# ఆంధ్రపితామహ
# మాడపాటి హనుమంతరాయ
# షష్టిపూర్తిసంచిక

ప్రకాశకులు:

శ్రీ మాడపాటి హనుమంతరాయ
షష్టిపూర్త్యుత్సవ సంఘము
హైదరాబాదు

1946

# పీఠిక

"శ్రీమాన్ పండిత యమ్. హనుమంతరావు పంతులుగారు మనరాష్ట్రములోని ప్రజా ఉద్యమములకు అపారమైన నిష్కామసేవ చేసినవారు. మనరాష్ట్రమున ప్రత్యేకముగ తెలంగాణము నందలి ప్రతిరాజ్యాంగ, సాంఘిక, ఆర్థిక, విద్యా మొదలయిన సంస్థలు వారి సేవను గోల్పోయినవి లేవు. వారు ఆంధ్రోద్యమమును, ప్రజల గ్రంథాలయములను, పాఠశాలలను స్థాపింపచేసి వాటిఅభివృద్ధికి నిరంతరము కృషిసల్పినారు. ఆంధ్రులను నిద్రావస్థనుంచి మేలుకొల్పి వారిలో దేశాభిమానమును, ఆత్మగౌరవమును, రాజ్యాంగభావములను వృద్ధిచేసినారు. నేడు ఆంధ్రోద్యమాభివృద్ధి, నారాయణగూడెం బాలికల ఉన్నత పాఠశాల, పరోపకారిణీబాలికా పాఠశాల మున్నగు వాటి తేజోవంతమైన అభివృద్ధి వారిసేవను వేనోళ్ళ చాటుచున్నది. వారిని యెరుగని ఆంధ్రుడు మన రాష్ట్రములో ఉండడని చెప్పవచ్చును. ఇప్పుడు వారివయస్సు అరువదవ సంవత్సరము జరుగుచున్నది. ఆంధ్రప్రజాహిత కార్యకర్తలు మరియు ప్రజా సంస్థలు వారి షష్టిపూర్తి మహోత్సవము వారిసేవకు తగినట్లు జరిపి తమకర్తవ్యము నెరవేర్చవలసి యున్నది. కనుక బాధ్యతగల నాయకులు తొందరగా యీ విషయమును దృష్టికి తెచ్చుకొని తమబాధ్యతను నెరవేర్పవలెను."

అని 6-10-1944 తారీఖుగల తెలంగాణ పత్రికలో నేను విన్నపముచేసికొని యుంటిని. అసలీ విషయమును మున్ముందు నాతో ప్రస్తావించినవారు రయ్యత్ పత్రికాధిపతులగు శ్రీ మందుముల నరసింగరావుగారు. మాసంభాషణల ఫలితముగానే నావిన్నపము పైరీతిగా ప్రకటితమయ్యెను. మాసోదరాంధ్రులు నా యీ సూచనను మహోత్సాహముతో స్వీకరించి, పత్రికా ముఖముననుం, లేఖలమూలముననుం, తమ యామోదమును వెల్లడించిరి. వెల్లడించుటయేకాదు పెక్కుసూచనలుచేసి ధైర్యోత్సాహములను పురికొల్పిరి.

అఖిలాంధ్రజనులకు సమ్మతమయిన యీ మహాకార్యమును జయప్రదముగ నిర్వహించుటకునిశ్చయింప బడెను. కావున ఏతత్కార్య సాధనావసరములనుసమాలోచన చేయుటకై 18-5-1354 ఫసలి(14-2-1945)నాడు రెడ్డి హాస్టలులో ఒకసభ సమావేశపరుపబడెను. ఈసభకు హైదరాబాదు, సికింద్రాబాదులలోని ఆంధ్రప్రముఖులును జిల్లాలలోని ప్రముఖులును, విచ్చేసియుండిరి. షష్టిపూర్త్యుత్సవ కార్య విధానమును గూర్చి సభ్యులు అభిమాన పూర్వకముగ చర్చించిరి. ఉత్సవము కార్యరూపమును పెట్టుటకొరకు కార్యనిర్వాహక వర్గము నెన్నుకొనిరి. అందీ క్రిందివారు సభ్యులుగా ఎన్నుకోబడిరి.

1. శ్రీమంతు రాజాబహద్దరు వేంకటరామారెడ్డి ఓ. బి. ఇ. గారు (అధ్యక్షులు)
2. శ్రీకొండా వేంకటరంగారెడ్డిగారు (కార్యదర్శి)
3. శ్రీమతి యెల్లాప్రగడ సీతాకుమారిగారు.
4. శ్రీమాదిరాజు రామకోటీశ్వర రావుగారు.
5. శ్రీబూర్గుల రామకృష్ణరావుగారు.
6. శ్రీపులిజాల వేంకటరంగారావుగారు.
7. శ్రీబచ్చు వేంకటేశ్వర గుప్తగారు.
8. శ్రీముప్పారం నారాయణరెడ్డిగారు.
9. శ్రీపల్లెర్ల హనుమంతరావుగారు.
10. శ్రీరావి నారాయణరెడ్డిగారు.
11. శ్రీపోల్కంపల్లి వేంకటరామారావుగారు.
12. శ్రీమందుముల నరసింగరావుగారు.

ఈ కార్యనిర్వాహక వర్గమువారు రెండు ఉపసంఘములను నియమించిరి. ఒకటి షష్టిపూర్తి సంచికను ప్రకటించుటకు ఇంకొకటి షష్టిపూర్త్యుత్సవ కార్యములకు ద్రవ్యమును సమకూర్చుటకు.

1. సంచికోప సంఘసభ్యులు
   - శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు.
   - ,, చలమచర్ల రంగాచార్య శిరోమణిగారు.
   - ,, ఆదిరాజు వీరభద్రరావుగారు.
   - ,, బిదురు వేంకట శేషయ్యగారు.
   - ,, అదునుమల్లి దత్తాత్రేయ శర్మగారు.
   - ,, కొమ్మవరపు సుబ్బారావుగారు (కార్యదర్శి)
2. ఆర్థికోప సంఘసభ్యులు
   - శ్రీ కొండా వేంకట రంగారెడ్డిగారు.
   - ,, అక్కినేపల్లి జానకి రామారావుగారు
   - ,, బూర్గుల రామకృష్ణరావుగారు.
   - ,, యం. నారాయణరావుగారు.
   - ,, రంగమ్మ ఓబలరెడ్డిగారు.
   - ,, వేంకటస్వామి వకీలుగారు.
   - ,, శెట్టె జగదీశ్వరయ్యగారు.
   - ,, రావి నారాయణరెడ్డిగారు.

ఈ రెండు సంఘములవారు తమ తమ కర్తవ్యములను సంతోషోత్సాహములతో జయప్రదముగా నిర్వహించి కృతకృత్యులయినారని తెలుపుటకు మిగుల సంతసించుచున్నాను.

పూర్వకాలములో సాధుపుంగవులను, సత్పురుషులను రాజులే సన్మానించి గౌరవించుచుండిరి. నేటికాలములో ప్రజాసేవాతత్పరులగు సత్పురుషులకు రాజసన్మానము దుష్కరము. అందు ఆంధ్రులకట్టి అవకాశమే లేదుగదా! ఇట్టి పరిస్థితిలో ఆంధ్రులకు వ్యక్తిత్వము నిలిపి, ఆంధ్రభాషకు అస్తిత్వము నెరపి విరాజమానుడయిన త్యాగధనుని, శ్రీ మాడపాటి హనుమంతరాయుని సన్మానించుటకు ప్రజలే పూనుకొనుట ఎంతయు సముచితముగా నున్నది.

ఈ కార్యసాఫల్యమునకయి మాసోదరాంధ్రులేగాక, ఇతరులుకూడ దీక్షాబద్ధులయి తమ శక్త్యానుసారము ఒక్కరూపాయి మొదలుకొని వేయిరూపాయిలవరకు అభిమానపూర్వకముగా విరాళములను ఒసంగియుండిరి. ఈ గ్రంథముయొక్క నాల్గవ అనుబంధమునందు విరాళముల వివరములను ప్రకటించియున్నాము. అందరి నామములను సమగ్రముగ ప్రకటించ వీలుపడనందులకు మిగుల చింతించుచున్నాము. ధనసహాయముచేసిన దాతలకందరకును ఆహ్వానసంఘ పక్షమున కృతజ్ఞతాపూర్వక వందనములను సమర్పించుకొనుచున్నాము. ఆర్థిక సంఘములో సభ్యులుగానున్న శ్రీయుతులు సురవరం ప్రతాపరెడ్డిగారు, బూర్గులరామకృష్ణరావుగారు, మందుముల నరసింగరావుగారు, బేలె లక్ష్మయ్యగారు విరాళముల సమకూర్చుటయందు మాకు ఎక్కువగా సహాయపడి యున్నారు. కావునవారి సేవను నేను ప్రశంసించుచున్నాను.

ఈ యుత్సవనిధి లెక్కలను నాల్గవ అనుబంధమునందు వివరించుకొనియున్నాము. ఆదాయము రు. 11118-7-0 లు, వ్యయము రు. 9768-0-6లు తులాభార ద్రవ్యము రు. 6400-0-0 లు శ్రీ హనుమంతరావుగారి కీయబడినది. ఆ మొత్తము ప్రజాహిత కార్యమునకయి ఉపయోగించుటకు పై కార్యనిర్వాహక వర్గములోని కొందరుసభ్యులుగల సంఘమునకు అధికార మీయబడినది. ఉత్సవనిధిలో మిగిలిన ద్రవ్యముకూడ ప్రజాహిత కార్యములకు వినియోగింపబడును.

## ఉత్సవము

మేముచేసిన విన్నపమునాలించి, రాష్ట్రమునందు పెక్కు ప్రదేశములలో షష్టిపూర్త్యుత్సవములు మహావైభవముగా, మహోత్సాహముతో రాష్ట్రీయులు సలిపి

శ్రీ హనుమంతరావుగారి యెడ తమకుగల గాఢాభిమాన గౌరవములను ప్రకటించి యుండుట ఎంతో సంతోషకరమయిన విషయము. బ్రిటిష్ ఆంధ్రులు కూడ సభలు జరిపి మన నాయకునియెడ చూపిన ఆదరాభిమానములకు మనము కృతజ్ఞులమై యుండవలసి యున్నది. ఈ యుత్సవోదంతములను వీలయినంతవరకు సేకరించి ఇందు మొదటి అనుబంధముగా ప్రకటించి యున్నాము. మరియు మాసోదరులు చేసిన తీర్మానములను రెండవ అనుబంధముగా ప్రకటించి యున్నాము.

మొదటి అనుబంధములోని వర్ణనాంశములనుబట్టి 27 ప్రదేశములందు 32 సభలు జరిగినట్లు తెలుచున్నది. 117 సంఘములు పాల్గొన్నవి.

## షష్టిపూర్తి సంచిక

షష్టిపూర్త్యుత్సవ కార్యకలాపములో షష్టిపూర్తిసంచిక ప్రకటనము ముఖ్యమయినదిగా మేము భావించితిమి. శ్రీ హనుమంతరావుగారి జీవిత చరిత్ర లేనిది ఈ సంపుటము శోభాయమానముగా నుండదని తలచి, శ్రీవారి జీవితమును వ్రాయించి ముందు మొదట చేర్చి యున్నాము ఈజీవిత చరిత్రము సమగ్రముగను, సత్యబద్ధముగను, ప్రామాణిక దృష్టితోను రచింపబడినదని మాపాఠకులు గ్రహింపగలరు. చాల మందికి తెలియని శ్రీహనుమంతరావుగారి జీవితాంశములిందు గలవు. ఈజీవితచరిత్రతో ఆంధ్రోద్యమచరిత్రయు పూసలలో దారమట్లు అవినాభావసంబంధము కలిగి యుండుట గమనింపవలసిన విషయము.

ఈ సంచికకు అలంకారముగా నుండినట్టివి పండితులు వ్రాసిన వ్యాసరాజములు. ఉభయ ప్రాంతములందు నుండెడు ఆంధ్రపండితులు మాకు ఎంతో అభిమానముతో తమ ఉత్తమ రచనలనుపంపి తోడ్పడినందులకు వారికి మా కృతజ్ఞతా వందనములు. ఈసంచికలో పండితుల ప్రత్యేక వ్యాసములనేగాక ఏతదుత్సవోదంతమును సమగ్రము ప్రకటించుటకు కృషిసల్పి యున్నాము. ఆంధ్రపితామహుని కీర్తించుచు వ్రాసిన పద్యములను, పాటలను ప్రకటించినాము. ఉత్సవవర్ణనము, తీర్మానములు, సన్మానపత్రములు [illegible] అనుబంధములుగా ప్రకటించి యున్నాము. శ్రీ హనుమంతరావుగారి యొక్కయు, వారి నాయనగారి [illegible] యొక్కయు రూపపటములు చేర్చి గ్రంథమున కలంకారము కూర్చినాము.

ఇట్లు ఈసంచిక విషయమున వివిధవిషయములను సేకరించి ప్రకటించుటలో చాల శ్రమపడవలసి వచ్చినది. వ్యవధి కావలసి వచ్చినది. అదియునుగాక ఇట్టి

ఉద్గ్రంథ ప్రకటనమునకు తగిన ముద్రణాలయములు లేకపోవుటయు గ్రంథప్రకటనమునకు కొంత ఆలస్యకారణ మయినది. ఈయిబ్బందులన్నింటిని ఓపికతో సహించి సమగ్రముగ, సుందరముగ సంచికను సిద్ధము చేసినందులకు సంచికోప సంఘము వారిని అభినందించు చున్నాను.

## వందనములు

హైద్రాబాదునందు జరిగిన ప్రథమ దినోత్సవ సమావేశమునకు దేశసేవా ధురంధరులగు క. కోటిరెడ్డి, బారట్లాగారు అధ్యక్షత వహించిరి. శ్రీ కోటిరెడ్డిగారు మా యాహ్వానము నంగీకరించి యిచ్చుటకె దయతో విచ్చేసి తమ సౌహార్ద్రభావముతోను, సత్సంగధోరణితోను మమ్మలరించి యున్నారు. వారికి మా ధన్యవాదములు. రెండవదినము అధ్యక్షత వహించి ఉత్సవమును జయప్రదముగ ముగింపజేసిన స్థానిక ప్రముఖవరేణ్యులగు శ్రీయుత పింగలి వేంకట రామారెడ్డి దేశముఖు గారికిని ధన్యవాదములు సమర్పించుకొను చున్నాము ప్రశంసాపద్యములు చదివియు, బుర్రకథలు చెప్పియు, వివిధ ప్రదర్శనములు సలిపియు ఉత్సవ కార్యక్రమమును శోభావంతము గావించిన మహాశయులందరకును మా యానందమును వెల్లడించుచున్నాము. శ్రీ హనుమంతరావుగారికి సన్మానపత్రములు సమర్పించి, శ్రీవారి ప్రతిభను శ్లాఘించిన వివిధ సంఘములవారిని మిక్కిలి ప్రశంసించు చున్నాము. గోలకొండ, తెలంగాణ, మీజాన్, రయ్యతు, ముషీరె దక్కన్ పత్రికలు మాయుద్యమమునకు చాల సహాయకారులయి మెలంగినవి. ఆపత్రికాధిపతులకు మావందనములు.

ఈ కార్యభారమును నిర్వహించుటలో నాకు కార్యనిర్వాహకవర్గముతో పాటు ఉద్యమ విజయమునకు కారకులయినవారు శ్రీయుతులు బొజ్జం నరసింలుగారు, కొత్తూరు సీతయ్యగారు వీరి సేవావిధానమును నేను ఎక్కువగ కొనియాడుచున్నాను. వీరేగాక స్థానికులును, పరస్థానికులును ఎందరో, ఎన్నివిధములనో తోడ్పడియున్నారు వారినందరిని పేర్కొనుట కష్టము. వారికందరకును నా నమస్సులు.

ఇట్లందరి ప్రేమపూర్వ కాశీర్వాదములతో శ్రీ ఆంధ్రపిత మహా మాడపాటి హనుమంతరావుగారి షష్టిపూర్త్యుత్సవము మహా వైభవముగ జరుపగలిగినందులకు సన్మాన సంఘమువారు ఎంతయు సంతసించు చున్నారు.

సౌజన్య పూర్ణులయిన శ్రీ హనుమంతరావుగారికిని, వారి కుటుంబమునకును భగవానుడు సమస్తాయురారోగ్యములను ప్రసాదించును గాక! ఇట్లు

హైద్రాబాదు
15-7-1946

కొండా వెంకటరంగారెడ్డి (కార్యదర్శి)
షష్టిపూర్త్యుత్సవ సన్మాన సంఘము.

# విషయసూచిక

## పటములు







# ఆంధ్ర పితామహ
# మాడపాటి - హనుమంతరాయ
# చరిత్రము



## ౧

"ఎట్టి ప్రవక్తయు తన దేశమునందు పూజ్యతను గణింపఁజాలఁడు" అని ఇంగ్లీషులో నొక సూక్తి గలదు. అనఁగా ఎట్టి మహనీయునైనను సమకాలము వారు మెచ్చుకొనఁజాలరు. ఇది సర్వసాధారణమయిన పరిస్థితియైనను, ప్రతి సూత్రమునకును అపవాద సూత్ర ముండురీతిగనే, పై నిర్వచనమునకును అపవాదముగ కొన్ని యుదాహరణములు స్వదేశ విదేశములందుఁ గనుపించుచుండుట గలదు. ఇట్లు లోకమాన్యతను బొందిన మహనీయులు ఏదే నొక విషయమునందు ప్రతిభావంతులయియుందురు. అట్టికారణజన్ములు కవిశ్రేష్ఠులుగనో, పండితశిఖామణులుగనో, రాజనీతికోవిదులుగనో, తత్వశాస్త్ర పరిజ్ఞాతులుగనో, చారిత్రిక వేత్తలుగనో, ఉన్నతోద్యోగులుగనో, ధనవంతులుగనో ఉండి దేశోపకారకముగ తమ జీవితములను ధారపోసి అజరామరులయి యున్నారు. ఈ కలియుగములో నిట్టి పరికర సహాయము లేనిచో ఎట్టి ప్రతిభావంతుడును గణ్యత నొందుటయే గాదు, తాను పూనిన దేశోపకార కార్యాభరణమున సంపూర్ణ విజయశీలుఁడయి ప్రకాశించుటయు దుష్కరము. ఇట్టి సిద్ధాంత పరంపరకు, అనగా అపవాద సూత్రమున కపవాదముగా, శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారి జీవితము మనకు కనబడుచున్నది.

శ్రీ మాడపాటి హనుమంతరావుగారు తిరుపతి వేంకటేశ్వరులవలె కవులు గారు, వేదము వేంకటరాయశాస్త్రిగారి వలె పండితులు కారు. డాక్టరు పట్టాభి సీతారామయ్యగారివలె రాజనీతి కోవిదులు గారు, సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారివలె తత్వశాస్త్ర పరిజ్ఞాతులు కారు, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారివలె చారిత్రకవేత్తలుగారు, రాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారివలె ఉన్నతోద్యోగులు కారు, కాశీనాథుని నాగేశ్వరరావుగారివలె ధనవంతులు కారు. ఇట్లన్ని విషయములలో ప్రఖ్యాత పురుషులతో సమా

నముగా తులదూగువారు కాకపోయి
నను, వారితో అన్ని విషయములందును
సరిసమానమయిన కీర్తిప్రతిష్ఠలనుగడించి,
ఆంధ్ర దేశీయుల ఆదరాభిమానములను
చూరబుచ్చుకొని, నిజాం రాష్ట్రములో
ఆంధ్రత్వమునకు జీవముపోసి ఆంధ్ర పితా
మహ బిరుదాంకితులయిన శ్రీ మాడపాటి
హనుమంతరావుగారి జీవిత రహస్యము
కడుంగడు ముదావహమయినదిగదా !

## ౨

శ్రీ మాడపాటి హనుమంతరావు
గారు ఆర్వేల నియోగి శాఖకు చెందిన
బ్రాహ్మణులు. ఆప స్తంబ సూత్రులు.
కౌశిక సగోత్రికులు. శ్రీవారి జనకులు
వేంకటప్పయ్యగారు, జనని వేంకట
సుబ్బమ్మగారు. శ్రీ వేంకటప్పయ్యగారు
కృష్ణాజిల్లా నందిగామ తాలూకా పొక్కు-
నూరుగ్రామ కాపురస్తులు. వేంకటప్ప
య్యగారు తన గ్రామోద్యోగమును
దక్షతతో నిర్వహించుచు, ప్రజారంజ
కులై, అతిథి, అభ్యాగతులను సత్కరిం
చుచు ధన్యజీవితమును గడపుచుండిరి.
శ్రీ వేంకటసుబ్బమ్మగారు పతిహితధర్మ
చారిణులై, గృహనిర్వాహక దక్షురా
లయి సతీత్వము నెరపిన పవిత్రశీల.
ఈ పుణ్యదంపతులకు ఇద్దరు కొడుకులు
జన్మించిరి. ప్రథముఁడు తిరుమలరావు,
ద్వితీయుఁడు అద్వితీయ గుణ గణ విరా
జితుఁడయిన మన కథానాయకుఁడు
హనుమంతరావు. హనుమంతరావుగారి
జననము శా. శ. ౧౮౦౬ తారణనామ
సంవత్సర మాఘ శు ౬ గురువారము
(22 జనవరి 1885). రామలక్ష్మణులవలె
నున్న తమ పుత్రద్వయమును జూచుకొని
తల్లిదండ్రులు మురియుచుండిరి. ఇంతలో
దైవమునకు కన్నుకుట్టెను. శ్రీ వేంక
టప్పయ్యగారు కైలాసవాసులయిరి.
అనాథయైన వేంకట సుబ్బమ్మగారికిని,
పితృహీనులయిన తిరుమలరావు, హను
మంతరావుగార్లకు దుఃఖము మేరలేక
పోయెను. వారేమిచేయగలరు ? ఎవ
రేమిచేయగలరు ? వేంకటప్పయ్యగారు
లేమి ముప్పు నెరుంగకున్నను, వారిది
కలిమిగల సంసారము కాదు. విశేషించి
జీవితమునకు వారే తావలమయియుండిరి.
తండ్రి మరణమునాటికి తిరుమలరావు
గారి వయస్సు ౮ ఏండ్లు, హనుమంత
రావుగారి వయస్సు ౫ ఏండ్లు. ఈ చిన్న
పాపలతో సంసార నిర్వహణ మెట్లో,
గతి తెలియక యీ సతీమతల్లి దుఃఖాంధ
కారములో మునిగిపోయెను. జీవితపథము
కంటకావృతమయి యుండుటయు, అంధ
కారబంధురమయి యుండుటయు మహా
పురుషుల జీవిత లక్షణముగదా ! హను
మంతరావుగారి జీవిత మట్లే ప్రారంభ
మాయెను.

శ్రీ వేంకట సుబ్బమ్మగారు జమలా
పురపువారింటి ఆడుపడుచు. ఈమెకు
ఇద్దరు సోదరులు వేంకటరావు, రామ
చంద్రరావుగార్లను వారుండిరి. ఎఱ్ఱుపా
లెము సమీపమున నుండు గోపవరము
కాపురస్తులు. బంధుప్రీతి గల యీ సోద
రులు తమ సోదరియెడలను, తమ భాగి

నేయులయెడలను అత్యంత దయార్ద్ర
భావ సమన్వితులయి 'తండ్రి లేనియెడ
మేనమామయే దగ్గరచుట్టు' మను వాక్య
మును దృష్టాంతపూర్వకముగా జూపిరి.
జమలాపురపు సోదరులు ఆ దుఃఖ సమ
యములో సోదరి నాదరించి, ధైర్యము
గొల్పిరి.

గృహయజమానుఁడగు వేంకటప్పయ్య
గారు మరణమునకు పూర్వము కొంత
కాలము వ్యాధిగ్రస్తులైయుండిరి. ఆకార
ణమున పొన్కల్లూరునుండి వేంకటరావు
గారు తన సోదరిని, మేనల్లుండ్లను తన
వెంటఁ దీసికొనిపోయిరి. హనుమంతరావు
గారి జీవితములో ప్రథమ దశ తండ్రి
యంకతలమున గడిచెను. ఇప్పుడు ద్వితీ
యదశ మేనమామల ప్రేమామృతముతో
కాకతీయసీమలో ప్రారంభమాయెను.

శ్రీ జమలాపురపు వేంకటరావుగారు
సూర్యాపేటలో తహశ్శీలుదారు కచేరీ
యందు పేష్కారు పదవిని వహించియుం
డిరి. సౌజన్యశీలురయిన మేనమామ
వేంకటరావుగారి పోషణమున ఏలోటును
లేకుండ మన మాడపాటి సోదరులు
క్రమక్రమాభివృద్ధి నొందసాగిరి.

ఈ సూర్యాపేటయందే మనకథా
నాయకునకు చిత్తవికాశ బీజములు నాట
బడినవి. అనగా అక్షరాభ్యాసము చేయ
బడినది. శ్రీతిరునగరి సాతాని నర్స
య్యగారికి శ్రీ హనుమంతరావుగారి
ప్రథమ గురుగానుండు భాగ్యము లభిం
చెను. శ్రీ నర్సయ్యగారు ఎంతమందికో
చదువు చెప్పియుందురు. కాని వారి
నామమును శాశ్వత స్మరణ యోగ్య
ముగా నొనర్పగలిగినది హనుమంతరావు
గారుగాక మరి యెవ్వరయిన నున్నారా?
లేరుగదా; పూలతోఁగూడిన నారకు
సువాసన యబ్బినట్లు హనుమంతరావుగారి
శిష్యత్వ సాహచర్యమున సాతాని నర
సయ్యగారికిని కీర్తి ఘటిల్లినది.

సూర్యాపేటలో మూడు సంవత్సర
ములకాలము నిరంతరాయముగా విద్యా
భ్యాసము సాగెను. ఇంతలో వెంకట
రావుగారికి ఇబ్రహీం పట్టణమునకు
మార్పుకలిగెను. జమలాపురపువారితో
మాడపాటివారును ఇబ్రహీం పట్టణము
నకువచ్చిరి. తరువాత కొంతకాలము
వేంకటరావుగారియొద్ద జడచర్లలో హను
మంతరావుగా రుండిరి. ఎచ్చటనున్నను
హనుమంతరావుగారిచదువు సాగునట్లుగా
మేనమామలు శ్రద్ధగైకొనుచుండిరి.

జడచర్లలోగాని, ఇబ్రహీంపట్టణ
ములోగాని పై తరగతులలో చదువు
బాలురకు అనుకూలమగు బడులు లేకుం
డెను. హనుమంతరావుగారి విద్యా
తృష్ణ ముందుకు పేరెమువారుచుండెను.
అందుచే హనుమంతరావుగారు రెండవ
మేనమామ రామచంద్రరావుగారు పేష్కా
రుగానున్న నల్లగొండకు పంపబడిరి.
(౧౩౦౩ ఫ.–1894). అప్పటికి హనుమంత
రావుగారికి సుమారు పదేండ్ల వయస్సు.

హనుమంతరావుగారు నల్లగొండ
పాఠశాలలో చదివి ౧౩౦౭ ఫసలీలో
(1898) ఉర్దు మిడిల్ పరీక్షయందు తీర్ణు
లయిరి. ఆకాలములో మిడిల్ పరీక్షయే

ఇచ్చట గొప్పపరీక్ష. పై చదువులు చదువవలయునన్న ఇంగ్లీషు అవసరమయి యుండెను. అంత హనుమంతరావుగారు ఇంగ్లీషు భాషాభ్యాసమును ప్రారంభించి ౧౩౧౦ ఫసలీలో (1900)లో ఇంగ్లీషు మిడిల్ పరీక్షయందు గడతేరిరి. అంత విద్యారంగము కాకతీయ రాజధానియగు వరంగల్లునకు మారెను. హనుమకొండ లోని ఉన్నత పాఠశాలలో ప్రవేశించి ప్రిమెట్రికు, మెట్రిక్యులేషన్ అను మద్రాసు యూనివర్సిటీ పరీక్షలు ముగించిరి. (౧౩౧౨ ఫ.-1903). అప్పుడు హనుమకొండ ఉన్నత పాఠశాలకు ఎల్. పి. కన్నయ్యగారు ప్రధానోపాధ్యాయులుగా నుండిరి. ఆ సంవత్సరము హనుమంతరావుగారితోపాటు మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయినవారు ఖమ్మంమెట్టు గోపాలరావుగారు, కోట సుబ్బారావుగారు, కాచెగారి రాజన్నగారు. ఇంతటితో హనుమంతరావుగారి విద్యార్థిదశ ఒక విధముగా ముగిసినదని చెప్పవచ్చును.

అంతకు నాలుగేండ్లముందే పెద్దమేనమామగారును, రెండేండ్లముందు చిన్నమేనమామగారును దివంగతులైరి. తరువాత పెదతల్లిగారికుమారుడగుఏలూరునరసింహారావుగారియు వారు అకాలమృత్యువువాత బడగా అన్నగారగు తిరుమలరావుగారియు ద్రవ్యసహాయముతో వీరు చదువుసాగించుకొనిరి. ఈకాలముననిజాం ప్రభుత్వము నెలకు అయిదురూపాయల చొప్పునవీరికివిద్యార్థివేతనమిచ్చుచుండిరి నల్లగొండలో చదువుకాలమందే పారసీ భాషయు నభ్యసించిరి. పారసీ ఇప్పటికి శ్రీవారికి ఇంగ్లీషు, ఉరుదు, తెలుగు భాషలయందు మంచి పరిజ్ఞానము అలవడెను. శ్రీ హనుమంతరావుగారు పాఠశాల పాఠ్యపుస్తకములతో తృప్తిచెందక, బహుగ్రంథావలోకనము చేసి విజ్ఞాన సముపార్జనము చేయుచుండిరి. భాస్కరుని కరస్పర్శమున పంకజము వికసించినట్లుగనే, విజ్ఞాన భాస్కరుని సంస్పర్శమున శ్రీవారి హృదయపద్మమును వికసించెను. ఇప్పటివయస్సు పదునెనిమిది సంవత్సరములు.

## ౩

శ్రీ హనుమంతరావుగారి జీవితములో మూడవదశ ప్రారంభమయ్యెను. హనుమంతరావుగారు స్వయంకృషిచే మనువు గడపుచు సంసార భారమును వహించుటకు కృతనిశ్చయులయిరి. కుటుంబ పోషణము కర్తవ్యముగా భావించి, (౧౩౧౩ ఫ.-1904) విద్యాశాఖ సదరు మొహతమీం (ఇనస్పెక్టరు) కచేరీలో గుమాస్తా (మీర్ మున్షి) ఉద్యోగమును స్వీకరించిరి. అప్పుడు వారి జీతము రూ. ౪౦ లు. విద్యాశాఖ ఇనస్పెక్టరులగు శ్రీ హార్డికరు, శ్రీనివాసాచారి మొదలగువారిక్రింద ఉద్యోగమును చాకచక్యముతోను, దీక్షతతోను నెరవేర్చి యధికారుల మన్ననలను బడసిరి. ఇట్లు ఎనిమిది సంవత్సరములు హనుమకొండలో

పని చేసినతరువాత సెలవుపైన హైద్రాబాదునకువచ్చి లాక్లాసులో చేరిరి. హైద్రాబాదుకు విచ్చేసిన కొన్ని నెలలకు విద్యాశాఖ సదరు మొహతమీం కచేరిలో రు. ౫౦ వేతనముగల సిరిస్తెదారు పదవి దొరికినది. (౧౩౨౧ ఫ.-1912) కాని యీ పదవియందు మూడు మాసముల కంటె నెక్కువ కాలముండలేదు. ప్రతిభాశాలికి పైకి నెగబ్రాకుట కవకాశములు చిక్కకుండునా?

నిజాంరాష్ట్ర శాసన నిర్మాణశాఖయందు ఇంగ్లీషు, ఉరుదు, తెలుగు భాషలయందు ప్రవీణుడయిన పరివర్తకుడు కావలసివచ్చెను. దొరతనమువారి ప్రకటనానుసారము పంద్రెండుగురు దరఖాస్తులు పెట్టిరి. అట్టి అభ్యర్థులలో హానుమంతరావుగా రొకరయి యుండిరి. ఈ పోటీపరీక్షయందు శ్రీహనుమంతరావుగారు ప్రథమశ్రేణియందే గెలుపొందిరి. ఈ పరీక్షకు వచ్చినవారిలో శ్రీవారికంటె నెక్కువ విద్యను గడించి పట్టభద్రులయిన వారును ఉండిరి. అయిననేమి! శ్రీవారియందుగల గంభీరసాహిత్యపటిమ మిగతవారియందు లేకుండెను. ఇక నా పరివర్తక పదవికి శ్రీవారు నియమితులయినారని వేరుగ నుడువవలయునా! నూరురూపాయల వేతనముతో శాసన పరివర్తన కార్యమును సమర్థతతో అయిదు సంవత్సరములు నిర్వహించిరి. రాజాబహద్దరు కృష్ణమాచారిగారు ఈ శాసన నిర్మాణశాఖాధికారిగా నుండి శ్రీవారి ప్రజ్ఞను ఎంతయు మెచ్చుకొనిరి.

హానుమకొండనుండి శ్రీవారిని హైద్రాబాదుకు రప్పించినది ముఖ్యముగా పేర్కొనదగినది విద్యాతృష్ణ. కుటుంబ నిర్వహణార్థము ఉద్యోగము స్వీకరించినను, ఇంకను పెద్దచదువులు చదివి స్వతంత్ర జీవనము చేయవలయునని వారి యాశయమైయుండెను. హైద్రాబాదులో అట్టిచదువున కవకాశములు ఉండెను. శ్రీవారు హైద్రాబాదునం దుద్యోగములోనున్న అయిదు సంవత్సరములు తీరికకాలమును ఆటపాటలయందు వృథపుచ్చక వకాలతు పరీక్షలకుచదువసాగిరి స్వతంత్ర జీవనసంపాదనమునకును, ప్రజాసేవా సంరంభమునకును అనుకూలమయిన వృత్తి వకీలువృత్తి యని భావించిరి. క్రమముగా, సువ్వందర్జా, దువ్వందర్జా, అవ్వల్ దర్జా వకాలతు పరీక్షలయందు జయపత్రములను బొందిరి. అవ్వల్ దర్జా వకీలుపదవి కర్హులుకాగానె శాసన సభలోని యుద్యోగమునకు విముక్తి పత్రమును సమర్పించిరి. ౧౩౨౬ ఫ-1917).

౪

ఇప్పుడు హానుమంతరావుగారి జీవితములో నాల్గవదశ ప్రారంభమయ్యెను. ఇది న్యాయవాదవృత్తిదశ. ఇది ౧౯౧౭ సంవత్సరములో ప్రారంభమయి, ౧౯౪౧ లో ముగిసెను. న్యాయవాదవృత్తి నవలంబించిన యీకాలమే శ్రీ హానుమంతరావుగారి ప్రజాసేవా తత్పరత్వము వికె

సించి, పూచి, సత్ఫలముల నొసంగిన స్వర్ణయుగము.

న్యాయవాదవృత్తి నవలంబించుటలో శ్రీవారి యుద్దేశము వాక్స్వాతంత్ర్యము కార్యాచరణ స్వాతంత్ర్యము కలిగి యుండుటకే. న్యాయవాదవృత్తిని జీవనోపాధికి తగినంతవరకు పయోగించుకొని ప్రజాసేవ చేయుటయే వారి పరమాదర్శము. అంతియేకాని, ఆ వృత్తియందు నిమగ్నుడయి వేలు, లక్షలు సంపాదించి, హైకోర్టు జడ్జీవంటి యున్నత పదవుల కాశించుట యీ రాదర్శముగా పెట్టుకొనలేదు. వారి కట్టి మహత్వకాంక్ష యున్నచో వారి ప్రజ్ఞావిశేషము లట్టి సంకల్పమును పూర్తి చేసియే యుండును. ఈ నవీనయుగములో, పదవులపై, ప్రతిష్ఠలపై మోజుకల యీ కాలములో నవనవ నెరయౌవనములో కష్ట భూయిష్ఠమయిన పథము త్రొక్కుట హనుమంత రావుగారివంటి మహాపురుషులకే తగును.

న్యాయవాద వృత్తియందు ప్రవేశించు యువకుడు ఒక పెద్ద న్యాయవాదియొద్ద నుండి పని నేర్చుకొనవలసి యుండును. కావున హనుమంతరావుగారు రాయ్ విశ్వేశ్వరనాథ్ బి.ఏ.ఎల్.ఎల్.బి. గారి యొద్దచేరిరి. శ్రీరాయ్ విశ్వేశ్వర నాథ్‌గారు ఉత్తర హిందూస్థానీయులు. కొలది కాలముక్రిందనే యిచ్చటికి విచ్చేసి వకాలతు ప్రారంభించిరి. అప్పు డిచ్చట ప్రముఖ న్యాయవాదులలో నొకరయి యుండిరి. వీరు తమ ప్రతిభావిశేషమున తరువాత క్రమక్రమముగా న్యాయమూర్తులయి, ప్రధాన న్యాయమూర్తులై, రాజాబహాద్దరు బిరుదాంకితులయి ఇప్పుడు విశ్రాంతి గైకొనుచున్నారు. హనుమంత రావుగారు రాజాబహాద్దరు వారియొద్ద ౧ సంవత్సరము జూనియరుగా పనిచేసి, కొంత దిటవు సంపాదించుకొని, స్వతంత్రముగా పనిచేయ సాగిరి. విశ్వేశ్వరనాథ్, హనుమంతరావుగార్ల జీవితములో అవస్థాభేదము లెన్ని యుద్భవిల్లినను, వీరిద్దరి మధ్య సుహృద్భావము, పరస్పర గౌరవము చిరంతనముగ వర్థిల్లుచు నేయున్నది.

శ్రీ హనుమంతరావుగారు న్యాయవాదవృత్తిలో మంచిగ జయప్రదులయిరనియే చెప్పవలెను. నెలకు రు. 600/-ల వరకు ఆదాయము వచ్చుచుండెను. కక్షిదారులయెడ సుహృద్భావము, వారి పనులయందు శ్రద్ధ, కార్యదీక్ష ఇత్యాది గుణగణములు శ్రీవారియందు నిండుగ నెలకొనియుండెను. శ్రీవారి సౌజన్యము, పరోపకార పారీణత, సత్యశీలము కక్షిదారుల నెక్కువగ నాకర్షించెను. తరుయొద్దకు కక్షిదారులు వచ్చినప్పుడు వారి వ్యవహారపు ముచ్చటలు ముగిసిన తరువాత, వారితో దేశాభిమాన పూరితములగు ప్రసంగములు సలిపి వారి హృదయములందు దేశాభిమాన బీజములను నాటుచుండెడి వారు. హనుమంతరావు గారు సంభాషణ చాతుర్యము గలవారు. ఎట్టికఠిన సమస్యనైనను ప్రపంచధోరణి లేని పల్లెటూరికైతునకుగూడ అర్థమగు నట్లు విడమరిచి ముచ్చటించ గలరు. నిజాం రాష్ట్రములోని రాజకీయ పరి

స్థితులు, విద్యాపరిస్థితులు. వ్యవసాయ, వాణిజ్య పరిస్థితులు, సాంఘికోన్నతి, మొదలగు సమస్త విషయములు వారికి కరతలామలకము చేయుచుండెడి వారు. "ఉత్తిష్ఠత, జాగ్రత్త" అనుసూక్తి భావానుసారము వారిగృహమున ప్రబోధము సాగుచుండెను. శ్రీవారి యీ ప్రబోధ ఫలితముగానే వారి కక్షిదారులు ప్రబోధ్యములందు వారికిచేదోడు వాదోడుగా నుండి యిప్పుడు గొప్ప దేశసేవకులుగా సిద్ధమయినారు. "నేనుకొంచెముగనో, గొప్పగానో చదువుకొన్నవాడనే. శ్రీ హనుమంతరావుగారితో ముచ్చటించిన తరువాత నేను వట్టి అజ్ఞానుడనని తోచినది. ఒకగంట కాలములో నాకెన్నో విషయాలు తెలిపినారు. వారికెన్ని విషయాలు తెలుసునండీ! ఎంత చక్కగా తెలిపినారండీ!" అని యొకానొకరు ప్రశంసించినారు.

న్యాయవాది ధర్మశాస్త్రాంశములను చక్కగ తెలిసియుండవలెను. కాని ఆ పాండిత్యమే చాలదు. దానికంగములుగ యుక్తి ప్రయుక్తులు, వాదకౌశల్యము, సమయస్ఫూర్తి, తార్కిక విజ్ఞానము ప్రపంచానుభవము, నిర్భయత మొదలగు పెక్కుశక్తులు పూర్ణముగనుండిననే గాని న్యాయవాది రాణింపడు. శ్రీ హనుమంతరావుగారు ఏవంగుణ విశిష్టులయి న్యాయవాదులలో పిన్నలకుఆదర్శప్రాయులయి, పెద్దలకు గౌరవభాజనులయి యొప్పుచుండిరి. పెద్దపెద్దచదువులు చదివి, బి. ఏ. ఎల్. ఎల్. బి, ఎం. ఏ. ఎల్. ఎల్. బి, బారటల్లావంటి యున్నత పరీక్షలనిచ్చిన ప్రముఖ న్యాయవాదులలో ఒకమెట్టుక్రిందిదైనను తలయెత్తుకొని సరిసమానముగా తిరుగ వలయుననన్న సామాన్య కార్యమా? శ్రీ హనుమంత రావుగారివంటి ప్రతిభాశాలికి అదియొక ఘనకార్యము కాకపోయెను.

శ్రీ హనుమంతరావుగారి యెడ న్యాయవాది వర్గమువారేకాక, న్యాయమూర్తులును, అధికారులును ఎక్కువగ గౌరవము చూపుచు ముచ్చటించుచుండిరి. పోలీసు, రివిన్యూశాఖల మంత్రియగు మిస్టరు టాస్కరు గారికిని, హనుమంతరావుగారికిని మధ్య నుంచి మైత్రియేర్పడెను. ఏదో వ్యాజ్యసందర్భమున టాస్కరుగారియెదుట వాదించుటకు వెళ్లినచో, కోర్టు వ్యవహారములు ముగిసిన తరువాత టాస్కరుగారు హనుమంతరావుగారిని కూర్చొబెట్టి మంతనములు సలుపుచుండెడివారు. శ్రీవారా యవకాశమును గైకొని, ప్రజల కష్టనిష్ఠురములను టాస్కరుగారి యెదుట పెట్టెడివారు. దొరతనమువారి కార్యవిధానమును విమర్శించెడివారు. కర్తవ్యమును సూచించెడువారు. ఈవిధముగా ఆంధ్రోద్యమముపై ప్రభుత్వవారికిగల యపోహలను నిర్మూలము చేయగలిగినారు.

శ్రీ హనుమంతరావుగారి న్యాయవాద వృత్తి విజయవంతముగానే ప్రారంభమయినది. ప్రథమ విజయములు యువక న్యాయవాదికి ఉత్సాహకరములుగనే యుండునుగదా! ఆ ప్రారంభదినములల

లోనే యొక యభియోగమున హనుమంతరావుగారి కక్షిదారు ఓడిపోయెను. ఇది హనుమంతరావుగారికి గొప్ప ఆశాభంగముగా కనుపట్టెనును. కక్షిదారుని కన్న హనుమంతరావుగారే యెక్కువగ వ్యసనపడసాగిరి. తనలోప మెచ్చట నున్నదని హనుమంతరావుగారు వితర్కించుకొనసాగిరి. శ్రీ హనుమంతరావుగారి మానసికావస్థను న్యాయమూర్తులగు నవాబు అక్బరు యార్జంగు బహదరుగారు గమనించిరి. శ్రీ న్యాయమూర్తిగారు శ్రీవారిని ఛేంబరులోనికి పిలిపించుకొని, కూర్చొబెట్టి వీపుతట్టి "ఓ యువక న్యాయవాదీ! నేడు నీపక్షము ఓడిపోయినందులకు నీవు వ్యసనపడుచున్నట్లు నాకు కనబడినది. అట్లు అధైర్యపడకుము. జయాపజయములు పర్యాయముగ మానవమాత్రునకు సంభవించుచునే యుండును. నేడు నీవాదము చక్కగనే యున్నది. గట్టిగనేయున్నది. ప్రారంభ న్యాయవాదికి మించిన ప్రతిభనే నేడు నీవు చూపినావు. ఉభయపక్షముల వాద ప్రతివాదములే మాకు చాలవు. ధర్మ సూక్ష్మములనుకూడ మేము గమనించవలసియుండును. ఆ ధర్మసూక్ష్మములను తెలిసి మేము నిర్ణయమునకు రావలసియుండును. ఆ ధర్మసూక్ష్మములను తెలిసికొనుటకు ప్రయత్నించుము. అపజయములకు జంకకుము" అని న్యాయమూర్తులవారు ప్రోత్సాహవాక్యములు పలికిరి. ఈ యుదంతమునుబట్టి హనుమంతరావుగారి ప్రతిభను న్యాయమూర్తి గ్రహించినట్లు విశదమగుచున్నది గదా!

ఒకానొక యభియోగములో హనుమంతరావుగారు ప్రతివాది పక్షమునను, మాదిరాజు రామకోటీశ్వరరావుగారు వాదిపక్షమునను నిలుచుండిరి. రామకోటీశ్వరరావుగారు హనుమకొండనుండి వచ్చి హనుమంతరావుగారి యింట్లోనే బసచేసిరి. ఇద్దరు వకీళ్లును కలిసి కోర్టుకు వెళ్లిరి. కోర్టుకు వెళ్లుచు హనుమంతరావుగారు 'నీలగిరి' పత్రిక సంపుటమును వెంట దీసికొని పోయిరి. త్రోవపొడుగునను ఆ పత్రికల పుటలను త్రిప్పుచు ఏదో చదువుచున్నట్లు నటింపసాగిరి. "బావా! కోర్టుకుకూడా నీలగిరి పత్రిక యెందుకయ్యా! ఇచ్చటగూడ దేశసేవా గొడవయేనా?" అని రామకోటీశ్వరరావుగారు ఉల్లసమాడిరి. హనుమంతరావుగారు చిరునవ్వునవ్వి యూరకుండిరి. ఆనాటి వాయిదాకు ప్రతివాది సాక్షులు రాలేదు. అందుచే వాదిపక్షమున తీర్పు చెప్పవలసినదిగా రామకోటీశ్వర రావుగారు కోర్టు నెదుట బలముగా వాదించిరి. ఆ వాదమునకు ప్రత్యుత్తరముగా హనుమంతరావుగారు లేచి, పెనుతుపానువీచి, చెరువులు తెగి, నదులు పొంగి యంతయు జలమయియున్న సమయములో, బాటలు చెడి, రైళ్లు ఆగిపోయియున్న సమయములో, పంచభూతము లాగ్రహించి భీభత్సము చేయుచున్న సమయములో ఏ మానవునకయినా ప్రయాణావకాశము లుండగలవా? యని ప్రశ్నించిరి. తన కక్షిదారుడును ఈభయంకర పరిస్థితుల

మూలకముగనే రాలేకపోయెననియు, తన కక్షిదారు వాదము దుర్బలమయి నదిగాదనియు, మరియొక వాయిదా ఇప్పించవలసినదనియు కోర్టువారితో మనవి చేసిరి. "ఇది వట్టిసాకు. ఇందు సారము లేదు. తుపానుకు ప్రతివాదికి ఏమీ సంబంధములేదు" అని రామకోటీశ్వర రావుగారు గర్జించిరి. ఆ తుపాను వర్ణన యంతయు నీలగిరి పత్రికలో వర్ణితమై యుండెను. హనుమంతరావుగారు నీల గిరి పుటలువిప్పి, తేదీలవారీగానున్న ఆవర్ణనభాగమును జదివి, తన కక్షిదారుడు గ్రామమును వదలుటకు ఎట్లు వీలుగాక పోయెనో విశదీకరించిరి. కోర్టువారు హనుమంతరావుగారి వాదమును విశ్వసించిరి. "బావా! ఇందుకా నీలగిరి పత్రికలను దెచ్చినది? ఎంత మోసము చేసినావయ్యా?" అని రామకోటీశ్వర రావుగారు కేరడమాడిరి.

"ప్రాక్టీసు" లేని వకీళ్లును, అందు ముఖ్యముగా ప్రారంభదశలోనున్న న్యాయవాదులును కక్షిదారులకొరకు ఎదురు చూచుచుందురు. ఎవడయినను వచ్చినచో "ఇవ్వాళ్ల రొట్టె నేతిలోపడ్డదిరా" యని లోలోన సంతసించి వాడు చేయి జారకుండ చూచెదరు. వాడు తెచ్చిన వ్యవహార పత్రములను అటునిటు తిరుగవేసి "ఓ! మన కనుకూలముగా లా పాయింట్లు చాలాఉన్నవి. ఈ కేసులో జయము తప్పదు" అని ప్రగల్భములు పలికి, ఫీజు మాటాడుకొని వ్యవహారము బిగించి వేయుదురు. శ్రీ హనుమంతరావు గారు ఈ తరగతిలోని వారుకారు. హనుమంతరావుగారు కక్షిదారులకొరకు ఎదురుచూడవలసిన యవసరమే లేకపోయెను. కక్షిదారుడు తమవద్దకు వచ్చినప్పుడు వాని కాగితపత్రములను సాకల్యముగ చదివి అది యోగ్యమయిన వ్యవహారమని తోచినగాని యట్టిదానిని స్వీకరింప కుండిరి. నిస్సారములు, దగాకోరు వ్యవహారములను వారు చేపట్టకుండ నుండెడివారు. ఇది కక్షిదారులకు వెగటుగను లౌకికులకు పిచ్చగను గనుపించుచుండెను. ఎవరేమనుకొన్న నేమి? శ్రీవారు మాత్రము సత్పథమును వదలకుండిరి.

ఒకానొకసారి ఒక కక్షిదారుడు వచ్చెను. వాని కాగితపత్రములను పరిశీలించి "నీ వ్యాజ్యములో పసలేదు. దీనిని నీవు గెలువజాలవు, ఇందీ యీ విషయములు దుర్బలభాగములు. ఇట్టి పనికిమాలిన వ్యవహారములో వకీళ్ళనుబెట్టి అధిక ధన నష్టము పొందుట సవ్యమార్గము కాదు. ఎదురుపార్టీతో రాజీపడి వీలయినంతవరకు రాబట్టుకొనుటయే శ్రేయోదాయకము. నేనీ వ్యవహారమును చేపట్టజాలను" అని పలికిరి. ఇట్టి ఖండితవాది ఎచ్చటనైన నుండునా? శ్రీ హనుమంత రావుగారివంటి కర్మయోగులే యట్లు చెప్పగలుగుదురు, ఆ కక్షిదారుడా మాటలు విని అబ్బురము చెందెను. "ఈ వకీలుగారి తెలివి తెల్లవారినట్లే యున్నది" అని సణుగుకొనుచు ఇంకొక

వకీలును సందర్శించెను. ఆ మహానుభావుడు 'లేత లేత సొరకాయలు బాగుగ నరికి' వ్యాజ్యము చేపట్టి దండిగ ఫీజు లాగెను. కాని ఫలితమునున్నయయ్యెను. అప్పుడు కక్షిదారునకు హనుమంతరావు గారి యుపదేశము స్మరణకు వచ్చెను. అతడు తిరిగి హనుమంతరావుగారి యొద్దకువచ్చి వారియెదుట పెద్దమిఠాయి పొట్లమును పెట్టి సమస్కరించెను. హనుమంతరావుగారు ఆయనను గుర్తించ జాలక 'మీరెవరు? ఇదేమి?' అని ప్రశ్నించిరి. అప్పుడాయన తన పూర్వోదంతమును తెలియపరచి, తమ యమూల్యమయిన సలహాను వినక వందలరూపాయలు నష్టపడ్డాను. తమయెడ కృతజ్ఞతా సూచకముగా నేను తెచ్చిన యీ మిఠాయిని స్వీకరించి నన్ను సంతోష పెట్టుడు. తమవంటి వకీళ్లు పెక్కుమంది యున్నచో ప్రజలు బాగుపడి పోదురు.'' అని నమస్కరించెను. ఈయొక్క ఉదాహరణమే చాలు హనుమంతరావుగారి న్యాయవాద వృత్తిలోని న్యాయప్రవర్తనమునకు.

హైద్రాబాదులో పెక్కు న్యాయస్థానములుకలవు. ఒకే వకీలు అన్నికోర్టులలోను ఒకేసారి వ్యవహరించుట సాధ్యముకాదు గదా? అందుచేత శ్రీ కొండా వేంకట రంగారెడ్డిగారు, శ్రీనివాసరెడ్డి గారు, మందుముల రామచంద్రరావు గారు, హనుమంతరావుగారు- వీరు నలుగురు ఒక కూటమిగా నేర్పడి కోర్టులను పంచుకొనిరి. శ్రీ హనుమంతరావుగారు మూలుగా వ్యవహారములు చూచునట్లు నిర్ణయమయ్యెను. ఈ వకీళ్లు నలుగురిలో ఎవరియొద్ద కేకక్షిదారుడు వచ్చినను ఫీజువగయిరాలు నిర్ణయముచేసి ఆయన ఆవ్యాజ్యమునకు సంబంధించిన కోర్టు న్యాయవాది యొద్దకు పంపుచుండెడు వాడు. ఈ పరస్పర సహకార పద్ధతి వకీళ్లకేగాక కక్షిదారులకును ఎక్కువ శ్రేయోదాయకముగా పరిణమించెను. వకీళ్లును పరస్పర విశ్వాస కలితులయి మెలంగిరి. శ్రీ హనుమంతరావుగారు తమ కార్యమును చక్కగ నెరవేర్చి మిత్రుల మెప్పును బొందిరి. ఉన్న కలిమితో తృప్తిచెంది శ్రీ · రు 1941 లో న్యాయవాద వృత్తిని విసర్జించిరి.

౩

శ్రీ హనుమంతరావు పంతులుగారు విద్యార్జనార్థము హనుమకొండలో ప్రవేశించినది మొదలుకొని వారి జీవితములో నూతనశకము ప్రారంభమయినదని చెప్ప వచ్చును. హనుమకొండ నగరము ఓరుగల్లు మండలమునకు రాజధాని. పెక్కుమంది ఉన్నతోద్యోగులు, ఉన్నత పాఠశాల కల ప్రదేశము. విద్యాధికులు బహుళముగా నుండిరి. విశేషించి కాకతీయ సీమకు నడిగడ్డయై, కాకతీయ సామ్రాజ్య ప్రభావ లేశములనుజాటుచు, ఆలోచనాపరులకు ఆవేశమును కలిగించునదియై యుండెను. శ్రీ హనుమంతరావుగారు హనుమకొండలో కాలిడగనే వా

రొక క్రొత్త లోకములో దూకినట్లుగా వారికి తోచెను. విద్యార్థికుల ప్రసంగములు, వారి ఊహాపోహాలు, అచ్చటి వివిధోద్యమముల సంరంభము వారి నెక్కుడుగ నాకర్షించెను.

అప్పుడు హనుమకొండలో ముఖ్యముగా మూడుద్యమములు ప్రజల నుత్సాహిత లూగించుచుండెను. మొదటిది ఆంధ్రభాషా వికాసోద్యమము. రెండవది సంఘ సంస్కరణోద్యమము. మూడవది రాజకీయోద్యమము. ఈ మూడు ఉద్యమములందును అభిమాన పూరితులయి హనుమంతరావుగారు మిత్రులతో సహచరించి కృషిసల్పసాగిరి. శ్రీ హనుమంతరావుగారు తమ యుత్తర జీవితమునందు ఈ యుద్యమత్రయ సంసిద్ధికొరకే తమ శక్తిత్రయమును వినియోగించి ధన్యజీవులయిరి.

౧౯౦౧ సంవత్సరములో హైదరాబాదునందు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయ స్థాపనముతో నిజాం రాష్ట్రములో ఆంధ్రభాషా వికసనోద్యమము ప్రారంభమయినదని చెప్పవలయును.

"అచ్చ తెనుంగు కబ్బమున
కాదిపదంబయి పొల్చు భాగ్యమున్
హెచ్చగఁగన్న దేశ మిది
యేదురదృష్టమొ యాంధ్రభాష నే
డిచ్చట సొంపు నింపు చెడి
హీనదశార్తినిఁ గుందె నక్కటా
అచ్చపు టాంధ్రపుత్రులకు
నందఱకున్ తలవంపులౌనటుల్."

అని హెచ్చరించిన శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారి ఘంటానాదము శ్రీ హనుమంతరావుగారి కర్ణ తాడిత మయ్యెను. హైద్రాబాదు నిలయమునుండి ఆంధ్ర గ్రంథములు, మాసపత్రికలు, వార్తాపత్రికలు తెప్పించుకొని హనుమంతరావుగారు మిత్ర బృందముతోపాటు చదువసాగిరి. ఉద్యోగ ధర్మము ననుసరించి హైద్రాబాదునుండి హనుమకొండ కేతెంచిన విద్యార్థికులు శ్రీకృష్ణదేవరా యాంధ్రభాషా నిలయపు కార్యకలాపములు, ఆదర్శములు చవులూరునట్లుగా వినిపించిరి. వీటి యన్నిటి ఫలితము లూరక పోవునా? అందు శ్రీహనుమంతరావుగారి వంటి సునిశిత బుద్ధిశాలి నూరక విడుచునా ?

శ్రీ మైలవరపు నరసింహశాస్త్రిగారు వార్షికోత్సవ సందర్భములయందు పద్యములు రచించి, వాటి నన్నిటిని 'శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ ప్రవర్ధమాన చరిత్రము అనుపేరితో ప్రకటించియుండిరి. ఆ పద్యములు ఆంధ్రభాషాభిమాన పూరితములై యుండెను.

"పరభాష లభ్యసింపగవచ్చు హెచ్చగా
మాతృభాష నదేల మానవలెను
ద్రవ్యంబుగడియించుదారిచూడగవచ్చు
మాతృభాష నదేల మానవలెను .

పరమర్మభేదనోపాయంబు గనవచ్చు
మాతృభాష నదేల మానవలెను
సత్యమార్గంబున (జరియింపగావచ్చు
మాతృభాష నదేల మానవలెను
మానరాదని మన మభిమానముంచి
గారవించిన మనతల్లి గౌరవంబు
సూర్యచంద్రులు త్రోవలు సురిగెనేని
సురిగిపోవునె భువి నాంధ్రసూనులార"

"ఘనులార! సత్యవర్తనులార! తనివార
మన్నించుడీ యాంధ్రమాత నెపుడు
దయులార!సద్గుణోదయులార!దయమీర
భూషించుడీ యాంధ్రభాష నెపుడు
హితులార!శ్రీయుతోన్నతులార!మితిమీర
వినుతించుడీ యాంధ్రవిద్య నెపుడు
నయులార! సజ్జనప్రియులార! మనసార
కరుణించుడీ యాంధ్ర కాంత నెపుడు
పూజితామల సౌజన్యపూర్ణులార
ధైర్యగాంభీర్యయుతమన స్థైర్యులార
మానితాఖండ భాషాభిమానులార!
పూని పోషింపుడీ యాంధ్రసూనులార!"

ఈవిధముగా పండిత నరసింహశాస్త్రి గారు చేసిన విన్నపము, ప్రబోధము హనుమకొండలోని యువకులయందు మంచి పని చేసెను. వారి మనోవీథులందు దృశ్యాదృశ్యముగ నిలయ స్థాపనోద్దేశ ములు పొడచూపసాగెను. దీని కుపబలముగ శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ స్థాప కులలో నొక్కరగు శ్రీ రావిచెట్టు రంగారావుగారు హనుమకొండలో భాషానిల యమును స్థాపించుటకు ప్రయత్నములు సలిపిరి. వీటి అన్నిటి సాముదాయక పరి ణామముగా ౧౯౦౪ జనవరి ౨౬ మంగళవారమునాడు హనుమకొండలో 'శ్రీ రాజరాజనరేంద్రాంధ్రభాషా నిలయము' స్థాపిత మయ్యెను. హైదాబాదునుండి శ్రీ రాజా నాయని వేంకట రంగారావు బహద్దరువారు, రావిచెట్టు రంగారావు గారు, మైలవరపు నరసింహశాస్త్రిగారు విచ్చేసి, నిలయస్థాపనోత్సవమును జయ ప్రదముగ జరిపించి, యువకులయందు నుత్సాహమును పురికొల్పిరి. హనుమ కొండ నిలయస్థాపనవిషయమునను, దాని ప్రవృద్ధివిషయమునను హనుమంతరావు గారు చాల కృషిసలిపిరి. ఇప్పుడు తనివి దీర నాంధ్ర గ్రంథములను జదువుటకు హనుమంతరావుగారికి మంచి యవకా శము దొరకెను. శ్రీవా రిట్టి యవకాశ మును బాగుగ నుపయోగించుకొని ఆంధ్ర భాషలో మంచి పాండిత్యమును సంపా దింపగలిగిరి.

ఆంధ్ర భాషా నిలయములు చేయు చున్నపనికి దోహదముగా శ్రీ రావిచెట్టు రంగారావు ప్రభృతులు హైద్రాబా దులో "విజ్ఞాన చంద్రికామండలి"ని స్థాపించి నవ్యగ్రంథరాజములను ప్రక టింపసాగిరి. (౧౯౦౬) ఈగ్రంథమాలలో మొదటిదగు "అబ్రహాంలింకను" చరిత్ర యందు శ్రీ లక్ష్మణరావుగారు వ్రాసిన వర్తమానాంధ్ర వాఙ్మయ పరిస్థితి పర్యా లోకనము శ్రీ హనుమంతరావు గారి యుత్సాహము నినుమడింప జేసెను.

ఆసింహావలోకమును గూర్చి యిప్పటికిని సంతోషోత్సాహములతో, మిత్రులతో ముచ్చటించుచుందురు. అబ్రహాం లింకను చరిత్ర రెండవ ముద్రణమునందు ఉపోద్ఘాతాత్మకమగు నాసింహావలోకనమును తీసివేసినందుకు వగచుచు హనుమంతరావుగారు ఈమధ్య పత్రికలలో వ్రాసియున్నారు. ఈ విజ్ఞాన చంద్రికా గ్రంథమాలలోని పుస్తకములలో ముఖ్యముగా హిందూ మహాయుగము, మహమ్మదీయ మహాయుగము, వీరి నెక్కువగ నాకర్షించి యావేశమును గలిగించినవి.

ఈ విధముగా శ్రీ హనుమంతరావుగారు ఆంధ్రభాషా వికసనోద్యమమునకు బద్ధకంకణులయిరి.

ఆంధ్రయువకుల మనస్సులను తరంగితములుగా చేసిన యుద్యమములలో రెండవదిగా సంఘసంస్కరణోద్యమమును పైన పేర్కొనియున్నాము. ఈ యుద్యమమునకు మూలపురుషులు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు. రాజరాజనరేంద్ర ఆంధ్రభాషా నిలయ సహకారమున శ్రీ వీరేశలింగము పంతులుగారి పది సంపుటములను చదువనవకాశము హనుమంతరావుగారికి దొరకెను. ఇతరులవలె నా సంపుటములను చదివి యూరక నానందించినవారుకారు. అందలి సందేశమును బాగుగ జీర్ణము చేసికొనిరి. ఏకేశ్వరోపాసనము, వర్ణవ్యవస్థ, వితంతూద్వాహము, ప్రౌఢావివాహములు, వర్ణాంతర వివాహములు, సర్వమానవ సోదరభావము, వేశ్యానిగర్హణము, విద్యాధురీణులయుర్హాకృత్యములు, సంఘదురాచారములు, సంఘైక్యము, మతసహనము, ఇత్యాది నూరారు సమస్యలపై శ్రీ వీరేశలింగము పంతులుగారి ప్రచండ దండయాత్ర శ్రీహనుమంతరావుగారిపై మంచి ముద్ర వేసినది. ఇందు కుపబలముగా వార్తాపత్రికలలోని చర్చలు తోడ్పడినవి. ఇట్టి సమస్యలను గూర్చి హనుమకొండలోని యువకులలో చర్చలు చెలరేగుచుండెను. ఇట్టి సమయమునందే పాఠశాలల పర్యవేక్షకులగు శ్రీ ఖమ్మముమెట్టు తిరుమలరావు, బి. ఏ, గారు హైద్రాబాదు నుండి హనుమకొండకు విచ్చేసిరి. శ్రీతిరుమలరావుగారు విద్యాధికులగుటయే గాక, సంఘసంస్కారోద్దేశములను అభినివేశముతో పరిపాటించువారయి యుండిరి. సంఘసంస్కరణోద్యమ బీజములు హనుమంతరావుగారి మానసక్షేత్రమున బాగుగ నాటుకొని, వర్ధమానములగుటలో శ్రీఖమ్మముమెట్టు తిరుమలరావుగారి సాహచర్యము ఫలప్రదముగా పరిణమించినది.

మూడవదగు రాజకీయోద్యమమును గూర్చికూడ కొంతవ్రాయవలసియున్నది. ఆంధ్రదేశమేకాదు, అఖిల భారతదేశము కూడ సమ్మోహనవశమయి నిద్రాముద్రితమయియున్నపుడు హఠాత్తుగ మేల్కొల్పినతరుణమది. అప్పటి రాజప్రతినిధి యగు కర్జన్‌ప్రభువు రాజనీతి

ఫలితముగా వంగరాష్ట్రము రెండుగా చీల్చబడెను. వంగీయులీ విభజనమును సహించరయిరి. వందేమాతర ధ్వానములతో ప్రభుత్వమును ప్రతిఘటించిరి. వంగదేశములో గొప్ప రాజకీయోద్యమము ప్రభవించెను. ఈయుద్యమజ్వాలలు క్రమక్రమముగా ఆసేతుహిమాచలపర్యంతము ప్రాకెను. బిపిన్‌చంద్రపాలుగారు ఆంధ్రదేశములో పర్యటనముసల్పి ఆంధ్ర యువకులమనస్సులందు చిచ్చుముట్టించిరి. స్వదేశోద్యమము, విదేశవస్తు బహిష్కారము, పౌరస్వత్వములు, జాతీయ విద్య, స్వపరిపాలనము, బ్రిటిషువారి యార్థిక నీతి, శాసనసభల నిర్మాణము, సైనిక వృత్తి, పన్నులభారము, మున్నగు రాజకీయ సమస్యలపై ప్రతిప్రదేశములందును మహాసభలు సమావేశమగుచుండెను. తీవ్రచర్చలు సాగుచుండెను. ఈ మహాసభలలో ఇండియన్ నేషనలు కాంగ్రెను మకుటాయమానముగా నుండెను. కలకత్తాలో ౧౯౦౬ లో సమావేశమయిన కాంగ్రెసునందు భారతదేశ పితామహుడన దగు దాదాభాయి నౌరోజీగారు "హిందూదేశీయుల యాదర్శము స్వరాజ్యము" అని ముక్తకంఠముతో ప్రవచించిరి. ఆసేతు హిమాచల వ్యాప్తమగు ఆర్యావర్తమునందు రాజకీయ ఝంఝామారుతము వీచెను. జనులందరు ఆవేశపూరితులయి యుండిరి.

ఈ యావేశతరంగము పత్రికలద్వారా, ప్రముఖులద్వారా, హనుమకొండకును ప్రాకెను. అచ్చటి యువకులును ఈయుద్యమపు సుడిగుండములోనుజిక్కుకొనిరి. యువకులందరు ఒకకూటమిగా జేరి చర్చించసాగిరి. ఈచర్చలలో హనుమకొండ యువకులు ఒక వినోదకరమయిన పద్ధతియవలంబించిరి. అప్పటి రాజకీయ రంగములో ప్రముఖులయిన నాయకులు దాదాభాయి నౌరోజీ, సురేంద్రనాథ బెనర్జీ, సర్ ఫిరోజిషా మెహతా, గోపాల కృష్ణ గోఖలే, బాలగంగాధర తిలక్ మున్నగువారయి యుండిరి. మన హనుమకొండ యువకులలో నొక్కొక్కరు ఒక్కొక్క భారత నాయకుని పేరుపెట్టుకొనిరి. ముత్కావి వాసుదేవరావుగారు సర్ ఫిరోజషా మెహతా, గుట్టాజురావుగారు, సురేంద్రనాథ బెనర్జీ. ఇట్లే యితరులకును నామకరణములు జరిగెను. ఇక మనమనమంతరావుగారెవరో తెలియునా? వీరికి "గోపాలకృష్ణ గోఖలే" యని మిత్రులు నామకరణముచేసిరి. శ్రీ హనుమంతరావుగారిని గోఖలే యనుటలో మిత్రుల బుద్ధి చాకచక్యమును మనమెంతయు సంభావించ వలసియున్నది. శ్రీవారి భావిజీవిత క్రమము ననుసరించి మనము సరిచూచినచో నీ "గోఖలే" బిరుదము వీరికి ఎంతయు సమంజసముగా నిరూపితమయినది. ఏలయన గోపాల కృష్ణగోఖలేగారు హిందూదేశ సేవక ప్రముఖుడుగా గణుతికెక్కి యున్నాడు. నిరుపమాన రాజకీయవేత్త, అర్థశాస్త్ర తంత్ర నిపుణుడు, విద్యాభిమాని, ప్రభుత్వప్రతి పక్షవాదియైనను సామరస్యభావ

సమన్వితుడు, అంతుగొంతులేని కర్మయోగి తన సర్వస్వము భరతమాత చరణ సన్నిధిని సమర్పించిన ధన్యజీవి. ఇట్టి మహనీయుల నామబిరుదములను ధరించిన వారలలో ఇతరుల మాటేమోగాని శ్రీ హనుమంతరావుగారు మాత్రము సార్థక బిరుదనాములయిరి. ఈ విధముగా హనుమకొండయందే శ్రీ హనుమంతరావుగారి హృదయక్షేత్రమున రాజకీయ విషయ వాసనాబీజములు నాటుకొని, మొలకెత్తి, క్రమక్రమముగా విజృంభించెను.

౬

శ్రీ హనుమంతరావు పంతులుగారు హైద్రాబాదు నగరమునకు విచ్చేసిరి గదా! హైదరాబాదు రాజధానీ నగరమగుటచే శ్రీవారి దృష్టి మరింత దూరము పోసాగెను. పంతులుగారు గోలకొండ శిఖరము నధిరోహించి, బాలాహిస్సారుపై నిలచి తెలంగాణమునంతను పరికించిరి. ఆదృశ్యము శ్రీవారి హృదయమును కల్లోలపరిచెను. ఎచ్చట చూచినను అవిద్య, అజ్ఞానము తాండవమాడుచుండెను. నిజాంరాష్ట్రములో 8 జిల్లాలలో 60 లక్షల జనులుండిరి. అయిననేమి? బ్రిటిషు హిందూదేశమందలి ఆంధ్రదేశ స్థితితోను, నిజాంరాష్ట్రములోని మహారాష్ట్ర, కర్ణాటక జిల్లాల స్థితితోను పోల్చి చూచిన యెడల నెంతయు విచారకరముగా నుండెను. ఎనిమిది జిల్లాలలో ఒకటి మాత్రమే యింగ్లీషు హైస్కూలుండుటయు, తదితర విద్యాలయములయిననుమహారాష్ట్రాది యితర మండలములకంటె తక్కువగా నుండి తెలంగాణవాసుల విద్యా దారిద్ర్యమును వెల్లడి చేయుచుండెను. జనులలో విద్యాభివృద్ధికి సహకారముచేయు నుద్దేశముగలవారె లేకుండిరి. పత్రికా ప్రచారము, పత్రికా పఠనేచ్ఛ మృగ్యముగా నుండెను. దేశభాషలపై యభిమానము ఉభయత్ర శూన్యముగా నుండెను. ఆంధ్ర చరిత్రకు దోహదముగానుండు శాసనాదులు తండోపతండములుగ నున్నను, వాటిపై దృష్టిపరపినవారే లేకుండిరి. ధనవంతులు, సంస్థానాధిపతులు, దేశముఖులు. వర్తకులు దేశాభివృద్ధిపట్ల విముఖులయి మెలగుచుండిరి. వ్యవసాయము తాతలనాటి ప్రాత పద్ధతులపై జరుగుచు, రైతును క్రుంగదీయుచుండెను. అనుదిన జీవనమునందు సమయాసమయములను లెక్కచేయక ఉర్దూభాషను మాటాడుకొనుటయే పరమార్థము, నాగరికత యనుకొనుచుండిరి. తెలుగు మాటాడినను "బిమొకద్దమే ముందర్జెం వున్వాఁని గారిషు యిదిగదా'' అనుచు సంకర భాషను వాడుచుండిరి. నూటతొంబయి ఆరురూపాయల పాంచానా చారుపాయి'' అనివర్తకులు లెక్కలను గుణించుచుండిరి.

''ప్రజాహిత జీవనము'' అనగా తన పని తాను చేసికొనుచు, తనకుగల

పాండిత్యమును, ధనమును, అనుభవమును, విరామకాలమును ఇతర ప్రజల యభివృద్ధికయి వినియోగించు బుద్ధి మన ఆంధ్రజిల్లాలలో సున్నగా నుండెను. తెలంగాణజనులు శారీరక, మానసిక పుష్టి లేక, ఔన్నత్యమార్గమును బట్టించు, ధార్మిక, సామాజిక, పారిశ్రమిక, రాజకీయాది తత్వముల నెరుంగక అజ్ఞానాంధకారములో నిద్రాముద్రితులయి యుండిరి. ఇట్టి విచారకరమగు ఆంధ్రజనానీకపు దౌర్భాగ్యపరిస్థితులు హనుమంతరావుగారి మనస్సునును కలంచెను.

"అన్నివిధములగు నౌన్నత్యము నలవడజేయ నత్యవసరమగు సంఘీభావము, పూర్వచరిత్రను గూర్చిన గౌరవమును, భావిభాగ్యోదయ విషయమున విశ్వాసమును తెలుగువారి హృదయక్షేత్రములం దంకురింపనిచో మృతతుల్యులుగా నున్న వీరి భావిసంతానము గతి యేమి గావలయును?" అని హనుమంతరావుగారు వాపోయిరి. (తెనుగు పత్రిక.)

"అరువది లక్షల జీవులు నిజాంరాష్ట్రమునకును, భారతవర్షమునకును చిరకాలము భారముగా నుండవలసినదేనా?" అని పంతులుగారు ప్రశ్నించిరి.
(తెనుగు పత్రిక.)

ఆంధ్రజనులయందు ఘనీభవించియున్నయీ అవిద్యను, అజ్ఞానమును, మూఢత్వమును, నిస్పృహత్వమును, దాస్యభావమును పటాపంచలు గావించుట యెట్లు? ఎట్లు? ఈ కార్యభారమునకు కడంగువారెవరు? ఎవరు? పాండిత్యము కలవారే యిట్టి పనికి సమర్థులు. అయితే పండితులెట్లున్నారు? "అంకం కేపి శశంకిరే జలనిధే పంకం..." అని చదువుకొనుచు, "వీడి తస్సాగొయ్యా ఎంత చక్కగా చెప్పాడయ్యా" అని మురియుచుందురు. మరియు తమ పాండిత్యము నొక సాకుగా పెట్టుకొని, వారిని వీరిని పీడించి మిద్దెలు మేడలు కట్టుకొని స్వలాభపరాయణులయి "పండిత" నామమునకే విరుద్ధార్థము కల్పించుచున్నారు. ఇట్టివారేమి చేయగలరు? ఇక ధనికులో, వారు తమ ధనమును వేషభూషణాదులయందు వెచ్చించుచు, సదా కేళీవిలాస క్రీడాపరాయణులయి విందులు గుడుచుచు, వ్యవధి అనునది లేక తమ్ము తామే మరచిపోవుచున్నారు? ఇట్టివారెట్లు చేయగలరు? ఉన్నత పదవులందున్న అధికారులో తమ యధికారమును, ప్రయోజకత్వమును పరపీడనమునందే వినియోగించి సంతసించుచున్నారు. పాపపంకిలము లోబడియున్న వీరు ఇతరుల నెట్లు ఉద్ధరింపగలరు? అన్నివిధముల యోగ్యత గలిగి చీకుచింత లేని యదృష్టజాతకులు తమ విరామకాలమును సద్వినియోగము చేసి పుణ్యము కట్టుకొనవచ్చును. కాని ఆ విరామకాలము జూదమాడుటకును, నాటక వీక్షణములకును, స్వైరవిహారములకును సరిపోవుట లేదాయెను. ఇట్లంతయు నిరుత్సాహ ప్రదర్శనముగా

నుండెను. అయితే ప్రజాసముద్ధరణకార్య కలాపమునకు పాండిత్యము, భాగ్యము, పదవి, అధికారము ఇత్యాదులే ప్రధానము కాదు. ఇవి యున్నను లేకపోయినను, కొంచెముగ నున్నను, గొప్పగ నున్నను ఉండవలసిన ప్రధానలక్షణము ఒకటి కలదు. అది నిష్కామసేవాదీక్ష. సత్సంకల్పముతో, సానుభూతితో, ఆత్మవిశ్వాసముతో, అకుంఠితప్రజాసేవాపరాయణుడగు కర్మయోగి కావలెను. శ్రీ హనుమంతరావుగారు ప్రపంచ చరిత్రములను జదివినవారు. ప్రపంచములోని ప్రజోద్యమములను పరికించినవారు. ఇంగ్లండు, అమెరికా పరిస్థితులను గమనించినవారు. ఆర్యావర్తములోని సంచలనమునకు కారకులయినవారెవరో శ్రీవారు ప్రత్యక్షముగా జూచుచుండిరి.

ఇట్టి పరిశీలన ఫలితముగా నీ జనోద్ధరణ కార్యమును, సామాన్య జనులే నిర్వహించిరని వారి కవగతమయ్యెను. ప్రజాహృదయమును చూరగొని, ప్రజాభిలాషమునుగ్రహించినవారు మధ్యతరగతి వారేయని రూఢియయ్యెను. ఇటలీదేశ భక్తాగ్రగణ్యుడగు 'గ్యారిబాల్డి' జీవితమును రచించుట శ్రీవారి మనోభావములకు ప్రబలసాక్ష్యము. శ్రీవారికి చెప్పుకోతగ్గ పాండిత్యమునుగాని, భాగ్యముకాని, పలుకుబడి కాని, అనుభవము కానిలేదు. అయినను తామీ నవీన కార్యజాతమును నిర్వహించుటకు కృతనిశ్చయులయిరి. ప్రాచీనాంధ్రుల కీర్తివైభవములు, తేజోవిరాజితమయిన వారి ప్రతిభా పరాక్రమాదులు శ్రీవారి నుత్సాహతరంగితుల గావించెను. ఆంధ్ర జనుల సహజ సౌజన్యము పంతులుగారి నావేశ పూరితులను గావించెను. ఆంధ్ర జనుల యభ్యుదయము నాకాంక్షించుచు శ్రీ హనుమంతరావు పంతులుగారు దీక్షాబద్ధ కంకణులయి, ఆత్మవిశ్వాసముతో, అచంచల భక్తితో అనుపమాన త్యాగ సంకల్పముతో కార్యరంగమున దుమికిరి. మహాత్ములకు లోకమే కుటుంబము కదా!

౨

దేశీయుల పూర్వవైభవమును ప్రజ్ఞను జాటుటయందును, వర్తమాన వివిధ సాంఘిక పరిస్థితులను కరతలామలకము చేయుట యందును ఒక గ్రంథాలయము చేయగలుగు పనిని, కలిగింపగలుగు విజ్ఞానమును, ప్రబోధించు కర్తవ్యమును వేయిమంది పండితులయినను చేయజాలరు. ఈ ధర్మరహస్యము ననుసరించియే ౧౯౦౧ లో హైదాబ్రాదునందు శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషానిలయము స్థాపితమయ్యెను. ఈ నిలయము ప్రాథమికమయి ఆదర్శప్రాయమయి, మకుటాయమానముగా నుండెను. ఆంధ్రజనులను ప్రబోధము గావించుటలో ఆంధ్ర గ్రంథాలయములకు గలశక్తి మహత్తరమయినదని శ్రీవారికి తెలియును. హనుమకొండయందుండిన కాలములో రాజరాజ నరేంద్రాంధ్ర భాషానిలయమును కడుభక్తితో

సేవించి అపారానుభవమును గడించి యుండిరి. ఆ యనుభవమును శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయమునకు సమర్పించుటకు సంకల్పించిరి. అప్పుడీ నిలయము రు. 4-8-0 ల అద్దెగల చిన్న గదిలో నుండెను. నిలయము జనాకర్షకమై, కార్యజాతము పెరుగుచుండుటచేత విశాల భవనమును కట్టించుటకు సభ్యులువ్విళులూరుచుండిరి. ప్రయత్నములన్నియు స్వప్న సంఘటనలుగానే యుండెను. శ్రీ హనుమంతరావుగారు ౧౯౧౮-౧౯౧౯ లో నిలయపు కార్యదర్శి పదవిని స్వీకరించి భవన నిర్మాణమునకు బద్ధకంకణులయిరి. రావిచెట్టు రంగారావుగారి ధర్మపత్నియగు శ్రీమతి లక్ష్మీనరసమాంబగారిని ప్రోత్సాహపరిచి, యా సతీమణి తనభర్తయగు రంగరాయ స్మృతిచిహ్నముగా భవన నిర్మాణమున కొసంగిన నాల్గువేలరూపాయల విరాళముతో మందిరనిర్మాణమున కంకురార్పణ గావించిరి. శ్రీ లక్ష్మీనరసమ్మగారు ఇంకను వలయు ద్రవ్యము నొసంగుటకు సిద్ధముగనే యుండిరి. కాని ఆ పరోపకారశీల అకాలమృత్యువు వాతబడుటచే గొప్ప ఆశాభంగము కలిగెను. అయినను హనుమంతరావుగారు ధైర్యము వీడక కృషి సల్పి, ఇప్పుడు సమస్తవస్తు పరికర సమాహితమై, దేదీప్యమానముగా వెలుగొందుచున్న నిలయపు దివ్యమందిర నిర్మాణ చరిత్రయందు హనుమంతరావుగారి నామము ప్రకాశవంతముగా నుండగలదు. నిలయపు పరిపాలన విషయములో, నిలయపు రజతోత్సవము సలుపు సందర్భమున, ఇంక నెన్నో విధములందు శ్రీవారి పాండిత్యము, పలుకుబడి, దూరదృష్టి, ప్రతిభ, సమాలోచనము నిలయమునకు పెట్టని కోటయై తనరారెను. శ్రీవారికి ప్రియమైన సంస్థలలో శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ మొక్కటి. నిలయపు సభ్యులకు శ్రీవారి మాట శ్రీరామ మంత్రము. వారిప్పటికిని నిలయము నొకకంట గనిపెట్టుచునే యున్నారు.

స్థానికములయిన బాలసరస్వతీ యాంధ్రభాషా నిలయము, వేమన ఆంధ్రభాషా నిలయమును శ్రీవారి సేవాభాగ్యమును పొందినట్టివే. పొందుచున్నట్టివే. బాలసరస్వతీ ఆంధ్రభాషానిలయమున కేర్పడిన దివ్యభవన సౌకర్యమున శ్రీ హనుమంతరావుగారి కృషి చాలవరకు చేరియున్నది.

యాదవ, ముదిరాజ, మున్నూరు, హరిజన, పద్మశాలి, గౌడ మున్నగు వర్గీయుల మేల్కొలుపసాగిరి. ఆంధ్ర విద్యార్థులను ప్రోత్సాహపరుచసాగిరి. జీవరక్షా ప్రచారిణీ సంఘము, హిందూ సంఘసంస్కార సభ, ఆది హిందూసేవా సమితి మున్నగు సంస్థలతో సంబంధము కలిగించుకొని పనిచేయసాగిరి. ఆర్యసమాజము, బ్రహ్మ సమాజము, దివ్యజ్ఞాన సమాజము మున్నగు మతసంస్థల పక్షమున ప్రత్యక్షముగ పాల్గొనకున్నను, వాటిని సానుభూతితో తిలకించుచు హర్షింపసాగిరి. శ్రీమతి యస్. సీతమ్మగారు నడుపుచున్న పరోపకారిణీ బాలికా

పాఠశాలను కైవసము చేసికొని శ్రీ విద్యాభిమానమును ప్రకటింపసాగిరి. నీలగిరిపత్రిక, తెనుఁగుపత్రిక వీరి యభిమానమునకు పాత్రములయ్యెను. గోలకొండపత్రిక, సుజాత (మాస) పత్రిక వీరి సహాయ కృషి ఫలితముగా స్థాపితములయి. శ్రీవారి రచనలతో నలరారసాగెను. శ్రీవారి ప్రతిభను ఆంధ్రేతరులు గ్రహింపసాగిరి. అందు ముఖ్యముగా అప్పుడు నాయకులుగా నుండిన వామన్ నాయకు, కేశవరావుగార్లు వీరి నెక్కుడుగ గౌరవించుచుండిరి. ఆంధ్రేతరుల సాహచర్యముతో హిందు, మహమ్మదీయు లను భేదములేకుండ, ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక, అను భేదము లేకుండ నిజాంరాష్ట్రీయు లందరకు సంబంధించిన వివిధోద్యమములతో సంబంధము కలిగియుండి పనిచేయసాగిరి. "గస్తీ నిషాన్ తిర్పన్" అని ప్రఖ్యాతివడసిన సర్కారువారి 53వ సంఖ్యగల సభాసమావేశప్రతిబంధక ప్రకటనమునకు వ్యతిరేకముగా నాందోళన సలుపుటకు ఏర్పడిన సంఘమునకు కార్యదర్శిగా నియమితులయిరి. స్టేటు రిఫారం అసోసియేషన్, కాంగ్రెసుకమిటీ హిందూమహాసభ మున్నగు సంస్థలయందధికార పదవులను వహించిరి. ఇట్లెన్నింటిని జూపగలము? మాకించిజ్ఞతయు కొంతకారణముగ నున్నది. ప్రతిసమాజమునకును సలహా లొసంగుచుండిరి. ప్రతి సమావేశమునందును పాల్గొనుచుండిరి. శ్రీవారి వాణి పట్టణమునందును, పల్లెలయందును ప్రతిధ్వనింపసాగెను. చిన్నలు పెద్దలు శ్రీవారి సాహచర్యమును, సదుపదేశములను ఆశించుచుండిరి. శ్రీవారి యాదేశములు శిరోధార్యములగు చుండెను. సర్వాంతర్యామి అను పదము శ్రీవారికిప్పట్టున అన్వర్థకముగా నుండెను.

ఇట్లు సకలజన సమ్మతమయిన పురుషపుంగవుడు శ్రీవారొక్కరే. కారణమేమి? శ్రీవారి నిష్కల్మష మయిన చిత్తము. స్వార్థరహితమయిన చింత. స్వచ్ఛమయిన ఆదర్శములు. శ్రీవారి యాదర్శములను ఒజ్జబంతిగా పెట్టుకొని పలువురు ప్రయత్నించసాగిరి. అట్టివారి పొరపాట్లను గణింపక ప్రోత్సాహ వాక్యములే పలుకుచుండిరి. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారొకసారి యిట్లు సెలవిచ్చియున్నారు:—"వీరిలో నొక గొప్ప లక్షణముకలదు. ప్రజాసేవకులను, ప్రాయసకాండ్రను గుర్తించుటలో వీరికి పక్షిచూపు (eagles' eye) కలదు. అట్టివారిని జారిపోదమన్నను జారనీయక తమ దృక్పథమందే యుంచుకొని ప్రోత్సాహపరచి రంగములోనికి లాగుచుందురు. సహాయకులను, అనుయాయులను సిద్ధము చేసుకొనుట నాయక లక్షణములలో నొకటి" (ప్రబుద్ధాంధ్ర) ఈ వాక్యములందెంతయు సత్య మిమిడియున్నది.

ప్రజలయందు జాగృతి గలిగినది. సంస్థలు వర్ధిల్లుచున్నవి. నూత్నావేశ సంభరితులయిన యువకు లుత్సాహముతో ముఱ్ఱూతలూగుచున్నారు. ఇట్టి పరిస్థితులను చక్కగ నుపయోగించుకొని

సక్రమమార్గమున పరస్పర వైరుధ్య
భావములేకుండ నడచునట్లు చూడవలయు
నన్న, పాయలు పాయలై యున్న వివిధో
ద్యమములను ఏకోన్ముఖము గావించుట
యవసరముగా హనుమంతరావుగారికి
తోచెను. అట్టిపని కంకురార్పణ గావిం
చుటకు కాలము పరిపక్వమై యుండెను.

## ౭

"విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత?"
అని వేమనసూక్తి. చిన్న బీజమునుండి
శాఖోపశాఖలుగ పరివ్యాప్తమయిన
మహా వటవృక్షము ఆవిష్కరించినది.
ఇట్లే ప్రపంచములోని ప్రతి ఘనకార్య
మునకును ప్రారంభ మల్పకారణముగనే
యుండును. న్యూటను మహాశయునకు
గురుత్వాకర్షణ శక్తిని తెలిసికొనుటకు
చెట్టునుండి పండు పడుటయే కారణము.
వాట్ మహాశయుడు ఆవిరి బలమును
తెలిసికొనుటకు పాత్రలోని వేడి నీరు
మూత నెగద్రోయుటయే కారణము.
అమెరికారాష్ట్ర మేర్పడుటకు ఇంగ్లండు
లోని రాజులు ఒక మతపక్షీయులయెడ
చూపిన క్రౌర్యమే కారణము. అమెరికా
స్వాతంత్ర్య మగుటకు ఒక చిన్న సుంకపు
పట్టింపే కారణము. అట్లే సర్వతోముఖ
మయిన ఆంధ్రోద్యమ ప్రారంభమునకు
కారణమైనట్టి దొక అల్ప విషయము.
భావి విశాల కార్యరంగమున కంగలు
జాచుచున్న శ్రీ హనుమంతరావుగారి
యల్ప సంఘటనమును ప్రాతిపదికగా
గైకొనిరి.

ఆనాడు లదై ౧౩౩౧ ఫ (౧౯ నవం
బరు ౧౯౨౧) శనివారము రాత్రి. గౌలీ
గూడెములోని వివేకవర్థనీ థియేటరు
నందు హిందూ సంఘసంస్కార మహా
సభ జరుగుచుండెను. పునహా నివాసు
లును, సంఘసంస్కరణ పరాయణులును,
మహిళా విశ్వవిద్యాలయ ప్రతిష్ఠాపకు
లును అగు ధోండు కేశవ కార్వే మహా
శయులవారు అధ్యక్షులుగా నుండిరి. సభ
లో వేలకొలది జనము సమావేశమయి
యుండెను. మహాసభను నిర్వహించు
ప్రముఖ నాయకులు మహారాష్ట్రు లగుట
చేతను, అధ్యక్షులవారు మహారాష్ట్రు
లగుటచేతను, వివేక వర్థనీ థియేటరు
మహారాష్ట్ర వాతావరణము గలది
యగుటచేతను అచ్చట గుమిగూడిన జన
ములో పెక్కుమంది మహారాష్ట్రులే
యయియుండిరి. ఆంధ్రులును, కన్నడు
లును తక్కువసంఖ్యగా నుండిరి. ఆంధ్రుల
పక్షమున శ్రీహనుమంతరావుగారు సభా
నిర్వహణమున ప్రముఖపాత్రను వహించి
వేదికపై పెద్దలతో సమానముగా
నాసీనులయి యుండిరి. సభా చర్చలలో
ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక భాషల
యందు ప్రసంగములు జరుపుటకు విషయ
నిర్ణయ సభవారు నిశ్చయించిరి. ఆంధ్ర
ములో నుపన్యసి[illegible]
ప్రభృతులు నియమితులయిరి. సభా
నిర్వాహకులు ఏర్పరచిన యీ సక్రమ,

సామరస్య పద్ధతిని సభలో పరివేష్టించి యుండిన మహారాష్ట్రవు మూకకు ఏవగింపుగా నుండెను. తెలుగువారు ప్రసంగించబోగా అల్లరిచేయ మొదలుపెట్టిరి. హనుమంతరావుగారి యాంధ్ర ప్రసంగ సంబంధమున అంతవికటముగా ప్రవర్తించక వారియెడ కొంత గౌరవము జూపినను, శ్రీయుత ఆలంపల్లి వేంకట్రామారావు హైకోర్టు వకీలుగారు ప్రసంగించు సమయము వచ్చినప్పుడు, వారి యుపన్యాసము సాగనియ్యక కేకలువేయసాగిరి. ఆలంపల్లి వేంకట్రామారావుగారు చక్కగా, ధారాళముగా, అర్థవంతముగా నుపన్యసింపగల ధీమంతులు. వారు తమ యుపన్యాసమును మధ్యభాగముననే ఆపివేయవలసి వచ్చెను. అచ్చట సమావేశమయిన ఆంధ్రజను లీయవమానమును వేంకట్రామారావుగారికి గాక ఆంధ్ర జాతికే చేసినట్లు భావించిరి. ఉద్రిక్తులయిరి. ఏతద్విపరీత ప్రదర్శనమున కసమ్మతి సూచకముగా హనుమంతరావు ప్రభృతులు పండ్రెండుగురు పెద్దలు సభను విడిచిపోయిరి. ఈ ద్వాదశాదిత్యులు ఆరాత్రివేళ వెంటనే త్రూపుబజారులోని శ్రీ టేకుమాల రంగారావు హైకోర్టు వకీలుగారి మందిరమునకుజని భావికర్తవ్యమునుగూర్చి మంతనములు సలిపిరి ఆమంతనముల ఫలితముగా నప్పుడే "ఆంధ్రజన సంఘము"నుస్థాపించి శ్రీహనుమంతరావుగారిని కార్యదర్శిగా నియమించిరి. ఈవిధముగా ఆంధ్రోద్యమమునకు విఘ్నేశ్వరపూజ జరిగినది. శ్రీ హనుమంతరావుగారికి ఆంధ్రలోక సంగ్రహారము విశాలరంగ మేర్పడినది. అదియే గదా వారి యాశయము!

౯

హైద్రాబాదులో ఆంధ్రజన సంఘము స్థాపించినదాదిగా శ్రీ హనుమంతరావుగారు విధివిరామములు లేకుండ ప్రచారము చేయసాగిరి. వీరి యీ నిరంతర కృషిఫలితముగా ఈ సందేశమును స్వీకరించి జను లుత్సాహులయిరి. వరంగల్, ఖమ్మము, పరకాల, నల్లగొండ, సికింద్రాబాదు మున్నగు ప్రదేశములందు ఆంధ్రజన సంఘములు స్థాపితములయ్యెను. ఇట్టి ఆంధ్రజన సంఘములు 3-4 ఏండ్లలో సుమారు ఏబదివరకు స్థాపితములయినవనియు, సుమారు 90 గ్రంథాలయములు స్వతంత్రముగ నేర్పడి విద్యాప్రచారము చేయుచున్నవనియు శ్రీ హనుమంతరావు పంతులుగారు "తెలుగు సమాచార్" పత్రికలో వ్రాసియున్నారు.

ఈ సంఘములకు నిర్దిష్ట కార్యవిధానమును సూచించి, పరస్పర సంబంధము కలిగించి, ఏకసూత్రముపై ప్రవర్తిల్లునట్లు చేయగల కేంద్రసంఘ మొకటి యవసరముగా గన్పట్టెను. హనుమకొండలో ఆంధ్రజన సంఘముల ప్రతినిధులు ౧౯౨౩ మార్చి నెలలో సమావేశమై "నిజాం రాష్ట్రాంధ్రజన కేంద్రసంఘము" స్థాపించుటకు తీర్మానించి నియమములు చేసిరి.

ఈ కేంద్రసంఘ కార్యకలాపము నియమబద్ధమై, వివిధ సంఘములను పర్యవేక్షణ చేయుచు, కార్య విధానమును సూచించుట యయియుండెను.

కేంద్రసంఘ నియమముల ననుసరించి మొదటి కేంద్రసంఘసభ ౧౯౨౩ జూలై నెలలో హైద్రాబాదునందు సమావేశమయ్యెను. అప్పు డీ కేంద్రసంఘమునకు హనుమంతరావుగారే ప్రధాన కార్యదర్శిగా నెన్నుకోబడిరి. రెండవ కేంద్రసంఘసభ ౧౯౨౪ మార్చి నెలలో నల్లగొండయందును, మూడవ కేంద్రసంఘసభ ౧౯౨౫ ఫిబ్రవరిలో మధిరయందును నాల్గవ కేంద్రసంఘసభ ౧౯౨౬ మెయి నెలలో సూర్యాపేటయందును సమావేశములయి యుండెను.

కేంద్రసంఘ సమావేశములు వివిధ ప్రదేశములందు జరుగునట్లు కార్యక్రమము ననుసంధించిరి. నల్లగొండలో ద్వితీయ సమావేశానంతరము వారి యూహాలు ఇంకొక మెట్టెక్కెను. ఆంధ్రజనసంఘ ప్రతినిధులు ఏ పదిమందియో కేంద్రసంఘ సభ్యులయియుందురు. ఇందు కారణాంతరమున రానివారు కొందరుండకపోరు. కనుక ఏ అయిదారుగురో సమావేశమయినచో ప్రజలయం దుత్సాహము ఎట్లు జనింపజేయగలుగుదురు? సమ్మేళనములను (కాన్ఫరెన్సులను) ఏర్పాటు చేసినచో జనులలో నిర్వహణ చాతుర్యము, సమ్మేళనముల పద్ధతి, చర్చావిధానములు–ఇత్యాది విషయములను గూర్చిన విజ్ఞానము పెరుగును. కావున మూడవదగు మధిర సమావేశమునందు "మొదటి గ్రంథాలయసభ"ను ఏర్పాటు చేయించిరి.

మధిర యనుభవము జనుల నెట్లు ఉత్సాహతరంగితులను గావించెనో శ్రీవారు కనిపెట్టిరి. నాల్గవది యగు సూర్యాపేట సమావేశమునందు 'రెండవ గ్రంథాలయసభ'ను ఏర్పాటు చేసిరి. ఈ సభకు దేశభక్త వామన రామచంద్ర నాయకుగారు అధ్యక్షత వహించిరి. వదాన్యులగు శ్రీ వామననాయకుగారి నచ్చటికి రప్పింపగలిగినది శ్రీ హనుమంతరావుగారి ప్రతిభయే. ఈ గ్రంథాలయ సభతోపాటు ఆంధ్ర యువక సభ, సంఘ సంస్కారసభ, ఆంధ్ర మహిళాసభ, వైశ్య యువజన సభలును జరిగెను. ఆరు సభలు మూడు దినములు మహోత్సవముతో జరిగెను. అంతియేగాదు, స్థానికములగు గ్రంథాలయ, వర్తకసంఘ, భజనసమాజ వార్షికోత్సవములును జరిగెను. జనుల యీ యుత్సాహతరంగములను అదుపు ఆజ్ఞలలోనుంచి నియమబద్ధముగ నిర్మాణ మార్గమున పరిపాలించినచో ఆంధ్రుల భావిదశ ప్రకాశవంతముగా నుండగలదని వారికి తోచెను. శ్రీవారి యాశయము మరియొక మెట్టెక్కెను.

## ౧౦

ఇంతవరకును వేర్వేరుసభలు భిన్నభిన్నాశయములతో వివిధ వేదికలపై నుండి తమ యాశయములను బ్రకటించు

చుండెను. ఈ వర్గసభల యాశయము లతో శ్రీ హనుమంతరావుగారు ఏకీభవించి ఆ సభా సమావేశములను ప్రోత్సహించుచుండిరి. ఆ కార్యకర్తలను కూడ గట్టుకొనియే శ్రీవారు ప్రవర్తిల్లుచుండిరి. ఈ సభలలో పోటీలేదు. పరస్పరవిద్వేష భావము లేదు. తమ తమ కులసంఘములను బలపుష్టియుతములుగా చేయుటయే వారి ప్రధానయాశయమై యుండెను. ఇది యవసరమైన కార్యజాతముగానే శ్రీవారికి తోచెను. ఇట్లన్ని సంఘములును వీర్యవంతములయినగదా ఆంధ్రజాతి పూర్ణస్వరూపము తేజోవంతముగా నుండగలుగుట! ఈ కార్యజాత మిట్లు నడచుచుండవలసినదే. అయితే, ఇట్లు వివిధ వేదికలపయి నుండువారిని ఒక్క వేదికపయి నెక్కించుట అవసరమయిన కర్తవ్యముగా శ్రీవారు భావించిరి. ఒక్క యాశయముతో - సకలాంధ్రజనాభ్యుదయాశయముతో- వీరి హృదయములు స్పందించునట్లు చేయుటకు సంకల్పించిరి. ఆంధ్రమహాసభను స్థాపించుటకు కృతనిశ్చయులయిరి. ఆంధ్రమహాసభ వేదికయే ఆంధ్రజాతి హృదయస్వరూపమును సందర్శించుటకు ఏకైక వేదికగదా!

ఆంధ్ర జన సంఘములు పెక్కు స్థాపితము లయినవి. పలు ప్రదేశములందు సభలు జరుగుచున్నవి. ఉర్దు భాషలో మాటాడుటయే నాగరికతగా భావించు విద్యాధికులు చక్కగా తెలుగులో నుపన్యసించుచున్నారు. ఆంధ్ర భాషలో మాటాడుటయే సగర్వముగా భావించుచున్నారు. విద్యాధికులకు, విద్యావిహీనులకు అంతరము నశించుచున్నది. పలువురు పత్రికలకు తెలుగులో వ్యాసములు వ్రాసి తమ మనోభావములను ప్రకాశితము చేయ గడంగుచున్నారు. ఇదంతయు మంచిప్రవర్తనమే. కాని ఇరలక్షల యాంధ్రులలో ఇప్పుడు కలిగిన సంచలనమెంత? సముద్రములో నొక నీటిబొట్టు. ఆంధ్రజనసంఘములసందేశము ప్రతి గ్రామమునకు, ప్రతి వ్యక్తికి, మూలమూలలకు ప్రాకవలెను. అప్పుడుగాని ఆంధ్ర మహాసభ స్థాపనోద్దేశము ఫలవంతము కానేరదు. నిరంతర కృషి జరుగవలెను. నిరంతర ప్రచారము గావలెను. కావున ద్రవ్యాభావమును గణింపక శ్రీయుత ఉన్నవ వేంకట్రామయ్యగారను నొకఘటికుని కేంద్రసంఘ పక్షమున ప్రచారకునిగా నియమించిరి. ఈ ప్రచార కార్యమునకై మొదటి సంవత్సరమున 300 రూపాయల విరాళమును శ్రీ దేశభక్త వామననాయకుగారిచ్చి ఆంధ్రోద్యమమునకు గట్టి బునాది నేర్పరచినవారైరి.

శ్రీ వేంకట్రామయ్యగారు సంచారము చేయుచు కేంద్రసంఘ ఆశయములను, ఆదేశములను ప్రచారము చేయసాగిరి. ఆంధ్ర నిధిని పుష్టివంతము చేయుటకు ద్రవ్యము ప్రోగుచేయుచుండిరి. ఆంధ్రమహాసభా సమావేశమునకు తగు ప్రదేశమును వెదుకసాగిరి. స్థానికుల సాను

భూతి సహాయములు లేకున్నచో ఈ కార్యము నెరవేరదుగదా! శ్రీ వేంకటాద్రి మయ్యగారి ప్రబోధ, కార్యచాతుర్యముల ఫలితముగా, హనుమంత నామమంత్రి ప్రభావమున ప్రథమాంధ్ర మహాసభను సమావేశపరుచుటకు మెదకు జిల్లాలోని జోగిపేట పౌరు లుత్సహించిరి. ఇట్లు ముందంజ వేసిన జోగిపేట పౌరులును, మెదకుజిల్లా పౌరులును ధన్యులుగదా! ఒక్కసారి మహాసభ జరుగగనే క్రమేణ సభలు జరుపుటకు సమానోత్సాహముతో వివిధ మండలములవారు ముందుకు రాసాగిరి.

పదకొండు మహాసభలు జరిగేవరకు తెలుగువారు తెలుగుమీరిపోయిరి. నిజామాబాదు సభయందే చిన్న అపస్వరము ప్రతిధ్వనించి అభివృద్ధిపక్ష మేర్పడెను. ఆసభాసమయమున గద్గదిక కంఠముతో బాష్పాకులిత నేత్రములతో హనుమంతరావుగారు మాటాడవలసి వచ్చెను. ఈ అభివృద్ధి పక్షము వికసించక మునుపే అంతరించిపోయెను. ఈ యభివృద్ధి పక్షీయులు తమ పొరపాటును గ్రహించిరి కాబోలు. మల్కాపుర సమావేశమునందు యువకుల దృక్పథమున క్రొత్త విధము గానవచ్చెను. రష్యావారికమ్యూనిజం (సామ్యవాదము) ప్రవాహరూపమున ప్రవేశించి యువకులను ముంచివైచెను. ఈ అవభృథస్నానముతో యువయులు కామ్రేడు బిరుదాంకితు లయిరి. ఈ కామ్రేడులు నూతావేశవశులయి ఖదము త్రొక్కసాగిరి.

ధర్మవరములో కామ్రేడు ధర్మములను రుచి చూపిరి. చిలుకూరులో పెద్ద పలుకులు పలికిరి. హైదరాబాదులో సింహనాదములు చేసిరి. ఈ కమ్యూనిస్టు పార్టియొక్క నిజస్వరూపము భువనగిరి సభలో పర్వతాకారమున బహిర్గతమయ్యెను. ఆంధ్రోద్యమ సంరంభమున పెక్కుశ్రమలుపడి నడపిన పెద్దలందరు జాతీయవాదులుగా విడిపోయిరి. ఇప్పుడు జాతీయపక్షము, కమ్యూనిస్టుపక్షము అను రెండుపక్షము లేర్పడినవి. జాతీయ పక్షమువారు మడికొండలో పండ్రెండవ మహాసభను జరిపియున్నారు. కమ్యూనిస్టు పక్షమువారు ఖమ్మములో పండ్రెండవ మహాసభను జరిపినారు. భేదతంత్రము చక్కగా పారినది. ఇట్టి విభేదము లెంత కాలము నిలుచునో తెలియదు ఈ విభేదములవల్లను, వృద్ధాప్యమువల్లను హనుమంతరావుగారు ఆంధ్రమహాసభ సంబంధమును త్రెంపుకొని కూర్చున్నారు. విచారపూరిత హృదయముతో, బాష్పపూరిత నయనములతో నీ విషమ పరిస్థితులను విలోకించుచున్నారు. శ్రీవారి యభిప్రాయము జాతీయవాదుల పక్షమున మ్రొగ్గుదల జూపుచున్నను, యువకుల యుత్సాహమునకు, కార్యదీక్షకు లోలోన సంతసించుచున్నారు. అనుభవముమీద కామ్రేడులు సౌమ్యపద్ధతికి రాగలరను ఆశతో నున్నారు. ఇట్టి మహత్తరమయిన కార్యజాతమును సమాచరించుటకు శ్రీవారు పూనిన ఆయుధము "ఓర్పుగుణము". ఈ ఓర్పు

గుణ మొకటి యున్నచో, సవ్యముగ ప్రచారము సాగినచో కాలమే సర్వ కార్యములను చక్కబఱచునని శ్రీవారి సిద్ధాంతము.

## ౧౧

నిజాము రాష్ట్రాంధ్రమహాసభ చరిత్రలో సిరిసిల్లా చతుర్థాంధ్రమహాసభా సమావేశము ముఖ్యఘట్టమని పేర్కొనవలసియున్నది. ఏలయనగా ఆ సభకు హానుమంతరావుగారే అధ్యక్షులుగా వరింపబడిరి. ఇంతకు పూర్వమే వీరి నధ్యక్షులుగా చేయుటకు ప్రయత్నములు జరిగెను. కాని శ్రీవారు పదవులయందు వ్యామోహము కలవారు [illegible] చే ఆ ప్రయత్నములు [illegible] సాగలేదు. [illegible] యువకులనుటకు తగు [illegible] నున్న విద్యార్థికులను ముందు [illegible] త్రోసి [illegible] తప్పించుకొనుచుండిరి. [illegible] సందర్భమున తప్పనిసరి [illegible]. ఆహ్వాన సంఘమువారేమి, వివిధ సంఘముల వారేమి ఏకవాక్యముగా హానుమంతరావు గారిని అధ్యక్షుడుగానుండ నిర్బంధించిరి. శ్రీవారి యధ్యక్ష్యమున సమా[illegible] సభ పెక్కువిధముల ప్రశంసనీయముగా నుండెను.

సిరిసిల్లసభలో ఆంధ్రమహాసభకు శాఖలుగా గ్రామసంఘములు, తాలూకా సంఘములు, జిల్లాసంఘములు స్థాపించుటయు, ఆంధ్రమహాసభకు ప్రతినిధుల నెన్నుకొనుటయు, ఆప్రతినిధులలోనుండి స్థాయిసంఘ మేర్పడుటయు, స్థాయిసంఘమునుండి కార్యకారిణీసంఘము నెన్నుకొనుటయు- ఈ విధముగా అంగనిర్మాణము గావింపబడెను. ఈ అంగనిర్మాణ విషయముసకై విపులముగ నియమావళి, ఉపనియమావళి అంగీకరింపబడెను. ఆంధ్రమహాసభ నియమబద్ధమయి కట్టుబాటు నకు వచ్చెను. ఈ తీర్థము హానుమంతరావుగారి శంఖమునుండియే పోయుట తటస్థించెను. ఏతత్సందర్భమున హానుమంతరావుగారి లౌకికప్రజ్ఞ, దూరదర్శిత్వము, సమయోచితప్రస్తావన, రాజకీయ శాస్త్రమర్యాదల ప్రియత్వము, రాజ్యాంగసూత్రవేదిత్వము సోపానపరం[illegible]నిర్మాణకౌశల్యము ప్రస్ఫుటముగ [illegible]యయ్యెను.

[illegible]బాదునుండి శ్రీ హానుమంతరావుగారు సిరిసిల్లకు బయలుదేరిన దొక [illegible]సమయము. అధ్యక్షులుగా నియామకులైన శ్రీవారి ప్రయాణమునకై పూలహారములతోను, మామిడాకుల తోరణములతోను నలంకృతమయిన మోటారు 'ఆంధ్రకుటీరము'నకు కేంద్ర సంఘ కార్యదర్శులయి, శ్రీవారి భార[illegible] మును వహించిన మందుముల రామచంద్రరావుగారు తీసికొనివచ్చి స్వయముగా మోటారు నడిపిరి. సిరిసిల్లకుపోవు యాత్రికులందరు అచ్చట సమావేశమయి జయజయ నినాదములు చేయుచుండిరి. అధ్యక్షులవారి మోటారుబండి కదలగా

వారి వెంట ౧౩ బస్సులలోను, ౩ మోటారు బండ్లలోను ప్రతినిధులు బయలుదేరిరి. ఈ ఆంధ్ర కల్యాణయాత్ర శ్రీవారి గృహమగు 'ఆంధ్రకుటీరము'నుండి ౨౬-౩-౪౨ ఉదయము ౧౧ గంటలకు సాగెను.

సిరిసిల్ల పోవు మార్గములోనున్న తూపురాను, కామారెడ్డి, మాచారెడ్డి, గోరెంటాల, గొల్లపల్లి, గ్రామాల జనులు అధ్యక్షులవారికి స్వాగత మిచ్చిరి. అల్పాహార విందులు చేసి సన్మానించిరి. ఇట్లు శ్రీవారు సపరివారముగ సాయంకాలమునకు సిరిసిల్లకు చేరిరి. ఆహ్వాన సంఘము వారు స్వాగతము చెప్పి, పెద్ద యూరేగింపుతో మహాసభకొరకు నిర్మితమయిన 'భీమకవి' నగరమునకు గొంపోయిరి.

అధ్యక్షుని మోటారుకారు ప్రధాన ద్వారమును బ్రవేశింపగనే స్వచ్ఛంద సేవకులు వందన మాచరించిరి. అధ్యక్షుడు కరతాళధ్వనులమధ్య సభామండపమును ప్రవేశించెను. చతుర్థాంధ్ర మహాసభ కార్యక్రమము ప్రారంభమయ్యెను.

ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీ ఆవునూరి వేణుగోపాలరావుగారు అధ్యక్షులకును, ప్రతినిధులకును స్వాగతములు పలికి అధ్యక్షుని ఎన్నుకొనుటకయి ప్రతిపాదనము చేయుచు నిట్లనిరి:-

"ఇంతకును మన భావ్యభివృద్ధికార్య్య నిర్మాణమునకై మన మొక నాయకుని యేర్పరచుకొనవలసి యుండును. ఇందుకు మన యాంధ్రోద్యమవ్యాప్తికి కారకులగు మ. రా. రా. శ్రీ మాడపాటి హనుమంతరావు హైకోర్టువకీలుగారన్ని విధముల మనకు మార్గదర్శకులని యాహ్వానసంఘ మభిప్రాయపడినది. ఇట్టి వీరిని గురించి ఆంధ్ర ప్రపంచమునకు పరిచయము గలిగించుట దీపము వెలుతురుతో నిండు చందురుని జూపినట్లగునని తలంచి, యీ మహాసభకు అధ్యక్షత వహించి, నిర్మాణ కార్యక్రమమును ఆదర్శప్రాయముగా ముగించెదరుగాక యని శ్రీవారిని గోరుచున్నాను."

ఆహ్వాన సంఘాధ్యక్షుని ప్రతిపాదనను బలపరచుచు, శ్రీ బూర్గుల రామకృష్ణరావు, బి.ఏ., ఎల్.ఎల్.బి., (హైద్రాబాదు) గారును, శ్రీ మాదిరాజా రామకోటీశ్వరరావు (వరంగల్లు) గారును, శ్రీ బి. కేశవరావు (నిజామాబాదు) గారును, శ్రీ కొండా వేంకటరంగారెడ్డి (అత్రాపుబల్దా) గారును, శ్రీ బోయినేపల్లి వేంకటరామనరసింహారావు (నల్లగొండ) గారును ఉపన్యసించిరి. అంత శ్రీ హనుమంతరావుగారు అధ్యక్షపీఠ మలంకరించి అధ్యక్షోపన్యాసము గావించిరి. ఈ అభిభాషణమునకు 75 నిమిషముల కాలము పట్టినది.

## ౧౨

ఆంధ్రాభ్యుదయముకొఱకు ఆంధ్రమహాసభా సమావేశములతో శ్రీ హనుమంతరావుగారు తృప్తిపడియుండలేదు. వారు తడవని విషయము లేదు; త్రొక్కని మార్గము లేదు. ఆంధ్రమహాసభ పురుషు

లకు, స్త్రీలకు అందరకు సంబంధించినదై యుండెను. ఆంధ్ర స్త్రీల యభ్యుదయమునకు సంబంధించిన ప్రత్యేక సమస్యలను పురుషుల సభలలో చర్చించుటకు వీలు లేదుగదా! అందుచే మొదటినుండియు ఆంధ్రమహాసభతో పాటు ఆంధ్ర మహిళా సభలును జరుపు ఏర్పాట్లు గావించిరి. ఈ మహిళా సభల విషయమున వీరికి తోడ్పడినవారిలో ముఖ్యముగా తోడ్పడినవారు శ్రీమతి నడింపల్లి సుందరమ్మ గారు.

ఆంధ్ర మహాసభలు సమావేశమగునప్పుడెల్ల, ఉన్నతాధికారులకును, ఆంధ్రేతరులకును ఆహ్వానములు పంపి, వారి సానుభూతిని పడయుచుండెడివారు. ఆంధ్రోద్యమమును ఆశీర్వదించుచు, విద్యాశాఖ ఉపాధ్యక్షులగు మౌల్వీ సయ్యదు మహమ్మదు హుస్సేన్ జాఫరీగారును, ప్రభుత్వ సభా కార్యదర్శులగు మౌల్వీ సయ్యదు మహమ్మదు మెహెదీగారును (వీరిప్పుడు నవాబ్ మెహదీ నవాజ్ జంగ్ బహదరు బిరుదాంకితులు) ప్రభుత్వపు పరిశ్రమిక శాఖా కార్యదర్శిగారును, వ్యవసాయ శాఖాధికారియగు డాక్టరు హెచ్. హెచ్. మ్యాన్ గారును, మౌల్వీ నిజాముద్దీన్ హైదరు సాహెబు, నాజం జిరాయతు గారును, నవాబు రహమతు యార్జంగు బహద్దరు కొత్వాలుగారును మున్నగు గొప్ప గొప్ప ప్రభుత్వాధికారులు సందేశములు పంపిరి. ఆంధ్రమహాసభలకు సందేశములంపిన ప్రభుత్వాధికారులలో పోలీసు, రెవిన్యూ శాఖలకు మంత్రిగా నుండిన సర్ టి. జే. టాస్కరు, I. C. S., C. I. E., O. B. S., గారుండిరనినచో, వీరు ఆంధ్రోద్యమమునెడ ప్రభుత్వము వారి సద్భావము సంపాదించుటలో ఎంతవరకు జయముగాంచిరో వెల్లడి కాగలదు.

ఆంధ్ర మహాసభతో పెక్కు ప్రదర్శనములు జరుపు వ్యవస్థను గల్పించియుండిరి. ప్రభుత్వాధికారులతో ముందుగా పత్రవ్యవహారము సల్పి, ఆ యా శాఖల వారిని మహాసభకు ఆహ్వానించిరి. మహాఘనత వహించిన నిజాము ప్రభుత్వము వారి వ్యవసాయశాఖ, పశుచికిత్సశాఖ, వైద్యశాఖ, సహకారశాఖలవారు సపరివారముగ విచ్చేసి, ఉపన్యాసములిచ్చియు, యంత్రిణీయంత్రము సహాయమునను, ప్రజల విజ్ఞానాభివృద్ధికి తోడ్పడిరి. జీవరక్షా ప్రచారక మండలి, బాలికల ఉన్నతపాఠశాల, నగరములోని తదితర బాలికా పాఠశాలలవారును, వ్యాయామ శాలలవారును అనుచర బృందముతో విచ్చేసి విజ్ఞాన ప్రచారమునకు ఎక్కువగా తోడ్పడిరి.

ఆంధ్ర విద్యార్థులందు వక్తృత్వ పాటవమును పెంపొందించుటకు పోటీపరీక్షలు నెలకొల్పి, విజయులయినవారికి కేంద్ర సంఘ పక్షమున పతకాదుల నొసంగు నేర్పాటు చేసిరి. విశ్వవిద్యాలయముల యందు పట్టభద్రులయిన ఆంధ్ర యువకుల నాహ్వానించి, స్నాతకోత్సవములు జరిపి

గౌరవించిరి. చిత్రకళా విద్యను నేర్చుకొనుటకయి శ్రీమాన్ మార్చాల రామాచార్యులుగారికి ధనసహాయము చేసియు, చేయించియు మచిలీపట్టణమునకు పంపిరి.

ఆంధ్రోద్యమముయొక్క ప్రధానకర్తవ్యముగా ఆంధ్ర పరిశోధక సంఘము నేర్పాటుచేసిరి. ఆంధ్ర మహాసభ స్థాయి సంఘము ఏర్పడిన తరువాత, తన్నియమానుసారము ఆంధ్ర పరిశోధకసంఘము స్వతంత్రమై ఇప్పుడు శ్రీ లక్ష్మణరాయ పరిశోధక మండలి యను పేరుతో పరిశోధక కార్యము నెరపుచున్నది. పరిశోధన మండలియందు సభ్యులయి శ్రీ హనుమంతరావుగారు తమ సహాయసంపత్తుల నొడగూర్చియున్నారు. ఈ మండలి మూలకముగా ఆంధ్ర చరిత్రకు ఎంతో మేలు కలిగినది.

హరిజనుల విద్యా విషయమునను రాయ్ శ్రీ కిషన్ బారిస్టరుగారికి సహాయ కార్యదర్శులుగను, ఆది హిందూ సాంఘిక సేవా సమితి కార్యకర్తలుగను కొంతకాలము కృషి సల్పియుండిరి. ఆంధ్రులలోని వివిధకులములయొక్కయు, వర్గముల యొక్కయు ఉద్యమములలో వీరు సంబంధము కలిగించుకొనియుండినందున ఆయా సంఘముల కార్యకర్తలు వీరివల్ల సహాయమును, ప్రోత్సాహమును పొందుచుండిరి. ఇప్పటికిని పొందుచున్నారు.

సంవత్సరము పొడుగునను ప్రజలు స్వయముగా స్వవిషయములను తెలిసికొని ధైర్యముతో పాటుపడుటకుగాను లఘుపుస్తకముల ప్రకటన పద్ధతి యొకటి లేవదీసిరి. ఈ లఘుపుస్తకమాలికలో సుమారు ౧౨౫ వరకు గ్రంథములు ప్రకటింపబడినట్లు తెలియుచున్నది. వీటిలో నిజాంరాష్ట్రాంధ్రులు, వర్తకస్వాతంత్ర్యము వెట్టిచాకిరి, వ్యవసాయకులకు కొన్ని సూచనలు, మద్యపానము, గ్రంథాలయములు, మన వాక్స్వాతంత్ర్యము, ఋణబాధానివారణ, మన విద్యాసమస్యలు, స్త్రీ సహకారిత యొక్క వివరణము, జనపరిగణన వృత్తాంతములు(౧౯౨౧,౧౯౩౧), నిజాం రాష్ట్రాంధ్రుల అభివృద్ధిమార్గములు, మొహకర్రా న్యాయస్థానములు, దేశభావలు అనునవి ముఖ్యముగా పేర్కొనదగిన పుస్తకములు. వీటి వెల అర్ధణా, అణా మాత్రమే. ఇవి వేలకొలది అమ్ముడుపోయినవి. తత్ఫలమున నుంచి ప్రబోధము జనులలో కలిగెను.

ఇట్టి కార్యకలాపమంతయు కేంద్ర సంఘ పక్షమున జరిగినమాట నిజము. పైని పేర్కొనిన లఘుపుస్తకములలో పనేకములను దేశాభిమానులగు కార్యకర్తలు పలువురు రచించి తోడ్పడిరనుట యదార్థము. అయితే అట్టి కార్యబాహుళ్యమును సూచించినవారును, అట్టి కార్యభారమును వహించినవారును శ్రీ హనుమంతరావుగారే యనియు, శ్రీ హనుమంతరావుగారి ప్రతిభయే ఏతదుద్యమ విజృంభణమునకు ప్రబల కారణమనియు తెలుపుటయే మా మాఖ్యాశయము. ఇట్టి కార్యకలాపము

ఇటీవల ఆంధ్రోద్యమ కార్యక్రమమున కనబడకుండుట గమనించదగియున్నది.

ఆంధ్రేతరులుకూడ ఆంధ్రోద్యమమును, హనుమంతరావుగారి కృషిని ఎంతయు కొనియాడుచు ప్రోత్సాహమిచ్చియున్నారు. ఇటీవల ౧౩౫౫ ఫసలీ (౧౭-౧౦-౧౯౪౫) నాడు నగరమున జరుపబడిన ఆంధ్రోద్యమ జయంతి సందర్భమున ఆంధ్ర పితామహులకు పౌరులు సన్మానపత్రము సమర్పించిరి. అప్పుడు మాటాడుచు, నిజాము రాష్ట్రములోని మహారాష్ట్ర, కర్ణాటకోద్యమముల జననమునకు హనుమంతరావుగారి యుద్యమమును వారి యాలోచనయు ప్రధాన కారణములయి యున్నవని మహారాష్ట్ర నాయకులగు కాశీనాథరావువైద్యా, ఎం. ఏ., ఎల్. ఎల్. బి., గారును, కర్ణాటక నాయకులగు శ్రీ జనార్దనరావు దేశాయిగారును, తమ సంతోషానుభవములను వెల్లడించియున్నారు.

## ౧౩

ఆంధ్ర మహిళోద్యమము చక్కగ సాగవలయునన్నచో స్త్రీలు విద్యావతులయి యుండవలయునుగదా! మన నిజాం సర్కారువారి విద్యాప్రణాళిక ఆంధ్ర బాలికల మాతృభాషాభివృద్ధికి భంగకరముగా నుండెను. ఏలయన, "విద్యాబోధనమునకు మాతృభాషయే సవ్యమార్గము, పరభాషలో బోధన మపసవ్యమార్గము" అని నిజాం ప్రభుత్వమువారు చారు మినారు శిఖరములమీదినుండి దండోరా వేసి, అందరు ఉర్దుభాషలోనే ఉన్నత విద్యను గడించవలయునని నిర్బంధించిరి. ఇదెట్టి తర్కమో! బాలుర విషయములో ఈ పద్ధతి యెట్లో సరిపుచ్చుకొన్నను, బాలికల విషయములో పరభాష యగు ఉర్దునందు విద్యార్జనము గావించుట శ్రీ హనుమంతరావుగారి కెంతయు విరుద్ధముగా గన్పట్టెను.

౧౩౩౦ ఫ. సంవత్సరములో "పరోపకారిణీ బాలికా పాఠశాల" నిర్వహణ భారము వహించినదాదిగ శ్రీ హనుమంతరావుగారి స్త్రీ విద్యాభిమానము ప్రశంసనీయముగ పరుగులువార జొచ్చెను.

ఈ పరోపకారిణీ బాలికాపాఠశాల ఇప్పుడు అఫ్‌జుల్‌గంజు బాలసరస్వతీ యాంధ్ర భాషానిలయములో నెలకొని ప్రాథమిక పాఠశాలగా చక్కగా నడచుచున్నది. ఈ పాఠశాల నిర్వాహణమున శ్రీయుత పురం విశ్వనాథము శ్రేష్ఠిగారు ప్రధానకార్యకర్తగనుండి శ్రీ హనుమంతరావుగారికి తోడ్పడుచున్నారు.

పైమరీవిద్య ముగించినంత మాత్రమున బాలికలు విద్యావతులను నామమున కర్హులుకారుగదా! ఆంధ్రభాషలో ఉన్నతవిద్యను గఱపు ఏర్పాట్లు నేల చేయుకూడదు? ఇట్టి భావతరంగములు శ్రీవారి హృదయవీథి నాక్రమించెను.

మనోనిశ్చయ మొకటి యేర్పడినచో మార్గమును గోచరమగు ననుట ఇప్పట్టున సార్థకమయ్యెను.

సర్కారువారి విద్యాపద్ధతి ఒక్క ఆంధ్రులకేగాక ఉర్దుమాతృభాష కానివారి కందరకును ప్రవాహమున కెదురీతగా నుండెను. సర్కారువారు బోధనభాష విషయమునేగాక, పాఠశాలల స్థాపించు విషయమునను కఠిన నియమములను చేసి స్త్రీవిద్యా ప్రచారమునకు పెద్ద అడ్డుకట్ట కట్టిరి. కావున హిందూనాయకుల కిది యొక గడ్డుసమస్యగా పరిణమించెను.

శ్రీ రామచంద్ర నాయకు, ఎం. ఏ. బారిష్టరు గారును, రాయ్ విశ్వేశ్వర నాథు, బి.ఏ.ఎల్.ఎల్.బి. గారును శ్రీ అహల్యాబాయి మల్లన్నగారును, శ్రీమతి సులోచనా శాయిగారును, శ్రీ హనుమంతరావు గారును, శ్రీ వాసుదేవ హార్డికరుగారును, శ్రీ కృష్ణస్వామి ముదిరాజుగారును, బాలికల విద్యాప్రచారము విషయములో నొక సంఘముగా నేర్పడిరి. రెసిడెన్సి బజారు (ఇప్పుడు సుల్తాన్ బజారు) బ్రిటిషు వారి యాధిపత్యములో నుండుటచేతను, ఇచ్చట విద్యాప్రచార విషయములో ఎట్టిచిక్కులునులేక స్వేచ్ఛావాతావరణ యుతమయి యుండుటచేతను, మహారాష్ట్రము, ఆంధ్రము ఈ రెండుభాషల యందును ఉన్నతవిద్యను గఱపు బాలికా పాఠశాలను రెసిడెన్సీ బజారునందు ఈ సంఘమువారు సాపించిరి (౧౯౨౮). కాని మహారాష్ట్రశాఖ తగినంత ప్రోత్సాహకరముగానుండమి, ఆ శాఖ ఎత్తివేయబడెను.

పైనచెప్పిన కమిటీవారీ పాఠశాలను మూడు సంవత్సరములవరకు జరిపి ఆంధ్ర శాఖ మూడవఫారమువరకు అభివృద్ధి పొందిన తరువాత ఆర్థిక సౌకర్యములు లేవనుకారణమున వదలుకొనిరి. (౧౯౩౧) అప్పుడు శ్రీ హనుమంతరావుగారు తమ మిత్రులగు శ్రీ వడ్లకొండ నరసింహారావు గారి సహాయబలమున ఆపాఠశాల భారమును మీద వైచికొని ఆంధ్ర బాలికల ఉన్నతపాఠశాలగా మార్చివైచిరి. దీనికి మొదట కొలదికాలము ఆంధ్రజన కేంద్ర సంఘమునుండి కొంత ధన సహాయము దొరకుచుండెను గాని తరువాత నది స్వతంత్రమయి శ్రీహనుమంతరావుగారి అవిశ్రాంతకృషి ఫలితముగా విజృంభించి నిక్కమయిన ఉన్నత పాఠశాలయై, వందల కొలది బాలికలకు ఆంధ్రభాషలో విద్యాదానము చేయుచున్నది.

ఈ పాఠశాలలోని చదువు నామోదించు విషయములో ఉస్మానియా, నాగపూరు, ఆంధ్ర విశ్వవిద్యాలయములవారికి శ్రీ హనుమంతరావుగారు వ్రాసి వ్రాసి వేసారిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ఉర్దును తప్ప మరేభాషను మేము ప్రధాన భాష (Medium) గా అంగీకరింపమనిరి. నాగపూరు విశ్వవిద్యాలయమువారు ఆంధ్రమునకు అట్టి సౌక

ర్యము లేదనిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు మాకు దేశీయ రాజ్యములతో సంబంధము లేదనిరి. ఇట్లన్నివిధముల విఫలమనోరథులు కాగా పూనా (ఇప్పుడు బొంబయి)లోని శ్రీమతి నాతీబాయి దామోదర థాకర్సే భారత మహిళా విశ్వవిద్యాలయమువారికి వ్రాసిరి. ఇది ప్రభుత్వమువారి యామోదము పొందిన విద్యాపరిషత్తు కాకపోయినను, మహిళావిద్యావిషయమున ఎం. ఏ. పరీక్షవరకు మంచి వ్యవస్థకల్పించి మాతృభాషకు ప్రాధాన్య మిచ్చుచుండెను. ఈ విశ్వవిద్యాలయము వారు ఆంధ్రములో పరీక్షలు జరిపి యోగ్యతాపత్రములను ఇచ్చుటకు సమ్మతించిరి. కావున శ్రీ హనుమంతరావుగారు బాలికల ఉన్నత పాఠశాలను పై విశ్వవిద్యాలయమున కనుబంధముగా నొనర్చిరి. (౧౯౩౭)

ఈ పాఠశాల ఆంధ్రబాలికల విద్యావిషయములో కల్పవల్లిగా భాసిల్లుచున్నది. ఈపాఠశాలలో చదివి సుమారు 38 మంది ప్రవేశపరీక్షలో నుత్తీర్ణలయిరి. కళాశాల పరీక్షలతో నీ పాఠశాలకు సంబంధము లేకపోయినను, ఆ పరీక్షలకు చదువువారలకును కొన్ని సదుపాయములుచేయబడినవి. ఒకరు 'గృహీతాగమ' (జి.ఏ.=బి.ఏ.)పరీక్షయం దుత్తీర్ణలయినారు. శ్రీ హనుమంతరావు కృషి ఫలితముగా ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు ఇటీవల వెనుకటి నియమములను మార్చుకొని కొంతసౌకర్యము కలిగించినందున నిరుటినుండి(౧౯౪౭) యీపాఠశాల బాలికలు ఆంధ్ర విశ్వవిద్యాలయ మెట్రిక్యులేషన్ పరీక్షకు పోవుచున్నారు.

శ్రీ హనుమంతరావుగారు ఏకార్యము చేపట్టినను దానికి చక్కని వికాసము గల్పించి సర్వాంగసుందరముగా చేయుదురు. ఈపాఠశాలలో సామాన్యవిద్యయే గాక, ప్రథమచికిత్స, కుట్టుపని, సంగీతము, మాతృభారతి పత్రిక మొదలగు విశేషశాఖలలో శిక్షణము గరపుటకు ఏర్పాటు చేయబడినది.

సౌన్యహస్తములతో స్థాపితమయిన యీ విద్యాసంస్థ రాజాబహద్దరు వేంకట్రామరెడ్డిగారి పోషకత్వమున క్రమాభివృద్ధిచెంది, మహోదారులగు ఆంధ్రుల, ఆంధ్రేతరుల యభిమానపాత్రమయి, బలిష్ఠమగు ఆర్థికపుష్టి కలిగి, సమస్తవస్తుపరికరసమేతమయి, దివ్యమోహనమయి తనరారుచుండుట ఎంత మోదావహమగు విషయమో యోచించుడు. కార్యదర్శిగానుండి కృషిసల్పిన శ్రీహనుమంతరావుగారి గాఢ కార్యానురక్తియు, కార్యసాధన చాతుర్యమును, ఘనతయు సువర్ణాక్షరములలో లిఖింపదగినవై యున్నవి.

## ౧౪

ఆంధ్రోద్యమ సంరంభమున అసంఖ్యాకమయిన యీ కార్యజాతమును నిర్వహించుటలో వ్యవహారము నల్లేరుపయి బండి నడకమాదిరి సాగినదని మా చదువరులు భ్రమింపగూడదు. మూడవ కేంద్రసభ

జరిగినతరువాత మూడేండ్లకుగాని నాల్గవ కేంద్రసభ జరుపుటకు వీలు కలుగలేదు. పదునారు సంవత్సరములలో పండ్రెండు ఆంధ్రమహాసభలు మాత్రమే జరుపుటకు అవకాశము కలిగినది. ఇట్టి యాలస్యమునకు కారణమేమి? ప్రజల అలసతయా? కాదు. కాదు. ప్రజ లుత్సాహాన్వితు లయియే యుండిరి. ఈ మందగమనమునకు ముఖ్యకారణము ప్రభుత్వమువారు. ప్రభుత్వమువారి "గస్తీ నిషాన్ తిర్పన్" సైతాన్ వలె వీరికి అడ్డుతగులుచుండెను. ఆంధ్రజన సంఘములకు బొట్టుపెట్టి రాజకీయసంఘము లని పిలిచిరి. ఏకైన్నామకరణ ఫలితముగా సభలకు ప్రభుత్వానుమతి దొరకుట దుర్లభమయ్యెను.

"రాజకీయము లన నేమి? రాజకీయ విషయములెయ్యవి? ఒక పట్టిక దయచేసి పంపండి. దాని ననుసరించుకొని మా కార్యక్రమమును సవరించుకొనెదము" అని శ్రీ హనుమంతరావుగారు ప్రభుత్వము వారికి పదేపదే వ్రాసిరి. ప్రభుత్వము నుండి తృప్తికరమగు ప్రత్యుత్తరము రాలేదు. ఈ గష్తీ విషయములో నిజాము రాష్ట్ర ప్రముఖులు ప్రభుత్వమువారి పోలీసుశాఖామాత్యులయొద్దకి రాయబారము వెడలి జ్ఞాపిక నర్పించిరి. ఈ రాయబారమునకు శ్రీవారు కార్యదర్శిగానుండి కృషి సలిపిరి. మహజరు తయారుచేసి ఆందోళన సలిపిరి. అన్ని ప్రయత్నములును నిష్ఫలము లయినవి.

"మందమందముగానైనను గట్టి పట్టుదలతో ముందంజ వేయవలయును" అని కదా శ్రీవారి సూక్తి. అట్టి యోపికతో విసుగువిరామములు లేకుండ ప్రభుత్వమువారితో పత్రవ్యవహారము జరుపుచుండెడువారు. అధికారులను స్వయముగా కలిసి వారి మనస్సులను సుముఖముగా చేసికొనుటకు ప్రయత్నించుచుండెడివారు. ఎక్కినగడపయే యెక్కుచు, దిగిన గడపయే దిగుచు శ్రమించుచుండెడివారు. ఎట్లయిననేమి, ఆలస్యముగ నైనను విజయలబ్ధిని పొందుచుండిరి. ఆంధ్రమహాసభకు ప్రభుత్వానుమతి దొరికినదను సమాచారము ఆంధ్రులకు కర్ణపర్వము కాగా అందరు శ్రీవారి నభినందించుచుండిరి. ఈవిషయమునుగూర్చి శ్రీయుత తిరుమల యన్. కృష్ణశర్మగారు ఇట్లభివర్ణించి యున్నారు:-

'అదొక విషపుగడియ. హైద్రాబాదు రాజకీయ రంగముమీద కారు చీకటి కప్పియుండినది. ప్రజాపక్షపు ఆందోళనపై ప్రభుత్వపు అంగారకదృష్టి పడియుండినది. మొదలే మొగలాయి జనులు. అందులో పిరికి. ఈ పిచ్చుకల పయి "తిర్పన్ గస్తీ" బ్రహ్మాస్త్రము ప్రయోగింపబడియుండెను. అది చాలదని సుగ్రీవాజ్ఞ యొకటి వెలువడెను. సభచేయుటకు రూ ౨౦౦౦ లు జామీనియ్యవలెను. సభ ప్రభుత్వపు మనస్సునకు రాకయున్న జామీను 'జప్తు'. దేశము గడగడ వడకినది. నాయకుల కంటికి పిడుగు పడెను. కమ్మిన చీకటి మూడేండ్లకు తొలగలేదు. ప్రజాందోళనక్రమి

అక్కడక్కడ పోరాడి సోలి చల్లారినది. వెలుగు ఆసను తగ్గించు నిరాశ అది. హఠాత్తుగ పత్రికలలో జను లొకదినము చదివిరి. "ఆంధ్రమహాసభకు అనుమతి, జామీనక్కఱలేదు". లోకుల వ్రేళ్ళు ముక్కుపై కెక్కినవి. ఈ అమావాస్య చంద్రుని నమ్ముటయే కష్టమాయెను. శ్రీ హనుమంతరాయలు పట్టిన పట్టుకే ఆ కీర్తి. వారి కార్యసాధనాదీక్షా ఫలమే అది. నిరంతరధారా ప్రవాహమునకు బండరాతిచట్టులూ పొడి పొడి అగును. నిజాము దేశపు రాజకీయ ప్రళయములో రావుగారు ఆంధ్రమహాసభా వ్యవహారమును తమకడకుతీసికొనియుండుట మొగలాయి జనులకు ఒక రీతి జీవదానము, పునస్సృష్టి. (గోలకొండ పత్రిక)

ప్రభుత్వమువారి రాజకీయదృష్టి భేదమును మనసునందుంచుకొనియే శ్రీ హనుమంతరావుగారు తమ అధ్యక్షోపన్యాసము (సిరిసిల్ల)నందు ఆంధ్రహృదయమును ఇట్లు విప్పిచెప్పిరి:—

"ఈ దేశమునందును నవీన భావములు వ్యాపించుచున్నవి. ఇది తప్పదు. దేశములోని విద్యార్థులలో ముఖ్యముగా యువజనులయందు దేశసేవాసక్తియు, ఆత్మగౌరవభావమును ప్రబలుచున్నవి. ఇట్టి సమయమున మహోత్కృష్టమగు విజ్ఞాన వ్యాపక కార్యమును ముందడుగు వేయ యత్నించుచున్నారు. ఇట్టి వారి సేవాసక్తిని అనుమానదృష్టితో చూడకూడదు. వీరి యుత్సాహమును హెచ్చించి వారితో పనిగొనుట యుత్తమ రాజనీతి యగును. వీరియందు ద్రోహబుద్ధి లేదని నేను ఘంటాపథముగ చెప్పగలను. ఇట్టి విద్యార్థులను ప్రభుత్వమువారు నమ్మవలయును. "నమ్మకము లేనివారికి సుఖము లేదను సామెత గలదు. నాయీవిజ్ఞప్తిని దూరాలోచనతోను, సానుభూతితోను, గైకొనబడుగాక."

ప్రభుత్వమువారి నెట్లో మెప్పించి అనుకూలముగ త్రిప్పికొన యత్నించుచుండగా, మన ఆంధ్ర సోదరులలోని కొందరు విభీషణయ్యలవల్ల ప్రారంభమైన క్రొత్త యలజడిని శ్రీ హనుమంతరావుగారు తట్టుకోవలసివచ్చెను. హైదరాబాదులో నిజాం రాష్ట్రాంధ్రజన సంఘము స్థాపితమయినప్పుడు "మేము బ్రిటిషు ఆంధ్రులము. మా బ్రిటిషు ఆంధ్రవ్యక్తిత్వమును మేము వదలుకొనజాలము. (We do not like to lose our individuality as British Andhras)" అని కారణముచెప్పి కొందరు సభ్యులుగా చేర నిరాకరించిరి. ఇట్టి వీరందరు ముల్కీ సర్టిఫికెట్లను సంపాదించి, "మేము ముల్కీలమేనండీ" అని చెప్పుకొనుచుండెడివారే. వ్రేళ్ళమీద లెక్కపెట్టదగు వీరలు సభ్యులుగా చేరక పోయినంతమాత్రమున కలుగు నష్టము లేదు. సానుభూతి చూపకుండినను కలుగు విపర్యయము ఏమియులేదు, ఊరకుండిన జాలును. కాని యూరకయుండిన ఊరా పేరా? వీరు తమ మండలిలో నొకరగు

శ్రీయుత పాలకోడేటి వేంకటశాస్త్రిశర్మ, బి. ఏ., గారిని ముందుకుతోసిరి. శ్రీశర్మగారు సౌమ్యులు, అమాయకులు. మిత్రుల ప్రోత్సాహమున నిజము తెలియక, దూరదృష్టిలేక, కేవల మసూయాభావముతో ఆంధ్రజన సంఘములు రాజకీయ సంఘములే యని నిరూపించుచు రెండు వ్యాసములను, వాటిని సమర్థించుచు మరిరెండు వ్యాసములను నీలగిరి పత్రికలో వ్రాసిరి. శ్రీ శర్మగారి యభిప్రాయమును ఖండించుచు శ్రీ హనుమంతరావుగారు ఆ పత్రికలోనే జవాబు ప్రకటించిరి. శర్మగారి వ్యాసములవలన మూల్గేనక్కమీద తాటిపండు పడినట్టులాయెను. "మీ ఆంధ్ర సోదరుడే రాజకీయ సంఘమంటుంటే మీరు కాదంటారేమి" అని అధికారులు సవాలుచేసిరి. తత్ఫలితముగా సభల నాపుచుండుటయు, గ్రంథాలయముల పనులకు ఆటంకముల కల్గించుచుండుటయు సాగుచుండెను. నేటివరకును ఆపద్ధతి ఆగిపోలేదు.

పైన చెప్పిన విధమున కొందరు సోదరులు "బ్రిటిషు ఆంధ్రులు - నిజామాంధ్రులు" అను వివాదము నొకటి లేవదీసి శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయమునందును గొప్ప దుమారము చెలరేగునట్లు చేసియుండిరి. ఆ సమయమున శ్రీ హనుమంతరావుగారు శ్రీ మునగాల రాజావారు మొదలగు ఇతర కార్యకర్తల సహకారముతో మేరుపర్వతమువలె నిలువంబడి తత్ప్రతిఘటనమును పటాపంచలు గావించిరి.

ఆంధ్రోద్యమము రాజకీయోద్యమము కాదనియే మొదటినుండియు శ్రీవారు ఎలుగెత్తి చాటుచుండిరి. "మన సంఘములు ముఖ్యముగా విద్య, విజ్ఞానము, నీతిని - వీటిని వృద్ధిపరుప యత్నించవలయును. దయాళువులగు ప్రభుత్వమువారు సర్వవిషయములందును మన యభివృద్ధికై పాటుపడుచున్నారు. కనుక రాజ్యాంగ విషయములతో మన కేమాత్రము పనిలేదు" అని శ్రీ హనుమంతరావుగారు వ్రాసినారు. (తెనుగుపత్రిక)

శ్రీవారి కిప్పటికిని ఆంధ్రమహాసభలు రాజకీయ సభలుగా మారకూడదనియే యభిప్రాయము. ఏలయనగా, సర్కారు ఉద్యోగస్థులును, ధనికులును ఈ సంఘములందు చేరి ఆంధ్రుల యందైకమత్యమును, ఆంధ్రసంస్కృతి ప్రవృద్ధికిని పాటుపడవలయుననియే వారి యాశయము.

ఇప్పుడు ఆంధ్రమహాసభ రాజకీయముగా మారినమాట నిజము. ఇట్లే పరిణమించునని మే మప్పుడే జోస్యము చెప్పియుండలేదా? అని ప్రభుత్వమువారును, శ్రీ వేంకట్రామశర్మ ప్రభృతులును సగర్వముగా చాటవచ్చును. కాని ఇట్టి పరిణామమునకు ప్రభుత్వమువారి ప్రతిబంధకములే ప్రబలకారణములని కొంచెము లోతుగా యోచించిన స్పష్టము కాగలదు. యువకులు నిరుత్సాహులయినారు. ప్రచండవేగముతో ప్రపంచము మారుచున్నది. రాజ్యతంత్రవిధానము మారిన

గాని సమావేశస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము లభించదని యువజనులకు రూఢియయినది. కావున ఆంధ్రోద్యమ కార్యవిధానము, ఆదర్శము మారినది. ఇట్లు మారుటకు ప్రపంచచరిత్రలో పెక్కు దృష్టాంతములు దొరుకగలవు. కాల ప్రభావ మరికట్టరానిది. సేనానులు రాజులయినారు. శాంతమతస్థులగు సిక్కులు వీరసింహులు లయినారు. ఇదియే చరిత్ర బోధించు పాఠము.

౧౫

సభలవిషయమున నెట్లో పత్రికలవిషయమునను అట్లే నిజాం సర్కారువారు తమ దృష్టిని పరుపుచుండిరి. శ్రీ హనుమంతరావుగారు "హైదరాబాదు పత్రిక" అను పేర ఒక పత్రికను నడుపుటకు సంకల్పించి, సర్కారువారి యనుమతికోరి మూడుసార్లు విఫలులయిరి. తరువాత తెలంగాణపత్రికను స్థాపించుటకు నుద్దేశించిరి. ఈ ప్రయత్నమును విఫలమయ్యెను. సర్కారువారి దృష్టిలో హనుమంతరావుగా రప్పుడు అపాయకరమైన వ్యక్తిగా నుండెను. క్రమక్రమముగా సత్యము గోచరించి, తెలంగాణపత్రికకు అనుమతి నిచ్చు విషయములో సుముఖులయి నప్పుడు హనుమంతరావుగారు సంసిద్ధులుగా లేరయిరి. ఈ సవ్వడి గ్రహించి శ్రీమాన్ బుక్కపట్టణము రామానుజాచార్యి, బి.ఏ.బి.ఎల్. గారు, సర్కారువారి యనుమతి పొంది, తెలంగాణ పత్రిక భారము వహించి, హనుమంతరావుగారి సహాయము స్వీకరించిరి. శ్రీవారు వర్లె యనిరి.

ఈ కాలములో పత్రికలే విజ్ఞానప్రచారమునకు ప్రబల సాధనములుగదా! అట్టి పత్రికాసాధనము తమ చేతిలో నుండుటకు వీలులేకపోయెను. కావున శ్రీవారి లేఖిని పలువిధ పత్రికలందు, పలువిధరూపముల సంచారము చేయుచుండెను. ఇట్లు శ్రీవారి సహాయమును పత్రికలు పొందినందున వీరి కనుమతి దొరకకపోవుట "కీడులో మేలయ్యె" నను సామెతకు తార్కాణమాయెను. నీలగిరి, తెనుగుపత్రిక, గోలకొండ, సుజాత, దేశబంధు మొదలగునవి వీరి సానుభూతిని పొందిన పత్రికలు. ఇప్పుడు తెలంగాణ పత్రికకును, వీరికిని అవినాభావసంబంధ ముండుట మా చదువరులు గ్రహించియుందురు. ఇట్లే మఱీరొ డక్కన్ ఉర్దు దిన పత్రికకును, వీరికిని సంబంధము కలదు.

వీరు పత్రికలలో నిజాం రాష్ట్ర విషయములనే గాని రాష్ట్రేతర విషయములను అంతగా చర్చించరు. ఏలయనగా, నిజాంరాష్ట్ర విషయములకు ఇతర పత్రికలు ఎంతమాత్రము తావిచ్చుటలేదు. అందుచేత మన రాష్ట్ర విషయములకే ప్రాధాన్య మిచ్చెదరు, "అంతర్జాతీయత" అని ఏమేమో పెద్ద పెద్ద మాటలు చెప్పు వారిని చూచి వీరు నవ్వుచుందురు. "ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గానికి ఎక్కగలదా?"

"పక్క యెక్కడ, నాగలోక మెక్కడ !" అను సామెతల భావమును గ్రహించు వారుగా కనబడుచుందురు. శ్రీ హను మంతరావుగారు నేల విడిచి సాముచేయు వారుకారు.

౧౬

శ్రీ హనుమంతరావుగారి వైదుష్యము విశాలమయినది. శ్రీవారికి ఆంధ్రము, ఉర్దు, ఫారసి, ఇంగ్లీషు భాషలయందు గట్టి సాహిత్యపటిమ గలదు. మహారాష్ట్ర హిందీభాషలయందు మంచి పరిచయము గలదు. ఈ భాషలలో ఒకదానినుండి యింకొకదానిలోనికి పరివర్తన చేయుట యందు శ్రీవారి శక్తి అద్భుతమయినది. శ్రీవారి భాషాంతరీకరణములు, ఆ యా భాషా సాంప్రదాయములు, దేశీయములు మొదలగువాని ననుగుణముగానుండి చదువువారలకు భాషాంతరీకరణములుగా తోపవు.

ఆంధ్రములో గాని, ఉర్దులో గాని, ఇంగ్లీషులో గాని ధారాళముగా, తడుము కోకుండా, ఆకర్షణీయముగ ఉపన్యసించు శక్తిగలవారు. ఒకసారి సికంద్రాబాదులో హరిజనాభివృద్ధి సంబంధమయిన సభలో రావుబహద్దరు సి. పద్మారావు మొదలి యారుగారు ఇంగ్లీషులో నుపన్యసించిరి. దానిని తెలుగులో చెప్పవలసినదిగా హను మంతరావుగారిని కోరిరి. వెంటనే హను మంతరావుగారు లేచి రావుబహద్దరువారి యుపన్యాసములోని భావములు బీరుపోకుండ, పూసగ్రుచ్చినట్లు తెలుగులో సెల విచ్చిరి. సభాసదులంద రాశ్చర్యచకితులైరి. ఇక పద్మారావు మొదలియారుగారో అత్యంత ముదితులై లేచి, హనుమంతరావు గారి కరచాలనము చేసి "నా యుపన్యాస మునకు మెరుగుదెచ్చినారు. మీ ప్రజ్ఞ అనుపమాన మయిన"దని ప్రశంసించిరి. భాష, మతము, సంఘ సంస్కరణము, రాజకీయము, మొదలగు ఏ విషయమున నైనను, వారు చక్కగ ప్రసంగించగలరు. ఎంత చిన్నని విషయమునైనను, పెంచి, రసస్ఫూర్తిగ పుష్టి చేసి, తత్పర్యవసానము తెలిసికొనుటకు సభ్యు లువ్విళులూరునట్లు చేయుదురు. వక్తృత్వపటిమ కలవారిలో శ్రీవారు ప్రథమశ్రేణికి చెందినవారే యని నిర్వివాదముగ నుడువవచ్చును.

శ్రీ హనుమంతరావుగారు వ్రాసిన వ్యాసముల సంఖ్య గణనాతీతము. పత్రికా రచనయందు వారు సిద్ధహస్తులు. వారు నిష్కర్షముగ విషయమును ప్రతిపాదించి మెల్లగ సాగనిచ్చుచుందురు. వారి విమర్శ నలు నిప్పులు గ్రక్కుచుండవు. శాంత స్థాయిలోనుండి కొంత వ్యంగ్యభావ సమ న్వితములయి యుండును. కఠినవాక్యము లుండనే యుండవు. అయినను ప్రతిపక్ష వాదమును నిర్మూలనము చేయుటలో, ప్రతిపక్షి నుడికించుటలో వీరి పదజాలము శక్తిమంతములయి యుండును.

శ్రీ హనుమంతరావుగారు హనుమ కొండలో నుండగనే, గ్రంథ రచనకు

కవిత్వరచనకు మొదలుపెట్టిరి. శ్రీవారి యందు కవితాశక్తి కలదు. కవిత యల్లినారుకూడను. అయితే, ఆధునిక యువ సరములను గుఱుతించి, పద్య రచనను వదిలి, వచన రచనకే తమ లేఖినిని ముఖ్యముగ నుపయోగించి యున్నారు. ఆంధ్రోద్యమ ప్రవాహములో పడిన తరువాత గణ యతి ప్రాసలను సరిచూచుకొనుచు పద్యముల్లల్లు నవకాశమే లేకపోయినది.

శ్రీవారు మొట్టమొదట రచించిన గ్రంథము బంకించందు 'ఆనందమఠ'కు తెనుగు అనువాదము. ఇది ముద్రణాలయ ముఖము చూడకముందే దొరసామయ్యగారి అనువాదము ప్రకటితమగుటచే దీనిని ప్రకటించలేదు. తరువాతి గ్రంథము ఇటలీదేశ భక్తాగ్రగణ్యుడగు గ్యారీబాల్డి జీవితము. అముద్రితముగా నున్నది. అచ్చులో సుమారు ౨౦౦ పుటలుండగలదు. శ్రీవారీ గ్రంథమును ౧౯౧౧ లో వ్రాయుటలోనే వారి మనోభావము, దృక్పథము గోచరించుచున్నది. ఈ గ్రంథ రచనకు తెలుగులో మంచి జీవితచరిత్రలు లేకపోవుట యొక కారణము. దేశాభిమానపూరితములు, దేశముక్తికి పోరాడిన ధీరుల చరిత్రలు లేకపోవుట రెండవ కారణము. ఈ పుస్తకమును ముద్రించదలచి మచిలీబందరులోని ఆంధ్ర భాషాభివర్ధనీ సంఘమువారు తెప్పించుకొని కొంతకాల ముంచుకొని తత్ప్రచురణమునకు అప్పటి కాల పరిస్థితులు అనుకూలముగా లేవని విచారము దెల్పుచు తిరుగనంపిరి. తరువాత కొన్ని యేండ్లకు శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావు గారు గ్యారిబాల్డి జీవితమును ప్రకటించుట తెలిసికొని ప్రకటనా ప్రయత్నము మానుకొన్నారు. ఇంతవరకు తెలుగులో లేని పుస్తకములను వ్రాయవలయునే గాని ఉన్న పుస్తకములనే మరల వ్రాయుట శ్రీవారి యుద్దేశము కాదు. రామాయణములకు నకలు రామాయణములు, భారతమునకు నకలు భారతములు, రుక్మిణీ కల్యాణమునకు నకలు రుక్మిణీ కల్యాణములు వ్రాయుట పుస్తక సంఖ్య పెరుగుటయే గాని వాఙ్మయమునకు పుష్టి కాదని శ్రీవారి దృఢనమ్మకము.

"రోమక సామ్రాజ్య చరిత్రము" వీరు రచించిన మూడవ గ్రంథము ఇది చరిత్ర గ్రంథము. ఇది అసంపూర్ణ గ్రంథము. రచన ధారాళముగ నున్నది. ఆంధ్ర భాషలో నింతవరకు రోమక సామ్రాజ్య చరిత్ర రచితమయియుండ లేదని తలంతుము. కావున ఈ యుద్గ్రంథమును పూర్తిచేసి ఆ మహాసామ్రాజ్య చరిత్రజ్ఞానమును ఆంధ్రుల కలవడ జేయుదురుగాక! ఇది ముద్రితమయినచో ఆంధ్ర సరస్వతి కొక నూత్నాభరణముగా ప్రకాశించగలదని మేము నమ్ముచున్నాము.

'క్షాత్రకాలపు హింద్వార్యులు' అను గ్రంథము వీరి నాల్గవ గ్రంథము. ఇది

౧౯_౨౭ లో ముద్రణభాగ్యము నొందినది. కీ. శే. పువ్వాడ వేంకటప్పయ్యగారు తమ 'కృషిప్రచారిణీ గ్రంథమాల'లో రెండవ కుసుమముగా ప్రకటించినారు. ౯౨ పుటలు గలవు. ఇది బొంబాయి వాస్తవ్యులును, శ్రీవారి మిత్రులునగు రావు బహద్దరు చింతామణిరావు వైద్య ఎం.ఏ., ఎల్.ఎల్.బి. గారు వ్రాసిన విఖ్యాతమగు 'ఎపిక్ ఇండియా' అను ఆంగ్లగ్రంథములోని వ్యాసములకు ఆంధ్రానువాదము. ఇందు హిందూ ఆర్యుల యుడుపులు, వారి యాహారము, వారి వివాహములు, వారి సాధారణ రాజ్యాంగస్థితి, వారి భూగోళశాస్త్రము అను విషయములు మనోహరములుగా పరిశోధనాపూర్వకముగా చర్చింపబడినవి. పూర్వపు టార్యుల సాంప్రదాయములను తెలిసికొనుట కెంతయు నుపకరించును.

ఈ పుస్తకమేగాక శ్రీ వైద్యాగారు ఆంగ్లమున రచించిన 'మహాభారతసమీక్షణము'ను కూడ తెనిగించి యున్నారు. (౧౯౧౬) కొన్నియధ్యాయములు ఆంధ్ర భారతి, ఆంధ్రాభ్యుదయము, దేశబంధు మాసపత్రికలలో ప్రకటించియున్నారు. ఇట్లే పారసీ కవులను గూర్చియు సుజాత పత్రికలో దఫాలవారిగా వ్యాసములు వ్రాసి ప్రకటించియున్నారు. ఇవన్నియు గ్రంథరూపమున వెలువడినచో ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికి దోహదముగా నుండ గలవు.

ఆంధ్రములో కథానికలు (**Short stories**) నూతన పద్ధతులమీద మొట్టమొదలు వ్రాసిన కీర్తి శ్రీ హనుమంతరావుగారికే చెందవలసియున్నదని చెప్పుటకు మిగుల సంతోషించుచున్నాము. వీరి కథలు మొట్టమొదట నేటికి ౩౫ సంవత్సరములకు పూర్వమే కృష్ణాపత్రికలో వెలువడుట ఆరంభమై యుండెను. వీరు ౧౩ కథలు రచించినారు. వాటిపేర్లను ఈ క్రింద నుదహరించుచున్నాము:-

౧ హృదయశల్యము
౨, రాణీ సారంధా
౩ ముసలిదాని యుసురు
౪. నేనే
౫. అగ్నిగుండము
౬. నాడు నీపంతము - నేడు నాపంతము
౭. ఆత్మార్పణము
౮, విధిప్రేరణము
౯. ఎవరికి ?
౧౦ న్యాయమా ?
౧౧. ఎవరిది తప్పు ?
౧౨. ఇక కావలసినదేమి ?
౧౩. నిజమేనా ?

ఈ పట్టికలోని మొదటి ఏడుకథలును 'మల్లికాగుచ్ఛ' మను పేరుతో మచిలీపట్టణములోని సరస్వతీ నికేతనమువారు పుస్తకరూపమున ప్రకటించియున్నారు. (౧౯౧౧). 'విధిప్రేరణము', 'ఎవరికి?' అనునవి హైదరాబాదు నగరములో అణా గ్రంథమాలయొక్క ౧౨ వ కుసుమముగా ప్రకటితమైనవి, మిగత నాలుగు కథలును సుజాత, భారతి, శారద మాస

పత్రికల పుటలలో దాగుకొనియున్నవి. ఇవి గ్రంథరూపమున వెలువడి యుండిన ఎంతబాగుగ నుండియుండును?

ఈ కథలలో హృదయశల్యము, నేనే అను రెండుకథలును హనుమంతరావు గారి స్వకపోల కల్పితములు. మిగత కథలు "ప్రేమచందు" అను ప్రఖ్యాత నవలాకారుని ఉర్దు రచనలకు కొన్ని అను వాదములును, కొన్ని అనుసరణములునై యున్నవి.

మల్లికాగుచ్ఛము ఒప్పులకుప్ప యని వావిళ్ళ రామస్వామిశాస్త్రిలు అండు సన్నువారు ప్రకటించిన "ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము" అను గ్రంథము నందు తద్గ్రంథకర్తయగు "కవిత్వవేది" గారు ప్రశంసించియున్నారు. ఇది సంతో షించదగిన విషయముకదా!

ఈ "కవిత్వవేది" గారు చేసిన దొడ్డ పొరపాటును కూడ మా పాఠకుల దృష్టికి తేవలసియున్నది. కావున ఆ వాక్యమును పూర్తిగ వ్రాయు చున్నాము. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము ౨౭౮ పుటలో "శ్రీ మైనంపాటి హను మంతరావుగారి మల్లికాగుచ్ఛ మొప్పుల కుప్ప" అని లిఖించియున్నారు. విలువ గల 'మాడ' పోయి, విలువలేని 'మైనం' అయినది. చరిత్రలు వ్రాయువారి యీ అలక్ష్యభావము ఎంతయు క్షమింపదగినది కాదు. మైనం అయితే చరిత్రలో బాగుగ నతుకుకొనిపోవుననుకొన్నారు కాబోలు! ఇట్లే మరియొక గ్రంథములో శ్రీ హను మంతరావుగారి అన్నగారగు మాడపాటి తిరుమలరావుగారు మొసలికంటి తిరు మలరావుగారై పోయినారు!

నిజాంరాష్ట్రమునకు చెందిన గ్రామా లను, కవులను, రాజులను మా తూర్పు తీరపు సోదరులు తారుమారుచేసి బ్రిటిషు ఆంధ్ర ప్రాంతమునకు లాగుకొనిపోయి చిత్రవిచిత్ర చర్చలు చేయుట మాకు క్రొత్త విషయము కాదు. ఇంతయేల ఈ ఆంధ్రసోదరుల దృష్టిలో ఇచ్చటివారు అసలు ఆంధ్రులుకారు; ఇది ఆంధ్రదేశము కాదు. ఇచ్చటి ఆంధ్రులు "వలసపోయిన ఆంధ్రులు" అని యొక ఆంధ్రనాయకుడు పత్రికాధిపతి ప్రకటించగా, శ్రీ హను మంతరావుగారే కలమును కేలబూని ఆ దుర్వాదమును ఖండించవలసివచ్చినది.

"నిజాం రాష్ట్రములో రాజ్యాంగ సంస్కరణలు" అనునది మరియొక గ్రం థము. ఇది ఇచ్చటి ప్రజాపరిషత్తువలన ఏర్పరుపబడిన కమిటీవారి నివేదిక. ఇంగ్లీషునుండి హనుమంతరావుగారే తెలుగులోని కనువదించిరి. ఇది ౮౦ పుటల గ్రంథము.

నిజాం సర్కారువారు "అయ్యంగారి కమిటీ"నిరాజ్యాంగప్రణాళికను నిర్మించు టకు నియమించగా, ప్రజల యభిప్రా యము సూచించుటకయి ప్రజాపక్షమున నొక సమితి ఏర్పడెను. ఈ సమితిలో

హిందు, మహమ్మదీయ, ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర నాయకులగు హేమాహేమీలు చాలమంది యుండిరి. ఇచ్చట మనము గర్వించదగిన విషయమేమనగా, ఆ సమితి సభ్యుల పేర్ల చివర ఇంగ్లీషు వర్ణ సమామ్నాయములోని పెక్కు అక్షరములు తగిలినవారుండగా, ఏ అక్షరము లేని మన మాడపాటి హనుమంతరావుగారే ఆ సమితి కధ్యక్షులుగా వరింపబడినారు. దీనివల్ల హనుమంతరావుగారి రాజ్యాంగ ధర్మవేతృత్వము ఎంత గొప్పదో విస్ఫుటమగుచున్నది. ఆంధ్రేతరులకును హనుమంతరావుగారియెడ ఎట్టి విశ్వాసము, గౌరవభావము కలదో తేటతెల్లమగుచున్నది.

రాజ్యాంగ ధర్మసూత్ర నిర్మాణ నౌకను జయప్రదముగ నడపిన కర్ణధారుని ప్రశంసించనివారు లేరు.

శ్రీవారి కవిత్వపురీతి తెలుపుటకై రెండు పద్యములను ఉదాహరించుచున్నాము:—

౧. ఇది ఫిర్దౌసికృత పార్సి పద్యమున కనువాదము :

"హీనుల మహోన్నతపదవి కెత్తుటయును
ఎత్తివారి యుపకృతి నాశించుటయును
స్వీయమానధనము బుగ్గిసేయుటగును
సర్వమును దనజేబులో సాదుటగును"

౨. ఇది స్వకపోలకల్పితము:—

"ఫలములచేతఁ గొన్నిటిని
బల్లవసంతతిచేతఁ గొన్నిటిన్
సలలిత సౌఖ్యదాయి యగు
ఛాయను గొన్నిటివేవిధాల నీ
యిలను ననేకప్రాణుల క
హీనసుఖంబిడు వృక్షరాజమున్
బలువడి పీకివైచితె తు
సాన! వినాశము చేసివైచితే.

అధునిక వచన రచన కనుకూలముగను, విస్పష్టార్థద్యోతకముగను ఉండుటకయి వ్యాకరణ సూత్రబంధములను సడలించుట అవసరమని శ్రీహనుమంతరావుగారు తలంచెదరు. కాని నియమవిరహితమయిన వ్యావహారికభాషను వాడుట శ్రీవారి యభిప్రాయముకాదు.

౧౭

యువకులయందు కార్యోత్సాహము ప్రజ్వలింపజేయుట మొదటినుండియు శ్రీవారి యాశయము. సిరిసిల్ల మహాసభలో తమ అధ్యక్షోపన్యాసమునందు యువకుల కర్తవ్యమును గూర్చి ఇట్లు నుడివియున్నారు :

"దేశభాగ్యోదయ కిరణములు దిఙ్మండలమున గానవచ్చుచున్న ఈ తరుణమున యువజనులు చేయవలసిన దెంతయేని కలదు. ఏ దేశమునందైనను, ఏ కాలమందయినను, అచ్చటి యువకులే భవిష్యత్తును నిర్మించుటకు సాధనములగుచున్నారు. ప్రపంచచరిత్ర యంతయు నేడీ యంశమునే ధృవపరచుచున్నది.

యువజనులందు సహజముగ నుండు ఉత్సాహము, కార్యనిర్వాహణాసక్తి వారిని దేశ సేవకులుగ జేయుటకు తోడ్పడుచు నుండుట శ్రోత్రవిషయము కాదు. మనము జీవించి యున్న యీ కాలమున నిది యెంత యాధార్థ్యమో ఆరువందల సంవత్సరములకు ముందును మన ఆంధ్ర కవి సార్వభౌముడగు శ్రీనాథునకు అంతేయాధార్థ్యమని తోచినది. విఖ్యాతమగు పల్నాటి వీరచరిత్రములోని యొక ముఖ్య సందర్భమున, ఆ మహాకవి ఇట్లు స్పష్టముగా వక్కాణించియున్నాడు. ఈ వాక్యరాజములు ప్రతి ఆంధ్ర యువకుడును స్మరింప దగినవి! ప్రతి వృద్ధుడును ఒప్పుకొన దగినవి :—

"మానాభిమానముల్ మగటిమి మించ
బ్రబలింపగలవారు బాలురెనమ్మ!
బాలురె పెద్దలు; బల్లిదుల్ వారె
బాలురకే వృద్ధి పరికించిచూడ!
పెద్దలు మతిచెడి పిఱికిపాఱుదురు
పాంచభౌతిక దేహ పటిమ క్షీణించు
ధైర్యంబు తగ్గు, నుత్సాహంబు లడగు
వయసు మీరిన వేళ వచ్చునా బలిమి!
కీర్తికయినను నపకీర్తికి నయిన
బాలురపైనుండు భారమంతయును.

కనుక మన యుద్యమమును ముందు దేశమంతటను వ్యాపింపజేయు ఘన కార్యముయొక్క భారము ఆంధ్ర యువజనులపై ననేయున్నది. వారి హృదయములందు తరంగితమగుచున్న యుత్సాహ ప్రభావమును నేను గ్రహించియున్నాను. కావున కార్యరంగమున ప్రవేశించి, దేశ సేవకయి కటిబద్ధులగుటకుగాను నేను 'వయసుమీరిన ఈవేళ' 'పాంచభౌతిక దేహము క్షీణించి' 'ధైర్యముతగ్గియుత్సాహంబు లడగుచుండు నీ సమయమున 'మతిచెడి పిఱికిపాఱు స్థితి' రాకముందే ఆంధ్రయువజనుల నాహ్వానించుచున్నాను. వారీ యాహ్వానము నంగీకరింతురు గాక !"

శ్రీ హనుమంతరావుగారి యాహ్వానమును యువజను లంగీకరించిరనియే మనము ఒప్పుకొనవలయును. నాయకుని యాజ్ఞలను పాలించిరనియే మనము గ్రహింపవచ్చును. అయితే యువజనుల నిట్లు ఆహ్వానించుచు, వారు కర్తవ్యపాలనమున నెట్లు మెలగవలయునో కూడ సూచించియున్నారు. వారిట్లు ఉపదేశించిరి :—

"దేశసేవ చేయు నుత్సాహమున కేవలము ఉద్రేకమునకు లోబడవలదనియు, మన రాష్ట్రములో గల ప్రత్యేక స్థితిగతులను దృష్టియందుంచి, క్రమశిక్షణకు విధేయులై, తొందరపాటు మాని, హిందూ మహమ్మదీయ క్రైస్తవాది వివిధ మతములును, మహారాష్ట్ర కర్ణాటకాది వివిధ భాషలును గల నిజాంరాష్ట్రాంధ్రదేశమున సమరసభావము నాదర్శముగనుంచుకొని, దేశాభివృద్ధికయి మందమందముగానైనను సరే గట్టి పట్టుదలతో ముందంజ వేయవలయుననియు నేను యువక సోదరులను, సోదరీమణులను ప్రబోధించుచున్నాను."

యువక సోదరులకును, సోదరీమణులకును శ్రీ హనుమంతరావుగారు చేసిన ఈ ప్రబోధమును యువక సోదరులును, సోదరీమణులును త్రోసిరాజనిరని స్పష్టముగా చెప్పవచ్చును.

శకటగత చక్రము విధమున ప్రతి యుద్యమప్రవర్తకుల పరిస్థితులును క్రిందు మీదగుచుండుట చరిత్రప్రసిద్ధము. ఒక్క మన ఆంధ్రోద్యమపు నొసటనే పొద్దు పొడవలేదు. 'ఇండియన్ నేషనల్ కాంగ్రెసు' అను విఖ్యాత సంస్థయందే ఇట్టి ఒడుదొడుకులు మెండుగా గలవు. కాంగ్రెసునందు యువకులు ఎక్కువగా గడబిడలు చేసి, నాయకులను పదభ్రష్టులుగా జేయ నుద్యమించిరి. పెద్దపెద్ద నాయకులు ఈయువజనుల సమరోత్సాహమునుజూచి దిగ్భ్రమ చెంది తబ్బిబ్బులయిరి. ఒక్క గాంధిమహాత్ముడు మాత్రము యువకుల తతంగమును నిర్వికారదృష్టితో చూచెను. ౧౯౩౯లో మహాత్ము డిట్లు సెలవిచ్చెను:—

"వారు (సోషలిసులు) చెప్పెడు విషయములలో కొన్ని మన మంగీకరింపదగినవే. సిద్ధాంతములలో విభేదములు పొడసూపినప్పుడెల్ల, మనము వాటిని స్పష్టపరచి యూరకుండుట భావ్యమని తలంచుచున్నాను. భేదాభిప్రాయము లేనంత వరకు వారిని ముందుకు పోనిండు. భేద మున్నసందర్భమున వారి కార్యకలాపము ముందుకు సాగిపోజాలదనెడు విశ్వాసమును మన మేల పెంపొందించుకొనగూడదు?"

(I follow the Mahatma by K. M. Munshi, Page 133.)

ఈ విషయచర్చాసందర్భమున, "ఇదియే మహాత్ముల దర్శన విభూతి (Mahatmic Perception). తరువాతి సంఘటనలు దీనిని బాగుగ ధృవపరిచెను. కాంగ్రెసు పెద్దలు పెక్కుమంది దీనిని కనుగొనజాలకపోయిరి" అని మున్షీగారు వివరించియున్నారు.

శ్రీ హనుమంతరావుగారి మనః ప్రవృత్తియు మహాత్ముని భావము ననుసరించి యున్నట్లు తోచుచున్నది. కాలగర్భమున నేమున్నదో?

## ౧౮

శ్రీ హనుమంతరావుగారు పూనిన కార్యజాతములో ఆంధ్రమహాసభ మకుటాయమానమయినట్టిది. ఈ మహాసభలలో ఆంధ్రజనుల యుత్సాహము వెల్లివిరిసి పారెను. మహాసభలకు వచ్చు జనుల సంఖ్య క్రమక్రమముగా హెచ్చసాగెను. వేలకొలది జనము నానావర్ణములవారు ఎట్టి అరమరికలేక సోదరభావముతో గుమిగూడుచుండిరి. సిరిసిల్ల మహాసభలో పంద్రెండు వేలమంది యుండిరని అంచనా వేయబడినది. ఆహ్వానసంఘముల పరిశ్రమ కడుంగడు హెచ్చసాగెను. ప్రథమాంధ్రసభకు రు ౧౨౫౨–౧–౦ లు వ్యయము చేయగా, ఐదవఆంధ్రమహాసభకు రు౯౫౬౨–౧౨–౦ వ్యయమును భరింపవలసి వచ్చెను.

ఈ యంకెలను బట్టి కార్య బాహుళ్యము ఎట్లు హెచ్చినదో గ్రహింపవచ్చును. ఆంధ్రాభిమానమును, ఆంధ్రభాషాభిమానమును అట్లే విజృంభించసాగెను. ఈ మహాసభలయందు నిరాడంబరముగ కార్యచక్రము నడపుచు బాలునివలె ఆనందించుచున్న శ్రీ హనుమంతరావుగారి నిండువిగ్రహము ఆంధ్రజన నయన చకోరములకు చంద్రతుల్యమైపోయెను. హనుమంతరావుగారు చిన్నయని, పెద్దయని, గొప్పవారని, కొద్దివారని, పురుషులని, స్త్రీలని భేదమెంచక అందరను పలుకరించి సంతోషపెట్టుచుండిరి. ఉచ్చనీచ పదములు వారి నిఘంటువులో లేవు. ఈ ఆంధ్రోద్యమ రథమును లాగుటకు ప్రతి అల్పుని బుజముకూడ అవసరమేనని వారు తలంచుచుండిరి.

ఈ ఆంధ్రోద్యమ సంరంభమున శ్రీవారికి పుష్కలముగ ప్రముఖులనుండి సహాయసంపత్తులు లభించినవి. శ్రీవారు మహాసభాధ్యక్షపదవికి నియమితులు కాగానే, కేంద్రసంఘ కార్యదర్శిపదవిని విసర్జించిరి. ఆ పదవిని సమానోత్సాహులగు శ్రీయుత మందుముల రామచంద్రరావుగారు వహించిరి. శ్రీ రామచంద్రరావుగారు ప్రధాన కార్యదర్శి యయి, తమ మోటారులో స్వయముగా రథచోదకులయి అధ్యక్షులవారిని సిరిసిల్లకు తీసికొనిపోయిరి. సిరిసిల్ల తీర్మానములలో మహాసభయొక్క చిత్తునియమావళి చర్చ గడ్డువిషయముగా నుండెను. ఆ సందర్భమున శ్రీ మందుముల రామచంద్రరావుగారు తమ యోచనా నైపుణ్యము, వ్యవహారదక్షత, రాజతంత్రచాతుర్యము అద్వితీయముగా నుపయోగించి అధ్యక్షులవారికి తోడ్పడిరి. రెండవ ఆంధ్రమహాసభ కొల్హాపురములో జరుగవలసియుండెను. కాని ఆ ఆంధ్ర సంస్థానము సమ్మతి నిరాకరించెను. మహారాజా సర్ కిషన్ ప్రసాద్ బహద్దరువారి సంస్థానము కొనిదగు షాదునగరులో ఐదవసభ జరుపుటకు మహారాజాబహద్దరువారి సంస్థాన కార్యదర్శి శ్రీయుత గుండేరావుగారు అనుమతి నిప్పించుటయే గాక సౌకర్యములుగూడ గావించిరి. శ్రీ గుండేరావుగారు సిరిసిల్ల సభా సమావేశ సందర్భమున సంస్థానపు ఇలాకా వేములవాడలో అధ్యక్షులగు శ్రీ హనుమంతరావుగారికిని, నాయకులకును గొప్పవిందు చేసి, ఛాయాపటము తీయించిరి. షాదునగరునందును నాయకులకు గొప్ప విందు చేసి సన్మానించిరి. కర్ణాటకులయినను శ్రీ గుండేరావుగారు చూపిన సౌజన్యమును శ్రీవారు శ్లాఘించుచుందురు.

శ్రీవారి ముఖమున ఆంధ్రోద్యమతత్వమును గ్రహించి, బొంబయి ఆంధ్రులు అధికాభిమానమును జూపిరి. అందు ముఖ్యముగా శ్రీశంకర శాయన్న వర్మాగారు రు ౫౦౦ ల విరాళమిచ్చి తోడ్పడిరి.

హైదరాబాదులో విద్యా విజ్ఞానోద్యమములకు శ్రీ రాజా బహద్దరు వేంక

గ్రామారెడ్డిగారు కల్పతరువు. శ్రీ రాజా బహద్దరువారు శ్రీ హనుమంతరావుగారికి సంపూర్ణముగ తోడ్పడిరి. శ్రీవారి సహచరులయి వీరికి తోడ్పడిన తోడ్పడుచున్న ప్రముఖులలో కొండా వేంకటరంగారెడ్డిగారు, సురవరం ప్రతాపరెడ్డిగారు, మాదిరాజు రామకోటీశ్వరరావుగారు, గడ్డం రామకృష్ణారెడ్డిగారు, మందుముల నరసింగరావు, రామచంద్రరావుగార్లు ముఖ్యులు.

౧౯

శ్రీ మాడపాటి సోదరులు! యుక్తవయస్కులు కాగానే సంసార భారములు వహించవలసిన పరిస్థితులు సంభవమయ్యెను. కావున శ్రీ తిరుమలరావుగారు పది సంవత్సరములు ప్రభుత్వోద్యోగమున గడిపిన తరువాత, ఎఱ్ఱిపాలెము నందును, శ్రీ హనుమంతరావుగారు మొదట హనుమకొండయందును, తరువాత హైదరాబాదునందును కాపురములు పెట్టిరి. ఎవరంతట వారు ఉద్యోగములు చేయుచు జీవికలు సాగించుచున్నను, సోదరులు అన్యోన్య ప్రేమబద్ధులయి మెలంగుచుండిరి.

శ్రీ తిరుమలరావుగారు సమర్థుడును, జనప్రియుడును, ఉపకారియు, ఉదారభావోపేతుడునగు గృహస్థుడుగా ప్రఖ్యాతి గడించిన మహాశయుడు. ఆంధ్రోద్యమపు ప్రారంభదశలో వీరు మూడవ కేంద్ర సంఘ సమావేశసభకును, ఆంధ్ర గ్రంథాలయ ప్రథమ మహాసభకును ఆహ్వాన సంఘాధ్యక్షులుగా నుండి మధిరలో ఆసభలను జయప్రదముగా నిర్వహించియుండిరి. వీరికి ఒక్కడే కుమారుడు, రామచంద్రరావు. రామచంద్రరావుగారు బి. ఏ., ఎల్.ఎల్.బి. పరీక్షలయందు ఉత్తీర్ణుడయిన విద్యాధికుడు. విశేష రాజకీయపరిజ్ఞానము, దేశసేవాభిలాషము కలవాడు. భావికాలమున రాజకీయరంగమున యోధుడుగా ప్రవర్తిల్లు లక్షణములు ఈతనియందు కన్పడుచున్నవి. శ్రీ తిరుమలరావుగారు స్వర్గస్థులయినారు. (౧౭-౨-౧౯౩౦)

చదువు పూర్తియయిన కొలదికాలమునకే శ్రీ హనుమంతరావుగారు తమ చిన్న మేనమామగారి కూతురు అన్నపూర్ణమ్మగారిని వివాహమాడిరి. హనుమకొండలో చిన్నయుద్యోగములో నున్నను వెంటనే మేనత్తగారిని, భార్యను పోషించవలసిన భారము వీరి తలపయి బడెను.

శ్రీ అన్నపూర్ణమ్మగారు వయోరూప గుణశీలములందు భర్తకు తగినదయి, అప్పురాలై, తోడునీడయయి చరించెను. శ్రీ అన్నపూర్ణమ్మగారి గర్భమున ఒక కూతురు జనించెను. పుత్రికా జననము తరువాత అన్నపూర్ణమ్మగారు నడియౌవనముననే అకాలమృత్యువునోట బడెను. ఈమె మరణసమయమున హనుమంతరావుగారు తమ అన్నగారి కుమారుడు రామచంద్రరావు విద్యావిషయములలో

శ్రద్ధగైకొనుచు బొంబయిపట్టణములో నుండుట శ్రీవారికి పత్నీవియోగము మరింత విషాదహేతువయ్యెను.

హనుమంతరావుగారి ఏకైక పుత్రిక లక్ష్మీబాయి తల్లిలేని శిశువగుటచే, శ్రీవారి అన్నగారును, వదినగారును ఆబాలికను మిగుల గారాబముతో పెంచి, పెద్దదానినిచేసి తల్లిలేని లోపమును దీర్చిరి. ఈ సౌభాగ్యవతి గుంటూరులో వకీలగు శ్రీయుత గోవిందరాజుల దత్తాత్రేయరావు బి.ఏ.,బి.ఎల్.గారిని వివాహమాడి ఇంతలు వంతలు నగు తన సంతానము వెంట నడచుచుండగా పుట్టిన యింటికిని మెట్టిన యింటికిని కీర్తి తెచ్చుచున్నది.

శ్రీయుత గోళ్ళమూడి హనుమంతరావుగారి కూతురగు మాణిక్యాంబను శ్రీ హనుమంతరావుగారు ద్వితీయ కళత్రముగా పరిగ్రహించిరి.(౧౯౧౮) ద్వితీయ కళత్రము వలన నాలుగేండ్లక్రింద వీరి కొక కుమారుడు కలిగినాడు. సుకుమార నామధేయుడగు నీబాలుడు నిక్కముగ సుకుమారుడయి, వంశవర్ధనుడయి ప్రకాశించునట్లు భగవంతు డనుగ్రహించుగాక!

స్త్రీవిద్య విషయములో అత్యంతాభిమానముకల హనుమంతరావుగారు తమ యర్ధాంగివిషయములో ఉదాసీనులగుదురా? కీ. శే. అన్నపూర్ణగారికివలెనే శ్రీమతి మాణిక్యమ్మగారికిని స్వయముగా విద్యగరప ప్రారంభించిరి. శ్రీ హనుమంతరావుగారు విద్యాశాఖలో చేరలేదు. కాని చేరియుండినచో చక్కని బోధనాకౌశల్యముగల ఉపాధ్యాయులయి గణుతికెక్కియుందురు. రెండేండ్లు తీరికకాలములో బాలికల ఉన్నతపాఠశాలలో ఉన్నతతరగతులకు ఆంధ్రమునందును, చరిత్రయందును పాఠములు చెప్పియున్నారుకూడను. తాము నెలకొల్పిన ఉన్నత బాలికాపాఠశాలలో మాణిక్యమ్మగారినివిద్యార్థినిగా చేర్చి, తాముస్వయముగా బోధించి చదివించిరి. క్రమక్రమముగా విద్యాభివృద్ధి చేసికొని, బాలికల ఉన్నత పాఠశాలనుండి ప్రవేశపరీక్షకు వెళ్ళిన మొదటిజట్టులో శ్రీ మాణిక్యమ్మగారు ప్రవేశపరీక్షకు వెళ్ళి జయమును పొందిరి. ఆమె యారోగ్యము సరిగా లేనందున పైచదువులు చదివి గొప్పపరీక్షల నిచ్చు నవకాశము తప్పిపోయినది. అయినను విద్యాపరిశ్రమము చేయుచు ఆంధ్రాంగ్లేయ భాషలయందు కొంతపాండిత్య మలవరచుకొనియున్నది.

విద్యావతియు, వివేకవతియు, నిగర్వియు, నిరాడంబరజీవియు నయి శ్రీమతి మాణిక్యమ్మగారు ఆదర్శగృహిణిగా తనరారుచున్నారు. భర్తగారు పూనిన సకలవిధోద్యమములందును సహకారమొనర్చుచు సహధర్మచారిణీ నామమును సార్థకము చేసియున్నారు.

సిరిసిల్ల ఆంధ్రమహాసభ కధ్యక్షులుగా శ్రీ హనుమంతరావుగారు వరణీయులై యుండుట మా చదువరుల కిదివరకే విష

రించుకొని యున్నాము. ఆంధ్ర మహాసభతోపాటు ఆంధ్ర మహిళాసభయు జరుగుచుండుట మా చదువరులు గ్రహించి యుందురు. ఈ సిరిసిల్ల ఆంధ్ర మహిళా సభకు శ్రీమతి మాణిక్యమ్మగారే అధ్యక్షురాలుగా నియమితురాలయినారు. ఈ నియామకము ఆహ్వాన సంఘమువారు ఏకవాక్యముగా, సంతోషపూర్వకముగా చేసిన నియామకము. శ్రీ హనుమంతరావుగారియందును, వారి కుటుంబమునందును తెలంగాణవాసులకు గల యాదరమున కిది ప్రబల తార్కాణము.

భర్తయు, భార్యయు, ఒకేసారి, ఒకే స్థలమున జంటగా సాగుచున్న ఆంధ్రమహాసభకును, ఆంధ్ర మహిళాసభకును క్రమముగా అధ్యక్షత వహించుట చరిత్రయందెచ్చటను గానము. సిరిసిల్లలోని దొక మనోహరదృశ్యము. ఆ దృశ్యమును జూచి ఆంధ్ర నర, నారీమణులు పులకాంకితులయిరి.

శ్రీమతి మాణిక్యమ్మగారి అధ్యక్షోపన్యాసము భావగర్భితమయి, పెక్కు స్త్రీజన సమస్యలను జర్చించి నారీపథము క్రొంగ్రొత్త వికాసముతో ప్రచలితమగునట్లు ఉద్బోధించుచుండెను.

## ౨౦

"ఎవ్వడయిన నొక్కజన్మములో ప్రజానాయకుడు గాజాలడు. జన్మతః ప్రజానాయకుడయి పుట్టవలయును. ఏలన, కష్టమంతయు సంఘస్థాపనయందుగాని, కార్యక్రమ కల్పనమునందుగాని లేదు. నాయక లక్షణము, నాయకత్వార్హతా నిదర్శనమిది. భిన్నాభిప్రాయములు, భిన్నసంప్రదాయములు గల జనులను వారి సమానాశయములనుబట్టి యేకమాత్రబద్ధులను గా నొనర్చి నడుపుటలోనే నాయకుని శక్తిసామర్థ్యములుగన్పట్టును" (శ్రీచిరంతనానందస్వామి విరచిత శ్రీ వివేకానంద జీవితచరిత్ర – పుట ౨౩౮ )

అని శ్రీ వివేకానందస్వాములవారు నాయక లక్షణములను నిర్వచనము చేసియున్నారు. ఈ నిర్వచనమునకు పరమోదాహరణముగ శ్రీ హనుమంతరావుగారి జీవిత లక్షణములుండుట గత పుటలయందు వర్ణితమయిన కథాభాగములను బట్టి కొంతవరకయినను మా చదువరులు గ్రహించి యుందురు. కొంతవరకనుట ఏలయనగా. శ్రీవారి చరిత్ర మొక గంభీర సాగరము. గజయీతగాడు మాత్రమే సముద్రాంతరాళమునకు బోయి రత్నములను సేకరించి ప్రకాశింపజేయ గలుగు శక్తిమంతుడగును. మాకు గల పాండితీ విభవమా తక్కువ. మాకు గల విషయ పరిజ్ఞానమా పరిమితము. మాకు గల భావనాబలమా నిస్సారము. కావున శ్రీవారి జీవితచారిత్రమును సుప్రకాశము చేయుటలో మేమెంతవరకు జయప్రదులమయితిమో చెప్పజాలము. అయినను, పండితులలో పండితుడయి, కార్యదీక్షా

-లలో కార్యద్రష్టయయి, నాయకులలో నాయకుడయి, గ్రంథకర్తయై, ఉపన్యాసకుడయి, రాజనీతి వేత్తయయి, సంఘసంస్కార ప్రియుడయి, ఆంధ్రభాషోద్ధారకుడయి, ఆంధ్రజనానందసంధాయకుడయి, అఖండ త్యాగశీలముతో, అకుంఠితసేవాసక్తితో తన సౌఖ్యమును, తన విరామమును, తన సర్వస్వమును రమారమి అర్ధశతాబ్ద కాలము ఆంధ్రమాతృ చరణారవింద ముల సన్నిధిని సమర్పించి, స్వయం ప్రకాశుడయి వెలుగొందుచున్న యీ ధీరునియెడ, ఈ సుప్రసన్నునియెడ, ఈ నిష్కళంకచారిత్రుని యెడ సకలాంధ్ర జనులు కృతజ్ఞతాపూర్వకముగ, ఆనంద కోలాహలముతో జరుపుచున్న శ్రీవారి షష్టిపూర్తి జయంతి మహోత్సవ శుభ సందర్భమున మా యీ యల్పసేవయగు వాక్కుసుమదామమును శ్రీ హనుమంత రావుగారికి కానుకగా సమర్పించుకొనుచున్నాము.

ఆంధ్రపితామహ పండిత మాడపాటి హనుమంతరావుపంతులుగారికిని, శ్రీవారి దారాపుత్రాదులకును చిరాయురారోగ్య భాగ్యములను భగవంతుడు ప్రసాదించునుగాక !

ఓం తత్సత్.










జయన్తి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశః కాయే
జరామరణజం భయమ్.




సుకృతాత్ములు రససిద్ధులు
సుకవీంద్రులు విజయనిధులు సుమ్ము తదీయా
ధిక కీర్తి శరీరంబులు
ప్రకట జరామరణ జన్మ భయ రహితంబుల్.







ఎఱుకగల వారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠి గదలక ధర్మం
బెఱుగుచు నెఱిగినదానిని
మఱవకనుష్ఠించు నది సమంజసబుద్ధిన్.










# సిరియాళదేవి

(ఏకాంక నాటిక)



శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు



## అంకితము

* * *

నిజాం రాష్ట్రాంధ్రోద్యమ పితామహులు
నిరాడంబర సేవాప్రియులు ఆదర్శజీవులు అగు

శ్రీ మాడపాటి హనుమంతరావు
పంతులుగారికి

షష్టిపూర్త్యుత్సవంలో

చంద్రమౌళిశాస్త్రి



ఆంధ్రవాఙ్మయ సేవాసమితి

## సిరియాలదేవి

(కందార రాజధాని, రాజభవనంలో శుద్ధాంతమున సోమరాజు-సిరియాలదేవి పర్యంకముపై కూర్చొని వున్నారు.)

సోమరాజు

నీవు సిరి!

సిరియాలదేవి

మీరు మక్కు!!

సోమరాజు

శత్రువులకు దెబ్బ!!

సిరియాలదేవి

మనకు శాత్రవులు లేవరున్నారు! నిష్కంటకముగదా రాజ్యము!

సోమరాజు

నీ వన్నమాటా నిజమే, ఐనా పగడియ యెటువంటిదో!—పోనిద్దూ!—నీ పర్యంకమును రాజకీయంతో కళంకితం చెయ్యను!—నీ గాఢాలింగనా నంద స్వర్గాన్ని అనుభవింతును సిరీ!! నీవు నాకు - నాకే గాదు - మన వంశానికి జ్యోతివి... నేను కోరేదను నీవైపు చూసుకొనేను — ఏదీ నీవు కోరేదాను నాదికూ.......

సిరియాలదేవి

ఇదంతా రస పర్యవసాయియైన నట భాషణము! లేకుంటే 'నా సజ్జీవం నా స్వామి' అని స్థిరసంకల్పం చేసుకున్న మనలోమనకు యాచన! దానికి సంశయము! కాదన్నది!!......(రాజువైపు జరుగుతోంది)

సోమరాజు

ఇది నీకు నేనిచ్చిన అలంకారముగాదు. గాని, గోస్వనిభారలోలికేన నీ ముఖాన్ని చుంబించక తప్పదు!... చాలు! ఎంత కమ్మదనము!! ప్రకృతీ మాయల్రావి పరుపు లెత్తు ఆవులేగ మూతింటి మధురమాధ్వవ పరిమళోద్గారసుభగము సిరీ నీ ముద్దు!—అదిగో. అటు జూడూ. ఆ పసికోడె యెట్లా గంతులతో పరుగులాడుచున్నదో! ...మన కేటువంటి... అబ్బో! లజ్జ!!—ఎంత కాలానికీ నీ తొలిసిగ్గు చూపిస్తివి!—నాడు శోభినివై — నేడు గర్భిణివై!!,...
(సిరియాల లజ్జావనతవదనము.)

సిరియాలదేవి

ఆ లేగ లిట్లా బైటి కెందుకొచ్చినవి! ...ఆఁ! అటు చూడండి! ఆ సత్యగోవూ!—మిత్రగోవూ—అదిగో. భద్రగోవూకూడా వచ్చింది!!...మన గోకదంబము గోదావరి తీరం నీటులకు మేతకు వెళ్ళిన వంటిరి గదా!?...అదిగో చూడండి! పశులకాపరులూ వస్తున్నారు! మీరు రమ్మని ఆజ్ఞ చేసినారా? —

సోమరాజు

వీరూ - వీరూ!...

వీరు

(ప్రవేశించి) దొరా. బాన్చని!...

సోమరాజు

ఆ గొల్లబోయలు ఎందుకో వచ్చినారు, ఇక్కడికి రావద్దనని చెప్పు.

వీరు

బాన్చను. (వెళ్ళును.)

సిరియాలదేవి

ఎంత యాగడము! ... ఆ కటికివానికి ఏమని ప్రత్యుత్తరింతురు?

సోమరాజు

కండలు గోసి కాకులకు వేతునని వ్రాస్తాను. చచ్చేవాడికి ప్రాణంవస్తే ఇక చావనని తలుస్తాడు! అవిధంగా వున్నది వీడి చర్య!...

వీరు

(ప్రవేశించి) దొరా బాంచని, ఇదుగో ఇది రాయబారప్పత్తరమంట. దొరవొద్ద యిచ్చివెయ్యమన్నరు. (ఇచ్చును.)

సోమరాజు

(చదువుకుని) సిరియాలా, వింటివా! సందేశము. "మీగోబృందము మారాజ్యమున నిరాజ్ఞగా-యథేచ్ఛగా విహరించుట వలననూ చెప్పినను వినక మీ గోపాలకులు తిరుగుబాటు చేసినందుననూ, మీ గోపాలకులను సాధ్యమైనంతవట్టు బంధనం చేస్తిమి మీరు సామర్థ్యమును చూచుకుని తోలుకొనిపోదగును-కటకేశ్వరుడు."- వింటివా సిరీ! ఎంత దుడుకుతనము!... కొవ్వు కరుగు కాలము దాపించినది,— వీరూ, వ్రాత మందసము...(వీరు వెళ్ళి పెట్టె తెచ్చి-తీసి-పత్రము గంటము నిచ్చి వంగి నిలబడును-రాజు వ్రాయును) సిరియాలా, ఇదిగో సమాధానము. "నైతికముగా నీవు పడిన నష్టమునకు విచారిస్తిమి. తప్పనిసరిగా నీవు నిర్ణయించిన యుద్ధానికే సిద్ధమై నీ దురాక్రమణను సత్పథమునకు ద్రిప్పట మాకు విధ్యుక్తము - ఆయుతము గావచ్చును — సోమదేవ భూపాలుడు." బాగున్నదా సిరీ!...

సిరియాలదేవి

(భర్తచేతిలోని పత్రమును తీసుకుని) సమాధికచతురముగా నున్నది - వీరూ, వీరూ...ఆఁ. యీపత్రమును రాయబార్లకిచ్చి పంపివేయవచ్చును.

వీరు

(వంగి తీసుకునును) సిత్తం.

సోమరాజు

వీరూ. వాండ్లను పుత్తెంచినపిదప నీవు మన ప్రధానికడకు వెళ్ళి నాఆజ్ఞగా నిట్లు చెప్పుము, అతిరయముగా కటకముపైకి దండెత్తిపోవలసి వచ్చినది. సత్వర సమర సన్నాహము చేయునది- ఎల్లుంట ఉదయాహ్నమునసే జైత్రయాత్రా ముహూర్తమనికూడా చెప్పవలె...వెళ్ళుము.

వీరు

సిత్తం. మీకాళ్ళ మొక్తా.

(నిష్క్రమించును.)

సోమరాజు

సిరీ! ఎన్నాళ్ళకు మన వికశయ్యా!!

(తెర పడుతుంది.)

---

రంగము రెండు

---

(కందార నృపసౌధము, మంత్రకూటములో విచారపూరితుడై సోమరాజు సింహాసనం మీద కూర్చుని ఉంటాడు. మంత్రి సామంతాదులు యథోచితంగా కూర్చుని, నిల్చుని ఉంటారు.)

౧ పౌరుడు

మహారాజా! తమరెంతమాత్రం విచార పడవద్దు. మేమంతా యెవరం! మీవారే!!

౨ పౌరుడు

తప్పక వాడి హతం అర్పించదనకా మేము నిద్రతీసేదిలేదు!

3 పౌరుడు

నిద్దరా! యీదొరేపోతే అన్న మొకటి వుంటదా! రామలవారిమాదిరి సల్లని రాజు...

౧ పౌరుడు

దొరా బాంచెం! తమకాడ మేమేం సెప్పలేం! నిర్విచారంగా వుండుండి దొరా!

ప్రధాని

(లేచి) ప్రభూ, దైవ మనుకూలించని దానికి ఎంత విచారించి యేమిలాభము? భవిష్యత్తును చూడవలె—ఆ దుండగీ డింత టితో విరమించుకొన్నాడనిన్నీ తలంచ రాదు,గాని కుములుతూన్న విప్లవజ్వాలలు విజృంభించి తెనుగునాడు నేమిజేయునో యని మాత్రం శంకింపవలసివస్తున్నది... (కూర్చుంటాడు.)

భటుడు

(ప్రవేశించి) అమ్మగారు అస్తాంద్రు...

ప్రధాని

(లేచి) ప్రభూ, దర్శనంజేసుకుంటాము— (అందరు నమస్కరించి వెళ్ళుతారు)

సిరియాల

(పుష్పమాలతో వచ్చి) నాథా! ఇది వీరహారము - మీ మెడకే అందమిది!! (వేస్తుంది) రాజా! విచారమున్న నేమి!!— జయాపజయాలు దైవికాలు— మనంకేవలమూ ప్రయత్నమాత్రులము, ... గాని గొంతులో ఊపి రాడుతున్నంతవట్టూ, కృతాన్ని విస్మరించమంటే జయసాధన అసాధ్యముగాదు, ... ప్రభూ మాట్లాడ రేమి!— ఇదిగాదు విచారమునకు సమయము! యుద్ధసన్నద్ధులు కావలె ... మాట్లాడరేమి!!—

సోమరాజు

సిరీ, ఆంధ్రపౌరుషానికి నీవే ఉదాహరణ మాతావు. నేనూ నను!, యుద్ధానికి వెడలక యెట్లాగూ తప్పదు— గాని...

సిరియాల

ఏమియూలేదు. అన్నిటికీ సర్వేశ్వరుడే వున్నాడు... వీరూ - వీరూ...

(వీరు ప్రవేశము.)

సోమరాజు

ఎందుకు! యెందుకు సిరీ!! ... వీరూ వెళ్ళుము. (వీరు నిష్క్రమణము.)

సిరియాల

ప్రధానికి తెలియనంపుదము. మరల తీవ్రముగా కదనపథకము పన్నుమని!—

సోమరాజు

సిరీ, నిన్నటి గాయము లింకా మాని యుండవు - అప్పుడే మరల యుద్ధానికి ఆహ్వానిస్తే వీరతాంబూల మెవరు పట్టుటకు ముందుకు దుముకుతారు?—

సిరియాల

రణభేరీ మ్రోగించుట తడవుగా లక్షోపలక్షలు వీరగంధాలంకృతులై, నేనంటే నేనని ముందుకు దుముకుతారు! ఆంధ్రులు పిరికివారుగారు!!...

వీరు

(రొప్పుతూ వచ్చి) దొరా బాంచెని, పెదబంటుగారు అచ్చి, యెంటనే తమతో మణివిసేసుకోవాలనబట్టెండు దొరా కాళ్ళ మొక్తా!—

సోమరాజు

రావచ్చునని చెప్పు,- సిరీ!...(ఒక వేపు నుంచీ వీరు, ఇంకో వైపునుంచి సిరియాల నిష్క్రమిస్తారు.)

బంటు

(వంగి నమస్కరిస్తూ ప్రవేశించి) దొరా, యేం జెప్పేదు! కటకంనుంచీ ఆ రాజు దండుతో అచ్చి మన నగరం చుట్టూ ముట్టడించి ఢంకాకొట్టినడు దొరా! ఏం విన్నపం జేసుకోండు! - మంత్రిగారు దిగాలుపడినరు! పట్నం అంతా అట్టుడికి పోతాంది! - దళవాయిగారు దొరతో తొందరగా చెప్పుమని ఉరికించిండు, చిత్తగించాలె.

సోమరాజు

అరే!!! బంటూ, నీవు శీఘ్రముగా పోయి, ప్రధానిని రమ్మనిచెప్పు వెంటనే!

బంటు

చిత్తం. బానిసను...

(నిష్క్రమించును)

సోమరాజు

సిరీ...సిరీ...వీరూ... (వీరు వస్తాడు) దొరసానిని రమ్మను!...

ప్రధాని

(ప్రవేశించి) మహారాజునకు ప్రణామము —

సోమరాజు

ప్రధానీ, ఇదేమిటింత! బల్లహుండు నగరముపైకి దండెత్తివచ్చెనటగదా!!-

ప్రధాని

ప్రభూ, భయంకరస్వప్నము వలె జరిగినది! నగరమంతా సంక్షుభితమౌతున్నది-

సోమరాజు

కర్తవ్యము ??-

ప్రధాని

గోవిందరావును ఇప్పుడు ఇటువస్తూనే నియమిస్తిని- సిద్ధముగానున్న సైన్యముతో యెదురునడచి...పిదప దైవసహాయము...

సోమరాజు

ప్రధానీ! నీచాతుర్యమంతా నేను వినియోగించవలె- సరే. వెళ్ళుము.

(ప్రధాని నిష్క్రమణము)

సిరియాల

(ప్రవేశించి)...వీరు వచ్చి చెప్పినాడు-

సోమరాజు

అవును. రమ్మంటిని! ఎందుకో ఇప్పుడు జ్ఞాపకము లేదు!! - యుద్ధ ప్రస్థానానికి అనుజ్ఞ!!...

సిరియాల

శుభం.

(ఉభయులూ నిష్క్రమిస్తారు - అవనిక.)

## రంగము మూడు

(అంతఃపురంలో ఒకటే మంచముమీద ఇరువురూ దగ్గరగా కూచుని వుంటారు. సోమరాజు క్రిందికి చూస్తూ మాట్లాడుతాడు. సిరియాల ఆశ్చర్యంగా వింటూవుంటుంది.)

సిరియాల

ఇంత ఆకస్మికముగా శత్రువు సన్నహించుటకూ - పరాభూత పరంపరాస్థితికీ మన మంత్రి సామంతాదు లే-మై-నా... కుట్ర చేసియుండరుగదా!!-

సోమరాజు

అదీ తప్పలేదు! కర్ణుడు చావటానికి ఎన్ని అసత్య శక్తులు విజృంభించి మృత్యునటనా విన్యాసాలు జేసినవో-నేడది జ్ఞాపకం వస్తున్నది. సామంతులు ప్రత్యర్థిసేనా వాహినీపతులై పిలిచినారు! - కావచ్చిన కథను వినటానికి ఆత్రమెందులకు ?... ఆ తరువాత - వింటున్నావా సిరీ! పరధ్యానంలో నున్నట్టున్నావు!...

సిరియాల

లేదు - ఏమీ లేదు!...ఆకాశము కాళీ సహోదరియై విరింగి మీదపడుతున్నట్టు కనిపిస్తుంటే చూస్తున్నాను - చెప్పండి. తరువాత ?-

సోమరాజు

మన దండు మండిపడుతూ విమతియూధము అంపపర్షములో ముంచెత్తినా లక్ష్యము చేయక పులిపిల్లలవలె ముందుకు దుమికినారు! - కొంతవడికి అడుగొక నెత్తురు మడుంగై సాయంసంధ్యాధాతువులు విరిసినై!! - పిడుగులవంటి మన జోదులు నీరై రక్తకయనంబు జేసినారు!- విధి వ్యత్యాసముగా జూచినది. విశాంపతులు దుర్గాన్ని దరిసి కవాటములను కొమ్ము టేనుగులతో కుమ్మించ సాగిరి. అప్పుడు మనసేన కోట బురుజుల పైనుండి శత్రుమస్తకములమీద గండశిలలూ—నిప్పుకలూ--బాణములూ కురిపించినారు. అంతట కోటపైకి ఉడుముల నడుములకు పగ్గములం గట్టి విసిరి కోట గోడల కెగప్రాక సమకట్టంగా మన సైనికులు అరిశిరస్సులను గోడిబిళ్ళలవలె కొట్టివేచుచుండిరి, - వీటన్నింటికీ తట్టుకొని గూడా కటకరాజ పక్షమువారు ద్విగుణితోత్సాహంబుతో నిలంబడిరి, చెప్పకోడగిన యూథ శిథిలమైన మన యూథము ... సిరీ, నీవు దక్క నాకిక సిరిలేదు—

సిరియాల

ఏమిటానీరసము! తరువాయి చెప్పండి, కదనకథనంబున నా శరీర ముత్పులకమూతున్నది!...మన యూథము??...

సోమరాజు

శతఘ్నుల దెబ్బలకు తలలు విరిగీ - మొలలు విరిగీ-నేనొక పెద్ద బురుజునెక్కి చూస్తూవుండంగా నే నిశ్శేషమైనారు,— ఇట్లా స్వసైన్య వినాశమూ పరబల దర్పమూ చూడగా చూడగా మిత్రబృందమంతా శత్రు పక్షస్థానీయులై ఉండుటమున్నా స్వయముగా జూచి సర్వత్రా అపజయచిహ్నాలే పొడగట్ట, నా జీవితసిరివైన నీ పాదసాన్నిధ్యంలో నిల్చున్నాను వచ్చి!—

సిరియాల

మీ మనస్సులో నేడేదో అననుభూత భీరుత్వం బావహించినది, కాలమూ-కర్మమునూ కదిసివచ్చినవి...ఇదిగో వీరగంధము. చేయి జాపండి...ఏదీ తొమ్ము... తల యెత్తండి. మెడకు పూస్తాను. (పూయును.) పరిమళము వీడని వాడని

వకుళమాలిక, ఇది ఆంధ్రసామ్రాజ్యశౌర్య పుష్పమాల ధరించండి! (వేయును) ఇదిగో అభిమానతాంబూలం బిని స్వీకరించండి! (ఇచ్చును),...వీరా - వీరా—

సోమరాజు

ఎందుకు వీరు ?...

సిరియాల

సంగ్రామరంగంలో జయభేరీ మ్రోగించమని సేనానాయకునితో చెప్పటకు!...

సోమరాజు

భేరీ పగిలినది నిన్నటితో! ... నేనే వుంటిని - నాకు నీవున్నావు...సరే! నీవు జరిపిన, వీర శృంగార కలాపంబులలో ఒక్కటిమాత్రము కొదువయున్నది, అది: హిమవచ్ఛృంగోన్నతజ్ఞాతులైన నీపయోధరములు నావక్షమున నిక్కపొడిచి మన యిరువుర మధ్యనూ యెడము లేనంతటి సన్నిహిత స్నేహమున్నలై, జీవికాజీవుల రసాద్వైతసిద్ధిజ్ఞాపు దృఢాలింగనము — ధీరాలింగనము! సిరి, నాయొక్క సర్వ సిరీ నీ చూపులలోనే యున్నది; (కౌగలించును...

తెరలో

“మహారాజా! జయము జయము— కటకేశ్వరుని ఖడ్గ-మార్బలమూ గండిపడ్డ నిండుచెరువువలె స్వేచ్ఛాచారులై కోట కొమ్ములపై కెక్కి ఆంధ్ర సామ్రాజ్య దిగ్విజయ పతాక నూతజెటికి పుర ప్రవేశమైనారు. రాణివాసము...భద్ర మహావశ్యశకుని విజ్ఞాపకం...వినాకు పురపాలకాధికారిగారు...చిత్తగించ”-

(రాజదంపతులు హఠాత్తుగా కౌగిళ్ళు వదలి నివ్వెరపాటుగా వింటారు. కొంత సేపు నిశ్శబ్దము)

సోమరాజు

వీరపత్నీ! నా తదిన దేశమును మన్నించవలె!...

(తల వంచుకుంటాడు.)

సిరియాల

(కన్నీటితో) రాజన్యా!...యిష్టురక్ష మీ ఆజ్ఞ పాలించే నన్ను...నా జీవితమే ధారపోస్తా. మీ మాటలు మా గిరిభూములకు - సర్వదిగంతములకు! - పట్టపగలు ఈ చీకటి యేమిటి!! ... మీ రెక్కడ వున్నారు!...నేనో!...నేను!!...నేనక్కడున్నాను!...ఏదీ నా చెయ్యి నాకు అవలంబముగా దొరక దేమి!! ... నాథా ... ఆంధ్రనాథా...

సోమరాజు

సిరియాలా, ఏమా అధీరత! ... వీరపత్ని వైనట్టే వీర మాతవు కావాల్సి వున్నది!......సిరీ, గుండె చెదరగొట్టుకొంటున్నావు ... సిరీ... సిరీ... నోరు రావటంలేదు నాకు చెప్పటకు...

సిరియాల

(సోమరాజు చేయి బట్టుకుని) చెప్పండి-చెప్పండి. నా ప్రాణం ఆహుతిగా ఇవ్వనా ఆంధ్రదేశానికి? ... ఏమి చెయ్యాలె ... చెప్పండి. ప్రభూ, చెప్పండి ???

సోమరాజు

(కన్నీరు గారుస్తూ) ఏమని చెప్పను సిరీ!...నీ గర్భమే. మనకూ, వంశానికీ, దేశానికీ దీపము;...దాన్ని కాపాడుకోవ

టమునకు నీ పీ సుకిగాలితో నుండజనదు! ...అదిగో కోలాహలము సిరీ!...నానుండి రాచసిరి ఉడిగిపోయినట్లే- తెలుంగు సిరి నీవునూ...వై-దొ-లం-గ-వ-లె! ఎంత కఠినవాక్కు!...ఎంత కఠోరకర్మము!... సిరీ, సిరీ, (కౌగిలించుకొని యేడ్చును)

సిరియాల

ఆర్యా! పతీ! ఎక్కడికిపోను !! ఎక్కడ తలదాచుకొందును !!!—ఆంధ్ర రాజ ప్రసాదము దిక్కుమాలిన దివాణమైనదా నేటికి !...నాథా...పోలేను... ఈ భూమి...నాభూమి విడిచి పోలేను...

సోమరాజు

ఈనగాచి నక్కలపాలు జేయవచ్చునా సిరీ!...భవిష్యదాంధ్రాభ్యుదయానికి నీవు జీవనదివి, నీ కడుపుపంటయే మనకు బంగారపు వర్షము...ఓపికకావాలె. సిరీ, ఇంకా యిక్కడ వుం-డ-టా-ని-కి సమయము లే-దు...నిరాశచేసుకో, సిరీ, ని-రా-శ-చే-సు-కో...నీకూ-ఎక్కడవున్నా నాకూ నీ గర్భమే ఆశ...వెళ్ళు...ఆశనుపెంచు, ఆంధ్రజ్యోతిని వెలిగించు...మల్లికనో - ఎవరినో, నమ్మకమైన సహవాసము తీసుకొని దే-శాం-త-ర-గ-మ-నం చెయ్యి ;— రాతిగుండెతో చెప్పుచున్నా ననుకోకు ! రాళ్ళలో కూడా సెలయేళ్ళున్నవి, ... సిరీ...వెళ్ళుచున్నావా ! ఏదీ !! (కౌగలించుకొనును.) సిరీ, స్వర్గపాథేయ మిది నాకు !...

సిరియాల

పతీ, ఇది కలా! నిజంగా నేను వెళ్ళాల్సిందేనా ! ... వెళ్ళాల్సిందేనా !! ... ఏ ప్రేమదంపతులకు వియోగము కలిగించామో వెనుకటిజన్మంలో!...నాథా... వెళ్ళుతున్నా, ఏవీ రాజపాదాలు—నా ప్రాణప్రదాలేవీ ! (వంగినమస్కరించును) సెలవు-నాథా, ఎప్పుడు తెలుగుగద్దెపై నేను రాణిగా కూర్చుండేది?...కాళ్ళు రావేమి రాజా!...ఏదీ కడసారి మీ వీరబాహు బంధము ! (తెర పడుతుంది.)

---

## రంగము నాలుగు

(హనుమకొండలో నొక శిథిలాల యావరణంలో సిరియాలదేవి ఒంటరిగా కూర్చునివుంటుంది. చేతిలో నొక చిత్రపటము.)

సిరియాల

సోమదేవభూపాలా—నా ప్రాణభూమీపాలా! నన్ను నాథను జేసి పోయితివా!... ఈ పాడుపడిన గుళ్ళు నాకు శరణ్యమ్మునర్చితివి! ... తొందరపడుతున్నా. నీ వేమి జేతువు నా గ్రహచారానికి! నాపుణ్యమైపోయినది— పాపమే మిగిలినది !

(మల్లికా, గిరిజలు ప్రవేశిస్తారు దీనాననాలతో.)

మల్లిక

అమ్మా...ఎందుకు తల్లీ ఏడుస్తావు ! ...ఏమిలాభమమ్మా...

సిరియాల

ఏమైనదే, పోయినపని ?...

గిరిజ

ఏమైనదమ్మా! ఏమీగాలేదు. ఈ రాజు గురించి యిదివరకే విన్నాముగదా సిరికి వాడని! అది తేటతెల్లమైంది !!

మల్లిక

తనకూ - ఆ రాజుకూ ఏవో సంధి నియమాలున్నై అనీ, తను ఆశ్రయమియ్యటానికి వల్లపడదనీ,...అనాధ అనీ-రాజకుటుంబిని అనీ, మీరు చెబుతున్నారు గనుక మా పురంలో ఎక్కడైనా చోటు దొరికితే, జాగ్రత్తగా-అజ్ఞాతంగా వుండటానికి మాత్రం మా అభ్యంతరం లేదని ఎలుకు దేవరాజుగా రన్నారు తల్లీ!—

సిరియాల

స్థానబలం లేనివాండ్లగతి యిట్లా వుంటుంద గాబోలు! ... ఇప్పుడేమిటే దారి గిరిజా!!

గిరిజ

ఏమీ తోచటంలేదు అమ్మా!...ఇక యీపట్నంలో మనం చూడదగ్గది ఒక్క బ్రాహ్మణాగ్రహారంమాత్రమే వున్నది,... లేవండి...పోదాం పదండి తల్లీ!... ఏమి దౌర్భాగ్యము తల్లీ!—ఆగర్భశ్రీమంతురాలివైన నీకెట్లాంటి పాట్లొచ్చినై అమ్మా! మేమే చూడలేక పోతున్నాం, — అట్లా అన్నం నీళ్ళూ ముగ్గబడితే ఎట్లాగమ్మా! నీళ్ళు డేపొద్దులుగూడా నూ! లేడి. వెళ్ళుదాము అగ్రహారానికి;—

(నిష్క్రమణం - తెర.)

---

రంగము ఐదు

---

(హన్మకొండలో బ్రాహ్మణాగ్రహారం, మాధవశర్మగారి ఇంటిముందు సిరియాలదేవీ-గిరిజా - మల్లికలు నిలబడివుంటారు; మాధవశర్మ ప్రవేశిస్తాడు.)

మాధవశర్మ

ఎవరమ్మా మీరు?...

మల్లిక

అయ్యా, దిక్కులేనివాళ్ళం—

మాధవశర్మ

అనేమిటి తల్లీ! ఆశ్రిత దిక్కున్నవాళ్లెవరూ!! అందరికీ సిద్ధేశ్వరుడొక్కండే శరణ్యము-నా కూతుళ్ళవంటి మీరెవరో తెలుసుకోగోరుచున్నా....

గిరిజ

నాయనగారూ, ఈ తల్లి సిరియాల దేవమ్మగారు. కందారం పాలించే సోమదేవ మహారాజుంగారి దేవేరి,- కటకం ధోరవారు చేసిన దుర్మార్గప్పనివల్ల ఈ నిర్మూలాలైన మహారాణీవారికీ గతి పట్టెచి. ఈ దినం తల దాచుకోటానికి చోటు దొరకక 'నా' అని ఆదరించేవారు లేక,...మహా తంగులైన తనుబోటివారి వీధివీధీ-గుమ్మంగుమ్మం తిరిగీ-తిరిగీ మీ పాదాలకాడికి వచ్చినం!;...

మాధవశర్మ

ఓహో! అదా అమ్మా!! తెలిసింది, తెలిసింది. లోపలికి రాండి తల్లీ ... విన్నాము ఆ కథంతా!-సిరియాల దేవమ్మ తల్లీ, రావమ్మా రా;—

సిరియాల

తండ్రీ! నా ఉనికివల్ల మీకేమైనా రాజరికంవారిచేత ఇబ్బందులున్నై అని

తో స్త్రీ ఆశ్రయం ఇవ్వకండి! ... ప్రపంచంలో బ్రతికి చెడ్డవాండ్లు వెనకావున్నారు- ముందూ వుంటారు. నేడు నాముఖాన ఆ వ్రాత పంక్తులు దీర్చింది; నా కష్టము నా కెల్లను తప్పదు నాకొరకు మీరు...

మాధవశర్మ

అయ్యో అసూయికపుతల్లీ! కష్టాలే కాపురంజేస్తవా అమ్మా జీవితంలో!!— కష్టసుఖంబులు కానడికుండలు- అసూర్యం పశ్యవైన నీవు పడే ఇడుములు చూచి ఏ జాలిగుండె సహించగలదమ్మా! సంతులేక, దానికోసం కలలల్లుకుంటూ, నిరాశాముఖమైన నా జీవికకు, పుత్రికా వాల్యయవు; అందునా సమీపమైన ప్రసవఘడియ కలదానివి. తల్లీ! నీ కాశ్రయమిచ్చుటయే నాకు కష్టమా!- రాతల్లీ, లోపలికి... (రమ్మని అభినయిస్తూ శర్మగారు ముందూ- సిరియాలాదులు వెనుకా వెళ్ళుదురు)

[ పదిహేను దినముల తరువాత ]

(మాధవశర్మగారి ఇంటిముంగిట వసారాలో, శర్మగారూ మరి ఇద్దరు బ్రాహ్మణులూ కూచుని వుంటారు)

మాధవశర్మ

"అథాతో ధర్మజిజ్ఞాసా-అథాతో బ్రహ్మజిజ్ఞాసా"- ఓహో! సిద్ధావధాన్లుగారా!! దయచెయ్యండు- దయచెయ్యండు,-

సిద్ధావధాన్లు

( ప్రవేశించి ) దయచేయుట కేంగానీయండీ ...

మాధవశర్మ

అదేమి! అష్టార్థోక్తిలో ముగించినారేమి? ఏమన్నావి శేషములు?

సిద్ధావధాన్లు

ఆఁ... ఉన్నవి, కొంం-చెం-లోనికి...

మాధవశర్మ

అక్కడలేదు అవధాన్లుగారూ, చెప్పుడురూ! బ్రాహ్మల కేంరహస్యాలు!!

సిద్ధావధాన్లు

కాదయ్యా తండ్రీ! ఊరంతా అట్టుడికి పోతున్నది.- ఒళ్ళో అగ్నికణందాచినారు మీరు! - అది మీకేకాదు. యావత్తు బ్రాహ్మణ్యానికే ముప్పు తెచ్చేట్టున్నది!!- మా అందరియందైనా అనుగ్రహంవుంచి దులిపేసుకోండి!...

మాధవశర్మ

—జపేశుదయాజులుగారూ విన్నారా! ఇంతాకటినించీ నేను మనవి చేసింది ఇదే! — వేదంవిరుద్ధంగా వున్నది మనవాళ్ళ అవధాన్లగారు,- ఏమండీ రాజలింగంగారూ?-

రాజలింగం

అవునండీ! సిద్ధావధాన్లుగారు వక్కాణించినది నిజమే! అందులోనూ ఇది రాజకీయము కూడా!! - ఆమెను ఎక్కడికైనా వెళ్ళి తలదాచుకొమ్మని చెప్పటమే ఉత్తమము!...

మాధవశర్మ

ఉత్తమమా! ఈ వ్యాఖ్యానానికి ఉత్తమాధమసిద్ధయు గూడా సెలవిచ్చినారూ!- తత్రాపి, ఒక్క అబలను రక్షించటానికి ప్రాణాలు పట్టి చూచుకొనుటకన్న బండగట్టుకుని బావిలో దూకటమే ఉత్తమమేమో! 'జాలి' అనే ముక్క అంతరించినక్క బ్రాహ్మలం బ్రాహ్మలం అని చెప్పుకొనుట ఎందుకింకా!-నేడు గూడులేని పక్షియైన

సిరియాలదేవమ్మను దివాంధమ్ములముందు
నిల్పుండబెట్టను; ఏమైనా గానివ్వండు...
మీరంతా కూడా కలిసి వస్తారా సరే!
రామంటారూ !! నేను ముందూ — ఆమె
వెనుకా !!!—

సిద్ధాపధానులు

నిజమేనండీ! ప్రాణాలకంటే ఎక్కువా
ఏ ధర్మమైనాను అన్నా నేను, అంతే!
ఈ అప్రతిష్ఠ మాకెందుకు! 'యశోహా-
మృత్యుర్వా' మీతోపాటే మేమూ!

వాజపేయయాజులు

ఏమీ భయము లేదు. అన్నిటికీ
సిద్ధేశ్వరుండే వున్నాడు !—

రాజలింగం

నా దొక విన్నపం వున్నది. చిత్త
గించండి. గ్రుడ్డొచ్చి పిల్లను వెక్కిరిస్తు
న్నదా అని అధిక్షేపంచేస్తేమట్టుకు నేను
చెప్పలేను!-ఆమెను కాపాడటం అవశ్యమే
కానివ్వండీ శుద్ధవైదికంగా ఐతేమాత్రం
చాలా ఒడుదుడుకు లుంటవి — లౌక్యం
పన్నవలె !!

మాధవశర్మ

దానికేమి! అట్లాగే, - సరే. సంధ్యా
వందనం వేళైనది ... ఒళ్ళుమాటవున్నది.
బ్రాహ్మణసభ... రంధ్రాలతోనూ మనవి
జేస్తున్నా. ఎప్పుడు కేక వేస్తే అప్పుడు
వచ్చి బాసటై వుండవలె ... (బ్రాహ్మ
లంతా వెళ్ళుతారు. మాధవశర్మ లేచి
ఆలోచిస్తూ పచారీ చేస్తూంటాడు.) ...
సిరియాలమ్మా...సిరియాలమ్మా...

సిరియాలదేవి

(ప్రవేశించి) ఏమిటి నాన్నగారూ!...

మాధవశర్మ

తల్లీ, ఏమీ అనుకోనవుగదా !!

సిరియాలదేవి

నాన్నగారూ, ఈ అభాగ్యను ఆజ్ఞా
పించుటకు సంశయిస్తారెందుకు ?

మాధవశర్మ

నాబిడ్డా! గతమును నేటినుండీ పూర్తిగా
విస్మరించవలె!-బ్రాహ్మణీవేషమును నుండ
వలెను తల్లీ కొంతకాలము !! — గిరిజా
మల్లిక లెక్కడనో కుశలులైయే వుందురు
తల్లీ! నోరే రావటంలేదమ్మా చెప్పటకు!-

సిరియాలదేవి

ఎందుకు తండ్రీ, నన్ను గురించి మీ
కీ చింత!—

మాధవశర్మ

దేశంకోసం ;— మేమేం చింతపడు
తున్నామమ్మా! ఆనందమాత కారాగా
రంలో కృశిస్తున్నది! ఆ తల్లి చెఱ విడి
పించుటమే మాకు విధ్యుక్తము;-వెళ్లమ్మా
లోపలికి! జాగ్రత్త తల్లీ!! ...(తెర)

---

## రంగము ఆరు

---

(అగ్రహారంలో ఒక వీధి - ఇద్దరు
రాజభటులు గుమ్మం గుమ్మమూ పరికిస్తూ
నడుస్తుంటారు,)

భీమన్న

ఒరేయ్ రామిగయ్యా! ఆయమ్మ ఎట్ట
గైనా యీ బావన అగ్గురారంలోనే
దొరకాల్రా! - ఈడ మనం దబ్బున పోలి
కూడా పట్టలమ్ము; ఆమేమో రాసమణి
సామె! యీరంతా బామ్మలామె!! —

రాగయ్య

ఏమోలేరా. ఇప్పుడు మన కేమంత ఊపిరిమీది కొచ్చింది! దొరక లేదంటే పోదంట్రా!! - పాపం సూలాలంట!...

భీమన్న

పిచ్చిపిచ్చి యేసాలెయ్యకు. రాసపీనుగ తోడులేకుండా పోదంట! ఈ రాజ్యం బైట బడ్డదాంటే, ఆ యమ్మతోపాటు నీ గొంతూ నా గొంతూ కసుక్కుమంటై! ...యీ వూళ్ళో సభావతింట్రా మాధవయ్యగారని;.. ఆ పెద్దగొరిలి ఆ బాపని దొరదేంట! పోయి అరుసుకుందం పద, (ముందుకు వెళ్ళి తెర లోపటికి చూస్తూ) అయ్యా...దొరా, దొరా...

మాధవశర్మ

(ప్రవేశించి) ఏమిటి నాయనా! ఎవరు మీరు?...

భీమన్న

లోపల ఆయమ్మ యెవరు??...

మాధవశర్మ

మీరెవరో తెలుపనా తెలుపక, ఇంటి లోని ఆడవాండ్లను అడుగుటం యేమి మర్యాద!...నా కుమారు ఆమె...

రాగయ్య

దొరా, బాంచెని. కటకం ధొరవారి బంట్లం మేము. ఒక పనివుండి అచ్చినం! కందారం ధొరవారి బాయిగార్ని మీ యింటికాడ దాచినట్టు తెలియఅచ్చింది ...ఇదిగో ఈ పటాన్ని చూడుండి దొరా! ... దీనికీ-ఆయమ్మకీ ఏం బేదంలేదు!...

మాధవశర్మ

ఈమె ఎవరో రాజపత్ని!...

భీమన్న

కాదు దొరా, పిలిపించుండి దొరా మీరే సూద్దురుగాని! మొగం వుండది అద్దం వుండది!!...

మాధవశర్మ

తప్పదా! తప్పదా!! - మాలనన్న వాండ్లను మొగసాలకీడ్చే దొరతనాలా మీ దొరతనాలు!!...బాగున్నది. చాలా బాగావున్నది! ... ఇట్లు చెడుతగువాతకు కుక్కమూతిపిందెలు పుట్టటం నిజమేనా! అమ్మా...అమ్మా... నాబిడ్డా. ఒకసారి ఇట్లారావమ్మా!

సిరియాల

(ప్రవేశించి) నాన్నగారూ, ఎందుకో పిలిచినారు?

(భటులు చేతిలో పటాన్ని పట్టుకొని ఆమెనూ, పటాన్నీ, పదేపదే చూస్తుంటారు)

మాధవశర్మ

ఏమీలేదుతల్లీ! నీవు కందారం దొర సానివట! ఈబుద్ధిమంతులు కనిపెట్టారు!... నేను, కాదూ, నాకూతురన్నా నమ్మరు పిలవమంటే పిలిచానమ్మా!!-

భీమన్న

చూడండి దొరా, యీ పటాన్ని! (పటాన్ని చూపిస్తూ) ఏం యేసువాసూ లేదు.....ఈమెను మావెంట పంపాలె; దొర ఆనతి!...

మాధవశర్మ

ఏమి దురన్యాయము! - నా బిడ్డను మీవెంట పంపాల్నా!—

భీమన్న

తప్పదు. మమ్మల్నన్నేంలాభంలే; రాజు గారి గట్టిఆజ్ఞ.

మాధవశర్మ

మీరు పంపించమన్నంతమాత్రాన్నే మీకు వదలివేసి, నేను గాజులు తొడిగించుకొని ఇంట్లో కూర్చోవలసిన దేనా!- నా బిడ్డను తోడ్కొని రమ్మనుటకు యే రాజుకూ అధికారంలేదు - ఏ చక్రవర్తికీ అధికారం లేదు! పోయి చెప్పుకోన వచ్చును! — ఎక్కడిదో మహారాజ్ఞీ ఛాయాచిత్రాన్ని తెచ్చి నా బిడ్డను పోలిక పట్టి, రాజాజ్ఞతోలుకొనిపోతామంఛారా! మనిషిని బోలిన మనుషులుండరా లోకంలో!?—

భీమన్న

ఎందుకొచ్చినవాదం దొరా! - మంచి మాటల్తోరాకుంటే బలవంతాన్నైనా...

మాధవశర్మ

బలవంతాన లాగుకొనిపోతారా! ఏదీ పోండి! (భటులు సిరియాలదేవిని చేయి పట్టుకుని లాగుకొనిపోదురు.)

సిరియాలదేవి

(పోతూ-ఏడుస్తూ) నాన్నా-నాన్నా-అనాథనై పోతున్నా - రావా నాన్నా, రావా.

మాధవశర్మ

అమ్మా, వస్తున్నా-వస్తున్నా(ముందుకు వచ్చి నడుముబిగిస్తూ) ఓ సభ్యబ్రాహ్మణులారా! దౌర్జన్యము-దౌర్జన్యము - నివురు గప్పిన నిప్పువలెనున్న మన క్షాత్రమును నేను అహింసాయుతముగా నిరూపించుకొనవలె... నేడు నాబిడ్డ - రేపు మీబిడ్డ! ...సత్యారాధకులంతా రాండి-రాండి !! (ఉరుకును - అవనిక జారుతుంది.)

———

## రంగము ఏడు

———

(కటకంలో రాజసభ తీర్చియుండగా, సిరియాలదేవితో భటులూ- వెనుక బ్రాహ్మలూ ప్రవేశిస్తారు,- భటులు నమస్కరించి నిలబడతారు)

బల్లహుడు

ఈమెయేనా సిరియాలదేవి?...

భటులు

చిత్తం- చిత్తం.

మంత్రి

ఎక్కడ పట్టుబడినది?-

భీమన్న

అనుమకొండలో బ్రాహ్మల అగ్రహారంలో మాధవయ్యగారంట పెద్దబాపనాయన ఆరింట్లో!...

(రాజూ - మంత్రీ ఒకరి ముఖం ఒకరు చూసుకుంటారు)

బల్లహుడు

(తలపంకిస్తూ) బ్రాహ్మణులుగూడా రాజకీయాల్లో చేయి జేసుకొంటున్నారూ! (బ్రాహ్మల్ని జూచి) వీరంతా వారేనను కుంటా!!...

భీమన్న

చిత్తం, పెద్దగా ఎగరించిన్రుదొరా, బాంచెని!!-

బల్లహుడు

ఏమండీ బ్రాహ్మణసభవారూ, మీకిది న్యాయ్యమేనా!...

మాధవశర్మ

(ముందుకు వచ్చి) ఏమి న్యాయము రాజా! న్యాయము అంతరించినది దేశంలో! నా కూతురును - నా కన్నబిడ్డను - నిండు చూలాలిని, బలాత్కారమ్ముగా రాజభటులు లాక్కొనివచ్చిన పిదప యింకేమి న్యాయము, ఇంకెక్కడి ధర్మమూ !!-

మంత్రి

మీ బిడ్డను వాండ్లెందుకు తెస్తారు, వాండ్లకు తగిన ఆధారం లేనిదే !—

మాధవశర్మ

ఆధారమా! ఏదో రాజకుటుంబినీ పటాన్ని చూపించి 'ఈ చిత్ర ప్రతిమా యీమే సమంగా వున్నారు. కనుక తోడ్కొనిపోతాం.' ఇదా ఆధారము!, లోకంలో మనిషినిపోలిన మనిషీ, పశువునుబోలిన పశువూ వుండదా!-ప్రాకృశ్చిత్తములు తెలియని బంట్లను మానధనుల యిండ్లలో ప్రవేశపెట్టి, న్యాయ్యపరిశీలన చేయుచున్నారా ! - మహామంత్రులతో ఇంతకన్న దౌర్జన్యము నభివర్ణింపలేను, ......రాజేంద్రా, నన్నే మాధవశర్మ అంటారు-పాన్మకొండ బ్రాహ్మణాగ్రహారంబునకు సభాపతిననీ అంటారు, - ప్రకృతపు మీ ఆజ్ఞ కేవలమూ దౌర్జన్యపూరితమైనదని నేను ఘంటాఘోషముగా వక్కాణించగలను. ఇట్టి మహాద్రోహములు - ఫలితములు, రామాయణ - భారతాది గ్రంథంబులలో జదువుచుందుము!...

బల్లహుడు

(మంత్రితో) సభవారి నరుసుకో వచ్చు—

మంత్రి

బ్రాహ్మణసభవారు ఈయనగారి వాఙ్మూలమును నిజమేనని ప్రమాణపూర్వకముగా వప్పుకొంటారా?...

బ్రాహ్మణబృందము

నిజము నిజము ముమ్మాటికీ నిజము.

మంత్రి

దీనికి దృష్టాంతమును జూపగలరా?-

౧ బ్రాహ్మడు

ఈమె పేరు లక్ష్మి. భర్త రాజమహేంద్రవరము విద్యాభ్యాసమునిమిత్తము వెళ్లినాడు,- పురిటికి తీసుకొనివచ్చినారీమెను- దీనికి నిదర్శనము లక్కఱలేదు. మాధవశర్మగారు దేవుని వంటివాడు. గొప్ప విద్వాంసుడున్నూ!

మంత్రి

ఇంకా సభవారిలో ఎవరైనా ఏమేని చెప్పుకొందురా?

బ్రాహ్మలందరూ

అక్కఱలేదు. సత్యమునకు వేయి మాటలు లేవు!

మంత్రి

(ఆలోచించి) ఐతే ఒకపని చేయవలె- ఈమె బ్రాహ్మణియే యగుట నిజమైన యెడల ఈమె చేతి అన్నము దినుటకు అభ్యంతరము లేదుగదా!?

మాధవశర్మ

నాబిడ్డచేతి యన్నము తినుటకు నాకే మభ్యంతరము!... గాని... ఈమె పూర్ణ

గర్భిణి కావటంచేత మాకోటి నైష్ఠిక లము భుజింపము, ప్రసవించిన తానక మూడు మాసమ్ములల అనంతరంబు నిరాక్షేపము! పోనివ్వండి. ఈసత్యము సిక్కడి వేత్తలైన స్మర్తలను విచారించవచ్చు...

మంత్రి

(ఆలోచన నభినయించి, రాజును జూచును) అట్లైన నొకపని జేస్తారా?...

మాధవశర్మ

ధర్మభ్రంశము గాకుండంగా నేపరీక్షయైన జేయవచ్చును.

మంత్రి

మీ సిద్ధేశ్వరాలయమునోనే ఈయమ చేతి ఉప్పూ - నేయీ తమరంతా తినవలె!—

మాధవశర్మ

అవశ్య మటులే జేతుము - ప్రభుత్వమిట్టి శరీర శాసనంబులలో ధర్మదేవత నడుము విరుగబొడిచినది...కానివ్వండి మీ చిత్తమువచ్చినట్లే జేతుము - పరీక్షలు దయచేయవచ్చును; నేడో రేపో ప్రసవింపనున్న నా తల్లిని యింకెంతకు దుర్బాధముంచుదురు! (మంత్రి)- భటులూ-బ్రాహ్మణులూ-సిరియాలదేవి నిష్క్రమిస్తారు. తెరపడును.)

---

రంగము ఎనిమిది

---

(సిద్ధేశ్వరాలయ మంటపంలో బ్రాహ్మణ బృందమూ - సిరియాలదేవి - మంత్రీ - భటులూ వుంటారు.)

మాధవశర్మ - బ్రాహ్మణులూ

(స్వామి కభిముఖంగా నిల్చుని నమస్కరిస్తూ)

"త్రియీవేద్యం, హృద్యం, త్రిపుర
హర మాద్యం, త్రినయనం
జటాభారోదారం, చలదురగహారం
మృగధరం
మహాదేవం, దేవం, మయిసదయ
భావం, పశుపతిం
చిదాలంబ , సాంబం, శివ, మతి
విడంబం, హృది భజే"

(చదివి కూర్చుంటారు — సిరియాలదేవి ఉప్పూ, నెయ్యీ అందరి చేతుల్లోనూ పడ్డిస్తుంది. అంతా తింటారు.)

మంత్రి

సభాపతిగారూ! మా పొరపాటును సైరించవలె. ఈయమ్మ తమ కూతురనీ- సిరియాలదేవి గాదనీ మేము హృదయపూర్వకంగా నమ్మి వదలివేస్తున్నాము!
......

మాధవశర్మ

చిత్తము - బ్రాహ్మణులకు క్షమే కోపము! పతావతా; నేడు తాము జరిపించిన ఘనకార్యములో గతానుభూతి విస్మృతిగతంబైనది, అంతా శివానుగ్రహము! - సెలవిప్పించవలె! - (ఒకవేపు నుంచీ బ్రాహ్మలూ, సిరియాలదేవీ - ఇంకోప్రక్కనించీ మిగతావారంతా వెళ్లుతారు - తెర.)

---

## రంగము తొమ్మిది

---

(మాధవశర్మ యిల్లు — ఉయ్యాల తొట్టెలో శిశువునుంచి ఊపుతూ సిరియాలదేవి-ప్రక్కన మాధవశర్మ దంపతులు.)

**మాధవశర్మ**

ఇంతకూ సిద్ధేశ్వరస్వామి కృపవల్ల సిరియాలదేవమ్మ చల్లగా నీళ్ళు పోసుకున్నది – (శిశువును చూస్తూ) ఈ శిశువు ఆంధ్రసామ్రాజ్య మకుటము ధరిస్తాడు— మంచిజాతకుండు.

**భార్య**

అమ్మా, ఈ మగబిడ్డకి పేరేమి పెడతావు?...

**సిరియాలదేవి**

నాన్నగారి పేరే! (బిడ్డను ఎత్తుకుని శర్మగారికిస్తూ) నాన్నగారూ, వీడుగో "మాధవవర్మ"—

**మాధవశర్మ**

(పిల్లవాడి నెత్తుకుని ముద్దాడుతూ) శుభం – తల్లీ. కుల ప్రదీపకులైన వంశవృద్ధుల పేర్లు ఏవైనా ఉంటే శాశ్వతంగా దేమో!...అలా ఉంచు. ఒకనాటికి కల కాలం ఉంచుంది; బీద బాపనాడికేమి...

**సిరియాలదేవి**

అట్లా మీరనవద్దు. అంతా మీచలవే, మీ ఉపకారానికి ప్రతిక్రృతి యేమిటూ – ఎంతకూ తీర్చుకోలేము. మా వంశం ఉన్నన్నాళ్ళూ మీ పవిత్ర నామం స్మరిస్తూ – ధరిస్తూ ఉండటండప్ప!... సంతానంలేక సంతాపించిన ఆ తండ్రికి పాప్రాప్తిలేదు. ప్రేలెడు మొలక గలిగితే చూసుకోవటమునకు. (కంట నీరుపెట్టుతుంద.)

**మాధవశర్మ**

దిగమింగుతల్లీ. ఈబిడ్డడిని చూచుకుని మరచిపోవలె... అమ్మా, బిడ్డడు నలుగు తాడు – మల్లెపూవు తల్లీ ఈ కుమారమూర్తి! ఉయ్యాల్లో పడుకోబెట్టి ఊపు. (శిశువునిచ్చి) లాలిపాట పాడుముతల్లీ ఆంధ్రరాజుకు...

**సిరియాలదేవి**

(పరుండబెట్టి-ఊపుతూ)

లాలి మాధవులలాలీ
నాతండ్రి – లాలి కన్నయ్యలాలీ
లాలి సిద్ధేశలాలీ
నాయనా – లాలి శ్రీరామలాలి.

సంపూర్ణము






శ్రీ దిగవల్లి వేంకట శివరావుగారు, బి. ఏ., బి. ఎల్.

ఇప్పుడు ఉత్తర సర్కారులలోను, రాయలసీమలోను, నాగపూరు-గోండ్వానా - బస్తరు ప్రాంతాలలోను, నిజాము రాష్ట్రములోని ఎనిమిది జిల్లాలలోను, ఇంకా తమిళ, ఉత్కల ప్రాంతాలలోను, చీలికలుగా నున్న తెలుగు భాగాలన్నీ ఒక కాలములో ఆంధ్రదేశము లేక తెలంగాణముగా నుండి రాజకీయముగాను ఆర్థికముగాను వైజ్ఞానికముగాను మహావైభవము ననుభవించినవనే సంగతి తెలిసినవారికి, ఇప్పుడు వివిధప్రాంతాలలో నుండే ఆంధ్రులు ఐకమత్యములేక ఒకరికన్న ఒకరెక్కువ అని చిన్న చిన్న విషయాలలో తగవులాడుకొంటూ అధోగతిలో పడి వుండడము చూస్తే చాలా విచారము కలుగుతుంది.

చరిత్రరీత్యా తెలంగాణము నేది ఎక్కడ నుంచి ఎక్కడిదాకా వ్యాపించివుండేవో చర్చించడం చాలా కష్టమైన విషయము. ఉజ్జాయింగా పరికించిచూద్దాము :

"దక్షిణాపథములో తూర్పువైపున సముద్రతీరము తీరప్రాంతాలలో చికాకోలునుండి దక్షిణమున (చెన్నపట్నము దగ్గరనున్న పులికాటు (ప్రళయకావేరి) దాకా తెలుగుభాష వ్యాపించియున్నది. చికాకోలుకు ఉత్తరమున ఓఢ్రమున్నూ, పులికాటుకు దక్షిణమున అరవమున్నూ వచ్చి కలిసి మెల్లి మెల్లిగా తెలుగునుత్రోసి రాజనుచున్నవి. ఈ తెలుగుభాష పడమర మహారాష్ట్రము మైసూరులవరకున్నూ వ్యాపించి యున్నది. దత్తమండలములు (రాయలసీమ) నిజాము రాష్ట్రములోని విశేషభాగమున్నూ నాగపూరు రాజ్యములోను గోండ్వానాలోను కొంత భాగమున్నూ ఈ తెలుగుదేశములో చేరి యున్నవి" అని ద్రావిడభాషా చరిత్రను గురించి పరిశోధన చేసిన కాల్డ్వెల్ గారు వ్రాసియున్నారు. (Comparative Grammar of Dravidian Languages by Bishop Caldwell — P. 25.)

### చక్రకోట్యము

క్రీస్తుశకము పదకొండు, పండ్రెండు, పదమూడు శతాబ్దములలో ప్రస్తుతము మధ్యమాగాణములని గోండ్వానా యని పిలువబడే దేశములోని బస్తరు (వస్తర) రాజ్యము చక్రకోట్యము అని వ్యవహరింపబడేది.

ఆంధ్రమహాభారత కృతిపతియైన రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరమును రాజధానిగా వేగిదేశమును పరిపాలిస్తూవుండగా జగదేకభూషణ ధారావర్షమహారాజు చక్రకోట్యమునకు రాజుగా

నుండేవాడు. రాజరాజనరేంద్రుని కుమారుడైన రాజేంద్రచోడుడు చక్రకోట్యముపైన దండెత్తి ధారావర్షుణ్ణి ఓడించి కప్పము పుచ్చుకుని దక్షిణ కోసలములోని వాయిరా (వజ్రాకరము) ను ముట్టడించి ఆ దేశములోని అనేక గజయూథములను తీసికొనిపోయినట్లు రాజేంద్రచోడుని శాసనములలో చెప్పబడినది. (South Indian Inscriptions Vol. III PP 132-140 Vol, II P .35)

ధారావర్షునికి సామంతుడుగా నుండిన చంద్రాదిత్యుడు వీరశూర నేటి బర్సూరు (Barsur) పట్టణమును రాజధానిగా చేసికొని బస్తరు ప్రాంతములను పరిపాలించేవాడు.

ధారావర్షునితరువాత ఆయన కుమారుడైన సోమేశ్వరదేవునికిని ఆయనదాయాదియైన మధురాంతకదేవునికిని రాజ్యాధిపత్యమును గురించి పోరాటములు జరిగినవి. సోమేశ్వరుడు వింధ్యవాసినీ దేవతయొక్క అనుగ్రహముచేత మధురాంతకుని చంపి సింహాసనమెక్కినట్లు కృష్ణపుర (Kuruspal) శాసనములో చెప్పబడినది.

ఈ చక్రకోట్య రాజుల శాసనములు కొన్ని నాగరలిపిలో సంస్కృతమునను కొన్ని తెలుగులోను వ్రాయబడియున్నవి. చక్రకోట్య మండలము నడుమ ఇంద్రావతీ నది ప్రవహించుచున్నది. దీనికుత్తరభాగమున బుట్టిన శాసనములన్నీ సంస్కృతములో నాగరలిపిలోను, ఇంద్రావతికి దక్షిణమున పుట్టిన శాసనములన్నీ తెలుగులోను ఉండుటచేతను ఉత్తరభాగమున గోండుభాషయున్నూ దక్షిణమున తెలుగుభాషయున్నూ వ్యవహరింపబడుతూ ఉన్నట్లు ఊహించవచ్చును.

ఈ నాగరాజుల తెలుగు శాసనములింకా చాలా ప్రకటింపబడవలసియున్నవి. రెండవ సోమేశ్వరుని తెలుగు శాసనమొకటి సిరువంచనుండి తీసికొని వెళ్ళి నాగపురం మ్యూజియములో నుంచినారు. (చూడుడు. శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారి కాకతీయాంధ్రరాజయుగము 8 వ ప్రకరణము.)

## 'తెలంగాణము'

మైసూరు దేశచరిత్రను గురించి పరిశోధనచేయుటలో దక్షిణాపథమును గురించిన అనేక విశేషాలను తెలిసికొన్న కర్నల్ మార్కు విల్కు్స 1810 లో ప్రకటించిన గ్రంథములో తెలుగు భాష వ్యాప్తిలోనున్న దేశభాగాన్ని గురించిన్నీ తెలంగాణముయొక్క హద్దులనుగురించిన్నీ వివరించియున్నారు.

"కళింగమని పిలువబడే తెలింగభాష, మహారాష్ట్రానికి తూర్పుగా ఉత్తరమున చికాకోలునుండి దక్షిణమున పులికాటువరకూ వ్యాపించియున్నది. ఈమధ్య గల గోండులు మాట్లాడే భాష కొంతమేరనున్నది. ఈ విశాల దేశము ఆంధ్ర కళింగ దేశములుగా విభజింపబడియున్నది. గోదావరికి ఉత్తరమున గల భాగమును కళింగమనిన్నీ, దక్షిణమున గలదానికి ఆంధ్రమనిన్నీ వ్యవహరింపబడుతున్నట్లున్నూ మహమ్మదీయ ప్రాంతాలమీదికి దండయాత్రచేసేనాటికీ రెండుభాగములున్నూ

కలిసి "తెలంగాణము" అని వ్యవహరింప బడుతూ వుండినట్లున్నూ దానియొక్క రాజధాని ఓరుగల్లు అయినట్లున్నూ తెలుస్తున్నది" అని స్పష్టీకరించినారు.

(Historical Sketches of the South of India By Lt. Col. Mark Wilks -- Vol. I (1810) P. 6)

పైన చెప్పినట్లు ఓరుగల్లు రాజధానిగా గల తెలంగాణమును అహమ్మదుషాబహామనీ సుల్తాను క్రీ. శ. 1423 లో పూర్తిగా తన రాజ్యంలో కలుపుకున్నాడు. ఈబహామనీ రాజ్యము 1512 లో బిరారు, అహమ్మదునగరము, బిజాపూరు, బీదరు, గోలకొండ లనే ఐదురాజ్యాలుగా విభజింపబడి వేరు వేరు సుల్తానుల పరిపాలన క్రిందికి వచ్చినది. ఓరుగంటి (ప్రతాపరుద్ర) దేవచక్రవర్తి ఏలిన కాకతీయసామ్రాజ్య భాగములన్నీ దరిదాపుగా గోలకొండ సుల్తాను రాజ్యంలో చేరినవి. గోదావరీ కృష్ణానదుల క్రిందిభాగమునుండి తూర్పున బంగాళాఖాతము సముద్రమువరకున్నూ పడమర బీదరురాజ్యం సరిహద్దువరకున్నూ ఉత్తరమున పెన్నగంగ (Pen ganga) వెనగంగ నదులవరకున్నూ వ్యాపించియున్నది. ఈ గోలకొండ రాజ్యస్థాపకుడైన కులీకుతుబ్‌షా సుల్తాను తన రాజధానిని ఓరుగల్లునుంచి గోలకొండకు మార్చివేశాడు. గోలకొండనగరము క్రమక్రమంగా అనారోగ్యకరముగా నుంటూ వచ్చినందువల్ల రాజధాని 1589 లో దానికి దగ్గరగా నున్న భాగ్యనగరానికి మార్చబడినది. ఈ భాగ్యనగరాన్నే హైదరాబాదు అని వ్యవహరించసాగినారు

(Oxford History of India, A. V. Smith PP 281—289)

మొగలు చక్రవర్తియైన షాజహాను 1635 లో దక్షిణ దిగ్విజయానికి పూనుకొని గోలకొండ, బిజాపూరు సుల్తానులను తనకు లోబడవలసినదని కబురంపినాడు. గోలకొండ సుల్తాను వెంటనే లోబడినాడు. గాని బిజాపూరుసుల్తాను యుద్ధము చేసి నెగ్గలేక 1636 సం॥ మే నెల 6 వ తేదీన సంధిచేసికొన్నాడు. దాని ప్రకారము 20 సంవత్సరములు అమలుజరిగింది. షాజహానుచక్రవర్తి కొమారుడైన ఔరంగజేబు దక్షిణపథానికి రాజప్రతినిధియైనాడు. ఖాందేషు, బీరారు, తెలంగాణము దౌలతాబాదు లనే నాలుగు పరగణాలకు ఆయన అధికారిగా నున్నాడు. ఇందులో 'తెలంగాణము' అనగా తెలుగుదేశమే. అయితే ఇది యావదాంధ్రదేశము కాదు. అందులోని ఉత్తరభాగము మాత్రమే. "బీరారుకున్నూ గోలకొండరాజ్యానికిన్నీ మధ్య కొండలతోను అడవులతోను నిండి అరణ్యమైన సరిహద్దులుగల ప్రదేశం.. దీని ముఖ్యపట్టణము [illegible]దేశు. ఇందలి ముఖ్యమైన దుర్గము "కంధార్" అనే [illegible]స్థానము" అని [illegible] దే[illegible] 25 మైళ్ళ దూరాన[illegible] పురాతనమైన కోట.

(Oxford History of India. V. A. Smith P 400.)

తరువాత ఔరంగజేబు చక్రవర్తి 1689లో గోలకొండను జయించి మొగలు సామ్రాజ్యంలో చేర్చి దక్షిణదేశాని కొక సుబేదారున్ని రాజప్రతినిధిగా నియమించినాడు. 1707 లో ఔరంగజేబుచక్రవర్తి చనిపోగా యీహైదరాబాదు సుబేదారే

తరువాత స్వతంత్రుడై నిజాం రాజ్యాధిపతి యైనాడు.

### “ తెలంగాణమే ఆంధ్రము ”

ఇలాగ మన తెలంగాణ మతి విశాలమైన దేశము, ఇప్పటికీ ఉత్తర దక్షిణములను, తూర్పు పడమరలను ఉన్న ఆంధ్రేతర రాష్ట్రాలలో తెలుగు మాట్లాడుతూ తెలుగు ఆచారాలను అవలంబించియున్న తెలుగుకులాలవారు చాలా మందిఉన్నారు. మహారాష్ట్ర, గోండ్వానా, బీరారు, నాగపూరు మొదలైన ప్రాంతాలలో నున్న 75 కులాలను గురించి శ్రీ తేకుమళ్ళ రాజగోపాలరావు పంతులుగారు ఆంధ్ర దేశపు చరిత్ర పీఠికలో వ్రాసియున్నారు. తక్కిన చోట్ల నున్న ఆంధ్రులను గురించి యితర గ్రంథాలలో వివరించబడి యున్నది.

క్రీ. శ. 1782 మొదలు 1810 వరకూ చెన్నపురి రాజధానిలో ప్రాచీనగ్రంథములను, చరిత్రాధారములను ప్రోగుచేసి ప్రసిద్ధుడైన కర్నల్ మెకంజీగారి గ్రంథ సముదాయముయొక్క సూచికకు ఉపోద్ఘాతమును వ్రాసిన విల్సన్ గారు దక్షిణ హిందూదేశములోని ఆంధ్ర, ద్రవిడ, కర్నాటక దేశముల హద్దులను గురించి చర్చించియున్నారు.

చెన్నపట్నము దగ్గర పులికాటునుంచి పడమటి కనుమలవరకూ ఒక గీత గీస్తే దానికిని బెంగుళూరునకును మధ్య ఆ కొండల వంపు వెంబడిని ఆ సరిహద్దు గీతకు పడమర మలబారు, కనరా (కర్నాటకము) లకు మధ్య సముద్రతీరము వరకున్నూ గల దక్షిణ దేశము ద్రవిడ దేశము. అక్కడ అరవము మాట్లాడతారు. ఈ ద్రవిడ దేశముయొక్క ఉత్తరపు సరిహద్దులు కొంత భాగము కర్ణాటకముయొక్క సరిహద్దుగా నున్నది. దానికి పడమర వారు కొంతవరకూ సముద్రమున్నూ, కొల్హాపురమువరకూ పడమటి కనుమలున్నూ, అయి యున్నవి. ఈ ఉత్తరపు సరిహద్దు ఉజ్జాయింపుగా కొల్హాపురము నుండి బీదరు పట్టణానికి ఒక గీత గీస్తే సరిపోతుంది. తూర్పున బీదరునుండి అదోని, అనంతపురము, నందిదుర్గముల గుండా పైన చెప్పిన ప్రకారము పులికాటు, బెంగుళూరుల మధ్య కనుమలలో ఒకచోటికి ఒక గీత గీస్తే సరిపోతుంది.

ఈ చివర చెప్పిన సరిహద్దుగీత తెలుగు మాట్లాడే దేశం తాలూకు కొంత భాగానికి పడమటి సరిహద్దుగా నుంటుంది. ఈ తెలుగు దేశముయొక్క సరిహద్దును, పైన చెప్పినట్లు ఉజ్జాయింపుగానే నేటి మధ్య రాష్ట్రాలలోని వరబా (వర్ధా) నదీతీరమున గల చాందా దాకా గీయవలసి యుంటుంది. అక్కడనుంచి ఆ గీత తూర్పు వైపునకు చూచాయగా మహానదిమీద నున్న సోనపురము (Sohanpur) నకు గీయవలెను. తూర్పు సరిహద్దు సోనపురము నుంచి చికాకోలునకున్నూ అక్కడనుంచి సముద్రతీరము వెంబడిని దక్షిణమున పులికాటువరకున్నూ పోయి తమిళ భాష యొక్క సరిహద్దుతో కలుస్తుంది.

ఆంధ్రమనేది తెలంగాణము (తెలుగు దేశము) యొక్క భూభాగాని కొసకి పేరు" అని స్పష్టముగా వ్రాసియున్నారు (Elphinstone's History of India (Hindu and Mahomedan Periods) PP 215 219) (1841.)

చూచినారా! మన తెలంగాణ యెక్కడనుంచి యెక్కడిదాకా వ్యాపించి యున్నదో! ఈ తెలంగాణమే చరిత్రప్రసిద్ధమైన ఆంధ్రదేశము; ఆంధ్రభాషకు ఆంధ్ర సంస్కృతికి ఆంధ్ర జాతీయతకు కాణాచి. ఎప్పటికైనా యీ తెలంగాణ మంతా ఏకము కావలెను. ఇది మన యాశయము. ఇదే మనకు ధ్యేయము.



## హనుమంతరాయ ప్రశస్తి

"నేటికిని భారతీయ దేశీయ సంస్థానములలో ప్రజాస్వామ్యోద్యమములు వృద్ధినందుటకు అనుకూలములు బొత్తిగా లేవన్నచో 1920 సంవత్సరమున హైదరాబాదు నందలి పరిస్థితి సులభముగా నూహింపవచ్చును. అట్టి పరిస్థితిలో కామధేనువు వంటి న్యాయవాదవృత్తి గల్గియు, సౌఖ్యజీవనము గడుపుటకు అన్నివీళ్ళు గలిగియు, వాటినన్నిటిని త్యాగము చేసి, ప్రభుత్వ వ్యతిరేకతను, ప్రజల యుదాసీనతను ఎదుర్కొనుచు ప్రజాసేవా కార్యమున దుమికిన (శ్రీ హనుమంతరావు) పంతులుగారికి ఎంత యున్నతస్థాన మిచ్చినను తక్కువయే."

— తెలంగాణ పత్రిక.

# ఆంధ్రులు - ఆంధ్రదేశము

→ డాక్టరు శ్రీ మారేమండ రామారావుగారు,
ఎం. ఏ., పిహెచ్. డి.

ఆంధ్రశబ్దం ఈనాడు యావద్భారత దేశంలోనూ తొమ్మిదోవంతు వైశాల్యం గల భూభాగాన్నీ, భారతదేశపు జన సంఖ్యలో పదోవంతు సంఖ్యనూ, భారతీయ భాషలలో మూడవ భాషనూ విశిష్టములైన నాగరికతా సంస్కృతులనూ కలిగి ఉన్న ఒక జాతినీ సూచించేదిగా ఉన్నది. ఆంధ్రులు చరిత్రప్రసిద్ధులు అనేది నిర్వివాదాంశం. అయినప్పటికీ ఆంధ్రులనిగురించీ, ఆంధ్రదేశాన్ని గురించీ, ఆంధ్ర రాజ వంశాలలో మొదటిదయిన శాతవాహన రాజవంశానికి ఆంధ్ర దేశంతో గల సంబంధాన్ని గురించీ కొన్ని అపోహాలు, ముఖ్యంగా ఇతర రాష్ట్రాల పండితులలో ప్రబలంగా ఉన్నవి. ఈసందర్భంలో ప్రసక్తములయిన కొన్ని ముఖ్యాంశాలను ఇక్కడ సూచిస్తాను.

ఆంధ్ర శబ్దం మొట్టమొదటిసారి ఐతరేయ బ్రాహ్మణంలో కనపడుతుంది. అందులో ఆంధ్రులు శబర పుళిందాది జాతులతో కలిసి ఉన్నట్టు చెప్పబడింది. ఈ ఆంధ్రశబ్దం జాతివాచకం అనేది స్పష్టం. దేశవాచకం అయిన ఆంధ్రశబ్దం మొట్టమొదటిసారి ఒక ప్రాకృతపల్లవ శాసనంలో "అంధపథ" అనే రూపంలో కనపడుతుంది. ఈ అంధపథ శబ్దానికి ఉత్తరాపథ, దక్షిణాపథ శబ్దాలవలెనే ఆంధ్రులుండే దిశ లేక దేశము అని అర్థం చెప్పవలసి ఉంటుంది. ఆంగిలులు అనే జాతినుండి ఇంగ్లండు, ఫ్రాంక్స్ అనే జాతి నించి ఫ్రాంసు, జూట్స్ అనే జాతినించి జట్‌లండు అనే దేశాల పేర్లు ఏర్పడినవి. మన పురాణాలలోనున్నూ అంగ వంగ కళింగాదులు ప్రజావాచకాలుగానే కనపడతవి. ఐతరేయబ్రాహ్మణం పై పల్లవ శాసనంకంటె ప్రాచీనతరం. ఈ కారణాలవల్ల ఆంధ్రులనే జాతి నివసించడం వల్ల, వారు నివసించిన ప్రదేశానికి ఆంధ్ర పదము అనే పేరు వచ్చినట్లు ఊహించవచ్చును. పై శాసనం గుంటూరుజిల్లాలో దొరికింది. అమరావతీ ధాన్యకటకప్రాంతం ఆంధ్రపథంలో ఉన్నట్లు దానివల్ల తెలుస్తుంది.

అన్ని సమయములలోనూ ఆంధ్రదేశం యొక్క విస్తృతి ఈవిధంగా పరిమితంగా ఉండలేదు. ఆయా కాలాలలో దాని వైశాల్యం ఎంత ఉండేదో ఒక విధంగా నిర్ణయించవచ్చును. ఐతరేయబ్రాహ్మణ కాలానికి ఆర్యులు ఉత్తరాపథంలో ఎంత వరకూ వ్యాపించారో నిర్ణయించడం కష్టసాధ్యం. అయినా మగధ వంగ దేశాలు వారి నివాసస్థలానికి వెలుపల ఉండినట్లు

తోస్తుంది. ఆంధ్రులు శబర పుళిందాదులతో చేర్చి పేర్కొబడ్డారు. ఈ రెండు జాతుల వారూ వింధ్యపర్వతాలకూ, తూర్పుకనుములకూ మధ్య నివసిస్తూ ఉండే వారు. ఋగ్వేదకాలపు ఆంధ్రులున్నూ ఈ ప్రాంతంలోనే నివసించి ఉండవచ్చును. తిరిగీ ఆంధ్రుల ప్రశంస ప్రాచీన బౌద్ధ వాఙ్మయంలో కనిపిస్తుంది. ఈ ఆధారాన్నిబట్టి వారు గోదావరీనదీ తీరాన ఉండినట్టున్నూ, వారికి అంధకపుర మనే ఒక నగరం ఉండినట్టున్నూ తెలియవస్తుంది. ఈ ప్రాంతం ఐతరేయబ్రాహ్మణంలో సూచించబడిన ప్రదేశానికి సరిపోతుంది. దీన్నిబట్టి ఆంధ్రజాతి చిరకాలం ఉత్తరాపథ దక్షిణాపథములు రెంటికీ సంగమస్థానంలోనూ ఉంటినట్లు స్పష్టమవుతుంది. క్రీ. పూ. 4 వ శతాబ్దిలో చంద్రగుప్తమౌర్యుడి కాలంలో వీరికి 80 ప్రాకారావృతములయిన నగరములు ఉండేవనీ, ప్రబలమైన హయగజ పదాతి బలం ఉండేదనీ, మౌర్యులతర్వాత వారే ప్రబలులనీ తెలియవస్తుంది. చంద్రగుప్తుడి పౌత్రుడైన అశోకచక్రవర్తి కాలంలో దక్షిణదిశని రాష్ట్రిక, పెటినిక, భోజక, ఆంధ్ర, పుళిందులున్నూ, ఆమీంద చేర చోళాది ద్రవిడరాజ్యములున్నూ ఉండినట్లు శాసనముల వల్ల తెలుస్తుంది. ఇందులో రాష్ట్రికులు మహారాష్ట్రములోను, పెటినికులు పైఠాన్ ప్రాంతమందును, భోజకులు బేరార్‌లోను, పుళిందులు వింధ్యపర్వత దక్షిణభాగమునందును ఉండేవారని పండితులు నిర్ణయించారు. దక్షిణాపథంలో ఈయా జాతుల వారి నివాసస్థానాలు పోగా మిగిలినది మధ్యప్రాగ్భాగాలు. ఆంధ్రజాతిని ఈప్రదేశంలో నివసించేజాతిగా పరిగణించడం సమంజసం అవుతుందిగదా! అంతేకాకుండా 80 నగరాలు గల దేశం సువిశాలమయినదిగా ఉండవలెను గాని పరిమితమూ, సంకుచితమూ అయి ఉండజాలదు. ఇంతవరకూ ఆంధ్రుల 80 నగరాలూ ఏవి, ఎక్కడ ఉండేవి అనే అంశం పండితులలో చర్చకు రాలేదు. ఇటీవల చేయబడిన ఖనన పరిశోధనల మూలంగా ఈ ప్రశ్నకు సమంజసమైన సమాధానం ఇయ్యవచ్చును. క్రీ. పూ. 3 వ శతాబ్ది నాటి ఖారవేలుడనే కళింగదేశపు రాజు శాతవాహన వంశంలో మూడవ రాజైన శాతకర్ణిని లక్ష్యం చెయ్యక పడమటగా తన సైన్యాలని పంపినట్లున్నూ, అవి "పూర్వరాజనివేశిత"మైన పిథుండ నగరాన్ని నాశనం చేసి, మూషికనగరాన్ని భయపెట్టి ద్రమిరరాజ్యాలయొడకి వెళ్ళినట్లున్నూ తన హాథీగుంఫా శాసనంలో చెప్పుకొన్నాడు. కళింగానికి పశ్చిమంగా ఉన్నవని చెప్పడంవల్ల ఈ రెండు నగరాలూ దక్షిణాపథ మధ్యప్రాగ్భాగాలలో ఉన్నట్లు స్పష్టమవుతుంది. క్రీ. శ. 2 వ శతాబ్దినాటి టాలెమీ అనే యవనుడు పిటుండ్రనగరం కృష్ణానదీ ప్రాంతంలో ఉన్నదని వ్రాశాడు. ఇది ఖారవేలుడికి పూర్వమే నిర్మించబడిన నగరం. క్రీ. శ. 8 వ శతాబ్దినాటి ఒక పల్లవశాసనంలో కటకం అనే రాజకీయ కేంద్రం పేర్కొ

బడింది. ఇది సుప్రసిద్ధమయిన ధాన్యకటకం అని పండితులు నిర్ణయించారు. ఆంధ్ర శాతవాహనచక్రవర్తి అయిన గౌతమీపుత్రుడి ఒక శాసనంలో "ధనకట సమినహి" అనే ఒక భాగం ఉన్నది. దీనికి ఆ రాజు ధనకటమునకు స్వామి అని అర్థం ఏర్పడుతుంది. కొందరు పండితులు ఈ శాసనభాగానికి "బెనాకట సమినహి" అనే పాఠాంతరాన్ని ఉపపాదించారు. అప్పుడు గౌతమీపుత్రుడు బెనాకటస్వామి అనే అర్థం ఏర్పడుతుంది. బెనా, వేణ్ణా, కృష్ణవేణ్ణా అనేవి కృష్ణానదికి నామాంతరాలు. గుంటూరు జిల్లా అమరావతిని అంటి ఉన్న ధాన్యకటకానికి తప్పితే కృష్ణాతీరస్థమైన కటకమనే ప్రసిద్ధి మరి ఏ నగరానికిన్నీ లేదు. క్రీ. పూ. 3 వ శతాబ్దినించిన్నీ ఇక్కడ జగత్ప్రసిద్ధమైన అమరావతీ మహాచైత్యం ఉండి ఉండడంవల్ల ఈ వేణ్ణాకటకమున్నూ ఆ కాలం నించీ ఉన్నదనే ఊహించవచ్చును. ఇటీవల నైజాం ప్రభుత్వంవారి పురాతత్వశాఖవారు ఖననంచేసి కొండాపురము, పణిగిరి, గాజులబండ, మాస్కి, గోగి అనే చోట్ల శాతవాహనాంధ్రయుగపుపట్టణాలని బయల్పెడలించారు. శాతవాహన వంశజులకి చిరకాలం పైఠాన్ లేక ప్రతిష్ఠానపురం రాజధానిగా ఉండేది. ఈవిధంగా మనకి ఇప్పటికి పిథుండ, ధాన్యకట, మూషికనగర, కొండాపుర, పణిగిరి మొదలయిన ఏడెనిమిది ఆంధ్రనగరాలు తెలియవస్తూన్నవి. నైజాం రాజ్యంలో జాగ్రత్తగా పరిశోధన సాగిస్తే ఇంకా ఎన్నో నగరాలు బయటపడగలవు. ఇవన్నీ పైన చెప్పబడిన 30 ప్రాచీనాంధ్ర నగరాలలోనూ చేరి ఉండేవి. క్రీ. పూ. 4వ శతాబ్దిలో ఉత్తరాన గోదావరికిన్నీ, దక్షిణాన కృష్ణానదికిన్నీ మధ్యగా ఉన్న దక్షిణాపథంలోని ప్రాఙ్మధ్యభాగమంతా ఆంధ్రజాతికి నివాసస్థానమై ఆంధ్రదేశంగా ఉండేదని తెలుస్తుంది.

పురాణములలో ఆంధ్రులు ప్రభుత్వం సాగిస్తూన్న కాలంలోనే వారి కుదురుకు చెందిన ఏడు వంశాలు రాజ్యం చేస్తూవచ్చిన్నీ, వాటిలో శ్రీపర్వతీయ ఆంధ్రశాఖ ఒకటి అనిన్నీ చెప్పబడి ఉన్నది. ఇటీవల గుంటూరుజిల్లా నాగార్జునకొండలో దొరికిన ఇక్ష్వాకువంశీయుల శాసనాలనిబట్టి నాగార్జునకొండే పురాణాలలోని పై శ్రీపర్వతమనిన్నీ, ఇక్ష్వాకురాజులే శ్రీపర్వతీయాంధ్రులనిన్నీ, పండితులు నిర్ణయించారు. కృష్ణా గుంటూరు జిల్లాలు దాటి ఈ రాజుల రాజ్యం ఎంతవరకూ వ్యాపించిందో చెప్పలేము కాని వీరు ఉత్తరాన ఉజ్జయినీ పాలకులతోనూ, పడమట వనవాసిరాజులతోనూ సంబంధబాంధవ్యాలు కలిగి ఉండడంవల్ల వారి రాజ్యం సువిస్తృతంగా ఉండేదని ఊహించవచ్చును. ఈ ఆంధ్రవంశంయొక్క రాజ్యం ఆంధ్రదేశమే అవుతుంది కదా! ఇప్పటి మైసూరు రాజ్యంలో వనవాసీప్రాంతంలో సమ్రాట్టులైన ఆంధ్ర శాతవాహన రాజులవలెనే శాతకర్ణి బిరుదును ధరించిన చాటునాగ వంశీకులు ఇక్ష్వాకు పల్లవరాజులకు సమకాలికులుగా రాజ్యం చేశారు. ఈ వం

శాన్ని ఏడు ఆంధ్రశాఖలలో ఒకటిగా పరిగణింపవచ్చును. ఈ రెండు నిదర్శనాలనిబట్టేన్నీ క్రీ. శ. 3వ శతాబ్దిలోకూడా కళింగం మినహాగా దక్షిణాపథంలోని ప్రాఙ్మధ్యభాగం ఆంధ్రదేశంగానూ, ఆంధ్రరాజవంశ పాలితంగానూ ఉన్నట్లు స్పష్టమవుతుంది.

ఆ తర్వాత శతాబ్దాలలోకూడా ఈ భాగానికి ఆంధ్రదేశమనీ, దాని ఏలికలకి ఆంధ్రరాజులనీ ప్రసిద్ధి ఉండేది. మౌఖరి, వాకాటక వంశాల రాజులు తాము ఆంధ్రాధిపతులను, ఆంధ్ర నృపతులను ఓడించినట్లు చెప్పుకున్నారు. ఈ ఆంధ్రాధిపత్యం ఆనాటి ప్రాగాంధ్రదేశాన్నీ ఏలిన శాలంకాయన విష్ణుకుండిరాజులకు సరిపోతుంది ఇది, క్రీ. శ. 5, 6, శతాబ్దుల ముచ్చట. క్రీ. శ. 7వ శతాబ్దిలోని దండి మహాకవి తూర్పు చాళుక్యరాజయిన జయసింహవల్లభుడిని "ఆంధ్రనాథు"డనీ, అతని రాజధాని అయిన వేంగిని "ఆంధ్రనగరి" అనీ వర్ణించాడు. చైనా దేశ యాత్రికుడైన హ్యూయన్‌ష్వాంగ్ కోసలకు దక్షిణంగా ఆంటోలో (ఆంధ్ర) అనే దేశం ఉన్నదన్నాడు. క్రీ. శ. 11, 12 శతాబ్దులలో నేటి బస్తరుప్రాంతాన్ని పరిపాలించిన నాగవంశపురాజులు ఆంధ్రులు. సుప్రసిద్ధులైన కాకతీయ చక్రవర్తులకు ఆంధ్ర క్ష్మాభృత్తులని ప్రసిద్ధి ఉండేది. వారిని సమకాలికులైన రాజులు ఆంధ్రరాజులనీ, తిల్లింగక్షితిపాలురనీ వ్యవహరించేవారు. ఈ తిల్లింగ శబ్దం త్రిలింగ శబ్దానికి రూపాంతరం. విద్యానాథుడి ప్రతాపరుద్రీయంలో శ్రీశైల కాళేశ్వర ద్రాక్షారామముల మధ్య ఉన్న దేశం త్రిలింగదేశం అని చెప్పబడింది. అశోక మౌర్యుడినాటి ఆంధ్రదేశవిస్తృతి, విద్యానాథుడి త్రిలింగదేశవిస్తృతి కొంచెం హెచ్చుతగ్గుగా సరిపోతున్నవి.

పై చర్చనిబట్టి ఐతరేయబ్రాహ్మణకాలంలో వింధ్యపర్వత ప్రాగ్భాగంలో ఉండిన ఆంధ్రులు క్రమక్రమంగా దక్షిణంగా వ్యాపించి దక్షిణాపథంలోని మధ్యభాగాన్నీ, ప్రాగ్భాగాన్నీ ఆక్రమించి, ఇక్కడ స్థిరపడ్డారనీ, వారినిబట్టి ఈభాగానికి ఆంధ్రదేశం అనే పేరు రూఢి అయిందనీ స్పష్టం అవుతూన్నది. ప్రాచీన సంస్కృత వాఙ్మయమున్నూ ఈ ఊహని బలపరుస్తూన్నది. రామాయణ మహాభారతములలో ఆంధ్రుల ప్రశంస ఉన్నది. బ్రహ్మాండపురాణంలో ఆంధ్రులు ఉత్తరాన పుళింద వింధ్య దండక అశ్మకులతోనూ, దక్షిణాన కౌంకణ కుంతలులతోనూ కలిసి పేర్కొనబడ్డారు. విష్ణుపురాణంలో ఆంధ్రులు మాగధ కాళింగులతో కలిసి చెప్పబడ్డారు. కూర్మపురాణాన్ని బట్టి వీరు సౌవీరులతోనూ, మంబ్రాములతోనూ కలిసి పాలియాత్రంలో ఉన్నట్టు తెలుస్తుంది. వాయుపురాణం ఈ ఆంధ్రులని కుంతలులతోబాటు దక్షిణాపథవాసులుగా చెపుతూన్నది. హరివంశంలో శ్రీకృష్ణునికిన్నీ చాణూరుడికిన్నీ జరిగిన మల్లయుద్ధాన్ని వర్ణించే ఘట్టంలో ఈ చాణూరుడు ఆంధ్రుడనీ, కరూశులలో జన్మించినవాడనీ చెప్పబడింది. శ్రీమద్రా

మాయకాన్నిబట్టి కరూశదేశం మగధకి దక్షిణంగా ఉన్నట్టు తెలుస్తుంది. ఈఆధారాన్నిబట్టిచూచినా ఆంధ్రులు దక్షిణాపథం అంతటా, ముఖ్యంగా ప్రాగ్మధ్య భాగాలలో ఉండినట్టు తెలియవస్తుంది.

నిజం ఈవిధంగా ఉంటే ఈమధ్య ఒక వితండ వాదం బయలుదేరింది. ఆంధ్రదేశాన్నీ, దక్షిణాపథం అంతటినీ పరిపాలించిన స్థానిక రాజవంశాలలో శాతవాహన వంశం మొట్టమొదటిది. ఈ వంశీయులలో మొదటి ఇరవైఇద్దరు రాజుల కట్టడాలూ, శాసనాలూ, నాణెములూ మహారాష్ట్రంలోనే దొరికినవి. దీన్నిబట్టి ఈ శాతవాహనవంశీయులు మహారాష్ట్రులనీ, ఈ మొదటి 22 మంది రాజులకీ ఆంధ్రదేశంతో సంబంధం లేదనీ కొందరు పండితులు ఉపపాదిస్తున్నారు. ఈ వంశంలో కడపటి ఎనిమిదిమంది శాసనాలూ, నాణెములూ కొంతవరకు ఆంధ్ర మహారాష్ట్రాలలోనూ, కొంతవరకు ఆంధ్రదేశంలో మాత్రమూ దొరికినవి. దీనికిపై పండితులు శాతవాహనరాజులలో కడపటివారు ఆంధ్రదేశాన్ని ఆక్రమించి పరిపాలించారని వ్యాఖ్యానం చేశారు. అంతే కాదు. వీరు అసలు ఆంధ్రులే కారనీ, కడపటివారు ఆంధ్రదేశాన్ని పరిపాలించడంవల్ల ఆంధ్రులని ప్రసిద్ధి పొందారనీ కూడా ఒక సిద్ధాంతం బయలుదేరింది.

ఈ ఊహాలన్నీ సత్యదూరాలూ, చరిత్రకు విరుద్ధాలూ అని సప్రమాణంగా నిరూపించవచ్చును. పురాణాలలో రాజవంశాల ప్రశంస చేసేటప్పుడు 30 మంది ఆంధ్రరాజులు సుమారు 400 సంవత్సరాలు పరిపాలించినట్లు చెప్పబడి ఉన్నది. ఈ ఆంధ్రరాజుల పేర్లూ, శాసనాదికాలవల్ల తెలియవచ్చే శాతవాహనవంశపు రాజుల పేర్లూ కొంచెం వ్యత్యాసంతో సరిపోతూన్నవి. అందువల్ల పురాణాలలోని ఆంధ్రరాజులూ, శాసనాలలోని శాతవాహనరాజులూ ఒక్కరేనని పండితులు నిశ్చయించారు. అంతే కాదు. శాసనాలలో శాతవాహనవంశకర్తగా తెలియవచ్చే రాజు శాముకుడు. పురాణాలలోనూ ఈ పేరే కనపడుతుంది. పైగా వాటిలో "ఆంధ్రుడైన శిసుకుడు సజాతీయులతో కలిసి భూమిని పొందును" అనికూడా చెప్పబడింది. మరిన్నీ తూర్పు తీరాన శ్రీపర్వతీయాంధ్రులనే ఇక్ష్వాకులున్నూ, పడమట మైసూరుప్రాంతంలో చూటువంశీయులున్నూ ఆంధ్ర సామ్రాజ్యాంతర్గతాలయిన భాగాలని పరిపాలించిన ఆంధ్రశాఖీయులని పౌరాణిక శాసనాద్యాధారాలని సమన్వయిస్తే తేలుతుందని పైన చెప్పాము. వీరు శాతవాహన వంశీయుల సామంతులని నిరూపించడానికి అనేక కారణాలు ఉన్నవి. ఈకారణాలను బట్టి శాతవాహనులు, ఆంధ్రప్రజలో ఒక కుటుంబానికి చెందినవారనీ, వారి మూలపురుషుడైన శాముకుడి నాయకత్వంకింద ఆనాటి ఆంధ్రులు మహారాష్ట్రాన్ని జయించారనీ, ఇది ఒక ప్రశంసనీయమైన ఆంధ్ర జాతీయోద్యమమనీ నిస్సందేహం[illegible]

ఇక ఈ శాతవాహనుల శాసనాలూ, నాణెములూ మహారాష్ట్రంలోనే ఎందుకు విరివిగా ఉన్నవి? అనే ప్రశ్నకున్నూ సమాధానం చెప్పవచ్చును. అశోకచక్రవర్తి మరణించాక జరిగిన కల్లోలంలో ఆంధ్రులు మహారాష్ట్రాన్ని జయించారు. ఉత్తరాపథంలో ఇదే సమయంలో పడమట యవనులు, తూర్పున శుంగులూ విజృంభించారు. మహారాష్ట్రం అశోకుడి సామ్రాజ్యంలో చేరి ఉన్నట్టు కనపడుతుంది. మౌర్యుల తర్వాత మగధని పాలించిన శుంగులు కానీ, కొత్తగా ప్రబలుతూన్న యవనులు కానీ మహారాష్ట్రం మీదికి రాదగిన కాలం అది. యవన విజృంభణం నాసికప్రాంతం (Poona Gap) మీదుగానూ, శుంగుల విజృంభణం ఉజ్జయినిమీదుగానూ రావలె. ఈ ప్రమాదాలని ఎదురుకోవాలి అంటే పురుషాంతరాల శాతవాహనరాజులు మహారాష్ట్రంలో ఉండక తప్పదు. ఈ రాజకీయకారణంవల్ల వారు అక్కడ ఉన్నారు గనుక వారి శాసనాలు అక్కడ విరివిగా దొరికినవి.

మొదటినుంచీ ఆంధ్రదేశం శాతవాహనవంశరాజుల పరిపాలనలో లేదనే వాదమున్నూ అసమంజసమే. ఈ వంశంలో మూడవరాజైన మొదటి శాతకర్ణికి "దక్షిణాపథపతి" అనే బిరుదు ఉండేది. ఆతర్వాత ఆంధ్ర మహారాష్ట్రాలని రెంటినీ ఏలిన అతని వంశీయులున్నూ ఈ బిరుదు వహించారు. సమకాలికుడైన ఖారవేలుడనే కళింగరాజు ఈ శాతకర్ణిని ధిక్కరించి ఆంధ్రదేశంలోని అని తెలియవచ్చే పిథుండ, మూషికనగరాలు ధ్వంసం చేశాడు. శాతకర్ణి రెండశ్వమేధాలూ, ఒక రాజసూయం చేశాడు. శుంగులని ఓడించి మాళవం పట్టుకున్నందుకు ఒక అశ్వమేధం చెయ్యబడిందని అనుకున్నా, రెండవ అశ్వమేధమూ ఆపైన రాజసూయమూ అతను చెయ్యడం ఈ ఆంధ్రప్రాంతాన్ని తిరిగీ వశపరచుకున్నందువల్లనే అని చెప్పవచ్చునుకదా! సప్తశతికి సంకలనం చేసిన హాలుడనే మరి ఒక రాజుకు భీమేశ్వరక్షేత్రమైన సప్తగోదావరీ - ద్రాక్షారామంతో సంబంధం ఉన్నట్టు లీలావతీకావ్యంవల్ల తెలుస్తుంది. సుప్రసిద్ధుడైన గౌతమీపుత్ర శాతకర్ణి సామ్రాజ్యంలో మహేంద్రి, సిరితన, చకోర అనే విభాగాలు గల తూర్పుకనుములు చేరిఉన్నట్టు అతని తల్లి నాసికశాసనం చెపుతుంది. అతని పూర్వుల కాలంలో క్షహరాటులనే విదేశీయులు మహారాష్ట్రాన్ని, మరికొంత పడమటి భాగాన్ని జయిస్తే, ఈ శాతకర్ణి క్షహరాటవంశాన్ని నిర్మూలించి, ఈ భాగాలన్నీ తిరిగీ వశపరుచుకున్నాడు. క్షహరాటాక్రాంతమైన ప్రాంతంలో దొరికిన ఈ రాజు శాసనాలలో మొదటిది 14వ రాజ్యసంవత్సరంనాటిది. అంతకుపూర్వం ఈ రాజు మహారాష్ట్రాదన్యమైన ఆంధ్రదేశంలోనే పరిపాలించాడనీ, ఇది అతనికి నిలిచి ఉండిన పైతృక రాజ్యభాగమనీ స్పష్టమవుతుందికదా! ఇటీవల గుంటూరు జిల్లాలో నాకు ఇతని నాణెములు చాలా

దొరికినవి. ఈమధ్య నైజాం రాజ్యంలో కొండాపురం, ఫణిగిరి మొదలైన చోట్ల ఖననం చేస్తే దొరికిన అవశేషాలలో గౌతమీపుత్రుడి నాణెములు చాలా ఉన్నవి. ఇతని కుమారుడైన మొదటి పులోమావి ఆంధ్ర మహారాష్ట్రాలు రెండింటినీ పరిపాలించాడు. తండ్రి గాని, కొడుకు గాని ఆంధ్రదేశాన్ని జయించినట్లు తెలిపే ఏ ఆధారమూ లేదు. పైగా క్షహరాటులు పశ్చిమాన విజృంభించిన కాలంలో శాతవాహనులు ఆంధ్రాన్ని జయించి ఆక్రమించినట్లు లేదు. వారు తమ సామ్రాజ్యంలో ఒక భాగం పోతే మరిఒకభాగం పరిపాలిస్తూ వచ్చినట్టే కన పడుతుంది. ఆంధ్రదేశం శతాబ్దాలుగా ఈ ఆంధ్రరాజవంశం పాలనలోనే పారంపర్యంగా ఉండింది. మహారాష్ట్రంమాత్రం చేతులు మారుతూ వచ్చింది. మరిఒక విషయం. ప్రాగాంధ్రదేశంలో అమరావతీ, భట్టిప్రోలూ మొదలయినచోట్ల ప్రశాంతమైన జీవితం సాగి, సంఘారామాలు బయలుదేరి సుప్రసిద్ధములయిన చైత్యాలూ, మహాచైత్యాలూ నిర్మించబడినవి. ఈ ప్రాంతంమీద శాతవాహనులకు పూర్వం గాని, వారికాలంలో గాని మరి ఏ రాజవంశంవారూ ఏలినట్లు కనపడదు. ఈ ప్రాంతం అస్వామికంగానే ఉంటే ఇక్కడ జగత్ప్రసిద్ధమైన అమరావతీ శిల్పకళ శతాబ్దాలకాలం వర్ధిల్లి పరిణతి చెందడం, విస్మయజనకములైన కట్టడములు నిర్మించబడడం జరిగిఉండేవా ?

ఈ చర్చకే ఫలితంగా అతి ప్రాచీన కాలంనించీ, దక్షిణాపథంలోని ప్రాఙ్మధ్య భాగాలు ఆంధ్రుల నివాసస్థానంగా ఉండి ఆంధ్రదేశమని ప్రసిద్ధికెక్కినవనీ, అశోకుడి మరణానంతరం ఈ ఆంధ్రప్రజ శ్రీముక శాతవాహనుడి నాయకత్వంకింద మహారాష్ట్రాన్ని జయించి యావద్దక్షిణాపథ వ్యాప్తమైన సామ్రాజ్యాన్ని నిర్మించారనీ, ఈ ఆంధ్ర శాతవాహన సామ్రాజ్య శీతలఛాయలో ఉండి రాజకీయరంగానికి సుదూరంగా ఉన్న పవిత్ర కృష్ణవేణీ తీరాన ఆనాటి ఆంధ్రులు మహోజ్జ్వలమైన సాంస్కృతిక జీవితాన్ని పెంపొందించుకుంటూ, శతాబ్దాల శాంత్యనుభవానికి ఫలితంగా లోకానికి అపూర్వమైన ఒక విశిష్ట కళాసాంప్రదాయాన్ని కానుకగా అర్పించారనీ నిస్సందేహంగా చెప్ప వచ్చును.



# ఆంధ్రదేశము - వేదప్రచారము

— ★ శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ★

ఆంధ్ర శబ్దము తొలుత జాతివాచకము. పిమ్మట దేశవాచకము. తరువాత భాషావాచకమును అయ్యెను.

జాతివాచకముగా నుండినపుడు ఆంధ్రులు యమునానది 'పుష్కరతీర్థ' ప్రాంత దేశమున (ఇది 'ఢిల్లీ' పట్టణ ప్రాంతమని దేశము) విశ్వామిత్ర శాపహతులై చెల్లాచెదరైరి. అందు ఆపస్తంబాదులు 'యమునా'తీరమునందలి 'సాల్వ' దేశమునందు 1 'యుగంధరి' మహారాజుచే పాలింపబడుచుండిరి. కాలాంతరమున నా యాంధ్రులు 'ఆర్యావర్తము' నుండి యున్నట్టొత్తిడిచే దక్షిణాపథమునందలి 'ప్రతిష్ఠానపురి' రాజ్యమును క్రీ. పూ. 4, 3, 2 శతాబ్దములలో స్థాపించి 'ఆంధ్ర శాతకర్ణులు' అని పేరొందిరి.

శాతకర్ణులు రాజ్యపాలకులగు బ్రాహ్మణులు. సౌరాష్ట్రాది దేశముల నేలిన 'సహపాన'నాదులును, 'ఉజ్జయిని' రాజధానిగా 'మాళ్వాది' దేశముల నేలిన 'చస్తనుని' వంశజులును శాతకర్ణులవలె బ్రాహ్మణ రాజులే. ఈ బ్రాహ్మణులు రాజ్యమేలుట 'హస్తిపురి'గంగాప్రవేశముగాఁగా (జనమేజయునికి 4వ తరమున) రాజ్యభ్రష్టుఁడగు 'నిచక్షుని' (శ్రోత్రియుఁడని పాణినియశే...) ఆతని పుత్రులగు 'అజపార్శ్వ' 'శౌనక, వైణ్యాదులు' అను ఋషులు, 'కౌశాంబి' నగరమున నుండి విభిన్నమైన రాజ్యము లేలిన 'మాహిష్మతి' నాటి ప్రభువులైన నాటి వంశమునఁ గలరు.

ప్రతిష్ఠానాది మహారాజ్యములను స్థాపించిన అపురాణమె చెప్పుచున్నది.

ఈ బ్రాహ్మణరాజులను అసహ్యించుకొనుచు 'విష్ణు, భాగవతాది' పురాణకర్తలు ... గనుక 'వ్రాత్యబ్రాహ్మణులు' సౌరాష్ట్ర దేశముల నేలుదురని ఈసడించి వ్రాసిరి.

ఈ వ్రాత్యబ్రాహ్మణులనఁబడువారి లోనివారే 'ఆంధ్ర శాతకర్ణులు'. వీరు 'చైత్య' (యజ్ఞవేదిక) చిహ్నము గల పతాకమును ధరించిరి. నాణెములలో చైత్య చిహ్నమును వేయించిరి. చైత్య చిహ్నము 'బౌద్ధమత చిహ్న'మని పెక్కురు భ్రమనొందుచున్నారు కాని 'ఆపస్తంబ, ఆశ్వలాయనాదుల' శ్రౌత సూత్రములఁ జదివిన నట్లు తలంపరు.

1 ఆపస్తంబమహర్షి యుగంధరి కాలమున సాల్వదేశమునందుండినట్లు 'ఏకాగ్నికాండ మంత్రప్రశ్న'ములవల్లను, వ్యాకృతమగు నవకథామంజరివల్లను తెలియఁగలదు.

'సహవాన, చష్టన, శాతకర్ణ' శాఖల వారి పూర్వులు పశ్చిమదిశనుండి 'డెరయస్ మొదలగు పాశ్చాత్యుల యొత్తిడికి తాళలేకయు, తూర్పున 'కోసల, మగధాది' దేశీయుల బలములను జయింపలేకయు, క్రీ. పూ. 6-2 శతాబ్దముల నడిమికాలమున దక్షిణాపథ రాజ్యములను స్థాపించినట్లు కాన్పించుచున్నది.

పై శాతకర్ణులు గోదావరీ తీరమున ప్రతిష్ఠానపుర రాజ్యమును స్థాపించునప్పటికి నేడు ఆంధ్రదేశము అని చెప్పబడు ప్రదేశము 5 విభాగములుగా 'అనార్యులు' లేక 'దేవయోనులు' 2 అనబడు జాతుల వారి యాధీనమున నుండినవి. అవి 'కళింగము, వేంగి, తెలుంగు, ములకనాడు' అనబడు పేరులు కలవి.

అనార్యుల యొక్క మతములు మొదట నెట్టివైనను 'ఖారవేలుడు' అను కళింగదేశ ప్రభువు యొక్క రాజ్యకాలమున 'జైన' మతము ఉత్తరాంధ్రమున బ్రవేశించి అత్యభివృద్ధినొందినది. ఇంచుమించుగ ఆ కాలముననె బౌద్ధమతమును మధ్యాంధ్రమున (కృష్ణాతీరమున) 'కబ్బెరలు' అనబడు కుబేర యక్షజాతిప్రభువుల పాలనమున ప్రవేశించి వృద్ధినొందినది.

'నిషాదస్థపతులు' 3 అగు పై రాజన్యుల కాలమున వేదమెట్లీ యాంధ్రభూమిలోఁ బ్రవేశించును.

నేఁటి 'ఆఫ్రికా' మొదలగు నీగ్రో జాతులవారిలో 'క్రైస్తవ మహమ్మదీయ' మతము లభివృద్ధినొందినట్లు 'జైన, బౌద్ధ' మతములే ఆ ప్రాంతములలో ప్రవేశించి యభివృద్ధి నొందినవి.

ఇట్లుండ శాతకర్ణుల ప్రభుత్వము పశ్చిమాంధ్రమున "గౌతమీపుత్ర శాతకర్ణి" కాలమందత్యంతము సౌరాష్ట్రాది పశ్చిమ భరతఖండమునకే గాక ప్రాచ్యమున్ గళింగము మహేంద్రగిరి మొదలు నల్లమలల వఱకు (కృష్ణగిరి) దక్షిణభాగమునను వ్యాపించినది. అపుడె మన దేశమునకు ఆంధ్రదేశము అను పేరు కల్గినట్లు కాన్పించును.

ఆ గౌతమీపుత్రుఁడె ఆర్యావర్తమునుండి ఆంధ్రదేశమునకు వచ్చిన బ్రాహ్మణులు సాంకర్యము నొందని నిబంధనముల నేర్పఱచి యున్నాఁడు. 4

ఆర్యావర్తమునుండి శాతకర్ణుల రాజ్యమునకుఁ బ్రవేశించిన బ్రాహ్మణులు తైత్తిరీయ శాఖకు (యజుర్వేదభాగము) చెందినవారుగను, ఉజ్జనీ ప్రాంతమునకు 'కఠ'

2 (1) విద్యాధరులు, (2) అచ్చరలు, (3) జక్కులు, (4) రక్కసులు, (5) గోండులు, (6) కచ్చెరలు, (7) కిన్నరులు, (8) పిశాచులు, (9) తెలుంగులు, (10) ఎరుకలు, (11) మేదరులు మొదలగువారు.

3 నిషాదస్థపతి శబ్దమునకు మూఁడువిధములగు నర్థములున్నవి. (1) నిషాదుఁడైన రాజు, (2) నిషాదులకు రాజు, (3) నిషాదుఁడు రాజుగాఁ గల జనుఁడు. పై యర్థములలో మొదటి రెండర్థముల నిట గ్రహింపవచ్చును.

4 గౌతమీపుత్ర శాతకర్ణియొక్క 'నాసిక' శాసనములలో పై యంశములు కలవు.

శాఖీయులును, సౌరాష్ట్ర మహారాష్ట్ర దేశములకు 'కాలాప' మైత్రాయణీయ శాఖీయులును, అగు బ్రాహ్మణులు చేరినట్లు 'చరణవ్యూహ, చరణవ్యూహపరిశిష్టము' అను గ్రంథములవలనఁ దెలియవగుచున్నది.

మఱియు సామవేదశాఖలలో ఆంధ్రదేశమునందు 'కౌథుమ' శాఖయు, మహారాష్ట్రమునందు 'రాయణ' శాఖయు, కర్ణాటకదేశమందు 'జైమిని' శాఖయు బ్రాహ్మణములలో వ్యాపించినవని పై చరణవ్యూహ, చరణవ్యూహపరిశిష్టములే స్పష్టపఱచుచున్నవి.

అధర్వవేద శాఖలలో 'శౌనకశాఖ' కాశ్మీరాదిదేశములలోను, దక్షిణాపథమునను సమానముగానే వ్యాపించినదిగానీ, 'పైప్పలాద' శాఖ ఆపస్తంబమహర్షిచే గౌరవింపఁబడినట్లును, ఆంధ్రదేశమున ప్రాచీనకాలముననే ప్రవేశించి వ్యాపించినట్టును, ఆపస్తంబుఁడు వనధర్మసూత్రముత్రములలో 'ప్రాచ్యపూజా' సందర్భమున శౌనకశాఖలోని విపులమగు ప్రాచ్యసూక్తసమితినిగ్రహింపశక్తముగానున్న పైప్పలాదశాఖలో ప్రాచ్యపూజా విధానమున్నే గ్రహించుటచేతను, ఆంధ్రదేశస్థులగు బ్రాహ్మణులు నేటికిని చేయు 'బ్రహ్మయజ్ఞము'నందు నాల్గువేదముల ప్రారంభ మంత్రములఁ జెప్పుటలో ♦ అధర్వవేదాది మంత్రముగా పైప్పలాద శాఖకు, ఆది మంత్రమగు "శంనో దేవీరభీష్టయ" అను మంత్రమును చెప్పుటయు, ఆంధ్రులకు, అధర్వశాఖ 'పైప్పలాద' శాఖయే యని స్పష్టమగుచున్నది.

ఈ అధర్వశాఖీయులు (అధర్వచరణులు) క్రీ. శ. 10 శతాబ్దివఱకు ఆంధ్రదేశమున నుండినట్లు కొన్ని 'తామ్ర, శిలాశాసనముల'లోని దానప్రతిగ్రహీతుల పట్టికలవల్ల తెలియనగుచున్నది.

ఎందులకై వేదములు- అందు కృష్ణయజుర్వేదము- (తైత్తిరీయశాఖ) అవసరమో, అట్టి యజ్ఞకర్మములును మన యాంధ్రదేశమున శాతకర్ణుల కాలముననే- ఆమహారాజులచేతనే ప్రవేశపెట్టఁబడెను, ఆంధ్ర శాతకర్ణులలో, 'యజ్ఞశ్రీ శాతకర్ణి, వేదశ్రీశాతకర్ణి' అను వారు నిత్యాగ్నిహోత్రులు, వేద పాఠకులుగాను నుండిరని వారి శాసన, నామముల వల్లనే స్పష్టముగాఁ దెలియనగుచున్నది.

ఇట్లని వారు తత్పూర్వము దేశమున వ్యాప్తమై జనసామాన్యముయొక్క పారమార్థికదృష్టి కనువగు 'బౌద్ధ, జైన మతములను' నిరసింపక దానికిని దోహదమును నిచ్చి స్తూపాది నిర్మాణములకుం దోడ్పడిరి. తమ వైదికమతమును, బ్రహ్మక్షత్రియజాతులలో వృద్ధియగునట్లుచేసిరి. సర్వమతసామరస్యమన నిట్టిదే కదా!

♦ శిష్టులగు నాంధ్రబ్రాహ్మణులు బ్రహ్మయజ్ఞముఁ జేయునపుడు, ఋగ్వేదాది యగు 'అగ్నిమీడే పురోహితం' అనియు, యజుర్వేదాది యగు 'ఇషేత్వా' అను మంత్రమును సామవేదాది గల 'అగ్న ఆయాహి వీతయే' అనుదానిని గ్రహించి, 'శంనో దేవీ' అను పైప్పలాద శాఖా మంత్రమును గ్రహింతురు.

జగత్ప్రసిద్ధింగన్న "నాగార్జునుఁడు" గోతమీపుత్ర శాతకర్ణికాలపువాఁడే యని లోకప్రథ కలదు. బ్రాహ్మ్యము సాంకర్య మొందకుండ శాసనములొనర్చిన గోతమీపుత్రుఁడు, లోకప్రసిద్ధిఁగన్న నాగార్జునుని మతప్రచారమునకు- అతని మహాస్తూపాది నిర్మాణమునకుఁ దోడ్పడి, జనులు కొన్ని విధములగు పన్నుల నీయనవసరము లేదని శాసనము లొనర్చుట మహోత్కృష్ట మనుటకంటె నాతని యనూహ్య పరిపాలనావిధానముయొక్క మహిమము నేమని పొగడవలెను?

గోతమీపుత్రుఁడు, గోదావరీనదిని, తనతల్లి పేరితో గౌతమీనదిగా (నేటి వారు బకింగ్హాంకెనాలు, హుస్సేన్ సాగర్, కృష్ణరాజసాగర్ వలె) మార్చెనట.(6)

పై కారణములచే మన యాంధ్రదేశమునందు ఆర్యమతచిహ్నములు- అందు వేదప్రచారకులగు బ్రాహ్మణులు ప్రవేశించుట- వేదముల ప్రయోజనమగు యజ్ఞకర్మ లొనర్పఁబడుటయు- ఆంధ్రశాతకర్ణుల కాలముననే ఇప్పటికి పదునెన్మిది శతాబ్దములకుఁ బూర్వమే జరిగినది.

శాతకర్ణులనాఁడే గోదావరీ తీరమున వేదపాఠకులగు బ్రాహ్మణులు ప్రవేశించిరో ఆగోదావరీ తీరమున నిప్పటికిని వేదపాఠము- సుస్థిరమై - సుస్పష్టమై - సుస్వరయుక్తముగా, లోకప్రసిద్ధి నొందియే యున్నది.

ఆంధ్రశాతకర్ణులు రాజ్యచ్యుతినొందిన పిమ్మటను, ఆంధ్రావనిఁ బాలించిన 'శాలంకాయనాది' ప్రభువుల కాలమున వేదమాత, ఈదేశమున నెట్లు ప్రచారమయ్యెనో తెలియదు. కాని శాలంకాయనులు, మహర్షిగోత్రనామములఁ గలవారును వేదమును వృద్ధినొందించిరనియే చెప్పవలసియున్నది.

శాలంకాయనులకుఁ బిమ్మట, ప్రాగాంధ్రమును విష్ణుకుండినులును, పశ్చిమాంధ్రమును చాళుక్యులును పాలించిరి. ఆకాలమునందు ఉత్తర హిందూస్థానమున 'కనోజ్' ప్రభువులు- అందు శ్రీహర్షుఁడు బౌద్ధమత ప్రధానయజ్ఞములఁ జేయుచుండుటచేత, అతనికి పోటీగా వైదికమత ప్రచారమొనర్పుచున్నారా? అనునట్లు చాళుక్యులు (పులికేశి) విష్ణుకుండినులు (మాధవవర్మ) అశ్వమేధాది మహాయజ్ఞముల నొనర్చి 'బోధాయనాది' మహర్షులచే అపవిత్రదేశముగాఁ దలఁపఁబడిన ద్రవిడావని మహాపవిత్రప్రదేశముగాఁ జేయఁబడినది. అందు 'విష్ణుకుండిన మాధవవర్మ' పదునొకండశ్వమేధయాగములును, నరమేధమును, చేసియున్నాఁ డనుటకంటె నాతని వైదికమతోద్రేకము వేఱుగఁ జెప్పవలయునా? (7)

ఇంతమాత్రమె కాదు. విష్ణుకుండినులు చాళుక్యులును, బ్రాహ్మణవిద్యార్థులవలె 'పవిత్రపాణులై' విప్రవిద్యార్థులతోఁ గలిసి

(6) వాల్మీకి రామాయణమునందు గోదావరినదిని గౌతమినది యని చెప్పినట్లు కాన్పించదు.
(7) మాధవవర్మ, పొలమూరు, చిక్కూల శాసనములవల్ల పై యంశము తెలియఁగలదు.

'తైత్తిరీయ వేదము'ను గురువులకడఁ జదువుచుండిరి. ఇందులకు విష్ణుకుండినుఁ డగు మూఁడవ మాధవవర్మ తాను "శివశర్మ" అను బ్రాహ్మణునితో "తైత్తిరిక సబ్రహ్మచారి" ననియు, కుబ్జవిష్ణువర్ధనుని పుత్రుఁడగు 'జయసింహవల్లభుఁడు' తాను రుద్రశర్మకు తైత్తిరిక సబ్రహ్మచారి ననియు 'పొలమూరు' తామ్రశాసనములలో వ్రాసికొనుటయే నిదర్శనము. (సబ్రహ్మచారి యనగా సహాధ్యాయుఁడై వేదముఁ జదువుకొనుట)

రాజరాజనరేంద్రుడు, ఆంధ్రభాషను పోషించినట్లే వేదవిద్యను గూడ పోషించెను. "బ్రహ్మరాజ" బిరుదము (8) గల 'ఆరెయ్య' అను గొప్ప వేదపండితునకు విశేష భూదాన మిచ్చినట్లు ఇటీవల 'భారతి'లోఁ బ్రచురింపఁబడిన 'మండ' తామ్రశాసనమువల్ల తెలియనగుచున్నది.

చాళుక్యులలో కుబ్జవిష్ణువర్ధనుని రెండవ పుత్రుఁడును, ఆఱుమాసములు మాత్రమే రాజ్యమేలినవాఁడు నగు "ఇంద్రవర్మ" వాజసనేయశాఖ (శుక్లయజుర్వేదము) చదివిన 'చండిశర్మకు' బ్రహ్మదేయముగా (వేదవిద్యకై) 'ఇర్బలి' అనుగ్రామమును క్రీ.శ. 663 సం.రమున, దానమిచ్చినట్లొక తామ్రశాసనము కలదు. ఇంతకుపూర్వ మీ యాంధ్రావనిలో శుక్లయజుర్వేద వేత్త ప్రశంస కానరాదు.

రాజనరేంద్రుని పౌత్రుఁడగు 'వీరచోడుఁడు' 553 మంది నానావిధ వేద శాస్త్రములఁ జదివిన బ్రాహ్మణులకుఁ మూఁడగ్రహారము లిచ్చిన 'పిఠాపుర శాసనము' అఱువదిమంది పైయట్టిబ్రాహ్మణులకే 'ఏఱుపల్లి' అను గ్రామమును దాన మిచ్చిన 'మల్లవిష్ణువర్ధనుని శాసనము'ను ఈయాంధ్రదేశమున వేద ప్రచారమున కెట్లు ప్రాచీన ప్రభువులు ప్రోత్సాహ మిచ్చినదియు విశదము కాఁగలదు. 'తెలింగాణము' 'జైన, శైవ'మతములకు క్రీ.శ. 10-14 శతాబ్దములలోను, ఇటీవల 'మహమదీయమత'మునకును రాజ్యత్వ మొసఁగినను ప్రాచీనకాలముననే, తనలోని గోదావరీ తీరము నాశ్రయించిన వేదవిద్యను (తైత్తిరీయ శాఖను) వేరులు పారునట్లు దృఢముగఁ బట్టియుంచినదనుటకు, 'మంథెన, చెన్నూరు, ధర్మపురి' మొదలగు స్థలములలో మొన్నమొన్నటివఱకు ప్రసిద్ధికెక్కిన 'ఘనాపాఠీల' సంఖ్యయే నిదర్శనము.

ఆంధ్రమాత వేదవిద్యం గన్నతల్లి యనుటకు, వేదములన్నిఁటికి 'శాయనాచార్యులవారు' బుక్కమహీపాలుని కాలమున (క్రీ. శ. 1340-70 సం.) జగత్ప్రసిద్ధిం గన్న భాష్యములను వ్రాసిరనుట కంటె విశేష మేమి వ్రాయవలయును?

ఏదేని యొక గ్రంథమును కృతినొందిన మహారాజును చాల ఘనముగా మనము ప్రశంసింతుము - కాని 'బుక్కమహీపతియో' ఒకటియా? రెండా? నాల్గు వేదములు - పెక్కు బ్రాహ్మణములు - ఆరణ్యకములు - ఉపనిషత్తులు - పూర్వమీమాంస - ఉత్తరమీమాంస - ధర్మ

(8) బ్రహ్మరాజు అనగా వేదపాండిత్యమున రాజు. ఇది కవిరాజు బిరుదము వంటిది.

శాస్త్రము - ఇంక నెన్నియో మహా గ్రంథములను, భాష్యములను స్వనామాంకితములుగా జేయించుకొనెను.

ఇట్టి మహీపాలుని 'మాధవాచార్యుల వారు' ఎట్లు తమ గ్రంథాదుల సంకిత మొనర్చిరో చూతము.

శ్లో॥ యస్యనిశ్వసితం వేదాః యో వేదేభ్యో ఖిలంజగత్ । నిర్మమే తమహం వందే విద్యాతీర్థ మహేశ్వరం ॥

శ్లో॥ తత్కటాక్షేణ తద్రూపం దధద్బుక్క మహీపతిః । ఆదిశన్మాధవాచార్యం వేదార్థస్య ప్రకాశనే॥

తా. ఎవని నిశ్వాసమే వేదములో, ఎవడు వేదముల చేతనే జగత్తును సృష్టించెనో, అట్టి విద్యాతీర్థుడగు మహేశ్వరునకు వందన మొనర్తు.

ఆ విద్యాతీర్థ మహేశ్వరుని కటాక్షము చేతను ఆతని (దేవుని) స్వరూపమునే బుక్కమహీరాజు పొందియుండెను ఆ రాజు మాధవాచార్యుని(నన్ను) వేదార్థమును ప్రకాశింపజేయ నాజ్ఞాపించెను. ఇట్లు కృతులు నొందిన బుక్కభూపతి కంటెను ధన్యుడెవడు!

బుక్కరాజుయొక్క పుత్రుడగు రెండవ 'హరిహరరాయల' కాలమునను వేదశ్రౌతగ్రంథము లమితముగా నారాజ్యమున వృద్ధిగాంచెను.

'తాలికోట' యుద్ధానంతరము పశ్చిమాంధ్రమునను, తెలింగాణమునను, వేద విద్యాభివృద్ధి యంతగా కాన్పింపదు కాని 'గోదావరీ, కృష్ణా' నదీ ముఖద్వారములను (నేటి కృష్ణా, గోదావరీ మండలములు) తత్తత్కాలగు ప్రభువుల పోషణములచే 'వేదవేదాంగ విద్యలు' అమితముగ వృద్ధినొందినవి. 'శ్రౌత, స్మార్త' క్రియలకు సంబంధించిన 'అనుక్రమణికలు, పద్ధతులు, వృత్తులు, భట్టీయములు' పెక్కు పదులు గ్రంథాలు పండితులచే పై ప్రదేశములలో రచింపబడినవి.

ప్రాచీన కాలమునుండి నేటి వఱకు మా 'కోనసీమ' లో (అమలాపురము, రాజోలు తాలూకాలు) ప్రతి వత్సరము ఒకటి రెండు మహాయజ్ఞములు చేయబడుచు, వేదవిద్యయొక్క యుపయోగము చూపబడుచునే యున్నది.

కాని, ఈ శతాబ్దాదిని ఏబది మొదలు రెండువందలవఱకు నుండిన వేదపండితులు గల కోనసీమాగ్రహారములలో నేడు నూటికి తొంబదిమందివఱకు తగ్గిపోవుట మాత్రము విచారకరము.

కర్నూలుమండలము చాల కాలము మహామదీయులచే పరిపాలింపబడినను 'వెలుగోడు, కురుకుంద, కరివేను' మొదలగు గ్రామములలో ఇప్పటికిరువదేండ్లకు పూర్వమువఱకు 'అధ్వర్యవము హౌత్రము ఔద్గాత్రము' మొదలగు శ్రౌతభాగములను పల్లించు విద్యార్థులు, చెప్పెడు గురువులు కలిగియుండుటజూచి ఆశ్చర్యానందముల నొందితిని.

గత శతాబ్దాంతమువఱకు 'గోదావరీ మండలము వేదవేదార్థములు చెప్పుటకును కృష్ణామండలము శ్రౌతకర్మములు చేయించుటకును, తగిన పండితులున్నారని ప్రసిద్ధి నొందినవి.

గోదావరీమండల పండితులకు 'పెద్దాపుర' సంస్థాన ప్రభువులగు 'వత్సవాయి జగపతులు' ఇచ్చిన మాన్యక్షేత్రము లమితములు.

'బోధాయనమహర్షి' మొదలు తెనాలి రామకృష్ణకవివఱకు 'అబ్రాహ్మణదేశము, అవినీతికరదేశము' అని నిందింపఁబడిన కళింగాంధ్రము (నేటి విశాఖపట్టణపుజిల్లా) కళింగగజపతుల కాలమువఱకు వేదపండితులు నివసించినట్లు కాన్పింపదు. 'ఖారవేలుఁడు (క్రీ,పూ.2 శతాబ్దము) మొదలు గజపతుల పాలనము (క్రీ. శ. 15 శతాబ్దము) నఱకు, తత్రత్యప్రభువు లొసర్చిన దానధర్మాలు 'జైనులకో, శైవ, వైష్ణవ దేవుళ్ళకో' మాత్రమేకాని వేద శ్రౌతశాస్త్రపండితుల కొసర్చినట్లు లేదు (9) కాని కళింగగజపతులు వేదవేదాంగములను నేర్చిన పండితులకు అగ్రహారాదుల నీయ నారంభించిరి. పిమ్మట (క్రీ. శ 16 17, 18 శతాబ్దములలో) దానవీరులలోఁ బ్రసిద్ధిఁగన్న 'పెద్దాపురసంస్థాన ప్రభువులకు, పోటీపడిరా యనునట్లు విజయనగరసంస్థానప్రభువులగు 'పూసపాటిగజపతులు' అమితముగ వేదశాస్త్రములఁ జదివిన పండితులను కృష్ణా గోదావరీ మండలముల నుండి తమరాజ్యమునకు రప్పించి బహుళాగ్రహారముల నొసంగి వేదశాస్త్ర విద్యల నభివృద్ధిఁ జేసిరి.

గత శతాబ్దముయొక్క చివరభాగము మొదలు ఈ శతాబ్దాదివఱకు 'ఉర్లాం' సంస్థానమును (విశాఖపట్టణము జిల్లా) పాలించిన 'కందుకూరి బసవరాజుగారును, ఆయన కోడలు మహాలక్ష్మమ్మగారును' ప్రతివత్సరము శ్రావణపూర్ణిమకు వందలకొలది వేదవేత్తలను పరీక్షచేయించి 'వర్షాశనములు' ఇచ్చుచుండెడివారు. ఆ యుర్లాము పరీక్షకై కృష్ణా, గోదావరీ మండలముల నుండియేకాక 'మంథెన' వంటి దూరదేశములనుండి కూడ వేదవేత్తలు వచ్చుచుండుట నాకు దెలియును.

ఇట్లు బహువిధముల మన యాంధ్రదేశమున ప్రచారమొందిన వేదవిద్య, 'శ్రుతి' యనునదిగాఁ గాక (విని వల్లించుకొనునది) పాశ్చాత్య విద్యా విజృంభణముచే స్వల్పీకృతమై పాఠ్యగ్రంథముగా నుండు స్థితికి వచ్చుచున్నది.

ఇంకను 'బందరు' మొదలగు చోటులలో వేదపాఠశాలలు నడుపఁబడుచుండుట ప్రశంసనీయము.

ఆంధ్రదేశీయులు వైదికగ్రంథములఁ బ్రచురింప నంతగాఁ బ్రయత్నింపలేదు గాని, గత శతాబ్దాంతమున 'మన్నవ బుచ్చయ్యపంతులు, ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజి'గార్లు కొన్ని వేదగ్రంథములఁ బ్రచురించిరి. ఇపుడు 'వినయాశ్రమము వారు' ప్రచురించుచున్నారు - ఈ ప్రచారకులలో శుక్ల యజుర్వేద (కాణ్వశాఖ) సంహితాబ్రాహ్మణములఁ బ్రచురించిన మన్మిత్రులగు 'భాగవతుల లక్ష్మీనరసింహశాస్త్రి'గారి పరిశ్రమముమాత్ర మతి శ్లాఘ్యమైనదనియు, అనన్యసామాన్యమైనదనియు చెప్పవలసియున్నది.

(9) చూ. సౌతిండియన్ ఇన్‌స్క్రిప్షన్సు, 4,5,10 వాల్యూ॥ (మద్రాసు గవర్నమెంటు ప్రచురణము).

# పద్యచూడామణి

శ్రీ తల్లావజ్ఝల శివశంకర శాస్త్రిగారు

[ ౧ ]

ఆంధ్రదేశములో సంస్కృత పండితుల దృష్టిపద్యచూడామణిమీద పడినట్లులేదు. పది సర్గలతో, ౬౪౧ పద్యములలో నిబద్ధమయిన ఈ సంస్కృత మహాకావ్యము బౌద్ధాచార్యుని కృతి. గ్రంథభాగములో కవి నిజనామము ఎక్కడా చెప్పుకోలేదు. ఆదిలో బుద్ధభగవానునికి నమస్కార శ్లోకము చెప్పి, కవి వినయసూచకముగా రెండుపద్యాలు మాత్రము రచించినాడు.

యస్యైకదేశం యతయోఽపి వక్తుం
నాలం బభూవుర్నవినాసనాద్యాః
శాస్తుస్తదేతచ్చరితావదానం
వక్తుం మనీషా మమ మౌగ్ధ్యమేవ.
తథాఽపి తత్రాహిత భక్తిశక్త్యా
తదేత దాఖ్యాతు మహం ప్రవీణః
తథా హి! తత్పాద సమాశ్రయేణ
రజోఽపి లక్ష్మీం కురుతే హి పుంసామ్.

కాని, కావ్యాంతగద్యలో బుద్ధఘోషాచార్య విరచిత మని కనబడుచున్నది.

పాలివాఙ్మయములో బుద్ధఘోషుని నామధేయము సుప్రసిద్ధము. బర్మా, సయాం, సింహళదేశాలలో ఆయన జగద్విదితుడు; సింహళములో సద్ధర్మద్వితీయ స్థాపకు డని సర్వజనాంగీకృతుడు. ప్రథమతః ఆయన బ్రాహ్మణు డనీ, మహావిద్వాంసుడై వాదప్రతివాదములలో బహుపర్యాయములు పరపక్షనిర్ణయము చేసినవా డనీ, కాలక్రమేణ బౌద్ధమతావలంబనము చేసి, ఆచార్యు డయినా డనీ పురాతత్త్వవేత్తలు లిఖించినారు. బుద్ధఘోషుడు మగధదేశవాసి అని కొందరూ, మర్తబాన్ సమీపమున ఉన్న తాటాన్ నివాసి అని బర్మావారూ లిఖించారు. అయితే తైలంగుల ఐతిహ్యములు చాలా విశ్వాసపాత్రము లని ఒకానొక చరిత్రకారుడు చెప్పినాడు. ఆ వ్రాతల ప్రకారము బుద్ధఘోషుడు తాటానులో జన్మించిన బ్రాహ్మణుడు. మతాంతరుడై నతర్వాత కైలాస మఠములో ఉన్నాడట. ధర్మపాలప్రభువు ఆయనను త్రిపిటకములు తెమ్మని సింహళము పంపినాడు. బుద్ధఘోషుడు బాసిన్ రేవులో పడవ యెక్కి తామ్రలిప్తి చేరి, గంగామార్గాన గయాక్షేత్రము వెళ్ళి, పవిత్రప్రదేశాలపటములు సేకరించినాడు, తర్వాత సింహళము వెళ్ళి మూడుసంవత్సరాలు ఉన్నాడు. అనురాధపురములో విశుద్ధిమార్గగ్రంథము వ్రాసినాడు. సింహళమునుంచి త్రిపిటకములు, వాటివ్యాఖ్యలు, తైలింగాక్షరములలో వ్రాసిన

అన్యగ్రంథాలూ తాటానుకు తెచ్చినాడు.

ప్రసిద్ధ చీనాయాత్రికుడు ఫాహియాన్ సింహళము క్రీ. శ. ౪౧౨ లో చేరినాడు. బుద్ధఘోషుడు క్రీ. శ. ౪౦౩ లో వెళ్ళినాడు. క్రీ. శ. ౪౮౯ లో సంఘభద్రుడు బుద్ధఘోషుని సమంతపాసాదికా గ్రంథాన్ని చీనా భాషలోకి అనువదించినాడు. ఈ కర్తలనుబట్టి బుద్ధఘోషుడు క్రీ శ ౫ శతాబ్దివాడని ఐతిహాసికులు నిర్ధారణ చేసినారు.

[౨]

త్రిపిటకములో గౌతమచరిత్ర లలిత విస్తరము, అశ్వఘోషుని బుద్ధచరితము, పద్మచూడామణికి ఆధారాలు. సిద్ధార్థుని జన్మాదారభ్య సంబుద్ధివరకూ జరిగిన కొన్ని ఘటనలు ఈ కావ్యములో నిబద్ధమయినవి. శాక్యప్రభువు శుద్ధోదనుడు కపిలానగరము పరిపాలిస్తున్నాడు. ఆయన భార్య మాయాదేవి. సంతానము లేనందున వారు తీర్థసేవన జప దానాదులు చేశారు. దేవతల ప్రార్థనలవల్ల తుషితాధిపతి భూలోకాన్ని ఉద్ధరించడానికి మాయాదేవికి శిశువుగా జన్మించినాడు. కుమారుని జననకాలములో విశేషాలు సంభవించినవి. శిశువుకు సిద్ధార్థుడని నామకరణము జరిగింది. కాలక్రమేణ తండ్రి పుత్రునికి యౌవరాజ్యాభిషేకము చేసి వివాహముసంగతి ఆలోచించినాడు. కోలియ రాజపుత్రిని ఇచ్చి సిద్ధార్థునికి పెండ్లి చేసినాడు. వరుడు వధూసమేతుడై నిజనగరానికి మహోత్సవానందముతో వచ్చినాడు. కుమారుని వినోదార్థము రాజు సమస్త సదుపాయములూ చేసినాడు.

వసంతఋతువులో ఒకనాడు సిద్ధార్థుడు ఉల్లాసముతో ఉద్యానానికి బయలుదేరినాడు. మార్గములో దేవతల నిర్ణయ ప్రకారము ఒకానొక వృద్ధుడు, రోగగ్రస్తుడు, శవమూ అతనికి కనబడినవి. తర్వాత సిద్ధార్థుడు తపోధనుని చూడడము సంభవించింది. అయినా రాజకుమారుడు ఉద్యానవనానికి వెళ్ళి వివిధ వినోదాలతో కాలము గడిపినాడు. రాత్రి వేళ ఏమి మనఃపరివర్తనము జరిగిందో! రహస్యముగా బయలుదేరి 30 యోజనాలు ప్రయాణము చేసి అనవమానది దాటి, అనుచరులను వెనకకు పంపి, సాధువేషము ధరించినాడు.

తర్వాత సిద్ధార్థుడు బింబిసారనగరములో భిక్షాటనము చేస్తూ కఠినతపస్సు చేసినాడు. మోక్షము లభించలేదు. ఆయన ఆలోచిస్తూ నిద్రపోయినాడు. అందులో అయిదు స్వప్నములు వచ్చినవి. వాటి సూచన ప్రకారము నిర్వాణమార్గము నిర్ణయించుకొని, వెళ్ళి వటవృక్షము కింద ఆసీనుడయినాడు. ఒకానొక పడతి అర్పించిన పాయసము స్వీకరించి ఆయన నైరంజనానది దాటినాడు. పగటివేళ అక్కడి సాంద్రసాలవనములో గడిపి, సాయంత్రము బోధివృక్షముకిందికి పోయి, దేవతాప్రస్తుతమైన వేదికమీద ఉపవిష్టుడయినాడు దేవతలు సిద్ధార్థుని స్తుతించినారు. మారుడు మాత్రము ఈ విషయము విని, ఆయనను జయించ

దలచి అనుచరులను పంపితే వారు ఏమీ చేయలేక పోయినారు. మారుడు స్వయముగా వెళ్ళినప్పటికీ మరలి రావలసి వచ్చింది. కడకు కామినులను పంపి సిద్ధార్థుని సమక్షములో చిత్రవిచిత్రనాట్యములు చేయించినాడు. వారు ఆయనను ఎంత ప్రలోభ పెట్టినా, ప్రయోజనము లేకపోయింది. సిద్ధార్థుడు ఇంద్రియములను జయించి బుద్ధు డయినాడు.

[3]

లలితవిస్తర గ్రంథములోను, అశ్వఘోషుని బుద్ధచరితలోను ఉన్న కథాభాగాలకూ, పద్యచూడామణిలో కథాంశాలకు కొంతకొంత భేద మున్న దని విమర్శకు లన్నారు. పై రెండుగ్రంథాలలోనూ సిద్ధార్థుడు జన్మించగానే అసితముని శుద్ధోధనునివద్దకు వెళ్ళి, శిశువును చూచి, ఆతడు సంసారము త్యజించి యౌవనములోనే విరాగి అవుతా డని చెప్పినాడు. ఈవిషయము పద్యచూడామణిలో లేదు. ఈ గాథ తెలుపనప్పుడు తండ్రి కుమారునికి త్వరలో వివాహము చేయవలె ననే ఆతురత గాని, సిద్ధార్థునికి నిరంతరవిలాసములు ప్రాసాదము లో సమకూర్చే సన్నాహము గాని సంబద్ధములు కానేరవు. పుత్రునికి ఏవిచారమూ కలగకుండా, ఏకష్టనిష్ఠురములు కనబడకుండా చేయడానికి రాజు యత్నించినట్టు పద్యచూడామణిలో కనబడదు. ఏవిధ మైన మనఃపరివర్తనమూ లేకుండా సిద్ధార్థుడు సౌధములోనుంచి సాంద్రారణ్యానికి వెళ్ళినట్టు రచించి ఉన్నది. ఆయన ఉద్యానానికి బయలు వెడలిన నాలుగుమార్గాలలో మూడుసార్లు దుఃఖఘట్టాలూ, తర్వాత తపోధనునీ చూచినట్టు అన్యత్ర వర్ణితము, వనదేవత కోసము తెచ్చిన పాయసము పొరపాటున సిద్ధార్థునికి ఒకానొక వనిత ఇచ్చినట్టూ, తర్వాత ఆయన నైరంజరానది దాటినట్టూ పద్యచూడామణిలో కనిపిస్తుంది. తక్కినవాటిలో నది దాటిన పిమ్మట పాయసప్రాప్తి వర్ణితము. తుషితాధిపతి లోకోద్ధరణార్థము మాయాదేవీ గర్భములో ప్రవేశించినట్టు బుద్ధచరితలో ఉన్నది. దేవతలు స్తుతించి ప్రార్థించిన పిమ్మట తుషితాధిపతి మాయాదేవీ గర్భములో చేరినట్టు పద్యచూడామణికర్త లిఖించినాడు. ఇటువంటివి అల్పభేదములు. బుద్ధఘోషాచార్యుని మతప్రకారము ఈ చిన్నమార్పులు కథలో కల్పితములు కావచ్చును ఒకవేళ జనశ్రుతినిబట్టి కవి మార్పులు చేసి, కథాసంధులను విడిచి పెట్టి ఉండవచ్చును.

[౪]

రఘువంశ, బుద్ధచరిత, పద్యచూడామణులలో కొన్ని కొన్ని సాదృశ్యాలు కనిపిస్తవి. కాళిదాసుని రఘువంశము చదివి అశ్వఘోషుడు బుద్ధచరితము రచించినాడు. ఉభయుల కావ్యములూ పఠించి బుద్ధఘోషుడు పద్యచూడామణి చేసినాడు. పై కవులు సంగ్రహముగా చెప్పినవి ఇతడు విపులముగా వర్ణించినాడు. ఇతని కావ్యములో కథాంశము చిన్న దన్నప్పటికీ వర్ణిస్తే

ప్రాధాన్యము వహించినవి. నగర, పర్వత, ఋతు, జలక్రీడా, సూర్యాస్తమయ, అంధకార, చంద్రోదయ, నదీ, స్తుతిప్రకార, గర్భవర్ణన, బాలావతారాదులు, రఘువంశ, బుద్ధచరిత, పద్యచూడామణులలో కొంతవరకు సమానముగా గోచరిస్తవి. అయితే దేని అందము దానిదే.

పద్యచూడామణి పంథా భారవి మాఘులకు మార్గదర్శక మేమో అనిపిస్తుంది. బుద్ధఘోషునివలె వారుకూడా కథాలేశాన్ని గ్రహించి వివిధరీతుల విస్తరించి మహాకావ్యము లల్లినారు.

ఈ కావ్యములో ఇంద్రవజ్ర, వసంతతిలక, ఉపజాతి, అనుష్టుప్పు విశేషముగానూ, వియోగిని, శాలిని, మాలిని, మందాక్రాంత, శార్దూలవిక్రీడితములు, సర్గాంతములోనూ కవి వాడినాడు. ఇతనికి వసంతతిలకమీాద ఎక్కువప్రీతి ఉన్నట్టు గోచరిస్తుంది.

బుద్ధఘోషుడు కొన్ని కొన్ని సంస్కృత శబ్దాలు విశ్వ, హేమచంద్ర, వైజయంతీ నిఘంటువుల అర్థ విధానములో వాడుక చేసినాడు. అంత = రమ్య; విభ్రమ = శోభ; వందనమాలికా = దామ; శృంగారిత = మండిత ; మందర = బహుల ; దారక = బాలక; రోమశ = నికషోపల; భిత్తి=ప్రదేశ; కౌతుక=ప్రతిసరసూత్ర; కాదంబ = బాణ; శర్కర=ఖండ; అంగపాలి = ఆలింగన; కంచులిక = కంచుక; మణీచక=పుష్ప; వేధ=అభిజ్ఞ; తగర= నంద్యావర్తపుష్ప - ఇత్యాదులు.

ఇతని రీతి చాలా మధురము. దీర్ఘ సమాసములు ప్రయోగించినా సరళముగానే ఉంటవి.

మందార కోరకస్యంది
మకరన్ద సుగన్ధిని
మదగన్ధవహాస్పన్ద
కన్దలీకృత కౌతుకే.

శబ్దాలంకారము చక్కగా కనబడుతుంది.

ఉత్ఫుల్ల మంజరీ పుంజ
పింజరీకృత సత్పథే
భ్రమద్భ్రమరఝంకార
హుంకార చకితాధ్వగే.

ప్రసిద్ధమైన అర్థాలంకారాలు అన్నీ పద్యచూడామణిలో అందందు గోచరిస్తవి.

ఆచార్య దండి నిర్వచనప్రకారము సర్గబంధములో అష్టాదశ వర్ణనలు ఉంటవి. అందులో కొన్ని ఇందులో లేకపోయినా ఇది గొప్పకావ్యమే. ప్రసక్తి లేనందున అర్ణవ, మధుపాన, రతోత్సవ, మంత్రి, దూత వర్ణనలు కనబడవు. విధించడానికి వీలు ఉన్నప్పటికీ బుద్ధఘోషాచార్యుడు విరాగి కావడముచేత మధుపాన రతోత్సవములు రానీయ లేదు ; సన్యాసి అని సామాన్య శృంగార ప్రశంస చెయ్యక పోలేదు.

ఈకావ్యము ఎక్కడ పట్టి చూచినా కమనీయము. అయితే కపిలానగర, శుద్ధోదన మాయాదేవి వర్ణనలు; తుషితాధిప, తుషితాధిప స్తోత్ర, అవతారకాల, రాజకుమారయౌవన, కోలియరాజ కుమారీ

అలంకరణ, వివాహవర్ణనలు, కపిలా స్త్రీల కుమారదర్శనము, ఋతూత్సవానుభవము వసంతకాలవర్ణన, ఉద్యానవర్ణన జలక్రీడ, సూర్యాస్తమయము. చంద్రోదయము, సేనాభిగమనము, యుద్ధారంభము చాలా చమత్కార ప్రదములు.

కావ్యానికి ఆద్యంతములలో బుద్ధభగవానుని ప్రశంస ఉన్నది.

కారుణ్య కల్లోలిత దృష్టిపాతం
కన్దర్పదర్పానల కాలమేఘమ్
కైవల్య కల్పద్రుమ మూలకన్దం
వన్దే మహాశకన్దల మర్కబన్ధుమ్.

♦ ♦ ♦

సిద్ధార్థ శ్చిరవాసనా పరిగతా
నుచ్ఛిద్య దోషద్విషో
ముక్తిక్షేత్రకుటుమ్బ రక్షణవిధా
మార్గాభిషిక్తో న భవత్.

[ ౫ ]

మన విద్వాంసులు చేసినదే తెలుగు చేయడముకన్న అనూదితము కాని సంస్కృతకావ్యాలు ఆంధ్రీకరించడము అవసరము. బుద్ధునికథామాధుర్యము చవిచూప దలచినవారు లలితవిస్తరము, బుద్ధచరితము, సౌందరనందము, పద్యచూడామణివంటి కావ్యములు తెలిగిస్తే మన సారస్వతము వన్నె కెక్కుతుంది. ఇతి శివమ్.



# హనుమంతరాయ ప్రశస్తి

"ప్రతి చిన్న విషయములోను కట్టుబాటు. అందు ఆవంత పొరపాటును గూడ గుమ్మడికాయంతగా జూతురు. సహింపనే సహింపరు. తమ యింటి లెక్క యెట్లో ప్రజానిధి లెక్కయు నట్లే. దమ్మిడీ దమ్మిడీ లెక్కపెట్టవలె. ఆ లెక్క సరిగా కుదరవలె. ఏదన్నీ వ్యర్థముగా పోరాదు. "ఆసొగొంది లెక్కలు" వారికి సరిపడనే సరిపడవు."

— సురవరం - ప్రతాపరెడ్డి.

# ఆంధ్రులు



★★
★

➔ శిరోమణి శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు.

అనాదివాచామాచార్యం
అనాదిం వేదసాదినం
అవార్య శౌర్యనీరన్ధ్రి
మన్థ్రి విష్ణునుహం భజే.

ఆన్ధ్రుల చరిత్ర మిదివరలో ననేకు లనేక విధముల నిరూపించి యున్నారు. అయినను వానియందు గల యరుచియే న న్నీ వ్యాసమును వ్రాయ బురికొల్పినది.

ఇచట పాశ్చాత్యుల యూహా కించుకయును జోటులేదు. మన ప్రాచీన గ్రంథములును, సామెతలును, మాటలును మాత్రమే ప్రమాణము. మనము సరిగా బరిశీలించినచో పై వానివలన కావలసినంత చరిత్రము లభించునని నా విశ్వాసము. నా నిరూపణములోని ప్రతి యంశమును పై వానిలోని దేనిచేనైనను నుపబృంహితీను. విద్వాంసులు పరిశీలింతురు గాక. నిర్మత్సరులగు విద్వాంసులు "నను వక్తృ విశేష నిస్పృహా గుణగృహ్యా వచనే విపశ్చితః" అని కదా నిరూపింప బడిరి. వారికొరకే యీ ప్రయాసమంతయు. వారి హృదయముల కొకింతయైన శ్రుతి విస్తర వికాసముల కల్పింపగల్గెనేని నా ప్రయాసము, నా పరిశ్రమ, నా విజ్ఞానము, ఇది యది యననేల! నా జన్మమే ధన్యమయ్యెనని భావింతును. ఇట్టి యవకాశమును నాకు కల్పించిన యీ సమాజ సభ్యులకు కృతజ్ఞత దెల్పి యసలు విషయము నుపక్రమింతును.

ఇప్పటివరకు దొరకిన ప్రపంచ గ్రంథ జాలములో నత్యన్త ప్రాచీనతమ మగు ఋగ్వేదమునకు బూర్వముననే మనము-అన్ధ్రులము ఉంటిమని నిదర్శనము కన్పట్టుచున్నది. ఎట్లనగా, ఋగ్వేదములోని ప్రథమ మండలమునకు ద్రష్ట మధుచ్ఛందుడు. అతడు "అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం హోతారం రత్నధాతమం" అను ఋగ్వేదారమ్భము నందలి సూక్తమునకు ద్రష్ట. విశ్వామిత్రుని నూటొక్క సంతానములో నేబది యొకటవవాడు. అతనికన్న పెద్ద లేబది మందియు జిన్న లేబదిమందియు సోదరులున్నారు. అతనికన్న పెద్దలగు "అష్టక, హారీత, జయన్త, సుమద"ఆదు లేబది మందియు విశ్వామిత్రుని శాపమువలన నన్ధ్రులు, పుండ్రులు, శబరులు, పులిందులు, మూతిబులు" అయిరని యైతరేయారణ్యకము తెల్పుచున్నది. "తస్యహ విశ్వామిత్రస్య ఏకశతం పుత్రా ఆసుః పంచాశ దేవజ్యాయాం సో మధుచ్ఛన్దసః, పఞ్చాశత్కనీయాం సః తద్యేజ్యాయాం సోనతే కుశలం మేనిరే, తానను వ్యాజహార అన్తాన్వః ప్రజాభక్షీష్టేతి, త ఏతేఽన్ధ్రాః పుణ్డ్రాః, పులిన్దాః మూతిబాః ఇత్యుదన్త్యా

బహవో భవన్తి వైశ్వామిత్రాః దస్యూ
నాం భూయిష్ఠాః (ఐతరేయబ్రాహ్మణం,
7 పం. 8 అధ్యాయము.) ఇందులో
"అన్త్రాన్, ఉదన్త్యాః, బహవః" ఈ పద
ములు ముఖ్యముగా పరిశీలింపవలసినవి.
"వః అన్త్రాన్ = మిమ్ములనంతా" అని
యర్థము తోచుచున్నది. "అంతా" అని
తెలుగులో సర్వవాచకమగు పదమే
సంస్కృతీకరింపబడి వాడబడెనేమో యని
తోచుచున్నది. ఇంకొకవిధముగా తృప్తి
కరమగు సమన్వయము కుదురలేదు.

మరియు "ఉదన్త్యాః=అనగా అగ్రాది
శబ్దము లన్నియు ఉకారాన్తములుగా స్వ
భావములం దున్నవి. ఇవి సంస్కృతములో
అకారాన్తములుగా వాడబడినవి. 'బహవః'
=అందరు అనగా 'అందరు' అను తెలుగు
పదమే సంస్కృతీకరింపబడి 'అన్ధ్ర' యని
అకారాన్తముగా గీర్వాణిలో వాడబడి
నట్లు స్ఫురించుచున్నది.

ఈయభిప్రాయము నింకను సోపపత్తిక
ముగా నిరూపింతుము: సంస్కృతములో
అకారాన్తములుగా నున్న శబ్దములు
సాధారణముగా దెనుగులో ఉకారాన్తము
లగును.

ఉదా: మార్గ = మార్గు, ధర్మ =
ధర్మువు. ఇంతేకాక పై పేరులలోనన్నియు
దెలుగుమాటలు కన్పట్టుచున్నవి. పుండ్ర=
"పుండరింపు" అను పదమొకటి తెను
గులో నున్నది. ఏదైన నొక జరిగిన విష
యమును ద్వేషముతో మాటిమాటికిని
కలకవేయునట్లు ఎదుటివారికి బాధకల్గు
నట్లుగా ప్రస్తావించుటను "పుండరింపు"
అందురు. దీనిలోని "మాటిమాటికి బాధ
కల్గించుట" యను ధర్మమును పురస్క
రించుకొని "పుండు" (గాయము) అను పద
మేర్పడినది. "శబర""సవరణ, సవరించు"
ఇత్యాది పదములు తెనుగులో నున్నవి
"సౌరు అనుపదియు నున్నది. ఈ "సౌరు"
అనుపదమే "సవర-శబర"గా గీర్వాణీక
రింపబడిన దని తోచును. 'వ' కారము
'బ' కార మగుటయు, 'స' వర్ణము 'శ' వర్ణ
మగుటయు నౌత్తరాహుల పలుకుబడిలో
విప్పుడును కన్పడుచునే యుండునుగదా!
"పులింద"=పులిని దా (రమ్మని) అని
పలుకు (తో ఎదుర్కొను) వారు అను
నర్థము స్ఫురించును. అయితే తెలు
గులో నిట్టి యర్థముగల పదములపోలిక
ఎచటనైన గలదా? యని శంకించినచో
"బాలింత" యను పదమును జూడుము.
"ఇంతబాల (శిసువు) కలది" యను నర్థ
ముతో ఆపదము ఏర్పడినది. ఇంతకన్న
గూడ స్పష్టముగా దెనుగులో "ఆరిందా"
యను పదమును గ్రహింపవచ్చును.
ఆరు=నూగారు, ఇందా=ఇదిగో ముట్టుకో"
యని చెప్పగలది. "ఆరింబా" అనగా
ఇచటి యితిహాసమంతయు నెరిగిన గాని
యిది చక్కగా దెలియదు. ఋగ్వేదములో
నొక మగడు పెండ్లాము వీరిరువురి సంభా
షణయు కలదు. ఎట్లనగా

"ఆగధితాపరిగధితా యాకశీకేవ జం
గహే దదాతిమహ్యాం యాదురీ యాశూ
నాం భోజ్యాశతా..."

అని మగడనగా భార్య

"ఉపోపమే పరామృశమామే దభ్రాణి

మన్యథాః సర్వాహమస్మిరోమశా గంధా రీణా మివా వికా" అని జవాబు చెప్పెను. దీని భావ మిది.

"వయసింకను సరిగా రాకయే నా భార్య నన్ను పునః పునః సంభోగార్థమై ఆడ ముంగివలె పట్టుకొని విడువదు. ఆమె కింకను సంభోగార్హమగు వయసురాలేదు" అని మగనిభావము. అందుకు భార్య జవాబిది: "నేను సంభోగార్హమగు వయసు కల్గియే యున్నాను. నన్ను బాగా అంటి ముట్టి తడివి చూడుము. గాంధార (కందహార) దేశస్థుల గొఱ్ఱెవలె నేను రోమపూర్ణురాలనుగా నుంటిని." (రోమములు -కేశములు కాదు - మొలచుట వయసు వచ్చిన దనుటకు గుర్తుగా సుప్రసిద్ధము కదా) అనును. ఇట్లు నన్ను తడివి చూచి రోమశత్వమును నిర్ణయించుకొను మనుటలో నామె రోమశత్వము నూగారు ద్వారానే యుచితముగా నిర్ణేయమగును గాని అన్యతః అనుచితమే కదా! అదియే తెలుగులో నతి ప్రాచీనకాలములో "ఆరు +ఇందా" అనగా "నేను వయఃపూర్ణను. ఇదిగో నా నూగారు నంటి చూడుము" అని చెప్పబడినది. ఆ యితిహాసభరితమే "ఆరిందా పదము", "పరిపూర్ణురాలు" అను నర్థములో క్రమముగా వాడుక యగుచున్నది. ఇట్లే "ముత్తైదువ" ఇత్యాది తెనుగుపదములందు వ్యుత్పత్త్యర్థ మూహింపవలసి యున్నది. ఇక "మూతిబాః" పదము. "మూతి" యను తెలుగు పద మిందు స్పష్టముగానే యున్నది. ఇట్లే ఆన్ధ్రులను గురించిన మరొక వృత్తాన్తములో దీర్ఘతముని పుత్రులగు అంగ, వంగ, అన్ధ్ర, ఆదులలో గూడ తెలుగు పదము లున్నవి.

అంగ=కాలి యంగ, వంగ = వంగుట ఇత్యాది. ఇవియే గైర్వాణిలో గలసి తద్భాషా పదములుగా వ్యవహరింపబడి నట్లుతోచును. గైర్వాణియందు భాషాన్తరీయ పదములు కలసినవనుటలో విప్రతిపత్తి యవసరము లేదు.

వేద పరిశీలకులలో నగ్రగణ్యులగు మీమాంసకులే యీవిషయమును జైమిని దర్శనమున మొదటియధ్యాయమూడవ పాదములో మ్లేచ్ఛ ప్రసిద్ధార్థాధికరణములో నంగీకరించియున్నారు. వారచట చేర్కొనిన కొన్ని పదములు తెనుగు పదములుగానె కన్పట్టును. గమనింపుడు.

పిక, తామరస, సత (దారుమయపాత్ర) ఇత్యాదు లచటివి. పికశబ్దమునకు ఆకులచాటుననక్కి కూయునది యని యర్థమును సాంస్కృతికులు చెప్పుచున్నారు. తెనుగులో పిక్కుట = తగ్గుట. ఇట్లే కాయలో దాగియుండునది గనుక పిక్క. (గింజకె "జీడిపిక్కలు" అని విశాఖపట్టం జిల్లా వాడుక.) ఇంతేకాక "గూఢజత్రుత" ఉత్తమ లక్షణముగా బరిగణింపబడుటవలన జత్రువు గూఢముగా గూడునది యను భావములో తెనుగులో జత్రువును - పిక్క యని వాడుదురు. "గూఢజత్రు రరిందమః" అని (శ్రీమద్రామాయణము.) సత = కొయ్యపాత్ర. సతాయించు (మాటిమాటికికొట్టు) అను పద మున్నది. కొయ్యతో కొట్టెదరు.

గనుక 'సత' శబ్ద మట్లు మారినదేమో ? ఇక 'తామరసం', వంటిమీద లేచునట్టి గుండ్రముగా నుండు నొక రకపు పొడ. ( ring-worm ) తామర యని తెనుగులో వాడుదురు దీ.తో సమానమగు నాకారముగలది గనుక మొదట "తామరసము" అను పదముండి అది క్రమముగా గైర్వాణిలో తామరసం అని మారి స్వీకరింపబడినదని తోచును. మఱియు తెనుగులో "తామరకొలను - తామరపర" అని తెలుగు పదముగానే అనగా తెనుగు పదములతో సమసించియే ప్రయోగము కన్పట్టుచున్నది ఇది గైర్వాణి పదము కాదనియు, భాషాంతరీయమనియు ప్రాచీను లొప్పుకొని యున్నారు. తెనుగున గాక ఇతరభాషలలో నీపద మీయర్థమున లేదు. తెనుగులో నున్నది. సంస్కృతము నుండి తెనుగునకు వచ్చినదగుచో "తామరసం" అని యుండుట సహజము. తెన్గున పద మట్లే కన్పట్టుచున్నదిగాదా? మఱియు నిది తెనుగు పదములతో నాచ్ఛిక సమాసములో సమసించి "తామరతంపర - తామరకొలను - తామరాకు" ఇత్యాదులగును గన్పట్టుటయు పై యూహకు ప్రోద్బలకమే కదా! ఇట్లే కొన్ని పదము లున్నవున్నట్లుగానే సంస్కృతములో స్వీకరింపబడినవి. "పోత, నేతి, మాంతి" పోత మరొక రూపమున అచ్చుపోయుట-కొడుకు తండ్రి రూపమునకు పోతయనుభావమున పోత = శిశువు(పోతః పాకోఽర్భకో డింభః పృథుకః శాబకః శిశుః. అమరము) "నేతి" యని యోగశాస్త్రములో నొక పనికి పేరు. తెనుగులో నర్థము తెలిసినదేకదా ! "మాత"=జామాతపదములో నున్నది. కొన్ని పదములు కొంచెము మార్చి స్వీకరింపబడినవి- నౌలి=నవులుట-ఔకారము తెనుగులో "అవు"గా మారునని తెలిసినదే. "నవులు"నే యోగశాస్త్రములో "నౌలి"గా గ్రహించిరి. రెంటియర్థ మొకటియే. (ఇప్పటి మనవారు 'నవులుట' తప్పనియు 'నములుట' సరియైనదనియు ననుకొనుట ఈపదతత్త్వము సరిగా నెఱుగకయే) ఈపై నిరూపణమంతయు బరిశీలించినవారికి తెనుగులోని పదములు గైర్వాణిలో కొంచెము సంస్కరించి స్వీకరించుట కలదని అంగీకరింపక తప్పదు. కనుక అట్లే "అందరు" అను తెనుగుపదమే "ఆంధ్ర"గా సంస్కరింపబడి గైర్వాణిలో స్వీకరింపబడెనని స్పష్టము. ఇట్లే తండర=తంద్రః - సంబగము=సంభ్రమము, నిబ్బరము = నిర్భ్రమము, సందడి=సముద్రము, నిప్పచ్చరము=నిష్ప్రచరము. ఇత్యాదులుగూడ గ్రహింపవలెను ఈసందర్భములో నొక మాట తెలియవలసి యున్నది "తెలుగు" అనునది "తిలుగు, తింగు" అనుశబ్దమునుండి "సరసా స్తిలవర్గావః ఋత్సత్రిపమ్ముస్రశః సదేశ స్తిలగుర్నామ" అను ప్రాచీనసూక్త్యనుసారముగ నుదయించి యుండవచ్చును గాని తెనుగు అనునదిమాత్రము "త్రినగ" శబ్దమునుండి పుట్టినదనుట తప్పు. ఏమనగా- "తెనుంగు" అను బిందు వెట్లేర్పడును! మఱియు "తెన్" దక్షిణము అగు- తెనుగు అను వ్యుత్పత్తి సరిగాగన్పడుచున్నది. (తెంగళులు=టెంకాయ)'ను'

అనుచోట ఉకారము 'గు' వర్ణములోని యకారమునుబట్టి వచ్చినది. ఇది భాషా తత్త్వపరిశోధకు లెఱింగినదే.

ఇట్లే "అడి=పాదము-అగు - అడుగు" యాదించువాడు లోకువగనుక పాదము వలె దిగువవాడు అనుసరమున అడుగు అని ప్రయోగమున్నది. ఇది తమిళపదము తోడి సంబంధము. నిజమునకు "తెలగ... శబ్దముమీద తెలుగుగూడ బిండ్వనుపవత్తిచే నిరాకరణీయమే అలుతే తెల్లన - లేక - తెలవ=స్పష్టముగా అను నరము గల తెం + అగు వాని సమావేశమే తెలంగు తెలుగు అనియయి యుండ వచ్చును. "లు" లోని ఉకారము "గు" లోని ఉకారసామ్యముననే సమకూడినది. అసలు "తెలగు" అనునదియే మొదలిపదమని తోచుచున్నది. ఏమనగా "తెలంగాలు, తెలగాణ్యులు, తెలంగి, తెలాంగ్" ఇత్యాది పదముల వాడుకనుబట్టి చూచినచో "తెలగు" అనియే మూలపదమునకు తప్పదు. అదివఱకు దుర్గమమై అంధకారావృతముగా నున్న ఈ దండకారణ్యభాగమును ఈ వైశ్వామిత్రులు వచ్చి తెల్లమగున ట్లొనర్చిరి గనుక "తెల" స్పష్టము అగునట్టి దేశము 'తెలుగు' అయినది.

(అనుధాతువునకు మూలము "అజ్" అను సవరభాషలోనున్న పదమని తోచుచున్నది. అను నాసికవర్ణమే చివరను 'గ' వర్ణముగా మారి స్వభావముచే బిందుపూర్వకమై యుండవచ్చునని తోచును)

(తెనుగు శబ్దము విషయము ఇంకొక విధముగా దోచుచున్నది. ఎట్లనగా మన దేశములో ఇక్ష్వాకులు కొంతకాలము క్రింద నెటనుండియో వచ్చిరని చారిత్రికులు పరిశీలించి చెప్పుచున్నారు. అది పరిశీలించగా "ఇక్షు + వాక=ఇక్ష్వాక, ఇట్లె చారు + వాక=చార్వాక" వాని తీరుగనే తేన + వాక = తేన్వాక - అయి క్రమేణ తెనుగుగా మారినదని తోచుచున్నది.)

మఱియు నదివఱకు నంధకారములో నున్న ఈ దేశమును బైటికి తీసుకొని వచ్చిరి గనుక ఈ యందరును అంధ+ర అంధకారమున నున్నదానిని ర — అగ్ని - అనగా అంధకారమునకు అగ్నివలె కీకటాది దేశములందుగల చీకట్లను బోగొట్టి బైటికి దెచ్చిరి, అను నరముగల అంధర- అంధ్ర- అనునామముతో "అందరు" అను పదము ఇంచుమించు సమానముగ గైర్వాణీకరింపబడి యుండవచ్చునని తోచును, ఇదియంతయు జూడగా "అంధ్ర, తెలుగు" ఇవిరెండును ఆ దేశముయొక్క మొదటి స్థితిని తర్వాత వైశ్వామిత్రుల ప్రయత్నమును తత్ఫలమును వ్యక్తీకరించుచున్నవని స్పష్టము. ఇట్లె బృహస్పతి (మనోజ్ఞుని) ఉతథ్యుని భార్య మమతతో (వివేచనాజ్ఞానము నంటియుండు ఆత్మీయత్వబుద్ధితో అనగా ఆ దేశములను సంపాదింపవలెనను మమకారముతో) సంగమించి= కలసి అధికలవాడై యునుట• దీర్ఘతమ డద్దుటవలన - అనగా దండకారణ్యభాగములో ప్రవేశించుటకే వీలులేనంతటిదుర్గమమై చీకటిగా నుండుటవలన నతని నిరాకరింపగా = దీర్ఘతమమును సప్రయత్నముగ పోగొట్టగా అతనినుండి ఆదీర్ఘత

మస్సునుండి మొదట బలిరాజు భార్య దాసివలన కక్షీవదాదు లుదయించిరి - అనగా బలవంతులగు రాజులను సహాయముగ గోరి వారి పరిజనుల తోడ్పాటు వలన "బర్బర (కక్షీవంత) అంగ-వంగ-కళింగ-సుహ్మ-అంధ్ర - పుండ్ర-పుళింద-శబర (సవర) మూతిబ (తమిళులై యుందురు) పాండ్య అని పదకొండు దేశవిభాగము లేర్పడినవట. అందును తెనుగు దేశము మిక్కిలి యంధకారమున నది తెల్లనగుట(స్పష్టమగుట) చాలకాలముపట్టి యుండి అటనందరు ప్రయత్నమత్యావశ్యకమైయుండుట గాబోలు దానిని ( తెల్ల + అగు)'తెలుగు'అనియు, తత్ప్రయత్నమొనర్చినవారందరను అంధ్రులనియు వాడిరి. పిమ్మట బలిరాజు భార్యయందు దీర్ఘతమునివలన వంశకరుడైన మహాబలవంతుడగు పుత్రుడు పుట్టె" ననగా ఆ బలవంతుని సంతానమే ఈ యన్ని దేశములకును పాలకుడై మహాబలవంతుడయ్యెనట. ఇట్లు ఈ దీర్ఘతముని వృత్తాంతమంతయు ఆంధ్రాది దేశములు బయల్పడిన కథకు రూపకమని స్పష్టపడును. మఱియు దీర్ఘతముడు ఏటిలో కొట్టుకొనిపోయెననగా నది తెలివాహానది ననుసరించి గట్టి పట్టుదలతో చేసిన ప్రయత్నమువలన తెలివాహానది ( తెలి యను శబ్దము ననుసరించి గంగయై యుండును.) నంటియుండిన దీర్ఘతమస్సుతో నంటియుండిన ప్రదేశమునంతను ఆ నదీ మార్గముగుండా ప్రవేశించి అచటి యడవి మొదలైనవానిని ఛేదించి బట్టబయలు చేసి యుండును. ఆఫ్రికాలో పాశ్చాత్యులు దేశములోనికి ప్రవేశింపగోరినప్పుడు దుర్గమారణ్యముల జొరుటకు నదులగుండానే మొదట ప్రవేశించిరనియు అట్టి మార్గమే దేశ ప్రవేశములకు సులభమైనదనియు విందుము. అట్లే మన పూర్వులు నొనర్చి యుండిరని ప్రకథవలన స్పష్టసూచితమగుచున్నది.

ఈ సందర్భములో నింకొక విషయమునుగూడ పరిశీలింతము. ఋగ్వేదములో కీకటదేశమున ప్రమగందుడనువాడున్నాడనియు, అతని గోవులను తమకీయవలయుననియు ఆర్యులు ఇంద్రుని ప్రార్థించు సూక్తములు కొన్ని యున్నవి. దీనివలన నొక చరిత్ర మూహింపదగి యున్నది. కీకటదేశమనగా నేది ? "మగధాః కీకటా మతాః" అను త్రికాండ శేషమును బట్టి మగధదేశము కీకటమనబడును.

" ప్రమగంద " అను శబ్దము కేవల సంస్కృతశబ్దముగా గన్పట్టదు. సంస్కృత శబ్దమునుండి ఏర్పడినదిగా గన్పట్టును. తద్భవమన్నమాట. "ప్రము ఖాంధ్ర" అనునది మూలశబ్దమునక తప్పదు. తెనుగులో 'చీకటి - కీకారణ్యము' అను పదములు కన్పట్టును. ఈ పదము లితరభాషలందు లేవు. వీనిని జక్కగ పరామర్శించుచో నిట్లు తేలును.

విశ్వామిత్రుతో విరోధించిన యతని పుత్రులు గంగనుదాటి గంగకు దూర్పన నున్న కీకటదేశములను చేరిరి. అయితే గంగ దాటునప్పుడు చాల శ్రమపడిరి. అదివఱకు గంగకు పడమరనె ఆర్యుల నివాస మున్నది. తూర్పున లేదు. కను

కనే గంగ నతిశ్రమతో దాటిరి. గంగ దాటుటలో వారు శ్రమపడి రనుటకును గంగ దాటుటకు వీలులేని స్థితిలో నున్న దనుటకును ప్రమాణము లగుపడుచున్నవి. "ఉన్మత్తగంగం" అను సంస్కృత పదమును గమనింపుడు. 'ఉన్మత్తాగంగా యస్మిన్ దేశే తదున్మత్తగంగం" అని దాని విగ్రహము. గంగ అత్యుద్రేకముతో ప్రవహించుచు దాటుటకు వలనుగాని స్థితిలో నొక దేశమున నున్నదని తాత్పర్యము.

మఱియు తెనుగులో "గంగలో దూకాడు" "సొమ్మంతా గంగలో పోశాడు" "నాకష్టమంతా గంగలో కలిసింది" అని అంధ్రులు గంగదాటు విషయములో పడిన శ్రమ అంతా ఇంతా కాదని సూచించుచున్నవి వాడుకలు. గంగయనగ నెంత మాత్రము స్వాధీనము కాదనియు దాటుట చాల కష్టమనియు సూచించు నీ వాడుకను గూడ గమనించుడు. ఎవనితో నైన నేదైన నొకవిషయమును గుఱించి యనేకవిధముల చెప్పి అతడు వినకపోయిన నిట్లందురు. "గంగ వినదు" "గంగ ఒప్పుకోదండీ" అని. ఇచటి 'గంగ' అను పదము ప్రభావమును బోధింపగలదనుటలో సంశయము లేదుకదా! కాగా దాటుటకు శక్యముగాని యీ గంగ నెట్లు దాటిరంధ్రులు? ఎట్లో వీరు దాటినతర్వాత వెనుకటి ఆర్యులతోటి సంబంధ బాంధవ్యముల వదలుకొనిరి, వారి నసలు పూర్తిగా మఱచియే పోయిరి. చూడు డీసామెతను? "ఏఱు దాటాడు" మాట్లాడుతూనే నిద్రపోయినవానిని గుఱించి మేల్కొనియున్నవాడను మాట యిది.

ఇట్లు గంగను దాటి అచటి కీకారణ్యము లంధకారబంధురములుగా నుండి దుష్ప్రవేశములై వాని సంగతియే ఆర్యులకు తెలియకయుండగా ఆర్యుల కంధకారములో నున్న ఆ కీకట దేశములను మన పూర్వులు అంధకారమునుండి బైటికి లాగిరి. అనగా సుప్రవేశముల నొనర్చిరి. అందువలననే అంధ + ర అంధకారమునకు అగ్నివంటివారనియు (ర=అగ్ని యని యర్థము.) అంధకారమునుండి బైటికి తీసుకొనివచ్చిరనియు (రా-లా-ఆదానే) దాని యర్థము అంధ్రులు ఆ దేశములో ప్రవేశించి పూర్తిగా సుప్రవేశముల నొనర్చునంతవఱకును అవి కీకటములు (కీకారణ్యములు)గానే చీకటితో నిండియున్నవిగానే ఆర్యులు తలంచిరి. అనగా ఆర్యులు అప్పటికింకా ఆ దేశములో బాగా ప్రవేశింపజాలకుండిరి. కనుకనే ప్రమగందుని దేశము కీటకమని వాడిరి. అయితే మనవారు గంగను దాటి ఆ దేశములలో ప్రవేశించిన తర్వాత ఆర్యులకన్న గొప్పదనమును సంపాదించుటకై యజ్ఞయాగాదుల నెక్కుడుగా నొనర్చుటకు ప్రారంభించిరి. యజ్ఞము చేసినవాడే అందఱికన్న ఘనుడు యజ్ఞము చేయుటయే మనము చేయవలసిన గొప్ప కార్యము. అది యొక ఘనకార్యము. అదియే అతని జీవితమును సార్థక మొనర్చు కార్యమని తలంచి ఆట్లొనర్చిరి. ఈ తెనుగు సామెతను గమనింపుడు. "పుట్టినన్నాళ్ళకు

పురుషుడు యజ్ఞం చేశాడయ్యా” అని. దీనివలన యజ్ఞ నిర్వహణమే జీవితమును సార్థకమొనర్చు నంతటి ఘనకృత్య మని ఆంధ్రులు తలచినట్లు స్పష్టపడ లేదా ? మఱియు ఇంటి పెత్తనదారిని, ఏదైననొక ఘనకార్యమును నిర్వహించిన వానినిగూడ తెనుగులో యజమాను డందురు. “ఇంటి యజమానుడు లేడండీ. యజమాని చెప్పందే మే మెట్లా చేస్తాము. ఎట్లా నైతే నేం ఇంటికి యజమానుడైనాడోయ్. మా యజమాని కనపడ్డాడండీ ?” ఇత్యాదులు. ఈ వాడుక ఆంధ్రభాషయందు అధికముగా నున్నది. సజాతీయములగు తమిళ, కన్నడములందు గూడ కొలదిగా లేకపోలేదు. కాని సంస్కృతభాషయందు గాని తదితర ఆర్యభాషలందు గాని ఇట్లు కన్పట్టదు. కాగా ఈ వాడుకవలన యజ్ఞమను స్థానమువలననే ప్రముఖతను ఆంధ్రులు గడించిరని స్పష్టము. ఇపుడు “ప్రమగండ” అనుదానిని పరిశీలింపుదు. “ప్రకృష్టముగా మఖముల నొనర్చిన యంధ్రుడ”ని యర్థము. “మఖ” శబ్దమే యజ్ఞార్థములో ప్రాశస్త్య సూచకముగా ముఖ్యముగా వాడబడుచున్నది. “శతమఖః” ఇంద్రునకు పేరు. “శతక్రతుః” అని యున్నను శతమఖ శబ్దమునకు గల సార్థక్యము దానికి లేదు. కాని ఆర్యుల దేవుడగు ఇంద్రునకు గూడ శతమఖముల వలననే ఆధిక్యమేర్పడుట వేదపురాణేతిహాసాదులవలన స్పష్టమే. కావున నిన్న మొన్నటివఱకు ఆర్యులలో నుండి వారి యాచారములను, వారి సత్కార్యములను, వారి యభిప్రాయములను బాగా యెఱిగిన యాంధ్రులకు వారివలె మఖానుష్ఠానమువలన నాధిక్యము సంపాదింపవలెనను తలంపు గలుగుటలోను, మఖముల నధికముగా నొనర్చుటలోను, తదనుష్ఠాన సూచకము లగు శబ్దములనే ఆధిక్య స్ఫోరకముగా నామముగా వాడుటలో గాని అంధ్రులధిక ప్రయత్నము గల్గియుండి రనుటలో పై సామెతలు, వాడుకలు మున్నగునవి చక్కగా పరిశీలించినవారికి విప్రతిపత్తి యుండదు. అట్టి స్థితిలో నెక్కుడు (ప్రముఖము) గా మఖము లొనర్చిన యంధ్రుడు ప్రముఖాంధ్రుడు (ప్రమగండుడు) ఆర్యులకు ద్వేషస్థాన మయ్యెను. కనుకనే ఆర్యులతని గోవులను అనగా అతని ధనమును (పూర్వము గోవులే గాదా ఉత్తమధనముగా గ్రహింపబడినవి. “గోధనం” అను శబ్దమునకున్ను గోవుల విషయంలో సొమ్ములు అను విశాఖపట్నంజిల్లా వాడుక యున్న ఈవిషయంలో విచారింపదగినవి) తమ కిప్పింపవలసిన దని అంధ్రులు (ఆర్యులు) ఇంద్రుని ప్రార్థించిరి. “మఖ” శబ్దభవమే “మగ” శబ్దము. యజ్ఞశబ్దము కన్న మఖ శబ్దములో విశేషమున్నది. “మఖతిధర్మం మఖః” అని క్షీరస్వామి. ధర్మమును గురించి ప్రవర్తించునది యని యర్థము. (మఖ=గతౌ). ఇందువలన నీ యభిప్రాయమే యజ్ఞాదిపదములందుకన్న దీనియందు ఆధిక్యమును సమకూర్చినది. కాగా ఈపదమే మన ఆంధ్రులు తమలో నాధిక్యస్ఫోరకముగా వాడిరి. “మఖ

వన్" మగవాడు. "మఖ" శబ్ద
భవము "మగ" యనునది 'వాడు'అనునది
'కలవాడు' అను అర్థము వాడబడుచునే
యున్నది. అసలు "కావాడు వాడు"
(అవకాశ) అను వర్గములోనిది. ఈ విష
యము మా నిఘంటువులో గమనింతురు
గాక. ఇందువలన ధర్మప్రవర్తక మగు
యజ్ఞమును (మఖమును) నిర్వహించు
వాడు మఖవంతుడు. ఇంద్రుడు గాడు.
అది కాలక్రమేణ "మగవాడు" అయినది.
"మొగుడు" అనునది వేరు. "కొడుకు -
కూతురు" పదములవలె అది యొక విశిష్ట
చిహ్నస్ఫోరకము. ఆవిషయము మానిఘం
టువులో వివరింపబడినది. లోకములో
గూడ నేదైన నొక సత్కృత్యమును నిర్వ
హించినప్పుడు "ఇప్పటికి మగవాడై
నాడా! అతనిదిరా మగతనము" అని
వాడుక లున్నవి. ఇట్టి స్థితిలో "ప్రమ
ఖాంధ్రుడు" కాలక్రమేణ "ప్రమగండు"
డైనాడు. ఋగ్వేదములోనే "ప్రము
ఖాంధ్ర" శబ్దముకూడ దొరకినది. ప్రమ
గండ శబ్దము వాడబడుటవలన అప్పటికే
మన భాష పైభాషలనుండి వేరయి పరిగ
ణింపబడుచున్నదని స్పష్టము. అంతేగాక
అట్టి "మఖంధ్రులు" నివసించు దేశము
"మగధ" దేశ మయినది. మఖ+
అన్ధ శకన్ధ్వాదషు పరరూపం వాచ్యం,
శక + అంధః = శకంధుః అయి
నట్లుగా మఖ + అంధ్ర = మఖంధ్ర అయి
నది. కాలక్రమమున 'న' వర్ణమును రేఫ
మును తొలగిపోయినవి. కీకట దేశము
కాలకాలమునకుగాని మగధ దేశము
కాలేదు. "మగధ" శబ్దమునకు సంస్కృత
ములో వ్యుత్పత్తి గన్పట్టదు. ప్రమగండ
శబ్దము ప్రమఖాంధ్రశబ్దపరముగ వాడినట్లు
స్పష్టపడినది. మగ యనునది మఖశబ్దము
నుండి ఏర్పడుటయు నుచితముగనే గన్పడు
చున్నది. "మగటిమి" అనునదికూడ పై
యూహాల కాధారము. అయితే "మగ
టిమి"ని గుఱించి కొంత చెప్పవలసి
యున్నది. మగటిమి యనగా పౌరుషము,
శౌర్యము అని యర్థము. అంతేగాని
మగనితనము కాదు. కావున మగడు(భర్త)
అనుపదముకూడ భావార్థకముగు పద మిది
కాదు స్పష్టము. "మొగుడు" అనియేకాని
"మగడు" అనునది సరియైనదిగా గన్ప
డదు. "మఖ" శబ్దపరిణామమే "మగ"
శబ్దము. "మి" యనునది భావప్రత్య
యము. మఱి "టి" యెచ్చటిది? విచారిం
తము. మగ + అంధ్ర = మగడు. (సర్వే వ
ర్ణైతే ఉదన్యాభవన్తి) మగడు + మి =
మగటిమి. ఇపుడు స్పష్టమైనదిగాదా
"మగడు"లోని డువర్ణము "టి"గా మారి
నదని. అయితే లాభమేమంటారా? వినండి.

ఈ "మగడు"లోని "డు" విభక్తి సం
బంధముగు "డు" వర్ణకము గాదు. ఏమనగా
అట్లగుచో దానిమీద భావార్థకముగు
ప్రత్యయము చేర్చినప్పుడు అది "టి" గా
మారదు. అదిపోవును. రాముడు. రాముని
తనము. గండడు. గండడితనము. అంతే
గాక విభక్తిసంబంధము లేని డువర్ణమే
భావార్థకమగు ప్రత్యయము చేరినపుడు
నిలుచును. వేడి=వేడిమి. పోడు=పోడిమి.
ఓడు=ఓటమి. ఇందువలన ఈ "మగడు"

అనుచోటి 'డు' వర్ణము ప్రాతిపదికము లోనిదే గాని ప్రథమావిభక్తి ప్రత్యయము కాదని తేలినది. మఱియు ఈ "మగడు" అను శబ్దము అనగా 'మగటిమి' అను రూప మేర్పడుటకు మూలమగు శబ్దము పౌరుషము, 'శౌర్యము కలవాడు' అను నర్థమిచ్చునదేగాని పురుష జాతి అనిగానీ, భర్త అని గానీ అర్థమిచ్చునదిమాత్రము కాదని కూడ స్పష్టము. ఆయర్థములలో 'మగడు'= (భర్త) మగనితనము. మగవాడు (పురుషుడు)=మగవాడితనము అను పదములే గలవు. 'మగటిమి' యనుదానివంటి పదము మరొకటి మన తెనుగులో నాకు గన్పడ లేదు. తెనుగువారి 'మగటిమి'కి సరిపోయిన పదముకూడ మరొకటి నాకు గన్పడ లేదు. ఇప్పటికి మన 'మగడు' లో 'డు' ప్రత్యయము కాదని స్పష్టమైనది. అయితే ఇది యెక్కడిది? 'మఖన్ధ్రి' అనునది కాలక్రిమమున మగండు. మగడు అని కాగలదనియు స్పష్టము. ఇకొక రకముగా కుదురదుకదా? అయితే మఖ శబ్దమునకు అంధ్ర శబ్దమును చేర్చునపుడు వైర్వాణికాలములో విసంధి 'శకన్ధ్వాదిషు పరరూపం వాచ్యమ్' అను పరరూప సంధియేకాని దీర్ఘసంధి కానేరదు. ఇందుకు 'ప్రమగండ' (ప్రమఖంధ్ర) అనురూపము కూడ ప్రమాణమే కాదా?

ఇప్పటికి మనము విమర్శించిన దానిని బట్టి ఋగ్వేదకాలమునకు జాలపూర్వము నందే మనము ఆర్యులతో విడబడినను ఆర్యుల- అనగా మన ప్రాచీనుల యాచారములను వదలక వారికన్న మిన్నగా నుంటిమి. మన పేరులుగూడ మఖైకచిహ్నితములుగను, ఆంధ్రజాతిసూచక మగు అంధ్రపదచిహ్నితముగను ఏర్పరచితిమి. చూడుడు. మఖ+అంధ్ర=మగండు. మగడు రామ+అంధ్ర=రాముడు. రాముండు. (ఈ 'డు' విభక్తి స్వరూపమును గుఱించి మానిఘంటువునందు చక్కగా విమర్శించి వివరించియుంటిమి. ఇది 'అంధ్ర' శబ్దము యొక్క పరిణామము. ఇట్లే 'లు' 'రు' వర్ణకములు- అనగా - ప్రథమా బహువచనములుగూడ నగునని యెఱుంగునది)

"అయితే మన పేరుల చివర నున్న 'డు' అనునది ఆంధ్రశబ్దపు పరిణామమని యు, మనము మన పేరుల చివర జాతీయముగా చేర్చుకొంటిమనియు నెట్లునమ్ముదు" మంటారా? వినండి.

'ప్రమగంద' అనుచోట 'ప్రమఖంధ్రి' అని నిరూపించితిమికదా. అంతకన్నను విస్పష్టముగా నిరూపింతుము. 'చాణూరాంధ్ర నిషూదనః' (విష్ణుసహస్రనామము) 'చాణూరనామానం అంధ్రం నిషూదితవానితి' (శంకరభాష్యము) ఇచటి చాణూరుని సంహరించె ననుటలో అంధ్ర పదమును చాణూర పదమునకు చేర్చుటలో గల రహస్యము గమనింపుడు. వేరు శత్రువులను చంపినాడనునప్పుడు తజ్జాతివాచక పదమును గూర్పలేదు చూడుడు. 'కాలనేమినిహా వీరః' ఇట్లే 'మధుహా' మొదలైనవి. ఈ ఒక్క 'చాణూర' పదమునకు అంధ్రపదమును చేర్చుటలో గల రహస్యమేమి? ఇదియే కాదా అంధ్ర జాతివాచక గౌరవపదము. దానినే తమ పేరుల ప్రక్కన

ఆంధ్రులు వాడిరి. ఇతరులును వారిని జాతీయ చిహ్నముతో కల్పియే వ్యవహరించిరి. ప్రకృత కాలములో చూడుడు. రామిరెడ్డి-ప్రతాపరెడ్డి - జాన్సాహేబు - సుబ్రహ్మణ్య మొదలియార్ - నరశింహ నాయుడు - మొదలగునవి.

అట్లే పూర్వకాలమునందు ఆంధ్రశబ్దముతో మనజాతివారిని వ్యవహరించిరి. అసలు "చాణూరాంధ్ర నిషూదనః" అను చోట నొక చారిత్రిక రహస్య మున్నది. ఏమనగా- ఈ చాణూరుడు కరూశదేశపు రాజు. విష్ణుపురాణము జూడుడు. ఈ కరూశదేశము కాశ్మీరదేశమేమో యని తోచుచున్నది. వర్ణసామ్యము కొంత ఊహకు దోడ్పడుచున్నది. అంతేగాక అంధ్రులు కొంతకాలము కాశ్మీరకులుగ నుండిరని చారిత్రికులు. మరియు బార్హస్పత్యమానమును వ్యవహరించు నుత్తరాపథమునందలి దేశ మగు కాశ్మీరములో చాంద్రమానమున వ్యవహరించు మన అంధ్రులకును సంవత్సరాది యొకటియే. మఱియు కాశ్మీరమును శాలివాహన రాజులు రాజ్యమేలిరని కథాసరిత్సాగరము. అంతేగాక తెలుగుపదములకును కాశ్మీరభాషా పదములకును పోలికలు గన్పట్టుచున్నవి. చూడుడు.

(3) పన నిగరె — తన ఇంట్లో
*(5) పాః — తాను
(7) కాసితన్ — గాసి
(10) పనయ్ — వానిని
(14) గురు — గడ్డము
పలవన్ — పల్లము (జీను)
(17) వటా. వట్టిది
(20) లాగ్ — అలాగు

* పవర్ణము తవర్ణముగా మారును.

ఆంధ్రులును, కాశ్మీరులును వీరశైవులే. మఱియు కాశ్మీరులును, ఆంధ్రులును మాత్రమే గీర్వాణ భాషలో అలంకార శాస్త్రమున ప్రమాణముగా అంగీకరింపదగిన గ్రంథములను వ్రాసిరి. ఈ సంబంధము లన్నియు కేవల యాకస్మికము లనుటకు వీలులేనివిగావా? ఇట్లు కాశ్మీరా(కరూశా)ధిపుడగు చాణూరుడు కంసుని వద్ద నుండగా శ్రీకృష్ణు డతని జంపుటయు చాణూరునకు అంధ్రు డను బిరు దుండుటయు గూడ గమనించినచో నంధ్రులు కాశ్మీరులై కొంతకాల ముండిరని విస్పష్టపడకపోదు. ఇంతేగాక జరాసంధుడు మగధనాయకుడు, జరా + సంధ అని నిగ్రహమును భారతములో జెప్పిరి. కాని పరిశీలించినచో జరాన్ + అంధ (అంధ్రి) యని తోచుచున్నది. జరాసంధుడు అంధ్రుడే యని దాని తాత్పర్యము. ప్రమగందుని చరిత్రములో మనము మాగధులమని నిరూపించితిని. అంతేకాక చారిత్రి కాలములో మనము మగధరాజ్యమును ఒకటి రెండుసారు లాక్రమించియుంటిమి. ఒకసారి కాశ్మీరమునుండియు మరొకసారి ఇప్పటి అంధ్రదేశమునుండియు ఆక్రమించియుంటిమి. దానికి గారణమేమి? మగధదేశము మగధరాజ్యమును మనవి. వాని యందు నిజమగు హక్కు వారసత్వములు మనకే గలవు. ఎట్లనగా చంద్రగుప్తుడు, అశోకుడు మొదలగువారు అంధ్రులు.

ఈమధ్య బొంబాయిలో ప్రకటింపబడిన సాంష్టిల్ డిక్షనరీలో (Sanstil Dictionary), G. V. Devastali, M. A; B. T., Bala Vedokta Pritiman అనువారు అనుబంధములో అశోక = A name of celebrated Andhra King said to have existed in the third century B. C. "అంధ్రరాజు క్రీస్తుకు పూర్వము మూడవశతాబ్దిలో పరిపాలించి వెలుగొందినట్లుగా జెప్పబడుచున్నాడు." అని వ్రాసిరి. ఇవి యన్నియు గమనించిన వారికి పైని నా యూహలు సప్రమాణము లనుటలో సాధ్యమైనంతవఱకు విప్రతిపత్తి యుండకూడదు.

అయితే జరాన్ + అంధ్ర - అనునది 'జరాసంధ' యని కాలక్రమమున నేర్పడి నది. ఇచటి చరిత్ర మిది. జరాసంధుడు అంధ్రుడు. అతడు తనకు ప్రతికూలముగా నున్న రాజులనందరిని జయించి లోబరచుకొని సమ్రాట్టగుటకు ప్రయత్నించుచుండెను. చేదిదేశము (బుందెల్ ఖండు) రాజగు శిశుపాలుని సేనాపతిగానొనర్చెను. బుందేలులు ధైర్యశాలులు, బలపరాక్రమవంతులనుట ఇప్పటికిని ప్రసిద్ధమే. భోజవంశ్యుడగు కంసునకు తన కూతుళ్ళ నిచ్చి సంబంధము కల్పుకొని తద్వారా యాదవులను లోబరచుకొనియెను. లోబడని వారు దేశాంతరములకేగిరి, వారి సంతతి వారే ఇప్పుడు యూదు లనబడుచున్నారు. హంసడిభకులను, అదేదో దేశపు రాజపుత్త్రిలను ఇరువురను సహాయముగా చేసికొనెను. కాలయవనుని (ఆఫ్రికా దేశపు రాజు) స్నేహమొనర్చెను. ఇంకను పనేకు లతో ననేకవిధములగు సంబంధము లొనర్చుకొని తన కనుకూలముగా నేర్పఱుచుకొని అంధ్రసామ్రాజ్యము నెలకొల్ప ప్రయత్నించుచుండెను. ఇతని మీాదకు వచ్చుటకు గాని ఇతని నెదిరించుటకు గాని నేరెవ్వరును జాలకుండిరి. భీష్ముడంతటివాడుండియును కౌరవ రాజ్య మల్లకల్లోలముగా నుండినందున జరాసంధు నెదుర్పడయ్యెను. ఆయుధములతోడి యుద్ధములో జరాసంధు డజేయుడు. ముప్పది యక్షౌహిణులసైన్యముకలవాడు ఈవిషయము శ్రీకృష్ణుడే ఒప్పుకున్నాడు. ఇట్లు ఇతడు శత్రుదుర్నిరీక్ష్యుడై సామ్రాజ్యస్థాపనకు ప్రయత్నించునంతలో ఆంధ్రసామ్రాజ్యవిద్వేషులందరును ఎంతదూరము ప్రయత్నించియు ఏమియు నొనర్పజాలని స్థితిలో భగవానుడు శ్రీకృష్ణుడు ఆంధ్రసామ్రాజ్యము సహింపక పాండవులతో గుట్రయొనర్చి అతని జంపెను. అంతటితో నాప్రయత్నమాగిపోయెను. ఆప్రయత్నములోనే చాణూరాంధ్రుడు తొలిముద్దగానయ్యెను. ఈయభిప్రాయమును అనగా అంధ్రుల సామ్రాజ్యమందును ఆంధ్రులయందును గలవిద్వేషమువలన వారి సామ్రాజ్యనాశ వారి నాశనమును నమును సూచించు తలంపుతోనే ప్రథముడగు చాణూరాంధ్రుని చంపుట చెప్పబడినది.

ఇట్లే శ్రీమద్రామాయణమునందు గూడ అంధ్రులు సామ్రాజ్యనాశన మొనరబడి వారు ప్రాదేశిక ప్రభువులుగా నేరఏడిరి. ఎట్లనగా రావణాదులుమాటాడు భాష తెనుగని తెలియుచున్నది. రావ

ణుడు తెనుగునకు వ్యాకరణము వ్రాసెనని పండితలోక ప్రసిసిద్ధము. గ్రంథ మిప్పుడు దొరకనంతమాత్రమున లేనేలేదని వాదించుట వట్టి తెలివితక్కువతనము కాదా? బ్రహ్మసూత్రములలో 'సమానాధికరణ' గ్రంథమున్నట్లు చెప్పబడినది. అది ఇపుడు దొరకకుండుటవలన అది అసలే లేదను వాదము జ్ఞానహీనతనే సూచించును గాదా? అసలివుడు ఎన్ని గ్రంథములు నామమాత్రావశిష్టములుగా నుండలేదు? అంతేగాక 'రావణభేటు' అను నొక గ్రంథమున్నదనియు, రావణుడే దానికి చిట్టె నేర్పరిచెననియు ప్రవాదమున్నది. శ్రీ రామాయణములోనే 'అగ్నిహోత్రంచ వేదాశ్చ రాక్షసానాం గృహే గృహే' అనుటవలన రాక్షసాధిపుడగు రావణుడు వేదవేదాంగపారంగతుడనియు, వైదికకర్మలయందు శ్రద్ధ గలవాడనియు, వ్యక్తమగుటలేదా? అతని పార్థివలింగ పూజ కార్తవీర్య విజయ సందర్భమున నుత్తరరామాయణమున వర్ణింపబడినది. రావణుడు పులస్త్యుని మనుమడు. విశ్రవుని సంతతిలో తల్లిద్వారా రెండు తెగ లేర్పడినవి. ఒకటి కుబేరునిది, రెండు రావణునిది. మొదటిది ఔత్తరాత్యము. రెండవది దాక్షిణాత్యము. రావణుని మాతామహులు సాలకటంకట వంశమునకు జెందినవారనియు వారు శ్రీవిష్ణువుచే పరాభూతులై పాతాళమున కేగిరనియు రావణుడు ప్రబలుడైన తర్వాత లంక నాక్రమించుకొని సకలలోకముల నాక్రమించుకొని చక్రవర్తులకు చక్రవర్తిగా నయ్యెననియు గూడ నుత్తరరామాయణమున గలదు. మఱియు గిష్కింధ, దండక, పంప మొదలగు చాల పేరులు సంస్కృతములోనివి కావనియు నవి భాషాంతరీయములనియు జాలకాలముక్రిందటి భారతిలో శ్రీ. రామదాసుగారు నిరూపించియున్నారు. అదియునుగాక రామాయణములో రాక్షసుల పేర్లన్నియు నించుమించుగ భాషాంతరీకరణపు బేర్లుగా గన్పట్టును. సర్పరోముడు, మకరాక్షుడు, రావణుడు, కుంభకర్ణుడు, శూర్పణఖ, మందోదరి" ఈ పేరులన్ని వికృతముగా నుండి భాషాంతరీయములగు పేరులకు సంస్కృతీకరణములుగ గన్పట్టుచున్నవి. "సర్పరోముడు + పాపయ్య, అనుచో పాపపదము దుష్టవాచకము కాదు. ఎవడు తనపేరట్లు పెట్టుకొనును? ఇట్లే ముసలయ్య అనునదియు గ్రామ్యము. ఏమనగా 'ముసలివాడు' అని ఎవ్వరును పెట్టుకొనరుగదా? 'తాతయ్య' అనునది తండ్రి యను నర్థములో నుపయోగింపబడుట స్పష్టము. కాగా ఇట్లు పై నిరూపించిన పేరులను, సర్పరోమాదులను భాషాంతరీకరణములని యూహింపవలెను. ఇంకను స్థిరముగా నిర్ణయింపవలయును.

కనుక అంధ్రుల భాషకు వ్యాకరణము రచించిన రావణుడు అంధ్రుడనుటలో దోష మంతగా గన్పట్టదు. అతని సామ్రాజ్యము విభీషణుని అనూయవలన నష్టమై చివరకు విభీషణునకు బ్రాప్తించినది.

మఱియు మృచ్ఛకటికములోని చరిత్రము రాజ్యవిక్రాంతికాలములో నున్నది.

ఆ విశ్రాన్తి శాలివాహనులకు సంబంధించి నట్లుగా గన్పట్టును. ఎట్లు? పాలకు డను రాజును చంపి ఆర్యకుడు రాజయ్యెను. పాలకుడు హాలుడేమోనని తోచుచున్నది. ఏమనగా, నీ 'పాల' ధాతువు తెనుగుది. సంస్కృతములో నిది మృగ్యము. 'పాలు' అనగా క్షీరము. దానినిబట్టియే అనగా క్షీరదాత యగు గోసమూహమునుబట్టియే సంఘమంతయు నిర్వహింపబడుట. అనగా యజ్ఞ యాగాది వైదికధర్మముల ఇహ స బంధములగు భోజనాది క్రియలు (ఆవు చన్నులలో నరువదియారు పిండి వంట లున్నవను వాడుకయు, గోధనం-సొమ్ములు' మున్నగు పదములును ఈ సందర్భమున స్మరింపవలెను) నిర్వహింపబడుటయు, ఎవడు ఎక్కుడుగా గోవులు గలవాడో వాడే ఎక్కుడు ధనవంతుడుగ గ్రహింప బడుచుండెడువాడు. ఈ కారణమున మొదట "క్షీరము" అను నర్థములో "పాలు" శబ్దముండి పిమ్మట సంస్కృతములో క్షీరముగ గ్రహింపబడినది. ఎట్ల నగా హాలుడనువాడున్నాడుకదా! అతడు పాలుడేయని నిర్ణయింపవలెను ఏమనగా "హాలుడు" అనునది కన్నడింపబడిన పేరుగా గన్పడుచున్నది. తెనుగులోని "పాలు" కన్నడములో "హాలు" ఇట్లే పవర్ణము హవర్ణముగ మారును. కన్న డులు, తెలుగులుగూడ మొదట నంధ్రులే! శాలివాహనులకాలమున నేకముగనున్న ఈసంఘము తరువాత కొంతకాలమునకు తెలుగన్నడ మాలె గన్నడగామారిన వను టయు చారిత్రకులకు అపరిచితముకాదు.

కన్నడాంధ్రులయు తత్సంఘములయు సమానలక్షణములు చాలమంది యెఱుగు దురు. కాగా సంస్కృతములోని "పాల" యనునదియే 'హాల' మైనదని తోచును. అయితే యిది (పాలధాతువు) తెలుగు దేశ మనుటకు గారణమేమందురా! కన్న డములో తెలుగులోని 'ప'వర్ణమే 'హ' వర్ణముగ మారునుగాని సంస్కృతములోని పవర్ణము అట్లు మారదు.

"పావం=పాపం - పారద=పారద"

కావున హవర్ణముగ మారిన పవర్ణము తెనగుపదములలోనిదే నని నిశ్చయము. కనుక పాలధాతువు తెనుగుదే. పాలుడే హాలుడు. ఆరాజే మృచ్ఛకటికములో పాలకుడుగా జెప్పబడెను. అతని గాథా సప్తశతి జూచినచో నాతనికి పారదారి కమునందు గల యభిరుచి గన్పట్టును. అతని వ్యభిచారరుచివలననే శకులు తమ ఆడంగులను అతనికి దార్చి అతనియాస్థాన మున పలుకుబడి సంపాదించి ప్రజలను బీడింప దొడగిరి. మృచ్ఛకటికములోని శకారుడు శకుల ప్రతినిధి. పై చరిత్రము నకు సూచకముగా శకారు డచట జెప్ప బడినాడు. అతని సోదరి హాలుని ఉంపుడు కత్తె యగుటయు ఇతడు రాష్ట్రియుడను టలో స్పష్టము. "కాణేలీ మాతః" అను సంబోధనము కూడ శకస్త్రీల నడవడికను స్పష్టపఱచుచున్నది. ఇట్లు జాతీయాజన్మ విరోధులైన శకుల ఆడవాండ్లను మఱిగి ప్రజాపరిపాలన ముపేక్షించి అథవా శకు లకు అధికార ప్రాబల్యము గల్గించి వారి వలన ప్రజల బాధలను లెక్కగొనని

రాజును హాలుని ప్రజ లుపేక్షింతురా? అభీరకుడగు ఆర్యకుడు (ఇది యొక జాతి చిహ్నమగు పేరు. అంధ్రుడగు హాలుని ఆర్యజాతివాడు జయించెను. జయించి రాజ్యమును చేకొనెననుట) హాలుని కాలములో శాతవాహనులరాజ్యము విచ్ఛిన్నమైనదని చారిత్రకులు వ్రాయుచున్నారు. ఆ తరువాత చకోరస్వాతికర్ణి మొదలగు రాజులు మళ్ళీ రాజ్యము కొంత కాల మెట్లో నిల్వబెట్టిరి. కాని అది నిల్వక చెదిరిపోయినది. ఆర్యకుడు రాజ్యము నాక్రమించుటయు చకోరస్వాతికర్ణి తిరిగి రాజ్యమును స్వాధీనపరుచుకొను తలంపుతో నచట నచట గొంతమంది విషయములను కనిపెట్టు చారులను, తన సామంతులను అట్టిపెట్టుటయు గూడ నా మృచ్ఛకటికములోనే గన్పట్టును. ఎట్లనగా-

"ద్విరదైంద్రగతిః చకోరనేత్రః" అను శ్లోకములో "చకోరనేత్రః" అనునది చకోరములవంటి కనులు గలవా డను నర్థము తప్పు. ఎచటనుగూడ మొగవాని కనులు చకోరములతో పోల్చుట లేదు. మఱెచటనైన నున్నదా యని విచారింప ప్రాచీనకవుల గ్రంథములలో నెచ్చటను కన్పడలేదు. కాగ చకోర స్వాతి కర్ణికి నేత్రమువంటివాడు=చకోరరాజు నేతగా, నాయకుడుగా గలవాడు - అను నర్థములు పొసగగలవు. దానినిబట్టి ఆర్యకు డాక్రమించిన రాజ్యము తిరిగి రాబట్టుటకై ప్రయత్నించుచున్న చకోర స్వాతి కర్ణికి నేత్రమువలె పనిచేయుచున్న శూద్రకుడు రాజ్యమును నిర్వహించుచున్న కాలములో మృచ్ఛకటికము వ్రాయబడినది.

ఇట్లు చారిత్రకకాలమునందు గూడ మనము అంధ్రులము సుప్రసిద్ధులముగా నున్నాము. అయితే ఆనాడు అంధ్రులందు ఐకమత్యము, తమలో నొకరియం దొకరి కసూయ లేక పోవుట, ఏకనాయకత్వము, ఓపిక, ధర్మానురక్తి, బలపరాక్రమములు మొదలగు సద్భావము లెన్నో యున్నవి.

ఈ కాలమునగూడ మనము శ్రీ మాడపాటి హనుమంతరావుగారివంటి ఉత్తమోత్తమ నాయకుడు గల్గియుండియు నైకమత్యాది గుణములు సంపాదింపలేకున్నాము. భగవంతుని కరుణవలన నట్టి సద్గుణములు మన కేర్పడునట్టి కృషి సల్పుటకై శ్రీమన్నారాయణుడు శ్రీ హనుమంతరావుగారికి శతాధికాయుస్సు సమకూర్చుగాక.

---

## హనుమంతరాయ ప్రశస్తి

"ఈ (అంధ్ర) సంఘమునకు శ్రీయుత మాడపాటి హనుమంతరావు పంతులుగారు సంఘ ద్రష్టలగుటయే గాక, కార్యదక్షిగా నుండుట చూడ నైజాం రాష్ట్రీయాంధ్రజనుల భాగ్య మనుపమాని నొక్కి చెప్పుటయం దెంతమాత్ర మతిశయోక్తి లేదు."

— తెనుగు పత్రిక.

# గ్రంథాలయోద్యమము - ఆంధ్రోద్యమము



శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, ఎం. ఏ.

ఆంధ్రదేశములో గ్రంథాలయోద్యమము ఆంధ్రోద్యమము రమారమి ఏకకాల సంజనితములు. కర్జనుప్రభువుగారి దయచేత మాతృభాషాభిమానము బంగాళములో 1905, 1906, 1907 ప్రాంతముల ఉగ్రరూపము దాల్చినది. ఆ రూపపు అంతరార్థమును చక్కగా గ్రహింపగల్గినది అప్పటికి ఆంధ్రప్రాంత మొక్కటే యని నాయభిప్రాయము. అదివరలో తెలుగు పలికి వ్రాసి యెరుగని మాతృభాషా మూకనాయకులు విజృంభించి విశృంఖలముగ తెలుగున నుపన్యసింప మొదలిడిరి. ప్రజా సమూహమున వాఙ్మయప్రచారము విరివిగ కావలెనన్న హృదయాభిలాష రేకెత్తి విజ్ఞానచంద్రిక, ఆంధ్రభాషాభివర్ధనీ సంఘములు రూపము దాల్చెను. స్వరాజ్, నవయుగ, ఆంధ్రకేసరి మున్నగు తేజోవిరాజిత పత్రికలు తీవ్రరూపమున బయలుదేరినవి. అతరుణమున అంకురించిన ఈ మహత్తరాభిమానమునకు ఆదివరలో తెలుగుభూమిలో బీజము లేదనరాదు. శ్రీ వీరేశలింగ, వేంకటరాయశాస్త్రి, రామకృష్ణమాచార్య ప్రభృతుల కృషి మరువదగినది కాదు. కాని వందేమాతరం ఉద్యమపు వేడిమి, తత్ఫలితమైన జీవనప్రవాహము ఆధారము కాకుండినచో ఈబీజము పడినచోటనే పడియుండునని విశ్వాసముచే ఈ మహోద్యమమునకు ప్రాధాన్యము కలుగుచున్నది. అదీగాక ఈయభిమానము విశ్వవ్యాప్తముగ రూపము దాల్చుటకు ఆ ఉద్యమమే మూలకారణమని మాయొంట్ల నమ్మిక. ఆ ఉద్యమము విజృంభించుచుండగా చూచి, హర్షించి, చేయూతనొసంగి, తనమితులకు లోబడి పాల్గొన్న వ్యక్తులలో శ్రీ హనుమంతరాయడు ఎన్నదగినవాడు. నాడట్లు విజృంభించిన మాతృసేవాపరత్వము, వందేమాతరమను రాజకీయోద్యమమును అడంచివైచితిమని బ్రిటిష్ ప్రభుత్వము ఎన్నుచుండిన నిమేషముననే నవనవరూపములతో పునర్జన్మము నందినది. ఆరూపములే ఆంధ్ర గ్రంథాలయోద్యమము, ఆంధ్రోద్యమము. ఆంధ్రోద్యమతత్వము ఇప్పటికినికను కొందరు పెద్దలకు అర్థమైనట్లు కన్పించదు. ప్రజలు స్వతంత్రులగుటకు వారిభాష ఆధారమైనట్లు మరియొక ఉపకరణము ఆధారము కాజాలదు. తానెరిగిన భాషలో వ్యవహారము జరుగుచున్నట్లయితే వ్యక్తి ముందు కడుగు వేయగలడు గాని ఎరుగనిభాషలో వ్యవహారము జరిగినంతకాలము తన తోడి నరు

లను దోపిడిచేసి తిను దుర్వ్యాప్తికి నడు కావలసిందేతప్ప వేరుమార్గ ముండదు. ఇది విషమపరిణామము. ఈ విషమపరిణామమునుండి ఆంధ్రభూమిని తప్పించుటకును, సంపూర్ణస్వాతంత్ర్యానుభవ మను సహజ పరిణామమునుసాధించుటకును మాతృభాష ఆగాధనీయమని గ్రహించిన ఆంధ్రజాతి ఈ యుద్యమములహృదయపూర్వకముగ సాగించిన దనుటలో విపరీతమేమీ లేదు. ఆంధ్ర దేశంలో యువకహృదయాలుప్పొంగి పల్లె పల్లెలలోను గ్రంథాలయములు పెట్టుటకు పత్రికలు చదివి వినిపించుటకు, హరికథలు చెప్పించుటకు, ఉపన్యాసముల నిప్పించుటకు ఇట్టి యితర కార్యకలాపము జరుపుటకు కృషి శ్రద్ధతో చేయుటచేతనే తిలకు అనిబిసెంటుల 'హోంరూలు' ఉద్యమానికీ, గాంధీజీ 'సహాయనిరాకరణోద్యమానికీ' తెలుగు దేశాన్ని సిద్ధంచేయగలిగినవి. మరొకవైపున ఈ యువకహృదయాలే పొంగి పొరలి ప్రజల భావములో సర్వవ్యవహారము సాధింపవలెనను అకాంక్షతో భాషాధారక రాష్ట్రోద్యమమునువిజృంభింప జేసినవి. అతిమితవాదులు, రాజభక్తులు ఇందులో పాల్గొని అధ్యక్షతలవహించి, ఉపన్యాసా లిచ్చి ఎంత సత్వరముగా సాధ్యమైనచో అంత సత్వరముగ ఆంధ్ర రాష్ట్రము నిర్మింపదగునని గంటాఘోషము చేసిరి. ఉద్యమము ఆంధ్రావనిలోని అన్ని ప్రాంతములకును వ్యాపించెను. 1916 లో తీవ్రవాదులకు కాంగ్రెస్ మహాసభ లోనికి పునఃప్రవేశము కలిగినతర్వాత ఆంధ్ర ప్రతిభ చేత కాంగ్రెస్ వారును భాషాధారక రాష్ట్రోద్యమమును చేపట్టి తమ కార్యక్రమమునకై భారతభూమిని భాషాధారక వ్యవహారసూత్రముమీద విభజించిరి. నేడు ఈ మహాతత్త్వము సంపూర్ణ స్వాతంత్ర్యసాధనకు అత్యవసరమని ఆంధ్ర కంఠములే ఉచ్చైశ్శ్రవమున పలుకుచున్నవి. ఈ వాదమునూ తప్పక భారత భూమిలో విజయవంతము కాగలదనుటకు సందేహము లేదు.

బ్రిటిష్ ప్రాంతమున ఇట్టిపరిణామము కలుగుచున్న కాలమున నైజాం యిలాకాలో తెలుగుప్రజల వికాసానికి ఆంధ్ర జాతీయ భవిష్యత్తుకు స్వరూపం మేర్పరచుటకే గ్రంథాలయోద్యమము మొదట సాగినది. ఆంధ్రజాతీయహృదయం సువ్యక్తముచేయుటకు బ్రిటిష్‌ప్రాంతములోవలె నిచ్చట సదవకాశములు లేకపోవడంచేత గ్రంథాలయోద్యమము ఆకొరతను కూడ తీర్చవలసివచ్చి ఎక్కువ యుత్సాహముతో కృషి జరిగినది. ఆ కృషిఫలితంగానే, ఆకృషికి దోహదంగానే నైజాం యిలాకాలోనూ ఆంధ్రమహాసభ యేర్పడినది. ఈ యన్నివిధములైన పరిణామముల చరిత్రలోనూ శ్రీ మాడపాటి హనుమంతరాయనిది ప్రధానపాత్ర. ఇక పిటిని ముందుకు సాగించవలసినవారు ఇతరప్రదేశములందు వలె నైజాంయిలాకాలోనూ యువకులే. కాబట్టి శ్రీ మాడపాటి హనుమంతరావుగారు అచ్చట యువకులకును, బ్రిటిష్‌ప్రాంతములోని యువకులకును ఆదర్శప్రాయులుగా ఉండదగినవారు. వారి అమోఘమైన భాషాభిమానమును, అచం

చలమైన కార్యదీక్షను, అలౌకికమైన నిరాడంబరమును యువకు లలవరచుకొని కాలరూపమును వారు తీర్చినట్లే తామును కాలరూపమును తీర్చి గురువును మించిన శిష్యులవలె, తండ్రిని మించిన కుమారుల వలె ప్రవర్తించి తమ జీవితముల ధన్యము చేసికొని, తమ నాయకమణి శ్రీ మాడ పాటి హనుమంతరాయుని జీవితమును యశోవిరాజితము కావింతురుగాక యని నాహృదయపూర్వకమైన మనవి.



## హనుమంతరాయ ప్రశస్తి

"శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుంగారి నిరంతర సేవా ఫలితమే ఈ రాష్ట్రమున ఆంధ్రోద్యమ సంచల నమునకును గ్రంథాలయోద్యమ వ్యాప్తికిని ముఖ్యకారణ మనుట; యతిశయోక్తి కాదు. వీరియందు ఈ రాష్ట్రీయాంధ్రుల నడిపించు శక్తిసామర్థ్యములు, విజ్ఞానప్రతిభ, కార్యశూరత్వము, సౌమ్యస్వభావము, కలిగి నాయకత్వ లక్షణములు మూర్తీభవించి యున్నవి."

కొత్తపల్లి వేంకటలక్ష్మీనారాయణశర్మ,
(కృష్ణాపత్రిక 23-6-1923)

# తైలపదేవుని రాజ్యాధిరోహణము

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు ఎం. ఏ.

హైదరాబాదు పూర్వచరిత్రము ఇకను చక్కఁగా విరచితము కావలసి యున్నది. ప్రాచీన శాసనాదికములను పరిశోధించి పలువురు పరిశ్రమించుచున్నను సముద్రమునకు ఏతము వేయుటగానున్నది. ఈ విషయమై ఘనతవహించిన శ్రీ నైజాము వారి ప్రభుత్వ ప్రాచ్యతత్త్వశాఖాధికారులేమి, లక్ష్మణరాయ పరిశోధకమండలి వారేమి, ఇంకను పలువురు పండితులేమి వహించిన శ్రద్ధయు, కావించిన పనులును తక్కువకానేరదు. దేశముయొక్క వైశాల్యమును ప్రాచీన శిథిలముల కలిమియు చూడఁగా ఇంకను ఎంతకైనను అవకాశము కలదని తెలియఁగలదు.

నేటి హైదరాబాదు రాజ్యము పూర్వము, అనఁగా భారతదేశచరిత్ర గ్రంథములందు హైందవయుగమని పేర్కొనఁబడు కాలమున, పెక్కు మహోన్నత రాజ్యములకును, చక్రవర్తులకును ఆస్పదమై యుండినది. తెలంగాణము తొలుత శాతవాహనుల యొక్కయు, తర్వాత చాళుక్యులయు, రాష్ట్రకూటులయు, పశ్చిమ (కళ్యాణీ) చాళుక్యులయు, కాకతీయులయు ఏలుబడిలో మహమ్మదీయాక్రాంతమగు వఱకు నుండినది. ఈ చక్రవర్తులకు రాజధానీనగరములుగానుండి నేఁడు ప్రాచీన శిథిల శకలములతో నిండిన ప్రదేశములు ఈ రాజ్యమునందే హెచ్చుగా గలవు. ఆంధ్రదేశమునందు దాదాపు సగము తెలంగాణముగా నుండుటచే నైజామాంధ్రుల పూర్వచరిత్రకు పునాదులేర్పడు నంతవఱకు సమగ్రాంధ్రదేశచరిత్ర కవకాశము లేదు.

పశ్చిమచాళుక్యులు హెచ్చుగా కర్ణాటకులుగా వారి ఆస్థానభాష చేతను, శాసనముల చేతను పరిగణింపఁబడుచున్నను వారి రాజ్యమున హెచ్చుభాగము తెలంగాణమగుటచేతను, ఆర్యావర్తమందలి రాజులు వీరిని తెలుఁగురాజులని తమ గ్రంథములందు పేర్కొనియుండుటచేతను (చూ. మేరుతుంగాచార్యుని ప్రబంధచింతామణి) తైలపుని రాజధానియైన మాన్యఖేటనగరము (నేటి మాల్ఖేడ్ - చిత్తాపురముజిల్లా)ను, తర్వాతి రాజధానియైన కల్యాణకటకమును (నేటి కల్యాన్ జాగీరు) హైదరాబాదు రాజ్యములోనే యున్నందునను తైలపచక్రవర్తి చరిత్ర

మాంధ్రులకును, హెచ్చుగా నైజామాంధ్రులకును కీర్తనీయమే.

దక్షిణ భారతదేశమందు చాలభాగమావరించియుండి మహావైభవముతో నలరారుచుండిన రాష్ట్రకూటసామ్రాజ్యము తటాలున నస్తమించిన దొకయాశ్చర్యము. ఇటీవలి పరిశోధనలచేత ఈ సామ్రాజ్య పతన కారణములు తెలియవచ్చుచున్నవి. పదియవ శతాబ్దపు తుదభాగమున దక్షిణాపథ చరిత్రమున పెక్కు మార్పులు జరిగినవి. క్రీ శ. 968 సం॥న రాష్ట్రకూట చక్రవర్తి మూడవకృష్ణరాజు గతించెను. తర్వాత, అచిరకాలముననే క్రీ శ. 973 సం॥మున నీ మహాసామ్రాజ్య మంతయు చాళుక్యవంశజుడయిన ఇమ్మడి తైలపదేవుని వశమాయెను. ఇంతసులువుగా నీ రాజ్యము చేతులు మారినది చరిత్రకారుల కాశ్చర్యకరమే. కాని రాష్ట్రకూట సామ్రాజ్య పతనమునకు కారణభూతములైన చెయ్వులు ముమ్మడి కృష్ణరాజు కాలమునుండియు కనబడుచునేయున్నవి. రాష్ట్రమందంతయు నొకయలజడి ప్రారంభమై యుండినది. రాష్ట్రకూటుల కు సామంతుడును, ముమ్మడి కృష్ణరాజునకు మేనల్లుడునునైన గంగభూపతి ఇమ్మడి మారసింహుడు తన శక్తినంతయు వినియోగించి శిథిలపడిపోవుచున్న సామ్రాజ్యమును నిలువబెట్టుటకు యత్నించుచుండెను. ఈతడు కృష్ణరాజ నియుక్తుడై ఘూర్జరమును జయించెను. వింధ్యప్రాంతస్థ కిరాతులను తపతీతీరయుద్ధమున పాఱద్రోలెను. గండమార్తాండబిరుదుడైన కృష్ణరాజుయొక్క సింహాసనరాజచిహ్నములను కాపాడెను. (మారసింహుని ప్రశస్తి E. I. V. 18) కృష్ణరాజు మరణానంతరము అతని సోదరుడు ఖొట్టిగుడు రాజై 968 మొదలు 972 (క్రీ.శ.) వఱకు పరిపాలించెను. ఈతని కాలముననే మాళవపతి పరమారవంశీయుడు శీయకహర్షుడు ఖొట్టిగుని యుద్ధమున జయించి మాన్యఖేటనగర విధ్వంసనమునకుం గడంగెను. (E. I. I. p. 235) మాన్యఖేటనగరమును పరమారులు కొల్లగొట్టినది 972 - 973 క్రీ. శ. మని ఆకాలమున ధనపాలకవి ప్రాకృతమున రచించిన పైయలచ్ఛియను గ్రంథముచే తెలియుచున్నది. ఈకవి తన గ్రంథమును తాను పూర్తిచేసినది విక్రమశకము 1029 వ సంవత్సరమున ననియు (క్రీ.శ. 972-73) అయ్యెడ మాన్యఖేటమును (నేటి హైదరాబాదు రాజ్యములోని చిత్తాపూరు జిల్లా యందలి మాల్ఖేడ్) హర్షుడు కొల్లగొట్టుచుండెననియు, వర్తమానవిషయముగా వ్రాసియున్నాడు (E. I. XIII p. 180; పైయలచ్ఛి శ్లో. 276) ఈసమయమున కూడ మారసింహుడే రాజధానిని, సామ్రాజ్యమును రక్షించెను. (E. C. XI.) సామ్రాజ్యము బలహీనమై రాజధానీనగరమునే శత్రువులు ప్రవేశించి బాధించునంతటి విషమస్థితి సంభవించినది. శిథిలపడిపోవుచున్న సామ్రాజ్యమును నిలుపుటకు మారసింహనృపతి కావించుచుండిన ప్రయత్నము లన్నియు రాజకుటుంబముతో నాతని కుండిన బాంధవ్యముచేతనే

క్రీ. శ. 973-78 సం.మున తన పరాజయానంతరము, ఎప్పుడో ఖొట్టిగచక్రవర్తి మరణించియుండవలయును. రాజ్యవిప్లవాదికములకాల మది. అతని యనంతరము రాజ్యాధిరోహణ మొనరించిన ద్వితీయకర్కరాజు క్లిష్టసన్నివేశములలో నుండినది స్పష్టము. మారసింహుడు తాను మాన్యఖేటమును సంరక్షించినట్లు చెప్పుకొనియుండుటచే శత్రువిద్రావణ మొనరించి కర్కరాజును మాన్యఖేటమందే అభిషిక్తుని గావించియుండును. అనంతర చరిత్రము ఈయూహకు బలమొసంగుచున్నది. కర్కరాజు చిరకాలము రాజ్యమును వహింపలేదు. పరాక్రమశాలియైన మారసింహునిచే పరిరక్షితము మైనను నాతని మును అసువులును త్వరలోనే పోయినవి. రాజ్యాధిరోహణ మొనరించిన కొలది నెలలలోనే చాళుక్యకులతిలకుడైన తైలపదేవుడు యుద్ధమున నీతనిని ఈతనికి సహాయుడైన ఒకానొక రణస్తంభుని (ఇతడెవడో ఇంకను తెలియక యేయున్నది) చంపి క్రీ. శ. 973 మొదలు రాజ్యమేలినట్లు శాసనములచే తెలియుచున్నది. (E. I. III P. 292) కర్కరాజు తన ఖార్ధ (Kharda) తామ్రశాసనములో తాను పాండ్యులకు భయంకరుడడనియు హూణులతో పోరాడినట్లును చోళ ఘూర్జర సైన్యములను నిర్జించినట్లును తెలుపుకొనియుండుటచేతను అత్యల్పకాలమే (కొలదినెలలే) రాజ్యమేలియుండుటచేతను ఎడతెగని పోరాటములలో పాల్గొని తుదకు రణనిహతుడాయె ననుట స్పష్టము. (I. A. XII p. 263) ఈ యుద్ధకాలమున మాన్యఖేటనగరము కర్కరాజు వశమునుండి అనంతరము శత్రుహస్తగతమైనట్లును తెలియుచున్నది. కర్కరాజు ననంతరము నాలవ ఇంద్రుడు రాజ్యమునకు వారసు. కాని యాతని పట్టాభిషేకము సులువుగా జరుగలేదు. మారసింహుని గొప్పప్రయత్నము కావలసి వచ్చినది. రాష్ట్రకూటుల శత్రువులను తఱిమివైచి నగరమును తన భుజములు కాచుచుండ ఇంద్రరాజునకు మారసింహుడు పట్టబంధనోత్సవము కావించెను. "భుజబలపరిపాలిత మాన్యఖేట ప్రవేశిత చక్రవర్తి కటకస్య" అని చెప్పుకొనియున్నాడు. (E. I. V, 18) ఆకాలమున మాన్యఖేటమును ఆక్రమించుకొనియుండదగిన శత్రువు తైలపుడు తప్ప అన్యుడెవ్వడు?

రాష్ట్రకూటుల శత్రువులలో తైలపదేవుడు ప్రధానుడు. ముమ్మడి కృష్ణరాజు రాజ్యకాలమున నీతడు ఆతని సామంతుడుగ తద్దవాడి (లేక తర్దవాడి) విషయమును 957 క్రీ.శ. లో పరిపాలించుచుండెను. దీనికి తర్దవాడి సాయిరమని నామాంతరము. అనగా వేయిగ్రామముల తెర్దవాడియని యర్థము. (B. K. 113 of 1929—30 M. E. R.) ఈకాలమున నీతనికేవియు బిరుదములు వహింపబడియుండలేదు. తర్వాత క్రీ. శ. 965 సం. నాటికి మహాసామంతాధిప, చాళుక్యరామ, సత్యాశ్రయకులతిలక ఆహవమల్ల బిరుదములతో ఆప్రదేశమునే అనుగజీవితముగా ననుభ

వించుచుండినట్లు కనఁబడుచున్నది. (B. K. I. 1, 40) అణుగులు లేక అనుఁగులన రాచలెంకలు. వీరలకే ఏకాంగవీరులనియు పేరు. వీరు కొన్ని ప్రమాణాదికములచే రాజులకు అనుచరభటులై రాజుల ప్రాణమానములను కాపాడుటకు దీక్ష వహించి 'రాజకుమారు'లని ప్రసిద్ధినంది కొన్ని సమయములలో రాజులు మరణించినను కూడ ప్రాణత్యాగము చేయుచు, పరిపాలనాదికములలో సామంతపదవుల మహామండలేశ్వర బిరుదములనుపొంది మహోన్నతపదవి ననుభవించుచుండిరి. ఈయాచారమే నేటికిని 'నగరిపిల్లకాయలు' అనువారియందు కొన్ని సంస్థానములలో కొంత వఱకు చూడనగును. (ఈ విషయమును వివరముగా శ్రీ డాక్టరు నే. వేంకటరమణయ్య ఎమ్.ఏ., పి.హెచ్.డి.గారి 'జోళవాళి వేళవాళి వెంకవాళి' అను వ్యాసమున చూడనగును. Journal of Oriental Research Vol XIV Part II)

సామంతులలో నొకఁడయిన తైలపదేవుఁడు రాష్ట్రకూటరాజ్యపతనము తప్పదని గ్రహించి కుంతలరాజ్య సమాకర్షణమునకు గడంగినట్లు కనఁబడుచున్నది. ఈతని శాసనములలోనేమి, ఈతని వంశీయులవానిలోనేమి పలుతావులలో మునుఁగుచున్న భూమిని అదివరాహముం బోలె నీతఁడు పునరుద్ధరణ మొనరించెనని యున్నది. చాళుక్యుల యధికారమును మరల ప్రతిష్ఠించుటయందు నీతనికి ముమ్మడి కృష్ణరాజుయొక్క శత్రువులు సాయపడి యుండవలయును. దాహాలపురాధీశ్వరులైన చేదిరాజులు మూఁడు పర్యాయములు తమ కుమార్తెలను రాష్ట్రకూటుల కొసంగినవారు ఏకారణముచేతనో వారినిమాని చాళుక్యవంశీయుఁడును తైలపుని తండ్రియు నగు నాలవ విక్రమాదిత్యునికి తమకన్య నొసంగిరి. చేదిరాజు లక్ష్మణుని కుమార్తె బొంథాదేవి యే ఆయమ; తైలపుని తల్లి. సామంతుఁడుగానున్నను తైలపునితండ్రి విక్రమాదిత్యుఁడు ఉన్నతరాజవంశములతో సంబంధబాంధవ్యములు నెఱపుచుండెను. 'చేదీశవంశతిలకం లక్ష్మణరాజస్య నందనాం నుతశీలాం బొంథాదేవీం విధివత్ పరిణిన్యే విక్రమాదిత్యః' (I. A. xvi P—15) "విధివత్" అనువాక్యముచే సంబంధయోగ్యుఁడని తెలియుచున్నది.

మఱియు మారసింహుని శత్రువుల పరిగణనలో నొకానొక ధల్లనింగూర్చిన ప్రస్తావము కలదు. ఈధల్లఁడు వనగజమల్లునికి ప్రతిమల్లుఁడనియు ఈతనికి మారసింహుఁడు దర్పదళనముం గావించెననియు శాసనవాక్యము. 'వనగజమల్ల ప్రతిమల్లనప్ప బలవదల్ల దర్పదళన' E IV 18 పంక్తులు 8. 9) (డాక్టరు ఫ్లీటు దొరవారు బలవత్ + అల్ల (బలవదల్ల) అనియు రైసుదొరవారు బలవత్ + ధల్ల (బలవద్ధల్ల) అనియు పఠించియున్నారు E C II 281. ఇందు రైసుగారిది ప్రకరణోచితముగా నున్నది. పైగా సమకాలికులలో ధల్లఁడని యొకప్రఖ్యాతపురుషుఁడు కనఁబడుచున్నాఁడేగాని అల్లఁడు కానరాఁడు) తైలపదేవుని ప్రధానామా

త్యుని నామధేయము ధల్లఁడు. ఈతఁడు వాజివంశమునకు చెందిన (నియోగి) బ్రాహ్మణుఁడు; సుప్రసిద్ధుఁడైన యోధుఁడు; పరిపాలనాసమర్థుఁడు; తైలపుని మహామంత్రాక్షపటలమునకు అధిపతి. అక్షపటలమనగా రెవిన్యూడిపార్టుమెంటు. ఈతనికి తైలపదేవునకును అభేద ప్రతిపత్తి.

"ధల్లంగం నెగర్దాహవ
మల్లంగం భేదముంటె విభవదొళదనే
నల్లరు మఱియర్ ధరణీ
వల్లభ సింహాసనైక భేదమభేదం."

ధల్లనికి ఆహవమల్లునికిని విభవమునందు భేదము లేదనియు, సింహాసనైకభేదమే భేదమనియు పద్యార్థము. తైలపునికి మండలమును స్వాధీన మొనర్చినందున 'మండలసిద్ధ'యనియు, మహామంత్రియగుటచే 'వివేకబృహస్పతి' యనియు, 'సచివోత్తము' డనియు, పరిశుద్ధుఁడగుటచే 'చతురపదావిశుద్ధుఁ' డనియు పొగడ్త గన్నవాఁడు. పైగా 'చక్రవర్తిసభాసంవాస చతుర' అనియు ప్రసిద్ధుఁడు. (B.K. I. I. 52) వీనిఁ జూడఁగా నీతఁడు తొలుత కృష్ణరాజశత్రువై "శత్రుశత్రువు"మిత్రుఁడైన పగిది తైలపునికి మిత్రుఁడై కార్యజ్ఞుఁడై మహామంత్రియై పలు తెఱఁగుల తోడ్పడినట్లు తెలియుచున్నది. ఇతని కుమారుఁడును మనుమఁడును బంధువులును వంశక్రమాగతముగ తర్వాతివారెల్ల చాళుక్యుల కొలువుననుండి ప్రఖ్యాతి గాంచిరి.

మఱియు ఈధల్లామాత్యుని వియ్యంకుఁడు మల్లపయ్య తెనుఁగు బ్రాహ్మణుఁడు; కౌండిన్య గోత్రజుఁడు వేంగిమండలము నందలి కంమెవిషయమునందలి పుంగనూర జనించినవాఁడు. ఈతఁడు తనకుమార్తెను ధల్లామాత్యుని పుత్త్రుఁడును అసహాయశూరుండునైన నాగమయ్య కొసంగుటయేగాక ధల్లనితో సమానపదవినంది 'శ్రీమదాహవమల్లదేవ సామ్రాజ్యలక్ష్మీ ప్రవర్ధమాన హేతుభూత నిజాదేశపరంపరావకాశిత ప్రజ్ఞానాతిశయుఁ' డనియు 'అభినవకృపాచార్యుఁ' డనియు నుతికెక్కినాఁడు. (అజితపురాణము - కన్నడము - పీఠిక ౨౨) చూడఁగా ధల్లామాత్యుఁడును ఆంధ్రుఁడే కావలయును. వీరిది జైనమతము.

మాన్యఖేటనగరమును పరమారులు కొల్లగొట్టినవెనుక క్రీ. శ. 972-73 సం. మున రాజకీయకల్లోలకాలమున తైలపుఁడు ధల్లామాత్యుని సాయముతో రాష్ట్రకూటులను పడద్రోయుటకు గడంగియుండవలయును. ఇయ్యది ఆసంవత్సరము క్రీ. శ. 973 జూన్ నెలకు తర్వాత జరిగియుండవలయును. ఏలయన ఆనెలవఱకును కర్కరాజు శాసనములు గలవు. (I.A. XII P. 270) ఈతఁడు రణరంగమున కర్కరాజును పరిమార్చి (E. I. III P. 292; I. A. XVI P. 15) మాన్యఖేటనగరమును ప్రవేశించి యుండవలయును.

ఇట్టి సన్నివేశమున మారసింహప్రభు వెట్లూరకుండగలఁడు? రాష్ట్రకూటులలో నిఁక మిగిలినవాఁడు నాలవ ఇంద్రరాజు,

మారసింహునికి మేనల్లుఁడు, ముమ్మడి కృష్ణరాజునకు మనుమడు. ఇంద్రరాజును రాజ్యమందు ప్రతిష్ఠించుట సులభసాధ్యము గాదు. మాన్యఖేటనగరము శత్రువులచేత పడిపోయినది; నొళంబ పల్లవరాజులు తిరుగఁబడి మారసింహుని ఎదిరింపసాగిరి. రెండుపనులలో మారసింహుఁడు తొలుత నొళంబులను సాధించి వెనుక మాన్యఖేటమును గ్రహింపఁగల్గెను. ఇందులకు కారణము తైలవునకు వారు సహాయులై యుండి వారిని సాధించిననే మాన్యఖేటము సులువుగా కైవసము గాకయుండినట్లు తర్వాతి చరిత్రముచే తెలియుచున్నది.

నొలంబపల్లవులు గాంగులకు సామంతులుగా నుండి ఈకాలమున బలవంతులై తిరుగఁబడసాగిరి, మారసింహుఁడు ఈ నొలంబుల తిరుగుబాటునకు కారణమును లెక్కలేని రాజపుత్రులు కొలువున్న సైన్యము యొక్కయు మత్తేభముల యొక్కయు బలముచే గలిగిన యహంకారమని వచించెను. (**E. C. II** 281) ఈనొలంబులను జయించినందుకే 'నొలంబకులాంతకుఁ'డని బిరుదమును వహించెను. ఈయుద్ధము గోనూరను ప్రదేశమున నూరిబయుట బయలులో జరిగినదనియు ఆ యుద్ధమున మహాపరాక్రమమును చూపి మారసింహుని మెప్పించి ఆతని మంత్రి చాముండరాయఁడను నాతఁడు 'వీరమార్తాండ' బిరుదమును వహించెనని చాముండరాయపురాణము చెప్పుచున్నది. (చాముండ. పురా. కన్నడము) వందల కొలఁది రాజపుత్రుల సాయముచే నీ నొలంబు లహంకరించి రనఁగా నీ రాజపుత్రు లెవరు? రాజపుత్ర శబ్దమునకు రాజుయొక్క కుమారులనియే యర్థము కాదు. క్షత్రియకుమారు లెల్లరును రాజపుత్రులే. పైగా వీరికి కుమారులనియు నామాంతరము గలదు. రాజాస్థానమున రాజగౌరవమునకు పాత్రులైన రాజవంశీయు లెల్లరును 'కుమారవర్గము'నఁ జేరుచుండిరి. వీరికే అనుఁగులనియు లెంకలనియు అంకకారులనియు నామాంతరములు. (తైలపుఁడును ఒక లెంకగానుండిన వాఁడే యనియు ఆవిస్తరమును శ్రీ డాక్టరు నే. వెం. గారి వ్యాసమున చూడవగునని ముందే సూచితిమి) ఈ లెంకలు బలుప్రమాణములచే రాజుల ప్రాణమానములను కాపాడుటకు దృఢదీక్ష వహించిన వారు. ఇట్టి అంగరక్షకబలము ఉత్కృష్ట క్షత్రియకుమారాధిష్ఠితము నొలంబరాజుల కడ క్రీ.శ. 1045, 1046 సంవత్సరములలో నుండినట్లు మంచి నిదర్శనములు గలవు. (**S. I. I. IX-I.** (101, 104) వీరు త్రైలోక్యమల్లాహవమల్లబిరుదాంకితుఁడైన మొదటి సోమేశ్వరుని(చాళుక్య)కి సామంతులుగా నున్నప్పుడు తమకడ తమరాజ్యరక్షణమునకై వేయిమంది లెంకల నుంచుకొనియుండిరి. వీరికి నాయకుఁడు దండనాయకుఁడయిన తిక్కణ్ణ(తిక్కన). నొలంబరాజ్య మూలస్తంభాయమానులనియు వీరావతారులనియు ఏకైకవీరులనియు వీరిప్రశస్తి ఎంతయేనియు గలదు. నొళంబులకును మారసింహునకును జరిగిన పోరాటములో వారి మూలబలమైన (?) రాజ

కుమారులు బలముగా పోరాడియుండవలయును.

ఈవిషయమునే రన్నకవి అజితపురాణమున "కుమారలోధ్ర సమర" మనియు, "కుమరరకాళగ" మనియు వర్ణించి అంకు తైలపుడును తైలపుని పరివారమును పోరాడిన విధమును విశదీకరించినాడు. అసంఖ్యాకులైన 'కుమారులు' పాల్గొనిన యుద్ధము సుప్రసిద్ధము. ఇదితప్ప వేరు కానరాదు. ఈయుద్ధమున పొన్నమయ్య నాగమయ్యలను ఇరువురు బ్రాహ్మణులు, జైనులు, తైలపునకై పోరాడిరి. వీరిలో పొన్నమయ్య అమాత్యశేఖరుడైన మల్లపయ్యకు సోదరుడు. నాగమయ్య మల్లపుని యల్లుడు మహామాత్యుడయిన ధల్లని కుమారుడు. తైలపుడు చూచుచుండగా శత్రువుల యేనుగులను తునియలుగా నఱికి అతనికి నాగమయ్య సంతస మొసంగెను. ఈతని ధాటికి వెఱచి శత్రువుల యంగరక్షకులు పాఱిపోయిరి. (అజితపురాణము-కన్నడ)

ఈయుద్ధమున మారసింహునికి జయమబ్బినను నొలంబులబలము నశింపలేదు. వీరు ఆవెనుక అనతికాలముననే చాళుక్యుల సామంతులై వారితో సంబధబాంధవ్యములు కలుపుకొనిరి. తైలపునకు వీరికిని సఖ్యముండి ఈయుద్ధమున తైలపుడు వీరికి సాయము చేసెను. నొళంబుల యుద్ధమే కుమారలోధ్రసమర మనుట కేమాటంకము కనబడలేదు.

ఈయుద్ధానంతరము మారసింహుడు మాన్యఖేటముపై దాడివెడలి అచటిశత్రువును (తైలపుని) తఱిమి ఇంద్రరాజునకు ఆపెద్దల నగరముననే మహావైభవమున పట్టాభిషేక మొనర్చెను. ఇంద్రరాజ పట్టబంధనోత్సవము క్రీ.శ. 974వ సం. జూలై నెలకు ముందే జరిగియుండవలయును; ఏలయన అప్పటికి మారసింహుడు గతించినట్లు తెలియుచున్నది. (**E.C.X. Mb 84**) ఈసందర్భములన్నియు నొకటివెనుక నొకటిగా క్రీ.శ. 973 జూన్ నెల మొదలు కర్కరాజు పరాజితుడైనప్పటినుండి త్వరత్వరగా జరిగిపోయినవి. మారసింహుడు ఇంతపని చేసియు శత్రుబలము తగ్గలేదు. ఇంద్రరాజ పట్టబంధనోత్సవ కాలముననే ఆతనిని నిండుసభలో చాళుక్యవంశజుడయిన రాజాదిత్యుడను రాజపుత్రుడు అధిక్షేపించెను. (**E. C. II. 281**) ఈ రాజాదిత్యుని తఱిమి చాముండరాయుడు (మారసింహుని మంత్రి) ఏకరుడుగానే ఉచ్చంగికుర్గమును ఓడించెను. (చాముండరాయ పురాణము)

ఇంద్రరాజ పట్టాభిషేకానంతరము కొంతకాలము (కొన్ని నెలలైనను) శాంతి కలిగి యుండవలయును. లేదా రాజకీయ పరిస్థితి కుదుటపడినట్లు మారసింహుడు తలంచియైన నుండవలయును. ఏలన నాతడు ఐహికవ్యాపారములను త్యజించి శ్రావణబెళగొళయందు జైనమఠమును ప్రవేశించి జినదీక్షవహించి సల్లేఖనమార్గమున క్రీ.శ. 974 సం. అసువులను త్యజించెను. (E C II Sb 38 E C X 84) ఆతని పనులను ఆతని యమాత్యుడు చాముండరాయుడు చూడసాగెను.

కాని ఇంద్రరాజు పదవి స్థిరతం జెంద లేదు. మారసింహుని వెనుక అతనియందు ఆపాటి శ్రద్ధ వహించువారు లేరైరి. అనంతర రాజకీయపరిస్థితులచే చాముండ రాయఁడు ఈతనిం త్యజించి గంగరాజ్యమును కాపాడుకొనుటకే పాటుపడవలసి వచ్చినది. ఈతనికిని తైలపునకును పోరాటము జరిగియుండు ననుటకు నిదర్శనములు కనఁబడుచున్నవి. రన్నమహాకవి అజితపురాణ పీఠికయందు ఇట్లు వ్రాసినాడు. —"పరమద్రోహులతో చేరి తన మీఁదికి యుద్ధమునకు గోవిందరుఁడను వాఁడు రాఁగా శత్రువులను పాఱద్రోలి 'తైలపరాజు చిరకాలము బ్రతుకును గాక' యని బిగ్గరగా నఱచుచు శత్రుమధ్యమున కుఱికి పలువురను పడఁగొట్టి రణరంగమున పొన్నమయ్య ప్రాణములను త్యజించెను" అని. ఈపొన్నమయ్య మునుపటి పొన్నమయ్యయో, మల్లపునిసోదరుఁడు. ఈగోవిందరుఁడు మారసింహుని సోదరుఁడైన నీతిమార్గ గోవిందరనరేంద్రుఁడు. ( E. C. VIII Nr 35 ) మారసింహుని యనంతరము ఈతఁడు గంగ రాజాయెను. ఈతనికి చాముండరాయఁడు సాయము చేసినట్లు నిదర్శనము లున్నవి. బాగెయూర కోటలో త్రిభువనవీరుఁడను వానిని చంపి గోవిందరుని అందు ప్రవేశింపించిన కారణమున తాను 'వైరికులకాలదండ' మను బిరుదము వహించెను. ( చావుండరాయపురాణము ప.21) అనంతర మీ గోవిందరుని చరిత్రము తెలియరాదు. ముదురాచయ యను నాతఁడు గంగరాజ్యము నపహరింప గడంగుడు ఆతనిం జంపి చాముండ రాయఁడు ( చావుండరాయ పురాణము ప. 21 ) నాలుగవ రాచమల్లుని క్రీ. శ. 975 సం. ముందే రాజ్యాభిషిక్తుని గావించెను.

తైలపునికి ఈకాలమందే పాంచాల దేవుఁ డనువానితో పోరాటము సంభవించెను. ఈ పాంచాలదేవుఁడు మారసింహునికి సామంతుఁడుగా పులిగెరె బెళ్వోళ - అను ప్రదేశములను 972 సం. పాలించుచుండెను. (I. A. XII 225). 974 - 75 సంవత్సరమున నీతఁడు ఇంకను సామంతుఁడుగానే యున్నను 'చాళుక్యపంచానన' యని బిరుదము వహించి తన రాజ్యకాంక్షను కనఁబరచెను. (E. I. VI. 257) ఈపాంచాలదేవుఁడు ఎవఁడో ఈతని పుట్టుపూర్వోత్తరము లెవ్వియో తెలియుట లేదు; ఆధారములు లేవు. కాని సూామెల్ కృష్ణస్వామయ్యంగార్లు చెప్పినట్లు నాలవ రాచమల్లుఁడు మాత్రము కానేరఁడు. (H. I. S. I.) ఈతని 'చాళుక్యపంచానన' బిరుదముచే నీతఁడు చాళుక్యవంశీయుఁడో లేక చాళుక్యులకు శత్రువో కావలయును. ఈతఁడు తుదవఱకును గంగసామంతుఁడుగానే యుండినందునను, గాంగులపై తిరుగబడిన [illegible] లేనందునను బహుశః చాముండరాయునికి అనుకూలుఁడై యుండియుండవచ్చును. పాంచాలదేవుని తైలపుఁడు నిర్జించినది తైలపుని జీవితమునందలి గొప్పవిషయములలో నొకటిగా నెన్నబడియున్నది (I. A.. XXI P. 167) పాంచాలునితోడి యీయుద్ధమునందు ధల్ల

నందనుండైన నాగదేవుడే పాంచాలుని కరిఘటనలను అశ్వసైన్యమును చెల్లా చెదరుగా పశువులమందలనువలె తఱిమి వైచెను. (అజితపురా. I. 44) బూతెయ దేవుం డనునాతండు పాంచాలదేవుని తల దునిమి తైలపునిచే 'మహామండలేశ్వర' పదవిని 'ఆహవమల్ల'బిరుదము నందెను.

ఇప్పటికి తైలపునకు రాజ్యము వదిల మాయెను. ఈతండు శ్రీముఖ సంవత్సరము నుండి (973 క్రీ.శ.) రాజ్యము చేసినట్లు ఈతని వంశీయులు చెప్పుకొనియున్నను (I. A. XXI P. 167) క్రీ. శ. 976 వఱకును ఈతని శాసనములు ఈతనిని రాజునుగా పేర్కొనియుండలేదు; ఇంతవనుక ఈతని సమగ్రరాజబిరుదములు కానరావు. మహామండలేశ్వరునుగానే కనంబడుచున్నాండు. కర్కరాజును ఓడించుట మొదలు ఇంతవఱకు ఎడతెగని పోరాటమున పాల్గొనియుండెను. తుదకు శత్రువుల నొకరొకరినిగా నిర్జించి క్రీ. శ. 976 సం. భావ, పూర్ణ రాజబిరుదములను వహించెను. (S. I. I. IX-I. 73).

తైలపునకు రాష్ట్రకూటులలో కొందఱు చీలి సాయముచేసియైన యుండవలయును లేదా మిగిలిన రాష్ట్రకూటులు ఆతనితో సంధి చేసికొనియైన యుండవలయును. ఏలయన తైలపుని రాణి జాకలదేవి (జాకవ్వె) రాష్ట్రకూట బ్రహ్మరాజు (బమ్మహరట్ట) కొమార్తె. రాష్ట్రకూట సామ్రాజ్య మంతరించిపోయినది. ఇంక దానిని పునరుద్ధరించుమాటయైనను లేకపోయినది. ఇంద్రరాజు వసంతరచరిత్రము దురూహము. మారసింహునివలె ఈతండును జైన సన్యాసియై శ్రావణ బెళగొళ యందు క్రీ.శ. 980 సం. మార్చి 20 తారీఖున సల్లేఖనమార్గమున ప్రాణత్యాగ మొనరించెను.

తైలపుండు ఆ వెనుక నెప్పుడో మరల మాన్యఖేటమును కైవశ మొనర్చుకొని యుండవలయును. రాష్ట్రకూట సామ్రాజ్యమునంతయు వశము చేసికొనినయాతండు ఈ చిన్న ప్రదేశమును వదలియుండడు గదా. పైగా నీతండు క్రీ. శ. 993 సం. మాన్యఖేటము నెలవీడుగా నొసంగిన యొక శాసనము కలదు. (B. K. 170 of 1933-34)

### ఇందలి సంకేతములు

E. I. ఎపిగ్రాఫియా ఇండికా
E C. " కర్నాటికా
I. A. ఇండియన్ ఆంటిక్వెరి
B. K. బాంబే కార్నాటిక్ శాసనసంపుటి
M E. R. మద్రాస్ ఎపిగ్రఫీ రిపోర్టు
S. I. I. సౌత్ ఇండియన్ (ఇన్స్క్రిప్షన్స్) శాసనములు

ఇందు దాహృత ప్రబంధములు కన్నడము వాఙ్మయమునకు చెందినవి.



# పార్వతీపరిణయకావ్యము

శ్రీ యేలూరుపాటి రామభద్ర చయనులుగారు

కవితాసారస్యమెంచి దినవెచ్చమునకై నాల్గురూకలనుగాని పైన గప్పికొన బచ్చడమైనగాని విసరని 1 శార్దూలమననేమొ యెఱుగని, 2 సరసప్రబంధముల చదువుచుండిన మంచి కల్పనయుని యెంచికొనని, 3 స్థాణువుల నెంచుచు కవివర్యుల పోషించుట రాజధర్మమని నాటిన మహనీయుడు, వాగ్దేవిచే దిద్దబడిన కృతికర్త కోటిరాయ రఘునాథ తొండమాన్ మహీపాలుడు పార్వతీపరిణయ కృతికర్త. ఈతడు 1767—1789 సం॥ వరకును పుదుకోటరాజ్య మేలినవాడు. కవితాసతిని గిలిగింతలు పెట్టి సొక్కించి వశవర్తినిగా జేసికొనిన కులక్రమాయాత సాహితీవిద్యావద్యుడు. 4 కృష్ణదేవరాయమహీజాని యనంతరము ప్రసిద్ధికెక్కిన రాజకవివర్యులలో వన్నెకెక్కిన యీతని కావ్యము నేడాంధ్రలోకమునందు పూర్వకావ్యకోటిలో చేరకుండుట కాతని కవితలో నందందుదోచు పాకకాఠిన్యము, లక్షణదూరతలు కారణములుగానోపు. పార్వతీ పరిణయ కథ ననేకు లనేకరూపముల వెలువరించిరి. కాని యేమహాకవియు రఘునాథరాయుల జాడల బోయినవాఁడు లేఁడు. ప్రారంభము నుండి తుదివఱకు పాఠకుల మనంబుల నుఱ్ఱూతలూగించు పదప్రయోజనము నీతఁడు నెఱపి ధన్యుడైనాఁడు. కవితాకల్పనా విశేషముల తానే తెల్పుచు పాఠకుల దృష్టి నావంకకు మరలించుచు వచ్చెను. ఈతనికి తెలుగుబాసను పాటవము తక్కువయని వ్రాసిన "సరస్వతీ" పత్రికాధిపతులు సాహసమూని రనక తప్పదు. 960 పద్యములు వ్రాసిన యీతనికి తెనుగున ప్రావీణ్యము తక్కియుండె ననుటకు వీలగునా? ఈతని

---

1. ఉ. వెచ్చము సేయ నేమయిన వేడెదమంచని పోయి పద్యము
లిచ్చట మీఱ జెప్పి వినుమోయి యటన్నను దప్పులెన్నగా
వచ్చెదు గెంచుగాని విసయమ్మునుజూపుచు నాల్గురూకలన్
బచ్చడమెత్తి నాపయినవైవడు లోభ మదేమిజెప్పుదున్. II – 94

2. సీ. ... ... ... ... ...
శార్దూలవృత్తంబు చదివిన యిది కందపద్యంబు గణముల బంచుమనును. II-95

3. సీ. ... ... ... ... ...
సరసప్రబంధముల్ జదువుచునుండిన మంచికల్పనయంచు నెంచికొనడు. II-149

4. గద్యలో ... ... ...

తెనుఁగుపదముల ప్రయోగించు నేర్పును జూపుటకు విస్తరభీతిని వదలితిని. రాచకు డైనకవి ప్రయోగదుష్టతను పాటించడు. పోతనామలీకోటిలోనివారేయని విజ్ఞులందురు.

వరించేవేళ (I-1), గదిమేటందుకు (II-103), వుంతాము (V-264), యెంచేవట్ల (V-253) గలిగేవి (V-2?8) ఇట్టి ప్రయోగదుష్టత కొన్నిచోట్ల నోచి నను కావ్యమంతటిని లాక్షణికముగానే నడపినాడు. ఔచిత్యపోషణమున నీతఁడు దిట్ట యైనను ఒకట రెంట ననభ్యపు వ్రాతల వ్రాసెను

పార్వతి చలికత్తెలతో వృద్ధబ్రాహ్మణవేషముననున్న శివుని నిందించుచు

"...బత్తెసంగాతి కనవడకున్న జీరెడు కరణిని వినబడు గాకకొంతు" (IV-108)

అని పలికినదట.

పాకచతుష్టయమును ఋళితముచేసి సిద్ధపరచిన యీతని కొత్తపాకమును రసజ్ఞు లేపేరునఁ బిలిచెదరో ! కవిసామాన్యముగు నతిశయోక్తియుక్తి యీతని కవితయందు దండిగ కలదు. వెత్తపనులుగ నీకాలమునదోఁచు సనాతనపుటాచారములు కొన్ని మహీపాలుడగు నీతని కండ్లబడి మెప్పునే బడసినవి.

(1) క. కతిగిన నతకడటంచున్
మతిమంతులు పలుకుబలుకు మాటోటులకున్
స్మృతికంటె హెచ్చుగావున
నతివేగమ పెండ్లివడుపు మవుడౌనంచున్ (V-87)

(2) క. పాలన్నమన్నగాదన
మేలే యొకపళ్ళెరాన మెలఁతుకతోనే
నేలాగున భుజియించుట
యాలేనీవాద శాస్త్రమున్నదిగాదే. (V-217)

(3) గీ. కొంగుముల్లను వైవంగఁ గొంకి కొంకి
చిఱునగవు మోమునందునఁ జెంగలింప
నిదియు నొకశాస్త్రమా యను నింతితోడ
స్నానముం జేసి ధౌత వస్త్రములుదాల్చి.

రతివర్ణనము మొదలగు నౌచిత్యశూన్యతల నితడు తడవి పదగాంభీర్యమును పెంపొందించుకొనఁ బూనలేదు. పార్వతీ పరిణయ రతీవిలాపమున నీతడు కాళిదాసు ననుసరించిన పట్లు రెండుమాత్రము గన్పట్టుచున్నవి. బాలసరస్వతి 'కోడూరు వెంకటాచలకవి' శివరహస్యఖండములోని రతీవిలాపమున జాలవఱకు కాళిదాసునే యనుకరించెను. "అచలాత్మజాపరిణయము"ను కాళిదాసును జూచి దిద్దిన యొరవడియే! నన్నెచోడుడు కాళిదాసుని ననుయాయియే. ఈ శైవకథను వ్రాసిన పలువురుకవు ల్తీ త్రోవను బోయినవారే. రఘునాథరాయలుమాత్రము స్వకపోలకల్పితముల నేరచించి

పరమతానుయాయిగా నుండె నని కడపటను జదివిన దెలియగలదు. ఈతఁడు వాత్స్యాయనాది వేదాంతపర్యంత నిఖిలతంత్రనిర్మిత గ్రంథశకృచ్ఛ్రవణ మేగాక బహుపురాణశ్రవణము జేసినవాడని చెప్పకతప్పదు. శబ్దశాస్త్రమున నీతని పరిచితిని జూతము:—

కం. స్త్రీలోపము పుంశేషం
బేలీలన్ ద్వంద్వమున మునీంద్రుడు చెప్పెన్
శూలికడఁ జదివి తన్మత
మీలాగని తెలియఁడయ్యె నికనేమందున్. (III - 86)

దీనిని జదివి క్రీ. శే. తిరుపతిశాస్త్రి మహాశయులు ఆనందచకితు లయినట్లు మా మిత్రులు శ్రీ మంగిపూడి వెంకటశర్మగారొకప్పుడు నుడివిరి. వ్యాకృతివిశేషము లిట్టివనేకములు. మచ్చునకు గొన్ని:—

1. గీ. అంత హరుడు స్వపాణినీయుతను దెల్పె
నచల కన్యాకరంబున కది స్వకంఠ
నారవమిషంబునను శబ్దవార మెఱిగి
సంతతము తత్త్వదర్శ ప్రసంగితగను. V-169
(ఉణాదిప్రత్యయవిశేషః=కంకణమితిసంజ్ఞా)

2. క. అతిరసముల వడ్డించితి
వతికిసతిక్రాంతిమనెడి యర్థంబే మీ
మతినూహించితి నీవీ
గతి నేచేసితివి రిత్త గగనసరిత్తా. V-181

3. గీ. సలిలదుగ్ధంబులకు క్షీరశబ్దవాచ్య
భావసంపత్తి నొకటియై పరగుననుచు
నీళ్ళఁ బాలని వడ్డించు నిన్నువంటి
దొకవిదుషీకల్లునె వినంగ నోసిగంగ, V-188

4. గీ అనుచు నీరీతి బీరాలనాడి మఱచి
తరలజేతు గిరీశుల ధైర్య మనిన
గర్మసంబంధషష్ఠి కేగతిని వచ్చె
బహువచనమంచు నిందురిందు పలుకరింప. II-130

5. గీ. అపగతంబయ్యె భేదబ్రియంబులేని
పురహరుడుదోచు బూజార్థమున నటన్న
వేఱచెప్పిన నీతడు గారవింపఁ
డనుచు యోచించి పూజార్థమున నటన్న. II-181

6. సుప్తిఙంతములు కాకేక పదసంజ్ఞం జెందుటకు. IV-130

సుపాంతిఙాంచ వ్యుత్పత్తిం వాచాం వాంఛంత్యలం క్రియాం
తదేతదాహుస్సౌశబ్ద్యంనార్థ వ్యుత్పత్తిరీదృశీ. (భామహుడు) 1-14
వ్యుత్పత్తిస్సుప్తిఙాం యాతుప్రోచ్యతే సా సుశబ్దతా. (సరస్వతీకంఠాభరణం)

7. గీ. అంగజారే నమోనమో యనుచు ముక్క-
దత్పురుషవిగ్రహంబంచు దలతు రాఖ్య
బిడ్డలకువీర లిది బహువ్రీహియగుట
తెలియలేరని యాత్మలో దలచుచుండ. V-37

8. సీ. చుకుసుమిదర్శ్నిమచ్ఛుద్ధకాణచయంబు| సనినేత్రిమత్త్రపుజానివహము
జగణేశిమన్నేత్రయుగశాలిలోకంబు| శిశిఖేమన్మత్తసింధురాస్య
మాత్రితన్మభూమద్వియచ్చారివక్త్రం బు|పాంక్తివివదనిమత్పద్మభవము
దైవతీతపతిమద్దంకాధినాథంబు | భుజజిగరాడిమద్భూధరారి
గీ. గాను నిలసిల్లె శైలకన్యానిమిత్త
ధృతమహాద్భుతసౌందర్యదేహ శర్వ
మందమందవిలాసి క్రమావలోక
కార్యధుర్యత మేష్టి జగత్సృష్టి. V-161

అర్థము:—చుకుసుమిదర్శ్నిమచ్ఛుద్ధకాణచయంబు—

పశ్యతీతిదర్శః పచాద్యచ్-కుసుమినా సాదర్శశ్చ కుసుమిదర్శిః. స ఇవ భవితు మిచ్ఛతీతి చుకుసుమిదర్శ్నిమన్-కర్తృభూతోపమానవాచకాత్ - ఆచారార్థే సర్వప్రాతిపదికేభ్యః కిబ్వా వక్తవ్యః ఇతిక్విపి. ధాతోః కర్మణః ఇతీచ్ఛార్థే సనియద్దేష్టం నామధాతుష్విధి ప్రథమైకాజ్భాగస్యద్విత్వే అతోలోకే లటిశతరియాపం. సః శుద్ధకాణచయః యస్యసః. కేవలగ్రుడ్డివారల సమూహము కంట పూవులుగలిగి కొంచముకొంచెము చూచువారివలె దాముగూడ జూచుటను గోరుచున్నదనిభావము.

సనినేత్రిమత్త్రపుజానివహము—

నేత్రాభ్యాం సహితః సనేత్రః తతఃక్విపి సనిచ పూర్వవత్ప్రక్రియా కంట పూవులులేని నేత్రములను కలిగియుండుటకు గోరుచున్నారు.

జగణేశిమన్నేత్రయుగశాలిలోకంబు—

నేత్రయుగము కలవారు గణేశుడువలె నుండగోరుచున్నారు. గణేశుడు గజముఖుడు చిన్ననైన కండ్లుగలిగి అరగన్ను మూతగలవాడు. నిద్రపోవకుండుటను గోరుచున్నారు,

శిశిఖేనిమన్మత్తసింధురాస్యము

ఖే + ఇన-"ఏతీతి=సంచరతీతి=ఇనః + ఇణ్ గతౌ (లింగాభట్టు)

ఖేన=ఆకాశమునందు సంచరించు నట్టివారు దేవతలు=వారివలె అనిమిషత్వమును గణేశుడు కోరుచున్నాడని భావము.

ఆత్రితత్మ భూవద్వియచ్చారి వక్త్రంబు :

దేవతా సముదాయము ( ఆత్మ-భూః ) బ్రహ్మవలె నుండగోరుచున్నది. అనగా చతుర్ముఖత్వమున నెనిమిది కండ్లుండును.

పంక్తివివదనివత్పద్మభవము

రావణుడువలె నుండగోరుచున్నాడు. బహ్మ ( పంక్తివదనః=రావణః ) "రావణుడు పార్వతీవివాహమున నున్నాడా యనునది చింత్యము. కవి సమయముల నిట్టివి చేరినట్టులేదు. ఇది యనౌచిత్యమనబడును. పండితులు కవులునుగూడ నిట్టి ప్రయోగములలో పొరబడుచునే వచ్చిరి. కాళిదాస మహాకవి కుమారసంభవమున పార్వతీ వివాహాంగకమైన అనంగత్వమును ( మన్మథుని ) ముందే చెప్పియున్నాడు. వేదాంత దేశికుడు హంససందేశమున రామునిచే తానెఱుగని కౌబేరపుష్పక ప్రశంస ప్రస్రవణ పర్వతమందే చేయించినాడు. ఆంశికము నూహించి శ్రీ పురుషోత్తమ దేవుఁడు త్రికాండశేషమున కృష్ణసారథియగుదారుకుని విష్ణు సారధిగను, కృష్ణ మంత్రియగు ఉద్ధవుని విష్ణు మంత్రిగను జెప్పినాడు. ఇట్టి వనేకములు. ఈపార్వతీపరిణయమునందే "పాండ్యుని మధురలోపలను గొన్నిదినాలు కట్టెలమ్మిన సుద్ది కలదో లేదో! అను ముందు రాబోవు గాధను శివునిచే జెప్పించినాడు. పార్వతీ విరహవర్ణన సమయమున" గీతలలోనఁ బార్థునకు కృష్ణుడు దెల్పినయర్థ మట్లైకా" యని కృష్ణుని నెనుకకీడ్చినాడు. పార్వతీవివాహమునకు శివుడు తరలినవుడు "ఓరయ్య గణపతి వేతయిశ్చెదగాని యబ్బబ్బ యీ దుప్పటడుగవలదు" అనెను. ఆలులేదు చూలులేదు కొడుకుపేరు సోమలింగమనునట్లు పార్వతీవివాహమునకు పూర్వమే గణపతిని బుట్టించెను. బలిజేపల్లివారు హరిశ్చంద్రునిచే అన్నమో రామచంద్రా అనిపించిరి. హరిశ్చంద్రుని కెన్నవతరమువాడు రాముడు ? శ్రీమద్భాగవతమున నారదజన్మ వృత్తాంతమున "ఏవం కృష్ణమతే ర్బ్రహ్మన్నసక్త శ్యామలాత్మనః" అని కృష్ణుని ధ్యానించుచున్నట్లు చెప్పెను. కృష్ణుని విష్ణు నవతారముగా నూహించి యిట్లు చెప్పించినాడు. ఇదియు ననౌచిత్యగణములోనిదే కావచ్చు.

దైవతీతిపతివల్లంకాధినాథంబు : లంకాధినాథుడు రావణుడు దైవతపతి శబ్దాత్ సనాదాసనః. ఆగమశాస్త్రమనిత్యమితీ డఖాలేసంజ్ఞా పూర్వకో విధిరనిత్యయితి సార్వధాతుకార్థ ధాతుకమోఽతిగుణాభావే చ రూపం. అన్యదా పతయిషదితిస్యాత్ .

భుజజీగరాడివద్భూధరారి : భూధరాణాం+అరిః = ఇంద్రః భుజగానాం రాజా = భుజగరాట్=శేషః. ఇంద్రుడు శేషుడువలె నుండగోరుచున్నాడు. శేషు

(గ) పదమతీత గ్రహగ్రాప్తపల్లవ మయ్యోసమమని యాడిన చానయెవతె।
షట్పితాపుత్రులంపు జతుల కాదామటన్న నుద్ఘట్టితంబెత్తు నువిద యెవతె।
దర్యోస్వరాలు చిత్రితరాన నడువంగ వార్తికంబని యాడువనితయెవతె।
♦ ఆటతాళకావున నటుదుగ్గడింప రూపకకావునను దీరుపదతియెవతె।
యంశకికి దేటనీబోసి యట్టిదాన। వెట్లువేడెదు బిరుదుల నిమ్మటంచు
సాధకముసేయుజతి ప్రయాసముగాదు। దుదుకులటుగట్టు దానినా
తొత్తుపట్టు. 5 ఆ. 200 వ.

♦ తాళబిరుదసంఖ్యా 104: ఆటతాళః నూతాఖ్యస ప్తతాళేష్వేకః తల్లక్షణం లఘుద్వయాద్రుతం చేతి-సరిగ సరిగమా మరిగమరిగమ పాపాగమప - గమపగాదా మపధనీనీ పధని పధనిని సాసా-లఘుళబ్ధార్థసర్వస్వము.

(ఘ) ......తంబురుల బోరగిలించి యొళవులమీటి చతుస్సారిని బడి పంచమంబునబోక పునగుకి, తెలియక పాడినది పాడువారును హెచ్చుశ్రుతినిగూడి పైయంటక గొంతులు చించుకొను వారును, ముఖంబులు మార్చివెట్టి మృదంగంబులు వాయించువారును, సమశ్రుతికలైన వీణల దగ్గశ్రుతులంచు హెచ్చించి తంత్రీస్ఫోటనంబు సేయువారును, దగ్గనపు హెచ్చుబతిలోమంబుగా బిరడల దప్పద్రిప్పి వదులు తంత్రుల మీటి సరియని యొప్పువారును. 5 ఆ. 211 వచనము

(జ) మ॥ శ్రుతులంగూడక రాగముల్ దెలుపదే శుద్ధంబుగా గంతమా।
గతిగన్నుంగపయొప్ప నుత్తమతనొగా తాళజాత్యంగసం।
గతిదప్పించి పదాలజారిజను కాంతున్ బూనుటరీతినీ।
పతిసర్వజ్ఞుడుగాన మెచ్చుకొనునో పర్వేందు బింబాననా॥

ఇట్టి వింతను కొన్నిగలవు—

ఈతనికి శిష్టాచార బ్రాహ్మణులతో పరిచయముండు. కావుననే నిత్యాచార వ్యవహారములను బాగుగా గ్రహించగలిగెను. చూడుడు.

గీ॥ శ్రోత్రియుడు దేవతార్చకై శుద్ధతోయ
పాత్రికను బూని కొనిపోవుపగిది. (III - 89)

శా॥ ఔరా యెంతటి హెచ్చు శంకరునిఁ బెండ్లాడంగ లింగంపుటా
కారంబొక్కటి మంటిముద్దగొని వేగంజేసియుల్లందుపై
మారేడాకులు రెండుపైచు నెడ బ్రేమందూరు నల్లందులో
రారాయంచన నోరుమూసికొని చేరన్నాడె యింతేటికిన్॥

క॥ అగజకు కుశలమె కుశలమె అగజమునని జలగణించుచునట్టులుగ 5-92

సీ॥ ఇష్టిరేపటి కిప్పుడెందైన నెనుకక ఘృత మబ్బదని-యరుంధతి యరింగె. V 232

ఈతని మిత్రుఁడు నుదురుమాటి వెంకనకవి(ఆంధ్రభాషార్ణవకర్త)శిష్టయజ్వయేమో!
వృద్ధశిష్ట బ్రాహ్మణునెట్లు చిత్రించెనో చూడుడు 33

(3) చ॥ కదలురదాళితో నరయు గడ్డముతో బిగితప్పికట్టును।
వ్వదలినమేనితో గనులపై బడి కప్పెడు భ్రూయుగంబుతో।
గుదియనుగేల నూనకొని క్రొళ్ళున దగ్గుచు నోటితుంపురుల్।
చెదరఁగమంబుఁ జెప్పుచును శీతనగాత్మజఁజేర నామెయున్॥ IV-61 ప

ఈతడు రాజయినను ప్రజాబాహుళ్యమున కలిసి మెలసి యుండెననుట కీతని ప్రబంధమందలి లౌకికభావయే తార్కాణము. ఈకవి దేశీయములను పలుచోట్ల నిమిడ్చెను.

4. (1) ............ఆకులఁన్। మడుపులువెట్టి వక్కపొడి V-220
(2) గీ॥ ఈపసిది వక్కవేయ కొక్కింత తాళదున్నదే V-229
(3) పడెడు పెరుగును పదివేల పళ్లుచేసి VI-184

ఇవి దాక్షిణాత్య పద్ధతులు.

మతబోధాచరణమున జరుగునని కొన్ని యువాచ్యముల నీతడత్తెను. వ్యాకృతి భాషాపదముల నీతడు విశేషముగ వాడియుంటచే పద్యముల కర్థము కనుగొన కష్టముగా నుండును.

(5) డమరుకము.

అనన చుం చుం చుంబి తైదవ శకల సుమనస్ఫురితలతికా
కృతజ టంటంట నినాదవినోద సాధకహ స్తభాస్వ
ద్డమరు కంఖంకం జనూతే రత్నముఖేన కృత్యభీషణ
మపిప తంతంతం డుచేత సిథక్తిభాసిని మస్తకోపరి
విధృత గం గం గమ్యమాన మనాదివచనై రంతరీక్షక
మనివ శంశంశంసనీయ తనుంవిలోచన దహనభస్మిత
మదన చంచంచంచరీకిత సకలసుర పీరహృద్గతు పదయుగ
సరసి జం జం జన్యమానదయం భవంత మిహాశ్రయామః॥ IV-4

పతివ్రతాత్వబోధన మెంతచక్కగా నీతండుచేసెనో చూడుఁడు.

(6) సీ॥ గంధాంధసింధుర గామినియాగాక పరగేహమున కేగ బడఁతి మొండి
శ్రుతిపుట వ్యాపకలోచనయాగాక పరవీక్షణంబునఁ బడఁతిగ్రుడ్డి
సకలశాస్త్రార్థ విచక్షణయాగాక పరునితోభాషింప బాలమూక
పతిపల్కు నోటిలోపలనున్న వినుగాక పరుడువల్కినవేళ తెరవబధిర
గీ॥ యవయవములెల్ల నున్నవి యుండు లేమి
యున్న నేమాయ నుండిన నుండువల్లె

యాడుదానికి బురుషసింహంబురీతి నడువ,
దన, బల్క, వినగను న్యాయమగునె॥ 4 ఆ. 76 ప.

అన్వయ కాఠిన్యము తటుచీ పొత్తమున కనబడు

(1) కమలాప్తుండు ప్రియాళినేచు హిమమేగం దానుదీచీప్రదే
శము జేరంజనబోవు। దీక్ష్ణతర తేజః ప్రాప్తికై పావక
త్వముఃబూన న్నిమేషసంస్థుడగుచోఁ బైబూది నూదెం దద
గ్రిమపుత్రుండని పాంథులె న్నగను మాతెందెమ్మెర ల్మెల్లగన్ III-8

(2) అటులవారలు గలయు నాద్యతురాల
కొడుకొకఁడు గల్గునతనికి గోపనాద్వ
యంబనుచు దెల్పెకాలజ్ఞ తాప్తిననగ
గూసెఁగోడులు వడిగో కొ కో యటంచు. V-265

సమాస భూయిష్ఠముగ వ్రాయుట కీత డలవాటుపడినవాడు కాడు. గద్య సీసపద్యములను గాక వృత్తములలో నాల్గు అయిదు పద్యములు మాత్రమే దీర్ఘసమాస యుతములు. వర్ణనా సందర్భమున యిట్టిపద్యములు వ్రాయుట కవి లోక పరిపాటియే.

చ॥ కలదు................ I-47
చ॥ వినుము................ V-72
మ॥ మొరసెన్ దుందుభులంత............ V-117

రతివిలాప మీతని ప్రబంధమున ప్రత్యేకత నొందినదయి యున్నది.

క॥ సన్నంపుచీరగట్టుక తిన్నగ నేనడువ తోడితెరవలిసీ! నీ
కన్నె నెలలవ నవ్వుచు నెన్నోయని మొగము విసరు నెటులిక మదనా!

చ॥ గరడిని సాముసాదనల గల్గినవాడనొ యుత్కటాయుధాల్।
కరముల గల్గువాఁడనొ చొకాటము కత్తలముల్ గలాడనో।
విరులను దూపులుంచుకొని వేడుకగా రసికాలివై చుచున్।
దిరిగెడి నీదు పాపనుపధించెను శంభుడు శూరుఁడేకగా॥ III-99

ఆ॥ పూలనేసితమిని బుట్టించి సతితోడ గూర్చబోవనిట్లు కోపగించి
కంటిమంటమరునిఁ గాల్చెగా। పరమేశుడిట్టిగొడ్డకాని నెందుగాన 3-98

సీ॥ తా నిరంజనుఁడుగాఁ దనరుచుండునుగాక శివుఁడు నాకనులట్లు చేయనేల
తాను నిర్గుణుఁడుగా దనరుచుండునుగాక శివుఁడు నాగళమట్లు చేయనేల
తామనిర్లిప్తుడై తనరుచుండునుగాక శివుఁడు నామే నట్లుచేయనేల
తాను నిస్సంగుఁడై తనరుచుండునుగాక శివుఁడునన్నట్టులు చేయనేల

తనకు సుఖమునుగావింప దలచివచ్చి పూలువైచెను దానమైచీలిచనెనె
యేదిగాయమ్ము నామగండేమిజేసె! నుద్దవిడిఁజల్పెగాయింతయోవసంత॥

గీ॥ పెండ్లిమొదలుకొన్ని పెద్దకార్యాలకు, నేగునట్టివార లెదుట నన్ను
గన్నఁదిట్టుతిట్టులన్నియు దాళెదఁ, దద్విఘాతఫలము తాళవశమె।

గీ॥ క్రోలుపులి లేగదూడను గొంచుబోవ
నరయ నమ్మాయటంచను నావు రీతి।
నోరి కొడుకాయటంచును బాటివచ్చు
నత్తఁజూచినచో వంతయగువసంత॥ III-116

క॥ కొన్నది యిట్టులవగవగ, గన్నది యిదివిన్న నెంతగా వగవదయో
క్రొన్నన విలుతునివలె నొకఁ, డున్నాడా తనులజూచు చుండమటన్నన్

గీ॥ ఉండనేయుండఁ దట్టివాడున్న, నేమి,
యామె తనుగొన్నబిడ్డపై నాశచేత।
వీని గనుచున్నదని తప్పిపోనుమాట
నేనుగనుచున్న నేమా ప్రసూనసమయ॥ III-118

గీ॥ మోసపోయుంటిఁ గూతురు మోముజూచి।
యతని నేమనజాలడా హరి నిజంబె।
కొడుకుకోడలు సంకటపడిన బడిరి!
వారిపై ప్రేమ పోవదెవ్వారికైన॥ III-121

క॥ తనకామేనను బాంధువు! తనయునికి మహోపాశరంబు దానికి గొండెల్
వినిసేయుహత్యమందా। కనుగొను మావారుని వింతకతలువసంతా॥ III-124

తారకుని పరిపాలనాదుష్టత లెట్లు గోచరింప జేసెనో జూతము:

సీ॥ తుంబురు నారదాదులకుఁ బల్లకిమోదు సానిమేళములోన సంబళంబు
దలిమాంబుపైనుండు తతిని బదాలీవాలుడ్చిములుగ హాహాహూ వులకుఁగొలువు
విశ్వావసుఁడు చేరిబృహతి నావలవైచి బోయెకిన్నర విన్కిసేయనంకె

... ... ... ... ... ...

తక్కగంధర్వయక్ష విద్యాధరాళి
లక్ష్యమావాని కంటి కేలాగుఁదెలియు।
గొడ్డువెంట బిడుంజు లోకులకు వాఁడు
గండ లుబుకంగ నన్నియు గప్పఁబడవె॥ II-98

సీ॥ భైరవి వినుపింప బాగాయె శంకరాభరణంబటంచును బ్రస్తుతించి
శార్దూలవృత్తంబు చదివిననిది కందపద్యంబుగణములఁ బంచుమనుచు

నటశాలకమునఁ బాత్రమాడుచు వచ్చిన ఘాతుకరూపకాంగములవైచుఁ
బాణినీయాన నుపన్యసించిన వానిఁ బద్మినీలైంగిక ప్రశ్నమడుగు
నెదిరికాదన్న వారలకేమి యిడఁడు
అనుసరించిన నవ్విఁబొమ్మనుచుఁ బలుకు।
మెచ్చినను మెచ్చకున్న నేమియును లేదు
కఠినచిత్తున కేరీతిఁ గలిగభూతి ।

చ। బడిబడి గూరలేమనుచువచ్చు సువారపువారిఁజూచినా
రొండలికి బాగులేదు మఱియొక్కటి యెల్లను మానిమేనినిం
జుడుకనుపింప వెన్నుడిగజుట్టును మట్టునుద్రోచి మట్టుగాఁ
బడితము బెట్టుఁడంచనుపు వారల నచ్చెదుగేమి జెప్పెదున్। II-99

సీ। పడిసెము పట్టినా పట్టుకరమ్మని వరుణుని వాయించుఁడరటు చేతఁ
గాకయించుక మేఁగలిగినా యప్పుడే హవ్యవాహనుగుండె యావులించుఁ
ద్రికమున నొక్కింతతిమురు కన్పించినా పవనుండు తత్తరపాటుఁజెందు
నూర్పుగాలి రొకింత యొకవేళ బిగిసెనా యమునికి బ్రాణాలయాసనిలుచు
వెఁకుగొను బానిసలకైన వెఱచుఁగాని
సురపతులటన్న నొక్కింత పరువుసేయఁ
డేమని వరఁబుగాంచెనో యెట్టితపము
దొరతనమ్మన వానిదే దొరతనమ్ము॥ II-100

దృశ్య ప్రబంధములలోవలె పాత్రౌచిత్యభావను వేటగాని భాషణముగఁ గనబరచెను:—

క। ఒడయా యీప్రాయంబున, నడవులలోఁజొచ్చి వేఁటలాడకయుంటే
నొడలుబ్బి జబ్బుకండలు, పడవా యీరీతి యున్కి పబువుల కగునే॥ VI-46

క॥ దగదప్పియుడుగు నొంటన్-బిగిదప్పదు జబ్బుకండపెట్టగ నీదా
వగమేలుకాదె యింకా-బగుగుణములు వేఁటలోని బద్దేయనుమీ।

క। శాపనికి జన్నమెట్లో-యాపగిదే దొరకువేఁట యగుటను పైనా
యాపుణ్యమెంత హెచ్చగు-నీ పుణ్యముజూడఁ బజసుఖంచుకతానన్।

ఉ। దేవరయింటి తొత్తు పెదతిమ్మని కూఁతురు కట్టిచాడనే
శావకుఁజెల్లు బడ్డయగుపట్లను బక్కనులేక నిద్దురం
బోవదుగాని యెల్లయదె బూచియనే దొడలేసిదానిపైఁ
జేవడకున్న బిట్టలఁతఁ జెందియు నిద్దురవోవ దెన్నఁడున్॥

ఈపద్ధతి ప్రబంధముల తఱచుగలదు.

కృతి భర్తను సంబోధించి "అవధరింపు" మని కవులు సంతుష్టి నొందు చుండ నీతఁడు

అవధరింపుము నీ వతండౌట వలన
నప్పటానంద రసమిప్పు డాత్మఁదోపఁ
దనువు మఱచితి వేమొ యూకొనవి దేల
యవలికతఁ దెల్పుమనియెదో నైనగాని.

అని శ్రోతపోకడను నడచెను.

శివుడు వృద్ధబ్రాహ్మణ వేషంబున పార్వతీ సముఖమున వివాహ పరిచ్ఛేద కోద్యోగము నెట్లు నడపెనో చూడుఁడు :—

ఉ॥ ఇంటిగనుండి యావెనుక నొక్కతెఁ గైకొని యిర్వురాటచే
వంటకమబ్బమిన్ గడుపుపాటుకు నుళ్ళగ దాను నల్లవా
ల్గంటియు నొక్క దేహముగఁ గన్పడుచుండిన యట్టిమంటనే
మంటవచింతు స్త్రీలకతఁ డాఁకలిదీర్చునె హాయిఁగూర్చునే॥ IV-50

క॥ పాండువు తనువునఁ దోఁపగ గుండల్యాదులను బుచ్చుకొన్నం జనకే
మొందుకొనుచున్న దిఁక నెట్లుండునొ పైయతని కీమె నోసగుటతగునే.

ఉ॥ బాలికతోడనీవు గనుబల్కుమి వీనుల శూలపాణికిం
గాలోకటమొ కంటివలెఁ గన్పడుచున్నది లేక కోడనే
వేళల నెక్కుచున్ దిరుగవెత్తియె యల్లది క్రిందమోపకే
కేళికయాడఁగా దెలిసెఁగీలిది నేను బ్రియాన దెల్పితిన్॥

క॥ ఒకకను దెలియుదు రాత్రుల । నొకకను పగలింట దెలివినొందకయుందున్
ఒకకన్ను పొగటకమ్మిన । దిక నెవ్వతె శివునిఁజెంద నిచ్ఛించుమదిన్॥

క॥ తనుభూషించినఁ దిట్టిన-వినుకేగాకేమి యనుచు వివరించియు దే
మనఁడా శుద్ధబ్రహ్మం-బును బెండ్లాడుచెలి సుఖముఁబొందునెబోటీ॥

శా॥ ఔరా యెంతటి హెచ్చుశంకరుని బెండ్లాడంగ లింగంపుటా
కారంబొక్కటి మంటిముద్దఁ గొని వేగంజేసి యల్లందుపై
మారేడాకులు రెండువైచు నెడఁ బ్రేమందూఱు నల్లందులో
రారాయంచన నోరుమూసికొన జేరన్నాఁడె యింతేటికిన్॥

సాధారణముగా సంగీత సభాప్రదేశములఁ గొన్నిచోటులఁ గల్గు పరిస్థితులను వర్ణించి యున్నాఁడు చూడుఁడు:—

"తంబుల కొరగించి............" V-2 వచనముఁ హా.వ.సం. పుట 128

ఈతని కాలమున పురాణాదులుకూడ సంతలుగా జెప్పుకొనుచున్నట్లు కాన్పించెడును. కానిచో వేలకొలఁది సంవత్సరములనాఁడు రచింపఁబడిన గ్రంథము

కెట్లు నిలిచియుండఁగలవు ? "అప్పుత్పన్న తాదోషపరిహారంబు సేయుటకు సకలశ్రుతి స్మృతి పురాణేతిహాసశాస్త్రముల సంతలు చెప్పుకొనురీతిని" — అని కవియే వెల్లడించి యున్నాఁడు.

నిఘంటుగతములుకాని పలు పదము లీతనిపొత్తమున గనుపించుచున్నవి. కొన్నిపదములకు క్రొత్త యర్థ మీతడిచ్చెను. లేఁగ ఈపదము సామాన్యముగా పశుజాతికే వాడబడుచుండగా నీతడు బాలికయగు పార్వతికి వాడెను. కాళిదాస మహాకవి ముప్పదినాల్గు శ్లోకములలో వాడిన రతీవిలాపము నీతడు యేబదిపద్యములలో వర్ణించెను. పద్యములన్నియు ప్రాపంచిక స్వభావానుసరణములే. ప్రబంధసరణి ననుసరించి నడచినవి. యీకావ్యమున సగముభాగమైన నాక్రమించలేదు. ఈతని కాలముననే మల్లంగిదుంప మనదేశమున వ్యాపించినట్లీత డుదహరించుటచే తెలియుచున్నది. ఈ మహారాజకవి ప్రతి పద్యమునను రసస్ఫూర్తి యుండురీతిన కావ్యము వ్రాసి ప్రబంధ నూతనతంత్రకరణ సామర్థ్య నిరంకుశ ప్రతిభా విభాసితుడై నెగడెను. ఈ ప్రబంధము నెన్నిమార్లు చదివినను యింకను చదువవలెనను ఉత్కంఠపాఠకునకు కలిగించుచునే యుండును. ధూర్తకవిగా దోషింపజేయుమాట లందందు గలిగినను నవి ప్రకృత్యనుసరణములే. ఈతడు యతివిషయమున భేదబుద్ధి నందందు జూపుచు వచ్చెను.

> ముచ్చటమీరజెప్పి వినిమోయి
> గోమయినట్టి నీతనువు కొప్పదటంచు (అఖండ యతి)

ఇట్టివి మఱికొన్నిగలవు.

మ చ్చు ప ద్య ము లు .

హిమవంతుని పడుచుదనము:—

సీ. మొల్లపూవులు శివపూజకెత్తెదమను మునులకించుకబిల్వ వనముజూపుఁ
గస్తూరిపిల్లెలఁ గానుకగాఁదెచ్చు కోయకుజీతంబు గొప్పచేయు
ఒకదారి రాకీలఁబట్టి తీర్చినయట్టి యరితికానికిఁ గంటసరులొసంగు
హెచ్చుచీరలఁగన్న నింటికిఁబంపించి వెనుక వర్తకుడాడు వెలయొసంగు
గీ. రాయసమ్ములు సరికమ్మరాయతగడు
విశ్వకర్మకటంచన విసకమీరు
బడుకయిలు కట్టుఁడంచని బళువుచాటు
ప్రాథమిక కామినీభోగ పరతనతడు॥ I-62

ఉ. శ్రీకిని బుట్టినాననుచుఁ జెప్పినవాంద్రఁట మారుడుండనీ
యాశత శ్రీయనంగ మలాలయగాదు విషంబుతజ్జుడం

తేకనుగొంటిలేక విరహిప్రమదావళి మూర్ఛజెందఁ జీ
కాకొనరించి చెమ్మటలు గ్రమ్మఁగఁ జేయుని గుండెపట్టుచున్॥ 5-10

మన్మథుడు ఇంద్రుని పిలుపునిని చులుకుగా రాలేనందులకు కారణమును జెప్పుట.

గీ. అదివినదెదియుక్కు శ్రోత్రియుం డతివపైన
నలిగి జందెలుద్రెంపె సన్యాసమనుచు
ద్రెంచివైచిన వానినేఁ దిరుగదాని
పూసలకొసంగ జేయింప బ్రొద్దుపోయె.

మన్మథ నిధనాంతరము దేవతలు శివునిదర్శించి పలుకుట—

చ. కొలువగ మేమువచ్చినను గొంపలలోపలఁ జొచ్చిచేడెలన్
బలిమిగబట్టజూచు నలపాపియటంచని కాచియుంటిమి
తలపులు పోయెఁగాదె సుమధస్వేభవద్దయ చేతఁగూలన
చ్చెలువలు వీథినున్నఁనిఁకఁ జీయనిత్రోయను వాడుమావలెన్.

సీ. ఇంద్రుడు తమయొద్దికే తేర లేవకకనుసన్నఁ గూర్చుండుమనెడివారు
దైవతపతియంగి దాయమీఁదకు సోకఁగనులెత్తుజేసి యేమనెడివారు
వాసవుకెంగేలి వజ్రంబుఁదిలకించి యస్థియిదేమిటి కనెడువారు
స్వర్గాధిపతివచ్చి చదురునఁగూర్చుండ నాతఁడెయూరివాఁడనెడువారు
నైరి శంకరుడుమను పెండ్లాడుసుద్ది
కొద్దిగా బుట్టుచోఁబొట్టకొవ్వియెదురు
సడ్డలేనితనాల మీఁగములుదువ్వ
నట్టి హిమవంతు చుట్టపుగట్టువారలు.

ఈ పొత్తమున పచ్చుతప్పులు కొలదిగానుండి పాఠకుని బాధింపమనే యున్నవి. పద్యములన్నియు నుదహరించ దగినవియేయగుట ప్రబంధమునే చదివి కొనిన మేలనబడును. ఈ వ్యాసము నింతటితో ముగించెదను.



# కతిపయాంధ్ర శబ్ద చర్చ

శ్రీమాన్ తిరుమల రామచంద్రాచార్యులుగారు

[శ్రీవారి షష్టిపూర్త్యుత్సవ సందర్భంలో మంచి విషయాన్ని గూర్చి వ్రాయకుండా 'చెంబు, కంచం,' 'చేట, జల్లెడ,' 'రోలు, రోకలి' అనే అల్పవిషయాలపై వ్రాశాడేమా అని పెద్దలనుకుంటారు.

ఈ విషయమై బాగా ఆలోచించినాను. పై వస్తువులు నిత్యజీవనంలో ఎలా మేళవించి పోయాయో అలాగే శ్రీవారి వ్యక్తిత్వమూ, గుణగణాలూ, పాలలో పంచదారవలె ప్రతిమానవుని నిత్యజీవనంలోనూ మధురమేళనం పొందాలనే నా హార్దిక అభిలాష.

'ఉడుతకు ఉడుతాభక్తి' న్నట్లు ఆ సుగృహీతనామధేయుని, ప్రాతస్స్మరణీయుని సేవకు ఈ నా వ్యాస కణిక. —రామచంద్ర]

## ౧. చెంబూ - కంచం

మనం ప్రతినిత్యమూ ఎన్నో వస్తువులను చూస్తూంటాము, వాడుతూంటాము, ఎన్నో సంగతులు వింటూంటాము. కాని, వానిమూలతత్త్వం ఏమిటో, అవి ఎన్ని మార్పులు పొంది ప్రస్తుతం మనకు అగపడే రూపాన్ని పొందాయో మన మేమైనా ఆలోచిస్తామా?

ఎన్నో విషయాలు వానిపుట్టుపూర్వాలు తెలీకుండానే మన నిత్యజీవనంలో ప్రవేశించాయి. మనము ఉపయోగించే మాటలూ అంతే. నిత్యమూ మాట్లాడుతున్నాము గదా అని ఏ మాటకైనా వ్యుత్పత్త్యర్థం చెప్పుకోగలమా మనం? అన్ని శబ్దాలూ మొదట యౌగికాలేమో మన ప్రయోగ దశకు వచ్చే వేళకు రూఢలయాయి, తమ తాతతండ్రులనే మరచాయి.

వింతగొలిపే సంగతేమిటంటే ఒక శబ్దం తడిమితే ఒకొకజాతి సంపూర్ణేతిహాసమే బయటపడుతుంది.

ఓరోజు భోజనానికి కూర్చున్నాను. నిత్యమిత్రులు చెంబూ, కంచం ఎదుట ఉన్నారు. వడ్డన ఆలస్యమయింది. ఏవేవో ఆలోచనలు పరుగెత్తాయి. ఈ చెంబూ కంచాల అంతు కనుక్కుందామని బుద్ధిపుట్టింది. పాపం ఎన్నివేల ఏండ్లుగా ఈ రెండూ అవినాభావంగా వున్నాయో!

ఈ రెంటిలో కంచంకంటే చెంబే వయస్సులో పెద్దదని తోచిందినాకు. ఈలాంటి పేరేమిటి చెప్పండి. దీనిఖర్మం కాలితే రూపాన్ని చూచి పెట్టిన ముద్దుపేరా, రూ

ఢిగా వచ్చిన పేరా! నేనుమట్టుకు ఇది వీని
సొంత పేరు కాదనీ వీని వంశనామధేయ
మనీ నిర్ణయించుకున్నాను. తమ వంశ
వృత్తిమేకాకుండా తమ్ము ఉపయోగించే
వారి పుట్టు పూర్వోత్తరాలు యావత్తూ
తెలుపసాగాయి ఈ రెండూను.

చెంబు ఇలాఅంది: సెమెటిక్ జాతులు
రాగిని మొట్టమొదటకనిపెట్టాయి. బహుశః
ప్రపంచములోకల్లా మొదటి లోహం
రాగేనేమో! తమిళంలో 'శొప్పు'అంటారు
దీన్ని. ఎర్రనిది అనిఅర్థం. దీనిసంస్కృత
పర్యాయం 'శుల్బం' దీనివ్యుత్పత్తి ఎలా
వున్నా శొప్పే శుల్బమయిందని నేనం
టాను. రక్తవర్ణవాచకాలు 'సెహప్పు'
'సెన్' 'చెన్' 'కెన్' 'కెంపు' మొదలయి
నవి శొప్పునుంచే లాక్షణికంగా వచ్చా
యేమో? అధవా వర్ణవాచక శబ్దమే
(రాగికూడ ఎఱ్ఱగా వుందిగనక) కొంత
మార్పుతో లోహవాచకంగా వాడుకకు
వచ్చివుంటుంది.

సెమెటిక్ జాతులు రాగిని ఎక్కువగా
వాడుతాయి. ముసల్మానులు, రాగిపాత్ర
లను ఎక్కువగా ఉపయోగించడం దీనికి
సాక్ష్యంగా తీసుకోవచ్చు. ఇప్పటి 'ఆర్య'
ముసల్మానుల కంటెకీ ఈలోహపువాడుక
సెమెటిక్ జాతులనుంచీ వచ్చిందే. వీరు
మొదట తమకుకావలసిన వస్తుజాతం రాగి
తోనే చేసేవారు. క్రమంగా ఇతరలో
హాలు వాడుకలోకి వచ్చాయి. శొప్పులో
చేయబడింది గనుకనే శొంబు (త)చెంబు
(ఆం.క) అయిందిక్రమంగా. అన్నిలోహా
లతో చేయబడిన చిన్నపాత్ర చెంబే
అయింది. ఇప్పుడునీటిని తోడుకునే చిన్న
పాత్రవిశేషం చెంబుఅనేరూఢివచ్చింది.

కర్రతో చేసిన ఆటవస్తువులను'శొప్పు'
అంటారు తమిళంలో తెనుగులో 'చొప్పి
కవి' శబ్దాన్ని ఆటవస్తువులకు నన్నెచో
డుడు వాడినాడు. మొదటరాగితో చేయ
బడి ఎఱ్ఱగావుండే చొప్పికలను క్రమంగా
కర్రతో, మట్టితో చేయబడిన వాటి
కూడా వాడారు. తమిళంలో మాత్రం
కర్ర ఆటవస్తులకే 'చొప్పు' శబ్దంరూఢ
మయింది, అనిముగించింది చెంబు.

ఇక కంచం అందుకుంది. నన్ను కంచు
తోచేశారు. 'కాంస్యం' నా తల్లి కాదు.
నేనుశుద్ధ దక్షిణాదిని. అందులోనూ తెలు
గుదాన్ని. నేను ఎక్కువగా వాగుతానని
మీకందరికీ తెలుసు. దానినిబట్టి, ఖంగు
మని మ్రోగటాన్ని బట్టి కంచునయ్యాను.
కాంస్యం పూర్తిగా ద్రావిడ శబ్దమే.
అందులోనూ ధ్వన్యనుకరణవాచకం.

ఆంధ్రులు నన్నాదరించారు. కనుకనే
నన్నాశ్ర యించుకొని జీవించే వారు.
కంచర్లయ్యారు. కంసాలులయ్యారు. కాని
సొన్నారులు (స్వర్ణకారులు) కాలేదు.
కంచు ఆంధ్రదేశంలో మొదటి లోహం.
ఇప్పటికీ కంచుకడియాలు బాజుబందులూ
ఆంధ్రకర్ణాటక దేశములలోని చెంచులు,
కోయలు, లంబాడీలు మొదలయిన ప్రా
చీన జాతులు ఉపయోగిస్తారు. రాగి
తర్వాత నేనేపుట్టాను. ఆంధ్రదేశంలోని
కంచర్లు బంగారుపని చేసినా కంసాలులే
అయ్యారు.

తమిళంలో కంచుకువంగలం అంటారు. ఇది వంగదేశంనుంచి మొదట దిగుమతి అయివుంటుంది; దాదాపు ఆంధ్రదేశ సమీపంనుంచే, అని అంది.

[ఆంధ్రదేశంలో 'కంసాలి బత్తుడనే వ్యవహారముంది. తమిళదేశంలో 'పత్తర్' అంటారు. [వంగదేశీయుడయిన నామిత్రుడొకడు 'పాత్రో' తాము స్వర్ణకారులమనీ దక్షిణదేశంనుంచీ వంగదేశానికి వలస వచ్చిన వారమనీ, ఉపనామము మాత్రము మారలేదనీ అన్నాడు. వారు వివాహాదులు పరిమితమయిన తమసంఘంలోనే చేసుకుంటారు. తక్కిన వంశీయులతో వీరికి బాంధవ్యంలేదు.] రాయి, లోహ, కఱ్ఱ, పనులన్నీ బ్రాహ్మణజాతి శాఖకు చెందిన ఈ శిల్పులే అనాదిగా చేస్తూన్నందున: వీరికీ పేరు వచ్చింది. ప్రస్థర(రాయి) శబ్దం నుంచి పత్తర్, బత్తుడు వచ్చివుంటాయి రాతిపనిమానినా ఆపేరుమాత్రం మిగిలింది. వర్ధకశబ్దమునుంచి నిష్పన్నాలయిన వడ్ల, వడ్డె శబ్దాలు ఈజాతివారు కర్ర, రాయి, లోహాల పనులన్నీ చేస్తూండినారనడానికి సహకారి.]

## ౨. రోలు - రోకలి

నేను ఇదంతా వింటూ, యథాలాపంగా తల ప్రక్కకు త్రిప్పాను. మూల్లో వుండే రోలూ, రోకలీ ఇలా అన్నాయి. మాకిద్దరికీ ముందేమో భేదం వుండలేదు. ఉమ్మడిగా ఒకేశబ్దం వాడేవారు. మేము పూర్తిగా ద్రావిడులం. తమిళంలో 'ఉరోంగల్, ఉలక్కై' అంటారు మమ్మల్ని. సంస్కృతంలో రోలుకు 'ఉలూఖలం' అంటారు. దీని ఉచ్చారణ ద్రవిడత్వాన్ని చెప్పకే చెబుతూంది గదా! కాని, సంస్కృతపండితులు మాత్రం ఊర్ధ్వం ఖం ఆకాశం (మీదబయలుగా వుండేది) అనిఏదో అర్థంలేనివ్యుత్పత్తి చెబుతారు.

ఉరల్‌గల్ (ఎటుబడితేఅటు తిరిగే రాయి. రోలు రోకలి, రుబ్బుదురాయి, పాత్రంకూడా కావచ్చు) అనే ద్రవిడశబ్దం ఉరోంగల్, ఉరల్, రోలు అనివర్ణవ్యత్యయంతో అయింది. రోకలికూడ ఉరల్‌కల్, రోల్‌కల్, రోకల్, రోకలిఅయింది. ఖల్వం రోలు సవతి చెల్లెలు. రోకలికి మొదట్లోలేని వ్యక్తిత్వం క్రమంగా వచ్చింది.

## ౩. తెడ్డు - గరిటె

రోకలి వ్యక్తిత్వానికి సంతోషిస్తూండగా తెడ్డు గరిటెలపోట్లాట చెవిలోపడ్డది. తెడ్డు నేనార్యుణ్ణనీ, తండూః, (తృప్లవనతరణయోః ఉష్ణభయం తరతి, ఉష్ణభయాన్ని దాటిస్తుంది) తండుః (తన్యతే విస్తర్యతే, నరిపేందుకు ఉపయోగిస్తుంది) శబ్దాలనుంచి జనించాననీ గర్వంతో చెప్పుతుంది. సంస్కృతవేషంతో విర్రవీగినా నీవు పూర్తిగా మావాడేనని గరిటె చీకొట్టింది. నాయనా, తడి(త.కఱ్ఱ) తండు (త. కాడశబ్దాలు కాష్ఠవాచకాలు) ల నుంచీ పుట్టి తలపెరిగి (అకారాదులు సహజంగా ఎకారులుగా (గడ్డ, గెడ్డ) మారుతాయి గనుక) తెండు తెడ్డు అయి ఆర్యవేషంతో తండుఅయావు. ఇదిగో! నీ

వక్కింటావిడ 'డర్వీ'మాత్రం సంస్కృత దారుసుంచి పుట్టింది అంది.

నీ సంగతో అంది తెడ్డు. నేను పూర్తిగా ద్రావిడిని అంది గరిట. కరండి (కరండు, కలిసుబెట్టు త్రిప్పు. త.) నుంచి గరిటె నయాను. మా ఆర్యసోదరుడు కంచిః (కామ్యతే ఉష్ణ నివారణార్థం కోర బడుతున్నది. గరిటె) కూడ ద్రావిడు డేమోనని నా సందేహ మన్నది. (కమ్మి వలె తీగవలె వుంటుంది గనక కమ్మిః కంబిః ? )

౪. జల్లెడ - చేట

వీని వాదం వింటూ గోడకు చేరబడిన రెండు జల్లెడలూ కిలకిల నవ్వాయి. నేను 'చాలినీని' (చలకంపనే, చలించేది) అంది అందులో ఒకటి. నీవు చాలినీవో మాలి నీవో నేను మాత్రం "జల్లెడను" అంది మరొకటి. (జల్లించు=కదలించు, బాగు చేయు, చల్లు, వెదజల్లు) మనరూపం, మన పనీ ఒకటైనా మన వంశాలుమాత్రం వేరు. పోలికంటావా, ఒకరి నొకరు పోలిన వారు లోకంలో లేరా అంది.

ఇదంతా వింటూ చేట నోరు తెరిచి పట్టూర్చింది నా సంగతో అంటూ. నీవు పక్కా ఆంధ్రుడివి. తమిళ మొరానికీ, సంస్కృత శూర్పానికీ నీతో కయ్యమూ లేదు వియ్యమూ లేదు. నీ పనితోపాటు (విడిగాపడిన వస్తువులను ఒకటిగాచేర్చుట సేర్ (త). చేర్ (తె) ) శూర్పం పని కూడ (శూర్ప్యతే శూర్పమానే కొలువ బడునది. గంపలతో చేటలతో ధాన్యాన్ని కొలిచేవారు) చేసేవాడివి మునుపు. ఇప్పుడు నీకర్మం ఈదరగాలి కెదురుగా ఛస్తావు ఎప్పుడూ. ఆడవాళ్ళు వీపున బాదుతారు పాపం! అన్నది జల్లెడ.

ఇంతలోనే ఏమిటండీ! కంచంలో వడ్డించింటే కలుపుకోకుండా రోలువైపూ రోకలివైపూ చేటలవైపూ పిచ్చివాళ్ళలే చూస్తారు బంగారుగా అని గదిమింది మా రాణి. ఆ దెబ్బతో వాస్తవిక ప్రపంచం లోకి పడ్డాను నేను. [పాపం! అవన్నీ బిక్క మొగంతో నోరు నొక్కుకున్నాయి.]






# ఎఱ్ఱాప్రగడ - ఆతని కవిత్వము



శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు

ఆంధ్రభారత నిర్మాతలలో కడపటి వాడైన ఎఱ్ఱాప్రగడ కడపటివాడుకాడు. వాఙ్మయ తపస్సునందేమి, మహావైదుష్యమునందేమి, ఉన్నతప్రతిభయందేమి, గ్రంథవిస్తృతి యందేమి ఈకవి నన్నయ తిక్కనలకు మిక్కిలి తీసిపోవువాడు కాడు. నన్నయ తిక్కనలెత్తిన ఆంధ్రసారస్వతపు బావుటాను అత్యంత సమర్థతతో మోసుకొనిపోగల ఆనంతరికుడు ఎఱ్ఱన మహాకవియే అనిచెప్పుటలో సంశయింప బనిలేదు. నన్నయ తిక్కనలను పర్వతశృంగముల నాచ్ఛాదించి విజృంభించిన మహాసాలము ఎఱ్ఱనకవి. "అట్లాంటిక మహాసముద్రమువంటి నన్నయ కవితను శాంత మహాసముద్రమువంటి తిక్కన కవితతో కలుపు హిందూమహాసముద్రము ఎఱ్ఱన వాఙ్మయాంబుధి" అని బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చేసిన విమర్శనము అత్యంత మనోజ్ఞముగాను సమంజసముగాను ఉన్నది.

ఎఱ్ఱాప్రగడ ఇంటిపేరు చదలువాడవారు. ఈతడు నెల్లూరుజిల్లా యందలి గుడ్లూరు గ్రామవాస్తవ్యుడు. ఈతనితండ్రి సూరనార్యుడు కవితాప్రశస్తి గలవాడని ఎఱ్ఱన తన తండ్రియెడల వాడిన విశేషణములవలన తెలియవచ్చుచున్నది. నృసింహపురాణమునందు ఎఱ్ఱన తండ్రి నిట్లు వర్ణించినాడు.

'ప్రాజ్ఞప్రస్తుత భవ్యభోగవిభవ
స్ఫారాత్మ్మడారాద్యస
ర్వజ్ఞుండప్రతిమాద్భుతోభయ
కవిత్వప్రౌఢి శబ్దార్థయో
గాజ్ఞాసిద్ధి ఘనుండు మజ్జనకు
డుద్యత్కీర్తి శ్రీసూర్యుడీ
విజ్ఞానాత్మక వాఙ్మయంబున ముదా
వేశోజ్జ్వలుండయ్యెడున్.

ఈతనికి నాలుగుతరముల పూర్వుడైన భీమనమంత్రి వెలనాటిచోడమనుజేంద్రుని వలన మిక్కిలి మన్ననగన్నవాడట. ఎఱ్ఱనకవి కాకతీయ సామ్రాజ్య ప్రళయానంతరము ప్రాగాంధ్రదేశమును ఉద్ధరించిన ప్రోలయవేమారెడ్డి యాస్థానకవియైన ఈతడు 1323-49 సం॥ల నడుమ జీవించియుండును. ఎఱ్ఱాప్రగడ కవితామూర్తినే గాని ఆతని భౌతిక జీవిత విశేషములను తెలిసికొనుటకు మనకు ఆధారములులేవు, ఈ మహాకవి మన పూర్వకవుల వలెనే మిక్కిలి వినయసంపద గలవాడని మాత్రము మనము చెప్పవచ్చును. నృసింహపురాణమును వ్రాయదలచిన తనమహోద్యమము నీతడెట్లు వినయోక్తులతో ప్రకటించినాడో చూడుడు. "మహాకవి జన

ప్రార్థనంబును, సద్గురుచరణాను స్మరణ
కీర్తనంబును సమర్థించి కృతార్థతంబొంది,
కతిపయాతుర పరిగ్రహజనితంబైన నైస
ర్గిక చాపలంబుకతంబున

మించిన వేడ్క వీనులకు మిక్కుటమై
  మధువృష్టిగ్రమ్మరా
యంచలుకూయఁ గ్రౌంచమును
  నావలగూయ గడంగుభంగి ప్రౌ
ఢాంచిత శబ్దసారులు మహాకవు
  లాద్యులు కావ్యశయ్య గీ
లించిన కీర్తిసంగసుఖలీలకు
  నేనును గాంతుఁజేసితిన్.

హరివంశమును కృతినందిన ప్రోలయ వేమారెడ్డి మనకవిని ఇట్లుసంబోధించెనట.

"సకలభాషాకవిత్వ విశారదుడవు
సాధుసమ్మతుడవు నిత్యసౌమ్యమతివి
భవ్యుడవుగాన నీమీద బరగబత్తి
మేను గలిగియుండుదు నెవ్వనెఱ్ఱనార్య"

ఈ విశేషణములు నన్నయభట్టారకుని సహజవినయసంపదను దలపించుచున్నవి. 'నీమీద పత్తిమేను గలిగియుండుదు' నని చెప్పుటచేత వేమారెడ్డి యాస్థానమందితర పండితకవులును గలరనియు, వారందరి యందుకన్న యెఱ్ఱనయందే ఆతని కెక్కుడు తాత్పర్యమనియు మన మూహింప వచ్చును. నూతనరాజ్య నిర్మాణము నందలి కష్టపరంపరను, భారమును వహించినవాడగుటచే వేమారెడ్డికి మనుజులు, వారి స్వభావములు, వారి యోగ్యతా యోగ్యతలను తెలిసికొనుటయందు నిశితమైన ప్రాగల్భ్య ముండునుగదా అట్టి వాని ప్రత్యేకాదరమునకు పాత్రుడైన ఎఱ్ఱనార్యుడు మిక్కిలి గంభీర స్వభావము గలవాడనుట యుక్తముగానుండును.

తిక్కన మహాకవి నిర్వచనోత్తర రామాయణ రచనచేయు వయఃపరిపాకమునందు తన కవితాశక్తియందు ఉచిత గర్వము కలవాడై తాను శిల్పినని చెప్పుకొనుచు కుకవినిరాసనముగూడ చేసినాడు మహాభారత రచనాకాలమునాటి కాతని దృష్టిపథము పరమార్థైక ప్రవణమై యిట్టి యావన చాపల్యమును దిగద్రావినది. ఎఱ్ఱనార్యుడు తిక్కనగారియందు అనన్యసామాన్యమైన గౌరవము కలవాడైనను ఆతడు కుకవి నిరాసనము నెక్కడను చేయకుండుట ఆతని వినయసంపదకు మరియొక తార్కాణము. ఎఱ్ఱాప్రగడయు తిక్కనవలెనే అద్వైతాంబుధి నోలలాడిన వాడే. ఈతడు 'గిరిశపద భక్తిరస తత్పర భావము'కలిగి శంభుదాసుడన బరగియు 'గోవిందగుణాదర సంభృతసౌమనస్యుడు. ఈతని గ్రంథములన్నియు విష్ణుభక్తిపరముగానే యున్నవి.

ఎఱ్ఱన మహాకవియొక్క కవితాదర్శము లెట్టివి. వానినాత డెంతవరకు నిర్వహించి కృతకృత్యుడయ్యెను అనునది విచారణీయాంశము. ఈకవిమహోన్నత ప్రతిభాసమన్వితుడయ్యు అత్యంతవినీతు డగుటచే తన పూర్వకవులైన నన్నయ తిక్కన గార్లను వరవడిగా పెట్టుకొని వారిపాదన్యాసంబులలో అడుగులిడుకొనుచు పోయి ధన్యత్వమును గాంచినవాడు. నన్నయ తిక్కన లీతని కవితాగురువులు, వారియం

దలి భక్తితాత్పర్యములు ఎఱ్ఱన కవితా జీవితమునందు మతవిశ్వాసమంత ప్రాబల్యము కలిగియున్నవి. ఏ మహాకవికిని తనపూర్వులయెడ ఇంతగాఢభక్తి అనసూయత, ఆదరముఉన్నట్లు మనము వినబోము. తెలుగువారికి సారస్వత భిక్ష పెట్టినది నన్నయ తిక్కనలేయని విశ్వసించి ఎఱ్ఱనార్యుడునృసింహపురాణములో వారినిట్లు స్మరించినాడు.

భాసుర భారతార్థముల భంగులు
నిక్కమెఱుంగ నేరమిన్
గాసటబీసటేచదివి గాథలద్రవ్వ
తెనుంగువారికిన్
వ్యాసమునిప్రణీత పరమార్థము
తెల్లము జేసినట్టి య
భ్యాసకల్పులం దలతు నాద్యుల
నన్నయ తిక్కనార్యులన్.

నన్నయతిక్కన లారంభించిన ఆంధ్ర సారస్వతభవన నిర్మాణమును పూర్తి చేయుటయే తనజీవితాదర్శమని ఈమహాకవి తలంచినాడు. ఈ యుద్దేశముతోనే యాతడు భారతారణ్య పర్వశేషమును రచించి దీనిచే నన్నయతిక్కనల నారాధించెను. నృసింహ పురాణములో నిట్లు గలదు.

ఉన్నత సంస్కృతాది చతురోక్తి
పదంబులఁ గావ్యకర్తలై
యెన్నికమై ప్రబంధ పరమేశు
డనంగ నరణ్యపర్వశే
షోన్నయ మంధ్రభాషను జనో
త్సవమొప్పగ నిర్వహించితా
నన్నయభట్టు తిక్కకవినాథుల
కెక్కిన భక్తి పెంపునన్.

మరియు హరివంశమునందీ కవీంద్రుడు తనకవితాధి దైవతములైన నన్నయ తిక్కనలను నోరార ప్రశంసించినాడు. నన్నపార్యు నిట్లుస్తుతించినాడు.

ఉన్నతగోత్ర సంభవము నూర్జిత
సత్త్వము, భద్రజాతిసం
పన్నము నుద్ధతార్యపరిభావ మదో
త్కటమున్ నరేంద్ర పూ
జోన్నయ నోచితంబునయి జొప్పడు
నన్నయభట్టకుంజరం
బెన్ని నిరంకుశోక్తిగతి నెందును
గ్రాలుట ప్రస్తుతించెదన్.

నన్నయభట్టుగారి యెడ 'ఉద్ధతార్య పరిభావ మదోత్కటమున్, అనువిశేషణముయొక్క ఔచిత్యము విమర్శనీయము. నన్నయగారు మహావినయ సంపన్నుడు. ఇతరకవుల ఔద్ధత్యము సహించవలెనను ధీమాకలవాడుగా కాన్పించడు. ఆయన 'సత్సభాంతర సరసీవనంబుల ముడంబౌనరం' గొనియాడినాడు.

ఇట్లే తిక్కనగారిని ఎఱ్ఱాప్రగడ ఇట్లు స్తుతించినాడు.

తనకావించిన సృష్టితక్కొరులచేతం
గాదు నానేముఖం
బున దా బల్కినబల్కు లాగమములై
పొల్పొందునా వాణిన
త్తను నీతం డొకరుండనా జను మహా
త్వాప్తిన్ గవిబ్రహ్మ నా
వినుతింతుం గవి తిక్కయజ్వనక
లోర్వీదేవతాభ్యర్చితున్.

శారదరాత్రుల సముజ్జ్వల వైభవమును వర్ణించగా ఎఱ్ఱనార్యుడు శరత్కాల మందలి వాసరముఖంబుల ప్రసన్నరామణీయకతను చిత్రించినాడు. శరద్భయమున చేత మేఘములు మదపుటేనుగుల రూపునడాగి సంచరించెనట. ఆ మేఘముల జలప్రవాహములు ఏనుగుల దానధారలలోను, వానిగర్జానిర్ఘోషము ఏనుగుల ఘీంకారరవములలోను తలదాచుకొన్నయుట. అగస్త్యమహాముని దక్షిణ దిగ్భాగమునందుదయించి, ఎల్లెడ కప్పల యాటల భూతుడు చేత కలుషితమైన నదీ జలములను నిర్మలత్వమును ప్రసాదించెనట.

అరణ్యపర్వమునందు మనోహరములు, నీతిబోధకములునగు ఆఖ్యానములు పెక్కులు కలవు. సత్యాద్రౌపదీ సంవాదము, అత్రిగౌతమ సంవాదము, ధర్మవ్యాధోపాఖ్యానము మున్నగునవి మిక్కిలి రసవంతములై యున్నవి. ప్రకృతి వర్ణనలు చేయుటయందువలె ఎఱ్ఱనామాత్యుడు నన్నయను అనుసరించెను. కథాంశమును మనోజ్ఞమైన సంభాషణ రూపమున నడుపుటయందును తిక్కనామాత్యుని వద్ద నేర్చియుండును. అత్రిగౌతములను విరుద్ధ ఋషులు కోపావిష్టులై సంభాషించుట చక్కగా చిత్రింపబడినది. రాజే విధాత వంటివాడని యత్రియనెను. ఒక మానవమాత్రుని యర్థకాంక్షచే నింద్రుడు చంద్రుడు నందువాయని గౌతముడు ఖండించెను. అప్పుడు అత్రియాతని నధిక్షేపింపగా గౌతముడిట్లు హేళన చేసెను.

కలియుగసరణులు వచ్చి తల తెల్లనైనంత
జేసి యెట్లు నీకు జేరునెఱుక
జ్ఞానవృద్ధుడైన వానిమాటలు గదా
సభలజెల్లు నార్యజనుల కెక్క.

ఇంతలి సహజత్వమును, మాటల పొందికయు, లోకవృత్తానుకారిత్వము గమనించదగినవి. సులభమైన జాతీయపదములతోను, నుడికారములతోను, కూడి తెలుగువారి సంభాషణాధోరణిని స్ఫురింపజేయు రచననే నన్నయ గారు 'నానారుచిరార్థసూక్తి' నిధియు ఎఱ్ఱన 'చతురోక్తిపదంబు'లనియు వ్యవహరించిరని నా యూహ. సంస్కృతప్రాయమైన రచనకు 'అక్షరరమ్యత' యని పేరిడినాడు నన్నయ.

అరణ్యపర్వమందలి ఉపాఖ్యానములలో సావిత్ర్యుపాఖ్యానము మిక్కిలి మనోజ్ఞముగా నున్నది. సావిత్రియొక్క పాత్రనిర్వహణము మిక్కిలి అందముగా నున్నది. ఆమె ఉత్తమ కష్టాంతరాయముల కోర్చి జేర్చబడినట. పతికి గాబోవు నాపదను తన హృదయమునందే దాచుకొని, తెచ్చికోలు సంతోషముతో కాపురము చేయుచు ధీరతతో మెలంగిన యువతీమణి. ఎఱ్ఱాప్రగడకు అరణ్యపర్వశేషములో శృంగారరసపోషకములగు నాఖ్యానములు ఎక్కువ లభించలేదు. పరీక్షిత్తుడను రాజు అరణ్యములో నొకకన్యను మోహించిన వృత్తాంతమొక్కటే కలదు. ఈ కథ నన్నయ రచించిన రురుడు ప్రమద్వర ప్రేమవృత్తాంతమువలెనే యున్నది. రురుడు తన ప్రియురాలికి ఉపకారము

చేసిన పాములను చంపగా పరీక్షితుడు తన సుందరి సపహరించెనను నేరముపై కప్పలను కుప్పలుగా చంపించెను. ఎఱ్ఱాప్రగడ ద్రౌపదిని ధీరురాలుగాను సమయస్ఫూర్తిగలదానినిగను చిత్రించెను. సత్యభామకు పతివ్రతా ధర్మములు చెప్పునప్పుడు ఆమె ప్రదర్శించిన గరువంపు దనము ప్రశంసనీయము. సైంధవు డామె నెత్తుకొనిపోయినప్పుడు ద్రౌపది చూపిన మహాధైర్యము, వాక్చక్యము కొనియాడ దగినవి. కుంతీదేవి కర్ణుని నదిలో విడిచి పెట్టు ఘట్టమున కరుణరసమును కవి బాగుగా పోషించినాడు. కుంతి యిట్లు విలపించినది.

"ఏపుణ్యసతికి నీవింక జేపడియెదో
 యెక్కడపడియెదో యేనెరుంగ
నేపుణ్యురాలొకో యిప్పుడు నిను బుత్రు
 గా గాంచుటకు మేలికలను గాంచు
లలితాంసు కేళి నల్లననడపాడుచు
 నవ్యక్తమధుర వాక్యామృతంబు
వీనుల గురియుచు వెడదగన్నులు విన్న
 నవ్వును శుభలక్షణములు నమర
జేజక్కిల్లు నిన్ను దెరపయెవ్వతెయొక్క
 యడరగ్రుచ్చి యురమునందు జేర్చి
వేడ్కమిగిలి వేనవేలభంగుల గొని
 యాడియాడి ముద్దులాడు కొడుక.

వీరరస ఘట్టములను నడుపునప్పుడు ఎఱ్ఱనామాత్యుడు తిక్కనగారిమార్గమును త్రొక్కెను. ఘోషయాత్రాసందర్భమున జరిగిన యుద్ధము, పాండవులు సైంధవు నెదుర్కొని ద్రౌపదిని విడిపించుట మున్నగునవి దీని కుదాహరణములు. ఇట్లు ఉభయ కవులకును మెచ్చునకు వచ్చునట్లు రచించి ఎఱ్ఱనార్యుడు ప్రబంధపరమేశ్వరుడను కీర్తిని గడించెను.

## నృసింహ పురాణము

ఎఱ్ఱాప్రగడ తరువాతి గ్రంథము నృసింహపురాణము. ఇది యాతని స్వతంత్ర గ్రంథము. ప్రహ్లాద కథ నాతడు బ్రహ్మాండాది పురాణములనుండి జేకొని స్వతంత్ర ప్రబంధముగా వ్రాసినాడు. ఎఱ్ఱన పూర్వయుగమునకు జెందిన వాడగుటచే శృంగారరస ప్రధానమైన కథను గొనక విష్ణుమాహాత్మ్యము నభివర్ణించుటతో తృప్తిపడెను. మరియు 'ఈదృశంబులగు పుణ్య ప్రబంధములు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషంబు' అని తిక్కనామాత్యుడు ఉగ్గడించియున్నాడుగదా. ప్రబంధ లక్షణములైన వర్ణనము లన్నిటిని ఇందు జొప్పించి ఎఱ్ఱాప్రగడ తన నిరంకుశ ప్రతిభ చూపియున్నాడు. రచన 'ఉన్నతసంస్కృతోక్తి' మయముగా ఉన్నది. వైకుంఠనగరవర్ణనము, పాలసముద్ర వర్ణనము, శ్వేతద్వీప వర్ణనము అద్భుతరసమునకు ఆటపట్టుగా నున్నవి. సముద్ర వర్ణనమునందు కవి పురాణ ధోరణి నవలంబించెను. గాని తనకు సహజమైన వస్తు పరిశీలనాశక్తిని ఉపయోగించలేదు. బహుశః ఈ కవి సముద్రమును జూడలేదేమో. నన్నయ తిక్కనల సముద్ర వర్ణనములు ప్రకృతి చిత్రమునకు సమీపములుగా నున్నవి.

ఋతుధర్మములనీ కవి విపులముగా వర్ణించుచు సంస్కృతకవుల మార్గము ననుసరించెను. నృసింహ పురాణము నందలి వసంతఋతు వర్ణనము, గ్రీష్మఋతు వర్ణనము లిట్టివి. నన్నయ తిక్కనలు సూచన మాత్రముగా మాత్ర మిట్టి వర్ణనలను జేసిరి. హాస్యరససూచకములైన వర్ణనలు పూర్వకవులలో అరుదుగ కన్పించును. హిరణ్యకశిపుని ఉద్ధతచేష్టలను వర్ణించుచు ఎఱ్ఱనకవి హాస్యరసప్రధానముగ లిఖించినాడు.

"తపముల గ్రుస్సిన తపసులబట్టి తె
ప్పించి యచ్చరలతో బెండ్లిసేయు
మోదంబుతో నశ్వముఖులలాయంబుల
గట్టి బొక్కని యలఁ గవణమెత్తు
భుజగేశ్వరులశిరంబుననున్న మణులూడ్చి
కొమరార వట్రువ గుండులెత్తు
జెలగి గంధర్వుల చేతి వీణెలు పిశా
చులకిచ్చి పాడించి చూచి నవ్వు"

హిరణ్యకశిపును మన కవీశ్వరుడు రాక్షసాధమునిగా మాత్రమే పరిగణించక ధీరోద్ధత నాయకునిగా చిత్రించి పాత్రౌచిత్యమును గాపాడినాడు. హిరణ్యకశిపుని తపశ్చర్యను గౌరవాదరములతో వర్ణించి యాతని దైత్యతపోధను డన్నాడు. ఇంద్రుడు పంపిన యప్సరస్త్రీలు రాక్షసేశ్వరుని తపోభంగము చేయబోయి విఫలప్రయత్నలయిరని వర్ణించి యాతని తపోనిష్ఠకు మెరుగువెట్టెను. పోతనామాత్యుని ప్రహ్లాదచరిత్రమును, ఎఱ్ఱాప్రగడ నృసింహపురాణమును సమానమైన కథలు గలవి. పోతనగారి ప్రహ్లాద చరిత్ర లోకోత్తర రసవత్కథానిక. అందు రెండే ప్రధాన పాత్రలు. ప్రచండుడైన హిరణ్యకశిపువు. లలితుడైన ప్రహ్లాదుడు. ఇట్లు పాత్రల బాహుళ్యము లేకపోవుటచేత మన దృష్టి వీరిద్దరిమీదను కేంద్రీకరించినది. మరియు పోతనగారు ప్రహ్లాదచరిత్ర నొక ప్రత్యేక ప్రబంధముగా వ్రాయు భారముపూన లేదు. కావున రస కేంద్రీకరణమునకును, కథా సంవిధానమునకును అడ్డువచ్చు ప్రబంధపు పోకడలను, వర్ణనలను ఆయన చేయలేదు. ఇదియే భాగవతము నందలి ప్రహ్లాద చరిత్ర నృసింహపురాణముకన్న అద్భుతముగ లోకుల నానందింపజేయుటకు కారణము. మరియు పోతనగారి కవిత్వము ఆవేశపూరితమైనది. భావప్రవాహము నందు తగుల్కొన్నచో నది నిరాఘాటమై శృంఖలములను త్రెంపికొని తేలియాడును. ఎఱ్ఱనామాత్యుడు భావకవి గాడు. ఆతడు భావావేశమును నియమముతో నడపు మేధాకవి. ఆతని కృతి ఖండకృతియును గాదు. వివిధరసస్ఫోరకమైనది. కావున, రస కేంద్రీకరణమునకు నృసింహ పురాణములో నాతని కవకాశము లేదు. అట్లయ్యును హిరణ్యకశిపు ప్రహ్లాదుల పాత్ర నిర్మాణమునందును, ఆ యా సందర్భములలో అర్థవంతమైన పద్యరచనకును ఎఱ్ఱనార్యుడే పోతనకు మార్గదర్శకుడయ్యెనని నిరాక్షేపముగా చెప్పవచ్చును. పోతనకు వరవడియైన పద్యములు నృసింహ పురాణమునం దెన్నియో గలవు.

వాసుదేవుని పాదవనరుహంబుల భక్తి
తగదను తండ్రియు తండ్రిగాడు
వేదచోదితమైన విష్ణుధర్మమునకు
గోపించు గురుడును గురుడుగాడు.

ఇత్యాదియు.

'ఊషరబీజముల్, భసితహోమాజ్యఘృతంబులు, షండకన్యకాన్వేషణముల్', అను పద్యము పోతనగారి 'అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్' అను పద్యమునకు స్ఫోరకము. 'కలడు మేదినియందు కలడుదకంబుల కలడు వాయువునందు కలడు భానునియందు, కలడు సోముని యందు కలడు వహ్ని.' ఇత్యాది ఎఱ్ఱన గారి సీసపద్యము పోతనామాత్యుని 'కలడంబోధి కలండుగాలి కలడాకాశంబునన్ కుంభినిన్ కలడు' అను పద్యమునకు దారి చూపెనుగదా. ఇట్లెన్నెని పద్యము లుదహరించవచ్చును. పోతనగారు ప్రహ్లాదునిచే బాలకుల కుపన్యసింపచేయుచు ప్రజ్ఞాబుద్ధులకు మాత్రమే అన్వయించు గహనవేదాంతమును బోధించెను. ఎఱ్ఱనార్యు డీసందర్భమున ఔచితిని పాటించి బాలురకు సుబోధమగునట్లు సులభపద్యములలో ఉన్నతవేదాంతమును అరటిపండొలిచి చేత బెట్టినట్లు చెప్పించినాడు. నృసింహపురాణము వెనుకబడదగిన ప్రబంధము కాదు. అది పోతనగారికి పోకడలు నేర్పిన గ్రంథము.

## హరివంశము

ఎఱ్ఱాప్రగడ సర్వంకషప్రజ్ఞలకు క్షేత్రమై యాతని కవితాసర్వస్వమని చెప్పదగిన మహాగ్రంథము హరివంశము. ఇందాతని కవిత్వము పరిణతమొందినది. చరమగ్రంథమయ్యు కవి ప్రతిభ యెంతమాత్రమును మందగించలేదు. ఈగ్రంథము నాతడు ప్రోలయవేమారెడ్డి కంకిత మొనరించెను. యవనవాహినులనుండి ఆంధ్రదేశము నుద్ధరించి తొల్లింటి రాజులవలె ధర్మోత్తరముగను సాత్వికముగను పరిపాలించిన వేమారెడ్డికి హరివంశమును, కవి కృతియిచ్చుటయు మిక్కిలి సమీచీనముగ నున్నది. వేమారెడ్డియు రాజరాజనరేంద్రునివలె పురాణప్రవణమైన చిత్తవృత్తి గలవాడుగా కన్పించుచున్నాడు. ఎఱ్ఱాప్రగడచే నింతకుముందే రామాయణమును జెప్పించి వినియున్నాడు. ఇప్పుడు 'భారతపరాంశ'మైన హరివంశ కథను తెనుగులో రమ్యముగా చెప్పుమని యెఱ్ఱనార్యుని గోరెను. ఆతనికిని ఈ కార్యము మిక్కిలి యభిమతమైనది. హరివంశోపాఖ్యానములోగాని భారతవీరుల చరిత్ర సమగ్రముగాదు. ఏతద్రచనము నన్నయ తిక్కన లారంభించిన భారతభవన నిర్మాణములో అంగమేనని యాతని యాశయము.

'నన్నయభట్ట తిక్కకవినాథులు
చూపినత్రోవ పావనం
బెన్న పరాశరాత్మజ మునీంద్రుని
వాఙ్మయము'

ఇత్యాది శుభలక్షణము లెన్నియో హరివంశమునకు ఘటించుటచే నెఱ్ఱనాంధ్రుడు సంతోషముతో బూనుకొని.

ఆద్యంత మీ గ్రంథమును మహోన్నత కావ్యకళకు నిధానముగా చేసెను. హరివంశమునందు కవి తన కావ్యాదర్శములను ఆశ్వాసాంత కథనమం దిట్లు సూచించుచు వచ్చినాడు. 'అని వైశంపాయనుండు జనమేజయునకు కృష్ణశైశవచరితంబు కర్ణరసాయనంబు గావించిన దివ్విధం బఖిలంబును సుఖశ్రవంబగు వచోవిభవంబున' ఇది కవి యాదర్శము. మరియు 'కృష్ణసంక్రీడనంబులసంక్లిష్ట విస్పష్టంబులగు వాక్యంబులన్' మరియొక చోట 'వైశంపాయన కథితంబైన కథాప్రపంచంబు సమంచిత వ్యాఖ్యాన విఖ్యాతంబుగా' మరియొక్కచో 'అక్రూరుచరితంబు సమధికరసభరితంబుగ'. ఇత్యాది లక్షణములను దృష్టియం దుంచుకొని ఎఱ్ఱనామాత్యుడు రచించినా డనుట సువిదితము.

హరివంశమునందు శ్రీకృష్ణుని జీవితము సవిస్తరముగ వర్ణింపబడినది. విష్ణుని దశావతారకథలును సంగ్రహముగ చెప్పబడినవి. శ్రీకృష్ణ జీవితము భాగవతమునందును వర్ణింపబడినది. పోతనామాత్యుడు భక్తాగ్రేసరుడు. హృదయవాదికవి. ఆతడు శ్రీకృష్ణుని భగవంతునిగను ఆతనిచరిత్రను మానవ వ్యాపారాతిరిక్తముగను చిత్రించెను. ఎఱ్ఱనగారు శ్రీకృష్ణుని వీరరసోత్తుంగునిగను, లోకోత్తరమేధావిగను, మహారాజకీయవేత్తగను సందర్శించెను. శ్రీకృష్ణుడు భగవదవతార మను విషయములో ఆతనికిని సందియము లేదు. అయినను ఆతని చర్యలన్నియు అలౌకిక చర్యములు, అద్భుతాశ్చర్యసంపాదకములుగ ఎఱ్ఱన చూపలేదు. శ్రీకృష్ణుడు విష్ణ్వంశజనితుడయ్యు మానవ సులభమైన లేక సాధ్యమైన శక్తిసామర్థ్యములచేతనే తన జన్మోద్దేశమును పూర్తిచేయుచు కార్యావసరమునుబట్టి అలౌకిక సామర్థ్యమును ప్రదర్శించినట్లు ఎఱ్ఱనార్యుడు చిత్రించెను. హరివంశములోని కృష్ణలీలలన్నియు సాధారణముగా దుష్టశిక్షణ శిష్టరక్షణతో సంబంధించినవి. ఇదియే కృష్ణావతార సాఫల్యముగదా. ఈ కార్యములందు శ్రీకృష్ణుని లోకాతీతమైన బలశౌర్యములును ఆతని యనన్య సామాన్య బుద్ధిబలమును మిక్కిలి ప్రకాశించును. అక్కడ శ్రీకృష్ణుని శృంగార జీవితములో ఎక్కువ ప్రసక్తి లేదు. పోతనగారు శ్రీకృష్ణుని జీవితమునందు శృంగారరసలక్ష్యము నరయుటకోయి కొన్నియెడల నా మహాపురుషుని జీవితమును సందేహావర్తములలో దిగవిడచినాడు. శ్రీకృష్ణుని చిన్ననాటి యాగడములందే శృంగార చేష్టలు చిలికించుటచే పామర బుద్ధులు ఈ ఘట్టములను చదివి అపార్థములను కల్పించుకొనుచున్నారు. హరివంశమునందిట్టి సందిగ్ధస్థానములు లేవు. ఈ సందర్భమున మరియొక విశేషమును మనము ఊహింపవచ్చును. ఎఱ్ఱనగారు చెప్పకపోయినను ఆయన దృష్టిలో వేమారెడ్డి స్వతంత్ర రాజ్యనిర్మాణము చేయుటయు,

అందలి కష్టసుఖములును, అతని బంధు ప్రీతియు, శ్రీకృష్ణుని యాదవ రాజ్యనిర్మాణము, జరాసంధునితో యుద్ధములు, అతడు రాజ్యవిస్తృతికి చేసిన కట్టడులు, శ్రీకృష్ణుని బంధుప్రీతి మున్నగునవన్నియు దిక్ప్రాతముగానైనను ఒక తరగతిలోని విగా తోచియుండవచ్చును. కన్నడ కవులలో ప్రసిద్ధులైనవారు, పంపాదులు తమ కాశ్రితులైన రాజులను భారత వీరులతో నభిన్నులుగ వర్ణించుచు, వారి చర్యలకును వీరి చర్యలకును అభేదాధ్యవసాయము సాధించుట మర్యాద. ఎఱ్ఱన అట్లు చేసినను అనుచితప్రశంస కాకపోవచ్చును. కాని అగ్రహారాదులకొరకై యాతడు వేమారెడ్డిని శ్రీకృష్ణునిగా సంతరించువాడుకాడు. వేమారెడ్డియు శుద్ధసాత్త్విక వృత్తి గలవాడుగా తోచునే గాని రాజాహంకారము గలవాడుకాడు.

వేమారెడ్డితో నుండుటచే గల్గిన యనుభవవిశేషమే ఎఱ్ఱనకు తోడ్పడి శ్రీకృష్ణుని జీవితము నందలి ఆ యా ఘట్టములను 'అంతస్సన్నిధి' చేసికొనుటకు అతనికి ఉపకరించినది, వర్ణనీయాంశమును 'అంతస్సన్నిధి' చేసికొనుటయే మహాకవి లక్షణము. ఈ శక్తి ప్రపంచానుభవసంపదచే కవికి లభించుచున్నది. లోకానుభవము లేక అంతస్సన్నిధి చేసికొనుట కష్టము. అది లేనిచో కవిత్వము ఊహామాత్రమై లోతులేనిదిగా నుండును. ఈ లోకానుభవము ఎఱ్ఱనార్యునకు మిక్కుటముగా కలదు. అతడు రెడ్డిరాజ్యస్థాపనముచూచినాడు. అద్దంకి నిర్మాణము గాంచినాడు. కోటకొమ్మ లెట్లు కట్టవలెనో వాటి కీలు లేమో తెలిసికొన్నాడు. శ్రీకృష్ణుడు కైలాసమునకు పోవుచు దుర్గసంరక్షణము నకై యాదవవీరులకు చేసిన కట్టడి చూడుడు.

ద్వారములందు రక్ష సువిధానముగా
నొనరించి ముద్రలే
కేరిని వెల్వడం జొరగనీక యనేక
రథాశ్వదంతిమ
ద్దారుణ సైన్యసన్నహనదర్పితులై
వివిధాయుధ ప్రభల్
ఘోరనిరూఢి నెల్లెడసలం బొదువం
దగ నుండుడిమ్ములన్.

వేటదోటయనుచు వీడు వెల్వడిపోవ
వలదు చరుల బనిచి వైరి తెరువు
లరసిగెలుచు వెరవు లన్నియు దలపోసి
విక్రమంబు గారవించుటొప్పు.

అని సాత్యకిని నగర రక్షణంబునందు నియోగించి, ఉద్ధవాచార్యుని నీతిసామర్థ్యమును విశేషముగా పొగడి యాతని కిట్లు హెచ్చరిక తెలిపినాడు. "యదువీరులు కేవల వీరవ్రత శౌండులు, పాండిత్యనిత్యుండవైన నీవు వీరల విక్రమోద్ధతి యనుద్ధత నీతిపేశల యగునట్లుగా నడపుము" ఇట్టి నన్ని వేశములు రెడ్డిరాజ్యారంభ కాలమునందు ఎన్ని కలిగినవో వేమారెడ్డి ఎట్టి కట్టుదిట్టములు చేసెడివాడో మనము ఊహించుకోవలయును. ద్వారవతీ నగర నిర్మాణమును సవిస్తరముగ వర్ణించుచు మన కవి తన

కాలమునాటి అద్దంకి, కొండవీడు మొదలగు దుర్గముల కట్టుటను హృదయమునం దుంచుకొని యుండును.

ఇదివాసమునకు హితవు మిదిజనులకు నాయు
　రారోగ్య వృద్ధ్యావహంబు
మధురమనోజ్ఞ నిర్మలతోయ సంపన్న
　మిది సర్వతరులతాభ్యుదయభూమి.

ఈ మున్నగు లక్షణములు దుర్గనిర్మాణమునకు అవసరములుగ ఆ కాలపు వారు చూచుకొనువారు.

హరివంశమునందు మరియొక విశేషము కలదు. అది యందలి ప్రజజీవిత (లేక గోప జీవితము) వర్ణనములు. ఇట్టి వర్ణనలు మనవాఙ్మయములో అరుదనియే చెప్పవచ్చును. దీనిని ఆంగ్ల భాషలో Pastoral poetry అని చెప్పుదురు. అకృత్రిమమై సహజమైన గోవుల యొక్కయు గోపాలుర యొక్కయు జీవితము, వారినడ చెడంగులు, ప్రజదంపతుల నిరాడంబర ప్రేమవృత్తాంతములు. ఇవియే Pastoral poetryకి వస్తువు. ఎఱ్ఱనామాత్యుడు ప్రజజీవితమును చిత్రించుటయందు అఖండముగ విజయమొందినాడు. ఈ యనుభవ మాతని కెక్కడ లభించినది అని మనము ప్రశ్నించుకొనవచ్చును. దీనికి సమాధానము సమకాలిక రెడ్డిజీవితమునందే ఇట్టి దృశ్యము లాతనికి యనుభవ గోచరము లయ్యెనని యూహించవలసి యున్నది. రెడ్డివారు కృషియు గోపాలనము వృత్తిగా కలవారు. వారు గ్రామవాసులు. సమృద్ధమైన పశుసంపదగలవారు. వారు బాహుబలసంపద కూడ గల్గి యాదవులవలెనే వీరవ్రతశౌండులై యుండిరని యూహించవచ్చును. కాకతీయ సామ్రాజ్యమునకు వీరు వెన్నెముకగా నుండి భూమిని పండించువారుగాను, పశువుల పాలించువారుగాను, అవసరము వచ్చినప్పుడు నాగలికఱ్ఱు విడిచి కత్తిబట్టి యుద్ధము చేయువారుగాను నుండిరి. కాకతీయసామ్రాజ్య పతనానంతరము ఆంధ్రదేశోద్ధరణము ఈకర్షకవీరుల పాలబడెను. వీరీ బాధ్యతను అసామాన్య ప్రజ్ఞతో నిర్వహించి (సాగాంధ) దేశము యువనవాహినుల బారిపడకుండా మరియొక శతాబ్దమువరకు నిలుపరింపగలిగిరి. ఇందులకై యాంధ్రులు వీరికి కృతజ్ఞులై యుండవలసినదే. ఈ యంశమునందు వీరిని రోమన్ కర్షకులతో పోల్చవచ్చును. ప్రాచీన రోమను నిర్మాతలైన రోమన్ కర్షకులు మన రెడ్డివారివలెనే వ్యవసాయదారులు, పశుపాలకులు, సైనికులు కూడనై యుండిరి. వారిది ప్రజాయుత రాజ్యమై యుండెను. రెడ్డివారిది రాజాయుత్తమైన ప్రభుత్వము. రోమన్ కర్షకులు నిరంతర యుద్ధములు సేయుచు శాశ్వత సైనికులుగా నుండ జాలకపోయిరి. కావున రోమన్ ప్రజాసత్తాకము కర్షకుల చేతి నుండి తప్పిపోయి ధనికాయత్తమై క్రమముగా సామ్రాజ్యముగా పరిణమించెను. రెడ్డివీరులు శాశ్వత సైనికులు కాజాలక పోవుటచేతనే వారి రాజ్యము అస్తమించినదని చెప్పవచ్చును. వారు భూస్వాములగుటచే భూమిని విడువలేకపోయిరి. వారు రాజరికమును విడిచి పొలమునే నమ్మిరి. వారిప్పటికిని భూమాతనే యాశ్రయించి యున్నారు.

రెడ్డిరాజ్యారంభకాలము నందలి రెడ్డి జీవితమునందే ఎఱ్ఱనామాత్యునకు వ్రజ జీవితానుభవము కలిగినది. ఇతడు తన కండ్లతో తిలకించిన గోసమృద్ధినే హరివంశమునందు కన్నులకు కట్టినట్లు వర్ణించినాడు. వ్రజజీవితముతోపాటు రామకృష్ణుల శౌర్య వీర్య బాలసంపదల నాతడు వర్ణించిన విధానమును చాలా ఉత్తేజకముగా నున్నది. కడివెడు పొదుగులు గలిగి సౌమ్యములైన ఆవులు, చెంగుచెంగున గంతులువేయుచు బలిసిన వాటి దూడలు, ఎత్తైన మూపురములుగలిగి భూమి యదరిపడునట్లు నడిచెడు వృషభరాజములు, ఆ వృషభములను ఏకముష్టిఘాతము చేతనే పడగొట్టగల చేవకండలు గల యువకులు, వారిని నీలాలకములలోనుండి సతృష్ణ నయనములతో చూచు పడుచుపిల్లలు, వ్రజమునకంతకు నాయకులై కల్ల బొంకు లెరుగక నిష్కల్మషవృత్తులు-జానపదులునైన వృద్ధులు - ఈ దృశ్యము లన్నియు నందవ్రజమునకును ఎఱ్ఱనార్యుని పోషకులైన రెడ్డివారికిని సామాన్యములు. కావుననే ఈ దృశ్యముల నాతడు అనితరకవి సాధ్యములుగా వర్ణించినాడు. వ్రజమునందు యువకుల నడుమ జరుగు మల్లయుద్ధపు పోటీలు, మదించిన యాబోతుల పోట్లాటలు, ఒక్కొక్కప్పుడు కొన్ని దుష్ట మృగములు వ్రజవాసుల కలజడి కలిగించుచుండుట, వానిని సాహసికులైన యువకులు ఎదుర్కొని నేలకు గోలకు తెచ్చుచుండుట, వెన్నెల రాత్రులందు గోసంఘము లన్నియు హాయిగా నెమరులు వేయుచు పండుకొనుట, తెల్లవారకట్ల వ్రజమునందు ఆవులను పితుకు నప్పటి సందడి, గోపస్త్రీలు పెరుగులు మధించు సంరంభము ఇవన్నియు ఎఱ్ఱనార్యుడు సత్యసుందరముగా యుల్లేఖించినాడు. ఆతనికి తోటిమానవులను వారి వ్యాపారములను పరిశీలించుట యందు యెంతయో శ్రద్ధకలదు. పసిపిల్లలముద్దు చేష్టలనాతడెంతో ముద్దుగవర్ణించెను. ఆతని హృదయము ప్రేమమయము. అది నవనీత సమానమైనది.

శ్రీకృష్ణుని బాల్యలీలలనిట్లు వర్ణించినాడు.

పాలుపారగా బోరగిలిపాన్పు నాల్గు
  మూలలకును వచ్చును మొలగిమొలగి
లలిగపోలంబులు గిలిగింతలుపుచ్చి
  నవ్వింప గలకల నవ్వినవ్వి
ముద్దులుదొలకాడ మోకాలగేలను
  డడవుచు నొచును దారిదారి
నిలుచుండబెట్టి యంగుళులూత సూ
  పగా బ్రీతిదప్పడుగులు వెట్టివెట్టి
యన్నగంటి దండ్రిని గంటినయ్యగంటి,
  నిందురావయ్య విందులవిందవనుచు
నర్థిదనుబిలువగ నడ యాడియాడి
  యుల్లసిల్లెగృష్ణుడు శైశవోత్సవముల.

చుట్టవెంట్రుకలు. యౌవన ప్రాదుర్భావమున పురుషాకృతి యెట్లుండవలెనో శ్రీకృష్ణునియందు కవిరూపించియున్నాడు.

నెఱ్ఱులనున్నని కప్పైదుఱుగలి గొన గూడి
  పొదలి వెండ్రుకలుకొప్పునకు నెయిద

నూగారుమీసలతో గాంతిదళుకొత్తు
 మొగముకన్నులక్రొత్త జిగిడలిర్ప
నడుమువట్రువగాగ వెడదయైకటికెక్కి
 రొమ్ముప్పారవెలసి పేరురముదనర
మూపులు పొడవులై చాపు చక్క
 దనంబు గలిగిచేదోయి యగ్గలికసూప
వెన్నుపటుపయి, కంఠంబు విప్పుబెరసి
 పిఱుదు బెడగొంది నడపునొప్పిదమువింత
తెలుగుగ్గ కొన గోపాలదేవమూర్తి
 యఖిలశోభాకలాప కల్యాణియయ్యె.

దీనినే కవి యభినవస్ఫుర దుద్దామ యౌవనంబని వ్యవహరించెను. ఎఱ్ఱనామాత్యుడు తనచుట్టునుండు నిత్యజీవితమును పరిశీలనా దృష్టితో చూచి ప్రేమలులిత హృదయముతో వర్ణించినాడని చెప్పితిని. పిల్లలు యమునానదియందెట్లు ఆడుకొనిరో ఆతడు వ్రాసినది చాల ముచ్చటగ నున్నది.

ఒండొండియిద్దరినుండి యద్దరిదాక
 నేపారుపురుడున నీదియాడి
మునిగిలోలోనచని దవ్వుదవ్వుల
 ననువున నెగసి పెల్లార్చియార్చి
కడగానరాని పెన్మడువుల బఱతెంచి
 యుఱికి వేకదుదేలి మెఱసిమెఱసి
యొండొరుబేర్కొని యోలయోలని రేచి
 యదటునజల్లు బోరాడియాడి
వాద్యభంగిజలము వాయించివాయించి
 పాడిపాడికెరలి యాడియాడి
తనిసిమూడుజాలతటి ప్రొద్దొకించుక
 చల్లవడిన నల్లనల్ల వెడలి.

ఎఱ్ఱాప్రగడ గోజీవితము నెంతయో ఆదరముతో వీక్షించి దాని రామణీయకమును భక్తిశ్రద్ధలతో వర్ణించినాడు. ప్రాతఃకాలమందలి వ్రజదృశ్యముల నిట్లు పేర్కొనినాడు.

ప్రమదము లుల్లసిల్లదను పారగనిద్రలు
 వోయి పల్మఱుం
గమ్మియు నెమర్చి మేపఱుగగా బారి
 కెండలు వెట్టిలేచివ
త్సములదలంచి పంచితివి చన్నులు
 చేపి పొదుంగు పెంపుతో
గొమరుగ జాఱువాఱుకృతుల గోవులు
 చెన్నువహించె మందలన్.

నలుగునట్లు.

వెన్నెలయందు మందల ప్రశాంత రామణీయకతను అక్రూరుడిట్లు సందర్శించెను.

'చంద్రోదయోల్లాసంబున విభాసమానంబులగు గోసహస్రంబుల శేషతరంగంబులుగా, నత్యంత సంకులంబులైన గోవులం బేరు వేరంబిలుచు గోపాలకుల యెలుంగులను, దుహ్యమానలగు ధేనువుల దుగ్ధధారా నివహంబుల నితాంత నినదంబుల నొండొంటిం బ్రేమునించి సమ్ముఖంబులగు దాగ్ధ్రివత్స సముదయంబుల విపులధ్యానంబుల నొక ప్రమోతగా ప్రమోయుచుం బయుకప యోధింబుయుడించు నందగోవు ఘోషంబునను"

ఈనిన ఆవు.

నిరంతర ధారాపాతంబుగ వర్షము గురియు దుర్దినంబుల గోసంఘముల దీన

సితి ఎఱ్ఱనార్యుని హృదయమున జాలి గదురఁ జేసినది. వానికష్టముల నాత డిట్లు సందర్శించెను.

'అట్టి సమయంబున నిరంతర ధారాపాతంబునం దడిసి నలుదెసలం బఱచి వ్రేయువాయువునఁ గోరవోయి యొండొంటి చాటునకొదిగి కదగానక నిలువంబడియు, గొమ్ములొడ్డి కన్నులుమోడ్చి కడతెప్పల నీళ్ళుగాఱం దలలు డిగ్గవైచి నెమరులుడిగి మూర్ఛలు వోయినట్లుండియు, వడకుసొచ్చి యుఱచు క్రేపులముం దట బెట్టుకొని గంగడోళ్ళం బొదివుకొని యంభారవంబుల నాక్రందించియు, వెల్లువ కతన డొంకిలేక నిలువజాలుండి యుండి యోటఱి కాళ్ళువడంక"

ఇట్లు యెఱ్ఱాప్రగడ మహాకవి తన హృదయ మార్దవమును, సర్వంకషమనీషను, నిర్నిరోధ కవితాధారను వేయి విధంబుల ప్రదర్శించి యున్నాడు. ఆతడు సంస్తవనీయమైన వినయముగలవా డగుటచే నన్నయ తిక్కనలను తనకు కవితా గురువులుగ పొగడుచు వచ్చినను ఆతడు ఆ మహనీయులతో తుల్యాచార్యుడని మనము నిస్సందేహముగ చెప్పవచ్చును. మన పూర్వకవులలో పెక్కురు ఇట్టి యభిప్రాయమే గల్గియుండిరి. శ్రీనాథు నంతటి వాడు ప్రబంధ పరమేశ్వరుని విధమున నొక్కొక్కప్పుడు వ్రాయగలనని సగర్వముగ చెప్పుకొన్నాడు. 'పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని శేవసూక్తివైచిత్రి నొక్కొక్కమాటు' హరివంశము నందలి ఋతువర్ణనములు ప్రకృతి వర్ణనములు ఎఱ్ఱనార్యుని కవిత్వపరిణతిని, నిశిత పరిశీలనాశక్తికి చక్కగా వ్యక్తీకరించు చున్నవి. ఆతని కవిత్వము చదివి యానందించవలసినదేగాని ఉదహరించుటతో తృప్తిపడదు. త్రిలోకైక మల్లుడును ఆంధ్రుడునైన చాణూరమల్లుని యాత డెట్లు ప్రత్యక్షీకరించినాడో చూపుదము.

అనిమిషేభంబుల ననిమిషదృష్టిని జూచి
వెనుదిమానిసి జేయి బెలసెనొక్క
ప్రళయానలార్కుల పసయుం జేయును
నావహించి ప్రోవిడక దీపించెనొక్క
పవమానులందఱి పరమార్థ విధము
రూపప్రౌఢిగైకొని ప్రబలెనొక్క
గోత్రాచలంబు వీకునఁబట్టుగదలి
సర్వావయవస్ఫూర్తి నడరెనొక్క
యనగలావు వేడిమియు, రయంబుమూర్తి
పెనుపునసఖలాద్భుతంబులై పిక్కటిల్ల
దానజగజెట్టియై వెండితనకునెందు
మాఱుమల్లులు లేకుండ మలసినాడు.



# దేశచరిత్రలు - వాని స్వరూపము

శ్రీ ఖండవల్లి - బాలేందుశేఖరంగారు, ఎం. ఏ.

లిఖితరూపకముగను, కేవలశ్రావ్యరూపకముగను ఉన్న సమస్తగ్రంథ జాలమును మనము వాఙ్మయమని వ్యవహరించు చున్నాము. ఈ వాఙ్మయమున కొన్ని గ్రంథములు మత సంబంధములైనవి. అట్టివానిలో కొన్నిటిని అపౌరుషేయములుగ కొన్ని మతములవారు విశ్వసించుచున్నారు. వేదములను సమస్త సనాతన హిందువులును భగవద్దత్తములని నమ్ముచున్నారు. అట్లే బైబిలు, ఖురాను, మున్నగు మత గ్రంథములకు వాఙ్మయమునందు ప్రత్యేకస్థాన మీయవలసి యున్నది. వానియందిమిడియున్న శ్రేష్ఠతనుగూర్చి భిన్నాభిప్రాయములుండవచ్చును. కాని ఆ మతగ్రంథములు పారలౌకిక విషయములగూర్చి ప్రతిపాదించుచున్నవి. కావున వానికొక వైశిష్ట్యము నొసంగక తీరదు. అట్టి గ్రంథజాలమును కేవల లౌకికదృష్టితో చూచి విమర్శించుట సమంజసము కానేరదు. మన గ్రంథములుకాని యితర వాఙ్మయము నంతను మనము రెండు స్థూలభాగములుగ విభజింపవచ్చును. కావ్యములు శాస్త్రములు. కవికర్మ కావ్యము. కవియందుత్తమోత్తమములగు కొన్ని యంశములు కాననగును. భగవంతునివలెనే అతడుకూడ నిర్మాత. దృగ్గోచరమగు స్థావర జంగమ ప్రపంచమునంతను భగవంతుడు సృష్టించినట్లే భావప్రపంచములో కవి అనన్య సామాన్యమగు నిర్మాణమును కావించుచున్నాడు. అతడు నిర్జనమగు ఎడారులయందు మహోత్తర సౌధముల నిర్మించును. నిర్మానుష్యమగు అడవులలో జనసంకులములగు పట్టణములను స్థాపించును. అతడు సృష్టికి వేరొకసృష్టి కావించును. అంతేకాదు. కవి మానవుని అతినిశితమగు దృష్టితో పరిశీలించును. అతని హావభావములను అవగతము కావించుకొనును. కామక్రోధాది భావములచే ప్రేరేపింపబడి మానవుడెట్లు వర్తించునను విషయమును, కవి దృశ్యమాన ప్రపంచములో పరిశీలించి యూరకుండడు. అతని ప్రజ్ఞా విహంగము మహా ప్రపంచములో సైతము విహరించును. సామాన్య మానవుడు చూడజాలని యంశములను కవి తీవ్రమగు తన దృష్టితో గాంచును. కవి వర్ణించునవి కేవల నిత్యజీవనములోని యంశములు కావు. అభూత పూర్వములగు విషయముల నాతడు చిత్రించును. కాని అయ్యవి నిరాధారములగు గాలిబుగ్గలు కావు. ప్రపంచమందలి సామాన్యమానవుని నిత్యవ్యవహారమును దృష్టియందుంచుకొని, భవిష్యత్ప్రపంచమున నసంభవములు కాని యంశములను కవి తన భావనాశక్తిచే

నూహించి వానిని చిత్రవర్ణ రంజితము గావించి పాఠకలోకమున కొసంగును. ఇట్టి గ్రంథములను మనము కావ్యములని వ్యవహరింతుము. వీనియందు గద్యపద్యాత్మకములగు గ్రంథములు నవలలు, చిన్న కథలు, నాటకములు, ప్రబంధములు, గీతములు మున్నగు నవన్నియును ఇమిడి యున్నవి.

శాస్త్రములని వర్ణింపబడిన యితర గ్రంథములకును కావ్యములకును చాల వ్యత్యాసముకలదు. కవియొక్క ప్రపంచము విశాలమైనది. శాస్త్రకారునిప్రపంచము సంకుచితమైనది. కవి విశృంఖలుడు శాస్త్రజ్ఞుడు చాల నిర్బంధములకు లోనై వర్తించ వలయును. కావ్యము విశ్వశ్రేయమునకు మూలమను సిద్ధాంతమును విస్మరించకుండ తనకలమును నడపినంత కాలమును కవి నెవ్వరునుఆక్షేపింపజాలరు. అతనికల్పనా ప్రపంచములో అనంతమగు లోకములు కలవు. శాస్త్రజ్ఞుడు కవివలె భావప్రపంచమందు విహరింప జాలడు. అతడు ప్రకృతిపైననే సంపూర్ణముగ ఆధారపడి యుండును. శాస్త్రజ్ఞుడు దృశ్యమానమగు ప్రకృతిని నిరంతరమును పరిశీలించుచుండును. వస్తుతత్వమును గ్రహించుటకై యాతడెల్లప్పుడునుకృషిసల్పును. ప్రకృతియందు కానవగు వివిధ పదార్థముల గుణములను పరిశీలనచేతను, వివిధ ప్రయోగముల చేతను (Experiments) అతడు కనిపెట్టును. ఇట్లు కనుగొనినవివిధ పదార్థములు, శక్తులు, మున్నగువానిని తగువిధమున సంపుటీకరణముచేసి వాని వలన మానవజాతికి వివిధములగు అనుకూల్యతలను సేకరించుటకై శాస్త్రజ్ఞుడు కష్టించును. ప్రకృతి సామాన్య మానవుని కవగతముకాని కొన్నివిశిష్ట మార్గములలో ప్రవహించుచున్నది. అతినిశితమగు తన పరిశీలనాశక్తిచేతను, ప్రయోగశాల (Laboratory) యందలి వివిధ ప్రయోగములచేతను ప్రకృతి లక్షణములను, తద్రహస్యములను గుర్తించి, వానిని లోకోపకారమునకై కొన్ని సిద్ధాంతముల రూపమున శాస్త్రజ్ఞుడు ప్రకటించుచున్నాడు. ప్రకృతి పరిశీలనము వలన తానుగ్రహించిన సత్యములను పునఃపునః తర్కించి, విమర్శించి, పరీక్షించి, ఆ సత్యములను సూత్రరూపమున నిర్వచించుట శాస్త్రజ్ఞుని యుద్దేశ్యము. ఈతని కార్యరంగములోకూడ భావనాశక్తి విశేషముగ కావలయును. కాని ఆ శక్తి దృశ్యమానమగు నీ జగత్తునకే నిర్బంధింపబడి యుండునుకాని ఊహా ప్రపంచము లోనికి పరువులెత్తరాదు. అయ్యదిశాస్త్రమునకు విరుద్ధము. పైన వర్ణింపబడిన యంశములకనుగుణముగ రచింపబడిన గ్రంథములన్నియు శాస్త్రములని తెలుపవచ్చును. పదార్థ విజ్ఞానశాస్త్రము, రసాయన శాస్త్రము, జీవశాస్త్రము, మున్నగునవన్నియు నీ శాస్త్రకోటిలోనివి. ఈ శాస్త్రములు ప్రకృతిపై యాధారపడియున్నవి. కావున వీనిని ప్రకృతి శాస్త్రములు (Natural Sciences) అని వర్ణించుట సమంజసము.

ప్రకృతి శాస్త్రములు ప్రకృతియందలి కేవల జడపదార్థములను గురించి మాత్రమే తర్కించును. కాని యీ ప్రకృతి కంతకును మకుటాయమాన మగు మానవుని, ఆతని ప్రకృతినిగూర్చి యీశాస్త్రములు జోక్యము కల్గించుకొనవు. అందుచే మానవుని కేంద్రముగ నిడికొని కొన్ని శాస్త్రములు బయలుదేరినవి. వానిని మానవశాస్త్రములు (***Human Sciences***) అని మనము వర్ణింపవచ్చును. మానవ జీవితము సంపూర్ణతను పొందుటకై మనుష్యుడు కొన్ని ధర్మములను పాటింపవలెను. కొన్ని బాధ్యతలను గుర్తింపవలెను. ఇట్టి విషయములనుగూర్చి తెల్పు శాస్త్రము నీతిశాస్త్రము (***Ethics***). మానవుడు అర్థసంపాదనమునకై పడరానిపాట్లు పడును. కొందరు తమ జీవితమంతయు ధనార్జనమునందే వినియోగించుచున్నారు. మానవుని ప్రేరేపించు భావములలో అర్థకాంక్ష మిక్కిలి బలవత్తరమైనది. ఈ అర్థసంపాదనమెట్లు కొనసాగునను యంశమును నిరూపించు శాస్త్రము అర్థ శాస్త్రము. (***Economics***) మానవు డనాదినుండియు తోటి మానవులతో కలిసి నివసించుటకై యుత్సహించుచున్నాడు. అందుచే సమాజము వృద్ధిచెందినది. ఇట్టి సమాజము యొక్క స్వరూపము, దానియందలి లోపములు, సమాజవృద్ధికి మార్గములు. సమాజమందలి వివిధ వ్యక్తుల ధర్మములు హక్కులు మున్నగు విషయముల చర్చించునది సామాజిక శాస్త్రము (***Sociology***). అతి పురాతనకాలమునుండియు మానవుడు ఆత్మరక్షణమునకై యొక సంస్థను ప్రభుత్వమనుదానిని నెలకొల్పి వృద్ధి పొందించినాడు. అట్టి ప్రభుత్వములు, వాని స్వరూపము, వృద్ధిహాని యంగములు మున్నగు వివిధ విషయములను గూర్చి తెల్పుడు చేయు శాస్త్రము రాజ్యాంగ శాస్త్రము. (***Politics***) ఈ విధముగనే మానవుని గూర్చి చర్చించు శాస్త్రములు మరికొన్ని కలవు. వీని కన్నిటికిని మానవశాస్త్రములని మనము నామకరణము చేసినారము. మానవ విజ్ఞానమునం దియ్యవి యొక ముఖ్యశాఖయని వేరుగ తెలుపనక్కరలేదు. కాని యీ విజ్ఞానమునకు శాస్త్రగౌరవ మొసంగవచ్చునా యని కొందరు సందేహపడవచ్చును. కాని అట్టి సందేహమున కెంతమాత్రమును తావులేదు. సృష్టి పరిశీలనమువలన కనుగొనబడిన సత్యములను సిద్ధాంతరూపమున నిర్వచించి, ఆసిద్ధాంతములను పునాదిగ జేసికొని నిర్మింపబడు విజ్ఞానము శాస్త్ర మనబడుచున్నది. మానవశాస్త్రములుకూడ కొన్ని మూల సిద్ధాంతములపై యాధారపడియున్నవి. అయ్యవి మానవ ప్రకృతిని చక్కగ పరిశీలించిన బుద్ధిమంతులు నిర్వచించినవి. కావున పై విజ్ఞాన శాఖలకుకూడ శాస్త్రగౌరవ మొసంగుట తప్పుకానేరదు. కాని ప్రకృతి శాస్త్రములకును మానవశాస్త్రములకును కొన్ని విషయములలో చాలవ్యత్యాసముకలదు. మానవశాస్త్రముల యందలి సూత్రములకు ప్రకృతిశాస్త్ర సూత్రముల అచలత్వము (***Regidity***) లేదు. ఏలన నిప్ర

కృతి శాస్త్రములు జడప్రకృతినిగూర్చి వితర్కించును. ఆ జడపదార్థములు సర్వావస్థలయందును ఒకేరీతిగ మార్పుచెందక యుండగ నుండును. మానవుడుమాత్ర మట్లుకాదు. అతడు జడపదార్థముకాదు. జీవము కలవాడు. జీవికి బుద్ధియును, కామక్రోధాది భావములు నుండుట సహజము. అట్టి వైశిష్ట్యతకలజీవి సర్వకాల సర్వావస్థలయందును జడపదార్థమువలె నొకేరీతిన నుండజాలడు. అతడు తరుచు మార్పునకు లోనగును. భావ పరంపర యెట్లునడపిన మనుజు డామార్గమును ద్రొక్కును. కావున మనుష్యుడేదైన ఒక సందర్భములో నెల్లప్పుడు నొకేరీతిగ వర్తించునని మనము దృఢముగ సిద్ధాంతీకరింపజాలము. ఉదాహరణమునకు రాగి తునుకలపై (*Nitric acid*) పోసినయెడల Nitrogen Peroxide పుట్టునని ప్రకృతిశాస్త్రములోని యొక సిద్ధాంతము. ఈ సిద్ధాంతములో మార్పులేదు. అన్ని వేళలయందును, అన్ని దేశములయందును పై ప్రయోగము వలన పైన సూచింపబడిన Nitrogen peroxide ఉద్భవించును. కాని మానవ శాస్త్రములలో నిట్టి కర్కశ సిద్ధాంతమును కాపించుటకు వలనుపడదు. కూలినాలి యెచ్చట హెచ్చుగా దొరకునో అచ్చటికి పాటకజనము తరలిపోవునని అర్థశాస్త్రములో నొక సామాన్య సిద్ధాంతముకలదు. ఈ సిద్ధాంతము సామాన్య పరిస్థితులలో నిజమే యైనను కొన్ని ప్రాంతములలో నిజముకాకపోవచ్చును. ఇరువదిమైళ్ల దూరములో ఒకపట్టణములో కూలి విశేషముగ దొరకుచున్నను పల్లెటూరిలోని కూలీలు తమ స్వగ్రామముపైగల అభిమానముచేతనో, లేక సోమరితనము చేతనో హెచ్చుకూలి దొరకుప్రదేశమునకు పోకుండ నుండుట యసంభవముకాదు. ఆ సందర్భములో అర్థశాస్త్ర మందలి సూత్రము నిరర్థకమైనదే కదా! ఇట్టి విషయములను గుర్తించియే శాస్త్రజ్ఞులు మానవశాస్త్రములయందలి సూత్రములకు షరతులను కల్పించినారు. సర్వసాధారణముగ నీ సూత్రములతో నొక షరతు విధింపబడును. 'పరిసర స్థితిగతులలో నెట్టిమార్పులును లేని సందర్భములో నీ సూత్రమునందు తెలుపబడిన యంశములు నిజమగునని యీ శాస్త్రములు చాటును. క్షణక్షణ పరివర్తమాన శీలమగు మానవ ప్రకృతినిగూర్చి చర్చించు శాస్త్రముల కిట్టి సదుపాయములుండుట తప్పని సరియని బుద్ధిమంతులెల్లరు నంగీకరింతురు.

దేశ చరిత్రములను సైతము మేమీ మానవశాస్త్ర శ్రేణిలో చేర్చుటకు సాహసించుచున్నాము. చరిత్రయనగా కట్టుకథవంటి గాథలను నభిప్రాయము సర్వసామాన్యముగ వ్యాపించి యున్నది. కావున దేశ చరిత్రములకు శాస్త్రత్వము నొసంగుటకు పలువురు సందేహింపవచ్చును. కాని అట్టి సంకోచమునకు తావులేదని మావిశ్వాసము. శాస్త్రజ్ఞునికిని చారిత్రకునికిని చాల సామ్యముకలదు. సత్యాన్వేషణమే ఈ యిరువురియొక్క పరమార్థము. శాస్త్రజ్ఞుడు ప్రకృతిని

శోధించుచున్నాడు. అట్లు శోధించి కొన్ని సూత్రములనాతడు నిర్వచించుచున్నాడు. అట్లే చారిత్రికుడుకూడ మానవేతిహాసమును సంశోధించి సత్యమగు చరిత్రను వ్రాయుచున్నాడు. ఇరువురునుకూడ స్వాభయములగు నభిప్రాయములను సంపూర్ణముగ వెనుకకునెట్టి కేవల సత్యాంశములనే ప్రతిపాదించుటకై పాటుపడుచున్నందువలన ఇరువురునుకూడ సమానులు. చారిత్రకుడు శాస్త్రజ్ఞునివలె సూత్రనిర్వచనము మాత్రము చేయడు. ఆతడు ప్రపంచ చరిత్రయందలి మహత్తర సంఘటనలను వానికి కారణభూతములైన శక్తులను పేర్కొని వానిని చర్చించును, ఆతడు చారిత్రకాంశముల కార్య కారణ సంబంధమును, వాని ఫలితమును వర్ణించును. ఈ సంఘటనవలన మనమీ నీతిని గ్రహింపవలెనని మాత్రమాతడు వాచికముగ నుడువడు. అది యాతని ధర్మము కాదు. అది పాఠకునికే విడువబడినది. రాజనీతి కుశలుడు చరిత్ర పఠనమువలన తనబుద్ధి వైశిష్ట్యము ననుసరించి సూత్రముల గ్రహించును. చరిత్ర మానవ శాస్త్రములలో నొకటి కావున నిందు శాస్త్రప్రయోగములు(Scientific Experiments) కావించి సత్యమును కనుగొనుట కవకాశములేదు. దేశకాల పాత్రముల ననుసరించి మనుష్య ప్రకృతి మారవచ్చును, ప్రభుత్వముయొక్కయు, జమీందారులయొక్కయు దౌర్జన్యమును సహింపలేక ఫ్రాన్సు దేశీయులును, రష్యాప్రజలును మహత్తరమగు విప్లవములు కావించియున్నారు. కొంచెమించుమించు అట్టి పరిస్థితులే భారతదేశములో నెలకొనియున్నను ఇచ్చటి ప్రజలు రష్యావారివలెను ఫరాసువారివలెను దౌర్జన్యయుతమగు విప్లవమును కావింతురని రూఢిగ చెప్పుటకు వీలుకాదు. కావున దుష్ట ప్రభుత్వమువలన దౌర్జన్యపూరితమగు ప్రజా విప్లవము తప్పక సంభవించునని తెల్పుట సాహసము. కావున చరిత్రకారుడు తదితర శాస్త్రజ్ఞులవలె సూత్ర నిర్వచనము చేయజాలడు. చరిత్రను పఠించువారు తమంతతామే అట్టిసూత్రములను ఏర్పాటు చేసికొని వాని కనుగుణ్యముగ తమ కార్యకలాపమును సాగించుకొనవలెను.

చరిత్ర రచనము గ్రీకుదేశమున నతి పురాతన కాలమునుండియు సాగుచున్నట్లు మనకు తెలియవచ్చుచున్నది. ఈ చరిత్రకారులలో హెరోడోటస్, జెనొఫన్, థ్యూసిడైడ్స్ అనువారు ప్రముఖులుగ కాననగుచున్నారు. చరిత్రరచనము విషయమై వీరికి భిన్న దృక్పథము లున్నట్లు మనము వినుచున్నాము. ఇందు కొందరు చరిత్రయనగా మనస్సున కాహ్లాదము కల్గించునట్టివియు, వినుటకు సొంపైనవియు, అగు వంశముల నేర్చి కూర్చుటయని అభిప్రాయపడిరి. మరికొందరు చరిత్ర నీతిబోధకమగు నొక జ్ఞానభాండారముగ నుండవలయును. కావున అందు వినువారికేదైన జ్ఞానబోధ కావించి, జీవితమందు నూత్నమార్గములు, పద్ధతులు చూపు విషయములు మాత్రమే పొందుపరవ

వేలయునని వాదించిరి. చరిత్ర యనగా నిష్పక్షపాత బుద్ధితో జరిగిన యంశముల నన్నిటిని విపులముగ వర్ణించుచు వాని యంతరార్థమును తెల్పుటయని వేరొక పక్షమువారు వాదించిరి,

ఆధునిక యుగమందు మనము చరిత్రను నిష్పక్షపాత బుద్ధితో వ్రాయబడిన భూతవృత్తాంతమను నర్థము నొసంగుచున్నాము. చరిత్రకారుడు నిష్పక్షపాతియు, నిర్భయుడునై యుండుట మిక్కిలి యావశ్యకము. ఇటీవల చరిత్రరచనకై అపారముగు సామగ్రి లభించుచున్నది. అట్టి సామగ్రినంతను ఆమూలాగ్రముగ పరీక్షించి, తనకు సత్యమని తోచిన విషయములను మాత్రమే గ్రంథస్థము చేయుట చారిత్రికుని ధర్మము. తాను పరిశీలించుచున్న చరిత్ర సామగ్రియందు తన జాతికిని, తనమతమునకును, తన యభిప్రాయమునకును వ్యతిరేకమైన యనేకాంశములు చారిత్రికునకు లభింపవచ్చును. అట్టివిషయములను స్వాభిమానముచే మరుగుపరచినయెడల చరిత్రకారుడు తనధర్మమునుండి భ్రష్టుడైనాడని తలంపవచ్చును. అదేవిధముగ ప్రభువులనుగాని, తనకు పోషకులనుగాని న్యూనపరచునంశములను కూడ నిర్భయముగ తెల్పగల్గుట చరిత్రకారుని లక్షణములలో నొకటి. అట్లు కానినాడు చరిత్ర లోపభూయిష్ఠమై పోవును.

చారిత్రికునికి సమగ్రదృష్టి యుండవలయును. తానుచేపట్టిన జాతియొక్కగాని, దేశము యొక్కగాని సమగ్రతిహాసమును చారిత్రికుడు పాఠకలోకమున కందజేయవలయును. చరిత్ర యనగా సర్వసాధారణముగ మనము రాజవంశముల చరిత్రయని భ్రమపడుచున్నాము. రాజులు, రాణులు, మంత్రులు, సేనానులు, వారి యోగ్యతాయోగ్యతలు వారి జయాపజయములు, వారివృద్ధి క్షయములు మున్నగువానిని మాత్రమే చరిత్రకు కావలసిన సామగ్రియని తలంచినారము. ఈభావము లోపభూయిష్ఠమను విషయ మిటీవలనే ప్రబల జొచ్చినది. రాజ్యపాలనము చేయుచున్న రాజవంశముల చరిత్రకూడ సమగ్రచరిత్రయందు పొందుపరుప వలయును. అట్టి విషయములానాటి రాచరికమునుగురించి మాత్రమే మనకెరుక పరచును. చరిత్ర యనగా ఒక దేశపు ప్రజలచరిత్రగాని కేవలమా దేశప్రభుత్వచరిత్ర కానేరదు. కావున సామాన్య ప్రజలకు సంబంధించిన యంశములను కూడ చర్చించుట చరిత్రకారుని ధర్మము. ఇట్టివానిలో ఆ దేశముయొక్క వాణిజ్యము, వ్యవసాయము, పరిశ్రమలు, ప్రజలయొక్క ఇతరవృత్తులు, సాంఘికాచార వ్యవహారములు, ఆటపాటలు, లలితకళల యభివృద్ధి, విజ్ఞానాభివృద్ధి, మున్నగు సమస్త విషయములను ఇమిడియున్నవి. ఇట్టి యంశములన్నిటిని దృష్టియందుంచుకొనిన చరిత్రకారుడే తన ధర్మమును సక్రమముగ నెరవేర్చినవాడగును.

సమగ్రతయని చెప్పబడిన లక్షణము లేకుండుటవలననే నేటి మనచరిత్రలు పాఠకులయందభిరుచిని కల్పింపజాలకున్నవి.

చరిత్ర యనగా ఎన్నడో చనిపోయిన రాజుల వృత్తాంతముకదా. అట్టి విషయముతో మనకేమి సంబంధము కలదను భావము పలువురను భ్రమపెట్టుచున్నది. చరిత్ర కేవలము రాజుల వృత్తాంతము అయ్యాది మనపూర్వులనుగూర్చిన సమగ్రకథనమను భావమును చారిత్రికుడు శ్రోతలలో కల్గింపవలెను. నేటిమనజీవితము మన పూర్వుల జీవితమునుండి యుద్భవించినది. వర్తమానమునకును, భూత వృత్తాంతమునకును త్రెంపరాని సంబంధము కలదను సత్యమును పాఠకుని హృదయమందు నాటగల్గిననాడు చారిత్రకుడు తన ధర్మమందుకృతకృత్యుడైనట్లు తలంపవలెను. అట్టిభావమును చరిత్రకారు డెట్లు కల్గింపగలడు? "చరిత్రయందు వర్ణింపబడినకాలములోకూడ మనవంటిమనుష్యులే జీవించియుండిరి. వారికికూడ మనకువలెనే ఆదర్శములు, ధర్మములు, శాస్త్రములు, సుఖదుఃఖములు, మానావమానములు, మున్నగునవి కలవు" అను విశ్వాసమును చరిత్రకారుడు పాఠకునియందు కల్గింపవలెను. సర్వసామాన్యముగ మానవుడు వర్తమానముపైననే దృష్టియుంపగలడు. భూత భవిష్యత్తులు వానికి స్వప్నతుల్యముగ కాన్పించును. చరిత్రకారునియందిట్టి లోప ముండరాదు. అతడు భూతకాల వృత్తాంతమునుకూడ తన ప్రజ్ఞా చక్షువుచే చూడగల్గి యుండవలయును. ఈనాటి ప్రజలు జీవితలక్ష్యమని తాము విశ్వసించిన యర్థములను సంపాదించుటకై యెట్లు రాత్రింబగళ్ళు కష్టించి యత్నించుచున్నారో అట్లే పూర్వులు కూడ యత్నించిరని యాతడు తెలిసికొనవలెను. నేడు మనము కావించుచున్న కృషి మనకెంత యర్థవంతముగను, ఆవశ్యకముగను కాన్పించుచున్నదో అట్లే మన పూర్వులుకూడ తమకృత్యములను గూర్చి తలంచిరని యెరుంగుట చరిత్ర వ్రాయువారికి మిక్కిలి ఆవశ్యకము. అట్టి యూహాశక్తి కల్గినయాతడే నిజముగు చరిత్రకారుడు. అతని గ్రంథములే పాఠకుని చిత్తము నాకర్షింపగలవు.

చరిత్ర హృదయమును గ్రహించు నుద్దేశ్యము గలవారు. మరొక ముఖ్యవిషయమును గుర్తించవలెను. ప్రతియుగమునందును ప్రజలు తమ యుగమునందు మానవాభ్యుదయము సంపూర్ణతను గాంచినదని తలంచిరి. మానవ శక్తికి సాధ్యమైన కార్యములను మనము సాధించినారము. ఇంతకు మించి ముందు తరములవా రేమిచేయగలరు? అనుభావము ప్రతి యుగమునందును ప్రజల నావరించినది. అట్లు కానినాడు మనుష్యుడు తాను నిర్మించిన భవనములు, తాను రచించిన కావ్యములు, తాను మలచిన శిలలు, తాను చిత్రించిన దృశ్యములు మున్నగువానిని చూచి యానందభరితుడగుట సంభవము కాదు. తాను సాధించిన కార్యము స్వల్పము. సాధింపవలసినది మిక్కుటముగ కలదను వినమ్రభావము ఎవ్వరో కోటికొక్కరియందు మాత్రము పొడసూపును. తాను సాధింపవలసిన కార్యములు లేవను భావము మనుష్యుని సంతోషభరితుని

చేయుట వాస్తవమే కాని యీ భావమే పరివర్తమాన ప్రపంచమున నాతని పతనమునకు కూడ హేతువుగ పరిణమించును.

చరిత్రకారుడు ముఖ్యముగ గమనింపదగినదియు, చరిత్రయందు పొందుపరుపదలసినదియు నొక ముఖ్యాంశము గలదు. అయ్యది మానవజాతియొక్క ఎడతెగని మార్పు. భూమిపై మనుష్యు డేనాడుద్భవించెనో వివాదాస్పదమైన విషయము. కాని ఆనాటినుండి నేటివరకును కూడ మానవుడు క్షణక్షణమునుకూడ మార్పునకు లోనగుచున్నాడు. జాతులమాట యట్లుంచి వ్యక్తులు కూడ దినదినమును మారుచున్నారు. ఈనాటి భావములు, ఆదర్శములు రేపు లేవు. పదిసంవత్సరములకు పూర్వము మన మెట్లుంటిమో మనకే బాగుగా తెలియదు. ఏలనన, వర్తమానమే సత్యమును, శాశ్వతమనను భ్రమ ప్రతివారిని ఆవరించును. వ్యక్తులయందువలెనే జాతులయందుకూడ నిరంతరము మార్పులు జరుగుచున్నవి. వేదకాలమందలి భావములు, ఆదర్శములు, ఉపనిషత్కాలములో లేవు. ఉపనిషత్కాలమునకును పురాణ యుగమునకు చాల భేదము. పురాణకాలమునకును చారిత్రిక యుగమునకును బ్రహ్మాండమంత వ్యత్యాసము. పందొమ్మిదవ శతాబ్ది యందలి వాదములు నేడు మనకు హాస్యాస్పదముగను, పేలవముగను కాన్పించుచున్నవి. ఈ విధముగ మానవజాతి నిరంతరము మార్పు చెందుచున్నది. కాని ఆ విషయము వారికి తెలియదు. చారిత్రికుడీ పరివర్తమానశీలతను గుర్తించుట చాల ముఖ్యము. అట్లు గుర్తింపనినాడాతడు చారిత్రిక సంఘటనల యాంతర్యము నెరుంగజాలడు. తానెరుంగనివాడు పరులకు తెల్పుట దుస్సాధ్యము. జగత్తు నిరంతరము మార్పు చెందుచున్నదని పల్కుటవలన నయ్యది అభివృద్ధి చెందుచున్నదని మా యభిప్రాయము కాదు. అట్లు తెల్పుట సాహసము. మానవుడు పంచ మహాభూతములపై తన యాధిక్యతను సాధింపగల్గినను, మనుష్యప్రకృతియందు నెలకొనియున్న కామక్రోధాదులను, రాగద్వేషాదులను జయింపలేదు. ఆ కారణమువలననే ఇరువదవ శతాబ్దియందు సైతము రెండు మహాసంగ్రామములు చెలరేగి లోకమందు ప్రచండ సంక్షోభమును, ప్రబల దుఃఖమును కల్గించినవి. ఇట్టి పరిస్థితులలో మానవుడు దిన దినమును అభివృద్ధిచెందుచున్నాడని వాదించుట హాస్యాస్పదము. అందువలన చరిత్రకారుడు గుర్తింపవలసినదెల్ల ప్రపంచము నిరంతరమును మార్పుచెందుచున్నదను యంశ మొక్కటియే. ఆ మార్పువలన భౌతికముగను, నైతికముగను మానవుడు ముందునకు సాగిపోయినాడా లేదా యనునది ప్రత్యేకాంశము.

సర్వసాధారణముగ మానవు లందరి దృష్టిని ఆకర్షించెడి మహత్తర సంఘటనలతో పాటు, అల్పారంభము కల్గియు మహత్తర పరిణామములుకల యంశములను కూడ చరిత్రకారుడు దృష్టియందుంచుకొని పాఠకలోకమునకు తెల్పు

చుండవలెను. క్రీస్తుశకముయొక్క ఆరంభమున పాలస్తీనములో క్రీస్తుయొక్క బోధనలు మున్నగువానిని రోమకప్రభువు లొక స్థానికమగు విషయముగా పరిగణించి త్రోసివైచిరి. కాని మహత్తరమైన రోమకసామ్రాజ్యము నేడు నామమాత్రావశిష్టమైనది. కాని ఏసుక్రీస్తుయొక్క బోధనలు శాశ్వతఫలితమును కలిగి క్రైస్తవమత స్థాపనకు కారణమైనవి. క్రీ. శ. 1453 వ సంవత్సరమున రోమకసామ్రాజ్యముయొక్క తూర్పుశాఖకు ముఖ్యపట్టణమైన కాన్‌స్టాంటినోపులు నగరమును అట్టోమాను తురుష్కులు జయించినప్పుడు క్రైస్తవులెల్లరును తమ నాగరీకత కూలిపోయినట్లు వగచిరి. కాని అదేసంవత్సరము జాన్ గ్యూటెన్‌బర్గు అనునాతడు మొట్టమొదట పుస్తకమును అచ్చువేసిన యంశము నెవ్వరును గుర్తింపరైరి. కాన్‌స్టాంటినోపులు పతనమువలన క్రైస్తవ ప్రపంచమునకు సంభవించిన నష్టముకంటె ముద్రాయంత్రము కనుగొనుటవలన కల్గిన లాభము వేయిమడుంగు లధికమని మనకు తెలిసియే యున్నది. 1869 వ సంవత్సరమున మధ్యధరాసముద్రమును, ఎఱ్ఱసముద్రమును కలిపి, తద్వారా ప్రాక్పశ్చిమములకు సంబంధమును మరింత సన్నిహితము కావించిన సూయజుకాలువ నిర్మాణమునే మనము స్మరించుచున్నాము కాని అపరబుద్ధుడని విఖ్యాతిగాంచి ప్రపంచమందంతటను గొప్ప నైతికపరివర్తనమును కల్గించిన గాంధివంటి మహనీయుడు గుజరాతు రాష్ట్రములోని పోర్బందరు నగరములో అదే సంవత్సరమున జన్మించిన యంశమును మనము గుర్తించుటలేదు. ప్రపంచచరిత్ర యందలి సామాన్య మహత్తర సంఘటనముల నన్నిటినికూడ, ఎట్టి భేదమును లేకుండ పాఠకుని యెదుటనుంచుట చారిత్రకుని ముఖ్య ధర్మములలో నొకటి.

పందొమ్మిదవ శతాబ్దమునుండి భౌతిక శాస్త్రములయందు కల్గిన మహత్తరాభివృద్ధివలన మానవ జీవితమందు కూడ గొప్పమార్పు సంభవించినది. యాన ప్రతియాన సౌకర్యములు విస్తారముగ పెంపుగాంచినవి. వార్తాపత్రికలు, తంతివార్తలు రేడియో యంత్రములు మున్నగు వానివలన భావప్రపంచమందు గొప్పమార్పు సంభవించినది. రైళ్ళు, పొగయోడలు, వాయువిమానములు. మున్నగువానిసహాయమున మానవులొండొరులతో నత్యంత సామీప్యమును సంపాదించిరో, అట్లే వార్తాపత్రికలు మున్నగువానివలన మనుష్యుల భావములలో ఏకత్వము సిద్ధించుచున్నది. పదునాల్గవ శతాబ్దియందు యూరోపు ఖండమున సంభవించిన మార్పులు భారతదేశవాసులకు తెలిసెడివేకావు. తెలిసినను అయ్యవి వేరొకలోకమునకు సంబంధించిన యంశములవలె కాన్పించి యిచ్చటిప్రజలు నిర్లిప్తులై యుండెడివారు. ఇప్పుడట్లుకాదు. నేడు ప్రపంచమంతయు నేక దేశమువలె మారిపోయినది. దక్షిణ అమెరికాలోని మాకుమాల పట్టణములో జరిగిన సంఘటనలు కూడ నేడు మనము శ్రద్ధతో తెలిసికొను

చున్నాము. వానివలన మనభావములు కూడ మార్పుచెందుచున్నవి. ఈ విషయమును చారిత్రకుడు, గుర్తించవలెను. 1904 వ సంవత్సరమున ప్రాచ్యజాతియగు జపాను పాశ్చాత్య జాతియగు రష్యాను ఓడించుటతోడనే భారతదేశీయులెల్లరును దానిని తమ విజయముగ తలంచి ఉప్పొంగిరనియు, దానివలన భారతజాతీయోద్యమము ప్రబలమైనదనియు ఆధునికులెల్లరు నెరుంగుదురు. అట్లే 1921 వ సంవత్సరమున ముస్తఫా కమాలుపాషా నాయకత్వమున తురుష్కులు గ్రీకులనోడించి తమ దేశ స్వాతంత్ర్యమును స్థాపించుకొనుటవలన సమస్త మహమ్మదీయ ప్రపంచము నందును నూతనోత్సాహమును నూతనచైతన్యమును కల్గుట యుందెరింగిన విషయమే. ఇంతయేల, స్విట్జర్లాండు ప్రభుత్వము వారిద్వారా జపాను దేశము మిత్రమండలికి సంధి షరతులను పంపిన దని తెలియగానే బొంబాయి మార్కెట్టులో వెండిబంగారముల ధరలు తక్షణము పడిపోయినట్లు మీరువినలేదా! కావున ప్రపంచమందలి ప్రతి వ్యక్తి జీవితముపైనను ప్రపంచ పరిణామముల ప్రభావము తప్పక కాన్పించుచున్నది. అట్టి సందర్భమున ప్రపంచమందలి మహత్తర సంఘటనల ప్రభావ మితర దేశీయుల జీవితముపై తప్పక కానవచ్చునని వేరుగ చెప్పుట యనావశ్యకము. ఆధునిక చరిత్రకారుడు తన గ్రంథరచనా సందర్భమున తాను వ్రాయ బూనిన దేశ చరిత్రపై ప్రపంచ వాతావరణ ప్రభావ మెంత వరకు కలదను విషయమును చక్కగ గుర్తించి వర్తించవలెను. అట్లు గుర్తించని చరిత్రకారుని వ్రాతలు కూపస్థమండూకము పల్కులవలె హాస్యాస్పద మగును. కావున సమర్థుడగు చారిత్రికుడు తన గ్రంథమందిట్టి లోపములు సంక్రమింపకుండ చూచుకొనుట మిక్కిలి యావశ్యకము.





# ★ తలవ్రాత, నుదుటివ్రాత ★

డాక్టరు శ్రీ చిలుకూరి నారాయణరావుగారు, ఎమ్.ఏ., పి.ఎచ్.డి.

"అరసికేషు కవిత్వ నివేదనం
శిరసి మాలిఖ, మాలిఖ, మాలిఖ!"

"ఓ బ్రహ్మదేవుడా! తలమీద ఏమి వ్రాసినా వ్రాసుకోగాని, రసగ్రహణము చేయజాలనివాని ముందర కవిత్వము వినిపించుమని మాత్రము వ్రాయకయ్యా, మహాప్రభో!" అని కవి వేడుకొంటున్నాడు. అట్లే,—

"నుదుటన్ వ్రాసిన వ్రాత దాటఁదరమా నూతేండ్లు చింతించినన్" అని మరొకకవి అంటున్నాడు.

"అయ్యో! నా తల వ్రాత! - నా నుదుటివ్రాత!- వాడి నుదుటివ్రాత అట్లా ఉంటూ ఉంటే ఎవరేమి చేయగలరు!"

ఇటువంటి మాటలు ప్రతినిత్యము ప్రతి నోటినుంచీ వస్తూనే ఉంటవి.

తలవ్రాత, నుదుటివ్రాత అనేవి అన్ని సందర్భాలలోను దురదృష్ట సూచకార్థములలోనే వాడబడుతూ ఉంటవి. దురదృష్టమును సూచించే తల- నుదుటివ్రాత లున్నప్పుడు అదృష్టసూచకము లయిన వ్రాతలుకూడా ఉండవలెనుకదా! అయితే లోకములో అదృష్టపు వ్రాతలను గురించి సాధారణముగా ఆలోచించరు. వాటిని గురించి మాట్లాడుకోరు. అదృష్టము పట్టినప్పుడు అదంతా తమప్రజ్ఞామూలముగానే సంభవించిన దనుకొంటారు. అదృష్టము తప్పినప్పుడు మాత్రము బ్రహ్మదేవుడి మీదనో, మరి ఎవడి- దేని మీదనో తన దురదృష్టమును పులిమివేస్తాడు.

తలవ్రాత, నుదుటివ్రాత అని సమస్త పదములుగా ప్రయోగించక ఉత్త 'వ్రాత' అని ప్రయోగించడము కూడా ఉన్నది. "అయ్యో! నావ్రాతా! - వాని వ్రాత అట్లా అట్లా ఉన్నప్పు డెవరేమి చేయగలరు?" అనేటప్పుడు దురదృష్టసూచకముగా ఆ పదము వాడినా, దానిని మంచి అర్థములోకూడా వాడడము లేకపోలేదు. "వాని వ్రాత బాగున్నది" అనేటప్పుడు మంచి అర్థమే స్ఫురిస్తుంది గాని, ఆపలుకుబడిలో ఒకరీతి అసూయ, ఈర్ష్య, ఓర్వలేనితనము కూడా తొంగి చూస్తూ ఉంటుంది.

"వ్రాత"కు పర్యాయపదముగా "గీత" అనేదానినికూడా ఉపయోగిస్తారు. గీతల సముదాయమే వ్రాత కాబట్టి నామైకదేశే నామగ్రహణ న్యాయమునుబట్టి రెండింటికిన్ని వ్యవహారములో ఏకార్థము సిద్ధించింది. "వాని వ్రాత బయలుపడినది, వాని గీత బయలుపడినది" అనేటప్పుడు తల

మీది, నుదుటిమీది వ్రాత, గీత అనియే అర్థము. అదృష్టము అనే మంచి అర్థమున్న దా పదముల కా వాక్యములలో.

వ్రాత గీతల సముదాయమే అయినా, గీతల సముదాయములన్నీ వ్రాతలు కావు.

గీత అయినా వ్రాత అయినా అర్థవంతమైనప్పుడే మనకు ప్రయోజనకారి. అర్థములేని గీతలను, వ్రాతలను పిచ్చిగీతలు, పిచ్చి వ్రాతలు అంటాము. కాని, పిచ్చిలో కూడా ఒక పద్ధతి కనబడవచ్చును. పద్ధతి బోధపడితే దానినిబట్టి అర్థము నూహించడానికి ప్రయత్నించవచ్చును. ఆ అర్థము సరి అయినదా, కాదా, అనేది వేరేమాట. అవే గీతలు వివిధస్థానాలలో వచ్చి, ఒకటే ఉచ్చారణ కలిగి ఉండి, ఒకటే మాటకు గాని, వాక్యమునకుగాని గురుతుగా ఉండి వ్యవహారానికి అర్థము సరిపోతూ, వివిధ స్థలములలో వివిధములైన విలువలను కలిగి ఉండకపోతే వ్రాత కొక అర్థము తేలుతుంది

గీతకు గీతగా అర్థ మేమిన్నీ ఉండదు. అర్థ మనేది మనము కల్పించినది. మనమా గీతలో సాంకేతికముగా ఆరోపించేది- కాని, ఆ ఆరోపణ అన్ని సందర్భాలలోను అమరిపోవాలి. అనుభవాలను అనుసరించి ఉండాలి. సంకేతము తెలిసినవా రందరికిన్ని సమానముగా అర్థము కావాలి.

ఒక పద్ధతి ననుసరించిన గీతలు రెండు విధాల పరిణామము పొందవచ్చును. కొన్ని గీతలవల్ల బొమ్మ లేర్పడవచ్చును. కొన్ని గీతలవల్ల వ్రాత ఏర్పడవచ్చును.

బొమ్మలనేర్పాటు చేసేగీతలు చిత్రలేఖనముగా మారుతవి. వ్రాతనేర్పాటు చేసేగీతలు వాక్సంకేతవిద్యగా (కళగా అనుకొనంకి) మారుతవి. ఒకప్పుడు బొమ్మలే వ్రాతగా ఉపయోగపడవచ్చును. అప్పుడొకొక్క అభిప్రాయమునకు, వేదవాక్యమునకు ఒకొక్కబొమ్మ నిలుస్తుంది. ఆ బొమ్మల వరుసనుబట్టి ఒక కథ ఏర్పడవచ్చును. దేవాలయాలలో గాని, ఇతరత్రగాని ఇట్టి చిత్రకథలను పూర్వులు చిత్రించినారు. ఈ బొమ్మలే రానురాను పరిణామముపొంది ఇప్పటి వ్రాతగా మారినవని కొందరు శాస్త్రజ్ఞులంటారు.

ఈ విషయమును నిర్ణయించడానికి మానవచరిత్రను చాలాలోతుగా దీర్ఘముగా తరచవలసి ఉంటుంది. అదొకప్రత్యేకశాస్త్రము దానికిక్కడ కొద్దిగా సూచించి విడిచిపెట్టుతాను. ఈ ముందు పేజీలోనిబొమ్మలు చూడండి; ఇదిఇప్పుడు కల్పించి వ్రాసినవి కావు. కొన్ని దశసహస్రాబ్దములకు వెనుకవడి శాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. పురాతన మనుష్యులెవరో కొన్ని అభిప్రాయములను సంకేతములుగా కొండలలో రాళ్ళమీద చెక్కినారని అంటున్నారు. కాదనడానికి కారణము కనబడదు. మొదటిచిత్రములోనిబొమ్మలు ప్రత్యేకములైన పదార్థములకు గుర్తులని వారభిప్రాయ పడినారు. ఇటువంటిబొమ్మలను అనేకచోట్లచూచి, వాటినొకచోట చేర్చి, వర్గీకరించి, వాటిలో ఒకపద్ధతి ఉన్నదని కనుగొని, వాటిఅర్థమిదిఅయి

ఉంటుందని ఊహించినారు. ఈ బొమ్మలలో ఒక్కొక్కటి వ్రాతలోని ఒక్కొక్క మాటకు సరిపోతుంది - శాస్త్రజ్ఞులు ఈ బొమ్మల కారోపించిన అర్థములను బట్టి వాటిని వ్రాసినవారు గొప్ప నాగరకతను చెందినవారే అనవలెను.

దేవుని గురించిన అభిప్రాయాలు కలవారు నాగరికులుకాక మరేమవుతారు, తత్త్వజిజ్ఞాసువులుకాక మరేమవుతారు. బొమ్మలలో మొదటిదాని కర్థము 'దేవుడు' అని శాస్త్రజ్ఞులూహించినారు. ఆబొమ్మను చూస్తే ఒక మనుష్యుని చిత్రమువలె కనబడుతుంది. దేవుడున్ను ఒక మనుష్యుడేనా అని ఎవరయినా అంటారేమో. అవును, మనుష్యుని దేవుడు మనుష్యుడే. సందేహ మెందుకు? అతనిది మనుష్యాకారమే. మరొక ఆకారముతో మనుష్యుడు దేవుని ఊహించలేడు. కావలిస్తే ఆ మనుష్యాకారపు దేవునికి మరికొన్ని తలలు, మరికొన్ని కళ్ళు, మరికొన్ని చేతులు, కాళ్ళు చేరుతేచేరుతవి కాని, అట్ట అడుగుకు పోయి ఆలోచిస్తే దేవుడు మనుష్యుడే. కొన్ని సమయాలలో ఆ దేవుని ముఖము ( లు ) జంతు ముఖముల ఆకారములను పొందవచ్చును. "మత్స్య, కూర్మ, వరాహశ్చ"- జంతువులే. 'నారసింహశ్చ' నర జంతువుల జంట. 'వామనః రామో, రామశ్చ, రామశ్చ, బుద్ధః, కల్కి రేవచ'- మనుష్యులే. విష్ణువుకు నాలుగు చేతులు. శివుడు సగము మగ, సగము ఆడ, ఒక. (అయిదు) తల(లు) బ్రహ్మకు అయిదులో ఒకటి ఎగిరిపోతే నాలుగుతలలు-ఏమయితేనేమిమనుష్యులే. మనుష్యులకు కొన్ని గుణములు లైతే దేవునికి అనంతగుణములు. మనుష్యుల వలెనే దేవుళ్ళకున్ను కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము ఉండనే ఉన్నవి. మనుష్యులవలెనే దేవుళ్ళకున్ను పెండ్లాలు, కొడుకులు (కూతుళ్ళమాట నాకు తెలియదు), మనుమలు, ఎడతెగని సంసారము, వాళ్లొకప్పుడు భూమిమీదికి దిగివచ్చి, ఒక నాటకమాడి, ఆడించి, వచ్చినచోటికి వెళ్ళిపోతూ ఉంటారు. ఈ సంగతంతా మన దేవుళ్ళది. ఇతర దేశాలలోకూడా ఒకానొకప్పుడు దేవుళ్ళ అవస్థ అంతా ఇట్లే ఉండేది. కిరస్తానపు దేవుడు, మహమ్మదీయుల దేవుడు మాత్రము ఏకోవకః. వారు భూమిమీది కవతరించరు. సంసారమును పెంచుకొనరు. సాధారణ నరమానవుల చరిత్రములను కనిపెట్టి తమలోకములోనే ఉంటారు. మానవుల శారీరకయాత్ర అయిన తరువాత వారి ప్రవర్తనకు తగినట్టుగా బహుమానముతో శిక్షణ చెప్తూ ఉంటారు. ఎవరేమనుకొన్నా వారిపేళ్ళను బట్టి చూస్తే వాళ్ళు పుంలింగులయినట్లే కనబడుతుంది. కిరస్తానుల దేవుడుమాత్రం మగవాడే. అతనికి కొడుకు కూడా ఉన్నాడు. మానసపుత్త్రుడో మరొకరీతి పుత్త్రుడో అనుకొంటే అనుకోవచ్చును. ఇదంతా సగుణోపాసనకు సంబంధించిన మాట. నిర్గుణోపాసనలో ఈశ్వరత్త్వమునకు నిరాకారత్వమున్ను, నిర్గుణత్వమున్ను లక్షణములయినా, 'ఏ ఆకారము

లేదు? ఏ గుణములు లేవు?' అనే ప్రశ్న వచ్చినప్పుడు మనుష్యుని (లేక మనుష్యునికి తెలిసిన) ఆకారమున్ను, గుణములున్ను లేవని చెప్పగలమే కాని మరొకవిధముగా చెప్పలేముకదా! ఎంత నిర్గుణోపాసన అయినా తుదకొకరీతిగా సగుణోపాసనగా మారక వీలులేదు. 'నేతి, నేతి' వాదము నేలవిడచిన సాము వంటిది. ముక్కూ, మొగమూ, తలా, తోకా, కన్పించకపోయినా ఆ వాదము 'తత్ సత్' అని అయినా ఒప్పుకోక తీరదు. తుదకు సూఫీలు అల్లాకు 'అల్ (తత్) లహ్ (సత్) అనే అర్థము చెప్పినారు. ఈ విషయములోని కింకా లోతుగా పోవడ మప్రస్తుతము గనుక విడిచిపెట్టుచున్నాను.

ఆ బొమ్మను లిఖించిన పురాతన మనుష్యులు గొప్ప నాగరికత కలవారని చెప్పడమే ప్రస్తుతాంశము.

ఇటువంటి దేవునిబొమ్మ లా కాలములోనే కాకుండా తరువాత కాలములో కూడ కనబడుతున్నవి. మొహంజోదరో హారప్పా, మొదలయిన సింధుదేశ ప్రాంతములలో ఇప్పుడు భూగర్భమునుంచి బయలు పడుతూవున్న చిత్రములలో కూడా ఇదే ఆకారములో దేవుని బొమ్మలు ఈరీతిగానే ఉన్నవి. ఆ చిత్రాలలో స్త్రీ దేవతల ఆకారములుకూడా ఉన్నవి. భరతవర్షములోని ఇతర ప్రాంతాలమాట నిశ్చయముగా చెప్పలేను కాని

మొదటి చిత్రము




శాస్త్రజ్ఞు లూహించినట్లు మొదటి బొమ్మకు 'దేవుడు' అనేదే అర్థమయితే ఆంధ్రదేశములో పల్లెలలోను, పట్టణములలోను మశూచి, విశూచి పాడచూపి

నప్పుడు తలవాకిలి కిరుప్రక్కలా గోడల మీద పసుపుతో ఇటువంటి చిత్రాలు వ్రాయుడము ఆచారముగా ఉన్నది. అంటే ఈ ఆచార మానాటినుంచి ఈనాటి వరకు విస్మృతము కాలేదన్నమాట.

రెండోబొమ్మను చూడండి. మొదటి బొమ్మకు రెండుకాళ్లుండగా మనుష్యాకారములో ఉన్న ఈ బొమ్మకు ఒకటే కాలు కనబడుతున్నది. అందుచేతనే కాబోలు ఈ చిత్రమును 'సగము మనుష్యుడు' అంటే 'బాలుడు' అనే అర్థము శాస్త్రజ్ఞు లారోపించినారు.

మూడోబొమ్మకు 'నోరు' అని అర్థము నూహించినారు. కావచ్చునుగదా. నాలుగోది ఒక నదిచిత్రము. దానికి 'ప్రవాహము, నీరు' అని అర్థము స్పష్టమే. అయిదోచిత్రమునకు 'చేప' అని అర్థము చెప్పవచ్చును గదా! ఆరోచిత్రము సూర్యునిది. ఏడోది చంద్రునిది. ఎనిమిదో దానిలో సూర్యుడుదయిస్తున్నాడు కాబట్టి దానికి 'ప్రభాతము' అని అర్థము. 'వెలుతురు' అనడానికి బొమ్మగీయుడమునకు సాధ్యముకాక తొమ్మిదోబొమ్మలో వ్రాయసకాడు సూర్యచంద్రులబొమ్మలను చేర్చినాడు. పదోబొమ్మకు 'కొండ' అని అర్థమట. పదకొండోబొమ్మకు 'చెట్టు' అని అర్థము. భూమి దానిలోనికి లేదు, పైకి మొక్క, దానికి రెండుప్రక్కలా కొమ్మలు కనబడుచున్నవి. కాబట్టి అది చెట్టే. పన్నెండోబొమ్మలో రెండు చెట్లు కనబడుతున్నవి గనుక దానికి 'అడవి' అని అర్థము.

పైని వివరించినవి ఏవో ఆకారముగల వస్తువుల చిత్రములను తెలియజేసే బొమ్మలు. కాని, ఆకారములేని వాటిని తెలియజేయడమెట్లా? దానికిన్ని ఆనాటి మనుష్యుడొక ఉపాయ మాలోచించినాడు. పదమూడో బొమ్మను చూడండి ఆబొమ్మకు అర్థము 'పాట' అట. ఆ ఊహను తెలియజేయుడానికిఒకచెవి చిత్రమును గొంతుక ఎత్తుకొని ఉన్న ఒకపక్షి చిత్రమును చేర్చినాడు వ్రాయసకాడు, అని శాస్త్రజ్ఞుడనుకొన్నాడు.

ఈ అర్థము లాచిహ్నములకు శాస్త్రజ్ఞుడు కల్పించి ఊరుకోలేదు, అటువంటి చిత్రముకనబడినప్పుడు తానిచ్చిన అర్థము సరిపోతుందా లేదా అనికూడ అన్వయించుకొన్నాడు. అన్వయించినదని సమాధానపడినాడు-ఇతరులను సమాధానపరిచినాడు-ఇది పురాతనపు బొమ్మవ్రాత అన్నాడు - బొమ్మవ్రాతే బ్రహ్మవ్రాత అంటున్నాను నేను. తెలియనంతసేపు బ్రహ్మవ్రాత. తెలిసిన తరువాత కూను వ్రాత అయిపోయినదది. ఆ వ్రాతకు తాళపుచెవిదొరికినది. చెవి పెట్టి త్రిప్పితే లోపలి ఊహాభాండారము బయలు పడుతుంది.

రెండవ చిత్రము



రెండవ చిత్రములో అతిపురాతన కాలపు ఒక కథ ఇమిడి ఉన్నది, ఆకథను శాస్త్రజ్ఞులు చెప్పినట్లు చెప్తాను. పై వరుసలో ఒక పక్షి కనబడుతున్నది. కొన్ని పడవలుకూడా కనబడుతున్నవి కాబట్టి అది సముద్రమో, పెద్దనదియో అయి ఉండవలెను. ఆపక్షి జలపక్షి అయి ఉండవలెను. అది పడవలకుదారిచూపుతున్నది.

మనుష్యులు మరణించినప్పుడు పక్షి రూపముగా ఎగిరిపోతా రనిన్నీ, పక్షి రూపముగా ఉన్న ఆ ఆత్మ లప్పుడప్పుడు వచ్చి బ్రతికి ఉన్న బంధువులను చూచి పోతూ ఉంటా రనిన్నీ, ఒకప్పుడు వారికి రాబోయే విషయములను సూచిస్తూ ఉంటా రనిన్నీ అనాదినుంచిన్నీ అన్ని దేశాలలోను, అన్నిజాతులలోను ఒక నమ్మక మున్నది. జపానీయులలో ఇట్టి నమ్మకము మిక్కిలి ప్రబలముగా ఉన్నది. దానికి నిదర్శనముగా తొమ్మిదవ శతాబ్దములో ఉండిన ఒక నిప్పోను (జపాను) కవి వ్రాసిన గీతమునకు నా ఆంధ్రానువాదము నిక్కడ ఉదహరిస్తున్నాను.

"ముసషి షిమోస" మండలముల
నడినున్న "సుమిడ" నదిఁ జేరఁగనే
నగరమును జేరంగఁ దలఁపయ్యెగాధముగ;
నదితీరమున నొక్కక్షణమాగి, తమయిండ్లఁ
దలఁపసాగిరి వారు;-"ఇలువిడిచియక్కటా!
మొదతెగక యెంతదూరము వచ్చి
నా"మని విచారించుచునునూర్పుపుచ్చఁగా
పడవగడపెడువాఁడు:—
'ప్రొద్దయ్యె, రండోయి, పడవెక్కుఁ'డనివర్తె
మాటవిని యులికిపడి పడవెక్కినారు.

అందులో నొక్కడును నగరిలో
నెవరినో తాను ప్రేమించినట్టివారిని
విడువనట్టివాఁడే లేఁడు.
దిగులు మిగిలెను వారి కండలకు.
అపుడొక్క యెఱుపైన పాదములు
నెఱుపెనముక్కుఁగలయొక పక్షి యెదురయ్యె
నదిప్రక్క నెగురాడుచును;-ఆట్టిపక్షినెమ
నగరానఁగనికాని వినికాని యెఱుఁగ; రా
పడవవానిని అడిగిరి: "ఓయి! యిది
యేపక్షి?" అని. వాఁడు, "నెఱుఁగరే?
యిది నగరపక్షి"యనె;- అంత నేసల్లంటి:

"ఓ నగర విహాగమా!
ఒకటి యడిగెద, నీదు
పేరు సార్థకమైన
వచ్చి తెలుపంగదవె,
నా సకియ నగరమున
బ్రదికియున్నదొ, లేక
మరణించినదియో.

(తొలిసంజ తెలిచాయలు-అముద్రితము)

"గూట పక్షేదిరా:- చిన్నన్నా! - గూడుచినపోయెరా!"అనే తాత్త్వికాంధ్ర గీతములోకూడా ఆత్మను పక్షిగా ఊహించడము మనకు పరిచితమే.

పై బొమ్మలో ఆ జలపక్షి పడవలకు దారిచూపుతున్నది. యోధులు సముద్రమును దాటినారు. క్రిందివరుసలో నాయకుడు గుఱ్ఱముమీద కూర్చొని నేలమీద సైన్యమును నడుపుతున్నాడు. తరువాతి బొమ్మలో ఒక తాబేలుమీద ఒక సర్పమున్నది. జైత్రయాత్ర వెడలిన యోధునిది కూర్మధ్వజము. కూర్మధ్వజమువాడైన ఆయోధుడు సర్పధ్వజమువారికి లోనయినాడు. యుద్ధములో మరణించినాడు. తుదిబొమ్మ అతని సమాధిని చిత్రిస్తున్నది.

ఈ బొమ్మల వ్రాతనుంచి ప్రపంచములోని కొన్ని ప్రాచీనలిపులు పుట్టినవని లిపిశాస్త్రజ్ఞు లంటున్నారు. ముఖ్యముగా చీనావారి లిపి ఇటువంటిది. ఈలిపిని కొంతవరకు జపానువారు అవలంబించినారు.

ఇతర దేశపు లిపులతోబాటు మన దేశములోకూడా ఇటువంటి బొమ్మల లిపులు కూడా ఉండేవని ఇంతకుముందు తెలిపినాను. కాని, మన యిప్పటి లిపులకు మాతృక అయిన ఒక లిపిని గురించి తెలుసుకొంటే ఈ బ్రహ్మవ్రాత తత్త్వము కొంత బోధపడుతుంది.

నేను చిన్నప్పుడు సింహాచలము దేవాలయపు స్తంభాలమీది అక్షరాలేమిటో తెలుసుకొందామని చదువబోతూఉంటే, "వీని మొగం! దేవతలు వ్రాసిన అక్షరాలను వీడు చదువుతాడట!" అని మావాళ్లు నన్ను నిరుత్సాహపరిచినారు. ప్రాచీన శాసనాలను చదువడము నేర్చుకొన్న తరువాత ఏదయినా పల్లెలో రాతిమీద శాసనమున్నదనిపోయి చదువ ప్రయత్నిస్తూ ఉంటే ఆ పల్లెలోని వారు నా దగ్గరకే వచ్చేవారుకారు. ఆ రాతిక్రింద ధనశక్తి ఉన్నదనిన్ని, ఆ అక్షరాలను చదివినవారికి ధనము చిక్కుతుందనిన్ని, చదువడానికి ప్రయత్నిస్తే నెత్తురు కక్కుకొని చచ్చిపోతారనిన్ని వారు చెప్పేవారు. రాళ్ళమీద

ఉన్న ఆ అక్షరాలు దేవతల వ్రాతలని ఇప్పటికిన్ని పామరజనులు తలుస్తారు.

1860 సంవత్సర ప్రాంతాలలో ఒరిస్సాలోని కటకమునకు చేరువగా ఉన్న ధౌళీ గ్రామమువద్ద రాతిబండలమీద కొన్ని శాసనాలు కనబడినవి. ఆ శాసనములలోని అక్షరాలు సాధారణముగా ఇతర ప్రాంతాలలో కనబడే శాసనాక్షరాల వంటివి కావు. అవేమిటో కనుగొందామని ప్రిన్సెప్ (Prinsep) అనే ఆయన చాలా ప్రయత్నము చేశాడు. ఉదయమునుంచి సాయంకాలము వరకూ మండుటెండలో అట్లాగే ఏకాగ్రదృష్టితో బండ కెదురుగా కూర్చొని, "ఓ బండా! ఈ అక్షరాలేమిటో నాకు తెలుపవా?" అని మొరపెట్టుకొన్నాడు. ఇట్లా ఎన్నో నెలలు గడచిపోయినవి. అతడు తన పరిశ్రమను విడువలేదు. ఆ ప్రాంతవాసులు కనుక్కోలేకపోయినారు. నిరాశ చేసుకొన్నారు.

అదే కాలములో సింహళద్వీపములో టూర్నరు (Tourner) అనే మరొక విద్వాంసునకు బౌద్ధమత గ్రంథములు, త్రిపిటకములు దొరికినవి. అవి పాళీభాషలో ఉన్నవి. అతడా భాష నభ్యసించినాడు. ఆ భాషలో పాండిత్యము సంపాదించినాడు. ఆ గ్రంథముల నాంగ్లీకరించి ప్రకటింప నారంభించినాడు. వాటిలో 'అశోకస' అనే పదమున్నది. 'అశోకస్య' 'అశోకుని' అని దాని అర్థము. ఇక్కడ ధౌళీ బండమీద తల పగలగొట్టుకొంటూ ఉన్న ప్రిన్సెపుకు ఆ ఆంగ్లానువాదము కంటబడినది. 'అశోకస' అనే పదము ఆ బండమీది వ్రాతలో అతడు గుర్తింపగలిగినాడు. ఆ నాలుగక్షరముల ఆధారముతో అతడా శాసన మంతటినీ చదివినాడు. మొదట చదివినదానిలో కొన్ని తప్పులు లేకపోలేదు. కాని, అతడు చూపినదారిబట్టి ఇతర విద్వాంసులున్ను ప్రబలమైన కృషి చేయనారంభించినారు. ఇంకేమూ, ఇతర ప్రాంతాలలో కూడా అటువంటి అక్షరములే ఉన్న ఇతర శాసనాలు బయలుపడినవి. వాటి నన్నిటినీ చదివినారు. అవి అశోకుని శాసనములు అని స్థిరపరిచినారు. ఆ శాసనముల భాష స్థానిక భేదములతో ఉన్న పాలి భాష అని నిర్ధారణ చేసినారు. ఆ కాలపు దేశీయ పండితులా శాసనముల లిపి తమకు దుర్గ్రాహ్యము కావడముచేత దానిని "బ్రహ్మ వ్రాత" అంటూ ఉండడముచేత ఆనాటి పాశ్చాత్య విద్వాంసులా లిపిని తామున్ను 'బ్రాహ్మీలిపి' అనే పేరుతోనే వ్యవహరించినారు. ఆ లిపికి ఆ పేరు నేటికిన్ని నిలిచిపోయినది.

ఈ బ్రాహ్మలిపియే భారతీయ లిపులన్నిటిలోను అతి ప్రాచీనమైనదనిన్ని, దానినుంచే పరిణామము పొంది ఆధునిక భారతీయ లిపు లన్నీ యేర్పడినవనిన్ని పురాలిపి తత్త్వవేత్తలు నిర్ణయించినారు. ఇప్పుడు బ్రాహ్మీలిపిలోని శాసనాల ననేకులు చదువగలుగుతున్నారు.

బ్రాహ్మీలిపికంటె ప్రాచీనమైన లిపి భారతదేశములో లేదని పాశ్చాత్యుల అభిప్రాయము. కాని, వేదకాలమున్ను

చిన్న ఈ దేశములో లిపి అనేది ఉండే దని ఊహించడానికనేకాధారములున్నవి.

వేదములను గురు శిష్య పరంపరగా వ్రాతమూలముగా గాక సంత చెప్పి, చెప్పించుకొని అధ్యయనాధ్యాపనమూలముగా మనవారు నిలుపుకొనివచ్చినారని చెప్పుకొంటారు. అందుచేత అవి ఎన్నడున్ను వ్రాతమూలముగా లేవనే అభిప్రాయము కుదురుకొన్నది. కాని, అవి గ్రంథరూపముగా కూడా ఉండేవనడానికి కొన్ని నిదర్శనములను చూపవచ్చును.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అనే మంత్రభాగమును చూడండి. ఇక్కడ 'అక్షరం' అనేది వ్రాతలోని వర్ణమునకు అన్వయిస్తుంది. అది 'క్షరము కాని' అనే అర్థముగల విశేషణమే అయితే "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని ఉండును. అట్లు లేకపోవడము చేత అక్షరమును వర్ణపదముగా అన్వయించవలెననడానికి సందేహము లేదు.

మరొక్క ఉదాహరణము— వేదమంత్రము:

"హిరణ్యవర్ణాః, శుచయః, పావకా, యాసుజాతః కశ్యపో, యా స్విన్ద్రః, అగ్నిం యా గర్భం దధిరే, విరూపా, స్తాన ఆపః శగ్ం స్యోనా భవన్తు; యాసాగ్ం రాజా వరుణో యాతి మధ్యే సత్యానృతే అవపశ్యన్ జనానాం; మధుశ్చుతః శుచయో యాః పావకాస్తా ఆపః శగ్ం స్యోనా భవన్తు: యాసాం దేవా దివి కృణ్వన్తి భక్షం, యా అన్తరిక్షే బహుధా భవన్తి, యా పృథివీం పయసోన్దన్తి శుక్రాస్తా న ఆపః శగ్ం స్యోనా భవన్తు; శివేన మా చక్షుషా పశ్యతాప శ్శివయా తనువోప స్పృశత త్వచం మే;| సర్వాగ్ం అగ్నీగ్ం రప్సుషదో హువే; వో మయి వర్చో బలమోజో నిధత్త."

యాస్క, మాధవవిద్యారణ్య, శంకర, రామానుజానంద తీర్థాది మహా వేదవ్యాఖ్యాతలకందరికిన్ని జోహారులు చేసి, వారి వ్యాఖ్యాతృత్వమును నాలోని కావాహన చేసుకొని పై మంత్రమునకు నా మందబుద్ధికి భాసించినట్లు వ్యాఖ్యానిస్తున్నాను. సావధానముగ అనుగ్రహపూర్వకముగ చిత్తగింతురుగాక! ఈ మంత్రమునకు —

1. "యాసు కశ్యపో జాతః, యాసు ఇంద్రో జాతః, యాః అగ్నిం గర్భం దధిరే, హిరణ్యవర్ణాః, శుచయః, పావకాః, విరూపాః, తాః ఆపః నః శం స్యోనాః భవన్తు.

2. "జనానాం సత్యానృతే అవపశ్యన్ రాజా వరుణః యాసాం మధ్యే యాతి; మధుశ్చుతః, శుచయః, పావకాః యాః తాః ఆపః నః శం స్యోనాః భవన్తు; యాసాం ( = యాః ద్వితీయార్థానే షష్ఠీ విభక్తిః ) దేవాః దివి భక్షం కృణ్వన్తి యాః అన్తరిక్షే బహుధా భవన్తి, శుక్రాః యాః పృథివీం పయసా ఉన్దన్తి, తాః ఆపః నః శం స్యోనాః భవన్తు;

3. "(హే) ఆపః, మా(ం) శివేన చక్షుషా పశ్యత! (హే ఆపః) శివయా తనువా మే త్వచం ఉపస్పృశత! అప్సుషదః సర్వాన్ అగ్నీన్, వః(చ) హువే;

(యూయం) మయి వర్చస్, బలం,ఓజస్, నిధత్త!"

దీనికి అర్థము : "వేటియందు కశ్యపుడు పుట్టినాడో, వేటియందు ఇంద్రుడు పుట్టినాడో, ఏవి అగ్నిని గర్భమునందు ధరించినవో, బంగారురంగుగలవి, శుచులు, పవిత్రము చేయునట్టివి, విశేషరూపము కలవియునో ఆ జలములు మాకు సుఖమును కురియునట్టివి అగుగాక!

జనుల సత్యానృతములను గమనిస్తూ రాజైన వరుణుడు వేటిమధ్య సంచరిస్తున్నాడో, ఏవి మధువును కార్చుతూ, శుచులై, పవిత్రము చేయునట్టివై ఉన్నవో ఆ జలములు మాకు సుఖమును కురియునట్టివి అగుగాక!

వేటిని స్వర్గమందు దేవతలు ఆహారముగా చేసుకొంటున్నారో, అంతరిక్షమునందు ఏవి అనేక శాఖలుగా (విధములుగా) పరిణమిస్తున్నవో, ఏవి కాంతిమంతములై భూమిని అమృతముతో తడుపుతున్నవో, ఆ జలములు మాకు సుఖమును కురియునట్టి వగుగాక!

ఓ జలములారా! (మీరు) నన్ను మంగళకరమైన కంటితో చూతురుగాక! మంగళకరమైన దేహముతో నాత్వక్కును (వ్రాత కుపయోగిస్తూ ఉన్న భూర్జపు పట్టను, తోలును) తాకుదురుగాక! జలములలోనుండే సమస్తమైన అగ్నులను మిమ్మును పిలుస్తున్నాను; నాలో వర్చస్సును, బలమును, ఓజస్సును ఉంచండి!"

పై మంత్రములో 'ఆపః' అనే పదమున్నది గనుక దానిని సంధ్యావందనములో మార్జనమంత్రముగా ఉపయోగించి తలమీద నీళ్ళు చల్లుకొంటున్నారు. కాని, సూక్ష్మముగా విమర్శిస్తే కవి యిక్కడ బంగారు నీటిని సంబోధిస్తున్నాడని సులభముగా తెలుసుకోవచ్చును. ఆ కాలములో భూర్జపత్రముల మీదనో, తోళ్ళమీదనో బంగారు జలపోతతో (in setters of gold) వేదములను వ్రాసిపెట్టుకొంటూ ఉండేవారు. హిరణ్యవర్ణాఃఆపః అన్నప్పుడు బంగారునీళ్లు అని అర్థము చెప్పుకోవలెనే కాని, సాధారణమైన నీళ్ళు అని చెప్పకూడదు. సాధారణమైన నీళ్ళు హిరణ్యవర్ణములు కావు కదా. వాటికి వర్ణమే లేదుగదా! రంగుగల జలములతో వ్రాయడము చేతనే అక్షరములకు వర్ణములు అనే పర్యాయనామము కలిగినది.

అట్టి బంగారుజలములతో భూర్జపత్రములమీదనో తోళ్ళమీదనో వర్ణరూపముగా ఏర్పడిన వేదగ్రంథములనుంచి కశ్యపుడు, ఇంద్రుడు, వరుణుడు, అగ్ని. మొదలయిన ఋషులును, దేవతలును మనకు తెలియవస్తున్నారు. ఆ వేదములు తొల్లింటి కాలమున ఏకముగా అవిభాజ్యముగా ఉండేవి. రాను రాను మధ్యదేశమున (అంతరిక్షమున) అనేక శాఖలుగా విడబడ వ్యవహారమున వివిధములైనవి. ఆర్యావర్తమును (పృథివిని) తమ అమృత వాక్కులతో తడుపుతూ దానిని పునీతములు చేస్తున్నవి. ఈరీతిగా అర్థము చెప్పుకోకపోతే పదాల కేవో నైఘంటుక విపరీతార్థాలు కల్పించుకొని వింతవ్యాఖ్యానములు చేయవలసి ఉంటుంది.

వేదములకు సంహితలనే పేరుండడము కూడా చాలాకాలమునుంచిన్ని మన దేశములో వ్రాతా, పుస్తకాలూ, ఉండేవనడాని కాధారముగా ఉన్నది,

ఇదిగాక పురాణములనుబట్టి చూచినా ఈ విషయమే స్పష్టమౌతుంది. దశావతారాలలో మొదటిదయిన మత్స్యావతారమునకు కారణము సోమకుడనే రాక్షసుడు వేదగ్రంథములను దొంగిలించుకొని పోవడమని అన్ని పురాణాలున్ను చెప్పుచున్నవి. గ్రంథములను కాకుండా ఆరాక్షసుడు మాటలను దొంగిలించుకొని పోయి ఉండడుగదా.

వేదములను బంగారురేకులపై వ్రాసి ఉంచినారనే ఒక ఐతిహ్యమును తాను విన్నదానిని ఫ్రెంచి ప్రయాణికుడు, మత ప్రచారకుడుఅయిన అబ్బేదూబోయి అనే ఆయన తన ‘హిందూ ఆచారములు’ అనే పుస్తకములో వ్రాసినాడు.

సరే, పురాతనకాలమునుంచిన్ని ఈ దేశములో వ్రాత ఉండేదని ఒప్పుకొందాము. కాని, ఆ వ్రాత స్వరూపమెట్టిది! అక్షరము లెట్లా ఉండేవి? అనే ప్రశ్నలకు సమాధానము చెప్పలేము. మనకాకాలపు వ్రాత లేవిన్ని ఉపలభ్యములు కాలేదు. ఆనాటి లిపి మొహంజోదరో, హరప్పాలలో ఇప్పుడు దొరకుతూఉన్న లిపి గాని, అశోకుని శాసనముల లిపి గాని అయి ఉండదని మాత్రము లిపి పరిణామశాస్త్రము ప్రకారము నిశ్చయముగా చెప్పవచ్చును. ఒకవేళ ఈ రెండు లిపులున్ను వేదకాలపు లిపినుంచి పరిణామము పొందినవేమో! ఇదమిత్థమని చెప్పడాని కాధారములు లేవు,

వేదకాలపు అక్షరముల ఆకారమును మనము నిర్ధరింపలేకపోయినా “ఓమిత్యేకాక్షరం బ్రహ్మ” అనే మంత్రమునుబట్టి ఆకాలమునకే శబ్దశాస్త్రము బాగుగా స్థిరపడినదని చెప్పడానికభ్యంతరముండదు. ‘ఓమ్’ అనే ధ్వని అ, ఉ, మ్ అనే ధ్వనుల సముదాయమున కేకరూపము. అకారము కంఠ్యము, ఉకారము ఓష్ఠ్యము, మ్‌అనునది అనునాసికము. ధ్వనులన్నీ రెండు విధములు (1) కంఠము నుండి పెదవులవరకు గల స్థానములలో పుట్టినవి (2) నాసికము ద్వారా పుట్టినవి. ఇట్లు పుట్టినవన్నీ చేరి అక్షర సమామ్నాయ మేర్పడుతున్నది. వీటిని దాటి అర్థవంతములుకాగల ధ్వనులు మరేవీ లేవు. అందుచేత ఓమ్ అనగానే అక్షర సమామ్నాయ మంతటికిన్ని ఏక చిహ్నముగా ఏర్పడుతున్నది. దానిలో ఇమిడిఉన్న సమస్త ధ్వనుల పరస్పర సమ్మేళనము మూలముగానే భాష అంతా ఏర్పడుతున్నది ఆ భాష మూలముగానే అండ, పిండ, బ్రహ్మాండ విస్తారమైన బ్రహ్మపదార్థము విశదమౌతున్నది–కాబట్టి ఓమ్ అనే ఒక్క అక్షరమే బ్రహ్మముగా పై మంత్రములో నిరూపింపబడినది. మరొక్క విశేషము – వేదకాలమునాటి అక్షరసమామ్నాయము నేటివలెనే అకారముతో ఆరంభమై ఉండినట్లు గమనింపవచ్చును. “అక్షరాణా మకారోఽస్మి” అనే గీతావాక్యమీ అభిప్రాయమునే విశదము చేస్తున్నది. భారతీయ లిపిలోనే

కాక పాశ్చాత్య లిపులలోను, హీబ్రూ లిపిలోనుకూడా అకారమే ఆద్యక్షరముకదా. ఇంగ్లీషు లిపి A (అ) తోను, అరబ్బీ లిపి 'అలీఫ్' తోను ఆరంభమాతున్నదిగదా!

అపునయ్యా! అయితే ఏమిటీ సోది అంతా ? నీవు వ్రాయ నుపక్రమించిన విషయమేమిటి? ఇంతవరకూ నీవు వ్రాసిన దేమిటి ? అని నా ప్రక్కనుంచి ఒక పక్షి పలుకుతోన్నది. ఏమిటీ ఊకదంపుఅంతా అని ఈసడిస్తున్నది. అవును, ఇది సోదెయే. సాధారణమైన సోది కాదు. పెద్ద సోది. దానిని చెప్పుకోనుకొంటేనే కాని నాకు తృప్తి లేదు. అది నా స్వభావము. బూకర్పూరంలో ... ... తోసుంటే మానసు ... ... ఈ సోది ఆరోగ్యముగా లేదా ... ఇది ఊకదంపు. ఏమి చేయను ? సమస్తమున్నూ ... ఊకగా చేసివేసినాము దానిని ... కిందికి-మనకు మిగిలినది ఊక. ఆఊకను దంపగా దంపగా గట్టిగింజ ఒక్కటైనా చిక్కకపోతుందా అని ఆశ, జిజ్ఞాస. ఉంటేనే జ్ఞానలబ్ధి. అది లేనివారి కేమిన్నీ లేదు-సర్వశూన్యాం నిరాలంబాం.

'తలవ్రాత, నుదుటివ్రాత' అని ఈవ్యాసమునకు శీర్షిక. అది బ్రహ్మవ్రాత అని లోకములోని వాడుక – అంటే తెలియని దన్నమాట. తెలియనిదంతా బ్రహ్మకు ముడిపెట్టడము మనకు వాడుక. తెలుసుకొందామనే ఆలోచన తక్కువ. ప్రయత్నించి తెలుసుకొన్నతరువాత 'అయ్యో! ఇంతేనా? అనిపిస్తుంది.

బయటి గీతలను గురించి ఇంతవరకూ ముచ్చటించినాము. మన శరీరమునకు సంబంధించిన గీతలుకూడా కొన్ని ఉన్నవి. అరచేతులలోను, అరకాళ్ళలోను ఉన్న గీతలను ఒకవిధమైన అర్థమున్నట్లు మన సాముద్రిక శాస్త్రజ్ఞులు చెప్పుతారు. అల్లే అరచేతులలోను, వ్రేళ్ళ కొనలలోను, ఇతర స్థలములలోను గల చక్రములకున్నూ సుడులకున్నూ కూడా వారు ఫలితములను చెప్పుతారు. కాని, ఈ గీతలకు వ్రాత అనే పేరు లేదు. ఆ పేరుగలది తలపుర్రె ఎముకమీద ఉండే పుట్లనంటి, వ్రాతఅనె కనబడేది ఒకటి ఉన్నది. అది ఆ మాన్యత్తుల జీవిత విధానము తెలియుజేయుట కని బ్రహ్మదేవుని ఆ శరీరమును నిర్మాణము చేసినప్పుడే వ్రాసిపెట్టిఉంచిన దని ఈ దేశములో ఎనరు కాకపోయినా హిందువులందరున్నూ నమ్ముతున్నారు. ఇది వ్రాతయేనా ? వ్రాత అయితే దానిని చదివి అర్థము చేసుకొనే శక్తిని సంపాదించడము చాలా ప్రయోజనకారి అవుతుంది గదా! అప్పుడు మానవులమీద గ్రహములకు గల ప్రాబల్యములను నిరూపించే జ్యోతిశ్శాస్త్రముతో ప్రయోజనము తప్పిపోతుంది. జననకాలములను గుర్తించి పెట్టుకొనే అవస్థ తప్పిపోతుంది. ఆ జనన కాలమును సరిగా గుర్తించకపోయినా ప్రమాదము లేకపోతుంది. అప్పుడు పంచాంగము లక్కరలేదు. గణితముక్కర లేదు. తప్పుడు జాతకము లక్కరలేదు. సగము తెలిసిన జ్యోతిష్కులతో అవసరముండదు. అప్పుడే ఈ దేశములో ఆ మూ

జీవుల కేమి సంభవింపబోతున్నదో తెలిసి పోతుంది - తెలిసి అనుభవిస్తారు గనుక అధిక సుఖము గాని, అధిక బాధ గాని ఉండదు. దుఃఖమనేదే లోకములో ఉండ దాని కావశ్యకత ఉండదు.

ఇన్ని ప్రయోజనములతో కూడుకొని ఉన్న ఈవిద్యను నేర్చిఉంటే తిరిగి బ్రహ్మ దేవుడో, అతనిని పుట్టించిన మరొక పెద్ద బ్రహ్మదేవుడో కావడానికి సందేహముం టుందా? అయితేనేమి? మనవాళ్ళు ఎవరి ముక్కు వాళ్ళు పట్టుకొని కూర్చుంటే, 'అహం బ్రహ్మాస్మి' 'సోఽహం బ్రహ్మ' ఇట్లా అనుకొని సంతోషిస్తూ చతికిలబడి కూర్చున్నారే కాని, తామే బ్రహ్మమైతే, తలమీద (నుదుటిమీద) వ్రాతే బ్రహ్మ వ్రాత అయితే, తాము వ్రాసిన వ్రాతను తాము చదువగలిగే ఉందురుగదా. అయితే వారు దానిని చదువడానికి సాహ సించలేదో, సాహసించి కార్యము లేదని విడిచిపెట్టినారో చెప్పలేము. ఇంతింత బుద్ధిమంతులు, ఉన్నచోటునుంచి కదలకుం డానే కనబడే విశ్వమును, కనబడని విశ్వ మునుకూడా చుట్టివచ్చి, వాటి నన్నిటినీ అద్భుత సంఘటనలతో నింపివేసిన మన మేధాశాలులు ఈ విషయమును గురించి ఆలోచించే ఉంటారు. కాని, దాని మర్మ ము వారి కందకపోయిఉంటుంది.

అయితే, అది వ్రాతే అని అందరున్నూ అంటారే! వ్రాత అయితే దానిని తెలుసు కొనడానికి మళ్ళీ ప్రయత్నము నెందు కారంభించకూడదు? ఆరంభించినప్పుడు మాత్రము శాస్త్ర పద్ధతులమీద ఆరం భించవలెను. ఏమిటా శాస్త్రపద్ధతి?

ఏ శాస్త్ర నిర్మాణమునకైనా మొదట నిర్ణయించుకోవలసినది శోధ్యవిషయము. తరువాతిది శోధ్య వస్తు సంగ్రహణము. తరువాతిది ఆ వస్తువుల అన్వయ వ్యతిరేక భావ నిరూపణము. పిమ్మట భావములను బట్టి ఆ వస్తువుల వర్గీకరణము. తరువాత ఆ యా వర్గములలోని వస్తువుల వివిధభాగ నిరూపణము. తరువాత ఆయా భాగముల ప్రయోజన నిర్ధారణము. తరువాత ఈ సూక్ష్మపరిశీలనను నేర్పడిన తాత్కాలిక సిద్ధాంత (hypothesis) ప్రతిపాదనము. తరువాత ఆ తాత్కా లిక సిద్ధాంతమునకనుగుణముగు క్రొత్త విషయముల సంగ్రహము. పిదప తాత్కా లిక సిద్ధాంతమునకు పూర్వపక్ష ప్రతిపా దము. పిమ్మట పూర్వపక్ష స్థాపన కను కూలమైన విషయ సంగ్రహణము. అటు పిదప పూర్వపక్షమునకు వ్యతిరేక విషయ సంగ్రహణము. తరువాత పూర్వపక్ష నిరాకరణము. తుదకు క్రొత్త విషయ ములనుబట్టి సిద్ధాంతస్థాపనము.

శాస్త్ర నిర్మాణమున కింత తంతు ఉన్నదే! అందులో 'బ్రహ్మలిపి' శాస్త్రము ఎవ్వరూ ఎన్నడూ యత్నించడానికికూడా ఉపక్రమించని విషయము. ఉపక్రమించిన కార్యములేదని ఏనాడో విడిచిపెట్టిన విషయము! ఇది సాధ్యమేనా?

ఎందుకుకాదు? — అయితే ఎవరో ఆరంభించాలి. ఆరంభించడానికి ఎన్ను

కొంటూనే ఎన్నో ఆటంకములు, అపోహలు, కష్టములు ఎదుర్కొంటవి. ఎందుకంటారా! ఇది పుర్రెలతో సంబంధించినది. అందులో మనుష్యుల పుర్రెలతో-పుర్రెల కోసము వెదకుతున్నాడు, సమాధులను త్రవ్వుతున్నాడు అని తెలియగనేవీడెవడో మనుష్యులను తినేవాడు కాపాలికుడు, చిల్లంగివాడు, అని పట్టుకొని తీరుతారు తాపులు తగిలినా విడువకపోతేనడ తేర్చి వేస్తారు. ఇది మొట్టమొదటిలోనే పెద్ద అపాయము.

ఈ శాస్త్రపరిశోధనానికి ఉన్నవాళ్ల మీద పరీక్ష చేయ వీలులేదు. ఎందుచేత నంటారా ఆ వ్రాతమీద ఒక విధమైన ద్రవపదార్థము, ఆపదార్థములో అల్లుకొని రక్త కేశనాళికలు, నాడీతంత్రికలు, ఇతర జీవత్కణములు అల్లుకొని ఉంటవి. మీద ఉపచర్మము, దానిమీద గురుచర్మము ఉంటవి. ఆచర్మముమీద కేశములు. వీటినన్నిటినీ నున్నగా తీసివేస్తేగాని ఆ కపాలోపరిభాగములోని పుర్రె ఎముక పలకల రంపపుపండ్ల సంధుల కలయిక వలన కలిగే కుట్లవంటి గీతలు బయట పడవు. వీటిని బయట పెట్టడానికి బ్రదికి ఉన్నవాడెవ్వడూ ఒప్పుకోడు. ఇది రెండో పెద్దచిక్కు.

ఒకవేళ తత్త్వనిరూపణము కోసము ఎవరైనా ఆ రీతిగా చేయించుకొనడాని కొప్పుకొంటారే అనుకొనండి. మత్తుమందిస్తే ఇది అంత ప్రమాదకరమైన పని కాదు. శాస్త్ర సత్యస్థాపనముకోస మెందరుదారపురుషులు తమ ప్రాణములనే- అర్పించి ఉండలేదు!

అయితే ఇక్కడనే పెద్ద చిక్కులలో పెద్ద చిక్కు. ఇంతాచేసి ఆ కుట్లవల్ల ఏర్పడిన గీతలు అర్థములేని గీతలే అయితే? వాటికి ఘుణాక్షరన్యాయము వర్తిస్తే! ప్రయత్నమంతా నిష్ఫలము. పిచ్చివాళ్ళలో కారుపిచ్చివాడవుతాడు సాధకుడు.

అయితే నిరాశ చేసుకోవలసినదేనా! ఎంతమాట! మానవునికి నిరాశ ఏమిటి? నిరాశపరుడే అయితే ఇంతటి జ్ఞానము నెట్లు సాధించగలిగినాడు! సాధకులందరూ మొదటిలో పిచ్చివారే. సాధించిన తరువాత లోకము 'వహ్వా!' అంటుంది. మహర్షులలో, మహాత్ములలో, సిద్ధులలో చేరుస్తుంది. అంతవరకూ నవ్వుతూ, వెక్కిరిస్తూ, వేళాకోళముచేస్తూ, ఆటంకములు కలిగిస్తూ, తుదివరకూ నిరుత్సాహపరుస్తూనే ఉంటుంది.

ఇంతింతమాటలు వ్రాసి ఈవ్యాసము నింతగా పెంచినావే నీ వేమైనా ఈ విషయమై ఏమయినా కృషిచేసినావా! చేయదలచినావా! చేస్తావా! అని ఎవరయినా అడుగవస్తారేమో! నేను చేయనూలేదు, చేయదలచనూలేదు. చేయడాని కోపికా లేదు. తుదిమాట నేను చేయనూచేయను. అందరితోబాటు నేనున్ను పరోపదేశ పాండిత్యమును అంతోయింతో సంపాదిం

చుకొన్నాను. దాని నీవ్యాసములో చాలు గబెట్టినాను. ఇది శాస్త్రవ్యాసముకాదు. మూతి బిగింపు, కళ్ళచిట్లింపు, గంభీర దృగంచిత వ్యాసము కాదు. సారస్వత వ్యాసము—నాతలవ్రాత, నా నుదుటివ్రాత నాకు తెలుస్తూనే ఉన్నది. ఒకరి వ్రాత జోలికి నాకెందుకు? ఈ ఉద్బోధము ననుసరించి ఎవరైనా కృషిచేస్తే అనేకవిధాల లాభిస్తుందని మాత్రము నిశ్చయముగా చెప్పగలను. ఇది సాధ్యమైన విషయమే అనడములో నాకెట్టి సందేహమున్నూ లేదు, సెలవు!



# హనుమంతరాయ ప్రశస్తి

“హనుమంతరావుగారికి సమాజాలే సంతానము. మహాసభ ఒక పుత్రుడు; మహిళాసభ ఒక పుత్రిక; సోదరీ సమాజము ఒక తోబుట్టువు; భాషానిలయము ఒక గారాబు బిడ్డ; అందరికన్న అనుంగుబిడ్డ ఆంధ్ర బాలికా పాఠశాల.”



“ఒక్కమాటలో చెప్పాలంటే వీరేశలింగంగారి తరువాత మన రాష్ట్రములో స్త్రీజనోద్ధరణానికి పాటుపడ్డ ప్రధానవ్యక్తి ఆంధ్ర పితామహుడే.”



“హనుమంతరావుగారు ఒక మహావ్యక్తి కాదు, ఒక మహాసంస్థ. సజీవమైన విజ్ఞానసర్వస్వము. తెలంగాణము పండించిన ముత్యాల పంట.”



“హనుమంతరావుగారి చరిత్రమే ఆంధ్రోద్యమ చరిత్ర. దాని జీవితమే పంతులుగారి జీవితము.”

యల్లాప్రగడ - సీతాకుమారి.

# ఓరుగల్లు మండలమున సారస్వతసేవ

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, బి. ఏ.

తెనుగు సారస్వతము ముత్యాలపంట పండిన తేనె మాగాణము తెలంగాణము. తెలంగాణమునకు ఆయువుపట్టు ఓరుగల్లు మండలమని చెప్పవచ్చును. ఓరుగల్లు చరిత్ర పరిశోధకులకే కాదు, సారస్వత పిపాసువులకును, శిల్పవిద్యాప్రవీణులకును తీర్థయాత్రా స్థలము. ఏకశిలా నగరమునందు ఆంధ్ర పౌరుషము, ఆంధ్రసారస్వతము, ఆంధ్ర శిల్పము అను మూడు నదులు కలిసి త్రివేణీ సంగమమైనది. ప్రపంచములోని మహారాణీ మణులందు సర్వవిధముల నగ్రగణ్యురాలై సామ్రాజ్య చక్రము నవలీలగా నరచేత ద్రిప్పిన రుద్రమదేవి యోరుగంటి ఆడుబిడ్డయే. మార్కోపోలోవంటి విదేశ యాత్రికుని దిగ్భ్రాంత మొనరించినది యీమె పరిపాలించిన యాంధ్రనగరముయొక్క వైభవము. ఉత్తమ శిల్పమున కునికిపట్టులగు సౌధములచే నలరారిన ఆ విశాల రాజవీధులు, శత్రురాజులకు దుర్భేద్యమగు ఆ దుర్గము ఆ'నాడు' ఆంధ్రోర్వీశు మోసాలపై వ్రాసిన ఘంటా ఝణత్కారములు, ఆ పూటకూటింటిలోని కప్పురభోగి వంటకము, కమ్మని గోధుమపిండి వంటయును, ఆ చిత్రశాలలు ఏకశిలా నగర నాగరక జీవితమునకు ప్రతిబింబములై నేటికిం క్రీడాభిరామమున అక్షరరూపముతో శోభిల్లుచున్నవి. ఇట్లు ఆంధ్ర దేశమునకు, ఆంధ్ర సంస్కృతికి కేంద్ర స్థానమై విలసిల్లిన ఓరుగల్లునందు జరిగిన సారస్వత కృషి ప్రకాశవంతమగుటలో ఆశ్చర్యము లేదు.

ఆంధ్ర సారస్వతమున ఉత్తమోత్తములగు గ్రంథములు మూడు. వీనిలో రెండింటికి జన్మస్థానము ఓరుగల్లు. మూడవదానిలో ముఖ్యభాగము ప్రకాశమైనది ఆనాటి కాకతీయచక్రవర్తి సభామంటపమునందు. తిక్కనార్యుడు గణపతిదేవుని నిండోలగమున తన మహాభారతమును కావ్యగాన మొనరించినాడు. భాస్కర రామాయణ గ్రంథకర్తలగు భాస్కరుడు మల్లికార్జునభట్టు కుమార రుద్రదేవుడు, అయ్యలార్యుడు 1300 సంవత్సర ప్రాంతమున ఏకశిలానగర పరిసరములందు నివసించి భాషాసేవ గావించినారు. ఇంక ఆంధ్రులపాలిటి పారిజాతమగు పోతనామాత్యునికి కాపురమై యొప్పిన దీ యోరుగల్లే యను విషయము జగత్ప్రసిద్ధము. ఇంచుమించు భాస్కరరామాయణరచనా కాలమునందే అనగా 1300 సంవత్సర ప్రాంతముననే ఓరుగల్లునందు మారన

మహాకవి మార్కండేయ పురాణమును ఆంధ్రభారతి కర్పించినాడు. మార్కండేయ పురాణము ఆంధ్ర సారస్వతమున ఉత్తమశ్రేణికి జెంది సారస్వతోపాసకు లవశ్యముగా పఠింపదగిన గ్రంథము. అల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రమునకు ఆధారమైనది యీ మార్కండేయ పురాణాంతర్గతమగు గాథయే. పెద్దన మారనను మక్కికి మక్కిగా అనుకరించినట్లు మనుచరిత్రమునందు నిదర్శనములు కలవు.

లలితకళలను గురించి పరిశ్రమ సల్పి గ్రంథరచన గావించిన జాయప సేనాని కాకతీయ రాజులకు సేనానాయకుడుగా నుండెను. ఈయన రచించిన గ్రంథము నృత్త రత్నాకరము. కాలము ౧౨౫౦ ప్రాంతము. సుప్రసిద్ధ అలంకార శాస్త్రమగు ప్రతాపరుద్ర యశోభూషణ కృతికర్తయగు విద్యానాథుడు ఆంధ్రనగరమునందు కాకతీయ రాజుల యాస్థానము ౧౩౦౦ ప్రాంత మలంకరించినాడు. అలంకార శాస్త్రమును రచించిన యాంధ్రులలో ప్రథముడు విద్యానాథుడగుటయే కాక తత్కృతి భర్తయును, ఆంధ్రప్రభువగుట పేర్కొనదగిన విశేషము.

సాధారణముగా రాజులు కృతిభర్తలే కాని కృతికర్తలగుట యరుదు. హాలుని తరువాత కృతికర్తయైన ఆంధ్రప్రభువు ౧౨౬౨ ప్రాంతమున కాకతీయ సామ్రాజ్యమున కధిపతియైన రుద్రదేవచక్రవర్తి. ఈయన హనుమకొండలో నీతిసారమను గ్రంథమును రచించినాడు. ఈ కాకతీయ రాజధానియందే గణపతి దేవునకు ప్రధానిగా నుండిన మహామేధావియగు శివదేవయ్య (౧౨౫౦-౧౩౨౦) పురుషార్థ సారమను గ్రంథమును రచించియున్నాడు. ప్రేమాభిరామమను గ్రంథమును వ్రాసిన రావిపాటి త్రిపురాంతకుడు ౧౩౦౦ ప్రాంతమున ఓరుగల్లునందు నివసించియుండెను. ప్రస్తుతము మనకీ ప్రేమాభిరామము లభ్యముకాదు-ఇది కాకతీయుల రాజధానీ నగరవర్ణనాదులకు సంబంధించిన సంస్కృత గ్రంథము. క్రీడాభిరామమను తెనుగు గ్రంథమునకు మాతృక ప్రేమాభిరామము. 1300 సంవత్సర ప్రాంతమున అగస్త్యుడను నొక కవీశ్వరుడు (ఇతడే విద్యానాథ కవియట) నలకీర్తి కౌముది, బాలభారతమను గ్రంథములను, మరియు చక్రపాణి రంగనాథుడు 1280 సంవత్సర ప్రాంతమున నయనగతిరగడ మున్నగు గ్రంథములను రచించియున్నారు.

సాహిత్యము ప్రజలకొరకను సత్యమును గ్రహించి జాను తెనుంగున, ప్రజాసాహిత్యమునకు మిక్కిలి యనుకూలమగు ద్విపదరూపమున బసవపురాణమును రచించిన పాలకుర్తి సోమనాథకవి ఓరుగల్లు మండలమునందే ౧౧౫౦ ప్రాంతమున తన కలమునకు స్వైరవిహారము సమకూర్చినాడు. శైవవాఙ్మయమునకు జన్మస్థానము, ఆటపట్టు ఓరుగల్లని చెప్పవచ్చును. ద్విపదవాఙ్మయమునకును జన్మ

సానము ఓరుగల్లే. ౧౨౬౦ ప్రాంతమున శివతత్వసారము వ్రాసిన మల్లికార్జున పండితారాధ్యులు, ౧౫౦౦ ప్రాంతమున బసవపురాణమను పద్యకావ్యమును ప్రభులింగలీలయు వ్రాసినపిడుపర్తిసోమనాధుడు ౧౪౭౦ ప్రాంతమున సిద్ధేశ్వర చరిత్రను ద్విపద గ్రంథమును వ్రాసిన కాసె సర్వప్పయు, ౧౫౫౦ ప్రాంతమున బసవ పురాణమును వ్రాసిన పిడుపర్తి బసవప్పయు, ౧౮౬౦ ప్రాంతమున వీరశైవ దీక్షాబోధ బ్రహ్మోత్తర ఖండములను వ్రాసిన పిడుపర్తి బసవకవియు, ౧౭౦౦ ప్రాంతమున శివతత్వరసాయనము వ్రాసిన విశ్వేశ్వర శివదేశికులు మున్నగువారందరును ఏకశిలానగర ప్రాంతీయులే. ఈవిధముగా పైన పేర్కొనబడిన శతాబ్దములు ఓరుగల్లు సారస్వత చరిత్రమున, కాదు, ఆంధ్ర సారస్వత చరిత్రమునందే సువర్ణయుగమని చెప్పవచ్చును.

ఓరుగల్లు ప్రాంతమునందు శివకవులతో పాటు వైష్ణవ కవులును బయలుదేరి వైష్ణవ వాఙ్మయ ప్రచారము గావించియున్నారు. ౧౭౮౦ ప్రాంతమున ఓరుగల్లు సమీపముగానున్న వరదన్న పేటలో రామానుజాచార్యులను వైష్ణవుడు ముముక్షుజన కల్పకమును, తత్వార్థ దర్పణమను ద్విపద గ్రంథమును రచించినాడు. సుమారు ౧౭౦ సంవత్సరముల క్రింద అచ్చి లక్ష్మణాచార్యులను కవి మరియొక ముముక్షు జనకల్పకము వ్రాసియున్నాడు. సుమారు ౩౬౦ సంవత్సరముల క్రింద తిరునగరి వేంకటాచార్యులు యతిరాజ వింశతి యనుగ్రంథమును రచించినాడు. ఇప్పటికిని ఓరుగల్లు మండలమునందు కవితాపాటవముగల వైష్ణవులనేకులున్నారు. వీరిగృహములందు వీరి పూర్వులచే రచింపబడిన పెక్కు గ్రంథములు కలవు. ఎవరు వ్రాసిరో తెలియని మేలుకొలుపులు మంగళహారతులు ఓరుగల్లు మండలము సేకరింపవలసినవి నేడు సమృద్ధముగా కలవు.

౧౭౦౦ సంవత్సర ప్రాంతమున ఏకామ్రనాధుడను పండితుడు ద్వాత్రింశత్సాల భంజికలను గ్రంథముతోపాటు ప్రతాప చరిత్రమను వచన గ్రంథమును వ్రాసియున్నాడు. ఈయన ఓరుగల్లు నివాసి. ఈ గ్రంథమే ఆంధ్రభాషలో మొదటి వచన గ్రంథమేమో? అట్లేయగుచో మన వచన సారస్వతమునకు పునాది వేసిన గౌరవము ఓరుగల్లునకే యీయవలసి యుండును. ఈ పదునేడవ శతాబ్దముననే కేసనమల్లనలు దాక్షాయణీ పరిణయము విష్ణు భజనానందము అను రెండు గ్రంథములను రచించియున్నారు.

తరువాత ఓరుగల్లులో చెన్నదగిన సారస్వత కృషిగావించినవారు పరశురామపంతులవారు. వీరిలో పరశురామపంతుల అనంతరామకవి ౧౮౦ సంవత్సర ప్రాంతమున హనుమద్విజయము అను గ్రంథమునకు కర్తృత్వము వహించెను. రమారమి 180 సంవత్సరముల క్రింద పరశురామపంతుల రామమూర్తి సీతారా

మాంజనేయము అను యక్షగానమును విరచించియున్నాడు. సుమారొక నూట యిరువది సంవత్సరముల క్రింద పరశురామ పంతుల లింగమూర్తి యను పండితప్రకాండుడు సీతారామాంజనేయ మను గొప్ప ఆధ్యాత్మిక గ్రంథమును వ్రాసియున్నాడు. కళాదృష్టితో గాక ఆధ్యాత్మికదృష్టితో జూచిన సీతారామాంజనేయము భారతముతో తులదూగుచుండును. మొత్తము మీద సీతారామాంజనేయము మరొక యుద్గ్రంథమని చెప్పవచ్చును. ఈ పరశురామ పంతులవారి వంశీకులు నేటికిని ఓరుగల్లున నివసించుచున్నారు.

గతశతాబ్దాంతమున ఓరుగల్లుపట్టణమునందు తూము రామదాసను నొకపండిత కవి నిర్వచన మిత్రవిందోద్వాహాది గ్రంథములను రచించుటయే గాక ఆంధ్ర పదనిధాన మను నొక నిఘంటువును కూడ రచించియున్నాడు. ఈ నిఘంటువును శ్రీ శేషాద్రిరమణ కవులు సంపాదకులుగా కొంతకాలము ఓరుగల్లునందు భాషాసేవ గావించిన కాకతీయ గ్రంథమాలవారు ప్రకటించియున్నారు. ఈ రామదాస కవి వంశీకులు నేడును వరంగలునందు నివసించియున్నారు. ఇంకను ఓరుగల్లు ప్రాంతమునందు భాషాసేవగావించిన పూర్వకవులలో హరిశ్చంద్ర యను ద్విపద గ్రంథమును వ్రాసిన వెన్నెలకంటి చంద్రశేఖర కవియును, వజ్రాభ్యుదయకర్త యగు నెల్లుట్ల నారాయణ కవియు, వెలిగండల నారయ, హరిభట్టు మున్నగువారు ప్రత్యేకముగా ప్రశంసనీయులు.

ఆధునిక కాలమున జాతీయ పునర్వికాసముతో పాటు సారస్వత పునరుజ్జీవనముకూడ మన దేశమున జరిగినది. వీరేశలింగ ప్రభృతులగు మహనీయులు మనభాషలో క్రొత్త రచనారీతులను ప్రవేశపెట్టినారు. పత్రిక లవతరించి వాఙ్మయమునకు బహుళప్రచార మొసగినవి. ఈవిధముగా నొక క్రొత్తదనము సారస్వత ప్రపంచము నావరించినది. ఈ నవ్యతా ప్రభావము నుండి ఓరుగల్లు మండల మెట్లు తప్పించుకొనును ?

నేటి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున నిజాం రాష్ట్రాంధ్రుల జోహారుల నందుకొనుచున్న శ్రీ మాడపాటి హనుమంతరావుగారు ఓరుగల్లు వాసులు. కొంత కాలము ఓరుగల్లునందు కాపురముండి గ్రంథాలయోద్యమాది రూపకముగా ప్రజాసేవ గావించినారు. కావున ఆంధ్ర పితామహుల సారస్వత కృషి కొంత ఓరుగల్లునందు జరిగియుండుట నిస్సంశయము. హనుమంతరావుగారు తెనుగులో చిన్నకథలను వ్రాసిన ప్రథములలో నొక్కరని చెప్పవచ్చును. మున్షీ ప్రేమచంద్రుని కథలను మనోహరమగు సులభశైలిలో ఆంధ్రీకరించి వీరు భాషాసేవ గావించినారు. హనుమంతరావుగారు తెనుగులో చక్కని వ్యాసకర్తలు. వీరి వేషభాషలవలె శైలియును ఆడంబర రహితమైనది.

శ్రీ మాడపాటి హనుమంతరావుగారికి సమకాలికులై నిజాంరాష్ట్రమునందలి ఆం

ధ్రిల యభ్యుదయమునకై అపారముగు సేవగావించిన శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారికిని జన్మస్థానమీ యేకశిలానగర ప్రాంతమే. మనరాష్ట్రమునందు కీర్తిని కాంక్షించక సేవయే ప్రధానముగా భావించినవారిలో శ్రీ వీరభద్రరావుగా రగ్రగణ్యులు. శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయముయొక్క పెంపుసొంపులకు ఆధారభూతులైన పెద్దలలో వీరొక్కరు. నిలయపు రజతోత్సవ సంచికకు వీరు సంపాదకులై సంచికను సర్వాంగ సుందరముగను, విజ్ఞానదాయకముగను సిద్ధముగావించినారు. లక్ష్మణరాయ పరిశోధక మండలికి కార్యదర్శులై, పెక్కు శాసన విషయములను బహిరంగపరచినారు. ఇంకను చరిత్రాత్మకములు, భాషా విషయకములును, విజ్ఞానదాయకములు నగు వ్యాసము లనేకములను వ్రాసి ఆంధ్రవ్యాసరచయితలం దొక విశిష్టమగు స్థానము నాక్రమించి యున్నారు. నేడు నిజాం రాష్ట్రాంధ్రమునందలి చారిత్రిక ప్రదేశములు, చరిత్ర పరిశోధన, భాషావ్యవసాయము, ఇంతయేల ఆంధ్రోద్యమము యొక్క యేవిషయమును గురించియైనను సమగ్ర విజ్ఞానము గలిగినవారు శ్రీ వీరభద్రరావుగా రనుటలో నెట్టి అతిశయోక్తియును లేదు. వీరు ప్రచ్ఛన్నముగా చేసిన భాషాసేవ యెంతయో కలదు.

నిజాంరాష్ట్రమున ప్రథమ ఆంధ్ర పత్రికలు నీలగిరి, తెనుగు పత్రికలు. ఇందు తెనుగు పత్రిక ఓరుగల్లు మండలాంతర్గతమగు మానుకోటకు సమీపమునందలి ఇనుగుర్తి గ్రామమునుండి వెలువడినది. ఈ పత్రికా సంపాదకులు శ్రీ బద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవరంగారావు సోదరులు. వీరియిర్వురును పండితులు, కవులు, గ్రంథకర్తలు, బహుభాషాకోవిదులు, వీరి సంపాదకత్వమున కొన్ని సంవత్సరములు తెనుగు పత్రిక ప్రజాసేవ, భాషాసేవ గావించినది. తరువాత యీపత్రిక కేంద్రస్థానము ఓరుగల్లునకు మారినది. ఓరుగల్లునందు యీ పత్రికను కొంతకాలము చక్కగా నడిపినవారిలో ముఖ్యులు శ్రీ తూము వరదరాజ, దేవులపల్లి వేంకటాచలపతిరావుగార్లు. వీరిర్వురు స్థానిక గ్రంథాలయము యొక్క ఉన్నతి కొరకై శ్రద్ధతో శ్రమనొనరించిరి. ఓరుగల్లులో తెనుగు పత్రికకు సమకాలికముగా భాషా సేవగావించినది శైవప్రచారిణి. శైవప్రచారిణికి సంపాదకులు శ్రీ మునిగొండ వీరేశలింగశాస్త్రిగారు. శ్రీ శాస్త్రిగారు సంస్కృతాంధ్రములయందు చక్కని పండితులు. ప్రస్తుతము స్థానిక కళాశాలయందు పండితులుగా నున్నారు. తెనుగు పత్రిక శైవప్రచారిణుల, వలెనే సుకృతీ గతాయువన్నట్లు స్వల్పకాలమే జీవించినది. ఆంధ్రాభ్యుదయమను మాసపత్రిక. ఈ పత్రిక హనుమకొండనుండి శ్రీ కోకల సీతారామశర్మగారి సంపాదకత్వమున వెలువడుచుండెడిది. ఓరుగల్లు మండలమునందలి బూర్గంపహాడునుండి ఆంధ్ర

వాఙ్మయ సేవాసమితి పక్షమున కిన్నెర యను సంపుటము లొకటి రెండు వెలువడినవి. తెలుగుపత్రిక ప్రకటింపఁబడు రోజులలో శ్రీ ముసిపట్ల పట్టాభిరామరావుగారును, గార్లపాటి రాఘవరెడ్డిగారును చక్కని కవిత్వము వ్రాయుచుండెడివారు. శ్రీ పట్టాభిరామరావుగారు గత సంవత్సరము ఓరుగల్లులో జరిగిన కవి సమ్మేళనమున కధ్యక్షత వహించియుండిరి. హనుమకొండ కళాశాలలో ఉపాధ్యాయులుగా నుండి కీర్తిశేషులైన శ్రీ కంభంపాటి అప్పన్నశాస్త్రిగారు వేయి స్తంభాలగుడి శాసనమును ప్రకటించియు, పూలతోట యను మాసపత్రికను నిర్వహించియు భాషాసేవ చేసియున్నారు.

ఓరుగల్లు కళాశాలయందు చిరకాలము పండితులుగానుండి, సంస్కృతాంధ్రాంగ్లములయందేకాక, ఉర్దూ, ఫారసీ, అరబ్బీ, కర్ణాటకాది బహుభాషలయందు పాండిత్యము గడించి, ఉర్దూ-తెనుగు నిఘంటువును వ్రాసి ప్రశంసనీయముగు భాషాసేవ గావించి, ప్రచారమును కాంక్షింపక, పత్రికలయందు పేరెక్కించుకొనక, సభల జోలికిబోక, సమావేశముల కాహ్వానింపబడక నివురుగప్పిన నిప్పువలె నేటికిని సుల్తానుబజారునందు అప్పుడప్పుడు కనిపించు వృద్ధమూర్తి, అజ్ఞాతముగా నున్న విజ్ఞాన నిక్షేపము, ఓరుగల్లు నందలి కళాశాలలో అస్మదాది యువకుల కనేకులకు ఉపాధ్యాయులై సారస్వతప్రేమ గలిగించిన విద్వద్వర్యులు శ్రీ అమితంరాజు కొండలరావుగారు. వీరివలెనె బహుభాషాకోవిదులై ఓరుగల్లు కళాశాలయందు ప్రస్తుతము పండితులుగా నుండి అనేక గ్రంథములను రచించుచు ప్రకటింపనొల్లక అజ్ఞాతముగా నున్నవారు శ్రీ ఉదయరాజు శేషగిరిరావు, ఎం. ఏ. గారు.

గోలకొండ కవుల సంచిక నాటికి ఓరుగల్లు మండలమున మొత్తము ఎనుబదియైదుగురు కవులున్నట్లు తెలియుచున్నది. వీరిలో శ్రీ మామునూరి నాగభూషణరావుగారు ఆధునిక సంప్రదాయము ననుసరించి చక్కని కవిత్వమును వ్రాసిన సుప్రసిద్ధులు. వీరి కవితా సౌందర్యమును పఠనామాధుర్యము ద్విగుణీకృతమొనరించుచున్నది. వీరొక గ్రంథమాలను స్థాపించి వెన్నెల కుప్పలవంటి చక్కని గ్రంథములను ప్రకటించినారు. ఓరుగల్లు మండలమున బహుళ గ్రంథకర్తలు పండితులు, అవధానులు, ఆధునికులయందు కలరు. గోలకొండ కవులసంచిక ప్రకారము ఇచ్చటి సారస్వతోపాసకులలో యీ క్రిందివారిని ఉదహరింపవచ్చును. అంబటి లక్ష్మీనరసింహరాజు, వీరవల్లి నరసింహాచార్యులు, అల్లూరి రాజేశ్వరకవి, చిలుకూరి శ్రీరాములు, ఒద్దిరాజు లక్ష్మీనరసింహరావు, ఆవుల పురుషోత్తమదాసు, మాచేటి వరదరావు, కొండపర్తి వీరమల్లు, చాగంటి భాస్కరలింగము, ముదల్ధర నరహరిరావు, గుండా రాజమౌళి, కాభూరి రాజేశ్వరరావు, తిరువాయిపేట రంగయ్యసూరి, జ్ఞానమాంబ, లక్ష్మణసింగు, పలివెల వెంకట అప్పారావు, జములాపురము

వెంకట రామారావు, గంగు కృష్ణదాసు, కొండపల్లి రామచంద్రరావు, బండి వేంకటరామారెడ్డి, పొట్లపల్లి వేంకటేశ్వరరావు, కందాళ శేషగోపాలాచార్యులు, అకుల లక్ష్మీనారాయణ, నల్లాన్ చక్రవర్తుల వేంకటపెన్నరంగాచార్యులు, భవానీసింగు ఠాకూరు, శ్రీ రామపాల లక్ష్మీనారాయణ, పుట్టంరాజు దుర్గాప్రసాదరావు, కొండపల్లి గోపాలరావు, హరి రామలింగశాస్త్రి నల్లాన్ చక్రవర్తుల ప్రతాప రాఘవాచార్యులు, మాటేటి గోపాలరావు, పులివాక మహానందిశాస్త్రి, బొమ్మకంటి యోగానందరావు, మోటుపల్లి కృష్ణమాచార్యులు, గొట్టుపర్తి సుబ్బారావు, గుండా ముక్తిలింగము, తంయాల లక్ష్మీనరసింహాచార్యులు, కటారి మాణిక్యరావు, కె. వి. నరసింహాచార్యులు, సముద్రాల లక్ష్మీనరసింహాచార్యులు, కాళూరి సీతారామరావు, వానమామల జగన్నాధాచార్యులు, వనం వేంకటనరసింహారావు, రేమిడిచర్ల వేంకటకృష్ణారావు. ఊటుకూరి సూర్యనారాయణరావు, పడగం రాజేశ్వరరావు, సి. ఇ. ఆంధ్రూను, ముదిగొండ మల్లనారాధ్యకవి, బొమ్మినేని రాజరెడ్డి, నేరెళ్ళ నరసింహారాయకవి, వానమామల లక్ష్మణాచార్యులు, ఆడ్లూరి అయోధ్యరామకవి, గుండా రాజలింగకవి, వనం వేంకట నరసింహారావు మున్నగువారు. ఖమ్మములో శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు అను యువకుడు అభ్యుదయ రచనలను గావించుచున్నాడు.

ఈ ప్రాంతమున సారస్వత సేవ యొనరించిన గ్రంథమాలలు కాకతీయ గ్రంథమాల ఓరుగల్లు, విజ్ఞానప్రచారిణీ గ్రంథమాల ఇనుగుర్తి, వేంకటేశ్వర గ్రంథమాల గార్ల, అణా గ్రంథమాల ఇనుగుర్తి ఆంధ్రవాఙ్మయ సేవాసమితి పాల్వంచ ప్రస్తుతమీ గ్రంథమాలలు అంతరించినవి. ఇప్పుడీ ప్రాంతములో భాషాసేవ విద్యాప్రచారము గావించుచున్న సంస్థలలో పేర్కొనదగినవి ఆంధ్ర విద్యాభివర్ధనీ సమాజము ఓరుగల్లు, సారస్వత సేవా సమితి ఘనపురము, కాకతీయ కళాసమితి ఓరుగల్లు, కాకతీయ క్లబ్ ఓరుగల్లు, హాస్కర్స్ క్లబ్ ఖమ్మము, రఘునాధపల్లి ఆంధ్ర విద్యాలయము, ఆంధ్ర జాతీయ యువజనసంఘము ఖమ్మము, మున్నగునవి కలవు. ఓరుగల్లు మండలమున గ్రంథాలయోద్యమము క్రమవ్యాప్తినొంది అభివృద్ధి గాంచినది. హనుమకొండలోని రాజనరేంద్ర ఆంధ్రభాషానిలయము, ఓరుగల్లు నందలి శబ్దానుశాసనాంధ్రభాషానిలయము రజతోత్సవములు గావించుకొన్నవి. ఇంకను ఇచ్చటి గ్రంథాలయములలో ప్రశంసింపదగినవి శైవప్రచారిణీ గ్రంథభాండాగారము, ఓరుగల్లు, విజ్ఞాననికేతనము, ఖమ్మముమెట్టు, హిందీప్రచారిణీ గ్రంథాలయము, మల్లేపల్లి, విజ్ఞాన ప్రకాశినీ గ్రంథనిలయము, కలకోట, పత్రికా పఠనమందిరము జంగ్యాలరావుపేట, ఉస్మానియా గ్రంథాలయము మధిర, మహబూబియా గ్రంథాలయము, ఎట్టుపాలెము సిద్ధి మల్లేశ్వర గ్రంథాలయము రేమిడిచర్ల

శ్రీ సోమరాజు ఇందుమతీ దేవిగారు ప్రత్యేక ప్రశంసనీయురాలు. భాష యందు, సౌందర్యభావములందు రమణీయత యీయమ ప్రత్యేకత. గోలకొండ సంచికలో యీమె ప్రకటించిన పద్యములు మిక్కిలి మనోహరముగా నున్నవి. ప్రియుడు ప్రేయసిని సంబోధించు రచనలే ఇంతవరకు మనభాషయందు జన్మించినవి. ప్రేయసి ప్రియుని సంబోధించుచు వ్రాసిన కావ్యములు మన సారస్వతమున లేవేమో! శ్రీ ఇందుమతీదేవిగారు ఆ కొరతను దీర్చుచు నొక చక్కని ఖండకావ్య సంపుటమును ప్రకటించియున్నారు.

అధునికు లుపాసించు నవ్యత యీమె కవితయందు ప్రత్యక్షమై యున్నది. యువకులలో పేర్కొనదగిన మరియొక్కరు (శ్రీ) నెల్లుట్ల రామకృష్ణకవిగారు, వీరు సూరిబాలయను ఖండకావ్యమును, భావార్ణవాది ఇతర గ్రంథములను వ్రాసి యున్నారు. భావమును గీతపద్యమున ఇమిడించుటలో వీరి కొక ప్రత్యేకమగు విజ్ఞానము కలదు. నియోగిశాఖాభిమానము ఈయనయందు మూర్తీభవించి యున్నది. కావలసినంత యవకాశము కలిగిన యీయన ఆంధ్రభాషాసేవ ఇతోధికముగా గావించునని నమ్ముచున్నాను.

రాజకీయ రంగమునుండి సారస్వత రంగమునకు లంఘించిన నాప్రియమిత్రుడు శ్రీ నారాయణరావు కాళోజి నేడు గేయ రచనయందు నిమగ్నుడై యున్నాడు. అతని యొక్కొక హృదయస్పందము, ఒక గేయముగా మారుచున్నది. స్వభావసిద్ధమగు ఉద్రేకము ఈయన గేయములందు ఉప్పొంగుచుండును.

ఈ విధముగా ఓరుగల్లు మొదటి నుండియు నేటి వరకు సారస్వతరంగమున తన పాత్రను కాలానుగుణముగా నిర్వహించుచునే యున్నది. ఇది యొక పవిత్రమగు యాత్ర; అవశ్యము ఆచరింపవలసిన ధర్మము; మాతృదేవతా పాదసేవ నిరంతరము సాగుచునే యుండగలదు.

"నిలుపదు స్యందనంబు ధరణీపతిపాలన
దండభీతిచే ...... అనర్గళజవయాత్రి
నెగెడినికన్నులకునె గనరాని చోటికిన్"
"ప్రజలయాతేరు మోకుల బట్టువారు"
అని యొక యాధునిక కవిశేఖరుడు వ్రాసినట్లుగా మాతృదేవతాస్యందనము పరుగెత్తుచునే యుండగలదు. కాలము అనంతమైనది. ప్రపంచము విశాలమైనది. భావప్రపంచమునకు మార్పు సహజము.



# భా ర త వా ణి జ్య ము

శ్రీ బిచ్చు వేంకటేశ్వర గుప్తగారు, హైకోర్టు వకీలు

జాతీయ వికాసమునకు, దేశ సౌభాగ్యాభివృద్ధికిని వర్తకమే, అంతరంగభూతమైన పారిశ్రామికమే, ముఖ్యాంగ మను విషయము సర్వమానవప్రపంచ మంగీకరించి యున్నది. ప్రాచీన భారతీయ వాణిజ్యము ప్రాచ్య, పాశ్చాత్య, భూమండలమునం దంతటను ప్రబలముగ నడిచినది. భరత ఖండము పూర్వప్రపంచమున కంతటికిని హృదయమువలెనుండి, నౌకావాణిజ్యమునను, పరిశ్రమసంపత్తియందును భూఖండము లన్నిటిలో మిన్నయై ప్రకాశించె ననుటకు ప్రత్యక్షాప్రత్యక్ష ప్రమాణము లనేకములు గలవు. భారతీయుల వర్తక మద్వితీయముగ ఆంగ్లేయ ప్రభుత్వారంభమువరకు వర్ధిల్లి, నిఖిల లోకాకర్షణీయముగ నుండెననుటకు చారిత్రక నిదర్శనములు గలవు. మన ప్రాచీనుల యుపారసంపదకు వారి బాహుళ్యమైన విదేశవ్యవహార మొక కారణ మని నిర్ణయించవచ్చును. ఇచటి నైసర్గిక వస్తు సమృద్ధియు, బహుమూల్యములైన సుందర సామగ్రియు, ఖనిజసంపత్తియు, విలువగల పారిశ్రామిక వస్తురాజములును, విశ్వవ్యాప్తమైన యోగ్యతలకు సహకార మొసంగుచుండెను. స్వదేశవర్తకమేగాక, విదేశవ్యవహార మంతయు, సహజవాణిజ్యనైపుణ్యులగు వణిజుల హస్తగతమై యుండెనని చరిత్ర చాటుచున్నది.

## ఆదియుగములోని భారతీయుల వర్తకము

భారతీయుల వర్తక మతిప్రాచీనమైన దనుటకు, అనాదియైన వేదములో నయ్యది యొక ముఖ్యవృత్తిగ పేర్కొనబడుటయే సాక్షి. తద్వృత్తి నిర్వహణమునకై యొకజాతి ప్రత్యేకింపబడినది. "ధనమును గోరు వర్తకులు ఓడలతో సముద్రము నాశ్రయించెద" రనియు "వణిజులు లాభముల కొరకు ఎల్లచోట్ల కేగుచు సముద్రములో ద్రిమ్మరుచుందు" రనియు, ఋగ్వేద ప్రథమ మండలములో సూత్రప్రాయముగ నుదహరింపబడి యున్నది.

త్రేతాయుగములో ప్రాదుర్భవించిన యాదికావ్యమనబడు రామాయణమువలన

భారతీయుల కితరద్వీపవాసులతో వర్తక సంబంధ ముండినట్లు స్పష్టపడుచున్నది. మను, యాజ్ఞవల్క్య, మున్నగు స్మృతుల లోని వర్తక నిబంధనలు. నౌకాయాన వివాద పరిష్కార పద్ధతులు భారతీయుల వర్తక ప్రాశస్త్యమునకు సాక్ష్యము లిచ్చుచున్నవి.

శ్రీ సత్యనారాయణ వ్రతకల్పమునం దాక వైశ్యుని వ్యవహారదక్షత్వము, నౌకాయాన విశేషత్వము,వివరింపబడియున్నది. శకుంతల నాటకమున, ధనవృద్ధినామక వర్తకుడు సముద్రయానములో గతించెనని వ్రాయబడియున్నది. హరవిలాసమునందు త్రిపురారిశెట్టి యను నాతని విదేశవ్యవహార మభివర్ణింపబడియున్నది. ఇదే విధమున సంస్కృతాంధ్ర వాఙ్మయమున భారతీయ వర్తకప్రాబల్య ముల్లేఖింపబడియున్నది.

వేదములోని నౌకాయాన ప్రశంస, వాయువిమాన వివరణ, ఉక్కుతో చేయబడిన వస్తువుల పరామర్శ, రామాయణములోని ఇంద్రజిత్తుని యంతరిక్షయుద్ధ విచిత్రములు, లంకానగర ద్వారమందలి మరయంత్రములు మున్నగునవి ఆనాటి పరిశ్రమల యౌన్నత్యమును చాటుచున్నవి.

## మధ్యయుగములోని విదేశ వర్తకము

క్రీస్తుశకమునకు మూడువేల సంవత్సరములకు పూర్వము భారతీయులు,పోలెనేషియా, బాబిలోను మున్నగు దేశములతో వర్తకము చేసి యుండిరని పురాతత్వజ్ఞుడగు సెయిన్ గారు వక్కాణించి యున్నారు.

క్రీ. పూ. దశమశతాబ్దములో ఇస్రాయిలు రాజును, టైరు దేశపురాజును భరతఖండమునకు నోడల నంపి, దంతములు, వెండి, బంగారము. చందనపుచెక్క,రత్నములు మున్నగునవి తెప్పించుకొనెననియు భారతీయులకును,అరబ్బులకును వర్తకము బాహాటముగ జరుగుచుండెననియు మాక్సుడంకర్సు (Max Dunker's History of antiquity) గారి చరిత్ర చాటుచున్నది.

క్రీ. పూ. ౮-వ శతాబ్దమున భారత వర్తకము బాబిలోను (బకేరియా) తో జరిగినట్లు ప్రమాణములు లభించుచున్నవని జాక్సన్, ఐ.సి.యస్. గారు తెలిపియున్నారు.

భారతీయ వణిజులు క్రీ. పూ. ౬-వ శతాబ్దమున, చీనా తూర్పుతీరమునను, ఆఫ్రికా, అరబ్బు స్థానమందును, బాబిలోనునందును, ఉపనివేశము లేర్పరచుకొని యుండిరని కెన్నడీగారు Journel of the Royal Asiatic society for 1898 A. D.) తెలిపియున్నారు. కొందరు వాణిజ్యార్థము సముద్రయానము చేయుచుండ తుపానుచే కొట్టుకొనిపోబడి జర్మనీ దేశము చేరియుండిరని ప్లీనీ గారభిప్రాయపడి యున్నారు.

ఈజిప్టు, సైబీరియా, బాబిలోన్ దేశములకు ఇనుము, రంగుబట్టలు మున్నగునవి విరివిగ నెగుమతి చేయబడుచుండెనని మాండర్సు (Maundea's treasury of History) దేశచరిత్ర యుగ్గడించుచున్నది. క్రీ. పూర్వము భరతఖండము విస్తారముగ వ్యవహారము జరిపిన యూరోపు దేశ నగరములలో "రోము" పట్టణము ముఖ్యమైనది. అచటి కెగుమతియగు దినుసు లనేకములు పేర్కొనబడినవి. రోముదేశీయులెత్తునకెత్తు బంగారమిచ్చి భారతదేశపు పట్టుబట్టలు కొనుచుండిరట. వారేటేట వీటికై ౪౦ లక్షల కాసులు భరతఖండమునకు చెల్లించుచుండిరట. దీనిచే ఆకాలమున నిచటి పరిశ్రమవస్తువు లెంత యపురూపముగను, అమూల్యముగను భావింపబడుచుండెనో యూహింపబడవచ్చును,

క్రీస్తుశకారంభముమొదలు ౧౫వ శతాబ్దమువరకు ఈజిప్టుదేశమునకును, భరతఖండమునకును, నిరంతరము వర్తకము సాగుచుండె ననియు, అరబుస్థానములోని వర్తకస్థలములకును, ఈజిప్టునకును పంపబడు సరుకులు సముద్రముద్వారానే పోవుచుండెడివనియు (Journal of the R.A.S. for 1904) గ్రంథాదులలో నుదహరింపబడియున్నది.

## వాణిజ్య నౌకాశ్రయములు

సింధునదిపై నాలుగువేల వ్యవహార నౌకలు నడచుచుండె ననియు, అచట గొప్ప హార్బరు కట్టబడియుండె ననియు తెలియుచున్నది. బొంబాయి సమీపముననున్న కల్యాణీ రేవునుండి అనేక వర్తకపుటోడలు సిలోన్, పర్షియా, ఎతియోపియా, మడగాస్కర్ మున్నగు దేశములకు వర్తకపు సరకుల గొంపోవుచుండెను. భరుకచ్ఛము, తామ్రలిప్తి, నగరములు గొప్ప నౌకావాణిజ్య కేంద్రములుగ నుండి చైనాతో వర్తకము జరుపుచుండె నని చరిత్ర ఘోషించుచున్నది. మలబారు తీరమునుండి పాశ్చాత్యదేశములకు సరుకు లెగుమతి యగుచుండె నని తెల్లమగుచున్నది. ఒక్కొక యోడలో వర్తకులు ౭-౮ వందలవరకు సముద్రయానము చేయుచుండిరని నిదర్శనములు గలవు. బందరు రేవుపట్టణము వర్తకస్థానముగ ప్రసిద్ధికెక్కియుండెను. ఇచటినుండి అనేక వర్తకనావలు వివిధదేశముల కేగుచుండె నని టావర్న్యయర్ (Tovernier) గారు తెలిపియున్నారు. ఇంక ననేక భారతీయ నౌకాశ్రయములు పేర్కొనబడినవి.

## ఆంధ్రుల వర్తకము

అతిప్రాచీనకాలము నుండియు నాంధ్రదేశము వాణిజ్యమున ప్రసిద్ధికెక్కియున్నది. నేతపరిశ్రమయందును, ఖనిజసంపత్తియందును, విదేశవర్తకమునకును నియ్యది ముఖ్యస్థానముగ నుండెను. ఈ ప్రాంతములోని యనేక నౌకాశ్రయములను, టాలెమీ (Ptolemy) గారు పేర్కొనియున్నారు. గూడూరు, ఘంట

సాల, మోటుపల్లి, కోరంగి, బందరు, పాలూరు, అవనిగడ్డ, మున్నగు రేవులు ప్రాచీనాంధ్ర నౌకాస్థానములలో ప్రసిద్ధి గాంచి యుండెనని చరిత్ర తెలుపుచున్నది. జావా, బోర్నియో, సుమిత్రా చీనా, ఆఫ్రికా, ఐరోపియా, అరేబియా, ఈజిప్టు, రోము, గ్రీసు, పారశీకము మున్నగు దేశములతో ఆంధ్రులు వర్తకము చేయుచుండినట్లు రుజు వగుచున్నది.

రెడ్డిరాజుల పరిపాలనా కాలము లో విదేశవర్తకుల నాంధ్రదేశమునకు రప్పించుటకై యెన్నియో యానుకూల్యములు కావింపబడినట్లు శాసనములు తెలుపుచున్నవి. ప్రాగ్భారత దేశములోగూడ ఆంధ్రులు వర్తకము విశేషముగా జేయుచుండిరి. కృష్ణా, గోదావరీ నదులపై వర్తక నౌకలు లోభాగములకు తిరుగాడుచుండెనని (Pariplus) పెరిప్లసు అను క్రీ. శ. ౧౨-వ శతాబ్దమునాటి గ్రంథము తెలుపు చున్నది. నౌకావ్యవహారములు మాత్రమేగాక మెట్టవర్తకమునను ఆంధ్రులు ప్రసిద్ధిచెంది యుండిరి.

వర్తకులు – ఎగుమతులు.

పూర్వోదాహృత భారతీయ విదేశ వర్తకము సహితము వైశ్యుల హస్తంగతమైయుండెనని పెరిప్లసు గ్రంథము చాటుచున్నది. కోమటులును హిందూవణిజులును వారధులదాటి విదేశములలో స్థిరపడుట కభ్యాస పడినా రనుట సర్వ విదిత మని హీరెన్ పండితు డనినట్లు (Historical researches) ఒక పొత్తమున పొందుపరచబడి యున్నది.

భారతీయవర్తకులు హిందూస్థానము నుండి విదేశముల కెగుమతి చేయుచుండిన వస్తువుల సంఖ్య విస్తారముగ నీయబడి యున్నది. రత్నములు, ఖనిజములు, మున్నగు అతిమూల్య వస్తువులేగాక, పాశ్చాత్యలోకమున కంతటికిని, సుగంధ ద్రవ్యము లీఖండమునుండియే వచ్చుచుండెనని యాంగ్లేయుల చరిత్ర గ్రంథములు చెప్పుచున్నవి. గ్రీకులు మొట్టమొదట పంచదారను భరతఖండముననే చూడ కలిగిరని (Ancient & Midiaeval India) చేంబర్సు విజ్ఞానసర్వస్వమున గలదు.

పారిశ్రామికము.

ప్రస్తుతకాలమున మనము విస్మరింపగాం బున నోలలాడించి భరతఖండ సౌభాగ్యమును కొల్లగొట్టుచున్న విదేశీయవస్తుసంచయము ప్రాచీన భారతీయులకు క్రొత్తవిగావని విదేశీయులే యుద్ఘాటించుచున్నారు. భారతీయుల యొక్క పరిశ్రమల కింతవరకు సాటియైనవి లేవనుటకు తగిన సాక్ష్యములు గలవు. ఆటం బాంబులను తలదన్ను అస్త్రశస్త్రముల వర్ణన పురాతన సంస్కృత గ్రంథములలో గానవగును. భారతీయుల వివిధ కళానైపుణ్యముల జూపెట్టు నిదర్శనము లింతవరకు నిలచియున్నవి. ఇచటి వస్త్రముల నున్ని

తమునకు తులదూగు వస్త్రము లితర ఖండములలో నేటివరకు ఉత్పన్నము కాజాలలేదని ఎన్‌సైక్లోపీడియా (Encyclopaedai Britanica) వాక్రుచ్చుచున్నది. పరిశీలించగ మొత్తము పైకుమాకారణలోపేతులగు హిందువులకు ప్రకృతియే స్వాయముగ పారిశ్రామిక వైదగ్ధ్యమును ప్రసాదించి యుండెనని దృఢపడుచున్నది.

## ప్రస్తుత కర్తవ్యము

ప్రాచీనుల వాణిజ్యకౌశల్యమును, పారిశ్రామిక విజ్ఞానమును, సంపత్సౌభాగ్యమును, ప్రపంచ చారిత్రమంతయు కొనియాడుచున్నది. కాని కాలవైపరీత్యమున నవియన్నియు నన్యుల నాశ్రయించినవి. పూర్వము వణిజులేగాక ప్రభువులు సహితము నౌకావాణిజ్య విద్యల నభ్యసించుచుండిరని శాసనములు వాకొనుచున్నట్లు (Hunter's orissa) విదితమగుచున్నది, గాని నేటి భారతమాతా సూనులు పిత్రార్జితమంతయు వెచ్చించి విశ్వకళాపరిష ద్బిరుదముల పొందిన తోడనే, విశ్వకల్యాణ కారకములైన, వర్తక పారిశ్రామికముల మది నెంచక నేడో రేపో యుద్యోగమునకై పాటుబడుచుండుట విచారకరమైన విషయము. దీనివలన ప్రతిచిన్న వస్తువునకై నను నితరులపై యాధారపడవలసి వచ్చినది. భారతీయుల భాగ్యదేవత విదేశీయుల కావాలితి యగుచున్నది. ఐనను ప్రస్తుతము ప్రపంచ పరిస్థితులు మారినవి. భారతీయుల పురోభివృద్ధిదాయకములగు శుభసూచనలు పొడచూపుచున్నవి. కావున విద్యార్థులును ధనవంతులును ప్రకృత పరిస్థితుల గమనించి వర్తక పారిశ్రామికముల నైశ్వర్యమును దలపోసి భారతమాతకుతనపూర్వపు యశస్సును ప్రసాదించెద రని యాశించుచున్నాను. ఆలసించినచో, వంశపారంపర్యముగ వర్తకము చేయుచున్నవారి చేతులలో మిగిలియున్న యాకాసంత వర్తకము సహిత మన్యులచే నాక్రమింపబడుచున్న వాతావరణము జయమొంద గలదు. తరువాత తరములవారికి భారత జాతి వర్తకతంత్ర పరిజ్ఞానములేని మోటు జాతిగ స్ఫురించగలదు.



# ఆంధ్రుల సాంఘిక జీవనము

శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు, బి.ఏ., బి.ఎల్.

తళ్లికోట లేక రక్షసతగడీ యుద్ధము క్రీ. శ. ౧౫౬౫ లో జరిగెను. దాని తర్వాత ఆంధ్రదేశములో రాజకీయ దౌర్బల్య మేర్పడుచువచ్చెను. కొంతకాలము పెనుగొండలో ఆంధ్రరాజులు నిలద్రొక్కుకొనిరి. కాని అక్కడినుండి వీరము చంద్రగిరికి కదలగానే ఆంధ్రుల రాజకీయాస్వాతంత్ర్యము పరిసమాప్తి అయ్యెనన్నమాట. క్రీ. శ. ౧౬౦౦ వరకు ఆంధ్రదేశములో ఒక గోలకొంత సుల్తాను తప్ప తక్కిన తురకలెవ్వరును రాజ్యము చేయలేదు. గోలకొండసుల్తానులు షియ్యాలగుటచేతను వారి యాధిక్య మిప్పటి తెలంగాణములో పలనే యుండినందునను వారికి ప్రక్కననే ప్రబల విజయనగర చక్రవర్తు లుండుటచేతను వారాంధ్రులను దుష్టముగా పాలించినవారు కారు. కాని తళ్లికోట యనంతరము తెనుగు దేశములో తురకల విజృంభణము ఎక్కువయ్యెను. అంతవరకు కాకతీయులు విజయనగర చక్రవర్తులు, రెడ్డిరాజులు తురకలను విరోధించుచు వారిని తెనుగు సీమలోనికి రానీయనందున ఆంధ్రులకు ఉత్తర హిందూస్థాన హిందువులకు కలిగిన కష్టాలెట్టివో కానరాకుండెను. తటాలున క్రీ.శ. ౧౬౦౦ తర్వాత ౧౫౦ యేండ్లవరకు తురకల దాడు లెక్కువై కర్నూలు, కడప, గుంటూరు నవాబులేర్పడి ఉత్తర సర్కారులు వారివశమై వారి దుష్పరిపాలన మొకదిక్కు సాగుచుండగా మరొకదిక్కు పిండారీలు, దోపిడిగాండ్లు తురకలదండులు ఎక్కువై జనుల హింసించిచంపి దోచి ఊరచిగుళ్లను కూలద్రోసి నానాఘోరాలు చేయగా ఆంధ్రులు హాహాకారాలు చేసి చాల బాధపడిరి. ఆ బాధలు పద్యాలలోను, కావ్యాలలోను, ప్రబంధాలలోను, చాటువులలోను, ప్రతిఫలించినవి. గోగుల పాటి కూర్మనాథుడనుకవి విశాఖపట్టణ మండలములో తురకలదండు ప్రవేశించి భీభత్సములు చేయగా సింహాద్రి నారసింహ స్వామినే నానావిధాల తిట్టుచు సింహాద్రి నారసింహ శతకమును వ్రాసెను. ఆకవి క్రీ. శ. ౧౭౦౦-౧౭౫౦ ప్రాంతమువాడు. తురకదండు పొట్నూరు, భీమసింగి, జామి చోడవరం మున్నగు ప్రాంతాలలో దూరి దోచుకొని దేవాలయాలను ధ్వంసము చేయుచు వీరవిహారము చేసెను. వారి దుండగాలను కవి యిట్లు వర్ణించెను :—

ఎలమితో సోమయాజుల పెద్దఝూరీలు
గుడిగుడీలుగ జేసికొనెడివారు

యజ్ఞవాటికలలో నగ్నిహోత్రంబుల
ధూమపానము చేసి త్రుళ్లువారు
యాగపాత్రలు తెచ్చి హాసుగా వడి లుడి
కీ చిప్పలుగ జేసి కేరువారు
స్రుక్స్రువముఖ్యదారుమయోపకరణముల్
గొని వంటపోయి పిడుకొనెడివారు
నగుచు యవనులు విప్రుల దెగడుచుండ
పవనభోక్తృవు నీవిట్లు నైపదగునె
తినదినగ గారెలైనను కసరు వేయు
వైరిహరరంహ సింహాద్రివారసింహ
(ఝూకీలు=ఝురీపలె ధారపడు నాళము కల చెంబులు (ఉర్దూలో టూటీదాల్ లోటాఅందురు. గుడిగుడ్=హుక్కా)

ఆకాలపు తురకల వేషా లెట్లుండెనో పైకవియే వర్ణించినాడు. నరసింహస్వామిని తన హిందూ వేషమును మార్చుకొని తురక వేషము వేసుకొమ్మని యిట్లు సంబోధించుచున్నాడు:—

జడవిప్పి జులుపాలు సవరింపు మిరువంక
బలుకిటికీదారు పాగజుట్టు
బొట్టు నెన్నుదుటిపై బొత్తిగా తుడుచుకో
పోగులూడ్చుము చెవుల్ పూడవిడువు
వడిగ నంగీ యిజారొడ్డుగా దట్టీ జుట్టు
కైజారు దోపు డాల్కత్తిబట్టు
బీబినాంచారిని బిలిపింపు వేగమే
తురకభ్యసింపుమీ తురకభాష
శక్తి లేదన్న నిట్టి వేషంబు పూను
మన్న సరిలోకవంద్యుడవైన నీవు
నీచులకు సలాం చేయ నేసహింప ॥వైరి॥

తురకలు చేసిన దౌష్ట్యములను ఇట్లు వర్ణించినాడు:—

"కనిపించు కోవుగా ఖలులు మార్గముల
గొంకక ముక్కులు గోయునపుడు
అలకింపవుగదా యయ్యయో ప్రజఘోష
ధూర్తులు వడి నిళ్లు దోచునపుడు
జాలి గాదాయెగా చటులతురుష్కులు
భామినులను చెరల్ పట్టినపుడు

మరియు—

"గ్రామముల్ నిర్ధూమధామములయ్యెను
సస్యంబు లెల్ల నాశనము చెందె
దొడ్లలో శాకముల్ దుంపశుద్ధిగ బోయె
దోచిరి సర్వంబు గోచిదక్క"

తురకదండు సింహాద్రిపైకి వెళ్లగా అక్కడ తుమ్మెదల దండు వచ్చి వారినికరిచి పారిపోవునట్లు చేసెనని అట్టి తావును తుమ్మెదలమెట్ట యందురని కవి వర్ణించి ఒక పద్యాంతమందు ఇట్లు దేవుని సంబోధించినాడు:—

"(కాక) రోషంబు గలిగిన కఠిన యవన
సేన సర్జించి యీ యాంధ్రసృష్టినిలుపు

(ఇక్కడ సృష్టిఅనగా Culture సంస్కృతి అని అర్థమును నేను గ్రహించుచున్నాను. అదే కవిభావమనుకొందును)

కాంచినగరవాసియగు వెంకటాధ్వరి ౧౬౦౦ క్రీ. శ. ప్రాంతమువాడని యందురు. బహుశ ౧౬౫౦ ప్రాంతమువాడై యుండును. అతడు వ్రాసిన విశ్వగుణాదర్శము అను సంస్కృత కావ్యములో కూడ తురకలు చేసిన ఘోరాల నిట్లు

వర్ణించినాడు. తెనిగించిన భాగాలే యుదహరింతును.

"అయ్యో ఈ ఆంధ్రదేశములందు నమంద దురితనిరతులై యెల్లప్పుడు బెల్లుగ తురకలే తిరుగు చున్నవారు

"యవను లిందమంద జవనాశ్వముల నెక్కి
దేవతాలయాల దీర గూల్చి
సవనధర్మసమితి సమసి పోవగ జేసి
భువనభీకరులుగ భువి జరింత్రు

"యవనులు ఒక్కొక్కడు కోపముతో సవారియై కత్తి తిప్పుతూ మైదానములో దూకిన ఒకవేయి (ఆంధ్ర) యోధులు కూడా భయపడి పారిపోతున్నారు. మరియు—

"త్రావగనిమ్ము కల్లు, పర
దారల బెల్లు హరింపనిమ్ము నా
నావరదేశముల్ తిరిగి
నాశము సేయగనిమ్ము నేమముల్
వావిరి ద్రోవనిమ్ము మృధ
వాటి దృఢమ్మునుబోలె మాని మే
నే, విబుధేంద్రపట్టణ వి
నిష్టకవాటము వ్రక్కలింత్రె పో

భద్రాచల ప్రాంతమువాడేమో క్రీ.శ. ౧౭౫౦ ప్రాంతమువాడే యయినట్టి భల్లా పేరకవియనునతడు భద్రగిరిశతకములో పూర్తిగా గోగులపాటి కూర్మనాధుని వలెనే తురకలవలన చాల బాధపడి భద్రాద్రిరాముని చెడదిట్టినాడు. ఆపద్యాన్నియు నుదహరించిన గ్రంథము పెరుగును కాన తురక సర్దారులు, సేనానులు, స్థానికాధికారులు చేసిన దుండగాలను వర్ణించిన భాగాంశములను కొన్నింటిని నుదహరింతును.

"అచ్చిద్ర కర్ణులయాజ్ఞ నుండగలేక
తురకలకెదురుగా నరుగలేక
చేరిఖానులకు తాజీములీయగలేక
మును నమాజుధ్వనుల్ వినగలేక
"కాదుచేసిరికదా కళ్యాణ మండపా
గారవాహన గృహాంగణములెల్ల
"సంస్కృతాంధ్రోక్తులసారంబులుడివోయె
నపసవ్య భాషల నమరె జగము
"సత్రశాలాంగణల్ చలువపందిరులు
బబ్బరటఖానుల చప్పరములయ్యె
"పారిపోవగనైన పట్టులునాకళ
విడుతురే వైష్ణవ వితతినెల్ల

ఆంధ్రదేశమునకు మూడవ మూల యగు తిరుపతిలోకూడ ముసల్మానుల అక్రమాలు జరుగగా ఇదే కాలమున "శత్రుసంహార వెంకటాచలవిహార" యని ఒక శతకములో వడ్డికానుల వెంకన్నను ఒక కవి చీవాట్లు పెట్టెనట. ఈ విషయాలను చూడగా ఈకాలములో ఆంధ్రదేశమెంతటి దిక్కులేని దేశమై అరాచకమునకు గురియై ఎంతటి ఆవేదన పడెనో ఊహించుకొనవలెను.

ఉత్తరమునుండి తెనుగుదేశమువిూదికి కష్ట పరంపరలు ఒకదిక్కు దిగుమతికాగా దక్షిణదిక్కులో మరొకమూలనుండి ఇంకొక ఈతిభాధ ప్రారంభమయ్యెను. అది సముద్రాంతరమునుండి ఎగుమతి చేయు

బడినట్టిది. అదే క్రైస్తవ మతస్థుల దౌర్జన్యము. తంజావూరును ఆంధ్రరాజులు పాలిస్తుండెడు కాలమువరకే పోర్చుగీసువారు కాలికట్టులో కొలది ప్రబలులై కాలుసాపి తీరమంతయు వ్యాపించుకొని కత్తితోకాక తుపాకీగుండ్లతో క్రైస్తవ మత ప్రచారము ప్రారంభించిరి. ఆదిలో తంజావూరు రాజగు చెవ్వప్పనాయకుడు పోర్చుగీసువారికి ఆశ్రయమిచ్చెను. క్రమముగా పోర్చుగీసువారు తమ దౌర్జన్యము సాగించిరి.

వారితోపాటు డచ్చివారు (హాలెండు దేశమువారు) తంజావూరు రాజ్యమునందలి జనులను పట్టుకొనిపోయి విదేశాలలో బానిసలుగా అమ్ముకొనిరి. ఇంతేకాక ముసల్మానులుకూడ తంజావూరు నాక్రమించుకొని దేశమునంతయు భీభత్సము పట్టించి ప్రజల చంపి దోపిడులు చేసిరి. ఇదంతయు రంగీలా రాజగు విజయరాఘవ నాయకుని (అనగా క్రీ.శ. ౧౬౩౩-౧౬౭౩) కాలములో జరిగెను. ఈ పిచ్చి విజయరాఘవుడే తురకసైన్యముపై జపించిన తులసితీర్థము చల్లితే వారు భస్మమగుదురని దానిని పంపెనట. కాని అతడే సమూలముగా స్త్రీశిశుసమేతముగా నాశనమయ్యెను.

అట్టి పిరికికాలములో ఒక్క రాచవారు మాత్రమే ఆంధ్రుల కీర్తిని నిలువబెట్టిరి. వారు కత్తులతోనే శత్రులపై బడి తాము నిశ్శేషముగా హతమగు వరకు పోరాడి వీరస్వర్గ మలంకరించిరి. (చూ. తంజావూరాంధ్రనాయక చరిత్ర. వు. సీతారామయ్యగారు.)

అట్టి సన్నివేశములలో అనగా తురక క్రైస్తవుల విజృంభణ కాలములో ఆంధ్ర దేశమును రక్షించినది రాజులు కాదు. తత్త్వబోధకులే రక్షించినవారు. దేశమంతటా వేదాంతులు బయలుదేరి గేయాలతో మతావేశమును కలిగించుచు సంఘలోపాలను సంస్కరించుచు వచ్చిరి. అట్టి వారిలో ముఖ్యులు వేమనయోగి, పోతులూరి వీరబ్రహ్మముగారు.

పోతులూరి వీరబ్రహ్మము కమసాలివాడు. క్రీ. శ. ౧౭-వ శతాబ్ద మధ్యమువాడు. కర్నూలులోని పోతులూరను గ్రామవాసి. చిన్నప్పుడు బనగానపల్లెలోని వెంకటరెడ్డి అనువానియింట పసుల గాచినవాడు "ఇతడు విగ్రహారాధనలు, జాతిభేదములు మున్నగువానిని ఖండించి ప్రజలకు హితోపదేశము చేసెను. ఇతడు సంసారి. భార్య గోవిందమ్మ. ఇతని కనేక శిష్యులు గలరు. అందు దూదేకుల సిద్దయ్య అను తురక ముఖ్యశిష్యుడు" (రాళపల్లి అనంతకృష్ణశర్మగారి వేమన)

వేమన జగమెరిగిన వేదాంతి సంఘసంస్కారి. అందరిని తిట్టుచునే నవ్వించి బుద్ధిచెప్పి చక్కని బాటచూపినవాడు. వేమనకాలములో లింగాయతులు, వైష్ణవులు తమతమ మతప్రచారాలు చేసు

కొన్నవారు. ఆ యిరువురిలోని లోపాలను వేమన బయటపెట్టినట్టివాడు.

లింగమతములోన దొంగలుగాబుట్టి
యొకరినొకరు నిందనొనరజేసి
తురకజాతిచేత ధూళియైపోదురు ॥వి॥

తురక మతవ్యాప్తి నిట్లు వేమన వర్ణించెను.

"పసరపు మాంసము బెట్టియు
మసకల సులతాను ముసలిమానుల
జేసెన్

వైష్ణవుల నిట్లు తూలనాడెను

"ఎంబెరుమతమందు నెసగ మాంసముదిని
మారుపేర్లుపెట్టి మధువుద్రావి
వావివరుసదప్పి వలికి పాలౌదురు ॥వి॥

"రంగధామమునకు హంగుగాతానేగి
కల్లుకంపుసొంపు కలిగియుండు"

పై నాలుగుపద్యాలు వేమనవి కావనినా అనుమానము. వేమనపేరుపెట్టి పరస్పరము దూషించుకొన్నవారి హస్తలాఘవముగ కనబడుచున్నది. వేమన క్రీ.శ. ౧౭ వ లేక ౧౮ వ శతాబ్దములో నుండి యుండును.

ఆకాలములోని ఆంధ్రమండలి బ్రాహ్మణుల స్థితిగతులనుగూర్చి వెంకటాధ్వరి తన విశ్వగుణాదర్శమం దిట్లు వ్రాసెను.

"ఈ ఆంధ్రదేశములో ఒక్కొకయూరియందు శూద్రుడు గ్రామాధికారి (యజమానుడు) గాను, వానిప్రక్కన బ్రాహ్మణుడు భృత్యుడై గణకవృత్తిని (కరణముపనిని) అవలంబించినాడు. నీరులేనిచోట తటాకమువలె వేదాధ్యాపకు డొక్కడే ఉన్నను ఇక్కడ వాడు మురికిపాత్రలుతో మొసిపనిలో నియమింపబడియున్నాడు" ఈ వాక్యములవల్ల ఆకాలములో రెడ్డి కమ్మ మున్నగు జాతులవారు గ్రామాధికారులని ఆరువేలనియోగులు వారికి లోబడినవారై కరణీకాలు చేయుచుండిరనియూ, వైదికబ్రాహ్మణులు (ఇప్పటి మంథెనలోని పలువురివలె) వంటలు చేయుచు జీవించుచుండిరనియు కవి అభిప్రాయముగా కనబడుచున్నది.

"ఆంధ్రదేశస్థులగు బ్రాహ్మణులు యజ్ఞాలు చేయరు. వేదాలు చదువరు. అయినా ఈ దేశములో దేవతాభక్తి, బ్రాహ్మణపోషణ బాగాకలదు" అనియు "ఇక్కడి బ్రాహ్మణులు గోదావరీ స్నానముచేసి ఇసుక లింగములలో శివుని ధ్యానించి తిలాక్షతసుమములతోను బిల్వపత్రిలతోను పూజలు సేతురు" అనియు "గోదావరీతీర బ్రాహ్మణులు శివపూజలు చేసి వేదాధ్యయనముచేసి పరిశుద్ధులైన వారనియు" "కృష్ణ గోదావరీ మధ్య దేశవాసులగు వైదికులు యజ్ఞయాగాలుచేసి ఉత్తమజీవితముల గడుపుచున్నారనియు" అతడు వర్ణించియున్నాడు.

వెంకటాధ్వరి కాలమువరకే ఇంగ్లీషువారు మద్రాసులో బలపడి తమ వ్యాపారమును బాగుగ వృద్ధిచేసి తమ అధీనములో నున్న మద్రాసుతో న్యాయస్థాన మేర్పాటుచేసిన ముచ్చటను అతడు ఇట్లు వర్ణించాడు.

"తిరువళిక్కేణి ప్రసిద్ధమగు క్షేత్రము. దానిని పార్థసారథీ క్షేత్రమనిరి. దానినే కైరవిణి (తెల్లకలువకొలను) అన్నారు. (బహుశః అప్పుడు పార్థసారథి కొలనులో తెల్లకలువ లుండెనేమో? ఇప్పుడు అందు నాచు, పురుగుక్రిములు నిండి యున్నవి). తిరువళిక్కేణిలో ఇంగ్లీషువారి ప్రాబల్యముండెను" హూణులు అనగా ఇంగ్లీషువారిలో ఒడ్డగుణా లేవనగా

"హూణాః కరుణాహీనాః
తృణవద్బ్రాహ్మణగణం న గణయంతి
తేషాం దోషాః పారే వాచాం
యే నాచరంతి శౌచమపి"

ఇంగ్లీషువారిలో కరుణయే కానరాదు. బ్రాహ్మణులనైతే వారు గడ్డిపోచలవలె చులకనగా చూతురు, వారి దోషాలు చెప్ప నలవికావు. వారు శౌచమునైనా చేయరు, అని పై శ్లోక భావము. ఇప్పటికినీ ఇంగ్లీషువారును తక్కిన తెల్లవారును కాలకృత్యముల తీర్చుకొన్నతర్వాత జల ప్రక్షాళనము చేసుకొనువారు కారు.

"శౌచత్యాగిషు హూణకాదిషు
ధనం, శిష్టేషు చ క్లిష్టతాం"

అట్టి శౌచరహితులగు ఇంగ్లీషువారికి సంపన్నతనిచ్చిన హత విధిని అతడు దూరినాడు.

ఇక ఇంగ్లీషువారిలోని మంచిగుణాల నిట్లు వర్ణించినాడు. "ఈ హూణులు పరుల సొత్తులను కోరక, అబద్ధములాడక, అద్భుతములగు వస్తువులను సిద్ధముచేసి అమ్ముకొనువారు, తప్పుచేసినవారిని విచారించి శిక్షించుచున్నారు."

అయితే వెంకటాధ్వరి యీకాలములో ఉండినట్లయితే తమ సామ్రాజ్య స్థిరతకై ప్రచారముచేయు వీరిని "పరుల సొత్తులను అన్యాయముగ బలాత్కరించి వీరు తీసికొనరు, అబద్ధాలు ఆడరు" అని వ్రాసి యుండునో లేదో?

అడిదము సూరకవి క్రీ. శ. ౧౭౫౦ కి లోపలివాడని అందురు. అతని కాలములో ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు, తురకలు దేశమందు అల్లకల్లోలములుచేసిరని కవి యిట్లు చాటువును రచించెను.

"పచ్చిమాంసము కల్లుఁ భక్షించి మత్తెక్కి
రాణించి తిరుగు పరాసులైన
గంజాయి గుండ హుక్కా లుడికెడినీళ్ళు
త్రాగి ప్రమాన్పడెడు తురుష్కులైన
గోవుల పడమొత్తి కోసి ముక్కలు మెక్కు
సమహాంధులగు కొండసవరులైన
తెరవాట్లు కొట్టి కత్తెరదొంగలై చాల
పాలించి తిరుగు చండాలురైన
... ... ... ...
ఘాతుకత్వంబు సేయు ముష్కరులుగలరె

ఆ కాలములో గట్టి కేంద్రరాజ్యము లేక తెనుగుదేశము చిల్లర పాళెగాండ్ర వశమయ్యెను. వారును పరరాజుల సామంతులైరి. ఇంగ్లీషు ఫ్రెంచి ముస్లి

ములు రాజ్యాలకై పోట్లాడుచుండిరి.అందు చేత దేశమంతయు అరాచకమై బంది పోటు దొంగతనాలు ఎక్కువయ్యెను. ౧౬౦౦ క్రీ.శ. ప్రాంతాన వాసిరెడ్డి వెంక టాద్రినాయుడు అను ప్రభువు అమరా వతిలో చిన్నరాజ్యమేలెను. మహాదాత యనియు శూరుడనియు ఖ్యాతిగాంచెను. "అటునుండి కొట్టుకరా" అనే సామెత ఇతనినుండే పుట్టినదట. "ఆ కాలమందు దారి దోపుడుగాండ్రు మెండుగా ఉండిరట. అనేకుల ప్రాణధనముల గొనుచు ప్రజలకు మిక్కిలి పీడ కలిగించుచున్న యాదొంగ లను బహుప్రయత్నమున వెంకటాద్రి నాయుడు నూర్గురను పట్టి తెప్పించి వరు సగా నిలువబెట్టి తలలు నరుక తలారుల కాజ్ఞ యిచ్చెనట, ఒక కొననుండి నరుక ప్రారంభింపబోగా నచ్చటివాండ్రు అటు నుండి కొట్టుకొనుచు రమ్మని కోరిరట. కొందరి నరికిన తర్వాతనేని జాలి వొడ మక పోదని తలచిరి. కాని నాయుడుగారు అందరిని నరికించి ప్రజలకు చోరభీతి మాన్పిరట." (చాటుపద్యమణిమంజరి)

మనము సమీక్షించు కాలములో ఆంధ్రులవేషా లెట్లుండెనను విషయము మనకంతగా తెలియకున్నను ఈ నాడు మారుమూలలలోనుండే ముసలివారికి 300ల ఏండ్లక్రిందటి వారికీ అంతిభేదము లేకుండె నని చెప్పవచ్చును. ఇప్పుడు క్రాపులు, జుట్లు, అంగీలు, కోట్లు, సెల్లాలు టోపీలు ఎక్కువైనవి. ఆకాలములో పురు షులు విశేషముగా గుండురుమాలనో లేక వంకరపాగల (షమ్లావంటి చుంగు కల మెలికల లపేటాల) నో కట్టుకొను చుండిరి. అంగీలు చాల తక్కువ కాని అవి ఆచారములోనికి వచ్చియుండెను. బొందెలముళ్ళు ౬ తావుల వేసి అంగీలు తొడుగుచుండిరి. వాటినే బారాబందీ అనిరి. అది అపభ్రంశమై బాదరబందీ అయ్యెను. తరువాత నాలుగు తావుల ముళ్ళు వేయసాగిరి. కాని బారాబందీ పద మట్లే నిలచెను. జనసామాన్యము మోటుదుప్పటి మాత్రమే కప్పుకొనుచుం డెను. పురుషులకు చెవులకు పోగులుండుట సర్వసాధారణము. అందులో ధనికులగు వారు చెవుల పైభాగములో కూడా ముత్యాలతో లేక రత్నాలతోకూడిన పోగులను ధరించువారు. చాలామంది దండకడెములను ధరించేవారు. వేమన పలుమారు లిట్లు వ్రాసియున్నాడు.

తలను పాగ, పైని తగుపచ్చడము,బొజ్జ
చెవుల పోగు లరసి చేరునర్థి
శుద్ధపశువులనుచు బుద్ధిలో నరయక ॥వి॥
పాగ పచ్చడంబు పైకి కూసంబును
పోగు లుంగరములు బొజ్జకడుపు
కలిగి నట్టివాని కందురు చుట్టాలు ॥వి॥

వేమనకాలములోని కొన్ని సాంఘిక జీవితవిశేషములు అతని పద్యాలవల్ల స్ఫురిస్తున్నవి.

"గజపతింటనెన్న గవ్వలు చెల్లవా" అన్నాడు. గవ్వలుకూడా నాణెముగా నుండెను. "గవ్వ సేయనివాడు" అని పరమ

నీచునికొఱకందరకే తెనుగులోసామెత యున్నది.

"ఆశచేత ధనము నార్జింపగానేల
మట్టిక్రిందబెట్టి మరువనేల"

ఇనుపపెట్టెలు బ్యాంకులు లేనికాలములో భూమిలోనే ధనము పాతిపెట్టే ఆచారముండెను.

ఊసరవెల్లి పిచ్చియుపమానపు సమానను
చేర్చినూరి సతులు చెలువముగను
వశ్యమగును మగని వరియించి పెట్టంగ
రోగ మమరిసిల్లరూఢివేమ॥

నేటికిని "మరులుమందు" నా పిల్లని భర్తలకు భార్యలు కొందరు పెట్టుటయు ఆ మందుతో ఆభర్తలు చచ్చుటయు వినుచున్నాము. (కాని పై పద్యము వేమనది కాదని శైలియే తెల్పుచున్నది.)

నేయిలేనికూడు నీరసకనది
కూరలేనితిండి కుక్కతిండి.

నేయి, కూర ముఖ్యముగ జనుల భోజనములో చేరియుండెను.

నాగుబాముగన్న నంబిబ్రాహ్మణుగన్న
చెవులపిల్లిగన్న చేటువచ్చు
గరుడుని గనుగొన్న గలుగును కోరికల్॥వి

ఇప్పటికినీ జనులలో అవే విశ్వాసాలున్నవి (కాని మూఢవిశ్వాసాలను ఖండించిన వేమన ఈ పద్యము వ్రాసియుండడు)

"మండమోపికేల ముత్యాలపావట" అనుటచే సంపన్నులగు ముత్తైయిదువలు పావటలో ముత్యాల సరము నుంచుకొనుచుండిరనవచ్చును.

"వేమన, బసివిరాండ్రను పలుమారు పేర్కొనెను. బసవశబ్దము వృషభశబ్దముకన్నడము. ఇంటిలో ఒక కూతురు బిడ్డను వివాహముచేయక పతిబట్టి కొందఱు [illegible] కలదు. వారి [illegible] వృత్తిచే [illegible]. [illegible] బసివిజనము పేరుకల్గినది, [illegible] [illegible] గౌరవమును ఈ [illegible] [illegible] లో [illegible] [illegible] ఘంసల [illegible]" ( [illegible] — వేమన )

వేమన [illegible] [illegible] వ్రాయుట విశేషముగా నుండనట్లు కానవచ్చును. "చిత్రగుప్త ప్రతినైపడి చిత్రమున్నను గల మడిచి చింతరబుద్ధిన్" అని వర్ణించెను. మరియు

"ఇంగిలీక మహిమ హేమంపనేక
చిత్రపటము వ్రాసి చెరిచినారు"

అని వ్రాసెను, ఇంగిలీకాన్ని చిత్రరువులు రంగులకు వాడినారు. వేమనకాలములోనిఆయుర్వేద దేశీయవైద్యమెట్లుసాగెనో కొంతకొంత జాడ కానవచ్చుచున్నది.

కుక్కగఱచెనేని కూయనీయకపట్టి
వ్రక్క విరుగదన్ని వండబెట్టి
నిమ్మకాయదెచ్చి నెత్తినరుద్దిన
కుక్కవిషము దిగును కుదురువేమ.

తందానకథలను జంగముకథలనీ బుర్ర కథలనీ అందురు. ఆకథలు జనులకత్యంత ప్రీతికరములై యుండెను.

ఇంటిని తిమ్మరాజుకత, యింటిని యార్ల
కథా ప్రసంగముల్
ఇంటిని పాడులాలి, యుబమింటిని
నాయకురాలి శౌర్యమ
ప్పంటికి సందివాక్యముల పాండుచరిత్రల
నాను భాగ్యమే
న్నింటికి గల్గునో యనుసవజ్ఞాను
మూర్ఖుడు చంద్రశేఖరా॥

(యార్లకథ = సిరులకథ నాయకురాలి శౌర్యము = పల్నాటివీరులు సుద్దులలో ఆర్వెల్లి నాయకురాలి చరిత్ర) పల్లె జనులకు బయలునాటకాలు మరొక ఆనందకర మగు వినోదము. విశేషముగా భాగవత కథలను ప్రదర్శిస్తూ ఉండినందున నాటకాలాడువారిని భాగోతులు (భాగవతులు) అని అనుచుండిరి.

రాతిరి నూస్తిమెసబూలు రమ్మనుగా
గురులాన, మొన్న భా
గోతుల సత్తెభామ, యున పాడెని
కాసము లెల్లనీసె, మా
పాతకురాలు రాధ, పలపచ్చము
గుక్మిణిసుద్ది కిష్టమం
టీ తెరుగానడంచు వచియించును
మూర్ఖుడు చంద్రశేఖరా॥

"దస్తుగ మొన్ననే బురళదాసళ చేత
గడించి నాట్యమాడి స్తిసి"

అనుటచేత దాసళ్లే ఎక్కువగా బయలు నాటకాలాడుచుండిరని తోచుచున్నది.

నాటికిని నేటికిని జాతర లనగా పల్లె జనులకు చాల వేడుక.

"ఇరిదిగసూస్తి తీరతము లెన్ననో,
ఆపనగొండ గంగజా
తరపిరిరావు, పంబలను తప్పెటలున్
గోము గాండ్ల సిండ్లసం
బరములిడెల్లు బుంగొక పశావసు
రంకుల రాటమెక్కినే
తిరిగిన నాటిరావు నుతింపను
మూర్ఖుడు చంద్రశేఖరా॥

జాతరల్లో నేటికిని పై రెండు వేడుకలు జరుగును.

ఆకాలమున ఓనమాలు, ఎక్కాలు బాలగుణితము ఇసుకలో దిద్దించి చెప్పించుచుండిరి. నేటికిని నాటి బాడులు పెక్కు పల్లెలలో కలవు. పెద్ద వ్రాయడము నేర్చినపిమ్మట పలక పట్టించేవారు. తర్వాత భాగవతపు భాగాలు చదివించేవారు. ఆముక్కలనే కవి యిట్లు వర్ణించినాడు :

చన్న సదించె బాబు సినవాడు,
అమాసక భాగతంబురా
మాన్నము, బారతంబును, తిమామును
కిందివి ముందెవచ్చె, నే
ళ్ళనదుండగానె, బవ్వయెత్తును
నోరిక బాపనాండ్లు నా
కన్నను లొజ్జటంద్రు, పలుగాకులు
మూర్ఖులు చంద్రశేఖరా॥

(కిందివి ముందెవచ్చె = నేలపై ఇసుకలో నేర్చుకొను చదువు ముందుగానే వచ్చెను)

బడికాలము తెల్లవారు జామునుండియే చీకటి యుండగానే ప్రారంభమయ్యెడిది. గురువువద్ద బరిగనో కోడనో ఉండెడిది. మొదట వచ్చినవాని చేతిలో ఆ యాయుధముతోనే వ్రాసిపంపెడి. రెండవవాని చేతిలో ఆయుధమును ఊరక తాకించి (చుక్కపెట్టి) పంపెడి. మూడవ వానికి ఒక దెబ్బ, నాల్గవవానికి రెండు ఈప్రకారముగా ఆలస్యముగా వచ్చినవారికి శిక్ష యిచ్చేవారు.

"దలిము సఖాంకురాళినల చేడియ సైకముగాను చుక్కిడన్"

అని విజయవిలాసములో చేమకూర వెంకటకవి సూచించినాడు.

వర్షమునకు ఎండకు గొడుగులు పట్టుకొనుట ఆకాలమందు కానవచ్చున్నది. కాని ఇపటి బట్టగొడుగులు కానవచ్చవు. నేటికిని తిరువాన్కూరులో, కొచ్చినులో వెదురుకట్టెకు తాటియాకులను గుండ్రముగా ఛత్రివలె కట్టి వాడుదురు. వాటిని కోడే అందురు. ఆ పదమే మన గొడుగు పదమనుటలో సందేహము లేదు అయితే బట్ట ఛత్రీల వాడుక మన పూర్వీకులకు తెలియుదని కాదు. దేవతావిగ్రహములను ఊరేగింపు కాలములోను, రాజుల ఊరేగింపు కాలములోను రెండుగజాల పొడవుకట్టెకు రంగుల పట్టుబట్టలతో ఛత్రీలనుగా కట్టి వాడుచుండిరి. క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతపు వాడగు భాస్కరశతకకారుడు ఇట్లు వ్రాసినాడు.

కులమున నక్కడక్కడ నకుంఠిత
ధార్మికు డొక్కడొక్కడే
కలిగెడు గాక పెంపెంపున గల్గనేరదు
చెట్టుచెట్టునన్
గలుగక నేర్చునే గొడుగు కాములు
చూడగ, నాకనాక నిం
పలరగ నొక్కటొక్కటి వచుంబున
జేయదు గాక భాస్కరా.

ఆకాలపు జనుల వేడుకలలో తోలుబొమ్మలాట ఒకటి.

ద్విపదప్రబంధాలు, వివిధములగు పాటలు, తోలుబొమ్మలాటలు, మన దేశమున వానిలో [illegible] మొదటినుండియు ఉండినట్టివిగా కనబడు[illegible]. చాల ప్రాచీనుడగు పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్యచరిత్ర[illegible] ఇట్లు వ్రాసినాడు:

'భ్రమరాలుజాళియల్ బహునటనముల్ మెఱసి
రమణ పంచాంగ పేరణి యాడువారు
ప్రథమపురాతన పటుచరిత్రములు
క్రమము మెరయ బహునాటకము లాడువారు

◆ ◆ ◆

అమరాంగనలు దివినాడెడునాడ్కి
నమరంగ గడలపై నాడెడువారు
ఆవియద్గతి యక్షులాడెడునట్టి
భావన మ్రోకులపై నాడువారు
భారతాదికథలు చీరమరుగుల
నారంగ బొమ్మల నాడించువారు
నాదట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాత్రల నాడించువారు

భాస్కరశతకకారు డెవ్వడో తెలియదు. అతని కాలములోను తోలుబొమ్మలాట వ్యాప్తిలో ఉండినది.

"ఇంచుక నేర్పుచాలక విహీనత
జెందిన నాకవిత్వమున్
మించు వహించు నీకతన
మిక్కిలి యెట్లన తోలుబొమ్మలన్
మంచి వివేకి వాని తెరమాటున
నుండి ప్రశస్తరీతి నా
డించిన నాడవే జనుల డెందము
సంపద ప్రీతి భాస్కరా."

భాస్కరశతకమును జంటకవులు రచించిరని కొందరు విమర్శకులు వ్రాసినారు. ఈ పద్యములో "నాకవిత్వము" అన్న మాటతో ఆకథ యెగిరిపోయినది.

తెనుగుదేశములో మరొక వినోద విశిష్టత కానవచ్చుచున్నది. అది విప్రవినోదము అనునట్టిది. ఒకజాతి బ్రాహ్మణులు ఏదో క్షుద్రదేవతోపాసన వలననో మంత్ర తంత్రాల వలననో చిత్రమగు గారడీ చేయుదురు. ఇప్పటికినీ ఆ వినోధము చేయు విప్రులున్నారు. గుంటుపల్లి ముత్తరాజు అను సర్దారు గోలకొండ సుల్తానుల తుదికాలములో ఉండెను. అతనిగూర్చి యొక చాటువిట్లున్నది.

"సంతత మారగించు నెడ స
జ్జనకోటుల పూజసేయు శ్రీ
మంతుడు గుంటుపల్లికుల మంత్రి శి
ఖామణి ముత్తమంత్రి దా
బంతియె బంతిగాక కడుపంద గు
లాముల బంతులెల్ల నూల్
బంతులు, దుక్కిటెడ్ల మెడబం
తులు, విప్రవినోదిగారడీ
బంతులు, దొంగవాండ్ర ములుబం
తులు సుమ్మి ధరాతలంబునన్"

క్రీ.శ. 1200 తర్వాత తెనుగుదేశములో భూవ్యవహారమంతా మహారాష్ట్ర పద్ధతిపై సాగినట్లున్నది. ఒక చాటు విట్లున్నది.

గురు యశశ్యాల యనునట్టి గుంటుపల్లి
మంత్రి నరసింగనామ సన్మందిరమున
ఒక్కనాటి వ్యయంబగు నెక్కినట్టి
దేశపాండ్యాల యొకనేటి ప్రాశనంబు

దేశముఖు దేశపాండ్యాల నియామకము మహారాష్ట్ర పద్ధతియే.

పెమ్మయ సింగరాజు అనునతడు ప్రౌఢదేవరాయల నాటివాడని యందురు. ఉండవచ్చును. ఎందుకనగా అతని కాలమునాటికి మన హిందూస్థానములో మిరపకాయలు నెగడలేదు. వాటిని క్రీ.శ. 1600 ప్రాంతములో అమెరికానుండి తెచ్చి మనప్రాంతములో నెగిడించిరి.

పెమ్మయ సింగరాజును గూర్చి ఒక చాటు విట్లున్నది.

"మిరియములేని కూరయును
మెచ్చునెరుంగనివాని యీవియున్"

ఈవిషయమునుబట్టికూడా క్రీ.శ.౧౬౦౦ తర్వాత మిరపకాయలు మన దేశములో వ్యాపించెనని తెలియగలదు.

తెనుగు దేశములో కొంత భాగము సముద్రతీరమందుండుటచేత ప్రాచీనము నుండియు గొప్ప వ్యాపారము జరుగుచునుండెను. కాని మన సమీపకాలములో దేశము అరాచకమైనందున వ్యాపారమునకు రక్షణ లేకుండెను. గోలకొండ రాజ్యము పడిపోయెను. కర్నూలు కడపలలో అఫ్గన్ నవాబులు రాజ్యము చేసిరి. ఉత్తర సర్కారులలో ఇంగ్లీషు, ఫ్రెంచివారు వ్యాపారముతో పాటు యుద్ధాలుకూడ చేయుచుండిరి. తెల్లవారు వ్యాపారముచేసినచోట మన దేశ వ్యాపారము నాటికిని నేటికిని ముందుపడుట లేదుకదా!

క్రీ.శ. ౧౬౧౧లో ఇంగ్లీషువారు మచిలీబందరులో ఒక ఫ్యాక్టరీ పెట్టిరి. అప్పుడు మచిలీబందరు బట్టలు చాలా ప్రసిద్ధికెక్కియుండెను ఇంగ్లీషులోని మస్లిన్ పదము మచిలీనుండియే వచ్చెను. గోలకొండ రాజ్యమున్నప్పుడు అక్కన్న మాదన్నల నాశ్రయించి వారికి నజరానాలిచ్చి బహుమానాలిచ్చి ఇంగ్లీషువారు మదరాసులో వ్యాపారము సాగించుచుండిరి. గోలకొండ పడిపోగానే ఔరంగజేబునుండి "చెన్నపట్టణము"లో, మసూలాలో, మోటుపల్లిలో విశాఖపట్టణములోను మన తెనుగుతీరపు మరికొన్ని స్థలాలలోను కొలు పద్ధతిపై వ్యాపారము చేసికొనుటకు సెలవుపొందిరి.

తెనుగు సీమ మొత్తము భారతదేశములో వజ్రాలగనియని ప్రఖ్యాతి పొందెను. గోలకొండ రత్నాలు అని యూరోపు నందంతటను మారుమ్రోగిపోయెను. కాని నిజముగా గోలకొండ పట్టణముచుట్టును ఎక్కడా రత్నాలు లేకుండెను. గోలకొండనుండి దక్షిణముగా అయిదు దినాలు ప్రయాణము చేసినచో కృష్ణాతీరములో రావులకొండ అనే తావున వజ్రాలగని యుండెనని ఆకాలమందు సంచారముచేసిన టావర్నియర్ అనే తెల్లవాడు వ్రాసినాడు. అప్పుడందు ౬౦౦౦౦ మంది గనిలో పనిచేయుచుండిరనియు వ్రాసినాడు. కృష్ణాతీరములో కొల్లూరు అనేతావున రత్నాలగనిని క్రీ. శ. ౧౫౬౫లో కనిపెట్టిరి. అక్కడనే కోహినూరు వజ్రముదొరికెను. ఈ కొల్లూరు ప్రఖ్యాతి ఎక్కువై ఒక శతాబ్దములోనే అచ్చటి గనులు మూతబడెను. అప్పటి వైభవమును తర్వాత శైథిల్యమునుగూర్చి జనులలో ఒక చిత్రమగు కత బయలుదేరెను. "కొల్లూరు పట్నము వలె వెలిగిపోయింది" అని సామెతగా అనెదరు. దానిపై పుట్టినకథ యేమనగా—

కొల్లూరు పట్టణములో ఒక దేవుడు వెలిసెను. ప్రతిజనుడు ధాన్యమును చిన మాత్రములో తెచ్చి ఆ దేవతా విగ్రహముపై వేసిన అవన్నీ రత్నాలై, రవ్వలవుతుండెనట. అందరును అక్రియను చేయుచు మేడలుకట్టిరి. ఆపట్టణములో ఒక పేద బాపనుండెను. అందరివలె

సేవను చేసి సుఖపడరాదా అని అతని భార్య తొందరపెట్టుచునుండెను. ఏమైనను కానీ నేనా తుచ్ఛపుపనిచేసి అపచారము చేయనని ఆ శిష్టుడనుచుండెను. ఒకనాటి మధ్యరాత్రి మరొక వృద్ధబ్రాహ్మణుడా పేద బాపని కుటుంబసహితముగా పట్టణము బయటకు పిలుచుకొనిపోయి అదిగో కొల్లూరు పట్టణ వైభవముచూడు అని ధగద్ధగితముగా మండుచుండే పట్టణమును వారికి చూపి మాయమయ్యెనట. అది కొల్లూరు పట్టణంపలె వెలిగినది అనేకథ. ఆకథ నిజముగా ఈ వజ్రాలగనికి సంబంధించినదని పైవనే కనబడుచున్నది.

హైదరాబాదునుంచి మచిలీబందరుకు పొయ్యేదు మార్గములోని పరిటేల (Partial) కలదు. అది బంబరునుండి ౫౦ మైళ్ల దూరములో కలదు. అందుకు ఉస్తిపల్లి జగ్గయ్యపేటలలోను రత్నాల గనులుండెను. హైద్రాబాదు నగరమునకు 30 మైళ్ల దూరములో మంపాబాదుకు ౨౦ మైళ్ల దూరములోను ఉన్నసర్కారులో "నిజాంరత్నం" అనునది దొరికెను. అది ౩౭౫ క్యారట్లు తూకముది. దానివెల ౨ లక్షల ౨౦ వేల పౌనులు. పై ప్రదేశాలలో కాక కర్నూలు జిల్లాలోని రామళ్లకోటలో రవ్వలు దొరకుచుండెను. రవ్వలకోటయే రామళ్ళకోట అని యయ్యెను. రాయల సీమలో వజ్రకరూరు అను గ్రామము కలదు. అందుకూడా వజ్రాలు దొరుకుచుండెను. నేటికిని అచ్చట పలువురు వర్షాలు కురిసినవెంటనే వరదపారిపోయిన తావులందు రత్నాలకై వెదకుచుందురు. వారి కప్పుడప్పుడు రత్నాలు దొరుకుచునే ఉండును. ఇప్పుడీ ప్రదేశాలలో నెచ్చటను గనులు త్రవ్వుటలేదు.

వేణుగోపాలశతక కాల మేదో తెలియదు. అది క్రీ. శ. ౧౬౫౦ ప్రాంతమున రచితమైనట్లు దానిలో ఉరుదుమాటలు సూచించును. దాని సహాయమున అప్పటి కొన్ని యాచారములను గుర్తించవచ్చును. "పూటకూళ్ళమ్మకు పుణ్యమేల" అనుటచే పూటకూళ్ళు ఆనాటికే వ్యాపించియుండెను, ప్రతాపరుద్రుని కాలములో (క్రీ.శ. ౧300 లో) పూటకూళ్ళుండినవ్వుడు 300 ఏండ్ల క్రిందట ఉండుట మాశ్చర్యముకాదు.

అవనీశ్వరుడు ముందుడయిన నరులకిత్యా
వద్దిబి వద్ద దివాను చెప్పు
మునిషియొకడు చెప్పు బకిషియొకడు చెప్పు
తిరువాతినా ముజందారు చెప్పు
తిలద్రిప్పుచును శిరస్తా చెప్పువెంటనె
కేలుమొగిడ్చి వకీలు చెప్పు
దేశపాండ్యా తాను తినవలెనని చెప్పు
ముతసద్ది చెవిలోన మొనసిచెప్పు

పై పదాలనుబట్టి నవాబుల ప్రభుత్వము బాగా తెనుగు సీమలో పాదుకొన్న తర్వాత యీ శతకము రచితమయ్యెనవి తెలియరాగలదు. ఈ శతక కారుడు భట్టరాచార్యులు. వాళ్ళపాన

చిన్నన్నను తిట్టినందున వారి సమకాలికు డగును కాన క్రీ. శ. ౧౬౫౦ ప్రాంతము వాడై యుండును. తన కాలపు తెనుగు క్షత్రియులనువర్ణించినాడు. వారు రాజులు అంచవారు అయియుందురు.

కొండసిగల్ తలగుడ్డలు పాకోళ్ళు
చలువ వస్త్రములు బొజ్జలు కఠార్లు
కాసెకోకలు గంపెడేసి జందెములును
గలవారు జలతారు డాలువార్లు
సన్నపు తిరుచూర్ణ చిన్నెలు కట్ణాలు
జొల్లుపీడెములును వల్లెవాటు
దాడీలు వెదురాకు తరహాసొగసుకోర్లు
సంతకు దొరగార్ల టంచుపేర్లు
సమరముజొచ్చి రోమ్మున గాయమునకోర్చి
శాత్రవుల ద్రుంచనేరని క్షత్రియులకు
నేలగాల్పన యావట్టి యెమ్మెలెల్ల ॥మదన॥
వంకరపాగలు వంపుముచ్చెలజోళ్ళు
చెవిసందు కలములు చేరుమాళ్ళు
మీగాళ్ళపైపింజె బాగైనదోవతుల్
జిగితరంబుగను వార్సిమొహార్లు
చేపలవలెను పుస్తీయాసముల్ కలం
దాన్ పెట్టెయును పెద్ద దస్త్రములును
సొగసుగా దొరవద్ద తగినట్లు కూర్చుండి
రచ్చగాండ్రకు సిఫారసులు జేసి
కవిభటులకార్యము లనువిఘ్నములు చేయు
రాయకాల్పిండములు తినువాయసాలు ॥మ

ఆ కాలములోని కొన్ని కులాలను ఆ కులాల నాశ్రయించి బ్రదుకు మరి కొన్ని కులాలను అడిదము సూరకవి తన రామలింగేశ శతకములో ఇట్లు వర్ణించి నాడు:

జంగాలపాలు దేవాంగుల విత్తంబు
కాపువిత్తము పంబకానిపాలు
బలిజీలవిత్తంబు పట్టెపాసరిపాలు
గొల్లవిత్తము పిచ్చుగుంటిపాలు
వ్యాపారి విత్తంబు వారకాంతలపాలు
కల్లువి త్తము రుంజకానిపాలు
పరజాలపాల్ శిష్టకరణాలసొమ్మ, ఘూ
ర్జరుల విత్తంబు తస్కరులపాలు
కవులకీగలజాతి యొక్కటియు లేదు
వితరణము వైశ్యులకు పెండ్లి వేళగలదు
కొంగుబరచిరి నృపతులా కూటికొరకు
రామలింగేశ రామచంద్రపురనివాస

(పంబకాడు=కొమ్ముశవట్టుమాల? కల్లు? రుంజకాడు = బవనీడు అనుమాల ? పర జాలు=పక్షులు?

అడిదము సూరకవి కాలముపరకే పూర్వాచారాలు మాసిపోవుచు వచ్చె నని కవి యిట్లు వాపోయినాడు :

అగ్రహారములు నామావశిష్టములయ్యె
మాన్యంబులన్నియు మంటగలిసె
భత్యంబునకు దొంటి పసికట్టుతప్పెను
బుధజనంబుల రాకపోకలుడిగె
వర్షాశనంబులు వరదపాలై పోయె
మలవతీలనుప్రజల్ మాసిచనిరి
నశియించిపోయె వంటరులు తురుష్కులు
గజతురంగములు తాకట్టువడియె
ధార్మికస్థానమున కిట్టి తళ్ళుబుట్టె
కఠినచిత్తుని రాజ్యాధికారి జేసి
యింతపీడించితివి సత్కవీంద్రకోటి ॥రా॥

క్రీ.శ. ౧౬౦౦ నుండి ఆంధ్రుల రాజకీయ పతన మయ్యెనని చెప్పవచ్చును. దక్షిణములో రఘునాధరాయుల కాలములో (౧౬౧౪-౧౬౩౩) తంజావూరులో ఆంధ్రుల గొప్పదనము నిలిచియుండెను. అతని కాలములో తెనుగువారిపై మహమ్మదీయుల ఆక్రమములు కాని, యుద్ధాలు కానీ సాగనేరకపోయెను. వారిని రఘునాధుడు ఓడించి ఆంధ్రుల సృష్టిని (culture) మరికొంతకాలము నిలిపెను.

అతని కాలములో దక్షిణమున తెనుగు యక్షగానాలు చాల వృద్ధికి వచ్చెను. నాటకాలు, నాట్యకళ, సంగీతకళ ప్రశస్తికెక్కెను. ఇతని ప్రాంతాలలో తెలుగువారు తమపూర్వులు నిర్మించిన శిల్పాలను కోలుపోయిరి కాని తంజావూరులో ప్రాతవి నిలుపుటయేకాక రఘునాధరాయులు చక్కని శిల్పసౌందర్యముకల దేవాలయాలను, రాజభవనాలను, కోటలను నిర్మింపజేసెను. ఆంధ్ర సరస్వతి ముత్యాల శాలలో అచ్చట నాట్యమాడెను. ఈ విధముగా సంగీతాలు, కవిత్వాలు, శిల్పము తంజావూరులో వృద్ధిపొందెను. కాని అతని కుమారుని రాజ్యకాలములో తంజావూరు స్వాతంత్ర్యముకూడా మట్టిలో కలిసెను.

మన సమీపకాలములో మునల్మానుల నీడలు తెలుగువారిపై బాగుగా పారెను. ఆనాటి కవుల కవితలలో పార్సీ పదా లెక్కువగా మిళితమయ్యెను. క్రీ.శ. ౧౭౦౦ తర్వాత తెనుగువారి పతనము పూర్తి అయ్యెను. అటుతర్వాత చిల్లర పాలెగాండ్లే మనకు మిగిలిరి. వారి దర్జా యెంతటిదో అంతమేరకే మనకళలన్నియు నిలిచిపోయెను.

ఈ విధముగా ఆంధ్రదేశ సాంఘికస్థితి క్రీ. శ. ౧౬౦౦ నుండి ౧౭౫౦ వరకుండెనని స్థూలముగా చెప్పవచ్చును.



# కాళిదాసునాటి భారతదేశము

శ్రీ శిరోమణి చలమచర్ల రంగాచార్యులుగారు

కాళిదాస మహాకవి స్వతంత్ర భారత భూమిపై జన్మించిన భాగ్యశాలి. ఆర్ష ధర్మచ్ఛత్రచ్ఛాయలో మహావైభవము ననుభవించుచు ప్రపంచమునకు మకుటాయమానమై వెలిగిన దానాటి భారతమాత. స్వాతంత్ర్య వాయు తరంగములపై పూలనావ గట్టుకొని స్వైరవిహారములుసల్పిన కాళిదాస కవీంద్రుని భావనా స్వాతంత్ర్యమును, రచనా స్వాతంత్ర్యమును యథాతథముగాఁ దెలిసికొనఁజాలు నిశితదృష్టి యీనాటివారి కలవడుటయు గష్టమే. హిమవన్నగమునుండి కన్యాకుమారివఱకును పూర్వసముద్రమునుండి పశ్చిమ సముద్రమువఱకు వ్యాపించియున్న యఖండ భారతము ఈ కవీశ్వరుని కవితావిలాసములకు రంగస్థలమైనది. కాళిదాసుని కావ్యసౌందర్యమును పుక్కిటిబంట గ్రోలవలెననిన ఆతఁడత్యంత పవిత్రభావముతో, ఉత్సాహముతో వర్ణించుకొనిన భారతీయములైన వివిధ నదీనదములయు, వనపర్వతములయు, నగరాశ్రమములయు సుందరదృశ్యములను సాక్షాత్కరింపఁ జేసికొనవలెను. అతనికి భారత భూగోళ పరిజ్ఞానము మిక్కిలి గాఢముగ నుండెను. భారతీయులకు భూగోళ పరిజ్ఞానము ప్రాచీనకాలము నుండియు గలదు. రామాయణమందును మహాభారతమునందును వర్ణింపఁబడిన దేశములయు, స్థలవిశేషములయు స్థితిని పరిశీలించిన విమర్శకులు వాల్మీకియొక్కయు వ్యాసునియొక్కయు భూగోళ పరిజ్ఞానమునకు నెంతయు నచ్చెరువు నందుచున్నారు. అలగ్జాండరు భారతదేశముపై దండెత్తి వచ్చినపు డాతడు భారత భూగోళమును తన కెఱుకపఱుప గొందఱు భారతీయ విద్వాంసులను గోరెనట. వారు ఆసేతు హిమాచలమును చక్కగా నున్నదున్నట్లు వర్ణించి చెప్పిరట. ఈ విషయమునే కన్నింగ్‌హామ్ అను పాశ్చాత్య విద్వాంసుఁడు హిందూదేశపు ప్రాచీన భూగోళమను గ్రంథమున నిట్లువ్రాసెను:- 'అలగ్జాండరునకు భారత దేశముయొక్క పరిమాణము, స్వరూపములను గూర్చి యంత యథార్థముగా భారతీయ విద్వాంసులు ఆనాఁడే విశదీకరించి చెప్పుటనుబట్టి చూడఁగా తొలినుండియు భారతీయులు

తమ భూగోళము చక్కగా నెఱిఁగినవారని స్పష్టమగుచున్నది. *1

కాళిదాసునాఁటికి భారతదేశము జనసమృద్ధమైనది. పౌరాణిక మహారణ్యములు జనాక్రాంతములై నూతన జనపదములు తలలెత్తినవి. నూతన రాజవంశములు పొడసూపి చిన్నచిన్న రాజ్యములను నెలకొల్పికొనినవి. ఇట్టి చిన్నరాజ్యములనెల్ల సామంతములుగఁ జేసికొని రఘుని యొక్క మహారాజవంశము చక్రవర్తిత్వమును నెఱపినది. ఈ యానాఁటి స్థితినే కాళిదాసు రఘువంశ మహాకావ్యములో రఘుకులమునకు సార్వభౌమత్వము నన్వయించి తచ్చైత్ర యాత్రల ద్వారా ప్రదర్శించెను. ఆకావ్యములోనే యిందుమతీ స్వయంవర సందర్భములోను ఆయాదేశములను తత్పరి పాలకులగు వారిని వర్ణించెను. అంగదేశము, అనూపము, అవంతి, కాళింగము, కాంభోజము, కామరూపము, కేరళము, కోసలము, పాండ్యము, మగధము, మలయము, విదర్భ, శూరసేనము, సుంహము లను దేశములను నాతఁడు పేర్కొనెను.

## కొన్ని యోద్ధృజాతులు

### పారశీకులు *2

భారతదేశముయొక్క పశ్చిమసీమలో పారశీకులుండిరి. వారికి పొడుగుపాటి గడ్డములుండెను. వారికి యశ్వబలము సుప్రసిద్ధము భారతీయ మహావీరుఁడు రఘుమహారాజు వీరిని జయించెను.

### హూణులు

ఉత్తరదిక్కున హూణులుండిరి. వారినే చారిత్రకులు 'Huns' అను జాతివారినిగా గుర్తించుచున్నారు. వీరు జనపదులను క్షత్రియులైనట్లు మల్లినాధసూరి వ్యాఖ్యానించెను. *3 ఆంగ్లేయులను హూణులని నేఁడు మనవారు తప్పుగా వాడుచున్నారు. ప్రాచీనులై కాళిదాసుచేఁ బేర్కొనఁబడిన హూణులు హైందవధర్మావలంబులైయున్నవారు

### కాంభోజులు

ఈహూణులను వారిప్రక్కనేయున్న కాంభోజులను రఘుమహారాజు భుజబలముచే నోడించెను.

*1. 'The clase agreement of the dimensions given by Alexander's informents with the actual size of country is very remarkable and shows that Indians at that early date of their History had a very accurate knowledge of the form and extent of their nature land'

(Ancient Geography of India by Cunningham)

*2. రఘు॰ IV–60–63.

*3. "హూణాః జనపదాఖ్యాః క్షత్రియాః" రఘువంశవ్యాఖ్యసంజీవిని. IV–6

ఉత్సవ సంకేతగణములు

హిమవత్పర్వత ప్రాంతమున ఆనాఁడు కొన్ని యాటవిక యోద్ధృగణము లుండెను. ఉత్సవసంకేతములని ప్రసిద్ధి నొందిన యేడువిధములైన పర్వతీయ గణములు◆4 మహాభారత కాలమున గూడ విఖ్యాతమై యున్నట్లు మల్లినాథ సూరిగారు మహాభారత వాక్యము నుదాహరించెను.

ఈ పర్వతీయగణములను రఘుదైత్రయా ప్రకరణమున కాళిదాసు పేర్కొనెను.

దేశములు

కామరూపదేశము

భారతభూమికి తూర్పున ప్రాగ్జ్యోతిష పురముండెను. అది కామరూప దేశమునకు ముఖ్యపట్టణము. అది నేటి అస్సాం ప్రాంతము. దీనికి కామాఖ్య◆5 దేశమనియు మాఱు పేరుండెను.

లౌహిత్యనది

ఇచట లౌహిత్యయను నదియున్నట్లును ఆనదిని దాటి రఘుచక్రవర్తి ప్రాగ్జ్యోతిష ప్రభువును జయించినట్లును రఘువంశమున వర్ణించెను. ఈ లౌహిత్య నది యేదియో మల్లినాథసూరి వివరించలేదు. ఒకానొక నదియని యూరకుండెను. దానివివరణము వ్యాఖ్యాతృ చక్రవర్తికి తెలియవచ్చినట్లులేదు. కాని కాళిదాసునకు స్పష్టముగా నీనది బ్రహ్మపుత్రయే యని తెలియును. పరశురాముఁడు తల్లిని చంపిన పాపమువలన ఆతని గొడ్డలి గట్టిగా నాతనిచేతి కంటుకొని పోయినదట. ఈ బ్రహ్మపుత్రానదిలో స్నానముచేయగనే పాపవిముక్తి గలిగి యా గొడ్డలియూడి నదిలోఁ బడెనట. రక్తసిక్తమగు నా గండ్రగొడ్డలి పడుటచే నది యెఱ్ఱవడెనట. అప్పటినుండియు నాభాగమునకు లోహిత లేక లౌహిత్య యను వ్యవహారము గలిగినదట◆6. ఈ యైతిహ్యము నెఱింగిన కాళిదాసు బ్రహ్మపుత్రను

చకంపే తీర్ణలౌహిత్యే తస్మిన్
ప్రాగ్జ్యోతిషేశ్వరః
తద్గజాలానతాం ప్రాప్తైః
సహకాలాగరుద్రుమైః రఘు-సIV, శ్లో81

అను పద్యమున లౌహిత్యయని వ్యవహరించెను.

సుంహదేశము

ఉత్తరకోసలములకుఁ దూర్పుగా సుంహదేశమున్నట్లును తాటితోపులతో నిండిన యాదేశము సముద్రమున కనతిదూరమునసే యున్నట్లును ఈకవి వ్రాసెను. ఈ సుంహదేశము నేఁడు వాడుకలో లేదు. చాలకాలము క్రిందటనే యీ వ్యవహా

◆4. 'గణానుత్సవసంకేతా నజయత్సప్తపాండవః' మహాభారతము.

◆5 'Pragjotishapura = Kamarup or Kamakshya in Assam'. See 'The Geographical Dictionary of Ancient and Mediaeval India'; by Nandalal Dey.

◆6 పై నందలాల్ డే గారి 'ప్రాచీన భారత భూగోళ నిఘంటువు' పుట ౧౮

రము విస్మృతమైనట్లున్నది. సుంహశబ్దమును వివరించుచు మన మల్లినాథసూరిగారు 'సుంహాదిశబ్దములు జనపదములను బోధించు పదములనియు, ఆయా జనపదములలో నివసించు క్షత్రియులకు వాచకములుగా ప్రయుక్తములైనవనియు వ్రాసిరి. ♦7 సూరిగారినాటికే సుంహదేశము వ్యవహారమునుండి శిథిలమైనట్లు స్పష్టము. కాని యధునాతన భూగోళశాస్త్రవేత్తలు (Wilson) విల్సన్ పండితుఁడు, ఆర్. సి. దత్తు మున్నగువారు దీనిని గుర్తింపగలిగినారు. సుంహమను దేశము నేఁటి వంగదేశము (బెంగాల్) నందొక భాగము దీని ముఖ్యపట్టణము తామ్రలిప్త లేక తామలిప్త యనునది. ఇదియే దశకుమారచరితమున దామలిప్త యనియు వ్యవహరింపఁబడెను. ఇది హుగ్లినదికి ఉపనదియైన శిలైనదీతీరమున నున్నది. నేఁడీ నగరము 'తమ్లుక్' అని వ్యవహరింపఁబడుచున్నది. ♦8

**కళింగదేశము**

కాళిదాసు ఆంధ్రదేశములో నొక భాగమైన కళింగదేశమును పేర్కొనినాఁడు. ఆంధ్రులు ప్రతాపోదగ్రులని సూచించినాఁడు. గజపతు లను బిరుదు కళింగాంధ్ర రాజులకు చిరకాలముగ నున్నట్లున్నది. కళింగరాజు గజసాధనుఁడై యెదుర్కొనినట్లు కాళిదాసు వచించెను. ఆంధ్రయోధులు యుద్ధవిద్యలో నేర్పరులనియు, వారన్నిటికంటె విలువిద్యలో జేయి తిరిగిన మొనగాండ్రనియు 'ప్రతిజగ్రాహ కాళింగ స్తమస్త్రైర్గజసాధనః' ద్విషాంవిషహ్యా కాకుత్స్థ స్తత్ర నారాచదుర్దినమ్

అను వాక్యములతో మహాకవి ధ్వనింపఁజేసెను. ఆకుతోటలతోను, కొబ్బరితోటలతోను కనులపండువుగా నున్న యాంధ్రసీమ సౌభాగ్యమును స్మరించెను. ♦9 గారుబం రేకులవంటి తమలపాకు దొన్నలలో సైనికులు నారికేళాసవమును జుఱ్ఱు దృశ్యముతో తెలుఁగునేల సస్యశ్యామలమైయున్న నాటిస్థితిని తెలుఁగు ప్రజల సంపత్సమృద్ధిని కాళిదాస మహాకవి యుల్లేఖించెను. వసంతలక్ష్మిని నిత్యావాసములో యున్నట్లు పచ్చని తోటలతో ముచ్చటగొల్పు కోనసీమవంటి ప్రాగాంధ్ర

♦7 'Sumha = has been identified by some authors with Arracan; but it appears from the sixth chapter of Dasakumara Charita Damalipta was the Principal town of Sumha, and according to the Hunakosa, Damalipta was another name of Tamralipta (Tamluk). Hence Sumha was the Country of Tamralipta'. P. 89 G. D. of Nandalal Dey.

♦8 Tamralipta : I. Tamluk on the river Selai, just above its junction with river Hugli. (Wilson)
II. South Bengal (R. C. Dut) P. 93 G. D. by Nandalal Dey.

♦ 9. 'తాంబూలీనాం దళై స్తత్రరచితాపానభూమయః
నారికేళాసవం యోధాః ... పపుః ...'

ములో దిరిగిచూచినట్లు వర్ణించెను. 10

దక్షిణ భారతము

కాళిదాసునాఁటికి దక్షిణ భారతమున నున్న రాజవంశములలో పాండ్యులును, కేరళులును కొంచెము ప్రసిద్ధి కెక్కినట్లున్నారు. వీరైనను పరాక్రమవంతులుగా గన్పట్టరు. తమపైకి దాడివెడలిన శత్రువు నెదుర్కొనిన ట్లైనను లేదు. ఊరక దాసోహముచేసి ముత్తియము లుపగర చేసినట్లు కాళిదాసు వ్రాసెను. ఆ దేశమందు ప్రసిద్ధమైన కావేరీనదిని, తామ్రపర్ణీనదిని పేర్కొనెను. మలయపర్వతమును, మిరియపుపొదలు, ఏలకితీఁగెలు, మంచి గంధపుచెట్లతో నిండి మనోహరముగా నున్న కేరళదేశమును ప్రశంసించెను. దక్షిణ భారతమునఁ బ్రసిద్ధమైన నగరములనుగాని క్షేత్రములనుగాని కాళిదాసు వర్ణింపలేదు. 11

అనూపదేశము

నేఁటి నిజాంరాష్ట్రములోని ఔరంగాబాదు సమీపమునం దుండు కొంత దేశము, మాళ్వదేశములోని ప్రదేశము కొంతయు గలిసి యొక ప్రత్యేక దేశముగా విభక్తమైయుండెను. దానికే యనూపదేశమను వ్యవహారము పూర్వముండెను. దీనిని కార్తవీర్యార్జునుని వంశమువారైన హైహయులు పాలించుచుండిరి.

అంగదేశము

రామాయణకాలమున లోమపాదుఁడును, భారతకాలమున కర్ణుఁడును దీని నేలిరి. దీని రాజధాని చంపాపురి. గంగా సరయూనదుల కూడలి యీదేశమునకు పడమటియెల్ల. భాగల్‌పూరు (బెంగాలులో) నకు చుట్టుపట్టులనుండు దేశమే యంగదేశము.

మగధదేశము

నేఁటి బీహారు రాష్ట్రమే యీ మగధదేశము. ఈ దేశమునకు గిరివ్రజపురము (బౌద్ధుల రాజగృహము నేఁటి రాజ్‌గర్) ప్రాచీన రాజధాని. భారతకాలమున జరాసంధుఁడు దీని నేలెను. పిమ్మట (పాట్నా) దీనికి రాజధాని యయ్యెను.

విదర్భదేశము

నేఁటి బెరారు రాష్ట్రమును, నిజాం రాష్ట్రములోని బీదరు ప్రాంతమును విదర్భదేశమని వ్యవహరింపఁబడుచుండెను. దీనికి కుండినపురము రాజధానిగా నుండెను. విదర్భపుర మనియు దీనికే పేరు. కాళిదాసు ఈ దేశమును క్రథకైశిక దేశమనియు రెండుసారులు వాడెను. 12 కుండినపురమే రుక్మిణి పుట్టిల్లు. రుక్మిణి యాంధ్రుల యాడుబిడ్డ గాఁబోలు! కుండినపురము పిమ్మట కొండాపురముగా

10. ఇందుమతీ స్వయంవర సందర్భమున హేమాంగదుఁడను తెలుఁగురాజును (కళింగదేశాధిపతిని) కాళిదాసు వర్ణించెను. చూ. రఘు. ౬ స. ౫౩-౫౮ శ్లో.

11. పాండ్యదేశమునకు రాజధానిగా ఉరగపురమనుదానిని మాత్రము పేర్కొనెను. నాగపురమని దీనిని మల్లినాథసూరి వివరించెను. రఘు ౬ స. ౫౯ శ్లో.

12. రఘు. ౫ సర్గము ౩౯, ౬౧ శ్లోకములు. V—39, 61.

మాఱినది. ఇది యాంధ్రుల నగరము. ఇటీవల నిజాముప్రభుత్వపు పురాతత్త్వ శాఖవారు త్రవ్వింపగా ప్రాచీనపట్టణము లోని కట్టడములు, ఆంధ్రరాజుల నాణెములు లభించినవి.

## నదులు

కాళిదాసు పేర్కొనిన నదులలో నేఁటికిని ప్రసిద్ధముగా నున్నవి. గంగ, యమున, నర్మద, గోదావరి, కావేరి, తామ్రపర్ణి, బ్రహ్మపుత్ర, సరయు నను నవి. నేఁడు పేరుమాఱి ప్రసిద్ధిని గోల్పోయిన యితర నదులును గొన్ని యా మహాకవిచే స్మరింపఁబడినవి.

౧. సిప్రానది ♦13

ఈనదీ తీరముననే సుప్రసిద్ధమైన యుజ్జయినీ పట్టణ ముండెను. పుణ్యక్షేత్రముగాఁ గీర్తింపఁబడిన మహాకాళము దీని తీరముననే యుండెను. ఈనది మేఘసందేశమునను, రఘువంశమునను బేర్కొనఁబడెను.

౨. మాలిని

అయోధ్యానగరమునకు ఏఁబదిమైళ్లలో నున్నది. ఈనదీతీరముననే కణ్వాశ్రమ ముండెను. ఇది సరయూనది కొక శాఖానది. దీనిని ప్రకృతము 'ఛూకా' యని వ్యవహరించుచున్నారు.

3. మందాకిని. ♦14

ఇది గంగానది కాదు. వియద్గంగకు నామసామ్యముగల వేఱొకనది. ఇది చిత్రకూట పర్వతమునకు ప్రక్కగా పాఱువది. దీనికి పయస్విని యను మాఱు పేరుండెను. దానినిబట్టియే యిది ప్రకృతము పైసుని యని వాడఁబడుచున్నది. ఇది బుందేల్ ఖండప్రాంతములో నున్నది.

౪. కపిశానది. ♦15

కపిశానదిని ఏనుఁగు వంతెనలతో దాఁటి రఘుమహారాజు ఉత్కళులు దారి చూప కళింగముపై దండెత్తెను. ఈ నది యుత్కల (Orissa) కళింగదేశముల నడుమనున్నది. పాతపేరు మోటుగానున్నదని కాఁబోలు నేఁడు ఈ నదీసుందరి 'సువర్ణరేఖ' యను క్రొత్తపేరు పెట్టుకొని కులుకుచున్నది. ♦16

♦13. 'అనేనయూనా సహపార్థివేన రంభోరు కచ్చిన్మనసో రుచిస్తే
సిప్రాతరంగానిల కంపితాసు విహర్తుముద్యానపరంపరాసు.' రఘు. ౬ స. ౩౫ శ్లో. VI-35.

♦14. 'ఏషా ప్రసన్నస్తిమిత ప్రవాహా సరిద్విదూరాన్తరభావతన్వీ
మందాకినీభాతి నగోపకంఠే ముక్తావలీకంఠ గతేవభూమేః' రఘువంశ. ౧౩స. ౪౮శ్లో. XIII-48

♦15. 'సతీర్త్వా కపిశాంసైన్యైః బద్ధద్విరదసేతుభిః
ఉత్కలాదర్శితపథః కళింగాభిముఖోయయౌ' రఘు. ౪ స. ౩౮ శ్లో. IV-38

♦16. ఈ నదుల స్వరూప వివరణము నందాలాల్ డేగారి భారత భూగోళమునుండి గ్రహింపఁబడినది.

### పర్వతములు ఆశ్రమములు

భారతదేశమునఁ బ్రసిద్ధములైన పర్వతములను, ఆశ్రమములను కవిచక్రవర్తి యెంతయో యుత్సాహముతో వర్ణించెను ఈతని హిమగిరి వర్ణనము అత్యంత స్వాభావికము, లోకోత్తరమునని ప్రసిద్ధినొందినది. ఈ పర్వతరాజము 'స్థితః పృథివ్యా ఇవమానదండః పృథివికి కొలగఱ్ఱగానున్న' దను నొక వాక్యమేచాలు.

కాళిదాసునకు శాంతికాల వాలములగు తపోవనములను వర్ణించుట చాల మక్కువ. కణ్వాశ్రమము, వసిష్ఠాశ్రమము, మరీచ్యాశ్రమము కనులకు గట్టినట్లు వర్ణించెను. ఆ మహాకవి కాలమున ఆర్షధర్మ విశ్వవిద్యాలయములైన యిట్టి యాశ్రమములు భారతభూమిపై నెన్నియో యుండెనని స్ఫురించును.



# యతి ప్రాసములు

విద్వాన్ శిరోమణి
శ్రీ కేశవపంతుల నరసింహ శాస్త్రిగారు

లోకోత్తర వర్ణనా నిపుణుఁడగు కవిచేఁ గూర్పఁబడి రమణీయార్థ ప్రతిపాదక మగు శబ్దము కావ్యము. దాని శ్రవణ మనన నాదులచేఁ గలిగిన యానందమే రసము. ఇది బ్రహ్మానంద సబ్రహ్మచారి మతికి విగళిత వేద్యాంతరతను గూర్చు మహాయోగము. సంసార విషవృక్షము ప్రసాదించిన యమృతఫలము. దీనిసిద్ధికై ప్రయత్నించి కృతార్థుఁడైనవాఁడు కవి. అమూల్యమగు నీపదార్థమును స్వానుభవమునకు దెచ్చుకొనినవాఁడు సహృదయుఁడు.

ఇట్టి యుత్తమపదార్థమును కావ్యము ద్వారా సిద్ధింపఁజేయు కవికి శబ్దార్థములకు సంబంధించిన కొన్ని నియమము లుపాదేయములును గొన్ని పరిహార్యములు నగుచున్నవి. అట్లు పాదేయము లని తలంచినవానిలో, యతిప్రాసములు ముఖ్యములు. అవి సంస్కృతమున నొకవిధముగాను దెలుగున నొకవిధముగాను దమస్థానము నేర్పరచుకొనినవి.

గద్య పద్యోభయాత్మక కావ్యముల నంగీకరించినను, పద్యకావ్యమునకే ప్రాచీనులు ప్రాశస్త్యము నొసంగినారని ఛందోమయములగు వేద పురాణేతిహాసములవలన మనకు గోచర మగుచునే యున్నదిగదా!

కాలక్రమమున ఛందోమయ రచనమునందలి యాదరము ప్రబలినది. కవితా మార్గముల నుపదేశించు గ్రంథములు బయలుదేరినవి. పింగళుఁడు తనప్రాకృత ఛందస్సులో నపఛందస్కమగు పద్యమును పాదేయ (యథానసహతే కనకతులాతిల తులితమర్ధార్ధేన, తథానసహతే శ్రవణ తులా అపఛందస్కం ఛందోభంగేన) మని చెప్పినాఁడు. బంగారపుఁ దూనికలో నర్ధార్ధమగు తిలతులితమును త్రాసు సహింపనట్లు, శ్రవణతుల (చెవియనెడు త్రాసు) భగ్నఛందస్కమగు పద్యమును సహింపదని యాతని భావము.

ఛందోమయమగు రచనలోని సౌందర్యమును గణప్రస్తారముచే గుర్తించియు, మహాకవుల పద్యములద్వారా ననుభవించియు దామోదరగుప్త క్షేమేంద్ర కేదారభట్టులు క్రమముగా వాణీభూషణ, సువృత్తతిలక, వృత్తరత్నాకరములను గ్రంథములందు పద్యమయరచనకే ప్రాశస్త్యమున్నదని యుద్ఘాటించినారు. కాఁగా సంస్కృత కవులు ఛందోమయరచనకే ప్రాశస్త్యము నొసఁగి, యతిని ఛందోమయరచన కూతకొయ్యఁగా గ్రహించినారని మనము తలఁపవలసియున్నది.

సంస్కృత మర్యాదలనే యించుమించుగా ననుసరించుచుఁ గొన్నితావులఁ

దనువ్యక్తిత్వమును జాటుకొనిన యాంధ్ర కవులు, లాక్షణికులును ధీరులై యగి యున్నారు. యాయములగు తెలుఁగు కవులును నెల్లు పాటించిరో కనుఁగొనుటయే మనకుఁ బ్రస్తుతాంశము.

శబ్దము నాదాత్మకము ననాదము వ్యక్తమై వర్ణముగాను, అవ్యక్తమై రాగముగాను వర్ణ్యవివక్షాధీనముగా నేర్పడుచున్నది. కేవలవర్ణాత్మకమగు శబ్దము శ్రవణేంద్రియ తృప్తినిఁ గావింపఁజాలదు. అట్లే నాదాత్మక శబ్ద మఖిలమితార్థోపస్థితిని గలుగఁజేయఁజాలదు. ఈ ఉభయస్వభావమును దరిమిలిత కోచనుఁడై కనుఁగొనిన సహృదయునికి, సమీకరణ, చిత్రకర్మలను గళాద్వయమునకన్నఁ దగు భయ సంబంధ విరాజమానమగు పద్య కవిత్వము మిన్నయని తోపక మానదు. "ప్రేమన్ నభోవాహినీ లహరీశీతల గంధవాహ పరిఖేలన్మంజరీ సౌరభగ్రహణేందిందిరతుందిలంబు లివి మత్కాంతారసంతానముల్" అను పద్యమును జదువునపుఁడు మానసమునకు గోచరించు చిత్రమును, శ్రవణపేయమైన శయ్యాసౌభాగ్యమును అనుభవింపఁజాలిన సహృదయులెవ్వరును బద్యమయ కవిత్వ ముత్కృష్టమైనది కాదని యనఁజాలరు. కావున నిర్వివాదముగాఁ బద్యకవిత్వాధిక్య మంగీకరింపఁబడినప్పుడు; కవికి దానియందుఁ గలుగు ప్రవృత్తి, తన్నియమపాలనము మున్నగునవి యుపాదేయములని చెప్పుట చర్వితచర్వణము. అట్టి నియమములలో ముఖ్యములని చెప్పఁదగిన యతిప్రాసములను సంస్కృత కవులును, దదను

## యతి

"శ్లోకేషు నియతస్థానం పదచ్ఛేదం యతిం విదుః" (కావ్యాదర్శము)

"విరామో విరతిర్యతిః" (పింగళసూత్రములు)

యతి యనఁగా యమనము (విరామము) అని యర్థము. ఈ నియమము వృత్తము నందలి పదపిరామమునకు సంబంధించిన దగుటచే లాక్షణిక మను యతిశబ్దమునకు విరామము, విశ్రాంతి మున్నగు నర్థములు సిద్ధించుచున్నవి.

ఈయతిని వృత్తలక్షణములలో ముఖ్యమైన దానినిగా సంస్కృతకవులు, లాక్షణికులు భావించిరి. 'యతిర్విచ్ఛేదసంజ్ఞికః' యని కేదారభట్టు. ఈయతిని పద్యలక్షణమునఁ జేర్చుకొనుటచే సంస్కృతకవులుదాత్తమను ఫలద్వయమును సాధించినారు ఒకటి నియమిత స్థలమునఁ బరిమితాక్షరయుతములగు పదములు గోచరించి, యన్వయ సౌకర్యమును గలిగించి కవి యభిప్రాయమును సహృదయుని హృదయదర్పణమునఁ బ్రతిఫలింపఁ జేయుట రెండు పైఁజెప్పిన యన్వయసౌకర్య జనన మూలముగాః బ్రసాదమను గావ్యగుణమును గని తావధూటికి బెట్టనిభూషణముగా జేయుట.

యతిని వాడిన మాత్రముననే ప్రసాద గుణము సిద్ధించునా? యని ప్రశ్నించినచో ప్రసాదగుణ యుక్తముగాఁ గవితఁ జెప్పఁగల కవికి సహాయ మొనర్పఁగలదని సమాధానము.

దూరప్రయాణముఁ జేయువానికి మధ్యే మార్గమునందలి వృక్షచ్ఛాయవలె, గణబద్ధరచనను సాగించు కవికి యతి విశ్రాంతి నొసఁగునని కవితానిర్మాణ రహస్యము నెఱిఁగిన కవిశేఖరుల యాశయము. పాఠకునికిఁ బదమధ్యమున గ్రుక్క విడుచుటకు కుదురదు గాన బదావసానమున నతఁడు విశ్రాంతిఁ గొనుట కవకాశము నొసఁగుటకుఁగూడ యతి స్వీకరింపఁబడినదని కొందఱి యాశయము. యతి నిర్వాహణము కవితారచనములో ముఖ్యకార్యమను భావమును సూచించువాడు వలెఁ గుమారదాసు తన జానకీహరణ కావ్యమున "నవవిడధతి పాదపూరణాని" <u>ప్రథితయతా</u> వచలేకిరాతదేశాః విశద మతి భిరర్థ్యయా ప్రబంధే, రచిత నృపార్థవతీవ విప్రహీనాః" యని కుకవులను దూషించినాడు. యతిని పాటింపకుండుట దోషమనియు, ఆదోషము ఛందోభంగ రూపమగు వృత్తదోషముచే గతార్థము గాదనియు నలంకార శాస్త్రకర్తలలోఁ గావ్యాత్మ 'రీతి' యను సిద్ధాంతమును వెల్లడించిన వామనాచార్యుఁడు సూత్రబద్ధము గావించినాఁడు - చూడుఁడు:— "విరస విరామం యతిభ్రష్టమ్" యత్యాత్మకం హి వృత్తమితి భిన్నవృత్త ఏవ యతిభ్రష్ట స్యాంతర్భావాత్ నపృథగ్గ్రహణం కార్యమత ఆహ; సూ॥ న లక్ష్మణః పృథక్త్వాత్. వృత్తిః— నాయందోషః లక్ష్మణో లక్షణస్య పృథక్త్వాత్. అన్వర్థ లక్షణం వృత్తస్య అన్వర్థ్యతేః గురులఘు నియమాత్మకం వృత్తం. విరామాత్మికా చ యతిరితి" ఈ యుదాహరణమువలన యతికి సంస్కృత కవులు, ఆలంకారికులును ప్రత్యేకస్థానము నొసఁగినారని సువిదితముగు చున్నదిగదా?

ఇట్లు సంస్కృత కవులచే సమాదృతమగు యతిని తెలుఁగు కవులు నాంధ్ర లాక్షణికులు నే దృష్టితోఁ గనుఁగొనిరో యెట్లు మార్చిరో కనుఁగొందము. తెలుఁగున యతి యనఁగాఁ బద్యపాద ప్రథమాక్షరము. "ఆద్యో వళిః" అని నన్నయ నియమిత స్థలమున దీనికి సమానమైన వర్ణమును, "తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్" అని పాణిని విధించిన నియమానుసారముగు సావర్ణ్యము ప్రధానముగా నిలుపుఁబడియే యతి.

ఇఁక విచ్ఛేదాత్మకముగు యతి కిట్టి మార్పును గలిగించుటచే నాంధ్రకవులు మహత్తర సౌందర్యము నాంధ్రభాషా యోషకుఁ జేకూర్చినారని మనము తలఁపవలసి యున్నది. సంస్కృత భాషకును ఆంధ్రభాషకును జాతీయముగు నంతరము మహత్తరముగా నున్నది. విచ్ఛేదాత్మకముగు యతి ఆంధ్రభాషా రామణీయకమును గొలఁదిపరచును, యతిస్థానమునఁ

క్రొత్తపదమును బ్రారంభింపవలసి వచ్చినచో సాధారణముగాఁ బూర్వ పదమును విభక్త్యంతముగా నిలుపవలసి వచ్చును. "కూర్చి, గురించి, చేతన్, తోడన్, కొఱకున్, వలనన్, యొక్క" మున్నగు ప్రత్యయములే పద్యమున నెక్కువభాగము నాక్రమించును. ఈ విభక్తి ప్రత్యయములు గద్యరచనలో శోభించినట్లు పద్యరచనలో శోభింపవు. పద్యములందు 'యొక్కను' వ్యస్తప్రయోగము కానరాదు. ఆధునికులు ప్రయోగించుట యత్యాచారము. సంస్కృత విభక్తి ప్రత్యయములు ప్రాతిపదికము నంటియుండునేగాని విశాలస్థానము నాక్రమింపవు. తెలుగున విభక్త్యంత రచనకుఁ బ్రాధాన్యమొసఁగినచో నామ వాచక సౌందర్యము మందీకృతమగునని యాంధ్రకవులు కనుఁగొనిన రహస్యము. అజంతభాషయగు నాంధ్రమున హల్ద్వయ సంయోగము భిన్నపదములకుఁ బొసఁగదు గావునఁ బూర్వాక్షర గురు కల్పనము మున్నగు తావులఁ గవికి మిక్కిలి శ్రమ గలుగుచున్నది. గుర్వనసాయి పద్యములను ముగించుటకు ద్రుతమును గల్పతరు వుండుటచేతనే యాంధ్రకవులు సురక్షితులైనారు. తత్సమాది చతుర్విధ పదవిరాజమానమగు నాంధ్రమున విచ్ఛేదాత్మక యతిని పాటించుట సిద్ధసాంస్కృతిక సమాస రచనా విధానమున సిద్ధ సాధన దోష దూషితమై తదితర పదబంధమునం దనర్థోత్పత్తికి హేతువగుచున్నది. సామాన్య కవులకు సహజముగా దొరలు "తగన్, ఒగిన్, ఔరా, బళీ, నిచ్చలు" మున్నగు పదములతోఁ బాటు కూర్చి, గురించి, కొఱకు లును జేరినచో నిఁకఁ దెలుఁగు పలుకుల సోయగమును జెప్ప నక్కఱయే లేదు. కావున నెన్నెని నిక్కట్టులను గలిగించు విచ్ఛేదాత్మక యతిని స్వీకరింపక, పద్యమునకు నూతన సౌందర్యమును గలిగించు యతిని (వళిని) సవర్ణ విన్యాస నియతిని గ్రహించి తెలుఁగుకవు లాంధ్ర భాషారమకు సాటిబాసలలో మేటి తనమును గల్గించినారు. (కన్నడమున యతి లేదు. అఱవమున నిట్టి యతికి 'మోనై' అని పేరు) ఈ నూతన యతి స్వీకారముతోఁ దెల్గు కవులు సంస్కృత కవులను మించినారు. వారికి రచనా సౌందర్యమును గలిగించు శబ్దాలంకార సిద్ధి ప్రయత్న పూర్వకమై వీరి కప్రయత్న సిద్ధమగుచున్నది. తెలుఁగునఁ బ్రప్రథమమున శబ్దాలంకారముగా గ్రహింపఁబడిన యతి కాలక్రమమున వృత్త లక్షణముగా మారినదని కొందఱియూహ. యతికి మారుగా బ్రాసయతిని గ్రహించుటలో నీ యాశయము ఇమిడియున్నదని మాదృశుల విచారధార "యతికృతి కధిక శ్రావ్యంబై బెడంగుగా నిడవలయున్" అని భీమకవి యాదేశము. సావర్ణ్యము ప్రధానముగా నేర్పడిన యతిచేఁ గృతికి శ్రావ్యత్వము సిద్ధించుననుట తెలుఁగు తీపి నెఱిఁగిన వారికిఁ గ్రొత్త విషయముగాదు. ఈ శ్రావ్యతను స్వర యతులకన్న వ్యంజనయతులే యధికముగా సంపాదించునను విషయము మరువ

రానిది. కావుననే "మందార మకరంద మాధుర్య" ధుర్యమగు తనకవితా రసమును దెల్పువారికి శ్రవణపేయముగాఁ బ్రవహింపఁజేసిన పోతన పెక్కుతావుల వ్యంజన యతులనే పాటించినాడనుట స్మరణీయము.

ఇట్లు తెలుఁగు కవిత్వమున కపూర్వ సౌందర్యమును జేకూర్చిన యతి పదివిధములని భీమన, యిరువదినాల్గు విధములని యనంతామాత్యుఁడు, ఇరువది యేడు తెఱంగులని మరి కొందఱును, నలువది యొక్క విధంబని యప్పకవియుఁ జెప్పినారు. నిరంకుశులగు కవులు సావర్ణ్యము నాధారముగాఁ గాక పరంపరాది సంబంధములచే స్వీకరించి లక్ష్యములో సంగిన కొలఁది లక్షణములు పెఱిగి యతులు నలువదియొక్క రీతుల నేర్పడినవి. వీనిలోఁ బూర్వపూర్వములు గుణోత్తరములు. కావునఁ గవితా చమత్కారాధాయకమగు యతి యుపాదేయమే యని మరియొకసారి విన్నవించుచు దృష్టిని ప్రాసము వంకకు మరల్చుటకై ప్రార్థించుచున్నాను.

## ప్రాసము

పద్యపాద ద్వితీయాక్షరము ప్రాసము "ద్వితీయో వర్ణః ప్రాసోऽత్ర పాదపాదేషు" అని సన్నయ. ఇది సంస్కృతమునఁ బద్యలక్షణముగా గ్రహింపఁబడలేదు. "అనుప్రాసము" అనునది వారి శబ్దాలంకారములలో నొకటి. (అను+ప్ర+అసః=అనుప్రాసః) రసాద్యనుగత ప్రకృష్ట న్యాసము అనుప్రాసమని వ్యుత్పత్త్యర్థము. స్వరమాత్ర సాదృశ్యమున్నను రసానుగమము లేదనియు, అది సహృదయ హృదయావర్జకము కాఁజాలదనియు, స్వరసాదృశ్యము లేకపోయినను వ్యంజన సాదృశ్యముండినచో రసానుగమ సహృదయావర్జకత్వములు గలుగుననియు, అను ప్రాస శబ్దమునకు వ్యంజన సామ్యమునందే విశ్రాంతియనియుఁ గావ్యప్రకాశ వ్యాఖ్యయగు ప్రదీపము తెల్పుచున్నది. ఈ రహస్యము నెఱిఁగిన యాంధ్రలాక్షణికులు ప్రాసమునకు వ్యంజనమైత్రి ముఖ్యమని నొక్కి వక్కాణించిరి.

సంస్కృతమున నలంకారముగా నుండిన యనుప్రాసమే తెలుఁగున ప్రాసమను పేరితోఁ బద్యపాదద్వితీయ వర్ణమును నివాసముగా నేర్పరుచుకొని, తన రసవ్యంజకప సప్రతిభటముగా వెల్లడించుచున్నది. దీనివలనఁ దెలుఁగు వృత్తముల కప్రయత్నముగాఁ బాదాదియందు శబ్దాలంకార శోభ లబ్ధమగుచున్నది. పాదమధ్యమున యతి యలంకారత్వ సాధకమగుచున్నది. ఇఁక నాంధ్రవృత్తము లన్నియు శబ్దాలంకారమయములు, ఆంధ్రకవిత్వమంతయు సువర్ణభాసురము ననుటలో నాశ్చర్యమేమున్నది! "అనుప్రాసము" నుండి "అను"ను దీసి, ప్రాసము రసము ననుసరించుటకు బదులు రసమే ప్రాసము ననుసరించునంతటి యువ

కారణమును దెలుఁగుకవితకుఁ గూర్చిన ప్రాచీనాంధ్రకవుల ప్రతిభా బలము వేనోళ్లఁ గొనియాడఁ దగియున్నది. అను ప్రాసము సాధించుఫలముకన్నఁ బ్రాసము సాధించు ఫలము గొప్పదిగావున నీ సందర్భమునఁ దెలుఁగు కవులు సంస్కృత కవులను దమపాలితలోకనవై పరిహసించుచున్నారని తలఁపవలసియున్నది. ఈ సందర్భమున నొక్క తెలుఁగు ప్రాసమును స్మరింతము.

క॥ ఉల్లల దలకాజలకణ, పల్లవిత కదంబ
కుసుమ పరిమళలహరీ
హల్లోహల మదబంభర మల్లధ్వను
లెసఁగ విసరె మరుదంకురములే"

చూచితిరా యీపద్యమునందలి ప్రాసమెట్లు శబ్దాలంకారకృత శోభను సంపాదించుచున్నదో! ఇట్టి యుదాహరణము లెన్నేని మీకు వచ్చియుండఁగా నేను వ్రాయుట యేల? ఇట్లు శబ్దాలంకార కాయమానమునకు స్తంభము లనఁదగిన యతిప్రాసములను అపరిహార్య నియమములనుగా స్వీకరించి నిర్వహించిన ప్రాచీనుల రచనాచమత్కారము స్తుతిపాత్రము. కన్నడమున యతిలేదు. సంస్కృతమునఁ బ్రాసము లేదు. మరికొన్ని భాషలలో నుభయమును లేదు. కావుననే శ్రీకృష్ణదేవరాయలు అజంతపద విరాజమానమై కృతయతి శోభయై ప్రాసోల్లాస విభాసురమై వివిధనియమ సమలంకృతమగు నాంధ్రమును గురించి, తనబంగారు కలమున లోఁ బొంగు నమృతరసముతో "దేశభాషలందు తెలుఁగులెస్స" యని వ్రాసినాఁడు. ఈ సువర్ణాక్షరము లజరామరములై యుండుఁగాక.

ఈ యతిప్రాసములు రచనా ప్రతిబంధకములుగా నున్నవని, కొందఱు భాషాసేవకులు వీని నియమపరిపాలనమున విప్రతిపన్నులగుచున్నారు. భాషాసౌందర్యము భాషలో నున్నంత భావములో నుండదని వారు భావింపవలెను. భాషయు భావము, భావమునకు భాష సౌందర్యసంపాదకములు గావలెను. భావశూన్యమైన శబ్దాలంకార భూయిష్ఠ రచనవలెనే శబ్దసౌందర్య విహీనమగు భావమును కావ్యము కాఁజాలదు. కావ్యపద ప్రవృత్తికి నిమిత్తము శబ్దమేకాని భావము గాదు. కావుననే "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్" అని పండితరాజ జగన్నాథుఁడు చెప్పినాఁడు. ఆత్మరూపమగు భావమునకుఁ బ్రాధాన్యముండవలయుననుట సర్వసమ్మతమే గాని నూతన విషయముగాదు. అశబ్ద సౌందర్యమగు బంధము పేలవమై నీరసత్వాపాదకమును గావచ్చును. ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు గల కవికి యతిప్రాస నిర్వాహణము దుష్కరముగాదు.

"ప్రాసముకోసమై వెదుకరాదు యతి ప్రతిపాదనార్థమై గాసిని జెందరాదు గణకల్పనకోసము జల్లిపల్కులభ్యాసము సేయరా" దని రసవ్యంజక ధారావాహి

కవిత్వమును వ్రాయు మా మిత్రులు శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు (నంద్యాల) చెప్పుచున్నారు. సహజముగా వారు గణయతిప్రాస నిర్వాహణమునఁ గష్టపడరు. ప్రాచీనులు దమ కాలపుఁ బరిస్థితుల ననుసరించి పండిత రాజ మనోరంజకమగు కవిత్వమును వ్రాసిరిగాని, సామాన్య ప్రజాజీవిత వర్ణనము వారి కలభ్యపదార్థముగాదు. అది వారి కవితా వస్తువు కాఁదగినంత పరిస్థితి నాడు లేకపోవుటయే కారణము. సర్గబంధాత్మకమగు మహాకావ్యమునఁ గాలత్రయాబాధ్యములగు నితివృత్తము నుండుట యుక్తమనియే వారి యాశయము. ఇతివృత్తము మారినంత మాత్రమునఁ గవిత్వము శ్రేష్ఠతరము గాఁజాలదు. ప్రతిభా బలపరిశోభితమగు రచనా నైపుణ్యమే కవితా పరాకాష్ఠకు గారణము. సుదూరముగా నాలోచించిన కొలఁదియు నియమ సహితరచనయే చిరస్థాయియని గోచరింపక మానదు. ప్రాసములు కష్టములనుకొనువారికిఁ బ్రాసరహితములైన సీసగీతములున్నవి, యతిప్రాసములు రెండును గష్టమనుకొను వారికి వచనమును గలదు గదా! గేయరచనము తెలుఁగునకుఁ గ్రొత్తది కాదు. ఇన్ని యవకాశము లుండగా నా చంపకమాలాదులనే నిర్యతిప్రాసములుగా రచించుటకుఁ బూని, పూర్వ సంప్రదాయమును నాకులీభూతము గావించువారు భాషామాతకుఁ బెట్టు నూతనాలంకార మేమున్నది? ఇఁక వ్యాకరణమే కష్టమనుకొనువారికి సమాధానమును జెప్పుటకిది యదనుగాదు.

ఆంధ్రభాషాయోషకమూల్యాలంకారములయిన యతిప్రాసము లాంధ్రకవికుమారుల కవశ్యోపాదేయములేయని మనవిచేయుచున్నాను.



# కొఱవి గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

తెలంగాణమున వర్ధిల్లిన ప్రాచీనాంధ్ర కవివరేణ్యులలో కొఱవి గోపరాజు ఒకడు. ఇతనిని గుఱించి ఆంధ్ర పాఠకలోకమునకు అంత యెక్కువగ దెలియకపోవుట విచారకరము. ఈతని పెదతండ్రులు రామరాజు, కేసన, బాచిరాజు అనువారలు రాచకొండ దుర్గాధినాథు డయిన రేచర్ల గోత్రుడు కుమార సింగమనాయని మంత్రులు. కుమార సింగమనాయకుడు మొదటి సింగమనాయని పౌత్రుడు; అనపోతానాయని కుమారుడు. అనపోతానాయని శాసనములు శకవర్షము 1309 వరకు, అనగా క్రీ.శ. 1387 వరకు గానవచ్చుచున్నవి. ఈ 1309వ సంవత్సరమున కార్తిక శుక్ల పంచమి గురువారమునాడు ఇతడు నరసింహనాథునికి చేసిన దానమును దెలుపు శాసనము సింహాచలమున నున్నది. (*S. I. I. Vol. VI. No. 1086*) అందుచేత అనపోతానాయని కుమారుడు కుమారసింగమనాయుడు ఎప్పుడో క్రీ. శ 1387 కు తరువాత రాచకొండ సింహాసనము నధిష్ఠించి యుండవలెను. కొఱవి గోపరాజు పెదతండ్రులు రామరాజు, కేసన, బాచిరాజు అనువారలు కూడ కుమారసింగమనాయని కాలము ననే యుండవలెను. గోపరాజు తండ్రి కసవరాజు. గోపరాజు క్రీస్తుశకము పదునైదవ శతాబ్ది ప్రథమపాదమున నుండెననుటకు సందియము లేదు. అట్లగుట ఇతడు కుమారసింగభూపాలుని యనంతరము రాజ్యమునకు వచ్చిన అతని తనయుడు కుమారాన్నపోతానాయునికి సమకాలికుడు కూడ గావచ్చును.

గోపరాజును, ఇతని పూర్వులును రాచకొండ రాజ్యాధిపతుల ఆశ్రయ పోషణముల వర్ధిల్లినవారు. గోపరాజు పినతాత సత్తెనారన రామాయణ కృతికర్త యట. ఈ కృతి యింతవఱకు మన దురదృష్టవశమున దొరకనేలేదు. ఈ కృతి ప్రాకృస్యము ననుసరించినదే యేమో ఈ సత్తెనారనకు ఆంధ్రకవితా పితామహుడను బిరుదము గల్గెనట. ఇంతవఱకు ఈ బిరుదము మనుచరిత్రమును రచియించిన ఒక్క పెద్దనకే కలదనుకొనుచున్నాము. గోపరాజ విరచితమైన సింహాసనద్వాత్రింశిక వలన ఇది పెద్దనకు చాలకాలమునకు పూర్వమే [illegible] యొక కవి చంద్రునకు గలదను విషయము తేటపడుచున్నది. ప్రాయికముగ గోపరాజు పినతాతకీ బిరుదము నొసగినవారు రాచకొండ రేచెర్లప్రభువులే కాదగుదురు. ఏల

యున, ఏకవియు దనకుదానై యాంధ్ర
కవితాపితామహ బిరుదమును వహించి
యుండడుకదా. ఈ సందర్భమున రాచ
కొండ నేలిన రేచర్ల వెలమ భూపతులు
కవిపండిత పోషకులే కాక తాము స్వయము
సంస్కృతాంధ్రములందు కవులై ఉద్గ్రంథ
ములను రచించి కీర్తి వహించినవారని
జ్ఞాపకమునకు దెచ్చుకొనవలయును.
కుమారాన్నపోతానాయని తండ్రి
కుమారసింగమనాయుడు సంగీత, సాహి
త్యములు రెంటియందును అసమాన పాం
డిత్యము గన్నవాడు. ఈతని గ్రంథము
రసార్ణవ సుధాకరము, సంస్కృత పాఠక
లోకమునకు సుపరిచితము. ఈతడు రచిం
చిన సంగీత సుధాకరము ఇటీవలనే లభిం
చినది. ఇప్పుడు ముద్రణమున నున్నది.
గోపరాజు పినతాత సర్వజ్ఞునకు ఆంధ్ర
కవితా పితామహ బిరుదము ఈ కుమార
సింగ భూపతియే యిచ్చియుండునేమో.

గోపరాజు రచించిన తెలుగు కృతి
సింహాసన ద్వాత్రింశిక. ఈ గ్రంథము
నుద్ధరించి ప్రకటించిన ఆంధ్రసాహిత్య
పరిషత్తువారు ఆంధ్రలోకమునకు వం
ద్యులు. విక్రమార్క భూపతి సింహాస
నము నెక్కుటకు భోజమహారాజు వచ్చి
నపుడు ఆ సింహాసనమున జెక్కిన సాల
భంజికలు చెప్పిన విక్రమార్కుని కథల
సంపుటియిది. ఈగ్రంథమున, పేరు నను
సరించియే, ముప్పదిరెండు కథలున్నవని
గ్రహింపవచ్చును. ఇది స్వతంత్రకావ్యము
కాదనియు, ఆంధ్రీకరణమనియు కవియే
యవతారికయందు చెప్పియున్నాడు.
గాని దీనికి మూల మింతవఱకు గానరా
లేదు. కాకతి భూపతుల రాజ్యలక్ష్మి
పెంపొందెనునట్టి యేక శిలాభిధానమున
నెన్నికకెక్కి ధరిత్రి గోసనే పోకలబోవి
యట్టి సిరి పుట్టినయిల్లు ఓరుగల్లు" ఇందు
పేర్కొనబడుటచేత మూలగ్రంథముకూడ
కాకతి గణపతిదేవ చక్రవర్తి కాలముననో
అంతకించుక తరువాతనో వెలసియుండు
నని తోచుచున్నది. ఏలన, కాకతిరా
జన్యులకు ఓరుగల్లు రాజధానియైనది గణ
పతిదేవ చక్రవర్తి కాలమునుండియే.

సింహాసనద్వాత్రింశిక యందలి కథ
లన్నియు కథాసరిత్సాగరమునుండి తీసి
కొనబడినవని ఈ గ్రంథమునకు పీఠిక
వ్రాసినవారి అభిప్రాయము. కాని అన్ని
కథలను అందుండి గ్రహించినవని నిస్సం
శయముగా చెప్పజాలము. మూలగ్రంథ
మును గోపరాజు కవి కాలమునాటికే ప్రచా
రమునందున్న కథలను గూడ కవులు
గ్రహించి అట్టికథలలో సాహస చమత్కా
రములున్నవాటిని కొన్నిటినైన విక్రమా
ర్కుని కంటగట్టుచు వచ్చినట్లు కన్పట్టును.
ఇందుకు ఈ సింహాసన ద్వాత్రింశిక యం
దలి ముప్పదవ కథే ఉదాహరణము. ఒక
మహావీరుడు విక్రమార్క మహారాజు
సందర్శనము చేసి, తన ఇంద్రజాల మహేం
ద్రజాల విద్యలు చూపి, ఆ మహారాజును
విభ్రమపరిచి బహూకృతినందిన విషయ
మును దెలుపుకథ ఇది. మరి గోపరాజో,
లేక మూలగ్రంథమును రచియించిన
యతడో "త్రిషష్టిశలాకా పురుషచరిత"
మను జైనగ్రంథమునందలి అజితస్వామి,

సగర భూధవ వృత్తాంతము ననుసరించి గైకొన్న కథ ఇది. సింహాసన ద్వాత్రింశికయందలి కథయంతయు అదే; చివర మాత్రము చిన్నమార్పుచేసి గ్రంథకర్త ఈకథను విక్రమార్క భూపతికి అంటగట్టినాడు. ఇంకను ఈకథలు ఏయేచోట్ల నుండి తీసినవి ఉన్నవో పరిశీలింపవలసి యున్నది.

సింహాసన ద్వాత్రింశిక అనేకవిధముల ప్రశంసనీయమయిన మహాకావ్యము, కవిత్వము విషయము అటుండగా మనము తెలిసికొనవలసిన విషయములు ఇందెన్నియో కలవు. అట్టివాటిలో ఒక్కటి మాత్రమే చెప్పి ఈవ్యాసము ముగించెదను. "తత్తద్వారంబుల కడలనున్న బొమ్మల తలకడలనున్న చిన్నగద్దియలలో నెందేని నడుగిడి పెద్దగద్దియ యెక్కుట భావ్యంబని" భోజమహారాజు ఒకనాడేమి చేసినాడట, వారశూల రహితంబుగా నొక్కదిక్కున నిలిచి సకలజన కలకలంబు నుడిపి.........పూర్ణఘటికోచితనాదావసరంబు నెదురుచూచుచుండ

"మును గడియారమ్మున గట్టిన పెను
జేగంటరవముతో యనునెడ గ్రక్కున"

అడుగెత్తినాడట. గడియారము మన కానాడుకూడ ఉన్నది, క్రొత్తదికాదు. అయితే ఇప్పటిగడియారమునకు అప్పటి గడియారమునకు కొంచెము తేడా యున్నది. ఇప్పటి గడియారము గంటలను దెలుపునట్లు ఆనాటి గడియారము పగలును, రాత్రియు గడియలను దెలుపుచు వచ్చిన ఒక యంత్రవిశేషము, గోపరాజు కాలమునాటివాడే - కొంచెమించుమించుగ - మరియొక ఆంధ్రకవి ఈ యంత్ర స్వరూపమును చక్కగ ఇట్లు వర్ణించినాడు.

"శుభలగ్నోదయ సమయ సూచకంబగుచు జలంబులందు మునుంగు తామ్రఘటికాపాత్ర నిరీక్షించి మంగళాశీర్వాద పురస్సరంబుగా సుముహూర్తంబనుచు మహామౌహూర్తికుడు నక్షతలు చల్లిన

"కంగున గంటపై గొడుపు
గ్రక్కున వైచుడు"

దీని ననుసరించి చూడగా ఇది "నీటి గడియారము" (Water Clock) అని స్పష్టమగుచున్నది. తామ్రమయమయిన ఘటికాపాత్ర అది యుంచిన నీటిలో (లోపలికి నీరు లాగుకొని) మునుగుట తోడనే అది యొక గడియ యైనట్లు, ఆ తామ్రపాత్ర దానికి గల రంధ్రముగుండ లోనికి నీరు లాగుకొని సరిగా గడియ కాలమునకు మునుగును. వెంటనే అది కనిపెట్టి ఎన్నిగడియ లైనది గంటలు కొట్టువారు; లేక శంఖధ్వానము చేయువారు

క్రీస్తుశకమునకు పూర్వమునుండియు ప్రొద్దు తెలిసికొనుటకు మన కిట్టి సాధన ముండెనని జ్యోతిష వేదాంగమును బట్టి తెలియుచున్నది. జ్యోతిష వేదాంగము ననేకాక కౌటిలీయమునను, బౌద్ధదివ్యావధానమునను, పురాణమునందును కూడ ఈ సాధనవిశేషము వర్ణితమయినది. అయితే అత్యంత ప్రాచీనకాలమునాటి

గడియారమునకును, కొలని గోపరాజు నాటి గడియారమునకును గల భేద మిది. ప్రాచీనకాలమునాటి సాధనమున తామ్ర ఘటికాపాత్ర ఒక గడియకాలములో దానిలో పోసిన నీటిని కార్చివైచి కాళీ యగును; గోపరాజునాటి సాధనమున నీటి మీద తేలబెట్టిన తామ్రఘటికాపాత్ర దానికున్న సన్నని బెజ్జముగుండ లోనికి నీటిని లాగికొని క్రమముగా బరువెక్కి సరిగా గడియకాలమునకు నీటిలో మును గును. ఈ సాధనవిశేషమే గోపరాజు నాడు మన తెలుగుదేశమున - ప్రొద్దు తెలుపుటకు వాడుకలో నుండిన గడియా రము. పూర్వపు గడియారము నీటిని కార్చివైచునది; మధ్యయుగము నాటిది నీటిని లోనికి బీల్చి నీటిలో మునుగునది యును; ఇది రెంటికి గల వ్యత్యాసము.

ఇట్టి గడియారములు మన భారత దేశమున నెల్లయెడల నుండినట్లు తోచు చున్నది. వలభీదేశము (కాఠియవాడ- Kathiawad) పరిపాలించిన మైత్రిక వంశజుడయిన గుహసేనుని కాలమున వాడుకలో నుండిన గడియారమునకు సంబంధించిన పెద్ద జలకుంభ మొకటి దొరికినది. ఆకుంభముమీద శాసనము కూడ గలదు. అందు సంవత్సరమును ఈయబడినది. ఇది వలభీసంవత్సరము 247 అనగా క్రీ. శ. 566-67 అన్నమాట. ఈ శాసనము ననుసరించి యీ జలకుంభము ఘటికాయంత్రమునకు (Water Clock) సంబంధించదని తెలిసది. దీని ననుసరించి చూడగా ప్రాచీనకాలమున ప్రొద్దు తెలిసి కొనుటకు మన దేశమున ఒకరకమయిన గడియారము, నీటికి సంబంధించినది ఉండి నట్లు విస్పష్టమగుచున్నది. కాకతి భూప తులు ఓరుగంటిని పాలించుచుండిన కాల మున ఓరుగంటిలో ఆంధ్రోర్వీశు మోసా లపై గడియారముండె నని క్రీడాభి రామము నందలి "ఉడువీధిన్ శిఖరావి లంబియగు నంధ్రోర్వీశు మోసాలపై గడియారంబున మ్రోసె రెండెనిమిదుల్ ఘంటా ఘణాత్కారముల్, సడలెన్ భానుడు పశ్చిమంబునకు..." అనుపద్యము వలన విదితమగుచున్నది. ఇట్టి విశేష ములు ఈ సింహాసనద్వాత్రింశికయం దనే కములు కలవు.

మొత్తముమీద గోపరాజు రచించిన ఈ గ్రంథము చాల గొప్పది. ఆ యా ప్రసంగముల సందర్భమున కది నాటి విద్యల సంపూర్ణ స్వభావమును ప్రద ర్శించి తన సర్వజ్ఞతను జూపినాడు. ఆనాటి విద్యలను, మర్యాదలను, ఆచార ములను, వినోదాదులను దెలిసికొనుటకు ఈ గ్రంథము ఒక విజ్ఞానకోశము వంటిది. తప్పక ఆంధ్రు లందరు పఠింపవలసిన గ్రంథము.






శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు బి. ఏ. ఎల్. ఎల్. బి.

ఉర్దూభాష మన రాష్ట్రముయొక్క ప్రభుత్వభాష యైనందునను, మహమ్మదీయు లొకరుకే కాక ఉత్తర హిందూస్థానమందలి సంయుక్త పంజాబుప్రాంత వాసులగు నాగరికులగు హిందువు లనేకులకును మాతృభాషగా మారినందునను మరియు సకల భారత దేశమందును సామాన్యభాష (Lingna franca) గా పరిగణింపబడవచ్చునని యాభాషాభిమానులు చేయుచున్న మహత్తరమగు కృషి వలనను మిగుల ప్రాముఖ్యత వహించినది. ఈ భాషా సారస్వతముల చరిత్రముపై నొక విహంగమదృష్టిని ప్రసరించి ఉర్దూ భాషా పరిచయము లేనివారికి పరిచయమును గలిగించుటకై క్లుప్తముగా నీవ్యాసమును వ్రాయుచున్నాను.

ఉర్దూభాష భారత దేశమునందు జనించి యభివృద్ధినొందిన ముఖ్యమగు సంకీర్ణభాషలలో నొకటి. 'ఉర్దూ' 'హిందీ' భాషలు పరస్పరస్పర్థతో సహామహామికతో నభివృద్ధినొందుచు భారతదేశముయొక్క జనసామాన్యభాషగా మారి యుచ్ఛస్థానము నందుకొని రాష్ట్రభాషా పదవిని బొందుటకై ప్రయత్నించుచున్నది ఈ స్పర్థ ద్వేషముగా మారి రానురాను దురదృష్టవశమున మన దేశము నావరించిన యనేక వైషమ్య కారణములలో నొక ప్రబలకారణముగా పరిణమించుచున్నది. ఐనను ఈ రెండుభాషలు నొకే తల్లి కడుపున బుట్టిన యప్పచెల్లెండ్రని మరచిపోగూడదు. పర దేశీయులగు మహమ్మదీయరాజులీ దేశముపైదండెత్తి వచ్చి మొట్టమొదట దోపిళ్ళతో సంతృప్తి జెందిరి. కాని కుతుబుద్దీన్ ఐబక్ భారత దేశమును స్థిరనివాసముగా నేర్పరచుకొని రాజ్యస్థాపన మొనరించిననాటినుండి భారతీయులతో కలసిమెలసి వారి సహాయము నపేక్షించవలసిన యవసరము కలిగెను. ఈ యవసరమే యొకక్రొత్త భాష జనించుట కవకాశము గలిగించెను. ఉత్తరహిందూస్థాన ముఖ్యప్రాంతములందు

ప్రాకృతజన్యములగు హిందీభాషలు వాడుకలో నుండెను. వీనిలో శౌరసేనీ ప్రాకృతమునుండి జనించిన పశ్చిమ హిందీభాష (౧) బంగారూ (౨) బ్రజభాష (౩) కనోజీ యను మూడు రూపములను దాల్చెను. ఈ భాషలకు మూలమగు పశ్చిమ హిందీభాషకు "ఖడీబోలీ" యని పేరు. ఈ భాషయే యిప్పటికిని ఉత్తర హిందూస్థానమందలి గ్రామీణుల వ్యవహారిక భాష. నాగరికులగు హిందూ మహమ్మదీయులు ఉర్దూభాష మాటలాడినను గ్రామీణులు మాత్రము "ఖడీబోలీ"నే వాడుచుందురు. ఈ 'ఖడీబోలీ'యే హిందీ ఉర్దూ భాషలు రెండిటికిని తల్లి. ఢిల్లీ, మీరటు ప్రాంతములలోని భాషకును, మధురా ప్రాంతములందు వాడబడు బ్రజభాషకును కొంత భేదమున్నను రెంటికిని 'ఖడీబోలీ' యనియే పేరు.

బాబరు చక్రవర్తి కాలమువరకే హిందీభాష సారస్వతభాషగా మారిపోయినది. బాబర్ దర్బారులో రాజపుత్ర రాజుల దర్బారులలో నెట్టి హిందీ కవులుండిరి. హుమాయూన్ షేర్షాల కాలములలో హిందీభాషను కవులను మంచి యాదరించిరి. ఈ కాలమునందే "మలిక్ మహమ్మద్ జాయెసీ" యను మహమ్మదీయ కవి యొకడు 'పద్మావత్' యను సుప్రసిద్ధమగు హిందీ కావ్యమును రచించెను. బాబరునుండి మొదలిడి బహాదురుషా జఫరువరకు మొగల్ చక్రవర్తులు రాజకుమారు లందరు హిందీ భాషను ప్రేమించి యాదరించి యా భాషలో స్వయముగా కవిత నల్లిరి. వారురచించిన హిందీ గీతము లన్నియు "సంగీతరాగకల్పద్రుమ"మను గ్రంథమున సేకరింపబడి నాగరీ ప్రచారిణీ గ్రంథమాలవారిచే ప్రకటింపబడినవి. అక్బరు చక్రవర్తి 'నరహరి' యను హిందీకవియొక్క పల్లకిని స్వయముగా మోసెను. కృష్ణదేవరాయలు పెద్దనార్యుని సత్కరించినటులే, అక్బరు దర్బారులోని నవరత్నములలో ముఖ్యులగు ఫైజీ, అబుల్ ఫజల్ పండితులు ఫారసీ, అరబ్బీ భాషలందువలెనె హిందీభాష యందును కావ్యములు రచించిరి. సంగీత శిరోమణి శ్రీ స్వామి హరిదాసు చక్రవర్తి యాహ్వానమును నిరాకరించినపుడు సార్వభౌమ చక్రవర్తియగు అక్బరు హరిదాసుని కుటీరమునకు స్వయముగా పోయి సంగీతమును విని యానందించెను. సుప్రసిద్ధుడగు తాన్‌సేన్ నితని దర్బారు గాయకుడే. నరహరకవి రచించిన ఖండపట్టి గీతమును విని గోవధను మాన్పిన దయాశాలి అక్బరు. అబ్దుర్రహీంఖాన్ ఖానాఖానను వాడు గొప్ప పండితుడు కవి, విశాల హృదయుడు, బహుభాషాభిజ్ఞుడు, ఉదారాత్ముడు, అక్బరు దర్బారునందొకడై యుండెను. అతడు సంస్కృత హిందీ భాషలలో ప్రవీణుడు. తన రచనలన్నియు 'రహిమాన్ విలాస్' అను గ్రంథమిటీవలనే ప్రకటింపబడినది.

అచ్యుత చరిత తరంగిణి
శశిశేఖరమౌళి మాలతీమాలికే

> మమతను వితరణ సమయే
> హరతా దేయాన మే హరితా

అని గంగాస్తోత్రము గావించెను.

> ఆసీతానటవన్మయాతవపురీ
> శ్రీకృష్ణయాభూమికా
> వ్యోమాకాశ ఖ భాబ కాబ్దివసువ
> త్త్వత్ప్రీత యేద్యావది
> ప్రీత స్త్వం యది చేన్నిరీక్ష భగవన్
> స్వప్రార్థితమ దేహి మే
> నోచేద్ బ్రూహికదాపి మానయ పున
> స్త్వేతాదృశ భూమికాం॥

అని శ్రీకృష్ణుని స్తవ మొనరించినాడు. గాజీ అబ్దుర్రహీంఖాన్‌ఖాన్, షాజహాన్ కాలములో ఈ ఖడీబోలీ హిందీ కొరకు చెల్లెలు జనించిన దనియు దీనికే 'ఉర్దూ' అను పేరు కలిగిన దని ప్రతీతి. కాని షాజహాన్‌కు పూర్వమే 'ఖడీబోలీ' లో తుర్కీ పారసీ అరబ్బీ శబ్దములను కలిపి 'రేఖ్తా' అను కావ్యభాష నొకదానిని మహమ్మదీయ పండితులు కవులు కల్పించి యుండిరి. అబ్దుర్రహీంఖాన్‌ఖానాన్ ఈ 'రేఖ్తాభాష'లో గూడ రచించి యుండెను. "ఉర్దూ" యను పేరీభాషకు తర్వాత వచ్చినది. 'ఉర్దూ' అను పదమునకు టర్కీ భాషలో నర్థము 'సైన్యము' 'ఫౌజు'. మిలటరీవారు మాటాడు సంకరభాష యను ధ్వని గలదని ఈ పదమును పూర్వకవులు వాడలేదు. ప్రప్రథమమున ఖాన్ ఆర్జూ యను ఢిల్లీకవి ౧౮ వ శతాబ్దమున నీ పదము నుపయోగించెను. 'షాజహాన్' కాలమున ఢిల్లీపట్టణములోని 'లాలుకిల్లా' (ఎఱ్ఱదుర్గము) యను భాగమందు తుర్కీ పారసీక సేనానులు సర్దార్లు, అమీరులు పండితులు నివసించువారు. వారందరు జనసామాన్యముచే నుపయోగింపబడు ఖడీబోలీ హిందీభాషనుండి సంస్కృత ప్రాకృత భవములగు పదజాలమును తొలగించి పారసీ అరబ్బీపదములను విరివిగా నుపయోగించి గ్రంథములను కావ్యములను రచింపదొడంగిరి. ఇట్లు ఆరంభ దశలో 'రేఖ్తా' యను పేరుగలిగిన ఈ మిశ్రభాష 'ఉర్దూ' గా మారిపోయెను. పారసీ, అరబ్బీ భాషాపాండిత్యముగల ముస్లింపండితులు కవులు ఆ భాషా సంప్రదాయములను, పదజాలమును, ఛందస్సులను, వ్యాకరణమును జూపించిరి. అక్బరు కాలములో రాజా తోడర్‌మల్ పారసీ భాషను ప్రభుత్వభాషగా నొనరించెను. అప్పటినుండి 'రేఖ్తా' త్వరగా 'ఉర్దూ' గా మారిపోవుచుండెను. ఒక వైపున సంస్కారము జరుగుచుండ మరియొక వైపున హిందీ 'ఉర్దూ' భాషలు విడిపోవుచుండెను. ఒకటి సంస్కృతమును, దేవనాగరీ లిపి నాధారముగా గొనిపోయెను. రెండవది అరబ్బీ పారసీ భాషలను లిపిని పునాదిగా స్వీకరించెను. ఇట్లొకే క్షేత్రమున మొలచిన ఈ రెండు భాషాలతలు భిన్నభిన్నములగు నాధారముల నవలంబించి రెండు స్వతంత్రశాఖలుగా మారిపోయెను. ఈ పరిణామము ఒకవంక జరుగుచున్నను మొగల్ ప్రభువులీ రెండు

భాషలకును ఇతర దేశ భాషలకును ప్రోత్సాహము నొసగుచుండిరి. జగన్నాథ పండితునకు 'పండితరాయ' లనియు 'సుందర' కవికి 'కవిరాజ' అనియు బిరుదముల నొసంగి షాజహాన్ తన రసజ్ఞతను నిష్పక్షపాతమును వెల్లడించెను. 'ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా' యని యూరక పొగడలేదు పండితరాయలు. మొగలు చక్రవర్తులు తమ రాజకుమారులకు నిర్బంధముగా హిందీ భాషను నేర్పించుచుండిరి. ఔరంగజేబు చక్రవర్తియును హిందీ ప్రేమించుచుండెను. అతని దర్బారునందు 'కవిస్తా' 'సామంత్' మున్నగు హిందీకవులుండిరనియు స్వయముగా హిందీ కవితలను అల్లుచుండెననిన నాశ్చర్యము కలుగక మానదు. అతడు తన మనుమగు భార్యయగు ఉదయపురి రాణిని గురించి ప్రేమగీతములు హిందీ భాషయందు రచించెను. "జబ్ జబ్ గావత్ తబ్ తబ్ ... సుప్రద్రలవారీ ఉప జావత్" అను ధూమా సంగీతకళ ప్రావీణ్యతను వర్ణించెను. ఇట్టి బహాదర్ షా కాలమువరకును హిందీ ఉర్దూ భాషలు సమానాదరణమును బొందుచు పరిణతిని జెందుచుండెను. బహాదర్ షా స్వయముగా గొప్ప ఉర్దూకవి. అతడు వ్రాసిన 'బహదర్ షా కవహేలీ' అను కావ్యము హిందీ ఉర్దూ యొక్క రసవంతమగు సమ్మేళనమును సూచించుచున్నది.

ఇట్లు 'హిందీ', 'రేఖ్తా', 'ఉర్దూ' అను మూడుతరగతులందు 'హిందీ' భాష 'ఉర్దూ' గా మారిపోయినది. ఫారసీ అరబ్బీ పదజాలముచే నిండి అధిక సంఖ్యాకులగు జనసామాన్యముయొక్క ఖడీ బోలీకిని సంస్కృత ప్రాకృత భవమగు హిందీకిని అతిదూరమైన ఈ ఉర్దూభాషకు జనకులు ముగ్గురు. ఒకడు మీర్జా అమీన్ ఖాన్ ప్రధాని, రెండవవాడు సాదుల్లాఖాన్ 'గుల్షన్' ఢిల్లీ వాస్తవ్యుడు, కవి, అమీరు. మూడవవాడు 'వలీ' ఔరంగాబాద్ వాస్తవ్యుడు, కవి. ఈ ముగ్గురు 'రేఖ్తా' నిషిద్ధముగా సంస్కరించి ఉర్దూభాషకు ప్రస్తుత స్వరూపము నొసంగిరి. సంస్కృతము వైపునను ఫారసీ మరొకవైపునను లాగుచుండిన నీస ఘర్షణ కాలములోని రెండుభాషలు పరస్పర సంపర్క సంఘర్షణల వలన పరిణతిజెందెను. హిందీ మహారాష్ట్ర గుజరాతీ భాషలందుగల ఫారసీ తుర్కీ అరబ్బీ భాషల శబ్దజాలమును పరిశీలించినచో నీ పరస్పర సంకీర్ణతయొక్క ... వెల్లడియగును. ప్రభుత్వ భాషయగు ఫారసీ ఇతరభాషలు గౌరవింపవలసి వచ్చినది. పాలితులు పాలకుల భాషను గౌరవించుట స్వీకరించుట ప్రకృతి సహజమైన పరిణామము. మన రాష్ట్రములోని తెనుగు భాషయందు ఉర్దూయొక్క ప్రభావము గలిగిన మార్పు బ్రిటిషాంధ్ర ప్రాంతమునందు ఇంగ్లీషు భాషయొక్క ప్రభావమువల్ల గలిగిన మార్పు మనము చూచుచునేయున్నాము. కాని ఇందు రాజకీయ, ఆర్థిక, స్పర్ధలవలన హిందీవారు వాడుకలోనుండు సంకీర

లుగామారి స్వతంత్ర పరిణతిని జెందుచున్నవని విశదమగుచున్నది.

ఉర్దూ కవితా ప్రథమయుగము.

ఉర్దూ కవితా సారస్వతముయొక్క ఆరంభము నిర్ణయించుటకు నిశ్చితాధారములులేవు. కాని ఉర్దూభాషలో నాదికవిగా పేర్కొనదగిన గౌరవము 'అమీర్ ఖుస్రూ'కు లభించుచున్నది. ఈ సుప్రసిద్ధ ఫారసీకవి, ఫారసీ, హిందీ, రేఖ్తా (ఉర్దూ పూర్వరూపము) మూడు భాషలలోను కావ్యములు రచించెను. ఈ మహాకవి రచించిన పద్యములు, సంగీతములు ఖండకావ్యములు లిపటికిని జనరంజనమును గోల్పోలేదు. క్రీ.శ. ౧౩-వ శతాబ్దమున ఎటావాజిల్లాలో జన్మించిన ఈకవి 'బల్బన్' 'కైకుబాద్' రాజుల సమకాలికుడు. క్రీ.శ. ౧౩౨౪లో మరణించెను. ఫారసీ ఛందస్సు నర్దూకవితయందు మొట్టమొదట ప్రయోగించిన గౌరవ మితనికే చెందుచున్నది. ఇతడు రచించినదే సుప్రసిద్ధమైన 'ఖాలిక్ బారీ' యను ఫారసీ-ఉర్దూ నవలిగాను కాసనము. ఇతని యనంతరము మూడు శతాబ్దముల వరకు భాషాస్వరూప మేర్పడుచుండెను. మధ్యన కబీరుదాసు (క్రీ.శ. 1440-1518) పరిశుద్ధ హిందీలో 'దోహా' లనుపేరున కావ్యములను రచించెను. 'మలిక్ మహమ్మద్ జాయెసీ' (క్రీ.శ. 1540) 'పద్మావత్' అను హిందీ కావ్యమును ఫారసీ లిపిలో వ్రాసెను. తులసీదాసు (క్రీ.శ. 1550-1624) తన రామచరిత మానసమును మరి ఇతర ఖండకావ్యములను రచించెను. పైజీ, అబ్దుర్రహీం ఖాన్ ఖాన్, మున్నగువారును రచించిరి. కాని వీరందరును హిందీభాషా కవులుగా లెక్కింపబడరు. నిజమైన ఉర్దూకవిత దక్కన్‌లోని గోలకొండ బిజాపూరు రాజధానులందు బైలుదేరినది. గోలకొండ కుతుబ్‌షాహీ రాజులు-మహమ్మద్ కులీ కుతుబ్‌షా (క్రీ.శ. 1581-1611), మహమ్మద్ కుతుబ్‌షా (క్రీ.శ. 1611-1625), అబ్దుల్లాకుతుబ్‌షా (క్రీ.శ. 1635-1672) అబుల్‌హసన్ తానాషా (క్రీ.శ. 1672-1704) మున్నగువారు స్వయముగా కవులు రచయితలు. ఇందులో క్రీ.శ. 1581 లో రాజ్యపీఠము నధిష్ఠించిన మహమ్మద్ కులీ కుతుబ్‌షా అక్బరు చక్రవర్తి యొక్కయు ఈరాన్ దేశపు రాజగు 'షా అబ్బాస్' యొక్కయు సమకాలికుడు. మన భాగ్యనగరమును నెలకొల్పిన రాజితడే. ఇతడు ఫారసీలోను, దక్కనీ ఉర్దూలోను, తెనుగు భాషలోను కావ్యములు రచించెనట. తెనుగు కవితలభ్యము కాలేదు కాని ఉర్దూ భాషాచరిత్రకారులు ఇతడు తెలుగు కవియని వ్రాసినారు. ఇతని ఫారసీ, ఉర్దూ దీవాన్‌లు (కావ్యసంపుటములు) ౧౮౦౦ పేజీలు కలిగి ఏబదివేల పంక్తులు కలిగియున్నవి. భక్తి శృంగారములను, సాంఘిక ప్రకృతి చిత్రములను తన కవితాపటమున ననేక రంగులతో చిత్రించెను. హిందూ ముస్లిం పండుగలను, ఋతువులను వృక్షములను, పూరగాయులను, జనుల

స్థానము నొసంగుచున్నది. ఇతని భాష పారసీమయ మగు ఉర్దూభాష యైనను హిందీ వ్రజభాషా పదము లక్కడక్కడ పంక్తులలో బహుళముగానే కన్పడుచుండును. కాని శిష్యకోటిలోనివా రెల్లరు రానురాను హిందీపదజాలమును బహిష్కరించి ఉర్దూను సంపూర్ణముగా హిందువుల కొక పరభాషగా స్వీకరించునట్లు మార్చి వేసిరి.

'వలీ' తర్వాత ఉర్దూయొక్క కేంద్రము ఢిల్లీకి మారిపోయినది. గోలకొండ, బీజాపురపు బహమనీ రాజ్యములలో నాగాల ముందు హిందూ మహమ్మదీయ ఉత్కృష్ట మైత్రి గలిగి పరస్పర సమ్మేళనమునకై మతాంతర వివాహములును జరుపుకొనుచుండిరి. ఇక్కడ ప్రభుత్వపు లెక్కలు సనదులు మున్నగునవి దేశభాషలోనే వ్రాయబడుచుండెను. పర్షియా, తుర్కీ దేశస్థుల నెక్కువగా ప్రభుత్వోద్యోగములం దేర్పరచు పద్ధతి ప్రవేశపెట్టబడి లేదు. దేశీయులగు హిందువుల కెక్కువ యవకాశము లిచ్చుచుండిరి. కావున 'వలీ' గావించిన భాషాసంస్కారమునకు కిక్కడ తగినంత ప్రోత్సాహము లభింపలేదు. ఈరాన్, తూరాన్, తుర్కీ మున్నగు దేశీయులచే నిండి పారసీభాష కత్యంత గౌరవముగల కేంద్రప్రభుత్వస్థానమగు ఢిల్లీలో 'వలీ' వేసిన బీజములు ఫలవంతములై తొందరగా ఉర్దూభాషా క్షేత్రమును సస్యశ్యామలము మొనర్చెను. 'మిర్జా సిరాజుద్దీన్ ఖానె ఆర్జూ' (క్రీ. శ. 1689-1756) యను గొప్పకవి 'వలీ'కి దాదాపు సమకాలికుడైనవాడు, ఢిల్లీ వాస్తవ్యుడు, ఉర్దూ కవితకు మరింత వన్నె దెచ్చెను. ఇతడే 'ఉర్దూ' అను పదము నీ భాషకై వాడి నామకరణము గావించెను. హాతిం, నజీ, మజ్మూన్, మజహర్, ఫిగాన్ మున్నగు కవు లనేకులు 'వలీ'ని 'ఆర్జూ' ననుకరించిరి. వీరిలో ననేకులు పారసీక దేశస్థులు. ఇరానీవంశీయులైనవారు కావున పారసీక భక్తిని ప్రావీణ్యతతో కావ్యముల రచించి ఉర్దూకవిత నభివృద్ధికి తీసికొని వచ్చిరి.

### రెండవ యుగము

రెండవయుగము క్రీ.శ. ౧౮ వ శతాబ్దారంభమునుండియే మొదలగును. ఈ యుగము ఉర్దూ కవితా చరిత్రయందు మిక్కిలి సంపన్నమైనది. మిర్జారఫీసౌదా మీర్ తకీమీర్, ఖ్వాజామీర్ దర్ద్ అను ముగ్గురు మహాకవులు మన కవిత్రయము వంటివారు ఈకాలమునవారే.

ముగ్గురు ప్రతిభాశాలురు, స్వతంత్ర రచనా ప్రవీణులు, మిర్జారఫీసౌదా (క్రీ. శ. 1718-1781) మీర్ తకీ మీర్ (క్రీ.శ 1793-1810) రాబోవువారి కాదర్శప్రాయులైరి. 'సౌదా' కసీదాలు వ్రాయుటయందును 'మీర్' గజళ్ళు వ్రాయుటయందును ఆరితేరిన ప్రజ్ఞగలవారు. ఇవ్విధముగా 'వలీ' మహాకవి ఉర్దూభాషయొక్క యాది

కవి యైనందునను ప్రస్తుతభాషకు స్వరూప
మొసంగినందునను నన్నపార్యునితో
బోల్పదగినవాడు. అట్లే మిర్జారఫీసౌదాను
తిక్కనసోమయాజితోడను, మీర్ తకీ
మీర్‌ను ఎఱ్ఱాప్రగడతోడను బోల్ప
వగును. ఖ్వాజామీర్‌దర్దు అను మహాకవి
వీరందరికంటెను ప్రత్యేక విశిష్టత గల
వాడు. అతడొక గొప్ప మతగురువుల
వంశమున జనించినవాడు. చిష్తీ వంశీ
యుడు. గొప్ప మేధావియైన పండితుడు.
ఆధ్యాత్మికవిద్యలందారి తేరిన వేదాంతి.
సూఫీ భక్తుడు. గానకళా విశారదుడు.
రాజులనుగూడ సరకుగొనని నిర్భయుడు.
అతని గృహమున నెలకు రెండుసారులు
భక్తుల సంగీత సభలు జరుగుచుండెను.
షాహాలము చక్రవర్తి యొకనాడు సభకు
విచ్చేసి కూర్చుండి కొంతకాలమునకు
కాళ్లు జాచుకొనియెనట. ఈ మహాకవి
సభలో నిట్టిమర్యాదగా ప్రవర్తించరాదని
మందలించెనట. క్రీ. శ. 1759 లో అహ్
మద్‌షా అబదాలీ ఢిల్లీపై దండెత్తి వచ్చి
నపుడు ఢిల్లీవాసులగు పండితులు కవు
లనేకులు అవుధు (Oudh) కు పలాయన
మొనర్చిరి. కాని ఈకవి మాత్రము స్వగృ
హమును వదలి పోలేదు. ఇతడు కవితా
ధోరణిని, జీవితాదర్శములను, ఆధ్యా
త్మిక వాసనలను బట్టి చూడ మన పోతనా
మాత్యునితో బోల్చదగినవాడు.

ఈ కాలములో నెన్నదగిన కవులు,
మజహార్, దర్దు, సోజు, ఖాయం, యకీన్,
బయాన్, హిదాయత్, కుద్రత్, జియా
మున్నగువారు. వీరందరును మంచి ఫారసీ
పండితులు. ఆభాషా సంప్రదాయములను
కవుల భావసంపదలను, కవితా సామ
గ్రిని సంపూర్ణముగా స్వీకరించి, పురా
తనమైన హిందీవాక్యసరణిని వదలి ఫారసీ
వాక్యసరణి నవలంబించిరి. బుల్‌బుల్,
కంరీ, గుల్, షంషాద్, నర్గిసు, సరో
మున్నగు పారసీక కవితాసామగ్రిని స్వీక
రించిరి. హిందీకవితలోని యలంకారము
లను ముఖ్యముగా శ్లేషను పరిత్యజించిరి.
౧౯ వ శతాబ్దారంభమున, యిన్‌షా,
ముసహఫీ యను కవులు ముఖ్యులు. వీరి
ద్దరు గొప్ప ఫారసీ పండితులు. వీరి
కాలమున ఫారసీ సంప్రదాయములపై
భాష సంస్కరింపబడి బాగుగా నిగ్గుదేరి
నది కాని భావగాంభీర్యము సడలినది.
సంస్కృత ప్రాకృతభవము లగు దేశీయ
పదములు [illegible] భాష
గంభీరమైనది కాని యీకాలపు కవిత
యందు ఢిల్లీనగరవాసులయొక్క సాంఘిక
స్థితులు జీవితపద్ధతులు ప్రతిఫలించుచున్నవి.
యిన్‌షా, రంగీన్, జాన్‌సాహెబు,
మున్నగువారు 'రేఖ్తా' యొక్క స్త్రీలింగ
ము 'రేఖ్తీ' యను జనానాభాష నుప
యోగించి యాభాషామూలమున వచ్చి
శృంగారమును కవితయందు జొప్పిరి.
అనేకపు కవిత వృద్ధికి వచ్చెను. ఆకాలపు
కవులు 'గజల్'లో మిగుల ప్రతిభను గడిం
చిరి. 'ముషాయిరాలు' (కవితాగోష్ఠులు)
లెక్కకు మిక్కిలి జరుగుచుండెను. ఉర్దూ
సాహిత్యమునందు 'గజళ్ళ' కత్యంత ప్రాము
ఖ్యతగలదు. ఈ భాగమే చాలా ఎక్కువ.

'గజల్' అనుశబ్దమునకు 'స్త్రీతోసంభాషించుట' లేక 'ప్రేమభాషణము' అని యర్థము. దీనివలననే 'గజల్' శృంగార కవితా సాహిత్యమని చెప్పకయే తెలియనగును. ఉర్దూ సాహిత్యములో శృంగారము తరువాత ప్రాముఖ్యతగల గుణము సూఫీ తత్త్వము. ఫారసీ సాహిత్యముయొక్క విశిష్టమైన యీగుణము సంక్రమించినది. "యమనియమాదులచే పవిత్రతను సంపాదించుచు, పరమేశ్వరునికై సకలమును త్యజించుట, మనుజులకు సహజముగా లక్ష్యములగు భౌతిక సుఖసంపదలను, శక్తులను, ఆశలను విసర్జించుట, ఈశ్వర సేవకై ఏకాంతముగా జీవితమును వ్యయపరచుట ఇవి సూఫీల ముఖ్యతత్త్వములు. ఉర్దూ కవులలో మతగురువుల వంశీయులు, పండితులు, వేదాంతులనేకులుగలరు. వలీ ఔరంగాబాదీ, షాహ్‌ముబారక్ ఆర్జూ, షేఖ్‌షరపుద్దీన్, మజ్మూన్, షాహ్‌హాతిం, జాన్‌జహాన్‌మజహార్, ఖ్వాజామీర్‌దర్దు, మీర్‌సౌదా, ఇష్కు మున్నగు వారు సూఫీతత్త్వానుయాయులు. వీరి కవితయందీవాసనలు మిక్కుటముగా గలవు. భౌతికప్రేమ, ఆధ్యాత్మిక ప్రేమ లేక ఈశ్వరభక్తికొక సోపానమని సూఫీల తలంపు. అందువలన ఫారసీ-ఉర్దూ కవితలో వైరాగ్యము, శృంగారము. ఈ రెంటియొక్క విచిత్రమైన సమ్మేళనము దృశ్యమగుచున్నది. భక్తులకు వేదాంతులకు ఆధ్యాత్మిక జీవులకు ఈరకపు సాహిత్యమునందు జ్ఞానభక్తి వైరాగ్యములు కనపడును. ఈ కవితలోని ప్రేమభాషలకు నృత్తగీతములకు, పానములకు, నొక విశిష్టమైన యాధ్యాత్మికమగు నర్థము వారికి గోచరించును. సామాన్యులగు పామరులకు కేవల సుఖలంపటులైన భౌతిక జీవులకు శృంగారముతప్ప వేరేమియు కానరాదు. ఈ రెండు తెగలకు కూడా పనికివచ్చు సాహిత్యము ఉర్దూగజళ్ళలో గలదు. ౧౮ వ శతాబ్దమందు 'గజల్' కవిత పరిణతి నొందెను. ఈ కాలములోని ముఖ్యకవులు ఇన్‌షా, ముస్‌హాఫీ, ఫిరాక్, రంగీన్, బకాహ్రసత్, రాసిఖ్, జుర్రత్, హుస్నీ, అసర్ మున్నగువారు. 'ఇన్'షాతో నారంభమైన ఈ యుగము 'గాలిబ్'తో సమాప్తమయ్యెను.

మీర్జా అసదుల్లాఖాన్ "గాలిబ్", ఉర్దూ సాహిత్యమున శ్రీనాథునితో పోల్చదగినవాడు. మేధావి, పండితుడు. ఇతని కాలము క్రీ. శ. 1796 నుండి 1869 వరకు. ఈ కాలపు కవులలో పేర్కొనదగినవారు జఫర్, మోమిన్, జౌక్, నసీర్, కొందరు విమర్శకులు 'జౌక్' కవియును 'గాలిబ్' వంటి ప్రతిభాశాలియే యనియు, కొందరు 'గాలిబ్' కంటెను మిన్నయనియు వ్రాసియున్నారు. కాని మొత్తముపైన 'గాలబ్'కు ఉర్దూ సారస్వతిచరిత్రమునందు గల ప్రాముఖ్యత, పలుకుబడి, 'జౌక్'కు గాని మరితరులకుగాని లభింపలేదు. వీరిరువురును ఫారసీ అరబ్బీ పండితులు. బహుగ్రంథ నిర్మాతలు. వీరిద్దరికవిత సంస్కృత పద భూయిష్ఠమైన కఠినమగు మార్గకవిత వలె జటిలమై దీర్ఘసమాసయుతమై యుం

డును. 'గాలిబ్' కవిత నారికేళ పాక మనియే చెప్పవచ్చును. 'జౌక్' దేశీయ పదములు కొంచెమెక్కువగా వాడినను భావగాంభీర్యము తక్కువగు కారణమున 'గాలిబ్'కు కలిగిన పలుకుబడి గలుగలేదు. 'గాలిబ్' సుఖజీవిగానుండి బ్రిటిషు ప్రభుత్వమువారు తన యుపకార వేతనమును తగ్గించిన తర్వాత, మన శ్రీనాథుడు తన పోషకులైన ప్రభువులను దలంచి కస్తూరికై ఏడ్చినటులే, మధుపానమునకు తగిన యవకాశము లేదని దుఃఖించుచు వాపోవుచున్నాడు. వీరిద్దరి స్వభావములకును, కవితా శైలికిని, జీవితాదర్శములకును చాల సన్నిహితమగు పోలిక గలదని చెప్పవచ్చును.

తరువాతి యుగము, 'నాసిఖ్' 'ఆతిష్'లతో ప్రారంభమగుచున్నది. వీరితో ఉర్దూ సారస్వత కేంద్రము ఢిల్లీనుండి లక్నోకు మారుచున్నది. సిపాయీమ్యూటినీ అను తిరుగుబాటు సమయమున (క్రీ.శ. 1857) ననేక మహమ్మదీయ కుటుంబములు లక్నో చేరుకొని నెలవు గొనెను. లక్నో నవాబులు వీరిని కవులను పండితులను ప్రోత్సహించిరి. పై 'నాసిఖ్' 'ఆతిష్' అను కవులిరువురు రెండు కవితాసంప్రదాయముల కాచార్యులు. ప్రత్యేక గురుశిష్యపరంపరలు గలిగిన నీ రెండు తెగలవారికి స్పర్ధ. ఇరువురిలో 'నాసిఖ్' ఎక్కువ పండితుడు, భాషా సంస్కార మొనర్చినవాడు. ఉపమ, అతిశయోక్తి, ఉత్ప్రేక్ష మున్నగు నలంకారముల నెక్కుడు వాడుకలోనికి దెచ్చెను. కాని మానవభావములను చిత్రించుట యందుగాని లేక గంభీరమైన భావములను ప్రభావపూరితముగ వెల్లడించుట యందుగాని అతని కంతప్రజ్ఞ లేదు. ఈ తెగకు జెందినవారే బహీర్, వజీర్, మాయా, సహార్, రష్క్. 'ఆతిష్' కవి 'నాసిఖ్'కంటె తక్కువ పాండిత్యము గలిగియు సులభమైన చక్కని నిర్దుష్టమగు శైలిలో రసపూరితములగు భావములను వెలిబుచ్చిన మధురకవి.

పేర్కొనదగిన ఇతరకవులలో 'సహరుల్ బయాన్' అను బిరుదముగల మీర్ హసన్ ముఖ్యుడు. ఇతని 'మస్నవీ'కి ఉర్దూ సారస్వతమునందు గొప్ప స్థానము గలదు. ఇంతటి 'మస్నవీ' ఇతరు లెవ్వరు వ్రాయలేదు. తరువాత అనీస్, దబీర్ అను నిరువురు కవులు మర్సియాలను (స్మృతి కావ్యములను) పరిణతికి దెచ్చిరి. మర్సియా (Elegy) యనస్మృతసంస్మృతి. శోకరసము నుబికించు ఒప్పించడములో వీరిద్దరు ఘనులు. హసన్, హుసేన్ మున్నగు కర్బలావీరుల కథలు కరుణాశోకభరితము లైనవి. మొహరంలో షీయాలు సమావేశపడు మజ్లిసులలో (సభలలో) పాడబడును. నల్లని దుస్తుల ధరించి యనుగుణముగు రాగములలో నీమర్సియాలను పాడునపుడు ముస్లింలు గానివారి హృదయములును పరిప్లుతములై బాష్పపూరితనయనులగుదురని నేను స్వానుభవమున నెరుగుదును. వీరిరువురు 'షియా'లైనందువలన

వీరి ప్రతిభయెల్ల 'మర్సియా'లలో వెలువడినందునను ఉర్దూ సాహిత్యమున వీరికి తగిన గౌరవస్థానము ఒసంగబడలేదని శంకించుచున్నాను. తరువాతత పేర్కొనదగిన ముఖ్యకవి 'నజీర్' అక్బరాబాదీ. ఈకవి యాధునికయుగారంభకుడని చెప్పవచ్చును. ఇతనికి పూర్వము డిల్లీ, లక్నో, రాంపూర్, హైదరాబాద్ పట్టణములందు పోషింపబడినది కేవల శృంగార కవిత. మన యాంధ్ర సాహిత్యమందలి ప్రబంధకవితా లక్షణములు గలిగి యుండెను. గతానుగతికముగా వందలకొలది కవులు శృంగార వైరాగ్యభావములను పదభేదముతో నొకరినొక రనుకరించుచు వ్యక్తపరచుచు కావ్యముల రచించిరి. మూడువందల సంవత్సరముల ఉర్దూ సారస్వతమున నీభాగమే ఎక్కువ గనపడును.

క్రీ. శ. ౧౮౩౦ సం॥ మరణించిన 'నజీరు' అక్బరాబాదీ ఋతువులు పండుగలు, సంతలు, ప్రకృతి దృశ్యములు మున్నగువానిని చిత్రించు కథలు వ్రాసి దేశీయతను జాతీయతను ప్రతిఫలింపజేసెను. ఇతని ననుకరించి యనేక హిందూ మహమ్మదీయ రచయితలు ౧౯ వ శతాబ్దముయొక్క రెండవభాగమునను ౨౦ వ శతాబ్దమునను నూతనపథమును త్రొక్కి నవీన వాఙ్మయమునకు దారితీసిరి. ఈ నవీనవాఙ్మయ చరిత్రమును పరిశీలించుటకు పూర్వము రాంపూరు, హైదరాబాదు సంస్థానములలో పోషింపబడిన కవుల విషయము మించుక తెలిసికొనవగును.

'అమీర్' అను సుప్రసిద్ధకవి రాంపూరులోను, 'దాగ్' అను సుప్రసిద్ధుడగు కవి హైదరాబాద్ నందును దర్బారు కవులుగా నుండిరి. జలాల్, తస్లీం అను కవులు గూడ నట్టివారే. 'అమీర్' 'దాగ్' వీరిరువురు వందల శిష్యులు గలిగిన కవులు. వీరి కాధునిక గజల్ కవితాసాహిత్యమున మిగుల ప్రశస్తి గలదు. వీరి గజళ్ళు జనాదరణమును బడసి వేల ప్రజల నాలుకల నాశ్రయించినవి. కానివీరును గతానుగతికముగ గజళ్ళను వ్రాసిరి. ఇతరులు పలికిన మాటలను మరింత మంచిగా పలుక ప్రయత్నించిరే కాని నూతనత్వము జూపింపలేదు. క్రీ. శ. 1905 లో 'దాగ్' మరణించెను. అతనికి ౧౫౦౦ మంది శిష్యులు.

'నజీరు' అక్బరాబాదీలో నవీనయుగ చిహ్నములు కొన్ని కనుపడినను మౌలానా అల్తాఫుహుసేన్ 'హాలీ' మహమ్మద్ హుసేన్ 'ఆజాద్' పండితరత్ననాథ్ 'సర్షార్' మౌల్వీ అబ్దుల్ హలీం 'షరర్' మౌల్వీనజీరు అహమద్, మున్నగువారే యాధునిక ఉర్దూ సాహిత్యమునకు యుగపురుషులని చెప్పవలయును. ప్రకృతి దృశ్యములు. చారిత్రిక విషయములు పండుగలు, కథలు, సాంఘిక సమస్యలు ఏ నిబంధమున లేక నన్ని విషయములును వారికవితా సామగ్రిలో చేరినవి. కవితనే కాక ఉర్దూ వచన ప్రబంధముల నిర్మించి కథలను, నవలలను, వ్యాసములను విరివిగా వ్రాసి ఉర్దూ సారస్వతమును మిగుల

సంవత్సరములుగా నొనర్చిరి. 'హాలీ' 'ఆజాద్' 'నజీర్ అహమద్' వీరు ముగ్గురు సరు' సయ్యద్ అహమద్ ఖానుకు చేదోడు వాదోడుగానుండి భారతీయ ముస్లింలను వైజ్ఞానికముగా జాగరూకుల నొనర్చి వారిలో నూతన చైతన్యమును కలిగించిన పెద్దలు. నవీనమార్గముల ద్రొక్కుచు ముస్లిం జాతీయతను భారతీయతను పెంపొందించు ప్రతిభావంతమగు కవితకు సారస్వతమునకు వీరు మార్గదర్శకులైరి. హాలీ' కవిరచించిన 'ముసద్దస్ హాలీ'యను షట్పదగీత సంపుటి ప్రతి జాతీయవాదికి పఠనీయమైన గ్రంథమని చెప్పవచ్చును. ముస్లించరిత్రను సంస్మరించుచు పూర్వౌన్నత్యమును స్మరింపజేయుచు పాఠకులకుత్తేజమొసంగుచున్నను, కావ్యము భారతజాతీయతకును దోహద మొసంగుచున్నది. ముఖ్యమైన హాలీ రచనలు 'మునాజాత్' 'సురూద్' 'గూడ హాలీ' వంటివి యే. మహమ్మద్ హుసేన్ 'ఆజాద్' మంచి కవియేగాక గొప్పపండితుడు. 'ఆబెహయాత్' అను ఉర్దూ భాషాచరిత్ర గ్రంథకర్త. ఇతడు 'జౌక్' కవియొక్క శిష్యుడు. 'కససేహింద్' అను భారత చారిత్రక కథలు, నైరంగెఖయాల్ అను విచిత్రగ్రంథము మిగుల ప్రశస్తిని గాంచినవి. బహుగ్రంథ నిర్మాతయు పండితుడగు 'ఆజాద్' ను మన వీరేశలింగం పంతులుగారితో బోల్పవచ్చును. మౌల్వీ నజీరు అహమద్ కవియైనను వచన రచనయందే మిక్కిలి ప్రతిభాశాలి. అతడనేక గ్రంథములు వ్రాసియు, ఉపన్యాసములనిచ్చియు, సర్ సయ్యద్ యొక్క నవీనోద్యమమునకు గొప్ప చేయూత నొసంగి దేశసేవ గావించెను.

'అక్బర్' అలహాబాదీయను సుప్రసిద్ధ కవి నవీనకవులకు సమకాలికుడు. న్యాయాధీశుడుగానుండిన విద్యాధికుడు. ఇటీవలనే స్వర్గస్థుడయ్యెను. ఇతడాంగ్లేయ కవి పోప్ (Pope) వంటివాడు. సాంఘిక రాజకీయ విషయములను, చిన్న చిన్న యనేక దైనందిన జీవితసమస్యలను, దురాచారములను, పాశ్చాత్య వ్యామోహమున బడిన నవీనుల యతి నవీనతను వేయేల నన్ని విషయములను గట్టిగాను హాస్యరసము నుట్టిపడునట్లు విమర్శించుట ఈకవియొక్క ప్రత్యేక ప్రతిభయని చెప్పవచ్చును. కందుకూరి వారియొక్కయు పానుగంటివారియొక్కయు లక్షణములు కలిగి ఆంగ్లేయులలో Pope, swift మున్నగు విమర్శకాగ్రేసరులతో బోల్పనగును.

ఆధునిక వాఙ్మయ మతి విస్తారమైనది. కవిత, వచనసాహిత్యము రెండును దినదినాభివృద్ధి గాంచుచున్నవి. నవలలు కథలు, కథానికలు, పత్రికలు, నాటకములు మున్నగు వివిధరచనలను పేర్కొనుటకేనియు నీవ్యాసమున అవకాశము లేదు. ఆధునిక కవులలో కీ॥ శే॥ డాక్టరు ఎక్బాల్‌కు ప్రపంచ విఖ్యాతి గలిగినది. ఎక్బాల్‌కు ఉర్దూకంటె ఫారసీపై ఎక్కువ ప్రీతియని యతని రచనలవలన దెలియుచున్నను ఉర్దూలోనే కవిత నారంభించి,

సుప్రసిద్ధమగు 'తరానా' (జాతీయగీతము) షిక్వా, జవాబెషిక్వా మున్నగు కావ్యములను వ్రాసి భారత జాతీయతకు దోహద మొసంగెను. భారతీయ ముస్లిం సోదరులందు రాజకీయచైతన్యమును తరువాత ముస్లిం ఐక్యతా భావమును పెంపొందింపచేసిన వాఙ్మయ కారులలో నగ్రగణ్యుడు. గొప్ప తత్వవేత్త, పారసీ పండితుడు, మధురకవి, మతగ్రంధములను బాగుగా పరిశీలించి ప్రపంచమునందలి యాధునిక రాజకీయ సాంఘిక ఆర్థిక తత్వములను పవిత్రమగు 'ఖురాన్' యొక్క బోధల కనుగుణ్యముగా సమర్థించుటకును విమర్శించుటకును ప్రయత్నించెను. పాశ్చాత్యుల జాతీయత నిజమైన జాతీయత కాదనియు మతైక్యతపై యాధారపడిన జాతీయత (Nationalism) నిజమైనదనియు, అందువలన ముస్లింల కందరికి తమ మతము యొక్క పునాదులపై ఆధారపడిన ముస్లిం జాతీయతయే యాదర్శమనియు నుద్బోధించెను. రాను రాను ఈతత్వము పాకిస్థానోద్యమమునకు తాత్వికమైన భూమికగా స్థిరపడినది.

హస్రత్ మోహానీ, సుప్రసిద్ధ జాతీయ ముస్లింనాయకుడు. ఇతడు సుప్రసిద్ధకవి. జోష్ మలీహాబాదీ యను ప్రతిభావంతుడగు నవకవి మన రాయప్రోలు వారితో పోల్చదగినవాడు. కొన్ని సంవత్సరముల క్రితము హైదరాబాదలో నివసించియుండెను. ఆధునిక శృంగారకవితయందును, జాతీయగీత రచనయందును పెట్టినపేరు.

హిందూ మహమ్మదీయకవు లనేకు లీ యుగమున పేర్కొనదగినవారు గలరు. వారినామముల నేని పేర్కొనుట కీవ్యాసము చాలదు. షాద్, (కీ॥ శే॥ మహారాజాసర్ కృష్ణప్రసాద్) పండిత బ్రజమోహన్ దత్తాత్రేయ 'కైఫీ' మున్షీ జ్వాలాప్రసాద్ 'బర్క్' పండితదయా నారాయణ 'నిగమ్', బ్రిజనారాయణ 'చక్బస్తు' కీ॥ శే॥ లాలా ప్రేమ్‌చంద్, ఇత్యాదు లనేకులు ప్రతిభాశాలులైన యాధునిక హిందూకవులు రచయితలు గలరు. వీరందరు కాళిదాసుయొక్క కావ్యములను, సంస్కృత హిందీభాషల లోని తదితర సాహిత్య రత్నములను ఉర్దూ సారస్వతమున కందిచ్చి మిగుల సేవగావించిరి. ఎందరో యువక కవులీ సేవ నిరాటంకముగా నిప్పుడును చేయుచున్నారు. మౌలానా షిబ్లీయను సుప్రసిద్ధ పండితుడు ఉర్దూభాషయొక్క యభివృద్ధికై హిందువులు గావించిన కృషిని ప్రశంసించుచు ప్రత్యేక గ్రంధ మొకటి రచించి ఉర్దూభాష హిందూముస్లింల సాంస్కృతిక సమ్మేళనమువలన జనించి పోషింపబడి వృద్ధిపొందినదని నిరూపించియున్నాడు.

ఇతర దేశీయభాషలలో వలె ఉర్దూ భాషలోను వచన రచన నవీనయుగముననే వృద్ధిబొందినది. 'గాలిబ్' మున్నగు వారి కాలముననారంభమై, పండిత రత్ననాథ 'సర్‌షార్' యొక్క 'ఫసానేఅజాద్' సైరకోహిసార్, పీరహాన్, కామినీ మున్నగు

నవలారత్నములందు పరిణతి జెందెను. ఉర్దూ నవలారచన నారంభించినవాడు 'సర్ షార్' పండితుడే యనవచ్చును. 'ఔధ్ అక్బార్' అను పత్రికాధిపతి కూడా తరువాతి నవలా రచనలో 'అబ్దుల్ హాలీం షరర్' మున్నగు సుప్రసిద్ధ రచయితలు బహుగ్రంథ నిర్మాతలై వాఙ్మయమును వృద్ధిపరచిరి. మౌల్వీ నజీరు అహమద్, అబ్దుల్ హాలీం షరర్, రత్ననాథ్ సర్ షార్, మౌలానా షిబ్లీ మున్నగు సాహితీపరులకు హైదరాబాద ప్రభుత్వము మిగుల సహాయ మొనర్చెను. మౌలానా జఫర్ అలీఖాన్ (సుప్రసిద్ధ లీగు నాయకుడు) గొప్ప ప్రతిభాశాలియైన కవి, రచయిత. ఉస్మానియా విశ్వవిద్యాలయము, అంజుమనె తరక్కీ ఉర్దూ, దారు త్తర్జుమా దాయిరతుల్ మ ఆరిఫ్ మున్నగు సంస్థలు విజ్ఞానమును వెదజల్లుచు ఉర్దూ వాఙ్మయమున కఖండమైన సేవ నొనర్చుచున్నవి. ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనము నుండి ఉర్దూ యొక్క కేంద్ర ముత్తర హిందూస్థానమునుండి హైదరాబాదకు మారినదని చెప్పిన నేమాత్ర మతిశయోక్తి గాదు.

ఇతర వాఙ్మయములలోవలె ఉర్దూలోను నవీన సాహిత్యయుగమందలి లక్షణము లన్నియు గలవు. ఛందోబద్ధముగాని గీతములు అనగా (Blank Verse) వ్రాయుట టాగూరు మహాకవి ననుకరించి వచనకవితల రచించుట, ఏకాంక, అర్థాంక నాటికలు వ్రాయుట, ఖండకావ్యములు, చిన్ని గీతములు, ఒకపాదము పొడుగుగను మరియొకటి చాల చిన్నదిగను, రచించుట మున్నగు సర్వవిధముల క్రొత్తపోకడలు ఉర్దూ వాఙ్మయమునందును గలవు. రియాలిజం, సర్రియాలిజం, యిమ్ప్రెషనిజం మున్నగు నవీనతత్త్వము లన్నియు నితర దేశభాషలందువలె వృద్ధి జెందుచున్నవి. 'తరక్కీ పసంద్ ముసన్నిఫీన్' 'అభివృద్ధి రచయితలు' వందలకొలది గలరు. హైదరాబాదులో నిటీవలనే వారి మహాసభ జరిగియుండెను. ఈ రాష్ట్రమునందును పురాతన ఫక్కీని నవీనపద్ధతిని రచించు కవులనేకులు గలరు. కొందరి ప్రతిభ ఉత్తర హిందూస్థానమునకు ప్రాకలే దంతియే గాని వారిశక్తి లోపముగాదు. మహాఘనతవహించిన మన ప్రభువుగారు స్వయముగా గొప్పకవులు. జాగీరుదార్లలోను నితరవర్గములలోను కవులు రచయితలనేకులు గలరు. యువకవులలో 'సాహెబ్ జాదా మైకష్' మఖదూం మొహియుద్దీన్. పేర్కొనదగినవారు.

సర్ ఆల్ఫ్రెడు లాయల్ యను సుప్రసిద్ధ చరిత్రకారుడు ఉర్దూకవితా వాఙ్మయమును గురించి కేవలము 'గజల్' సాహిత్యము నాధారముగా గొని విమర్శించియున్నాడు. కాని కేవలము ప్రబంధ కావ్యములను విమర్శించుచు ఆంధ్రసాహిత్యమునందు గుణములేదని దురభిప్రాయపడుట పొరపాటగునట్లు, మూడు వందల సంవత్సరముల కాలములో వెలువడిన ఉర్దూకవితయందు గుల్, బుల్ బుల్

మై, సాకీ, యార్, తప్ప నితరమేమియు గనపడదని లాయల్ పండితునివలె విమర్శించుట పొరపాటగును. ఉర్దూభాష యొక్క వాఙ్మయ మభివృద్ధి నొందుచున్నది. కవిత, వచన వాఙ్మయము, శాస్త్రగ్రంథములు, నవీనరచనలు, పత్రికలు, ఉపన్యాసములు మున్నగు సర్వవిధ సారస్వతమును పరిశీలించినచో సర్వతోముఖముగా నభివృద్ధి నొందుచున్నదని దెలియనగును. మంచి ఉర్దూకవితలో శ్రోతల హృదయ వీణాతంత్రుల కదలించి యుత్తేజింపజేయు నద్భుతమగు శక్తి గలదు. ఇతర ఉర్దూ సారస్వతములోను విలువగల యనేకమణులు లభించుచున్నవి. భారతీయ వాఙ్మయ ప్రపంచమున నితర దేశభాషలతో సమానమగు గౌరవమును పొందుటయేగాక ఉర్దూభాష యావద్భారత ప్రాముఖ్యతను సంపాదించుటకు తగిన యుజ్జ్వలమైన ఆశాపూరితమైన భవిష్యత్తును కలిగియున్నదని విశ్వసించుచున్నాను.



# షితాబుఖాన బిరుదాంకితుడగు సీతాపతిరాజు

—— శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారు

## I ప్రవేశిక

ఓరుగంటిని మహాదక్షతతో పాలించిన రాజతిలకుడు షితాబుఖాను. ఇతడు కారణజన్ముడు. ఆంధ్రవీరుడు. నిరుపేద కుటుంబమున జన్మించి స్వశక్తి సామర్థ్యముల వలన, ఆంధ్రదేశ రాజ్యరంగమున నొక్క మెరుపుమెరిసి, వీరవిహారమునల్పి, వీరస్వర్గమును చూరగొనిన యశస్వి. ఇతని మొదటిపేరు సీతడు, పిమ్మట సీతాపతియయినాడు. ప్రాభవ దినములలో షితాబుఖాను, చిత్తాపుఖాను అను బిరుద నామములతో జీవితమును ముగించినాడు. ఈ యాంధ్రపుత్రుని, యీ మహావీరుని, యీ హిందూ మతాభిమాని యుదంతమును పరిశోధించి, విషయములను సమన్వయపరచి, గానముచేసిన కీర్తి మొట్టమొదట శ్రీ కే. వి. లక్ష్మణరావుగారికి చెందవలసియున్నది. తరువాత ఓరుగంటిలో షితాబుఖాను వేసిన శిలాశాసనమును మన నిజాంసర్కారువారు 1932లో ప్రకటించి చారిత్రక కథనమును సమగ్రము చేసి ఎంతో మేలుచేసియున్నారు. ఈ శాసనమునకు మొదట శ్రీ లక్ష్మణరావుగారు సమగ్ర వ్యాఖ్యానముచేసి మన సర్కారువారికిచ్చినట్లును, లక్ష్మణరావుగారి యకాలమరణము కతన, మన సర్కారువారు ఇండియా గవర్నమెంటు శాసన పరిశోధకులగు డాక్టరు హీరానంద శాస్త్రి ఎం. ఎ. ఎం. ఓ. ఎల్. డి. లిట్ గారిచే వ్యాఖ్యానమును తిరుగ వ్రాయించినట్లును తెలియుచున్నది. ఇప్పుడీ వ్యాసము ముఖ్యముగా సర్కారువారి ఆశాసన గ్రంథము ననుసరించియే వ్రాయుచున్నాడను.

## II. ఓరుగల్లు

వరంగల్ అనునది ఒకపురాతన పట్టణము. నిజామురాష్ట్రములో జిల్లాకును, సూబాకును ఇప్పుడు ప్రధానస్థలముగానున్నది. ఈ పట్టణము ఓరుగల్లు అనియు ఏకశిలానగరమనియు కావ్యములందును, శాసనములయందును పేర్కొనబడినది. ఈపురము సముద్రపు మట్టమునకు 1050 అడుగుల ఎత్తున, హైదరాబాదునకు 86 మైళ్ళదూరమున ఉత్తరమున నున్నది. ఈ ప్రాంతము కృష్ణా గోదావరీ నదుల మధ్యస్థమయి పల్లపు మాగాణమునందున్నది. ప్రచండప్రస్తరములతో నిండిన పర్వతభూమియగుటచే శత్రువుల కభేద్యమయి, సాంగ్రామిక దృష్టిలో

ఎక్కువ యనుకూలమగు ప్రదేశముగా నున్నది. ముఖ్యముగా నీకారణమునను మరియు నచ్చటి శీతోష్ణపరిస్థితుల విశేషము చేతను, ఈప్రదేశమున దుర్గనిర్మాణమునకు పూర్వులు నిశ్చయించియుందురు.

ఈ ఓరుగల్లు దుర్గనిర్మాణమును కాకతీయ రాజగు గణపతిదేవుడు 1199-1200 నుండి 1260-61 వరకు) ప్రారంభించెను. ఆయనకూతురగు మహారాణీ రుద్రమదేవి పూర్తిచేసెను. ఓరుగల్లు పండ్రెండవ శతాబ్ద మధ్యభాగమునుండి పదునాల్గవ శతాబ్ద మధ్యభాగమువరకు రెండువందల సంవత్సరములు కాకతీయ రాజన్యులపాలనములో నుండెను. కాకతీయ వంశములో ప్రతాపరుద్రుడు కడపటివాడు. శాసనాధారములనుబట్టి ప్రతాపరుద్రుడు శా.శ. 1246 (క్రీ.శ. 1323-24) వరకు జీవించియుండెనని నిశ్చయముగ చెప్పవచ్చును. ఇతడు క్రీ.శ. 1325లో మరణించి యుండవచ్చును. ఈ మహారాజు మరణానంతరము ఈతని రాజ్యమేమయినదో తెలియదు. కడపజిల్లాలోని ఉప్పరపల్లి శాసనమునుబట్టి ప్రతాపరుద్రునకు జుట్టయ అను కొమరుడున్నట్లు తెలియుచున్నది. ప్రతాపరుద్రుని తరువాత వీరభద్రుడు రాజ్యమునకు వచ్చినట్లును, అతడు తనస్థానమును కొండవీడునకు మార్చుకోవలసి వచ్చినట్లును సర్ వాల్టరు ఎల్లియటుగారు లిఖించియున్నారు. ప్రతాపరుద్రుని తరువాత రాజ్యమునకు వచ్చినది కృష్ణుడనియు, అప్పుడు వారిరాజ్యము చాల తగ్గియుండెననియు న్యూయల్ దొరవారు వ్రాసియున్నారు. ప్రతాపరుద్రుని కొడుకు నాగదేవుడను నామాంతరముగల వినాయకదేవుడని మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసినట్లుగా శ్రీ వెంకయ్యగారు చెప్పుచున్నారు. దీనికి వెంకయ్యగారు ప్రమాణాధారములు చూపలేదు. వీరభద్రుడు, కృష్ణుడు, నాగదేవుడను వినాయకదేవుడు, ఇట్టివారలను గూర్చి శాసనలిఖితములు కనబడుటలేదు. కావున కాకతీయ వంశము ప్రాముఖ్యమును గోల్పోవుటయో, సామంతాధికారమును వహించుటయో సంభవించి, క్రమక్రమముగా రంగమునుండి తొలగియుండవచ్చును. బహమనీవంశ ప్రథమ నృపతియగు అలాఉద్దీన్ హాసన్ (1347) ఓరుగంటి హిందూరాజునుండి కప్పము గైకొనుచుండెను. క్రీ.శ. 1422లో బహమనీసేనలు వరంగల్లును పట్టుకొనెను. బహమనీ వంశము విభాజ్యమయినప్పుడు ఓరుగల్లు పట్టణము గోలకొండ కుతుబుషాహీల వశమయ్యెను. కుతుబుషాహీలు ఓరుగల్లుపై అధికారము గలిగియున్న కాలముననే ఇందు చర్చితమగుచున్న శాసనము సంబంధించియున్నది. ఈ శాసనమునందు కాకతీయ ప్రశంస చేసిన విధమును బట్టిచూడగా, ఈ పూర్వవంశములోని యొక రాజపుత్రుడు అప్పటికి జీవించియున్నాడనియు, షితాబుఖాను అడ్డులేని యధికారము వహించి ఓరుగంటికి రాజుగానున్నను, ఆరాజపుత్రునే శాస్త్రదృష్ట్యా, నైతికముగ రాజుగా గణించినట్లుగా తోచుచున్నది.

షితాబుఖాను బహమనీరాజుల క్రింద వరంగల్ గవర్నరుగా మొదటనుండెను. కాని తానొక స్వతంత్ర రాజ్యాధిపతిగా నుండుటకు ప్రయత్నించి జయప్రదు డయ్యెను. ఈతని రాజ్యములో ఖమ్మముమెట్టు, వరంగల్, నల్లగొండ ప్రాంతములు చేరియుండెను వరంగల్ కోటలో "షితాబుఖాను దర్బారుహాలు" అను మందిరముండుటయు, పాఖాల చెరువు గటుమీద "షితాబుఖాను చబూతరా" అను నిర్మాణముండుటయు, గమనించినచో, ఈ శాసనమునందలి లిఖితము ప్రకారము ఈ అవృష్టజాతకుడు ఓరుగల్లునకు సరదారుగనో, రాజుగనో అయి యుండెననుట తథ్యము.

షితాబుఖాను వరంగల్‌ను జయించి ఒక శిలాశాసనము వేయించినాడు. ఈ శాసనము ఓరుగల్లు కోటలోనున్నది. షితాబుఖాను దర్బారుహాలు అను మందిరమునకు దక్షిణమున శంభుని గుడిముందరనున్నది. ఈ శాసనపాఠమిచ్చట పూర్తిగ నియ్యబడినది. అందలి విషయములనుబట్టి షితాబుఖానునిగూర్చి తెలిసిన విషయములను సమన్వయించి వీని పూర్ణోదంతమును గ్రహించుటకు చరిత్రకారుల వ్రాతలు, కైఫీయతులు, ఆంధ్ర కావ్యములు తోడ్పడుచున్నవి. కావున ఆయా లిఖితముల నన్నిటిని ఉల్లేఖించి షితాబుఖాను జీవితచరిత్రను వీలయినంత వరకు సమగ్రము చేయుటకు ఈ వ్యాసమునందు ప్రయత్నము చేయబడినది.

## III. శాసన పాఠము

౧

1. శాకాబ్దేతత్వ దేవవ్రజ విభుగణితే రక్తసంవామివర్షే
   మాఘేపక్షేసితాఖ్యే శుభగుణసహితే పంచమీభానువారే
   భోగీదిత్తాపఖాన క్షితిపతితిలకో విక్రమాదిత్య తుల్యః
   ప్రాస్కందద్రాజధానీం యవనపరివ్రాతం రమ్యమే కోపలాఖ్యాం

   శ్రీభూన్యాత్॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ
   శకవరుషంబులు ౧౪౨౫ నగు రుధిరోద్గారి
   మాఘ శు॥ ౫ ఆదివారంనాండు

2. యస్యోత్తుంగసటా విధూననరయా దుచ్ఛావితావ్యోమని
   స్తంభీభూతా [కులాచ] లాధృతియుతాః సంస్థానమాతన్వతే
   ఆలి [ంగంతిగ] జాదయోపిసకలాః ప్రోప్లుత్య దివ్యాంగదీం
   వందే [సుందరభూవిభూ] షితమముం దేవంవరాహంహరిం

## శుభమస్తు

3. [భాస్వజ్జ] లపూరమిశ్రిత సుర స్రోతస్వినీనిరభా
న్యక్కారిప్రియ [కాలికా] తనుకళా సంబద్ధ దేహద్యుతిః
ఆనందామృతవార్ధి [మజ్జన] కృతా సంగోవియోగవ్యథా
బోధోజ్జోవితరత్వభీష్ట మఖిలం దేవఃస్వయంభూఃశివః

4. యద్గండక్షితి భృద్వయీవి గళితం దానాంబుధారాయుగం
స్వర్ణాద్రావవ హజ్జలేన మిళితం మందాకినీ స్రోతసా
స్వర్లోకంకురుతే ప్రయాగమమలం వేణీత్రయేనాన్వితం
సోయందంతి ముఖఃకరోతుకరుణాం భక్తానుకంపాపరః

5. భోగేవం శేస్త్రికశ్చి త్సురమథనఇవా ప్లుష్ట విద్వేట్పురేశో
భల్లైరావిద్ధదంతి ప్రతిభయవిషమానేకదుర్ధాంత సత్వః
[నా] గాఖ్యోనాయకేంత్రఃసురభిమృగమదైర్లిప్యమానోతివీరై
ర్ధాను [ష్కై] శ్చండ [వై] రైరుప చితచమరీ వాలహస్తైపరీతః

6. తస్యాభూద్భూరిసారో నరపతివిదితో నందనో న్రమబంధు
ర్నీరంధ్రైర్భాణ పాత్రైర్విషకవితచల ర్థూలనూతాన్మది లక్ష్యైః
మానీసమ్మాన్యమానోనిఖిలమనుచరైర్ద్వంద్వయుద్ధేషుబద్ధ
స్పర్ధానిర్ధూతవీర ప్రతిభటనివహో నాయకోమానయాఖ్యః

7. తస్యశ్రీ కైటభారే రివకమలగృహా ప్రేయసీ సత్కుమారా
పర్వేషాం మంగళానాం సముదయ భవనం భూభృదుద్భూతిహేతుః
సర్వేశస్యేవ గౌరీజన విదితసతీ భావరూఢా జగత్యాం
గౌరాంబా గౌరవాఢ్యా జనికవి సమయే నీరసూశబ్దయోగ్యా.

8. తస్యాం రత్నభువై తమాన నృపతే శ్మేఘాది వప్రోద్యతా
వైదూర్యాభి నవాంకురా ఇవసుతా నానాత్వ సంఖ్యాశ్రయాః
లాల్యాస్తత్ర సితాపఖాన నృపతీ రాజ్ఞాంశ తైరుత్సకై (ః)
సత్యశ్చారు సువర్ణ సంశ్రయ తయా విద్యోతతే సంతతం.

9. యస్యాంతఃపురమేతి నందనపదం రత్నాంబరాలంకృతం
గంధర్వస్వరభేద మోహనకథా విర్భావ సంభావితం
వాయువ్యాపూరిత వంశరంధ్ర నినదై రాధ్మాయ మానాంతరం
సోయం సిత్తపఖాన భూపరివృఢో భూమండలాఖండలః.

10. యాన్నిస్త్రింశ నికృత్త శాత్రవతను ప్రస్యంది రక్తాపగా
స్తీర్త్వా పిచ్ఛిలమాంస కర్దమవతీః కూలంకషప్రక్రియాః
వీరశ్రీరభిసారికేవ సరతి ప్రోద్వేలరాగాకులా
సోయం సిత్తపఖాన భూమిరమణో వీరైకచూడామణిః

11. ఆలోకాలోక లోకాధికవిమలలసద్యత్ప్రతాపోరురత్న
చ్ఛాయాచ్ఛాకాళిమానం జనయతి విమతక్షోణిపానాం విచిత్రం
యత్కీర్తిః పంచభూతీం వసనతిజగతీం చండకోదండవిద్యా
పార్థః సీతాపఖా నక్షితిపతితిలకః సోతి శౌర్యైక సీమా.

12. శ్రీమాన్ సిత్తపఖావ భూమిరమణో యద్బాణ తార్క్ష్యారయా
న్నున్నాః సంగరసీమ్ని పత్రచలితాః ప్రోన్మూల్య భూభృత్తితం
కృత్వాకుండలినాం శిరాం సినమితా న్యాస్తభ్య తద్వాహినీ
రంధ్రాం స్తన్మద హస్తినో విదధతే సోయం మహాపౌరుషః.

13. సోయం సిత్తపఖాన క్షితిపతితిలకో యస్య హేతిర్విశుద్ధా
వైరీశాంగేషు నూతే జనభయ జననీం రక్తధారాం పతంతీ
తద్ధాలాపాన ఘూర్ణప్రవిచలిత మద వ్యాఘ్రు భేతాళికానాం
గీతై రస్పష్టవర్ణైర్బహుగదితసమస్తోపయోగ ప్రకారాః.

14. సోయం సిత్తాపఖాన క్షితిపతి తిలకో యస్య ఖడ్గోగ్రమేఘో
ధారాపాతేన వేగా దహితకుల ఘటాధరాణా శీర్ణసంధీ
కారం కారం తదీయాన్ కరటిపరివృఢాన్ దుర్మదోద్రేకదృప్తాన్
కంప్రాంగాన్ పాతయిత్వా ప్రవిచల తిరణే స్తూయతే సర్వతీరైః.

15. సోయం సిత్తాపఖానో జగతి విజయతే యస్య నిస్త్రింశధారాం
శంకంతే యుద్ధరంగే విమత ధరణిపాః కాలమృత్యోః కటాక్షం
స్వః (సౌ) ధారోహకృత్యైర్ హరిమణి రచితా మచ్ఛసోపానవీధీం
స్వేషామా న్యేతి రౌద్రార్భటిపటిమయుతాః సంస్మరంత్యాం తరంగే.

16. యన్నిస్త్రింశ కఠోర మందర మహీభృద్వేగ సంక్షోభిత
ప్రత్యర్థి క్షితిపాల సైన్యజలధే రావిర్భవంతీ మురా
అన్యం రాజగణం విహాయ విజయ శ్రీ రేత్య రాగాలయా
సంశ్లిష్య త్యతి వేగతః సవిజయీ సిత్తాపఖానో నృపః.

17. యో రౌద్రాద్రణరంగ నాడితధనుర్జ్యా వల్లరీ ఝల్లరీ
ధ్వానాం కూరితకామభూత నివహ ప్రస్తూయమాన స్తుతిః

వీర శ్రీకచకర్షణాని బహుధా కార్షీత్స శూరాగ్రణీ
శ్రీమచ్చిత్తపఖాన భూ[illegible]ణో నాన్యో౽స్తి భూమండలే.

18. యచ్చాపాంభోదరా వైరి [illegible] ప్రోన్మేషి ప్రోద్భటాయాం
బాణాసారేణ [illegible] విప్రులభువి చాపి[illegible] సమంతాత్
శత్రుస్త్రీ నేత్ర[illegible]కే[illegible] కర[illegible] సము[illegible]త్యేవ సద్యో
క్తోఽయం చిత్తాపఖాన క్షితిపతితిలకో రాజశార్దూల బోధ్యః.

19. దర్పోద్దండ భుజాగ్ర ప్రణిహితో ప్రస్పర్ధి వంశాటవీం
రాజాద్రి ప్రముఖాని దుర్గమశిరా దుర్గాణి భగ్నాశయః
ఆక్రామన్ [illegible]ణిభర్మాస్త్ర[illegible]తిభిః సార్ధం గిదాపాలయ
దీర్ఘం కాలమఖండ సూన్యాంచితా చిత్తాపఖాన ప్రభుః.

20. యద్దేతిర్దిత వైరిదేహవిగళ ద్రక్తాంచితో ప్రత్యేత్యతే
వీరశ్రీపద లక్త కారుణశిలా సుస్నిగ్ధ కాంత్యాయుతా
నీలానీల శిలాదిభోగరచితా వేణసలీవాపరా
సోయంచిత్తపఖాన రాజతి[illegible]కః శూరాగ్రణీర్గణ్యతే.

21. ఏకాకీసమరేఖ యైః సమరే నానావిధై ర్యాయుధై
ర్భిభ్యద్దర్గరికా విరుద్ధవచనం విద్రావ్య విద్వేర్భాణం
సంరబ్ధోష్ఠ పుటానిగర్వముఖరా న్యాయంతి రాజ్ఞాంకులా
న్యాలూతాత్యాతుల పౌరుషేణపమిత శ్చిత్తాపఖానో నృపః.

22. దిక్షుచ్ఛిత్యాంత్రతి జాలం విమమిత వచసాం విద్విషాంసంయుగాంత
ర్దత్యాభితాళికా భ్యో విభజతిబహుధా మాంసపేశై స్తదీయాః
తద్రక్తాస్వాదనాయ స్పృహయతిసితరాం భీమ నీనేనతుల్యః
శ్రీమచ్చిత్తాపఖా నక్షితిపతి తిలకో రౌద్రమ్రుదావతారః

23. యస్యాంతఃపురికాశతేపిలసతీ ప్రీతిఃపరావర్తతే
యస్యామచ్ఛనకీశ తేపిజలధే ర్గంగాపగాయాంతథా
భోగీవంశ్య చితాపఖాన నృపతిం దేవాంబికా సంశ్రితా
తంసాకల్పలతేవ నందనతరుం నానామణిద్యోతితం

24. తస్యాఃపుత్రయుగం పురారికృపయా పూజాసమారబ్ధయా
ప్రాదుర్భూతమ భూదభూతజననం పూర్వాం రసాయాస్థలే
తత్రాసీదవధూతఖాన నృపతిర్జ్యేష్ఠో గుణానాంనిధిః
సౌజన్యైనసముత్సుకై ర్నృపతిభిః సర్వై స్తదాస్తూయతే.

25. తస్యానంతరజాః పుత్రాస్తక [పసో] యస్యాసిధారామహః
తీర్థేచారు నిమజ్జ్య శాత్రవకులం మందాకినీ స్రోతసి
స్రోతస్మజ్జత్యతివేగతః సకుతుకః స్వ [ః] స్త్రీ సమాలోకితం
దివ్యానందసుధ గకేళిసుభగం లోకోత్తరం జాయతే

26. ఛాయేవాస్య చితాపఖాన నృపతేర్భార్యాను మాంబాపరా
సర్వత్రాప్యనుకూల భావసహితా తత్రాజనిష్టత్రియం
పుత్రాణామమరోగ్రజ స్తదనుజో భోగీతతో నంతరో
రామ స్తత్పథ మోద్గతో మరవదో దివ్యోభ్భవత్సాగరే.

27. పూర్వం కాకతి వంశ్యరాజనివహై ర్యాపాలిధర్మాత్మభి
ర్యానానావిధిభిః కుబేరనగరీ వాధ్యాసితాన్యోత తే
రమ్యామేకశిలాపురీం సవిభవ శ్చిత్తాపఖానో నృపో
కృష్ణాదో భగికులాగ్రణీః మరధరా దేవార్చనాయాధిపః

28. అత్రామత్యవహేల యాశ్రృతపదం సింహాసనానిత్యనా
ద్రాజ్ఞాం దీనదయాపరో వితరతి క్షోణీరనేకానపి
స్వచ్ఛందోజగదేక జాంఘికయశో రామాదిభిః సమ్మితో
భోగీ చిత్తపఖాన భూమిరమణః సౌభాగ్యసీమావధిః

29. యజ్జ్యానదంతీ రిపు వీరకాంతా-దినాననా రోదయతే తదాత్వే
తస్మైన చావస్య బలేనరాజ్య-మసాధయచ్చిత్తపఖాన భూపః

30. హేమాద్రిదానై రఖిలాన్వ్యతానీ దానంతపూర్ణాన్ విబుధాన్ వదాన్యః
సతోవ్యదయాత్యచ్ఛమనః ప్రపన్న-చ్చిత్తాపఖాన క్షితిపాల వర్యః

31. యోరాజాతను యావమేవ విబుధ వ్రాతాయ సంప్రార్థితః
కృచ్ఛ్రేనై వదదాతి సోపితులితః స్యాద్భూరి దాతా కథం
సర్వత్రాను కోల [illegible] దయయా నా యాసతః సర్వదా
భోగీచిత్తపఖానరాజ తిలకే నా శేషవర్ణ్యాత్మనా.

32. చిత్తాపఖాన నృపతిర్జలధిశ్చ సమ్య-క్సంతానవత్వా గుణత స్తులికాపరంతు
దుర్జనో విగళితో [illegible]ధాయమస్మా-దాధిక్యభాగ్భజతి సంశ్రయణేయభావం.

33. పాంచాల్యే పరిభూతదైన్యబహుళ ప్రోద్యత్కృపావేశత
ప్రాదాదక్షయ వస్త్రజాతమమలం యోగోపికావల్లభః

తంస్థానాచ్చలితం దురీతివిభవా త్పాంచాల రాయంపున
భోగిచిత్తపఖాన భూమిగమనః సింహాసనే స్థాపయత్

84. దేవీశుంభనిశుంభ దానవకుల ప్రోన్మూలనోజ్జృంభణా
రంభా కాకతిరాజ్య పీఠకమలా నాదిర్జగన్మాతృకా
యేనాస్థాపిపునా స్తురుష్కకుజనై రుచ్చాటితాస్థానతో
ధర్మ్నైకశిలాపురే సహిమహాం శ్చిత్తావఖానో నృపః

85. ఆద్యాం కాకతి వంశ్యరత్నవిధా చింతామణిం సత్కృపా
పారావారగభీరచారు చరితం దేవం స్వయంభూ శివం
సంపూజ్యైకశిలాపురే ప్రతిదినం భక్త్యా సమాసాదితం
చిత్తావక్షితినాయకే నసగుణే నైశ్వర్యమవ్యాహతం.

86. ఆపస్తంబో మాధవో న్నార్యసూను
ర్భరద్వాజశ్యాసన శ్లోకజాలం
వితత్కావ్యజ్ఞాన వాంఛ్యార్వవాది
దాకల్పాంతం వర్తతాం పుణ్యకీర్త్యా

మంగళమహా శ్రీ శ్రీ శ్రీ

౨

ఈ శాసనమునందు చితాపుఖాన, చిత్తాపుఖాన, చిత్తపుఖాన, సిత్తపుఖాన, సితావఖాన, చిత్తాపక నాయక యని వేర్వేరువిధములుగ నామము పేర్కొన బడినది. గణానుకూలముగ నుండుటకై యీమార్పులు కవి చేసియుండవచ్చును. ఈకవి ఆపస్తంబసూత్రుడు, భారద్వాజ గోత్రుడు, అన్నార్యసుతుడు, మాధవ నామధేయుడు.

ఈ శాసనమునందు చిత్తాపుఖాను వంశవృక్ష మీయబడినది. ఇతనిది భోగి వంశము. ఈవంశమున నాగాఖ్యుడను నాయకేంద్రుడుండెను. ఈ నాగయాఖ్యుని కొడుకు మానయాఖ్యుడు. ఇతడు భూరిసారుడు, నరపతివిదితుడు, దీనబంధు, విర్ధూత వీరభటనివహుడు. ఈతని ప్రియధర్మపత్ని గౌరాంబ. ఈమె గౌరీలక్ష్ములతో పోల్చ దగినది. వీరసూతి. ఈమాన నృపతికి గౌరాంబ గర్భమున పుత్రులనేకు లుదయించిరి. వారిలో సితాపఖాన నృపతి పెక్కురాజుల ప్రశంసనొందిన వాడు సితాపఖానుని. యంతఃపురము రత్నాంబరాలంకృతమయి, గంధర్వ స్వర

భేద మోహనకథా విర్భావ సంభావిత
మయి యుపరారుచుండెను రాణివాస
మందెందరో రాణులున్నను సిత్తాపఖాను
ప్రియపత్ని దేవాంబిక ఈమెకు పురారి
కృపచే నిద్దరు కొమరులు గలిగిరి. ఈ
యిద్దరిలో గజనిధి అను ధూతఖాను
జ్యేష్ఠుడు. వీరుడగు పురాంతకుడు రెండవ
వాడు. చితాపఖానుని రెండవభార్య
అనుమాంబ. అనుకూల భానసహిత,
ఈమెకు ముగ్గురు కొమరులుదయించిరి.
పెద్దవాడు అమరుడు, రెండవవాడు భోగి
(భోగయ్య), మూడవవాడు రాముడు
(రామయ్య). వీరిలో పెద్దవాడగు అమ
రయ్య వీరస్వర్గము నొందినాడు.

ఈ శాసనమునందు సితాపఖానుని
శౌర్య పరాక్రమములు, శాత్రవభంజ
నము అతివేలముగా వర్ణింపబడినది.
ఇతడు భూమిరమణుడు, క్షితిపతిలకుడు,
భూమండలాఖండలుడు, చండకోదండ విద్య
యందు పార్థుడు. శౌర్యైకసీమ, వీరైక
చూడామణి. వీరశ్రీ అభిసారికవలె
రక్తనదులుదాటి యీతని ననుసరించు
చుండెను. అతనికీర్తి పంచభూతములను
గప్పివేయుచుండెను. అతని ఖడ్గము
భయదమయి వైరినిశాయ కాయముల
నుండి రక్తప్రవాహములను ప్రవహింప
చేయుచుండెను. అతని ఖడ్గధారనుజూచి
విమత ధరణిపులు కాలమృత్యుకటాక్ష
ముగా భావించెడువారు. అతని నిస్త్రింశ
కఠోర మందరగిరిచే సంక్షోభితమయిన
ప్రత్యర్థిక్షితి పాలసైన్యజలధినుండి విజయ
శ్రీ యూర్ధ్వవించి అన్యరాజగణమును విస
ర్జించి సితాపఖానునే వరించెను. అతడు
నిజాంగణమున రౌద్రముతో ధనుర్జ్యా
వల్లరీ ధ్యానము చేయుచు, భూతలివహము
ప్రస్తుతింపసాగెను. అతడు వీరశ్రీకచ
కర్షణము చేసిన శూరాగ్రగణ్యులలో అగ్రణి.
అతడు ప్రత్యర్థినంశాటవిని దహించి
రాజాద్రి ప్రముఖదుర్గము శిలాదుర్గము
లను భగ్నాశయుడయి సాధించినాడు.
వైరిదేహవిగళద్రక్తాంచితమగు నాతని
ఖడ్గము వీరశ్రీపదాలక్తకారుణమో
యనునట్లు సుస్నిగ్ధకాంతి యుతమయి
యుండెను. ఇతడు రౌద్ర రుద్రావతా
రము. శత్రు రక్తాస్వాదన మందు భీమ
సేనుని పోలును.

శకవరుషంబులు 1425 నగు రుధిరోద్గారి
మాఘ శు ౫ ఆదివారము శుభదినమున
విక్రమాదిత్యతుల్యుడగు భోగిచిత్తాపఖాన
క్షితిపతితిలకుడు యవనపరిహృతమయిన
ఏకోపల (ఓరుగల్లు) అను రమ్యరాజధా
నిని పట్టుకొనెను. ధర్మాత్ములగు కాకతి
వంశరాజులచే పాలితమయిన యీ యేక
శిలాపురిని వశముచేసికొనుట సురధరా
దేవార్చనార్థమే. సౌభాగ్యసీమావధియగు
చిత్తపఖానుడు పెక్కురాజన్యుల సింహా
సనములనాక్రమించి, దీనదయాపరుడగు
టచే వారికి మరల నిచ్చివేయుచుండెను.
హేమాద్రి పేర్కొన్న సకలదానములు
చేసి విబుధులను తన వదాన్యతచే ఆనంద
పూర్ణుల గావించెను. చిత్తాపఖాను, సము
ద్రుడు ఇద్దరు సమానులు. ఏలయన సమా

నముగ సంతానవంతులు (జీవనరాశి కలవారు) అయితే సముద్రునకు దర్శనము (చెడ్డనీరు) కలదు. చిత్తాపుఖానునెడ అట్లుకాదు. (మంచిజీవులు కలరనుట) దుష్టులు బలాతిరేకమున పాంచాలరాయుని (శ్రీకృష్ణుని) విగ్రహమునకు స్థానభ్రష్టము చేయగా, చిత్తాపుఖానుడు ఆ విగ్రహమును పునః సంప్రోక్షణచేసి స్థాపించెను. శుంభనిశుంభ దానవులను నిర్మూలముచేసిన లక్ష్మిని, ఆ జగన్మాతను కాకతిరాజ్య పీఠమునుండి కుజనతురుష్కులు పెకికి పారవైవగా, చిత్తాపఖానుడు ధర్మశాస్త్రవిధిపూర్వకముగా ఏకశిలాపురమున పునఃస్థాపితము చేసెను. సితాపుఖాను ఏకశిలాపురియందు స్వయంభూశివుని, కాకతివంశరత్న చింతామణిని పూజించి అవ్యాహతమగు ఐశ్వర్యకలితుడాయెను.

### ౩

ఈ శాసనమునందలి లిపి తెలుగు. భాష సంస్కృతము. శాసనశిల నాల్గువైపుల లిఖితము గలదు. మొదటివైపున 34 పంక్తులును, రెండవవైపున 37 పంక్తులును. మూడవ వైపున 37 పంక్తులును, నాల్గవవైపున 35 పంక్తులును ఇట్లు 143 పంక్తు లున్నవి. 5, 6 పంక్తులలో మాత్రము "స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శకవరుషంబులు 1425 నగు రుధిరోద్గారి మాఘ శు ౫ ఆదివారంనాండు" అని తెలుగుభాష వాడబడినది. ఇందు 35 పద్యములు కలవు స్రగ్ధరలు, శార్దూలవిక్రీడితములు, వసంతతిలకాది వృత్తములు వాడబడినవి. తెలుగులో శా.శ. 1425 నగు రుధిరోద్గారి మాఘ శు ౫ ఆదివారంనాండు అనియు, సంస్కృతములో "శాకాబ్దేశత్వ (25) దేవవ్రజవిభు (14) గణితే రక్తసంవాహివర్షే మాఘేపక్షే సితాఖ్యే శుభగుణసహితే పంచమీ భానువారే" అనియు ఉండుటచేత శాసనకాలము క్రీ. శ. 1504 అగుచున్నది.

## IV. చరిత్రకారుల వ్రాతలు

మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసిన గ్రంథములలోని షితాబుఖానునకు సంబంధించిన విషయములను గుదిగూర్చి డాక్టరు హీరానందశాస్త్రిగారు ఉదహరించి యున్నారు. శ్రీ డాక్టరుగారి రచనను ఇచ్చట అనువదించుచున్నాను. బ్రిగ్సు దొరవారు ఇంగ్లీషుభాషలో వ్రాసిన భాషాంతరములనే డాక్టరుగారు గ్రహించినటు లున్నది.

### ౧

"సుల్తాన్ కులీకుతుబుషా చరిత్రము" వల్ల షితాబుఖాను వరంగల్లు, ఖమ్మముమెట్టు, బెల్లంకొండ దుర్గరాజముల కధిపతియై యున్నట్లు తెలియుచున్నది. దీనిని బట్టి కృష్ణానది కిరువైపులనున్న వరంగల్లు గుంటూరుల మధ్యనున్న ప్రాంతాలను ఇతడేలుచున్నట్లు స్పష్టమగుచున్నది.

గోడ నెక్కుటకనువగు నిచ్చెనలు పుష్కలముగ లభ్యములగు చుండుటచే, నొక్కపెట్టున, అందరొకేసమయమున కోటపై గవిసిరి. వారికిగలిగిన జననష్టము అపారమయిన దయినను, వారు కోటబురుజులను చేరగలిగిరి. అచ్చటి సైన్యసివహమును తరిమివేసిరి. ఈ సమయమున వారెట్టి సంకోచము లేకుండ, సీతాపతి కుటుంబ స్త్రీలను తప్ప, మిగతజనమును పురుషులనక, స్త్రీలనక, శిశువులనక అచ్చట నున్నవారి నందరను నరకివైచిరి. సీతాపతి యవరోధజనమును రాణివాసస్త్రీలు నవాబుగారి అంతఃపురములో చేర్చుటకు గాను ప్రత్యేకింపబడిరి.

సీతాపతి (షితాబుఖాను) పైన చెప్పిన ప్రకారము పరాభూతుడు కాగానే గజపతీంద్రుని కుమారుడగు రాజారామచంద్ర గజపతి యొద్దకు పరుగెత్తెను. రామచంద్ర గజపతి కొండపల్లిలో దర్బారుసాగించుచు, ఆ ప్రాంతమునకును, బంగాళా రాష్ట్రమువరకును గల తెలంగాణ, ఓఢ్ర సముద్రతీరాలకును అధిపతియై యుండెను. సుల్తాన్ కులీకుతుబుషా తనను అష్టకష్టములుపెట్టి, చివరకు తనను స్వదేశమునుండి తరిమివేయ గలిగినాడనియు, ఇప్పుడీతడు తెలంగాణ ప్రాంతమునంతయు వశపరుచుకో గలిగెననియు, దాని నంటుకొనియున్న రామచంద్ర గజపతి రాజ్యముపై దాడి వెడలుటయే, అతని తరువాతి పూనికయనియు సీతాపతి (షితాబుఖాను) రామచంద్ర గజపతికి వివరపరచెను. ఈ వాక్యములను రామచంద్ర గజపతి విశ్వసించినవాడగుట చేతను, ఒక్కుమ్మడి సమరాంగణములోనికి బహుళసంఖ్యాక సైన్యమును దింపగల సను ధైర్యముగలవాడగుటచేతను, తన మిత్రవర్గమునకు తమ తమ సైన్యాలతో కొండపల్లికి రావలసినదిగా ఆజ్ఞలు పంపించెను. ఇట్లు మూడులక్షల కాల్బలమును ముప్పది వేల అశ్వికదళమును కొండపల్లిలో సమావేశపరిచి, సీతాపతి(షితాబుఖాను) విదియాద్రి, హరిశ్చంద్రి మున్నగు రాజవర్యులతో సిద్ధమయ్యెను. వీరు పరస్పర సహాయభూతులుగా నుండుటకు ప్రమాణములు చేసికొని, సుల్తాన్ కులీపై బడుటకు బయలు దేరిరి. అతడు అయిదువేల యాశ్వికదళముతోనే వీరిని ప్రతిఘటించుటకు సిద్ధమయి, పాలచెన్నూరు సమీపముననున్న నదియొద్ద వారిని సంధించెను.

హిందువులు మరుసటిదినము తమ సైన్యములను ఈ క్రిందివిధముగా నిలువబెట్టిరి:—

మధ్య- రామచంద్రగజపతి, పదివేల యాశ్వికదళముతోను, ఒక లక్ష కాల్బలముతోను, మూడువందల గజసైన్యముతోను

కుడిప్రక్కన- అతని మేనల్లుడు విదియాద్రి, పదివేల యాశ్వికదళముతోను, ఒక లక్ష కాల్బలముతోను, రెండువందల గజసైన్యముతోను

ణములోని మహమ్మదీయ రాజ్యమునకును, ఒరిస్సాలోని హిందూ రాజ్యమునకును గోదావరియే ఎల్లగా నుండునట్లు సమ్మతించిరి. తరువాత నవాబుయొక్కయు విజయనాథదేవునియొక్కయు రాజముద్రికలు వేసిరి. ఈ సంధిఫలితముగా ఏలూరు మండలము మహమ్మదీయులకు అప్పగింపబడెను.

4. "తారీఖి కుతుబుషాహి" యను గ్రంథమునందు ఇబ్రాహీం కుతుబుషా కాలములో (1571) షితాబుఖాను అను పేరుగల వాడొకడుండెనని యీక్రింది కథనములవలన తెలియుచున్నది:—

"కొల్లికోట యుద్ధమునకు పూర్వము, మల్లిక్ నాయకుడను బిరుదముగల రఫ్ఫతు ఖానులారీ దక్షిణమునకు దాడివెడలి రాజమహేంద్రవర సీమలోని కొంతభాగమును వశపరచుకొన్నట్లు మనకు తెలియును. కాని, మహమ్మదీయ సంయుక్త సేనానివహముతో చేరుటకు కుతుబుషాహీ సైన్యములు కదలినప్పుడు ఆ మహాసైన్యముతో కలియవలసినదిగా రఫ్ఫతుఖాను ఆజ్ఞాపితుడాయెను. ఈ కాలమునకు పండ్రెండు నెలల తరువాత రఫ్ఫతుఖానులారీ తిరిగి దక్షిణమునకు పంపి వేయబడెను. ఇతనివెంట పదివేల అశ్వికదళముండెను. రాజమహేంద్రవరమును జయించు కార్యమును పూర్తిచేయవలసినదిగా ఇతనికి ఉత్తరువులియ్యబడెను. ధవళేశ్వరమును చేరగనే, రాజమహేంద్రవరమును ముట్టడించుటకు సన్నాహములు చేసెను. అయితే, పెంటపురము, రాజపూండి పట్టణములు సీతాపతి (షితాబుఖాను) ఆధీనములో నుండుటచేత, అతడు సహాయ సైన్యమును, వస్తు సామగ్రులను రాత్రిపూట రాజమహేంద్రవరమునకు పంపుచుండెడివాడు. అందువలన, రఫ్ఫతుఖాను ముందు వానిపై దాడిసాగించుటకు నిశ్చయించుకొనెను. [illegible] ఖాను సేనను పెంటపురమువైపు బయలుదేరెను. మార్గములో శత్రువు వాని నెదిరించెను. తుముల యుద్ధము జరిగెను. హిందువులు ఓడి పెంటపురి దుర్గమునకు పరువెత్తిరి. మహమ్మదీయ సైన్యము పలాయితుల వెంబడించి దుర్గద్వారముల వరకు తరిమిరి. అంతట కోటగోడల కెగబ్రాకి, కోటను పట్టుకొనిరి. సీతాపతియు (షితాబుఖాను), ఆతని కుటుంబమువారును ఎట్లో తప్పించుకొనిపోయి రాజపూండి దుర్గమును చేరిరి. మరునాడు మహమ్మదీయ సైన్యము అచ్చటికిని వెంబడించెను. కాని, త్రోవ నిరుకుగానుండుటచేతను, ఇరు ప్రక్కలనున్న యడవులు చొరశక్యముగాని వగుటచేతను, దుర్గమును చేరుటకు కొంతవర కాగవలసి వచ్చెను. రఫ్ఫతుఖాను ఆ దుర్గమును పట్టుకొనవలయునను పట్టుదల కలవాడగుటచే, అరణ్యమును నరికి తెగులబెట్టవలసినదిగా ఆజ్ఞాపించెను. మహమ్మదీయులు దినమునకు సుమారు రెండు మైళ్లు మాత్రమే పోగలుగుచుండిరి. మార్గమున కిరుప్రక్కల యరణ్యములో

దాచుకొనియుండి దొంగపోట్లు వేయుశత్రువుల తాకిడి మూలకముగా మూడువందలకుపైగా మహమ్మదీయులు మడిసిరి. కొంతకాలము తరువాత దాడిచేసికొని ఓపరకు రాజపూండి దుర్గమును చేరిరి. ఈదుర్గము ఒక గుట్టమీద నున్నది. అయితే, మహమ్మదీయులచ్చటికి రాగనే సీతాపతి (షితాబుఖాను) రహ్మతుఖానాక్రమణమున కనుకూలముగ దుర్గమును విడిచి, అరణ్యమార్గమునంబడి రాజమహేంద్రవరమునకు తప్పించుకొనిపోయి, దాని రాజగు విదయాద్రిని కలిసికొనెను. రహ్మతుఖానచ్చటినుండి రాజమహేంద్రవరమునకు బయలుదేరెను. ఇచ్చట విదయాద్రియొక్క శ్రీకాకోల రాజుయొక్క సేనలు ఏకమయి ఒక్కయెత్తున మహమ్మదీయులను తాకెను. ఈ సంయుక్త సైన్యములో ముప్పదివేలు అశ్వికదళము, అంతియే కాల్బలముండెను. మొదటి దెబ్బలో మహమ్మదీయ సైన్యపువంక్తి కుడిపక్షమును భంగపరుప గలిగిరి. కాని యింతలో వారికి సహాయముగా సైన్యము వచ్చుటచేత, సైన్యము కాలునిలువ త్రొక్కుకొని ఎదురొడ్డి నిలిచి హిందువుల నోడించెను. హిందువులు చిందరవందరలై పరువెత్తిపోయిరి. విదయాద్రి, సీతాపతి (షితాబుఖాను) శేష సైన్యముతో రాజమహేంద్రవర దుర్గమును చేరిరి. నాలుగు నెలల ముట్టడి తరువాత, కుతుబుషాహీ శతఘ్నులు, కోటగోడలమీద తమ ప్రభావమును చూపగలిగెను కోటగోడలో ఏబది అడుగుల గండిపడెను. పరిస్థితి లిట్లుండగా కోటలోనుండి సంధిజెండా వచ్చెను. కొన్ని షరతులమీద తాము లోబడుదుమనియు అపరతుడను, మహమ్మదీయ సైన్యములోని హిందూ గణకులలో నొక్కడును ఎల్లోపండితోనను తెలిపెదమనియు కోటలోనివారు సంకేతమంపిరి. తదనుసారముగా ఎల్లోపంతులు కోటలోనికి పోయెను. విదయాద్రియు, సీతాపతి (షితాబుఖాను)యు, తమతమ కుటుంబ జనముతో కోటను ఖాళీచేసి ఇష్టమువచ్చినచోటికి, ఎట్టి ఆటంకము లేకుండ, పోవునట్లు అంగీకృతమాయెను. ఇట్టి సంధి సూత్రములతో ఎల్లోపండితుడు శిబిరమునకు మరలివచ్చెను. రహ్మతుఖాను ఈ యొడంబడికకు సమ్మతి యిచ్చెను. విదయాద్రి శ్రీకాకోలమునకు పోయెను. సీతాపతి (షితాబుఖాను) విజయనగరమునకు చనెను.

ఈ సంఘటనము 979 వ సంవత్సరములో సంభవించెను. ఈ క్రిందివాక్యము ఇది సంభవించిన కాలమును తెలుపుచున్నది. (1570)

"కాఫరుల దేవాలయము మాహాస్తగతమాయినది.

## V కైఫియ్యతులు

౧

కిమ్మూర్రు కైఫియతు షితాబుఖాను పూర్వవృత్తాంతము తెలుపుచున్నది.

సందున తన్ను తానే శిక్షించుకొంటి ననియు, ఇట్టి దురాపవాద ఫలితము శీఘ్రముగానే సిద్ధించుననియు అతడు వచించెను. పిమ్మట పెద్దిరాజు రాజమహేంద్రమునకు వెళ్ళి సర్‌లష్కరగు అలీకులీఖానును కలిసెను. అలీకులీఖా నిచ్చిన సైన్యముతో పెద్దిరాజు తరలి రాజపూడిని ముట్టడించెను. చితాపుఖాను 30 దినములు యుద్ధముచేసి, కోటను వదలి పలాయితు డయ్యెను. పెద్ది రాజు వానిని తరుముచు పోయి "తాటపల్లిలొద్ది"యను ప్రదేశమున వాని తల నరికి నాల్గుగడియలలో రాజమహేంద్రవరమున కావార్త తెలిపెను.

౨

ఇంకొక కైఫియ్యతు ప్రకారము మరి కొన్ని విషయములు తెలియుచున్నవి.

ఆనసరాలు పెద్దిరాజు మతువెల్లపాలెము కాపురస్థుడు. ఇది రాజమండ్రి సర్కారులో బిక్కవోలు పరగణాలో నున్నది. సీతబు శూరజీకా పేరుపొందుటకు వెళ్ళుచుండగా, పెద్దిరాజు వానికి వేయిరూపాయలిచ్చి పంపెను. వాడు ఓరుగల్లునకు జని రాజసైన్యమున జేరెను. ఏ యిరువదిమందికో సర్దారుగా నుండిన వాడు క్రమముగా మూడు నాలుగువేల సైన్య దళాధిపతి యయ్యెను. తనక్రింద నున్న సైన్య పోషణార్థము తగుపాటి జాగీరు వానికీయబడెను. మహమ్మదీయులు ఓరుగల్లును వశపరచికొనిరి. అప్పటికే చితాపుఖానని పేరుపొందిన సీతడు ఓరుగల్లును వీడి కటకమునకు వెళ్లెను. ముకుందదేవ గజపతి వానిని తనసైన్యములో జేర్చుకొనెను. రాజమండ్రి దుర్గపాలకు డయిన శిరిశ్చంద్రుని గజపతి కటకమునకుమార్చి షితాబుఖానును నాల్గయిదు వేల సైన్యముతో నాదుర్గపాలకుని చేసెను. చాళుక్యుల కాలమునుండి వరిల్లుచుండిన రామగిరి దుర్గమునువీడి, రాజమహేంద్రవరమున ఉత్తరదిశయందుండిన కోటను బలపరిచి యందు వాడు నివసింప సాగెను. ఈ విధముగా వాడు రాజమండ్రి కోటకును, కస్బా ద్రాక్షారామమునకును పాలకుడయ్యెను. అప్పుడు పెద్దిరాజును పిలిపించుకొని, అతనిని దివానుగా చేసికొనెను. తరువాత రాజమండ్రి క్రింద నున్న పదునెనిమిది మొహల్లాలకు పెద్దిరాజు అధికారిగా నియమితుడయ్యెను."

ఈ కైఫియ్యతులో కూడ ప్రేమకథ కలదు. కాని యిచ్చట నీమెపేరు అప్పలమ్మకు బదులుగా నాగమ్మ యని యున్నది.

ఈ కైఫియ్యతులోనే షితాబుఖాను జీవితవిశేషాలు కొన్నిగలవు. ఇవి గోలకొండ నవాబగు ఇబ్రహీం కుతుబుషా రాజ్యకాలము నాటివిగా (1551-1581) గనబడుచున్నవి. వాటినిగూడ మనము కనుగొందము.

"పెద్దిరాజు విగత చక్షుడయి పల్లకిలో గోలకొండకు పోయెను. అచ్చట ఇబ్రహీం కుతుబుషా ఆస్థానమున గొప్ప సరదారగు జూపల్లి సామంతరావును గలిసెను. ఆయనకు తనశత్రువులనుగూర్చిన యుదంతమును వివరించి, రాజమండ్రిని సాధించుటలో సహాయము చేసెదననెను. తాను విజయమును పొందగనే ఒక జాములో షాహకు ఆవార్త తెలిపెదననెను. షాహ సంతోషించి దండయాత్రకు సకల సన్నాహములు చేయించెను. సలబతుఖాన్, అమల్దారు ఖోపుఖాన, సయ్యదు మీరా, షామహమ్మదుఖాను వజీరు, జూపల్లి సామంతరావు, కళ వీరమరావు, ముత్యాల ఎల్లపేశ్వరరావు, సెట్టిపల్లి భటరావు, మేదరాలమెట్ల గోపాలరేడు, భుల్లుమ చిన్నారావు, వెల్లన్ వీరమరావు అను పదునొకండు సర్దార్లు నియోజితులయిరి. పదునొకండు వేల అశ్వికదళము ఎనుబది వేలు కాల్బంట్లు, వీరివెంట నుండెను. తనపగ దీర్చుకొనుటకయి పెద్దిరాజు ఈ సేనా నివహముతో నార్కుడుపల్లివద్ద గోదావరి నదినిదాటి, ఈతకోట దుర్గమును పట్టుకొని, తాటపూడి రేవును తరించి నల్లామమడుగునందు విడిసెను. నల్లామమడుగు చౌదరియగు గంధం తిమ్మయ మహామాత్రుడు ఈ సేనకు భోజనసామగ్రులు సమకూర్చి పెట్టెను. ఈ సేనలోని కొంతభాగము కన్నాబ్రదాపురాముమును ముట్టడించెను. నల్లామ గంధం తిమ్మయ్య సూరనేని కొండమాలి అను వానిద్వారా ఈ సైన్యపు రాకనుగూర్చి షితాబుఖానుకు తెలుపుచు ఉత్తరములు పంపెను. దారుమకాది యాయుత్తరములను బట్టికొని వజీరుషా మహమ్మదుకు జూపిరి. గంధం తిమ్మయ మహామాత్రుని బాధించి ద్రాక్షగుండమును చెఱువు తూర్పుగట్టున తల నరికి వేసిరి. అశ్విక, పదాతి సైన్యముతో ఎల్లోవండితుడను వానిని రాజమండ్రిని పట్టుకొనుటకై మానికునాయుని పంపెను. ఇతడు శక సం॥ 1495 ఆషాఢ శు॥ 2 గురువారమునాడు (క్రీ. శ. 1573) యోగాముగిరి కోటను పట్టుకొనెను. రాజమండ్రి దుర్గమునుండి షితాబుఖానును వెడలనడిచి అందు ప్రవేశించెను. అనసరాల పెద్దిరాజు గోలకొండనుండి మరలునప్పుడు రెండుక్రోసుల కొకటిచొప్పున నగారాలుండునట్లు ఏర్పాటుచేసెను. ఈ నగారాలను ఒకదానితరువాతనొకటి ప్రయోగించుటచే, రాజమండ్రి పతనవార్త ఒక జాములో గోలకొండకు తెలిపెను. మహమ్మదీయ సైన్యము షితాబుఖానును తరిమి పట్టుకొని తాటపల్లి లొద్దివద్ద వానితల నరికివేసిరి. ఆ విషయమును ఒక కవి యిట్లు గానము చేసినాడు.

"రమ్య గోదావరి సముద్రము, యోగాముగిరి సువేలాద్రి, పెద్దనమంత్రి మహామహుడు విభీషణుడు, నాయకు హనుమంతుడు, బాహుబల్లుడు జాంబవంతుడు, భీకర తురుష్కులు వానరులు, రాజమహేంద్రవరము లంకాపట్టణము, ఇభరాముడు శ్రీరాముడు, షితాబుఖాను శత్రువు (రావణుడు) అంగీరస శుద్ధ పంచమినాడు

వెడలగొట్టబడెను. ఇభరాముడు పాలించ సాగెను."

3

ఏకశిలానగర కైఫియ్యతు పై రెండు కైఫియ్యతులకు విరుద్ధకథనము చెప్పుచున్నది. ఈ కైఫియ్యతు షితాబుఖాను హిందూ ద్వేషిగను, కాకతీయుల ద్వేషిగను వర్ణించుచున్నది. దీని ప్రకారము

"షితాబుఖాను చతుర్ముఖేశ్వర దేవాలయమును, వేయి స్తంభాల గుడిని, కాకతీయులు నిర్మించిన యితర దేవమందిరములను నాశనము చేసెను. ఆ యాలయముల రాలతో ప్రతాపరుద్రుడసంపూర్తిగ విడిచిన రాతికోటను పూర్తిగ కట్టెను. పరుసవేది శంభులింగ దేవాలయమునకు పశ్చిమమునను, కోనేరునకు దక్షిణమునను స్వోపయోగమునకు గొప్ప సౌధమును కూడ నిర్మించెను. దాని పేరు ఖాన్ మహాల్. షితాబుఖాను వెంబడి కొందరు రత్నకంబళ్లు నేయువారు ఉత్తరమునుండి వచ్చి యాశిలాదుర్గములో నతని యొద్దనే నిలిచిపోయిరి."

౪

చరిగొండ కైఫియ్యతుకూడ చితాపుఖానను పేర్కొనుచున్నది. ఈచరిగొండ కైఫియ్యతు (శ్రీ) లక్ష్మణరావుగారి యొక్కయు, డాక్టరు హీరానంద శాస్త్రి యొక్కయు దృష్టికి తగిలినట్లు కనబడదు. ఇందలి చరిత్రాంశములు ముఖ్యముగా మందుముల వంశమువారి వతందారీ యేర్పాటును సంబంధించి యున్నవి. అంతగా చారిత్రిక విలువ కలదిగా గనుపట్టదు. తారీఖులలో పొరపాట్లు కలవు. ఇది పూర్వపు భగోటను అనుసరించి 1906 ప్రాంతములో వ్రాయబడినది. ఈ వ్రాత ప్రతి లక్ష్మణరాయ పరిశోధ మండలి కార్యస్థానములో నున్నది. ఈ కైఫియ్యతునందు ఇట్లు వర్ణనముగలదు:—

"శితాబుఖానుడు అనే తురకవంశం వారు యీ దేశంబులు ౭౪ దుర్గాలు రాజ్యంబు చేసినది డబ్బైబ సంవత్సరంలు, శాలివాహన శకవరుషంబులు 1428 మొదలుకొని తుద శాలివాహన శకవరుషంబులు ౧౪౨౦పరియంతరం" క్రీ.శ.1498

## VI. ఆంధ్ర కావ్యములు.

౧

చరిగొండ ధర్మన్న ప్రణీతమయిన చిత్రభారతము చితాపుఖానుని గూర్చి యెక్కువగ దెలుపుచున్నది. ఈ తెలుగు కావ్యము ఎనుములపల్లి పెద్దామాత్యున కంకిత మీయబడినది. ఈ పెద్దామాత్యుడు చితాపుఖానునకు మంత్రిగా నోరుగంటిలో నుండెను. కావున ఇందలి కథనము సమకాలికము. ఈ పెద్దామా

త్యుడే పెద్దన్నగను, పెద్దిరాజుగను కైఫియత్తులందు వ్యవహరింప బడినాడని డాక్టరు హీరానందశాస్త్రిగారు వ్రాసినారు కాని అతడు అవసరాల పెద్దామాత్యుడు. ఈ మంత్రి ఎన్నమలపల్లి పెద్దామాత్యుడు కావున వీరిద్దరు వేర్వేరు పురుషులు చరిగొండ ధర్మన్న కవి "పదునాఱవ శతాబ్దము యొక్క అంతమునందో పదునేడవ శతాబ్దముయొక్క యాదియందో యుండి యుండుటకు సందేహములేదు." అని శ్రీ వీరేశలింగముగారు వ్రాసియున్నారు. కాని పదునాఱవ శతాబ్ద ప్రారంభము చిత్తాపుఖాను వైభవదశ అప్పటివాడయి యుండు నీకవి. ఈకాలమున సితాబుఖాను ప్రభ దుర్నిరీక్ష్యమాణ తేజోవిరాజితమై వెలుగొందు చుండెను. చిత్రభారతములో నీ చిత్తాపుఖాను ఎట్లు ప్రశంసింపబడినాడో కనుగొందము. వావిళ్లవారి ప్రతినుండి యీపద్యములు గైకొనబడినవి.

1. "అక్షయక్ష్మాభార దక్షదక్షిణభుజా-కాక్షేయకక్షత్ర రక్షితంబు
కూటకోటీకాంత కుంభకుంభప్రభా-మండితాంభోజాప్త మండలంబు
గంధసింధుర దాన గంధాంధమత్తపు-ష్పంధయ ఝుంకార బంధురంబు
విశ్వవిశ్వంభరా నశ్వరైశ్వర్యప్ర-దాశ్వరత్నవ్రాత శాశ్వతంబు
సంతతోత్సవ తోషిత శంభులింగ-సమ్ముఖేందు శిలానంద చారుమంట
పస్థలీనృత్యదంగనా పాదరణిత-నూపురంబగు నేకశిలాపురంబు. పీఠిక 10

2. చలితేఁడి వెలుఁగులై కలువదమ్ములనేలు-కనుదోయి నేప్రొద్దుగరుణచిలుక
మేలైన తామరమేడ నాడెపుకెంగ్వ-కిరవైన యురముపెంపదనెఱపఁ
దోలుచూలు కాపన దొరనింపుతోఁగన్న-షొక్కులి పురుటాలి పూవుదెలుఁగఁ
బదయాఱువన్నెల పసిమిఁజూపెడు వింత-సరిగదుప్పటి మేనఁ జౌకళింపఁ
బ్రాఁజదూపుగుంపు ప్రమోఁతలు పరిఢవిల్ల-మేటిజగములనాకు మిన్నేటిపాప
పుట్టినిల్లైన యడుగులఁ బొల్చియెపుడు-సంతసంబున వెలయుఁ బాంచాలివిభుఁడు
పీఠిక 11

3. అజగన్నాథ పరమదకాంత మధ్య-హతమూమండలుండు భీమప్రతాప
ఖండపరశుండు వైభవాఖండలుఁడు-భోగి వంశాబ్ధిచంద్రుఁడుండు భూరిబలుఁడు
పీఠిక 12

4. "అనువత్సరంబు బ్రాహ్మణులకు గోసహ-స్రములిచ్చు నృగనరేశ్వరునిరీతిఁ
గంధులకెనఁగఁ గాకాలచెర్వాదిగాఁ-జెఱువులు నిలుపు సగరుని కరణి.
దివ్యప్రతాపుఁడై దిగ్విజయంబుఁ గా-వించు మాంధాతృభూవిభునిలీల
దేవభూదేవతార్థిశ్రేణి కగ్రహా-రములిచ్చు భార్గవరాము పగిది

నిందుశేఖర పాదారవిందయుగళ
భావనాపరుఁడంగనా పంచబాణుఁ
డతులధైర్యాభిభూత హిమాచలుండు
మానభూపాల చిత్తాంబుఖానఘనుఁడు. పీఠిక 13.

ఈ పద్య ద్వితీయ పాదములో పాకాల చెరువు ప్రశంస గలదు. పాకాల తటాక నిర్మాణములో షితాబుఖానునకు సంబంధము కలదనుటకు గ్లింప్సెను ఆఫ్ ది నిజామ్సు డొమినీయన్సు అను గ్రంథములోని కథనమును సాక్ష్యమిచ్చుచున్నది. ఈగ్రంథమునుబట్టి షితాబుఖానుకొక స్వప్నము వచ్చినదట. ఆస్వప్నములో ప్రతాపరుద్ర గజపతి (Prathaparudra of Orissa) పాకాల చెరువులో విశేషధననిక్షేపము పాతిపెట్టబడినచోటును చూపెనట. షితాబుఖాను దానిని త్రవ్వితీసి కరగినసీసముతో రాతిపలకలను బంధించి, చెరువుకట్టలోని గండ్లను బాగుచేయించుటకు వినియోగించినాడు. ఈ ప్రతాపరుద్రగజపతి అనువాడు కాకతీయవంశ ప్రతాపరుద్రుడే గాని కళింగ ప్రతాపరుద్రుడు కాడని డాక్టరు హీరానంద శాస్త్రిగారి అభిప్రాయము (పుట 11).

5. "సర్వ సర్వంసహా సంగతగుణక్రియా-చాతుర్య సప్తమ చక్రవర్తి
హరిదంతి కరిదంతి హారరాజసురభూజ-తారకా నిర్మలోదారకీర్తి
దుర్వార పరిపంధి గర్వగాఢాంధకా-రచ్ఛటాహరణ మార్తాండమూర్తి
హేమభూధేను గంధేభఘోటక దాన-ధారాకృతాంభో నిధానపూర్తి

యాతఁడింపొందు లాటకర్ణాటభోట
ఘూటకరహాట పాండ్య పానాట గౌడ
చోళ మళయాళ రాజసంస్తూయమాన
మానధనుఁడైన చిత్తాంబుఖానవిభుఁడు. పీఠిక 14.

6. "ఆరాజేంద్ర శిఖావతంస నిజబాహాయత్త విశ్వంభరా
ధౌరేయుండు విరోధి మంత్రిముఖ ముద్రాదక్షుఁడుద్యద్దయా
పారీణుండు పటీరతారక సుధాపాణింధమ శ్రీ యశో
హారుండెన్మలపల్లి మాదవిభు పెద్దామాత్యుఁడుల్లాసియై—పీఠిక 15.

7. "ధర్మనామ్నాయు సత్కవితాధురీణు
దాంతు శతలేఖనీ సురత్రాణ బిరుద
కలితునను వేడ్కఁ బిలిపించి గారవించి
తేనియలుచిల్క నిట్లని యానతిచ్చె, పీఠిక 17.

8. "...విచిత్రగతి నలంకారసరణి
మీఱురసములు సిప్పిల మెచ్చులొలుకఁ
ఇనుఁగు గావింపు నాపేర ననఘసుకవి
ధీరులరుదందఁగాఁ జిత్రభారతంబు. పీఠిక 19.

9. "అని యానతిచ్చి కర్పూరతాంబూలంబు తోడఁగూడ జాంబూనదాంబరాభరణ సంకుమద మృగమదగంధసారంబులు దోరహత్తులుగా నొసంగి యనిపిన నేనును. "భుజబలభీమ, ప్రతిగండ భైరవ, యిరువత్తు గండగోపాళ, గండరగండ భేరుండ, మండలీక మృగబేంటెగార, సమరరామ హుత్తరాయ, సంగ్రామ ధనంజయ, కోదండ విద్యాపాండిత్య రఘురామ, యపరిమిత భూదాన పరశురామ, సురంతరి భోగ సుత్రామ, యుష్టదిగ్గజ మనో భయంకర, దుష్టలాంకుశ లారూసరి గజాంకుశ, ఇప్పత్తెలు దాడికయిర నాయంకరతల లంకగండ, హెమ్మకట్టు కుది, కట్టు మండలీకరగండ, యెబిరుందగండ సర్వ బిరుదరకోముర, వేశ్యాభుదంగ యనవరత కనకకర్పూరదాన ధారాప్రవాహాభిషేక బిరుద ప్రశస్త మధ్యమ మండలాధీశ్వర, భోగవంశపయః పారావార రాకాసుధాకర, శ్రీ చిత్తాంబుఖాన మహీమహేంద్ర దక్షిణ బాహూపాల ద్విశ్వ విశ్వంభరాభారంధారేయుండును ......నను నమ్మంత్రిమణి పీఠిక 20

10. "ఏలింపఁబతిచేత హిమధరాధర సేతు - పర్యంత మేదినీపతుల నెల్లఁ
బాలించె నిజబుద్ధి బలముచే నాజ్ఞావ - శంబులై చెలఁగ దేశంబులెల్లఁ
గూలించె సంగరక్షోణి బాహాసిచే - దర్పితారాతి జాతంబు నెల్లఁ
దూలించె నీగిచే దుర్భాగ్య బుధబంధు - యాచకవ్రాత దైన్యంబు నెల్ల
మించి చిత్తాంబుఖాన భూమీమహేంద్ర - సకల సామ్రాజ్య లక్ష్మీకవిశారదుండు
భాగ్యసంపన్నుఁ డెన్మిలపల్లిమీఁద - మంత్రిశేఖరు పెద్దనామాత్యవరుఁడు పీఠిక 72

పెద్దనామాత్యుని పెదతమ్ముఁడు సింగమంత్రికిని చిత్తాంబుఖానునకును సంబంధము కలదు. సింగమంత్రి దుర్గాధిపతిగ నుండెను.

11. "తనప్రతాపాగ్ని శాత్రవ సముత్థితిసేన-భూరిభూమీధ్రంబుఁ బుటము వెట్టఁ
దనకాంతి చంద్రిక జననేత్రకువలయం-బుల నేలి మురువుఖాంబుజము ముసుఁచఁ
దనదాన మేఘ మర్థిని కాయ చాతకా - వళిఁ బ్రోది చంద్రమండలముఁ బొదువఁ
వలరుఁ జిత్తాంబుఖాన దయాత్తహేమ - చామరాందోళికార్జున చ్ఛత్రపీఠి
కాకరండకలాచి భృంగారకాద - రాజచిహ్నాంచితుఁడు సింగరాజు భువిని - పీ. 67

పెద్దనామాత్యుని రెండవతమ్ముఁడు తిరుమలయ్య ఓరుగంటిలో పాంచాలేశ్వరాలయమును గట్టించినాఁడు:

12. "అలఘుప్రాభవుఁడయిన మాదవిభు తిమ్మామాత్యముఖ్యుండు తా
నెలయూరన్ రజతాచలంబుగతి లక్ష్మీశాలయం బర్థి ని
శ్చలభక్తి న్విలసిల్లఁజేసి మఱి పాంచాలీశ్వర ప్రాంగణ
స్థలిఁ గట్టించె సువర్ణకుంభవిలసత్సౌధంబు నోర్గంటిలోన్.—పీఠిక 64.

పితాబుఖాను సంప్రోక్షణచేసిన పాంచాలీశ్వరాలయ మిదియే.

13. "...భోగికుల సప్రమాద్యంధుర ప్రజ్ఞ...(పెద్దనామాత్యా!) - 2.161

14. "శ్రీలక్ష్మీశ్వర పాదభక్తి నిరతా చిత్తాబుఖాన క్షమా
పాలాగ్రేసర సత్కృపాకలిత దీవ్యద్దీపికా పేటికాం
దోళీఛత్ర కళాచికా ముఖగణా మానాంక చేతోభవ
ప్రాలేయాంశు జయంత మాపరిపు వీరవ్రాత సంహారకా - 4-146

వావిళ్ళవారు ప్రకటించిన యీ చిత్రభారత ప్రతియందు "చిత్తాంబుఖా"నని పై పద్యములలో ముద్రితమయినది. పూర్వోక్త 14వ ఉదాహరణములో "చిత్తాబుఖాన" అని ముద్రితమయినది. ఈ ప్రతి శ్రీ వీరేశలింగముగారు ప్రకటించిన ప్రతిని సవరించి "పరిశుద్ధముగా, ముద్రా ప్రమాదాదులు సవరించి" పునర్ముద్రణము చేయబడినట్టిది. శ్రీ వీరేశలింగముగారు తాము ప్రకటించిన ప్రతిలో "మానభూనాథ చిత్తాబ్జభానుఁడతఁడు" అని ముద్రించిరి. అనగా వీరేశలింగముగారి పాఠము ప్రకారము ఈ నాయకుని పేరు "చిత్తాబ్జభానుఁడు". చిత్తాపుఖానుఁడను పేరు విచిత్రముగా ముసల్మాను నామధేయముగా నుంటచే, చరిత్రాధారములు తెలియక పరిష్కర్తలు పడిన గజిబిజి యిది. ఈ విషయమై సుకూర్పి శ్రీ లక్ష్మణరావుగారు శివతత్త్వసార పీఠికలో 1-21 లో ఇట్లు వ్రాసియున్నారు:-

"శ్రీ వీరేశలింగము పంతులుగారీ గ్రంథమును ప్రకటించిన సమయమునందు "చిత్తాపఖానుఁ"డను వాఁడొకఁడు కలఁడని వారికేఁ దెలియదు. వారికే కాదు, ఇతర చరిత్రకారులకుఁగూడ బాగుగఁ దెలియదనయే చెప్పవచ్చును. ఇది యుండఁగ, పద్యములోని సందర్భమును జూడఁగా నచ్చట వర్ణింపఁబడిన రాజు హిందువుగఁ గాన వచ్చుచున్నాఁడు. గాని తురకవాఁడుఁ గానరాఁడు. ఇప్పటికిని నీతఁడు హిందువా మహమ్మదీయుఁడా యనినమాట స్పష్టముగఁ దెలలేదు. కావున వీరేశలింగముగారు 'చిత్తాపఖాను' శబ్దమును 'చిత్తాబ్జభానుఁ'ముగ దిద్ది ప్రకటించిరి. దీనివలన నేమైనది ? చిత్తాపఖానుఁడను నొక తురకనవాబు హిందూ దేవాలయములకు దానధర్మములు చేయువాఁడు, మానుఁడను తండ్రిగలవాఁ డుండెనని తెలిసికొనుటకు 30 సంవత్సరములు పట్టెను. (వరంగల్లులో నున్న పెద్దశాసనము ప్రతియొకటి నేనిటీవలఁ జూచుట తటస్థించినందున నీ చిత్తాపఖానుఁడు బైటబడియెను. అంతకుఁ బూర్వము తురుష్క-

లచేఁ బాడుచేయఁబడిన పాంచాలీశ్వర దేవాలయము నీతఁడు మరల బాగుచేయించె నని యీ శాసనమందున్నది...)".

అద్దంకి గంగాధర కవి రచించిన తపతీసంవరణోపాఖ్యానమునందును చితాపు ఖానుని యుదంతము సూచితమయినది. ఈ కావ్యము గోలకొండ నవాబగు ఇబ్రహిం మల్కునకు (మల్కిభరామునకు) కృతి యీయబడినది. ఈమల్కిభరాముడు ఇబ్రహిం కుతుబుశాహా అను పేరుతో 1550-1580 వరకు గోలకొండ నేలెను. ఇతడు కులీకుతుబుశాహా (1512-1543) కుమారుడు.

ఈ కావ్యములో

"కంపమంది చితాపుఖానుఁడు గొతిమీ తిటిసి లంఘించి పోఁబుటముపెట్టె"

అని యుండుటంజేసి షితాబుఖాను ఇబ్రహిం కుతుబుశాహాకును సమకాలికు డగుచున్నాడు. షితాబుఖాను గోదావరిని దాటి పారిపోవుట కులీకుతుబుశాహ విజయనాధదేవ గజపతుల మధ్య జరిగిన పూర్వోక్త సంధిని సూచించుచున్నదని డాక్టరు హీరానంద శాస్త్రిగా రభిప్రాయ పడుచున్నారు.

3

కుమార ధూర్జటి ప్రణీతమయిన కృష్ణరాయ విజయమునందు చిత్తాపుఖాను ప్రశంసకలదు. ఈ కావ్యకర్తకు వేంకటరాయామాత్యు డను రెండవ నామము కలదు.

శ్రీకృష్ణదేవరాయలవారు పూర్వదిగ్విజయ యాత్రకు బయలుదేరి కందుకూరు కొండవీడు, కొండపల్లి వినుకొండ మొదలగు కోటలను జయించి, జయోత్సాహం బున మించి, గజపతి యున్న దేశంబునకుం గమకంబునం దమకంబుమీరం జనునెంచె నట. ఈ దండయాత్రయందే రాయలవారికి చితాపుఖానుతో సంగరము తటస్థించి నది. చితాపుఖాను ఓడిపోయినాడు. ఈ కథాభాగమును కుమార ధూర్జటి ఇట్లు వర్ణించియున్నాడు:—

1. ఆవీర నృసింహాధరి
   శ్రీవరనందనుఁడు రణదతిస్ఫుటభేరీ
   రావములు చెలఁగ నడచెన్
   దేవతలు నుతింప గజపతిన్ గెలుచుటకై 69
2. చనుచోఁ జితాపుఖానుం
   డనువాఁడు ధరాధరాంత రాంతరసీమన్

గనుమలలో నఱువదివేల్
ఘనశౌర్యజ్య ధరుల్ చెలంగఁ గలహ మొనర్చున్ 8.70

3. నాలుగు దిక్కులం గవిసి నట్టడవిం జరియించు నచ్చమూ
పాళిగలంగ బల్లెముల బాణములన్ మెఱుఁగీటు గుంపులన్
రాలఁదుపాకులం బలు ఫిరంగుల భంగమునొందఁ జేసి గ
గ్గోలుపడం గడంగి యెంగోలు బంటు చలం బెలర్పగన్ 8.71

4. మాంగలనెసంగరంగ
తుంగ తురంగోగ్ర ఖురవిధూతరజంబుల్
నింగిఁ జెలంగఁ గళింగ ధ
రాంగణమున నిల్చె రాయ లద్భుత మతిమై 8-72

5 చితాపుఖానుఁడుం గడింది చిచ్చు నార్ప నేర్చి వ
చ్చితింగదా మునుంబు మీఱి శీఘ్రము మీ గజాధిపున్
నితాంతకీర్తి ధాత్రిలోన నిండగల్పెదన్ ఘన
ప్రతాపదీధితిన్ దిగంతభాగము ల్వెలార్చెదన్ 8.78

చితాపుఖాను 60,000 తురుష్కులతో రాయల నెదిరించెను. వానిదాడి కడింది చిచ్చుగానుండెను. ఆ చిచ్చునార్చుట కష్టమయిన కార్యము కనుకనే, ఆజయము రాయలకు ముదంబుగూర్చెను. చిచ్చు నార్చు నేర్పు వచ్చితింగదా యని రాయలవారు దీర్ఘ నిశ్వాసము చేసిరి. ఈ సంఘటనము క్రీ. శ. 1515-16 లో జరిగినది. విశ్వనాధరాయని స్థానాపతి రచించిన "రాయవాచకము" నందును ఈ విషయము వర్ణితమయినది.

రాయవాచకము విశ్వనాధరాయని స్థానాపతి రచించిన గ్రంథము. ఇందలి 94-95 పుటలలో చిత్తాపఖానునిగూర్చిన ప్రసక్తి యిట్లు గలదు:—

"రాయలవారు ... కదలిపోగా గజపతివారి కనుమల నడుమ పొయ్యేటప్పుడు చితాపుఖానుఁడనేవాడు అరవై వేల శింగాణి రాతులతో దట్టు కనుమమార్గమున పొయ్యే రాతురాణువమీద చిత్తవాన గురిసినరీతి అమ్ముల గురియించ్చగా అంమ్ములనుండ్డి తప్పించుకొనువారున్ను ఆ యంమ్ములకు యెదురై నిలిచినవారున్ను ముంద్దు వెనక తెలియక నిలిచినవారున్ను ఆడాడ దిగ్భ్రమపడి వున్నవారున్ను యీరీతిని వుండ్డగా చితాపుఖానునికి యెదురులేదు గనక జగడం శేయగా ఆ సమ

యాన కర్నాటకంకై జీతం రౌతులు చితాపుఖానునికి పెడతలపోటుగా ఇరు పార్శ్వాల కనమల పొదువున నెక్కి చితాపుఖానుని వెనకదిక్కులకై వచ్చి శింగాణుల చేతనున్ను ఖడ్గముల చేతనున్ను బరిజీల చేతనున్ను వేటారు తునకలుగా నరకగా చితాపుఖానుని తెగలకు కనుమలో నిలువకూడక విరిగి పారగా వెంబడించ్చి తిరుముకబోయి వారిని దుర్గం చొరదోలి తిరుగా వచ్చిరి. గనక అప్పుడు చితాపుఖానుని తెగలో యిరవై మూడు వేల స్త్రోమమున్ను నాల్గు వేల గుర్రమున్ను వఖతావున్ను మడిసి అటుతర్వాత సమదళం ఆజ్యాంత్రమున్ను ముంద్దర కదలిపోయిరి"

కృష్ణదేవరాయలవారు కళింగదేశముపై దండెత్తినది 1515-1516. కావున ఈ సంఘటనము ఆ కాలమునకు చెందియున్నది. "కృష్ణరాయ విజయము" లోని వర్ణనలతో నిది సరిపడుచున్నది.

## VII. హిందువా! ముసల్మానా?

ఏకశిలానగర కైఫియ్యతులోని భావమును వ్యాఖ్యానించుచు డాక్టరు హీరానంద శాస్త్రిగారు ఇట్లు వ్రాసియున్నారు. (పుట 10)

ఏకశిలానగర కైఫియ్యతును నమ్మినచో షితాబుఖాను తన కాంతాసిద్ధి కొరకు, అనగా మహమ్మదీయ విజేత ఆగ్రహమునుండి తప్పించుకొనుటకు ఇస్లాం మతమును స్వీకరించినాడేమో యని యనుకొనవలసివచ్చును. ఇందు ప్రకటితమయిన శాసనమేమి, మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతలేమి, ఇంక నితర ఆధారము లేమి యితడు హిందువనియే చెప్పుచున్నవి. మొదటి కైఫియ్యతులో బోయవాడని పిలువబడినది. బోయలు పల్లకీలు మోయుట, చేపలు పట్టుట వృత్తిగాగల శూద్రజాతీయులగు అల్పులు కావున వీడు కులపు పట్టుకల కలవాడుగా నుండక పోవచ్చును. అల్పజాతి సంభవుడగుటచే అగ్రవర్ణముల వారితనిని గౌరవింపకుండుటయు, వీడు వారిని ద్వేషించుచుండుటయు సంభవించి యుండును. హిందూదేవాలయముల శిలా పరికరములతో నీతడు రాతికోట నిర్మాణమును ముగించియుండుట అర్థమగుటలేదు. అప్పటి సంగతి సందర్భములను పురస్కరించుకొని వాడట్లు ప్రవర్తించవలసిన అవసరము కలిగెనేమో! అపవిత్ర మందిరములు శిథిలములయిపోగా, వాటి పరికరములు వినియోగించి యుండవచ్చును. పేరు చివర నుండు ఖానుశబ్దము వాడు మహమ్మదీయుడయినట్లు తెలుపును. ఎప్పుడు, ఎట్టి సందర్భములందు వాడు మహమ్మదీయ మత మవలంబించినది మనము చెప్పజాలము. ఇప్పుడు మన దృష్టిలోనున్న యీశాసన సమయమున, అనగా క్రీ.శ. 1504లో వీడు సనాతనాచార పరాయణుడగు హిందువుగా నుండెను. అయినను షితాబుఖానను పేరుతోనే వాడు తెలియ

వచ్చియుండెను. ఈ కైఫీయ్యతునే నమ్మవలసి యున్నచో ఏడీకాలమునకు ముందే అన్యమతమును స్వీకరించి యుండి యుండును. దీనికి సాదృశ్యముగా "వరంగల్‌ను జయించిన మొదటి మహమ్మదీయుడు షితాబుఖాను. ఇతడు దుర్గముయొక్క పశ్చిమ ద్వారముదగ్గర కొన్ని మందిరములను కట్టించెను" అని "గ్లింప్సెస్ ఆఫ్ ది నిజామ్సు డొమీనియన్సు" అను గ్రంథము చెప్పుచున్నది. ఈ వాక్యము వ్రాసిన చరిత్రకారుని పేరు చివరనుండు ఖానుశబ్దము తప్పుత్రోవను బడవేసి యుండును. ఏలయనగా, షితాబుఖాను మతమునుబట్టి ముసల్మాను అనుటకు తెలిపెడు ప్రమాణములు తెలిసినంతవరకు ఏమియు లేవు. పైగా, మహమ్మదీయ చరిత్రకారులగు ఫెరిస్తా మొదలగువారు వీనిని కాఫరనియే పేర్కొన్నారు. ఈ విధముగా వీడు ముసల్మాను కాడని స్పష్టపడుచున్నది. 1504లో వీడు గాఢ ధర్మాభిరతుడగు హిందువని యీ శాసనము నిర్దేశించుచున్నది. పైన పేర్కొన్న కయిఫియ్యతులో వీడు హిందువుల ద్వేషియని నుడువబడినదే గాని వీడు ముసల్మాను అయినట్లు చెప్పుటలేదు. కిమ్మూర్మరు కైఫీయ్యతు వీడు బోయకులములో జన్మించినట్లు తెలుపుచున్నది. కావున అగ్రవర్ణములవారు వాని అల్పజాతి సంభవమును మరచిపోక,—అగ్రవర్ణ హిందువులు ఆ యా శూద్రులను, అంత్యజులను హిందువులనుగా పరిగణింపరు కావున – వీనిని ద్విజునిగా అగ్రవర్ణములవారు ఒప్పుకొనలేదేమో యని తోచుచున్నది. అయినను వీడు ముసల్మానుకాడు. అగ్రవర్ణములవారి ప్రవర్తనము తనయెడ నిట్లు విస్పష్టమగుచుండుటచే, వీడు తన యిష్టమువచ్చినట్లు ప్రకటించుకొనుటకు నిశ్చయించి, భోగివంశములోని మహారాజన్యుడుగను విక్రమాదిత్య తుల్యుడుగను తాను వర్ణితుడగునట్లు ఏర్పాట్లు చేసికొనెను కాబోలు"

ఈవిధముగా ఏకశిలానగర కైఫీయ్యతులోని విషయమును సమన్వయించుటకు డాక్టరు హీరానంద శాస్త్రిగారు చాల దూరము చర్చించినారు. తుదకు హిందువనియే నిర్ధారణకు వచ్చినారు. ఈ చర్చలో "అగ్రవర్ణ హిందువులు ఆయా శూద్రులను, అంత్యజులను హిందువులనుగా పరిగణింపరు" అని మెల్లగా అభిప్రాయమును జారవిడిచినారు. ఈ భావము తమ వాదమును ఎట్లు పోషించుచున్నదో తెలియుటలేదు. శూద్రులు, అంత్యజులు హిందువులు అగునా? కారా? అను చర్చ మన కప్రస్తుతము. ఇక ఏకశిలానగర కైఫీయ్యతును వేరువిధముగ సమన్వయించుటకు వీలులేదా? వీలున్నట్లే తోచుచున్నది.

## VIII. ఇద్దరు షితాబుఖానులు

చరిత్రగ్రంథములు, కయిఫియ్యతులు పరిశీలించినప్పుడు 'షితాబుఖాను' అను పేరుగల వ్యక్తులు యిద్దరున్నట్లు డాక్టరు

హీరానందశాస్త్రిగారికి అనుమానము తోచినది. కావున తమ యీ అనుమానమును ఆ యా సందర్భములందు వెల్లడించి యున్నారు. ఆ భాగములను క్రింద చూపుచున్నాను:-

"ఈ కయిఫియ్యతులలో వర్ణితమయిన విషయములు ఇద్దరు పితాబుఖానులు- వేర్వేరు పురుషులు- ఉన్నట్లును వారి పరస్పర చరిత్రలు మిళితమయిపోయి నట్లును తెలుపుచున్నవి." పుట 5

"ఈ కయిఫియ్యతు (V-2) పితాబుఖాను జీవితములోని కొన్ని సంఘటనలను పేర్కొనుచున్నది. ఇవి గోలకొండ నవాబగు ఇబ్రహీం కుతుబుషా రాజ్యకాలమునాటివి.(1551-1581) మన ఈ శాసనపు పితాబుఖాను క్రూర హుమాయూన్ శావా (1458-1461) సమకాలికుడు గావున, ఈ కయిఫియ్యతులో ఇబ్రహీం కుతుబుశాహా సమకాలికుడుగా చెప్పబడిన పితాబుఖాను మరియొక వ్యక్తియై యుండవలయును. ఇబ్రహీం కుతుబుషాహా కాలములో పితాబుఖాను అనువాడొకడుండెనని తారీఖి కుతుబుశాహీని ఈ క్రింది కథనము IV-4 వల్ల తెలియవగుచున్నది." (పుట 7)

"నిశ్చయముగా వీడు (V 2 లో వర్ణితమయినవాడు) మరియొక పితాబుఖాను అయి యుండవలెను. ఈ రెండు కయిఫియ్యతులు (V-1,2) విషయములను కలగాపులగము చేసినవి. క్రూరహుమాయూన్ శాహ కాలమునాటి పితాబుఖాను వేరనియు, ఇబ్రహీం కుతుబుశాహ నాటి పితాబుఖాను వేరనియు కనుగొనజాలక పోయినవి. బురహానిమసీర్ ననుసరించి పైన నుడివిన ప్రకారము క్రీ. శ. 1461 ప్రాంతములో హుమాయూను క్రింది అమీర్లలో పితాబుఖానొకడయి యుండెను. ఈకాలములో వీడు 20 లేక 25 సంవత్సరముల ప్రాయపు యువకుడని ఒకవేళ మనము భావించినచో, 1571 లో అనగా ఈ సంఘటనము జరిగిన ఇబ్రహీంరాజు కాలములో వీడు 130 లేక 135 సంవత్సరములవాడయియుండును! కావున ఇప్పుడు ప్రశస్తిలో వర్ణితుడయిన వీరుడు ఏకనామధేయుడగు వేరొకనితో విడదీయవలసియుండును. ఈ రెండవవాడు క్రీస్తుశకము 16 వ శతాబ్దముయొక్క తరువాతి అర్ధభాగములో వచ్చినట్టివాడయియున్నాడు" (పుట 9)

పూర్వోక్త వాక్యములనుబట్టి ఇద్దరు పితాబుఖానులున్నట్లు డాక్టరు హీరానంద శాస్త్రిగారు తమ యభిప్రాయముగా స్పష్టపరచినారు. ఇద్దరున్నారని తలంచుటయే సమంజసముగా గనుపడుచున్నది. అయితే యీ యిద్దరిలో మొదటివాడగు శాసనపు వీరుడు హిందువని స్పష్టమగుచున్నది. ఈ విషయమును చిత్రభారతములోని వర్ణనావిశేషములు ధృవపరుచుచున్నవి. ఇక రెండవవాడు మహమ్మదీయుడయి యుండవచ్చును. అట్లే

యయినచో ఏకశిలానగర కయిఫియ్యతులోని విషయములు మన బుద్ధిచాతుర్యములు పరువులెత్తకుండనే సత్యచరిత్రమని నిర్ధారించుటకు అవకాశము కలుగుచున్నది.

ఈ రెండవ షితాబుఖాను మహామ్మదీయుడని నిరూపించుటకు పేరు కారణములును గనుపించుచున్నవి. ఏకశిలానగర కయిఫియ్యతులోని చివరి వాక్యమును డాక్టరు హీరానందశాస్త్రిగారు గమనించినట్లు లేదు. అందిట్లున్నది:—

"షితాబుఖాను వెంబడి కొందరు రత్నకంబళ్లు నేయువారు ఉత్తరమునుండి వచ్చి యీ శిలాదుర్గములో నతనియొద్దనే నిలిచిపోయిరి".

ఈ వాక్యములోని "షితాబుఖాను వెంబడి" "ఉత్తరము నుండివచ్చి" అను పదములు ఈ రెండవ షితాబుఖాను ఉత్తరమునుండి వచ్చిన వాడని స్పష్టపరుచుచున్నవి. కావున వీడు ఉత్తరమునుండి వచ్చిన ముసల్మానుడయి యుండును. ఈ రెండవ ముసల్మాను వీరుడు హిందుద్వేషిగా నున్నాడన్నచో అందాశ్చర్యమెంతమాత్ర ముండకూడదు. ఇక ఏకశిలానగర కయిఫియ్యతులోని విషయములు సత్యచరిత్రాంశములేయని మనము తీర్మానించవచ్చును.

పైనిచ్చిన చరిగొండ కయిఫియ్యతు (V-4) కూడ ఈ వాదమున కుపబలముగా నున్నది. అందిట్లున్నది:—

"శితాబుఖానుడు అనే తురకవంశం వారు యీదేశంబులు ౭౮ దుర్గాలు రాజ్యంబు చేసినది డెబ్భై సంవత్సరంలు".

ఇందు "తురకవంశంవారు" అని స్పష్టంగానున్నది. కావున రెండవ షితాబుఖాను మహామ్మదీయుడనుటలో సందేహవిచ్ఛేదము కలుగుచున్నది.

"ఫరంగిలును జయించిన మొదటి మహామ్మదీయుడు షితాబుఖాను..." అని "గ్లింప్సెసు ఆఫ్ ది నిజామ్సు డొమీనియన్సు" అను గ్రంథములోని వాక్యమును ఈ వాదమునకే పుష్టి కలిగించుచున్నది. డాక్టరు హీరానందశాస్త్రిగారు సెలవిచ్చినట్లు "పేరు చివరనుండు ఖాను శబ్దము" ఆ చరిత్రకారుని తప్పుత్రోవను పడవేసి యుండలేదేమో.

## IX షితాబుఖాను హిందువే.

షితాబుఖాను వంశీయులగు పూర్వులను గూర్చిన సత్యచరిత్ర విశేషములు తెలియవు. ఇతని మొదటిపేరేమో, సరియైన పేరేమో తెలియదు. ఈ శాసనమునుబట్టి ఇతనిపేరు చిత్తాపఖాన. ఇది షితాబుఖానను పదమునకు సంస్కృతీకరణము. కయిఫియ్యతులు, కావ్యములు, ముసల్మానుల వ్రాతలు పైన వివరించియున్నాము. వాటినిబట్టి ఇతని మొదటిపేరు సీతడు. ప్రాభవదశలో సీతాపతి అని గౌరవముగా పిలువబడినాడు. తరువాత

షితాబుఖాను అను పేరును వహించి యుండవచ్చును. కొంతకాలము మహమ్మదీయరాజుల క్రింద సరదారుగా నుండుటచే, హుమాయూన్ షాహరో, మరి ఎవ్వరో ఇతనికీ బిరుద మిచ్చియుందురు. లేదా ఇతడే తనకు తానే యీ బిరుదము పెట్టుకొని యుండవచ్చును. ఏదియు సిద్ధాంతరణగ చెప్పలేము. ఈ నామము ఇతని జీవితమందలి అత్యంత శీఘ్రోన్నత్యాభ్యుదయములను సూచించుననినచో అందు వికల్పమేమియు లేదు. షితాబు అనగా అభ్యుదయము. ఖాను అనునది శూరనాయకుడని అర్థమిచ్చెడు బిరుదనామమే. ఖాను అని పిలువబడినంత మాత్రమున వాడు ముసల్మానయి యుండవలసిన అవసరము లేదు. ఏలయనగా హిందువుకూడ అట్లే పిలువబడవచ్చును. మియా, మిర్జా అను పదములు కూడ నట్టివే. ఈ శాసన లిఖితమునుబట్టి షితాబుఖాను కొడుకు, హిందువుడయినను అవధూతఖాను నామధేయమును వహించియున్నాడు. అవధూత అనునది నిశ్చయముగ హిందువులు పెట్టుకొను సంస్కృతపదము. ఈ శాసనమువల్ల ఇతడును, ఇతని కొడుకును బ్రాహ్మణమత పరాయణులని నిస్సందేహముగ తెలియుచున్నది. తారీఖ్ కుతుబుషాహీ అను గ్రంథము ఇతడు కాఫరు అని స్పష్టముగ నుడువుచున్నది. ఈ గ్రంథపు వ్రాతప్రతి ఆసఫియా గ్రంథాలయములో నున్నది. అందలి వక్కాణ మిట్లున్నది:—

"నవాబుగారి భాగ్యవిశేషమున అట్టి బలీయదుర్గము పట్టుకొబడినది ... విజేతలయిన సైనికులు హస్తములు చాచి, షితాబుఖాను, అతని దుష్టసహాయకులు కూడబెట్టిన ధనమును, రత్నాభరణములను దోచుకొని కొల్లగొట్టిరి. షితాబుఖాను కుటుంబపు రాకుమార్తెలును, అవరోధజనమును రచ్చకీడ్వబడిరి. నవాబు అనుమతిప్రకారము కాఫరుల భవనములు, దేవమందిరములు భగ్నము చేయబడెను. వాటి స్థలములందు ముసల్మానుల మసీదులు, ధార్మిక నివాసములు నిర్మితములు కావింపబడెను."

ఈ శాసనానుసారము షితాబుఖాను భోగివంశములో పుట్టినాడు. భోగి అనునది భోగిని అనుపదమునకు రూపాంతరమో, భోయశబ్దమునకు సంస్కృతరూపమో చెప్పజాలము. శాసనమునవాడు జన్మతః ద్విజత్రయములో ఏదేనొకదానికి చెందినవాడని కాని శూద్రుడని కాని నుడువుటలేదు. ఇతని పితామహుడు నాయకేంద్రుడను నాగాఖ్యుడు. ఇతని తండ్రి ధానుమ్న(?)వీరుడగు మానాఖ్యుడు. తల్లి గౌరాంబ.

ఈశాసనము ప్రకారము షితాబుఖాను శా.శ. 1425 మాఘ శు 7 ఆదివారము (21 జనవరి 1504) నాడు మహమ్మదీయుల నిర్జించి ఓరుగల్లు పురమును స్వాధీనము చేసికొనెను.

"బురహానీమసీద్" అను గ్రంథము ప్రకారము 903 హిజ్రిలో (క్రీ.శ. 1497)

వరంగల్ కుతుబుషాహీ రాజ్యములో చేరియుండెనని తెలియనగుచున్నది. ఏలయనగా, కులీకుతుబుషా "తెలంగాణములోని సామంతరాజులందరిపయిన ప్రభుత్వము వహించి, తన పూర్వరాజ్య ప్రాంతమునకు వరంగల్‌ను కోయిలకొండ వాటి సామంత భూములను కలిపివేసెను" అని అందు వ్రాయబడియున్నది. అందుచేత, ఈ శాసన కథానాయకుడు 1504లో కులీకుతుబుషా (గోలకొండ కుతుబుషా వంశస్థాపకుడు) పిడికిటినుండి ఓరుగంటిని లాగుకొని యుండెనని మనము నిర్వివాదముగ తేల్చవచ్చును. అప్పటి కతడు స్వతంత్ర్యము ప్రకటించియుండడు. వరంగల్ షితాబుఖాను స్వాధీనములో ఎక్కువకాలము నిలిచియుండలేదు. ఏలయనగా, కులీకుతుబుషా 1512 లో అలాఉద్దీన్ ఇమాదుషాను ఓడించినపిదప దీనిని మరల పట్టుకొనియుండెను. కాబట్టి షితాబుఖాను తన విజయఫలములను ఆరు ఏడు ఏండ్లకంటె నెక్కువకాలము అనుభవించి యుండడు. ప్రాచీన హిందూ రాజులవలె దేవ ప్రతిష్ఠలుచేసి, దానధర్మాలొనర్చుటయే మహాదాశయముగా గలిగి, తన ఆశయసిద్ధిని సంపూర్ణముగా బడసిన యీ తారాచువ్వ వీరునివంటి వానికి ఈ ఆరేడేండ్లకాలము అంత తక్కువ కాలము కాదేమో!

పైన వర్ణితమయిన కథనమునుబట్టి షితాబుఖాను హిందువే కాని మహమ్మదీయుడుకాడు. వీడు సామాన్య బోయ కుటుంబములో క్రీ. శ. 1440 లో జనించియుండవచ్చును. భాగ్యరేఖ వరుసరించియు, స్వయంసహాయమునను ఉన్నత పదవికి వచ్చెను. మొదట ఇతడు బహమనీ వంశ హుమాయూన్‌షా క్రింద వరంగల్ పాలకుడుగానుండెను. తరువాత స్వతంత్రుడయ్యెను. 1504 ప్రాంతములో స్వతంత్ర రాజ్యమును స్థాపింపగలిగి, ఏకశిలాపురినేత - చిరకాలము కాకపోయినను - కొంతకాలము పాలింపగలిగెను. అంత దురదృష్టదినములు వచ్చెను. తుదకు గోలకొండ నవాబులతో యుద్ధము చేయుచు 1512 లో రణరంగమున వీరశయనము నొందెను.

## X విన్నపము

షితాబుఖాను-సీతాపతి అను ద్వంద్వనామములతో ప్రసిద్ధికెక్కిన వీరవరుని గూర్చి వినినప్పుడెల్ల వాని పూర్ణోదంతమును తెలిసికొనవలయునని కుతూహలము నాకు కలుగుచుండెడిది. మా నిజాం సర్కారు ఆర్కియాలజీ (?) శాఖవారు ప్రకటించిన "వరంగల్ షితాబుఖాను" అను శాసన గ్రంథము (No 9)ను డాక్టరు హీరానంద శాస్త్రిగారి వ్యాఖ్యయు నాకెంతో యానందము కలిగించినది, అంతియెగాదు. ఆగ్రంథమునందలి అద్భుత వీరచరిత్ర గాథలను ఇంగ్లీషు రాని మా యాంధ్ర సోదరులకు తెలుపుట భావ్యముగా భావించితిని. ఏతద్భావపరిణామమే యీ వ్యాస రచనము.

డాక్టరు హీరానంద శాస్త్రిగారి రచనమును పూర్తిగ ననువదించియున్నాను. క్రొత్తవిషయము లేమయిన దొరకునేమో యని ప్రయత్నించినాను. కాని ఒండు రెండు అల్పవిషయములు తప్ప చెప్పుకో దగ్గదేమియు లేదు. ఆంధ్ర కావ్యములలోని పద్యములను పూర్తిగ నుదహరించినాను. ఇందలి ఎనిమిదవ ప్రకరణము మాత్రము డాక్టరు హీరానందశాస్త్రిగారికి విన్నపుడ నయి చేర్చినాడనని మనవి చేసికొను చున్నాను.

ఆంధ్ర చరిత్రకు సంబంధించిన ప్రసిద్ధ వీరుని శాసన గ్రంథమును ప్రకటించిన నిజాం సర్కారు ఆర్కిశాఖవారికిని, అత్యంత శ్రద్ధతో, సమర్థతతో శాసనమును పరిశోధించి, పెక్కు నూతనాంశములను క్రోడీకరించి వ్యాఖ్యానము వ్రాసిన డాక్టరు హీరానందశాస్త్రి, ఎం. ఏ; ఎం. ఓ. ఎల్; డి లిట్ గారికిని కృతజ్ఞతాపూర్వకముగా నమస్కరించుచున్నాను. నా యీ వీరగాన ప్రయత్నమును జూచి, విని, హర్షించి, ప్రోత్సహించిన నామిత్రుల కందరకును కృతజ్ఞుడనయియున్నాను.



# నేటి హైదరాబాదు

శ్రీ కొమ్మవరపు సుబ్బారావుగారు

## ప్రభువు

హిజ ఎగ్జాల్టెడు హైనెస్, లెఫ్టినంటు జనరల్ సిపాహసాలారు, అసిఫ్ జాహ, ముజప్ఫరుల్ ముల్కువాల్ ముమాలిక్, నిజాముల్ ముల్కు, నిజాముద్దౌలా, నవాబు సర్ మీరు ఉస్మానలీ ఖాన్ బహద్దరు, ఫత్తేజంగు, జి. సి. ఎస్. ఐ; జి. బి. ఇ, సుల్తానల్ ఉలూం, హైదరాబాదు - బరారు నిజాం రాజన్యులు.

శ్రీ ప్రభువువారు ఆసఫ్‌జాహీ రాజ వంశములో ఏడవ పురుషుడు. 1911 లో సింహాసనాసీనులయిరి. శ్రీవారి రాజ్యపరి పాలనా రజతోత్సవము 1936 లో మహా వైభవముగా జరిగినది. శ్రీవారు బ్రిటిషు సార్వభౌమప్రభుత్వమునకు అప్తమిత్రులు. రెండవ ప్రపంచ సంగ్రామమున నొసర్చి సహాయ సంపత్తిని పురస్కరించుకొని శ్రీ ఆరవ జార్జిచక్రవర్తిగారు "రాయల్ విక్టోరియన్ చెయిన్" అను ఉదాత్త గౌరవ బిరుదము శ్రీవారికి నొసంగి బహూకరించిరి. శ్రీవారి గౌరవార్థము కాల్చెడు ఫిరంగిగుండ్ల సంఖ్య 21.

## రాజ కుటుంబము

ఘనత వహించిన వాలాషాన్ బిరారు యువరాజు నవాబు ఆజంజాహ బహద్దరు, జి. సి. ఇ, జి. సి. వి, ఇ, గారు శ్రీప్రభువు వారి జ్యేష్ఠకుమారులు. వీరి సతీమణి దుర్రెషవార్ దుర్దానా బేగం సాహెబా గారు. ఈ రాజదంపతులకు ఇద్దరు కొమరులు గలరు. జ్యేష్ఠకుమారుడు నవాబు ముకర్రంజాహ బహద్దరు డేరాడూన్ కళాశాలలో విద్య నభ్యసించుచున్నారు. ద్వితీయ పుత్రుడు నవాబు ముకఫక్కంజాహ గారు, బిరారు యువరాజుగారు రాష్ట్రీయ సర్వసైన్యాధిపతి. గౌరవ భృతి నెలకు రు 2000/-లు.

వాలాషాన్ నవాబు మొఅజ్జంజాహ బహద్దరు కె. సి. ఐ. ఇ. శ్రీ ప్రభువువారి ద్వితీయ పుత్రులు. మొఅజ్జంజాహ బహద్దరు వారు నగరాభివృద్ధి సంఘమునకు అధ్యక్షులుగా నున్నారు. గౌరవ భృతి నెలకు రు 1000/-లు. వీరి సతీమణి నీలోఫర్ ఫర్హాత్ బేగం సాహెబాగారు.

రాజుగారి కోడండ్రిద్దరును తుర్కీ సుల్తాన్ రాజవంశీయులు.

నవాబు బసాలత్ జా బహద్దరు వారు శ్రీ ప్రభువువారి సోదరులు. బసాలత్ జా బహద్దరువారు రాష్ట్రీయ సెకండరీ ఎడ్యుకేషన్ బోర్డునకును, జాగీర్దారుల కళాశాల పరిపాలక సంఘమునకును అధ్యక్షులుగా నుండి విద్యావిషయములందు శ్రద్ధగైకొనుచుందురు.

## మంత్రిమండలి.

ఇచ్చటి మంత్రిమండలిని బాబెహుకూమత్ అందురు. అనగా కార్యనిర్వాహక సభ (Executive Council). ఇందు తొమ్మిదిమంది మంత్రులుంగలరు. ప్రస్తుతము ప్రభుత్వమును సాగించుచున్న మంత్రి మండలిని ఈక్రింద పేర్కొనుచున్నాము:-

1. ప్రధానమంత్రి:- కర్నల్ సర్ మహమ్మదు అహమద్ సయీద్ ఖాన్, చత్తారి నవాబు, నవాబు సయీదుల్ ముల్కుబహద్దరు, కె. సి. యస్. ఐ. ఎం. బి. ఇ., ఎల్. ఎల్. డి. వేతనము రు. 5000 కల్దార్లు. అలవెన్సు రు. 1000 హాలీలు. ఇతడే కార్యనిర్వాహక సభ అధ్యక్షుడు.

2. ఆరికమంత్రి:- ఆనరబుల్ జాహెదు హుసేన్, ఎం.ఏ. వేతనము రు. 3500 అలవెన్సు రు. 100.

3. రివిన్యూమంత్రి:- ఆనరబుల్ W. V. గ్రిగ్సన్, ఐ. సి. యస్. వేతనము రు. 4000 కల్దార్లు. అలవెన్సు రు. 100 కల్దార్లు.

4. న్యాయశాఖామంత్రి:- ఆనరబుల్ నవాబు అలంయార్ జంగు బహద్దరు. వేతనము రు. 3500 అలవెన్సు రు. 100

5. తామీరాత్ మంత్రి:- ఆనరబుల్ నవాబు జైన్యారుజంగు బహద్దరు వేతనము రు. 3500 అలవెన్సు రు. 100

6. మతశాఖ మంత్రి:- ఆనరబుల్ నవాబు జహీర్యార్జంగు బహద్దరు. వేతనము రు 3500.

7. విద్యామంత్రి:- ఆనరబుల్ సయ్యదు మహమ్మదు ఆజం, ఎం.ఏ. (కాంటబు) బి. యస్. ఇ. (లండన్) వేతనము రు. 3500, అలవెన్సు రు. 100.

8. పారిశ్రామిక శాఖామంత్రి:- ఆనరబుల్ నవాబు లియాఖత్ జంగు బహద్దరు. వేతనము రు. 3500.

9. వైద్యశాఖామంత్రి:- ఆనరబుల్ దివాన్‌బహద్దరు అరవముధు అయ్యంగారు, బి. ఏ. బి. ఎల్. వేతనము రు. 3500.

ఈ మంత్రులను 'సదరుల్ మహాం' లని ఉర్దులో అనెదరు. ఈ తొమ్మండుగురు కాక ఇంకొక మంత్రి కలడు. ఇతనిని

'సదరుల్ మహాం పేషీముబారక్' అందురు. ఇతడు శ్రీ శ్రీ నిజాము ప్రభువుగారియొద్ద పనిచేయు చుండును. ఇతని క్రింద ఏ ప్రభుత్వ శాఖయునులేదు. ఈ పదవి యం దిప్పుడున్నవారు ఆనరబుల్ నవాబు కాజిం యార్జంగు బహద్దరువారు. వేతనము రు. 2500 లు. పెర్సనల్ అలవెన్సు రు. 200 లు. మోటారు అలవెన్సు రు. 100.

మంత్రి క్రింద సెక్రటరీ (కార్యదర్శి) లుందురు. ఈ సెక్రటరీల కార్యాలయములను సెక్రటేరియట్ (Secretariat) అందురు. ఇవి 18 ఈ క్రిందిపేర్లుగలవి కలవి.

1. ఛీఫ్ సెక్రటేరియటు
2. పొలిటికల్
3. ఫైనాన్సు
4. రైల్వే అండ్ మైన్సు
5. రివిన్యూ
6. జ్యుడిషియల్
7. పబ్లిక్ వర్క్సు
8. మిలిటరీ
9. డిఫెన్సు
10. కామెర్సు అండ్ ఇండస్ట్రీసు
11. లెజిస్లేటీవు
12. జ్యుడిషియల్ కమిటీ
13. కాంస్టిట్యూషనల్ ఎఫెయిర్సు
14. పోస్టువార్ ప్లానింగు
15. రిఫార్మ్సు
16. ఏజంటు బరారు
17. సప్లయి
18. కంట్రోలర్సు అండ్ స్టాఫ్ ఆఫ్ ది ప్రిన్సెస్

సెక్రటరీల క్రింద డైరక్టరులు (శాఖాధిపతులు) ఉందురు. ఈ విధముగా 18 మంది సెక్రటరీలు, 27 డైరక్టరులు పరిపాలనా చక్రమున గలరు. సగటున సెక్రటరీల జీతము రు. 2000 లు, డైరక్టరుల జీతము రు. 1500 లు. రాష్ట్రములో 2000 వరకు గెజెటెడు ఆఫీసర్లు గలరు.

1936 అక్టోబరు 24 నాటి సంధిప్రకారము బ్రిటిషు ప్రభుత్వమువారు నిజాము ప్రభువుగారికి బరారు పరగణాపైగల 'రాచరికము'ను స్థిరీకరించుటచే సెంట్రల్ ప్రావిన్సు రాజధానియగు నాగపూరునందు నిజాము ప్రభువుగారి పక్షమున ఒక ఏజంటు ఉండి బరారు రాజకీయ సమస్యలను గమనించుచుండును. బరారుతో బ్రిటిషు పతాకముతో సరిసమానముగా నిజాము రాజ్యపతాకము ఎగురుచుండును ఈ బరారు సంధిసందర్భముననే మనయువరాజు గారికి 'ప్రిన్సు ఆఫ్ బరారు' అను బిరుదొసంగబడెను. నాగపూరునం దిప్పుడున్న ఏజంటు ఈరేమా చినాయ్ గారు.

## రాష్ట్ర విభజనము

నిజాము రాష్ట్రము దేశీయ రాజ్యములలో ప్రధాన స్థానము కలది. రాష్ట్ర వైశాల్యము 82,698 చదరపు మైళ్ళు. కృష్ణా, గోదావరీ మహానదులు ఈ రాజ్యముగుండనే ప్రవహించుచున్నవి. ప్రపంచ

ఖ్యాతిచెందిన అజంతా, ఎల్లోరా గుహలు ఈ రాష్ట్రమునందే కలవు. శాతవాహనులు, కాకతీయులు, రాష్ట్రకూటులు, చాళుక్యులు మొదలగు ఆంధ్ర రాజన్యులకు మొదటి విహారభూమి యయినట్టి దీ భూభాగమే. ఆంధ్ర చరిత్రలో ముఖ్యపాత్ర వునికిపట్టయిన దీ రంగస్థలమే. ఆంధ్ర చరిత్ర యింకెంతయో ఇచ్చట నిద్రాణమయి యున్నది.

పరిపాలనాసౌకర్యముకొరకు ఈరాష్ట్రమును రెండు ప్రాంతములుగను, నాలుగు సుభాలుగను, 17జిల్లాలుగను, 104తాలూకాలుగను విభజించియున్నారు. తెలంగాణా ప్రాంతములో వరంగల్, మెదకు సుభాలును, మరాట్వాడా ప్రాంతములో గుల్బర్గా, ఔరంగబాదు సుభాలును కలవు కొద్దిపాటిదగు కన్నడ భాగము మరాట్వాడా ప్రాంతములోనే కలదు. తెలంగాణా ప్రాంత వైశాల్యము 41,502 చదరపుమైళ్ళు. మరాట్వాడా ప్రాంతపు వైశాల్యము 41,196 చదరపు మైళ్ళు. సుభాజిల్లాల పట్టికలో చేరనివి అత్రాఫ్ బల్దాయును, హైదరాబాదు (సికిందరాబాదుసహా) రాజధానీ పట్టణమును జిల్లాలుగా నున్నవి. అప్పుడు జిల్లాలు 18, తాలూకాలు 109 అగును. గ్రామముల సంఖ్య 22860. ఈ క్రింద ఏ యే సుభాల క్రింద ఏ యే జిల్లాలున్నవో, ఏ యే జిల్లాలలో ఏ యే తాలూకాలున్నవో చూపినాము.

వరంగల్ సుభా

I. వరంగల్ జిల్లా

ఇందలి తాలూకాలు 7.

1 ఖమ్మం
2 మహబూబాబాదు
3 మధిర
4 పాకాల
5 పాలవంచ
6 వరంగల్
7 ఎల్లందు

II. కరీంనగరము జిల్లా

ఇందలి తాలూకాలు 7

8 జగత్యాల
9 హుజూరాబాదు
10 కరీంనగరము
11 మహదేవపురము
12 పరకాల
13 సిరిసిల్లా
14 సుల్తానాబాదు

III ఆదిలాబాదు జిల్లా

ఇందలి తాలూకాలు 10

15 ఆదిలాబాదు
16 ఆసిఫాబాదు
17 చెన్నూరు
18 కిన్వట్
19 లక్సెట్టిపేట
20 నిర్మల
21 రాజూరా
22 సిర్పూరు
23 బోథ్

24 ఊట్నూరు

IV. నిజామాబాదు జిల్లా
ఇందలి తాలూకాలు 5
25 ఆర్మూరు
26 బోధన్
27 బాన్సువాడా
28 కామారెడ్డి
29 నిజామాబాదు

మెదకు సుబా

V. మెదకు జిల్లా
ఇందలి తాలూకాలు 5
30 అందోలు
31 కలబ్గూరు
32 మెదకు
33 సిద్దిపేట
34 యల్లారెడ్డి

VI. బాగాత్ జిల్లా 1
35 బాగాత్

VII. మహబూబునగరు జిల్లా
ఇందలి తాలూకాలు 6
36 కల్వకుర్తి
37 మహబూబునగరు
38 మక్తల
39 నాగరకర్నూలు
40 పర్గి
41 అమరాబాదు

VIII. నల్లగొండ జిల్లా
ఇందలి తాలూకాలు 7
42 భువనగిరి
43 దేవరకొండ
44 హుజూరునగర్
45 జన్గామ
46 మిరియాలగూడెము
47 సూర్యాపేట
48 నల్లగొండ

గుల్బర్గాసుబా

IX. గుల్బర్గా జిల్లా
ఇందలి తాలూకాలు 8
49 చించోలీ
50 గుల్బర్గా
51 కొడంగల్
52 సేడం
53 యాద్గీరు
54 అందోలా
55 షోరాపూరు
56 షాపూరు

X. రాయచూరు జిల్లా
ఇందలి తాలూకాలు 8
57 అలంపూరు
58 దేవదుర్గము
59 గంగావతి
60 కుష్టగి
61 లింగసూగూరు
62 మాన్వి
63 రాయచూరు
64 సింధునూరు

XI. ఉస్మానాబాదు జిల్లా
ఇందలి తాలూకాలు 5
65 తుల్జాపూర్

66 కలం
67 ఉస్మానాబాదు
68 పరేండా
69 లాతూర్

XII. బీదరు జిల్లా
ఇందలి తాలూకాలు 5
70 బీదరు
71 అహమదుపూర్
72 ఉద్గీర్
73 నెలంగా
74 జన్వాడా

ఔరంగబాదు సుబా

XIII. ఔరంగబాదు జిల్లా
ఇందలి తాలూకాలు 10
75 అంబడ్
76 ఔరంగబాదు
77 భోకర్దన్
78 గంగాపూర్
79 జాల్నా
80 కన్నడ్
81 పఠన్
82 విజాపూర్
83 ఖుల్దాబాదు
84 సిల్లోడ్

XIV. బీడు జిల్లా
ఇందలి తాలూకాలు 6
85 మోమినాబాదు
86 అష్టి
87 బీడ్
88 గ్రవాయీ
89 మంజ్లెగాంవ్
40 పాటోదా

XV. పర్భనీ జిల్లా
ఇందలి తాలూకాలు 7
91 హింగోలి
92 కలమ్నూరీ
93 పర్భనీ
94 పాథ్రీ
95 బస్మత్
96 జేతూర్
97 పాలెం

XVI. నాందేడు జిల్లా
ఇందలి తాలూకాలు 6
98 బిలోలీ
99 దేగ్లూర్
100 హద్గాంవ్
101 కంధార్
102 ముధోర్
103 నాందేడు

సుబాలలో చేరని జిల్లాలు

XVII. అత్రాఫ్‌బల్దా జిల్లా
ఇందలి తాలూకాలు 4
104 మలకుపేట
105 అంబరుపేట
106 ఘారూరు
107 మేడిచలం

XVIII. హైదరాబాదు జిల్లా
108 హైదరాబాదు నగరము
109 సికిందరాబాదు నగరము

రాష్ట్రము మొత్తముమీద 8100 చదరపుమైళ్ళ విస్తీర్ణము గల దేశభాగము సర్ఫ్ ఖాస్ (రాజుగారి స్వంతము)కు చెందియున్నది. 3262 చదరపు మైళ్ళు పాయగాల్త్రయమునకు చెందియున్నవి. మొత్తము 11,000 చదరపుమైళ్లు జాగీర్ల క్రింద గలవు.

రాష్ట్రములో చిన్నవి, పెద్దవి మొత్తము కలిసి 1167 జాగీర్లుకలవు. ఇందు హిందువులవి 633, ముసల్మానులవి 534. సాలీనా రు 10 నుండి 50 వరకు ఆదాయము కలవి మిక్కిలిచిన్నవి. ఇవి హిందువులవి 100ను, ముసల్మానులవి 42 కలవు. లక్షకు పైగా ఆదాయము కలవి హిందువులవి 7; ముసల్మానులవి 12. సాలీనా సర్ఫ్ఖాసుకు రు 50 లక్షలును, పాయెగాలకు రు 50 లక్షలును దాదాపుగా ఆదాయము వచ్చును.

### జనసంఖ్య

నిజాము రాష్ట్రముయొక్క మొత్తపు జనసంఖ్య 1,63,38,534 గత 1941 గణనము ప్రకారము. ఇందు

1. పురుషులు 83,46,775
   స్త్రీలు 79,91,759
2. పట్టణ వాసులు 21,94,294
   గ్రామవాసులు 141,44,240
3. మతములనుబట్టి జనసంఖ్య
   హిందువులు 1,33,09,649
   ముస్లింలు 20,97,475
   క్రైస్తవులు 2,20,464
   ఇతరులు 7,10,946
4. భాషలనుబట్టి జనసంఖ్య
   తెలుగు 75,29,229
   మహారాష్ట్రము 39,47,059
   కన్నడము 17,24,180
   ఉర్దు 21,67,005
   ఇతరములు 9,71,031
5. హైదరాబాదు (సికిందరాబాదు సహా) 7,39,159
   (అ) మతములనుబట్టి జనసంఖ్య
   హిందువులు 3 65,823
   ముస్లింలు 3,44,915
   క్రైస్తవులు 20,839
   జైనులు 1,161
   సిక్కులు 1,232
   పార్శీలు 1,372
   ఆదిజాతులు 3,630
   ఇతరములు 187
   (ఆ) పురుషులు 3,84,780
   స్త్రీలు 3,54,379
   (ఇ) వైశాల్యము 79 చదరపుమైళ్లు.
6. ఇతర 17 జిల్లాల జనసంఖ్యలు
   అత్రాఫ్ బల్దా 6,12,493
   వరంగల్ 18,21,338
   కరీంనగరు 13,55,415
   నిజామాబాదు 6,47,043
   ఆదిలాబాదు 8,33,622
   మెదకు 7,08,220
   నల్లగొండ 12,75,352

| | |
|---|---|
| మహబూబునగరు | 10,88,209 |
| వాగల్ | 90,415 |
| గుల్బర్గా | 18,12,055 |
| రాయచూరు | 10,41,959 |
| ఉస్మానాబాదు | 7,48,691 |
| బీదరు | 10,23,482 |
| ఔరంగబాదు | 10,71,950 |
| బీడు | 7,23 630 |
| పర్భనీ | 9,11,836 |
| నాందేడు | 8,03,115 |

ఈ రాష్ట్రములో 4 నగరములు, 134 బస్తీలు, 22360 గ్రామములు కలవు. నగరములలో ఈ క్రిందివిధముగా జనసంఖ్య కలదు.

| | |
|---|---|
| హైదాబాదు (సికందరాబాదు సహా) | 7,39,150 |
| వరంగల్లు | 92,808 |
| గుల్బర్గా | 53,551 |
| ఔరంగబాదు | 50,924 |

శాసన సభ

౧

శ్రీ నిజాము ప్రభువారి ఫర్మాను ప్రకారము 1303 ఫసలీలో (1894) ఈ రాష్ట్రములో మొట్టమొదటిసారి శాసన సభ ఏర్పాటు చేయబడినది. అప్పటి సభ్యుల సంఖ్య 17. ఈక్రింది విధముగా సభ్యులుండిరి:—

1 అధ్యక్షుడు
1 ఉపాధ్యక్షుడు
6 అధికార సభ్యులు
3 అధికారరీత్యా సభ్యులు
1 ప్రధానన్యాయమూర్తి,
2 ముమీరెఖానూని
3 న్యాయశాఖా కార్యదర్శి
6 అధికారేతరులు

అధికారేతర సభ్యులు 6 గురు ప్రధానమంత్రిచే నియమితులగు చుండెడువారు. ఇందు 2 జాగీర్ల ప్రతినిధులు, 2 హైకోర్టు వకీళ్ల ప్రతినిధులు, 2 ప్రజా ప్రతినిధులు.

1309 ఫసలీ (1900) శాసనము ద్వారా అధికారులగు సభ్యుల సంఖ్యలో ఇద్దరు ఎక్కువచేయబడిరి; పాయగాల పక్షమున ఒకసభ్యుడు, ప్రజాపక్షమున ఒకసభ్యుడు, జాగీర్ల పక్షమున ఇద్దరు, వకీళ్ల పక్షమున ఇద్దరు—వీరు ప్రధాన మంత్రి వలన నియమితులగు చుండిరి. ఈ విధముగా అధ్యక్షుడు ఉపాధ్యక్షుడుగాక 17 సభ్యులు శాసన సభలోనుండిరి.

౨

1315 ఫసలీ (1905) యొక్క 1 వ శాసనముద్వారా శాసనసభ విస్తృతము చేయబడినది. ఈ శాసనము ప్రకారము తరువాతి మార్పుల ననుసరించి 22 సభ్యులీ క్రిందివిధముగా నుందురు.

| | |
|---|---|
| 1 అధ్యక్షుడు | 1 |
| 2 ఉపాధ్యక్షుడు | 1 |
| 3 అధికారరీత్యా సభ్యులు - ప్రధాన న్యాయమూర్తి, ముమీరెఖానూని, న్యాయశాఖా కార్యదర్శి. | 3 |
| 4 అధికార సభ్యులు | 8 |

| | |
|---|---|
| 5 జాగీరుదారులు | 2 |
| 6 హైకోర్టు వకీళ్ళు | 2 |
| 7 పాయగాల పక్షమున | 1 |
| 8 ప్రజావర్గమునుండి | 1 |
| 9 అసాధారణ సభ్యులు | 2 |
| 10 సర్ఫెఖాసు ముబారకు | 1 |
| | 22 |

5, 6 సంఖ్యలవారు ఆ యా వర్గముల నుండి ఎన్నుకోబడుదురు. 4, 7, 8, 9, సంఖ్యలవారు ప్రధానమంత్రిచే నియమితు లగుదురు.

ప్రభుత్వ కార్యనిర్వాహక సభాధ్య క్షుడే శాసనసభ కధ్యక్షుడు. అయినను ఏదయిన చిత్తుశాసనము చర్చకు వచ్చి నప్పుడు, ఆ శాసనమునకు సంబంధించిన శాఖామాత్యుడు అధ్యక్షత వహించుటకు నిశ్చయింపబడెను. ఈ ప్రణాళిక వల్ల ఈసభ ప్రజకు బాధ్యతాయుతమని చెప్ప వీలులేదు. ప్రజలకు దీనిలో ప్రాతినిధ్య మును లేదు.

ఈ సభ యీ క్రింది అధికారములను గలిగియుండును:—

1. దరఖాస్తులను, ఇతర విజ్ఞప్తులను ఆలోచించుట.

2. శాసనసభలో సభ్యులు ప్రవేశ పెట్టదలచిన ప్రతిపాదనలను ఆలోచించుట.

3. చిత్తుశాసనములను ఆలోచించుట.

ఈ క్రింది విషయములను ప్రభుత్వ సభాధ్యక్షుని అంగీకారము పొందనిది ప్రవేశపెట్టగూడదు:—

(అ) ప్రభుత్వాదాయము, లేక, ప్రభుత్వఋణము, లేక అట్టి ఆదాయము పైన గాని, ప్రభుత్వ ఖజానాపై గాని భారము వేయు ఏదేని విషయము.

(ఆ) మ. ఘ. వ. ప్రభువు యొక్క ప్రజలలోని ఏ తెగవారినైనను సరే, మత విశ్వాసములు, కర్మకాండలు, మతా చారములు.

(ఇ) మ.ఘ.వ. ప్రభువుయొక్క సైన్యపు వ్యయములు, సైన్యముల క్రమశిక్ష.

(ఈ) మ. ఘ. వ. ప్రభుత్వమునకును బ్రిటిషు ప్రభుత్వమునకును గల సంబంధములు.

(ఉ) ఈ శాసనము (శాసన సభా నియ మావళి).

(ఊ) మ. ఘ. వ. ప్రభువు గారియొక్క తత్కాలమున అమలులోనుండు ఏ వేని ఆజ్ఞకు ఏవిధముగానైనను విరుద్ధ ముగానున్న ఏదేని ఇతరవిషయము.

ఇట్టి చిత్తశాసనముగాని, ప్రతిపాద నముగాని ప్రధానమంత్రి అంగీకారముతో ప్రవేశ పెట్టబడిన పక్షమున అట్టిదానికి ప్రభువుగారి అంగీకారము లభించిననేగాని అది శాసనము కాజాలదు. బ్రిటీషు ఇండియాలోవలె రాజ్యపు ఆదాయవ్యయ పట్టిక (Budget) ను విమర్శించుటకు గాని, దేశములో జరుగు అన్యాయములను గురించి ప్రశ్నలు వేయుటకుగాని శాసన సభాసభ్యులకు అధికారము లేదు. పరి పాలనా విషయములలో తీర్మానముల ప్రవేశపెట్టు అధికారముకూడ ఈ శాసన సభా సభ్యులకు లేదు.

ఇదియే గత ముప్పది సంవత్సరముల నుండి ఇప్పటికిని ఆచరణలోనున్న శాసన సభా ప్రణాళిక.

3

శాసనసభను విస్తృతముచేయుటకయి సర్కారువారు కొన్ని ప్రయత్నములు చేసిరి పూర్వపు హైకోర్టు న్యాయమూర్తి యగు శ్రీ శే. రాయ్ బాలముకుందుగారు ప్రత్యేకాధికారిగా ఈపనికయి నియమింప బడిరి. వీరొక ప్రణాళికను సిద్ధపరిచిరి (1919) తరువాత మూడు సంవత్సరముల తరువాత నవాబు నిజామత్ జంగు బహద్దరు ప్రభృతులతో ఏతద్విచారణమునకయి ఒక సంఘము నియమింపబడెను. ఈ కమిటి వారును ఒక నివేదికను సిద్ధము చేసి సర్కారువారికి సమర్పించిరి. ఈ ప్రయత్నములు కార్యకారిగాలేదు. ఆ ప్రణాళికలు ఏమయినవో తెలియదు. రాజ్యాంగ సంస్కరణలకొరకు ప్రజల యాందోళన ఎక్కువయ్యెను. అందుచే, ప్రభుత్వము వారు ఈ సమస్యను గూర్చి ఆతురతతో ఆలోచించి 22-9-1937 ఫర్మానుద్వారా "అయ్యంగారి కమిటీ" ని యేర్పరచిరి. ఈ కమిటీలో ఈ క్రింది అయిదుగురు సభ్యులుగా నుండిరి:—

1. దివాన్‌బహద్దరు ఎస్. అరవముదు అయ్యంగారు, బి.ఏ., బి.యల్; ఎం.బి, ఇ. (అధ్యక్షుడు).

2. మిస్టరు గులాంమహమ్మదు ఖురేషి, హెచ్. సి. యస్.

3. మిస్టరు కాశీనాథరావు వైద్యా, ఎం. ఏ., ఎల్. ఎల్. బి.

4. మిస్టరు మీరు అక్బరలీ ఖాన్, బి.ఏ., ఎల్.ఎల్.బి., బార్-ఎట్-లా.

5. ప్రొఫెసర్ ఖాదరుహుస్సేన్.

మిస్టరు సయ్యదు యూసుఫ్ అలీ హెచ్. సి. యస్. (కార్యదర్శి).

4

అయ్యంగారు కమిటీ సుమారు రెండు సంవత్సరములు ఆలోచనలు సల్పి నివేదికను సమర్పించెను. ఈ నివేదికను కొలది మార్పుచేసి ప్రభుత్వసభవారు శ్రీప్రభువు గారికి విన్నవించి అంగీకారము పడసిరి. (19-7-1939).

ఈ రాజ్యాంగ సంస్కరణ ప్రణాళిక ప్రకారము ఒకే శాసనసభ యుండును. ఇందలి సభ్యుల వివరములు ఈ క్రింద నీయ బడినవి:-

౧. ఎన్నుకొనబడువారు (42)

| | | |
|---|---|---|
| 1. | సంస్థానాధిపతులు, జాగీర్దారులు | 4 |
| 2. | మాష్ఖుదారులు | 2 |
| 3. | పట్టాదారులు | 8 |
| 4. | కాస్తుకారులు | 8 |
| 5. | కూలినాలన్న వృత్తి | 2 |
| 6. | పరిశ్రమలు | 2 |
| 7. | వర్తకము | 2 |
| 8. | సాహుకారి | 2 |
| 9. | వకీలువృత్తి | 2 |

| | |
|---|---|
| 10. వైద్యవృత్తి | 2 |
| 11. పట్టభద్రులు | 2 |
| 12. జిల్లా (లోకల్బోర్డు) సంఘములు | 2 |
| 13. పురపాలక సంఘములు | 2 |
| 14. హైదరాబాదు పురపాలక సంఘములు | 2 |
| | 42 |

౨. ఇలాకాలవారు (5)

| | |
|---|---|
| 1. మూడు పాయెగాలు | 3 |
| 2. పేష్కారి ఇలాకా | 1 |
| 3. సాలార్జంగు ఇలాకా | 1 |

3. ప్రభుత్వనియమితులు (28)

| | |
|---|---|
| 1. సర్కారి అధికారులు | 14 |
| 2. అధికారేతరులు | 14 |

౪. వీరు కాక మంత్రివర్గ సభాసదులును, సర్ఫేఖాసు పక్షమున శ్రీ ప్రభువుగారు నియమించు ముగ్గురు సభ్యులును, ఈ విధముగా 86 లేక 87 గురు సభ్యులుందురు.

శాసన సభలోనికి ఎన్నికోబడు నట్టియు, నియమితులగునట్టియు హిందూ, మహమ్మదీయ సభ్యులసంఖ్యలు సరిసమానముగా నుండవలెను. నియమితులగు హిందువులలో 5గురు హరిజనులు, 1లింగాయతు ఉండవలెను. వీరుకాక యిద్దరు స్త్రీలు, ఒకపార్శి మతస్థుడు, ఇద్దరు క్రైస్తవులు చేరియుందురు.

ఈ శాసన సభకు ఉపాంగములుగ స్థానిక సభలు, ఆలోచనా సంఘములు ఏర్పాటు చేయుటకు నిర్ణయింప బడినది. ఈ ప్రణాళికంతయు ఇటలీవారి పద్ధతిని పోలియున్నది.

మొత్తముమీద ఈ సంస్కరణములు హిందువులనుగాని, మహమ్మదీయులను గాని, రాజకీయ వాదులనుగాని వేర్వేరు కారణాలవల్ల తృప్తిపరుచలేదు.

ఈ సంస్కరణములు మంజూరయి సుమారు ఆరు సంవత్సరము లయినది. నేటికిని ఇవి ఆచరణలోనికి రాలేదు.

* * *

సర్కారువారు "అయ్యంగారు కమిటీ"ని నిర్మాణముచేయగానే, ప్రజాభిలాషమును తెలుపుటకు ఒక "ప్రజా పరిషత్తు" ఏర్పడెను. దీని కర్తృత్వులుగా శ్రీ మాడపాటి హనుమంతరావుగారు వ్యవహరించిరి. అయ్యంగారు కమిటీవారి ప్రణాళిక సిద్ధము కాకముందే, ఈ పరిషత్తువారు ఒక ప్రణాళికను సిద్ధముచేసి ప్రకటించిరి (25-1-1938). ప్రజాభిప్రాయములో రెండుసభలు లెజస్లేటివ్ అసెంబ్లీ, లెజస్లేటీవ్ కౌన్సిలు అనునవి ఉండవలయును. ఈ విధానము చాలవరకు బ్రిటిషు ఇండియాలోని విధానమును పోలియున్నది. ఈ ప్రణాళిక 80 పుటల గ్రంథము ప్రణాళిక సంగ్రహ రూప మిచ్చుచున్నాము:—

లెజిస్లేటివ్ అసెంబ్లి
మొత్తము సీట్లు 200

1. నియమింప బడినవి (అధికారులు, అనధికారులు) 33
2. ప్రత్యేక హక్కులు 37

| | |
|---|---|
| విశ్వవిద్యాలయము | 2 |
| వాణిజ్యపరిశ్రమలు | 2 |
| సాహుకార్లు, బ్యాంకర్లు | 3 |
| జాగీరుదార్లు | 4 |
| జమీందార్లు | 5 |
| స్త్రీలు | 5 |
| పాటకజనులు | 2 |
| హరిజనులు | 10 |
| ఆంగ్లో ఇండియనులు | 1 |
| క్రైస్తవులు | 1 |
| సిక్కులు | 1 |
| పార్సీలు | 1 |

3. సాధారణ నియోజక మండలములు 130

(అ) నగరములవి 52

| | |
|---|---|
| హైదరాబాదు | 16 |
| వరంగల్లు | 4 |
| కరీంనగరు | 2 |
| ఆదిలాబాదు | 2 |
| మెదకు | 2 |
| నిజామాబాదు | 2 |
| నల్లగొండ | 2 |
| మహబూబునగరు | 2 |
| ఔరంగబాదు | 3 |
| బీడు | 2 |
| నాందేడు | 3 |
| పర్భని | 2 |
| గుల్బర్గా | 3 |
| ఉస్మానాబాదు | 2 |
| రాయచూరు | 3 |
| బీదరు | 2 |

(ఆ) గ్రామములవి 78

| | |
|---|---|
| అత్రాఫ్ బల్దా | 3 |
| వరంగల్లు | 5 |
| కరీంనగరు | 7 |
| ఆదిలాబాదు | 4 |
| మెదకు | 4 |
| నిజామాబాదు | 4 |
| మహబూబునగరు | 5 |
| నల్లగొండ | 7 |
| ఔరంగబాదు | 5 |
| బీడు | 4 |
| నాందేడు | 4 |
| పర్భని | 5 |
| గుల్బర్గా | 6 |
| ఉస్మానాబాదు | 4 |
| రాయచూరు | 6 |
| బీదరు | 5 |

మొత్తము 200

లెజిస్లేటివ్ కౌన్సిలు
మొత్తము సీట్లు 65

1. ప్రభుత్వమువలన నియమింపబడినవి 16
2. అసెంబ్లీనుండి ఎన్నుకోబడినవి 16
3. సాధారణ నియోజకమండలము 33

| | |
|---|---|
| హైదరాబాదు | 5 |
| వరంగల్లు | 2 |
| ఆదిలాబాదు | 1 |
| నిజామాబాదు | 1 |
| నల్లగొండ | 2 |
| బీదరు | 2 |
| అత్రాఫ్‌బల్దా | 1 |
| కరీంనగరు | 3 |
| మెదకు | 1 |
| మహబూబునగరు | 2 |
| ఔరంగాబాదు | 2 |
| ఉస్మానాబాదు | 1 |
| బీడు | 1 |
| నాందేడు | 2 |
| పర్భని | 2 |
| గుల్బర్గా | 3 |
| రాయచూరు | 2 |
| మొత్తము | 65 |

శ్రీ నిజాం ప్రభువువారి ఛత్రచ్ఛాయ క్రింద బాధ్యతాయుత ప్రభుత్వమును పొందుటయే ప్రజా పరిషత్తు వారి ధ్యేయము.

ఘన కార్యములు.

ఉస్మానియా యుగములో పెక్కు ఘన కార్యములు చేయబడినవి. ముఖ్యమయిన వాటిని క్రింద పేర్కొనుచున్నాము:—

1914 ఆర్థశాఖ స్థాపితమయ్యెను

1918 ఉర్దు బోధన భాషగా ఉస్మానియా విశ్వవిద్యాలయము స్థాపనము

1919 కార్యనిర్వాహక సభాస్థాపనము

1921 జ్యుడిషియల్, ఎక్జిక్యూటివు ఉద్యోగ విభజనము

1922 రాష్ట్రములో ప్రాథమికవిద్య ఉచితము చేయబడినది.

1926 హైకోర్టుకు చార్టరియ్యబడినది

1929 గస్తీ నిషాన్ 53 ప్రకటనము

1930 ఎన్. జి. యస్. రైల్వే ప్రభుత్వము కొనుక్కొనిరి

1933 జ్యూరీపద్ధతి ప్రవేశపెట్టుట

1933 రెసిడెన్సీ బజారు వాపసు

1934 హైదరాబాదు మ్యునిసిపల్ కార్పొరేషన్ స్థాపింపబడినది.

1935 ధరేలా అగ్రిమెంటు చట్టము

1936 కొత్త బిరారు ఒడంబడిక

1936 సెకండరీ విద్యాబోర్డు స్థాపనము

1938 భూ అన్యాక్రాంత చట్టము

,, ఋణదాన చట్టము

,, ఋణపరిష్కార చట్టము

1939 రాజ్యాంగ సంస్కరణ ప్రకటనము

1940 డిఫెన్సు ఆఫ్ హైదరాబాదు చట్టము

1941 భూ తనఖా బ్యాంకు చట్టము

1942 హైదరాబాదు టెనెన్సీబిల్లు మంజూరయ్యెను.

1942 స్టేటు బ్యాంకు స్థాపనము

1943 స్టాకు ఎక్స్చేంజి బ్యాంకు స్థాపనము

1944 సింగరేణి బొగ్గుగనులు ప్రభుత్వ స్వాధీనమగుట.

1944 చక్కెర, ఉక్కు, గ్లాసు, కాగితము అగ్గిపెట్టెలు, గుండీలు, మొదలగు

ఫ్యాక్టరీల స్థాపనము. రాష్ట్రమందలి
మొత్తము ఫ్యాక్టరీల సంఖ్య ౬౫౦

1944 సికింద్రాబాదు వాపసు

దుస్సంఘటనలు

మహమ్మదీయ సంఘమును ఉద్రేక పరుచుటకయి ఇత్తెహాదుల్ ముసల్మీన్ అను సంస్థ స్థాపితమయ్యెను. దీని కధ్యక్షుడుగా నుండి ఈ సంస్థను పోషణము గావించి, బలకరముగను జేసి చొరవతో నడపిన వాడు నవాబు బహద్దూరు యార్జంగు బహద్దరు. ఇతడు మంచి వాచాలుడు. జనవశీకరణశక్తి గలవాడు. గత సంవత్సరమున అకస్మాత్తుగా కీర్తి శేషుడయినాడు. ఈ సంస్థకు జిల్లాలయందును శాఖలుగలవు. ఈ సంస్థవారు ఐకమత్యముతో, అభినివేశముతో, మెళకువతో కార్యములను నిర్వర్తించుచున్నారు.

ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థ హిందూ, మహమ్మదీయులయందు పరస్పర విద్వేషభావ ముదయించుటకు దారి తీసినది. నిజాము రాష్ట్ర జనసంఖ్యలో ముసల్మానులు అల్పసంఖ్యాకులుగా నుండుటచే ఈ “ముస్లిం రాజ్యము” నందు వారి సంఖ్యను వృద్ధిచేయుటకయి లక్షల కొలది రూప్యములు వ్యయముచేసి హిందువులను మహమ్మదీయ మతములో చేర్చుటకు ప్రయత్నించిరి. వీరి యీ మత పరివర్తన కార్యమును ఆర్యసమాజమువారు ప్రతిఘటించిరి. ఈవిధముగా కల్లోలములు ప్రారంభమాయెను.

“నిజాము రాష్ట్రములో ముసల్మానులు పాలకులు, హిందువులు పాలితులు” అను నొక సిద్ధాంతమును వీరు ప్రకటింపసాగిరి. ఇందువల్ల వీరికిని హిందూ మహాసభ వారికిని ఘర్షణ ప్రారంభమయ్యెను.

“అయ్యంగారు కమిటీ” ఏర్పాటయిన నాటినుండి రాజ్యాంగ సంస్కరణములు ప్రకటింపబడినప్పుడు వీరు తీవ్రముగ ప్రతిఘటించిరి. “ఇస్లాహాత్ ముర్దాబాదు” అను నినాదములతో ఊరేగింపులు జరిపి గందరగోళము చేసిరి. ఆ సందర్భమున హిందువులకును, ముసల్మానులకును పోరాటములు జరిగెను. కొంత నష్టము కలిగెను. శాంతికి భంగము కలిగెను. ఆల్ ఇండియా ముస్లింలీగు అధ్యక్షుడగు మహమ్మదలీ జిన్నాగారు ఇచ్చటికి విచ్చేసి ఇత్తెహాదుల్ ముసల్మీన్ పక్షమున ప్రభుత్వమువారితో రాయబారములు సల్పినట్లును, ప్రభుత్వమువారు కొన్ని హామీ లిచ్చిన తరువాత వీరు శాంతించినట్లును తెలియుచున్నది.

సాంఘిక కల్లోలములతో వాతావరణము కలుషితమయియున్న యీతరుణముననే “హైదరాబాదు స్టేటుకాంగ్రెసు” అను పేర నొక సంస్థను స్థాపించుటకు కొందరు నాయకులు ఉద్యమించిరి. జాతి మత కుల భేదములు లేకుండ రాష్ట్రీయ

లిందుచే, ఏక వేదికపయి సమావేశమయి నిజాం రాష్ట్ర ప్రజల రాజకీయ భవిష్యత్తును గూర్చి పాటుపడుటయే ఈ కాంగ్రెసు వారి యుద్దేశము. ఈ విధముగా మత వైషమ్యము లడుగంటునని భావించిరి. కాని యీ "హైదరాబాదు స్టేటు కాంగ్రెసు" పూర్ణస్వరూపము తాల్చి బయటపడకముందే, మత పక్షపాతముగల సంస్థగా పేర్కొని సర్కారువారు ఇది స్థాపితము కాకూడదని శాసించిరి. ఈ విధముగా రాజకీయ వాదులలో అసంతృప్తి బయలుదేరెను.

స్టేటు కాంగ్రెసువారి సామరస్య ప్రయత్నములన్నియు విఫలముకాగా, వారు సత్యాగ్రహము ప్రారంభించిరి. (1939-వ సం॥ ఏప్రెల్ 10) ఆర్యసమాజికులు తమ మతధర్మములను నిర్వర్తించుటలో సర్కారువారు ప్రతిబంధకములు కల్పించుచున్నారని చెప్పి వారును సత్యాగ్రహము చేసిరి. తాము తీయదలంచుకొనిన యూరేగింపును తీయనీయక తమ హక్కులను భంగము కలిగించునారని హిందూ మహాసభ వారును సత్యాగ్రహము చేసిరి. ఈ విధముగా సత్యాగ్రహము చేసి జయిలుకు పోయినవారి సంఖ్య 10,000 లు ఉండెనని అంచనా వేయబడినది. ఈ సత్యాగ్రహులందరిని ఎట్టి షరతులు లేకుండ ఆగష్టు 1939 లో సర్కారువారు విడుదల చేసిరి. స్టేటు కాంగ్రెసుపయిగల ఆంక్ష ఇంకను తొలగలేదు.

ఉస్మానియా విశ్వవిద్యాలయములోని హిందూ బాలురు హాస్టలులో తమ ప్రార్థన సమయమున వందేమాతర గీతమును పాడిరని విద్యార్థులను హాస్టలు నుండి అధికారులు వెళ్లగొట్టిరి. అందువలన హిందూవిద్యార్థులలో గొప్ప కలజడి ప్రారంభమయ్యెను. విద్యార్థులందరు స్థానిక విశ్వవిద్యాలయమును విడిచి నాగపురమునకు వెళ్లి చదువుకొనసాగిరి. నాగపురము వెడలిన విద్యార్థులకు ఇష్టము లేకుండ తిరిగి ఉస్మానియా విశ్వవిద్యాలయములో చేరుటకు విశ్వవిద్యాలయాధికారులు సమరస భావముతో వీళ్లుకలిగించి శాంతిని గూర్చిరి.

## నీటి వసరులు

ఈ ఉస్మానియా యుగమున దేశ సౌభాగ్యమును పెంపొందించు పెక్కు ప్రాజెక్టులు, కోట్లకొలది రూప్యముల వ్యయముతో నిర్మాణములయినవి. కొన్నిటిని మాత్ర మిందు వర్ణించెదము.

1. ఉస్మాన్ సాగరు:-- ఇది మూసీనది పరిసట్టి గండీపేట దగ్గర శ్రీ ప్రభువువారి నామాంకితముగ నిర్మితమయిన గొప్ప తటాకము. ఈ నిర్మాణము 1913 లో ప్రారంభమయి 1918 లో పరిపూర్తి అయ్యెను. దీనికయిన ఖర్చు రు 54,40,000. ఆనకట్ట పొడవు 4,160 అడుగులు. వరద తూములు 16 కలవు. ఈ చెరువులో 10,568 మిలియన్ల ఘనపుటడుగుల నీరు

నిలువచేయబడగలదు. 6,680 మిలియన్ల ఘనపుటడుగుల నీరు నిలువ చేయబడు చున్నది. 3200 మిలియన్ల ఘనపుటడుగుల నీరు నగరమునకు పానీయముగను, భూము లకును వినియోగింపబడుచున్నది.

2. హిమాయత్ సాగరు:-- ఈసానది నీరు నిలువచేయుటకు నిది నిర్మాణమయి నది. దీనిని కట్టుటకు 1921 లో ప్రారం భించి 1926 లో ముగించినారు. దీనికయిన వ్యయము రు 91,75,100 లు ఆనకట్ట మొత్తము పొడవు 7,400 అడుగులు. వరద తూములు 17. దీని ఎత్తు నదీగర్భమునకు పైగా 93 అడుగులున్నది. ఈ చెరువులో 7096 మిలియన్ల ఘనపుటడుగుల నీరు నిలువ ఉండగలదు. 3500 మిలియన్ల ఘ. అ. నీరు అనావృష్టి రక్షణకొరకును, 3160 మి. ఘ. అ. నీరు భూముల పారు దలకును వినియోగవగును. ఇది యువరాజ నామాంకితమయి తనరారుచున్నది.

3. నిజాంసాగరు ప్రాజెక్టు:-- దీని ప్రధానకాలువ సుమారు 73 మయిళ్ళు కలదు. 275000 ఎకరములు దీనిక్రింద సాగగుచున్నది. ఈ ప్రాజెక్టుకు రు 4,56 లక్షల రూపాయలు కర్చయినవి.

4. పాలేరు ప్రాజెక్టు:-- ఇది వరంగల్ జిల్లా ఖమ్మం తాలూకాలో కట్టబడినది. దీని నిజర్మాణముకు కట్టుటకు రు 24 లక్షల 65 వేలు వ్యయమయినవి. 19650 ఎకర ముల భూమిని ఇది సాగుచేయగలదు.

5. వైరా ప్రాజెక్టు:-- వరంగల్ జిల్లా ఖమ్మం తాలూకాలో కలదు. దీనిని కట్టు టకు 34 లక్షల 16 వేలు కర్చయినవి. ఇది 17390 ఎకరముల భూమిని సాగు చేయగలదు.

6. పోచవరం ప్రాజెక్టు:-- ఇది ఆలేరు నదికి అడ్డముగ కట్టిన ఆనకట్ట. దీనికయి 31 లక్షల 62 వేలు కర్చయ్యెను. 18069 ఎకరముల భూమిని సాగుచేయగలదు.

7. డిండీప్రాజెక్టు:--దీనికయి 35లక్షల 3వేలు కర్చయ్యెను. 45,000 ఎకరముల భూమి సాగుచేయును.

8. మహబూబ్ నహర్ ప్రాజెక్టు:- ఇది 8504 ఎకరములు సాగుచేయును.

9. ఫత్తేనహర్ ప్రాజెక్టు:- ఇది 500 ఎకరముల భూమిని సాగుచేయును 8, 9 ప్రాజెక్టులకు 23లక్షల 5 వేలు కర్చయ్యెను.

ఇవికాక రాయనపల్లి, భోయల్ మార్చేద్, పిండిపాకల, రూటీ, లక్ష్మణ చింత, మున్నగు పెక్కుప్రాజెక్టులుకలవు. వీటికి మొత్తము 21 లక్షల 27 వేలు వ్యయమయ్యెను.

తుంగభద్ర ప్రాజెక్టు:-- ఈ ప్రాజెక్టు నిర్మాణమునకు ఇప్పుడే అంకురార్పణ జరిగినది. ఇది పూర్తియగుటకు 12 కోట్ల 30 లక్షల రూప్యములు వ్యయమగునని

అంచనా వేయబడినది. ఈ ప్రాజెక్టు ఫలిత ముగా రాయచూరు, నల్లగొండ జిల్లాల లోని మరుభూములు సస్యశ్యామలము లయి నందనవనముగా విలసిల్లగలవు.

మానేరు, చంద్రసాగరు ప్రాజెక్టులు మంజూరయినవి.

గోదావరి లోయలో విరివిగా జల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి అవకాశములు కలవు. కావున ఇచ్చట గొప్ప పారిశ్రామిక నగరమును నిర్మింపవలెనని యుద్దేశింపబడినది. ఈ ప్రదేశమునకు దగ్గరగా బొగ్గు, ఇనుపమట్టి, సున్నపురాయి దొరకు స్థలములు కలవు, పెక్కు గిర్నీలు, ఫ్యాక్టరీలు స్థాపించి పలువిధ వస్తువులు ఉత్పత్తి చేయుటకు నిశ్చయింపబడినది. ఇది యొక బ్రహ్మాండమయిన ప్రయత్నము. మాంచెస్టరు ఆఫ్ హైదాబ్రాదు రాజ్యము.

నూతన పద్ధతులమీద వ్యవసాయము సాగించుటకయి సంగారెడ్డి, పర్భణీ, రాయచూరు, వరంగల్, హిమాయత్ సాగరు, రుద్రూరులందు, ఎక్స్పెరిమెంటల్ ఫారములు నెలకొల్పబడెను.

నిజామాబాదు, మెదకు, వరంగల్లు, కరీంనగరు, ఆదిలాబాదు, నల్లగొండ, మహబూబునగరు జిల్లాలలో 20,000 ల చెరువులు గలవు. ఇంక 2,000 లు ఇతర ప్రాంతములందు గలవు.

భూసారము, ఇతరవసతులు - వీనిని బట్టి "బ్రిటిషు ఇండియాలో పంజాబురాష్ట్రమున కెంత ప్రాముఖ్యముకలదో ఈ రాష్ట్రములో తెలంగానాయని పిలువబడు భాగమున కంత ప్రాముఖ్యముకలదు" అని ఆర్థిక మంత్రిసత్తములగు నవాబు జైన్ యార్జంగు బహద్దరువారు ప్రశంసించి యున్నారు.

ఆర్థికము.

I. గత 1354 ఫసలీ (1944-45) వేల అంకెలలో

ఆదాయము

| | |
|---|---|
| రివిన్యూ ఆదాయము | 175094 |
| నిధులనుండి గైకొన్నది | 7008 |
| మొత్తము | 182102 |
| వ్యయము మొత్తము | 142389 |
| మిగిలిన మొత్తము | 39718 |

II. 1355 ఫసలీ (1945-46) బడ్జెటు అంచనా - వేల అంకెలలో

| | |
|---|---|
| ఆదాయము | 175378 |
| వ్యయము | 172040 |
| మిగులు | 3338 |

III. 1355 ఫసలీ బడ్జెటు ముఖ్యవివరములు

(a) ఆదాయము: (వేలలో)

| | |
|---|---|
| రెవిన్యూ | 32958 |
| కస్టమ్స్ | 17500 |
| ఆబ్కారి | 32500 |
| వడ్డి | 16133 |
| రైల్వేలు | 18558 |
| అధిక లాభాలపన్ను | 5000 |
| ఇతరములు | 35594 |
| నిధులనుండి, రిజర్వులనుండి గ్రహించినది. | 17130 |
| మొత్తము | 175373 |

(b) వ్యయము (వేల అంకెలలో)

| | |
|---|---|
| విద్య | 21380 |
| వైద్యము | 6618 |
| వ్యవసాయము | 1876 |
| పశువైద్యము | 1900 |
| సహకారము | 1236 |
| మ్యునిసిపాలిటి-పబ్లిక్ ఇంప్రూవుమెంటు | 3734 |
| భవనములు-రాకపోకలు | 12363 |
| నీటిపారుదల | 2741 |
| పరిశ్రమలు | 2899 |
| కరువు | 5572 |
| గిరాసి అలవెన్సులు | 13718 |
| యుద్ధానంతర ప్రణాళిక | 16345 |
| ఆదాయముపన్ను పెట్టుబడి | 22105 |
| ఇతరములు | 58709 |
| మొత్తము | 172040 |

IV. యుద్ధ విజయమునకై హైదరాబాదు ఇచ్చిన ద్రవ్యము ఇంతవరకు మొత్తము రు. 802 లక్షలు. ఇండియా గవర్నమెంటువారి ఋణములలో పెట్టుబడి పెట్టినది ఇంతవరకు రు. 5767 లక్షలు.

V. ఇప్పటు ప్రభుత్వఋణముల మొత్తం 1802 లక్షల 41 వేల రూప్యములు

క్రొత్త పేర్లు

రాష్ట్రములోని పెక్కు నగరములకు పాతపేర్లు తీసివేసి క్రొత్తపేర్లు పెట్టబడినవి. ఈ మార్పులు తెలిసికొనుట చరిత్రకారులకు అవసరము కావున దొరకినంతవరకు ఈ క్రింద నుదహరించుచున్నాము. (క్రొ) క్రొత్తపేరు (పా) పాతపేరు,

1. హైద్రాబాదు (క్రొ) భాగ్యనగరము (పా)
2. మహబూబాబాదు (క్రొ) మానుకోట (పా)
3. సుజాతాబాదు (క్రొ) ఇందూరు (పా)
4. మహబూబునగరు (క్రొ) పాలమూరు (పా)
5. హుజూరునగరు (క్రొ) పోచంపల్లి (పా)
6. హుజూరాబాదు (క్రొ) జమ్మికుంట (పా)
7. దౌలతాబాదు (క్రొ) దేవగిరి (పా)

8. అజంటా (కొ)
   అజంత (పా)
9. గుల్బర్గా (కొ)
   కలబరగి (పా)
10. కరీంనగరు (కొ)
   ఎల్గందల (పా)
11. ఆదిలాబాదు (కొ)
   సిర్పూరు తాండూరు (పా)
12. ఆసిఫాబాదు (కొ)
   జన్గాం (పా)
13. గుల్షనాబాదు (కొ)
   మెదకు (పా)
14. ఉస్మానాబాదు (కొ)
   ధారాశివ (పా)
15. బీదరు (కొ)
   విదర్భ (పా)
16. ఔరంగబాదు (కొ)
   ఖరికి (పా)
17. పఠన్ (పైఠన్) (కొ)
   ప్రతిష్ఠానము (పా)
18. ఖుల్దాబాదు (కొ)
   రౌజా (పా)
19. మోమినాబాదు (కొ)
   అంబజోగి (పా)
20. నాందేడు (కొ)
   నందగిరి (పా)

ఫసలీ తారీఖుమార్పు

అక్టోబరు 1, 1946 నాడు 1356 ఫసలీ సంవత్సరము ప్రారంభమగును(1-1-1356) అప్పటినుండి ఫసలీ నెలల దినములు ఈ క్రింది విధముగా నుండును:—

1. ఆజూరు 31
2. దై 30
3. బహమన్ 31
4. ఇస్ఫందారు 31
5. ఫర్వర్ది 28
6. ఆర్దిబెహస్తు 31
7. ఖుర్దాదు 30
8. తీరు 31
9. అమర్దాదు 30
10. షహరేవరు 31
11. మెహరు 31
12. ఆబాన్ 30

ఫసలీ తారీఖు, క్రీస్తుశకము తారీఖు ఒక్కటిగా నుండుటకయి ఇట్లు మార్పు బడినది. ఫసలీ నెలల దినములు ఇంగ్లీషు శకపు నెలల దినముల ప్రకారముండును.

అవీ - ఇవీ

ఈ రాష్ట్రములోని కొన్ని విశేష విషయాలు.

1. సంవత్సరమునకు చక్కెర 2 లక్షల టన్నులకు పైగా తయారగుచున్నది.
2. రాష్ట్రములో 12 గుండీల ఫ్యాక్టరీలు గలవు
3. ఇచ్చట 4,62,000 గ్రోసుల అగ్గిపెట్టెలు తయారుచేయు 13 అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలు కలవు
4. మొత్తము ఫ్యాక్టరీలసంఖ్య సుమారు 650.

5. పబ్లికు వర్క్సు శాఖచేత నిర్వహింపబడు రోడ్లమొత్తము పొడవు 5,225 మైళ్లకు ఎక్కువ ఉన్నది.

6. మూడువందలకుపైగా బస్సులు కలవు 4000 మైళ్ళపొడవు బస్సుసర్వీసుకలదు.

7. రైలు మార్గము పొడవు సుమారు 1400 మైళ్లు

8. టపాఖానాల సంఖ్య సుమారు 1200 లు.

9. నగరములోను జిల్లాలలోను గల టెలిఫోనుల సంఖ్య సుమారు 1500 లు.

10. పంటలక్రింద ఉన్న భూమి మొత్తము 2,18,00,000 ల ఎకరములు.

11. భూస్వాముల సంఖ్య సుమారు 14,18,000.

12. సాలీనా ఉద్భవమగు విద్యుచ్ఛక్తి మొత్తపుసంఖ్య 2,45,00,000యూనిట్లు.

13. ఎనిమిదిజిల్లా పట్టణములు విద్యుచ్ఛక్తి కలిగియున్నవి.

14. రాష్ట్రములో జరుగు జాతరలు, మేలాలు, ఉరుసులు మొత్తము సంఖ్య 2440.

15. అక్షరాస్యుల సంఖ్య నూటికి 7 గురు

16. హైద్రాబాదు సముద్ర మట్టమునకు 1800 అడుగులపైన నున్నది.

17. హైదరాబాదు నగరము హిందూస్థానములో నాల్గవది; ఆంధ్రదేశములో మొదటిది.



# ఆంధ్రుల సాంఘిక జీవనము II

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్.

## క్రీ. శ. ౧౭౫౦ నుండి ౧౮౫౦ వరకు

క్రీ. శ. ౧౭౫౦ నుండి యింగ్లీషు ప్రభుత్వము స్థిరపడుతూవచ్చెను. దేశములో తీవ్రముగా మార్పులు ప్రారంభమయ్యెను ముసల్మానుల ప్రభావము తగ్గినకొలది ఇంగ్లీషువారి ప్రభావము దేశముపై దేశ జనులఆచారాలపై ఎక్కువగుతూవచ్చెను.

కూచిమంచితిమ్మకవి క్రీ. శ. ౧౭౫౦ తర్వాతవాడు. అతడు తనకుక్కుటేశ్వర శతకములో ఇట్లు విచారపడెను.

'వేదశాస్త్రపురాణ విద్యలక్కరగావు
పరిహాసవిద్యలు పైకివచ్చె
గద్యపద్యవిచిత్రకవితలు కొరగావు
గొల్లసుద్దులకతల్ పెల్లుమీరు
దేశీయభావలతీరు లేమియుగావు
పారసీకోక్తులు ప్రణుతికెక్కె
శైవవైష్ణవ మతాచారంబు లొప్పవు
పాషండమతములు ప్రబలినవరు"

గువ్వలచెన్న శతకమును "గువ్వల చెన్నడను గొల్లవాడు రచించెనని కొందరు చెప్పుదురు. కవి పదునేడవ శతాబ్దాంతమున ఉండనోపు" అని వావిళ్ల పీఠికలో కలదు. అనగా కవి క్రీ. శ. ౧౭౦౦ కు కాస్త లోపలివాడని వారి అభిప్రాయము.

గొల్లింట గోమటింటను
తల్లియుదండ్రియు వసింప దానువకీలై
కీళ్ల మదమెక్కి నతఃకి
గుల్లైనంగానరావు గువ్వలచెన్నా

అని కవి గొల్లవాడైన వ్రాసియుండడు.

కవి బ్రాహ్మణుడుకాడనియు రాయలసీమవాడుకాడనియు ఈ క్రింది పద్యము తెలుపుచున్నది.

వెల్లుల్లిబెట్టి పొగిచిన
పుల్లనిగోంగూరరుచినిబొగడగవశమా
మొల్లముగ నూనివేసుక
కొల్లగభుజియింపవలయుగువ్వలచెన్నా

రాయలసీమవారు గోంగూర అనరు పుంటికూర అందురు.

"కలిసి షికారునెపంబున"

అని షికారుపదమును వాడుటచే ఇతడు స్పష్టముగా ఉత్తరసర్కారువాడని తేలిపోయినది.

"ప్లీడరులమని వకీళ్లీ
వాడుక చెడ స్వేచ్ఛదిరిగి పాడు మొగములన్
గూడని వారిం గూడుచు
గూడెములజరింత్రుముందు గువ్వలచెన్నా"

"ధనమెవ్వంతట భూముల
తనఖాలను విక్రయమ్ములు తరువాత సతీ
మణిభూషణాంబరమ్ములు
గొనుటయు విలక్షణములు గువ్వలచెన్నా"

అనుపద్యములలోని ప్లీడరు పదము చేతను భూమి తనఖాలు (మార్టుగేజ్) అను పదము చేతను కవి క్రీ. శ. ౧౮౦౦-౧౮౫౦ ప్రాంతమువాడని స్పష్టము కావున ఈకాలములోని ఆంధ్రులస్థితిని ఈశతకము కొంతవరకు మనకు తెలుపుతున్నది.

అంగీలు పచ్చడంబులు
సంగతిగను శాలుజోడు సరిగంచుల మేల్
రంగగు దుప్పటులన్నియు
గొంగడి సరిపోవునన్న గువ్వలచెన్నా.

అంగీలు బాగా వ్యాప్తిలోనికివచ్చెను కాని గొంగడిని మరచిపోవద్దని చెన్నడు బోధిస్తున్నాడు.

అల్పునకు నెప్పు తెల్పిన
బొల్పుగ నిల్వదని పేడబొమ్మకు నెన్నో
శిల్పపు బనులొనరించిన
గోల్పడ యలాగుచున్న గువ్వలచెన్నా.

పేడబొమ్మల పరిశ్రమ మనవారికి పాతదే ఇంకా యింగ్లీషుబొమ్మలు దిగుమతి కాలేదన్నమాట.

జనులలో మొగలాయి వేషాలు పోయినవని కవి విచారపడినాడు.

పొగాకు లంక రకాలును
మీగాళ్ళన లావుబంచె మేలిమికట్టుల్
సాగించు కంచువాళ్ళయి
కోగాయిక గానమెన్న గువ్వలచెన్నా

క్రీ.శ. ౧౬౦౦-౧౭౫౦ లో క్రమక్రమాభివృద్ధిగా దేశమందు వ్యాపించిపోయిన పొగాకు ఈ[illegible] కాలములో మరింత వృద్ధికివచ్చెను. కవులు దానియశోగానము చేసిరి. అనేక చాటువులు బయలుదేరెను.

"దంతలుగాటి ఘోరదంతి హర్యక్షంబు
కుష్ఠరోగాచల కులిశధార......

మొదలగు పద్యాలను చూచిన విశదమగును.

(చూడుము చాటుపద్యమణిమంజరి పుటలు ౧౮౦-౧౮౨) భాషీయదండకమును రచించినకవి గంజూరి నరసింహశాస్త్రి క్రీ.శ. ౧౮౦౦ ప్రాంతములో కర్నూలుమండలములో ఉండినట్టివాడు. అప్పటిజనుల ఆచార వ్యవహారములను చక్కగా ఈ దండకము విశదీకరించును. నంబియొకరువస్తే పనిచెడుతుంది అని జనులవిశ్వాసము నాటికి నేటికి కలదు. అదేమాటను ఇతడిట్లు చెప్పినాడు.

"తోల్తపెండ్లిండ్లకున్ తర్లిపోయ్యేటివారందరూ
ముందుగా మమ్ము ప్రార్థించుచున్నారు
మమ్మెందు
సేవించికార్యార్థులైపోయినా వారికాపొద్దు
వైకుంఠయాత్రాసమంబైన సౌఖ్యంబు
సిద్ధించు

పొగాకును చుట్టగా త్రాగుటయేకాక పొగాకుకాడ పుల్లలను పొగాకుమొద్దుల చూర్ణాన్ని కర్నూలుకడపలోని పనిపాట లవారు నోట్లో వేసుకొను ఆచార మిప్పటి కినీ కలదు. ఈకవి యిట్లువర్ణించినాడు.

"ఇంగనొల్లేశ మొస్తుంది నోట్లోకికొంచెం
పొగాకుపుల్ల గిల్పెట్టి......పోరా
పొగాకుపుల్లకే యాడకొట్టించుకొంటావురా
బాలకిన్నెశగాడాయటంచున్ వినోదంబుగా
గూడెపు బాసరుల్ గుంపుగూడాడగా"

రాయలసీమలో పిల్లలపద్యాలుకొన్ని ప్రసిద్ధిగా వుండియుండును. వాటి మొదటి పాదము మాత్రము కవి యిట్లు సూచించినాడు.

"చెప్పాలవో చెప్పితే లడ్డులప్పాల్ గొని
తుప్పుగా - చేతిలోయున్న ముద్దొత్తు,
శంగల్వపూదండ సెప్పేసురి"

ఆపిల్లవా డిట్లన్నాడు "చేతిలో వెన్నముద్ద అనుపద్యము నాకువచ్చును. చెంగల్వ బూదండ అనేపద్యము నీవుచెప్పుము" ఇప్పుడాపద్యా లెట్టివో మనకు తెలియవు.

పల్లెటూళ్లలో "లేపాలు బస్మాలు, చూర్ణాలు, తైలాలు" దొంగవైద్యులు అమ్ముకొని జనులను మోసంచేసేవారు ఇప్పటికినీ ఈపని జరుగుతూనే ఉన్నది. నాటువైద్యుల మోసాలను ఈకవి చక్కగా వర్ణించినాడు.

• హంసవింశతిని రచించిన అయ్యలరాజు నారాయణామాత్యుడు క్రీ. శ. ౧౫౦౦ - ౧౫౫౦ ప్రాంతమువాడు. అతని గ్రంథ మూకాలములోని జనుల ఆచారవ్యవహార ములను తెలుపునట్టి ఒకగని. గ్రంథాంత ములో ఇతడు కందనూలు, గద్వాల, పాల లేకరి, రామళ్లకోట, నెల్లూరు, కంభము మార్కాపురము, వినుకొండ మొదలైన తెనుగు సీమలోని స్థలాలను పేర్కొన్నాడు ఆప్రాంతాలలోని జనుల ఆచారాలను కవి యెక్కువగా గమనించిన ట్లూహింప వచ్చును. హంసవింశతినుండి మనకు తెలియవచ్చు కొన్ని విషయములను ఇం దుదహరింతును. తెనుగు దేశములో చాలానాడులు ఏర్పడెను. అందు కొన్నిం టిని ఈ కవి యిట్లు తెలిపినాడు.

క॥ వెలనాడును వేంగినాడును
పులుగులనాడ్పాకనాడు పొత్తపునాడున్
కలమురికినాడు రేనా
డలయక కనుగొంటి నచటియబలల గంటిన్

చెన్నపట్టణము, బందరు ముంచివ్యాపార స్థలాలని కవి తెలిపినాడు. గుల్బర్గాలో ఖంఖాబులను బందరులో చీటిబట్టలు అత్తరులు సిద్ధముగుచుండెనని కవి తెలిపినాడు. (ఆ ౫ పద్యము ౩౫౮)

నారాయణకవినాటి కాలములో కొన్ని కులాల ఆచారాలు వ్యక్తమగుచున్నవి.

కాపుగుబ్బెత లెసటికై కుండలరయ

(ఆ ౧ ప ౧౩౮)

కాపువారిలో వంటలకు కుండలే యెక్కువగా వాడు ఆచారముండెను. ఆనాడు గోల్కొండ వ్యాపారులలో కరణీకము

చేయువారి వేషాలను కవి యిట్లు వర్ణించినాడు.

> మలిబెట్టిచుట్టిన తెలిపైఁడిణీపాగ
> చెవిసందవాగలో జెక్కుకలము
> తొడరిన నెరిచల్వనడరు నంగీజోడు
> జీరాడునడికట్టు చెరఁగుకొనలు
> పదతలంబుల నెఱ్ఱపారు పాపోసులు
> చెక్కుగాజంక చీటీఖలీతి
> నడికట్టులో మొలనిడిన ఖలందాను
> హస్తాగ్రమున వ్రేలు దస్తరంబు
> మించుశావాలువుమీఁద కాశ్మీరశాలు
> చెవులమిత్యాలపోగులు చెలువుదనర
> అలరిన ర్కావి దోవతి యమరనటకు
> పారుపత్యంబుసేయు వ్యాపారివచ్చె

(౨-౩౦)

కాపువారిలోని కొన్ని శాఖలను కవియిట్లు తెలిపినాడు.

> పంట, మోటాటి, పెడగంటి, పాకనాటి
> అరవెలమలాదికొండారె, మొరసుగోన
> కొణిదెకాపులు, మొదలైన క్షోణిదనరు
> కాపులకునెల్ల మిన్న యకాకుపుకొడుకు.

(౪-౧౩౬)

సెట్టిబలజల వేష మెట్టిదనగా:-

> సరిపెణతోడిసజ్జబలు సందటికాయితు
> లింగవస్త్రముల్
> సరిగెచెరంగుపాగ విలసన్మణిముద్రిక
> లంచుకమ్ములన్
> మెరుగులుగుల్కు దోవతియు, మిన్నగు
> నీలపు పోగుజోడు బి
> త్తగవు విభూతిరేఖలరుతన్ రుదురా
> క్షలుగల్గి భాసిలున్

(౮-౯౯)

సెట్టిబలిజెలు ఎద్దులపై ఎక్కిపోవు చుండెడివారు. (౮-౧౦౦)

తెల్లవారగనే గొల్లవారు మజ్జిగచిల్కుచుండిరనియు, "కాపుకూతులు తెలియూవనాళములు దొక్కగ జేయుచుండి"రనియు కవి తెలిపినాడు. (౧-౧౯౮)

గొల్లసుద్దులు చెప్పు గొల్లజాతివారు కొందరుండిరి. వారు కృష్ణలీలలను, కాటమరాజుకథను ప్రధానముగ చెప్పుచుండెడివారు (౧-౭౭)

నారాయణకవి కాలములోని కొన్ని కులాలవారును కొన్ని వృత్తులవారును ఇప్పుడు మనకు కానరారు వారిలో కొందరిని గురించి కవి యిట్లుదెలిపినాడు:

"కోమటి, కమ్మ, వెలమ, వెంకరి, వ్రట, గొల్ల, బలిజ, కుమ్మర వారును, పలగండలు, బెస్తలు, చిప్పవారును, కమ్మరి, వడ్రంగి, కాసె, కంచర, అగసాలవారును, ఆణికారి, పడసాలె, సాలె, సాయు, సాతీన, సాతాని, కటికవారును, ఘటియకారచిత్రకార సిమిత్తకారులును, భట్లు, జెట్లు, జాండ్ర, తొగట, గాండ్లవారును, వందిమాగధ, వైతాళిక, జైన, ఘూర్జర, కర్ణాజ, ఛాయతిలహాడి, గొడమిశ్రిలును, బేహారి, భణిజు, ఛటికి, స్వాదాలక, ఖత్రిజాతులును, బోయలు, మొరసగ, చెంచులు, యేనాదులు, జలగరి, వాని,

పన్నా. గట్టు, తంబళి, యీడిగె, వేదర వారును, వీరముష్టులు, మష్టీలు, ఒడ్డె యుప్పరలును, అసిధారకంబాటు సైలారి, మన్నెరి, తలారులును, తురక, పింజారి, విప్రవినోదులును, జాతికర్త, కొమ్మరి, డోమణి, బొమ్మలాటవారును, దాసళ్లు, తెరనాటకపుజంగాలు, బిడ్డము వాండ్రు...... ఇంకాఎన్నెన్నో వృత్తుల వారిని తెలిపియున్నాడు.

నారాయణకవి నాటికి పాత వేషాచారములు కొన్నిపోయి క్రొత్తవి పొడసూపినవి. టోపీలు మెల్లమెల్లగా మనవారి నెత్తికెక్కెను. శ్రీనాథుని కాలములోని కుల్లాయియే టోపీ అయ్యెనా? లేక ఈనాడు felt cap కొందరు ధరించు ఫెల్టుటోపీలా అవి తెలియరాదు. టోపీ అను పదమును ఈకవియే మొట్టమొదట వాడినట్లు తోచుచున్నది. 'మతిఘుర్నముల టోపీ మునగబట్టిన వల్లెకోకలు మరుల్గొల్పు మనసు హరింప'

(౧-౧౭౨)

అని ఒక బ్రాహ్మణుని వేషమును వర్ణించినాడు.

డుబుడక్కవాని వేషము ఆనాటినుండి యీనాటివరకు ఏమిన్ని మారినట్లు కానరాదు.

నొసలపై చుక్కల మిసిమినామపు రేఖ
లనువొందభుజముపై నసిమిసంచి
వాలుపీసులగాజు నీలాలపోగులు
పైనొప్పు పొప్పళి పచ్చడంబు
కులిగొనకట్టిన తలపాగ చెరగుంచి
పైలకేటాచుట్టు పట్టుశాలు
కడిమిమీరగ చంకనిడిన బొట్టియకోల
డాకమోపెడు డుబుడుక్కకేల

(౨-౫౮)

తాటాకులపై గంటములతో వ్రాయుట ౧౦౦ ఏండ్ల క్రిందటివరకు మన దేశమందు విరివిగా ప్రచారమందుండినను శ్రీనాథుని కాలమువరకే కాగిదాలపై మసితో వ్రాయు ఆచారము ప్రారంభమైయుండెను.

"దస్త్రాలన్ మసిబుర్రలున్ కలములున్
దాకొన్న చింతంబళుల్"

అన్న చాటువునుండి పైవిషయము విశదమైనది. హంసవింశతి కాలములో "దవతి" "శాయి" మరింత వ్యాప్తిలోనికి వచ్చెను.

రసికుడైనట్టి కాలంపు రక్కవాను
తనర బ్రహ్మాండమను పెద్ద దవతిలోన
శాయినిండారబోసిన చందమునను
తరుతిమిరపుగుంపు నిండారబర్వె

(దవతియనునది దవాత్ అను ఫార్సీ పదము మసిబుర్ర అనియర్థము. శాయ్ అనునది సియాహ్ అను ఫార్సీపదము. నల్లని రంగు అనియర్థము. ఈ రెండు పదాలు తెలంగాణా వారు విశేషముగా వాడుచున్నారు)

హంసవింశతి గ్రంథాదిలోనే నానావిధములగు ఉపాహారణములను భక్ష్యములు,

పిండివంటలు, చిరుతిండ్లను జేర్కొన్నాడు అదొక పెద్ద పట్టికయగుటచే ఉదహరించుటకు వీలులేదు. (౧ ౧౦౧)

ఇంకా గంటలుచూపు పాశ్చాత్య గడియారములు వచ్చి యుండలేదు. హంస వింశతికాలపు కాలములో విజ్ఞులు ఎండలో పాదచ్ఛాయను కొలిచి కాలమును గుర్తించు చుండిరి. పెద్ద పెద్ద పట్టణములలో గడియల కొట్టు ఏర్పాటుండెను.

"అస్తమయము కాదటంచు పాదచ్ఛాయ
లొనరించి వ్రేళ్ళెంచి కొనుచు
యూర గడియార మిడలేదోయని వీధి
ఈ వీధి వెంబడి వెదకి చూచు(3, ౧౫౬)

పైన గడియారమనునది గడియలు తెల్పునట్టిదే. గంటలు తెలుపు పాశ్చాత్య గడియారాలింకా దిగుమతియైయుండలేదు

నారాయణ కవినా= జనుల వినోదములు కొన్ని యిట్లుండెను రంగులు వేసి చిత్రపటములు వ్రాయువారుండిరి. సంపన్నుల యిండ్ల గోడలమీదను దేవాలయపు గోడలమీదనుచిత్తరువుల వ్రాయుచుండిరి.

హరిత హరిద్ర కృష్ణరక్తావ దాత
శబల పాటల ధూమల శ్యామకపిల
వర్ణముల గూర్చి చిప్పల వాగెలునిచి
చిత్తరువు వ్రాయు గుళ్ళలో చిత్రఘనుడు

( 3. ౮. )

౧౫౦ ఏండ్లక్రిందట మన తెనుగువారి ఆటలనుగూర్చి కవి విపులముగా తెలిపినాడు ఒకపెద్ద సీసమాలికలో ఆటలన్నింటిని ఒకపట్టికగాచేర్చి తెలిపినాడు. అందు సగముకంటె ఎక్కువ ఆట లెట్టివో మన కిప్పుడు తెలియరాదు ఎవరైనా కృషి చేసి పరిశోధనలుచేసి ఈ ఆట వివరములను అన్నింటిని వర్ణించి వివరించి ఒక చిన్న గ్రంథముగా వ్రాసిన బాగుండును. కవి తెలిపినవి కొన్ని యెట్టివనగా

"దూదియు జాబిల్లి బూదికన్నులకచ్చి
గుడిగుడికుంచంబు కుందెనగిరి
చీకటిమొటికాయ చింతాకుమణుగులు
పులియాటలును చిల్లపొట్లకాయ
తూరనకుంకాలు తూనిగతానిక
చిడుగుడు మొకమాట చిల్లకట్టె
దాగిలమూతలు తనుబిల్ల యాలంకి
గుప్పటగురిగింజ కొండకోతి
చిక్కణబిల్లయు జెల్లెముగొడుగును
బిల్లదీపులు లక్కిబిక్కిదండ
గచ్చెనబోడియొక్కసి కొక్కుబంగారు
పోటు గీరసగింజ బొంగరములు.

(3-౧౦౭)

ఇట్టివి చాలా వ్రాసినాడు. అదంతా ఉదహరించుటకు వీలులేదు. అభిలాషులు ఈ సీసమాలికను పూర్తిగా చదువుకొనగలరు.

చాలామంది యిండ్ల ముంగిటిభాగాలలో పులిజూదము ఆట గీతలను పలకరాళ్ళపై మలిపించి యుంచుచుండిరి.

"ముంగిట పులిజూదములు గీచియుండిన
రచ్చబండలు గోపహారిగోష"౨-౧౩

నేటికిని తెనుగుదేశమం దంతటను పల్లెలలో ఈ ఆచారము మిగిలియున్నది.

కోడిపందెములు తెనుగువారి వినోదములలో చాలా ప్రాచీనమగు వినోదము. మన సారస్వతములో కేతనకవి కాలము నుండియు నారాయణకవివరకు పలువురు కవులు ఈపందెములను వర్ణించినారు. కోడి పందెపు శాస్త్రముకూడా చాలా ప్రాచీనమైనట్టిదే. నారాయణకవి ఈ విషయములో ఇట్లు వర్ణించినాడు :

"కాచివ్రాతలు దారాలు కట్టుముళ్ళు
ముష్టులును నీళ్ళముంతలు మూలికలును
కత్తులపొదుళ్ళు మంత్రముల్ కట్టువసరు
లెనయవచ్చిరి పందెగాళ్ళుపురేగి.
వేగ నెమిలి పింగళి కోడి డేగ కాకి
వన్నెలైదింటి కిరులందు వెన్నలందు
రాజ్యభోజనగమన నిద్రామరణము
లనువిచారించి యుపజాతులను వచించి"
(3-౨౧3)

శైవభక్తులలో వీరభద్రుపళ్ళెరము లిడుట ఆచారముగా నుండెను (3-౧౮౮

జనులలో తాయెతులపై విశ్వాసము మెండుగా ఉండెను. ఈ తెయతుశబ్దము అప్పకవినాటికే రూఢియైపోయెను, తాయెతు అనగా (తాయి) తల్లి తనబిడ్డ రక్షణకై కట్టుయెత్తు అనగా రక్షాబంధము అని వ్రాసెను. అదే అర్థమును శబ్దరత్నాకరములో వ్రాసిరి. తాయెత్తు అనగా తాయి + ఎత్తు అనిరి. ఎత్తు అను ప్రత్యేకపదమువద్ద మాత్రము రక్షాబంధమను అర్థము శబ్దరత్నాకరములో వ్రాయలేదు. ఈశబ్దము అప్పకవికి పూర్వము తెనుగు వాఙ్మయములో కానరాదనిఅనుకొందును. యథార్థమేమనగా ఈపదము 'తావీజ్' అను అరబీపదము. ముసల్మానులు రోగ విముక్తికై ఖురాను మున్నగువాటిలోని మంత్రాలును వ్రాయించి చిన్నని బొండు వంటి గొట్టములలో ఉంచి చేతులకుకట్టు కొందురు ముసల్మానులు వచ్చిన తర్వాత ఈయాచారమును హిందువులు స్వీకరించిరి. అప్పుడు తావీజు పదము తాయెతుగా మారినది.

అప్పకవి అది గమనింప ఏదో కల్పన చేసి అర్థము చెప్పెను.

నారాయణకవి ఒకచో తాయెతు నిట్లు పేర్కొన్నాడు.

"సరిపెణతో సజ్జబలుసందిటితాయెతు
లంగవస్త్రము..." (౫-౯౯)

బాలికలు ఆడుకొను ఆటలు ప్రత్యేకముగా ఉండెను.

నాచన సోమన మొదలుగా నారాయణకవి వరకు వాటిని పేర్కొనుచు వచ్చినారు. హంసవింశతిలో ఇట్లు తెలిపినారు.

"బొమ్మలపెండ్లిండ్లు బువ్వంపుబంతులు
పుణికిళ్లు నిట్టిక్క బొమ్మరిండ్లు..."
(౫-౧౮౭)

(అభిలాషలు పూర్తిపద్యమును చూచుకొనగలరు)

రాటముపై వడుకుట ఇంకా విరివిగానే ఉండెను. దాని ముచ్చట పలుతావులలో హంసవింశతిలో కలదు.

ధనాఢ్యులైనవారు చలివందిరి పెట్టి వేసవిలోని బాటసారులకు సేద దీర్చి పుణ్యము కట్టుకొనుచుండిరి. ఆ చలివందిటిలో ఉత్తమజ్జిగమాత్రమే ఇయ్యకుండిరి "లవణశుంఠీజంబఫలరసాను యుక్తముల్

నీరుమజ్జిగకుండ బారులమర
లఘులవైలానూన లలితసౌరభమిశ్ర
శీతలజలకుంభ జాతమమర
జీరకకైడర్య చారుగంధములొల్కు
పలుచనియంబళ్ళ వంట్లుదనర
రవయుప్పనీరుల్లి రసమునించినకోళ్ళు
గంజికాగులగుంపు కడురహింప

గంధబర్హిష్ఠలామజ్జ కపరికస్త
కాయమాన మహుర్మహుర్ధాయమాన
మందపవమాన ఘనసార బృందవేది
కాలయవితాన పానీయశాలయొప్పె.

(౨-౧౬౦)

ఆకాలమందు బ్రాహ్మణులు సంస్కృతాభ్యాసము విరివిగా చేయుచుండిరి. వారి పాఠపరిణాళిక యేమనగా మేఘసందేశము, కువలయానందము, ప్రబోధ చంద్రోదయము, మణిసారము సిద్ధాంత కౌముది, రసమంజరి, కావ్య ప్రకాశిక, మొదలగునవి. (౨-౧౮౨)

మనవారు ఇంగ్లీషు విద్యాపద్ధతులలో నిండుగా మునిగినది ఈ ౬౦ ఏండ్లలో. అంతకుపూర్వము మన దేశము బళ్ళస్థితిని నారాయణకవి ఇట్లు చక్కగా వర్ణించినారు.

నన్నయ్యవారలో నామాలు దిద్దుకొ
మ్మనినచో కడుపునొవ్వనుచు నేడ్చి
దండంబునను గుణింతము పెట్టరమ్మన్న
అంగుళివ్రణమాయెననుచు జుణిగి
శిష్యులచే గాలుసేతులు బట్టించి
తెచ్చిపద్యముజెప్ప దెమలకుండి
పలకవ్రాయనటంచు బడికెత్తుకొనిపోవ
బలవంబులేదని పలుకకుండి

అలుకచేనుండ బుగ్గలునులిచి తిట్టి
తొడలు వడిపెట్టి కోదండమునగట్టి
రెట్టలెగకట్టి బట్టించి రేపుమాపు
కొట్టుజెట్టుగసజ్జన కోలదెగను.(౩-౧౮౧)

గద్దించి తిట్టింటు దిద్దుమంచును వ్రేలు
బట్టించినచటనే బట్టకుండు
పలుమారులో యనిపల్కుమంచునుగొట్టి
చెప్పి నకిలవృత్తి దప్పకుండు
ఒకటికి సెలవియ్యనురికి చీకటిదాక
పసులగావరుల వెంబడినపోదు
జననిఅడుక్కొని చదువుకోబొమ్మన్న
వినక వేమరు వెక్కివెక్కి యేడ్చు

సారెపద్యపుబలుకపై చమురుపూతు
ఎప్పుడును పెద్దవలక పొక్కిత్తజేతు
బాలరామాయణము పుస్తకాలుదాతు
వేయుసజ్జనకోలలు విరిచివైతు(౩-౧-౨(

చరికుండ పగులగొట్టుదు
పరువడినూత్రింబుత్రెంచి పారగవైతును

మరిమరి బలపములిచ్చిన
పౌరిసములు దుబగులగొట్టి పోయెనటందున్

(౩-౧౪౩)

పన్నబింగలు పెట్టించునాడె యయ్య
వారు నిద్రింపగా జూచి చేరి యంట
చింతబ్రేల్ గొమ్మ వంచుక గిరగట్టి
విడిచియుండిరిగ యగాగ మడికూయ.

(౧-౧౮౪)

పొగాకు వాడుక దేశమందు విరివిగా వ్యాపించి పోయెను. ఒట్టసంచిలో పొగాకు పెట్టుకొని కొంటతీసికొని పోవుచుండిరి. దానిని పొగాకుతిత్తి యనుచుండిరి

(౨-౭౬)

గ్రామకరణాలుకూడా పొగాకు చుట్టలు త్రాగుటకు బాగా అలవాటు పడిరి వారి వేషముకూడా గమనింపదగినది.

కెలితలపాగ, చొక్క, మొల
తిత్తి, భుజంబున జల్వపచ్చడం,
బలచిటిబ్రవేల ముద్రిక, రొమ్ముమూ
తముమీర పొగాకుచుట్ట, సొం
పలరెడు కావిదోవతి, పదాబ్జ
యుగంబున ముచ్చెలొప్పగా
వలనిభుడంత గ్రామకరణం
బటకై చనుదెంచె నంతటన్. (౩-౯౨)

స్త్రీలుకూడా పొగాకును వక్క తమల పాకులతో పాటు నమలుటకు అలవాటు పడిరి. (౪-౧౭౮)

శుకసప్తతి కవి కాలము నాటికి (క్రీ. శ. ౧౬౦౦) నారాయణకవి నాటికి స్త్రీలభూషణములలో భేదము రాలేదు నారాయణకవి తెలిపిన కొన్ని భూషణము లేవనగా

కమ్మ. రాగిడిచెళ్ళ (కంఠమురేఖ పా
పటబొట్టు) కమ్మలు, బావిలీలు,
లంనూర్య చంద్రవంకలు, సూరకము,
కంప్రదంతలవల్లెగి బూవు, రావిరేక,
బుగడలు. నాగదీగె, సొగసైన మెడనూలు
కుతికంట్లు, సరపణి, గుండ్లపేరు.
సరిగె, ముక్కెర, బన్నసరము లుత్తండాలు
కంకణంబులు. తట్లు .కడియములను
సందిదండీలు, ఒడ్డాణ ముందమైన
ముద్రికలు. పాంసకంబులు. మొలగజ్జె,
లందు బొబ్బిలకాయలు గిలకమెట్టె
లాదియగు సొమ్ముదాల్చి యయ్యబలమెరయు

(౨-౧౯౧)

మన పూర్వుల ఆటల వలెనే సొమ్ములున్నూ చాలావరకు మనకు తెలియరానివై పోతున్నవి. అభిమానులు వాటిని సంగ్రహించి చిత్రింపజేసి తెలుపుట మంచిది. ముఖ్యముగా నిఘంటుకారులు ఇట్టిపదాల కర్థము వ్రాయనప్పుడు ఒకవిధమగు ఆట, భూషణవిశేషము అని వ్రాయుచుందురు. అంతమాత్రమందరికిన్ని తెలియును ఇక నిఘంటుకారులొసగిన ఘనకార్యమేమి?

ఏనుగుల వీరాస్వామయ్య అనేవారు మద్రాసులో పెద్ద ఉద్యోగమందుండిన వాడు. అతని కాలములో ఇంకా రైళ్ళు ఏర్పడియుండలేదు. అతడు మద్రాసు

నుండి కాశీకి సకుటుంబ పరివారముగా ప్రయాణము చేసి వల్లకిలో క్రీ శ ౧౮౩౦-౩౧ లో ప్రయాణము చేసెను అతడు కడప, కర్నూలు, జటప్రోలు, వనపర్తి, పాలమూరు, హైదరాబాదు, నిజామాబాదు మీదుగా కాశీ చేరి తిరుగా ఉత్తర సర్కారుల తీరము మీదుగా మద్రాసు చేరుకొనెను. కాన ఇంచుమించు తెనుగు సీమలో ముఖ్యభాగాలన్నింటినీ అతడు చూచి అందలి జనుల ఆచారవ్యవహారాలను ఉన్నవున్నట్లుగా తన డైరీలో వ్రాసుకొనెను. అందుచేత అతని "కాశీయాత్ర చరిత్ర" మన సాంఘిక చరిత్రకు క్రీ. శ ౧౮౦౦ - ౧౮౫౦ కాలమువరకు చాలా ఉపకరించుచున్నదెను

వీరాస్వామి కాలములో తెనుగుదేశము ఇంగ్లీషువారి పరిపాలనలోనికి వచ్చెను హైదరాబాదులోని తెలంగాణా నిజాం పరిపాలనములో ఉండెను ఇంగ్లీషువారు ఇంకా తమ రాజ్యాలను స్థిరపఱచుకునే యత్నములోనే యుండిరి. అందుచేత దేశమందు శాంతిభద్రతలు ఏర్పడలేదు. అయినను బ్రిటిషిండియాలోని భాగాలలో నిజాంరాజ్యములోని భాగాలకంటే శాంతిభద్రత లెక్కువగా ఉండినవని కాశీయాత్ర చరిత్రనుండి బిగ్రామీ వ్రాసిన Historical and descriptive sketches of the Hyderabad States గ్రంథమునుండి మనకు తెలియ వస్తున్నది.

తెనుగుదేశములోని యిండ్లు ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్కవిధముగా నుండును. రాయలసీమలోని వ్యవసాయకుల యిండ్లలో పశువులున్నూ మనుష్యులున్నూ నివాసము చేయుదురు. ఇది నేటికిని మారకుండా వచ్చిన యాచారము. కర్నూలుజిల్లాలోని బండాత్మకూరు చేరి వీరాస్వామి యిట్లు వ్రాసెను. 'పశువులకు తాము కాపురముండే యిండ్లకంటే చక్కగా కొట్టములు కట్టి బాగా కాపాడుచున్నారు. ఆవులను పాలు పితుకుట లేదు ఎనుపపాడి సహజముగా ఉన్నది,

(పుట ౧౧)

రాయలసీమలో ఎద్దులవృద్ధి నాటికీ నేటికీ లేదు "ఎద్దులు నెల్లూరిసీమనుంచి వచ్చేవారివద్ద హమేషా వారికి కొనవలసి యున్నది. తడవకు ౧౦-౨౦ వరహాలు పెట్టి యెద్దులను కొనుచున్నారు. (పు౧౪)

కర్నూలు జిల్లాలో బియ్యము చాలా తక్కువ 'పేదలు జొన్నలతోనున్ను, ఆరికెయన్నములోనున్ను కాలముగడుపుచున్నారు" (౨౩)

కృష్ణాజిల్లాలోని ఎద్దులవంటి యెద్దులు దక్షిణహిందూస్థానములో మరెందును కానరావు. (౩౫౫)

మచిలీబందరువారిని గూర్చి యిట్లు వ్రాసినాడు.

"మనుష్యులు నిండా ఆరోగ్యదృఢగాత్రులుగా లేరు. స్త్రీలు అలంకారపురస్సరముగా శోభాయమానలై వున్నారు.

చెవులకు నిడువుగోలుసులు వేసి కొన్ని పావటకు చేర్చి చెక్కుతారు. స్త్రీ పురుషులు చాయ వేసిన వస్త్రప్రియులై యున్నారు. (పు. 3౫౦)

"ఈ దేశస్థులు(బందరువారు) కచేరీసహితముగా విందుచేస్తే అపుత్సవాన్ని మేజువానీ లంటారు" ఇప్పుడు ఉత్తరసర్కారులో భోగపుసానుల పాటకచ్చేరీని మేజువానీ అంటారు. ఇది ఉర్దూ 'మేజుబానీ' నుండి వచ్చిన పదము.

కృష్ణానదికి వుత్తరము తూర్పు సముద్ర పర్యంతము దేశస్థులు మాట్లాడే తెనుగుమాటలు రాగ సంయుక్తముగా నున్న అక్షరలోపముగల హ్రస్వశబ్దములుగా వుంటున్నవి స్త్రీలు నోరును అవరించేపాటి ముక్కరలు చాలా లావుగా చేసి ధరించుతారు. (పు3౫3-3౫౪)

నెల్లూరుసీమ పురుషులు స్త్రీలు దేహపటుత్వము కలవారుగా నున్న యథోచితమైన కురచరూపముగలిగి సౌందర్యవతులుగా తోచుచున్నది కాని దేహవర్ణము నలుపుకలసిన చామనగా తోచుచున్నది. గుణము నిష్కాపట్యమని చెప్పవచ్చును. (పు-3౬3)

రాజమహేంద్రవరము ధవళేశ్వరము ప్రాంతములో సప్తగోదావరీ భూమిని కోనసీమ అందురు. అక్కడ బ్రాహ్మణులకు భూవసతులు చాలా కన్నవి. (పు-3౮3)

అచ్చటి బ్రాహ్మణులు చాలా అధ్యయనపరులు, యజ్ఞయాగాది కర్మములయెడల చాలా శ్రద్ధాభక్తి కలిగి వున్నారు. (పు-3౮౪)

కళింగాంధ్ర దేశములలో తెలగాలనే వెలమలు కలరు. (పు-3౮౪) తెలగాలు వెలమలు ఒకేజాతివారని వీరాస్వామి వ్రాసినాడు! గమనించ దగినది.

చినగంజాం మొదలుగా సముద్ర తీరమందు వుప్పు పయరుచేయడము విస్తారముకనుక వుప్పరజాతిస్త్రీలు దోటి ముక్కరలు ధరింతురు. ఇప్పట్లో దక్షిణదేశము పడమటిదేశము పోడవుగాభూమి త్రోవ్వడానికు నెగడివుండేవారు. యీ దేశపు వుప్పర వాండ్లున్నూ వోఢ్ర దేశపు వొడ్డవాండ్లుగా తోచినది (3౫౬)

జగన్నాథక్షేత్రములో జోగి జంగము మొదలైన శైవులను తురకలవలెనే నిషిద్ధపఱచి గుడిలోనికి రానియ్యరు హిందువులలో చాకలి జాతిని చండాలురను గుడిలోపలికి రానియ్యరు. (3౧౦)

ఈ రెండువాక్యాలు తెనుగు దేశానికి సంబంధించకున్నా ఉత్తర సర్కారులకు సమీపమునసుండుసీమలో ఆనాటి యాచారములు తెలియవచ్చు. అందు చాకలివారిని చండాలురవలె చూచినది గమనింప దగినది.

ద్రావిడ దేశములో శూద్రులున్నూ ముఖ్యముగా చండాలురనను అగౌరవపరుస్తూ శూద్రులదృష్టిన్ని చండాలుర సమీపవర్తిత్వమున్నూ కూడదని నిండా అగౌరవ పరచడముచేత వేలపర్యంతము ప్రజలు క్రీస్తు మతస్థులుగా పెదపాళెము మైలాపూరు క్రీస్తుగుళ్ళ వుత్సవాదులలో చూడబడుచున్నారు. (౧౬౫)

విశాఖపట్టణంజిల్లావారినిగూర్చి ఇట్లు వ్రాసినాడు.

'ఈ దేశపు స్త్రీలు మంచిసౌందర్యము కలవారుగానున్న ముఖలక్షణము కలవారుగనున్న అగుపడుతారు. జాఫరా విత్తుల వర్ణము వేసిన బట్టలు వుపపన్నులు కట్టుతారు కాళ్ళకు పాడగాలు వెయ్యడం కలిగివున్నది.' (33౫)

బాలకొండ నిజామాబాదుజిల్లాలోని ఆర్మూరుకు ౬ కోసుల దూరములో ఉన్నది. 'హైదరాబాదు వదలినదిమొదలుగా పాలు పెరుగు మాత్రము తంబళి జాతివారిగుండా ఊరూరిలో సమృద్ధిగా దొరుకును ... ఈ దేశములో తంబళిజాతివారు వుస్సాలు పాలు, పెరుగు తెచ్చి యిచ్చి మేళాలు వాయించుచున్నారు మంగలజాతివారు మసాల్ వేయుచున్నారు" (వు ౮౬)

ఇది ఆనాటి తెనగుజనులనుగూర్చిన ముచ్చట.

ఇక మన తెనుగు భాషాస్థితి ఒక్కొక్క ప్రాంతమందెట్లుండెనో కనుగొందము. "కడపవదలినది మొదలుగా అరవభాష తెలిసి మాట్లాడ తగిన వారు సకృత్తుగా ఉన్నారు. తెనుగుమాటలు సర్వసాధారణముగా రాగసరళిగా చెప్పుచున్నారు. ప్రశ్నపూర్వకముగా ఉత్తర ప్రత్యుత్తరమిచ్చే టప్పుడు శబ్దముల సంకోచిత పరచి మాట్లాడుచున్నారు. ఎట్లాగంటే యీ యూరు ఆయూరికి ఎంతదూరమంటే నాకు ఏమిమెరుకఅని ప్రత్యుత్తరము పుట్టుచున్నది. వండుకొన్నాడు అనడానకు వండినాడని అనుచున్నారు. హిందూస్థానీ తురకమాటలు తరుచుగా తెనగుభాషలో కలిపి మాట్లాడుచున్నారు. (౮౮ ౮౯)

ఇది రాయలసీమను గూర్చి చెప్పిన మాటలు. తెనుగు దేశానికి దక్షిణమున కడప జిల్లా ఒక హద్దని ఇతని అభిప్రాయము, ఆదిలాబాదుకు ఉత్తరమున ౧౦ క్రోసుల దూరముపై మేకల గండి అను ఘాటుకలదు. తర్వాత వరదానది దాటవలెను హైద్రాబాదు సరిహద్దు దానితో తీరిపోయింది అని వీరాస్వామి వ్రాసెను. వరదానది అవల నాగపూరు రాజ్యమని తెలిపినాడు. అక్కడ కాయరా అనే యూరు మొదలు తెనుగుసకృత్తుగా ఉన్నది. (౫౬)

విశాఖపట్టణము జిల్లాలోని తెనుగు భాషనగూర్చి యతడిట్లు వ్రాసెను.

"సర్వసాధారణముగా ఈ దేశమందు తెనుగుభాష ప్రచురము గానున్నది మాటలు దీర్ఘముగానున్న దేశీయమై రహస్యముగానున్న పలుకుతారు తెనుగు అక్షరములు గొలుసుమోడిగా వ్రాస్తారు. మనుష్యులు స్వభావముగా దౌష్ట్యములు చేయతలచినా మంచి తియ్యని మాటలుమాత్రము వదలరు. (౩౩౭)

గంజాముజిల్లా తెనుగుసీమకు మరొక హద్దు. గంజాం మొదలుగా కళింగ దేశము ఆరంభమవుటచేత ఇండ్లు మనుష్యులఅలంకారాలు దృష్టిదోషపు పాటింపులు దక్షిణదేశము వలెనే యావత్తు కలిగివున్నవి. చిన్నయిండ్లకు కూడా వాకిటపంచతిన్నెలు పెట్టికట్టినారు. ప్రతిస్త్రీలు బలాకులు ముక్కరధరించి వున్నారు సమీపమున వుండేమాలువఘా అన్న వ్వారిలో యెవరికి రాని తెనుగు భాష యక్కడ అందరికి వచ్చినది. (౩౧౯)

నెల్లూరుదక్షిణములో తెనుగు సీమకు మరొకహద్దు. నెల్లూరు మొదలుగా అరవ మాటలువింటూవస్తాను. యీ దేశములో పడమటినుంచి కన్నడము వచ్చి కలసినది. దక్షిణమునుండి అరవము వచ్చి కలసినది. ఉత్తరమునుంచి తెనగు అదేరీతిగా వచ్చి కలసినది గనుక యీమధ్య దేశపుభాష (ఉత్తర దక్షిణపినాకినీలమధ్య దేశభాష) యీమూడు భాషల మిశ్రమయి యీమూడుభాషలు యీదేశస్థులు వచ్చిరాక ఆయాదేశములోకి వెళ్ళి మాట్లాడపోతే ఆయాదేశస్థులు హాస్యము చేయసాగుతారు." (౩౬౧)

చెన్నపట్టణమునుగూర్చి అందలిభాషలనుగూర్చి వీరాస్వామిగారిట్లు తెలిపినారు.

"౨౦౦ ఏండ్లక్రిందట (అనగా ౧౮౩౧ కి ౨౦౦ ఏండ్ల పూర్వము) చంద్రగిరిలో బీజానగరపు (విజయనగరపు) సమస్థానాధిపతి యయిన శ్రీరంగరాయడు దొరతనము చేయుచుండగా 'డే' అనేదొర యీ సముద్ర తీరమందు ఒక రేవు బందరు కట్టించవలెనని యత్నము చేసి శ్రీరంగరాయణ్ణి అడిగి వుత్తరువు తీసుకొని యీ ప్రాంత్యాలకు జమీందారుడైన దామర్ల వెంకటాద్రినాయడి పేర సన్నదు పుచ్చుకొన్నాడు. ఆ వెంకటాద్రినాయడు డే దొరకు కృతపరిచయుడు కనుక శ్రీరంగరాయడు తన పేరుపెట్టి శ్రీరంగరాయ పట్టణము అని రేవుబందరు కట్టమన్నా వెంకటాద్రినాయడు తన తండ్రియైన చెన్నపనాయడి పేరట చెన్నపట్టణమని పేరుపెట్టి కట్టడమే కాక తానే సన్నిధానాధిపతి గనుక అదే నామకరణము ఆరంభములో చేసినందున చెన్నపట్టణము పేరు కలిగినది. తత్పూర్వము ఈ రేవును యింగిలీషువారు మదిరాసు అంటూ వచ్చినారు. (౩౬౯)

"ఇక్కడివారు (చెన్నపట్టణమువారు) ప్రకృతులు ఉపాయవేత్తలుగాని సాహ

ములు గారు. ద్రావిడాంధ్రకర్ణాటదేశాల మధ్యే యీ పరిదేశము వుండుటచేత బాల్యాదారభ్య దేశ్యములైన ఆ మూడు భాషలున్ను ముందు దొరతనముచేసిన వారి తురకభాష, యిప్పుడు దొరతనము చేసే యింగ్లీషువారిభాషయున్నూ నోట నానడముచేతనున్ను పదార్థముల గా కొన్ని సంస్కృతవాక్యాలు అభ్యసించుట చేతనున్నూ ఇక్కడివారి వుచ్ఛారణ స్ఫుటముగా ఉంటూ వచ్చుచున్నది. ఇక్కడి స్త్రీలు గర్విష్ఠులుగానున్ను పురుషులపట్ల నిండా చొరవజేసుకొనే గలవారుగానున్ను అగుపడుతారు. అయితే వస్త్రాభరణప్రియులే కాని నైజగుణమై సాహసమునిండాకలవారుగా తోచలేదు." (౩౭౩)

"హైదరాబాదు రాష్ట్రములో తెలంగాణాను గురించి వీరాస్వామి తాను వెళ్ళిన దారిలో తగిలిన ప్రదేశాలలోని విశేషములను తెలిపినందువ దీనినిగూర్చి ప్రత్యేకముగా వ్రాయవలసియున్నది.

హైదరాబాదులోని కొల్లాపుర వనపర్తి సంస్థానాలవారు తరుచుగా తగవులాడి ఒకరి గ్రామాలను ఒకరు కొల్లపెట్టి రైతులను హింసించి గ్రామాదులు పాడుచేయుచున్నారు. ఈలాగున కలహములు పొసగినప్పుడు న్యాయము విచారించి యొకరికొకరికి సమరసపెట్టకుండా చందూలాల ప్రభృతులు ద్రవ్యకాంక్షచేత ఉభయులకున్ను కలహములు పెంచి వేడుకచూచుచున్నారు" ౨౮-౨౯

"జమీందారులు- వారి అధీనములో నుండే భూమిని పూర్ణమైన స్వాతంత్ర్యము కలిగి ఆ యా భూములలోని కాపురస్థులను భర్త భార్యమీద చెల్లించే అధికారముకంటె ఎక్కువైన అధికారములోనే యున్నారు" (౩-౨) ఈ వాక్యములు వ్రాసి ౧౧౬ సంవత్సరాలు గడిచిపోయినను ఇప్పటికిని హైదరాబాదు జాగీర్లలో ప్రజలు సర్వ"రహితులు"గా నున్నారు. జాగీర్దారులు ఆ 'రహితుల'పై భర్తలు భార్యలపై చెల్లించుకొనే దర్పముకంటె మించిన దర్పాన్ని సాగించుకొంటున్నారు. జాగీర్దార్ల దౌర్జన్యాలను గూర్చి బిల్గ్రామీ ఇట్లు వ్రాసెను.

'ప్రతిగ్రామములో జాగీర్దారు వ్యాపారులను బాధించి సరకుల పై సుంకాలు లాగుకొనేవారు. అందుచేత క్రీ. శ. ౧౫౦౦ నుండి ౧౮౦౦ వరకు రాష్ట్రములో వ్యాపారము నశించిపోయెను"

హైదరాబాదులో 'మనుష్యులందరున్ను ఆయుధపాణులై మెత్తనివారిని కొట్టి వదుకుచున్నారు' (కాశీయాత్ర ౩౭) మహారులో (హైదరాబాదునగరంలో) చంపినా అడిగే దిక్కులేదు. బీదలు ఏచెట్టు వేసినా వాటి ఫలమును క్షేమముగా ఆయుధాలే ఆభరణాలుగా నుంచుకొని దర్పమే యశస్సుగా భావించుకొనియుండే లోకులు అనుభ

వింపనీతురు, సాత్విక ప్రభుత్వముకల రాజ్యములో మెదిగినవారికి ఆ షహరులో ఉనికిన్ని, ఆ రాజ్య సంచారమున్ను భయప్రదములుగా ఉంచున్నవి. (కా. ౩౬) 'నాగపూరు నివాసస్థులు క్షత్రియులుకాని హైదరాబాదు షహరువారివలె మాటకు మునుపు ఆయుధములు వాడేవారుకారు' 'ఉత్తరసర్కారులలో నిజాంగారి జమీందారులు చాలా దౌర్జన్యాలు చేసిరి. (బిల్గ్రామి సంపుటం ౨ పు ౨౨) పిండారీలు, మరాటీవాడు దేశాన్ని కొల్లగొట్టుతూ ఉండెను. (౨౦-౨-౩౦)

హైద్రాబాదు రాష్ట్రములో 'ప్రతిదినం బందిపోటు దొంగతనాలు జరుగుచుండెను. రోహిలా గుంపులు. దొంగగుంపులు గ్రామాలను దోచుకొనుచుండెను (బి ౨-౧౨౭) బందిపోటుదొంగలలో ఎక్కువ రోహిలాలే యుండిరి. (బి. ౨-౧౬౯)

హైద్రాబాదు రాజ్య విట్టి దుస్థితిలో నుండుటచేత రాష్ట్రమంతటా వ్యాపారం స్తంభించి వ్యవసాయం నాశనమై పలుమారు కరువులు వచ్చి జనులు ఈగలవలె రాలిపోతూవచ్చిరి. రాష్ట్రములోని కొన్ని కరువుల వృత్తాంతము చాలాఘోరముగా ఉండెను.

'క్రీ.శ. ౧౬౨౯-౩౦ లోని కరువులో రొట్టెయు స్త్రీ కన్నబిడ్డను దానికి మారుగా యిచ్చువా రుండిరి. కుక్కలమాంసమును మేకమాంసమని అమ్మినవారుండిరి. చచ్చిన ప్రాణుల యెముకలను పిండిచేసి ధాన్యము పిండిలో కలిపి అమ్మిరి. కొందరు మనుష్యులను ఇతర మనుష్యులు తినిరి. మరల ౧౬౫౯ లో, ౧౬౮౧ లోను క్షామాలు సంభవించెను. (బి ౨-౧౬-౧౭) ౧౭౦౨ లో, ౧౭౧౩ లో, ౧౭౪౯ లో, ౧౭౮౭ లో క్షామాలు వచ్చెను. ౧౭౬౯-౯౩లో తెలంగాణాలో ఘోరక్షామము కలిగెను. హైద్రాబాదునగరములో౯౦౦౦౦ మంది చచ్చిరి. ఇండ్లలో చచ్చినవారిలెక్క లేనే లేదు. రాయచూరుజల్లాలో ౨౦౦౦ సాలెవాండ్లలో ౬ మంది మాత్రము క్షామానంతరము మిగిలినవారైరి. దేశమంతా చచ్చినవారి పుర్రెలతో నిండెను. అందుచే దాన్ని పుర్రెలకరువు అనిరి. (బి. ౨-౨౫) క్రీ.శ. ౧౮౦౪లో మళ్ళి క్షామము కలిగెను. రూపాయికి ౬౦ సేర్లమ్మె రాగులు రెండున్నరసేరుప్రకారమమ్మెను. కొందరు మనిషిమాంసమును తినిరి. (బి. ౨-౨౯) మళ్లీ ౧౮౩౧ లో క్షామము వచ్చెను. 'పిడికెడు గింజలకు పిల్లలను తండ్రులమ్ముకొనిరి. జొన్నలు రూపాయికి ౩ లేక ౪ సేర్లమ్మెను. చెట్ల ఆకులను జనులు మేయుచొడగిరి. (బి, ౨-౨౯,౪౦) మళ్ళీ ౧౮౫౪ లో మరొక క్షామము వచ్చెను వీధులలో పీనుగలు నిండియుండెను.

క్షామాలఫలితముగా జనులు అప్పులపాలైరి. అప్పులిచ్చేదానిలో మార్వాడీలే ఘనులు. కాని వారికంటె ఘోరులున్నారు కాని అదేలనో వారి నెవ్వరు

మన్నా స్మరించరు. అరబ్బులు, రోహిలాలు హైద్రాబాదురాజ్యములో ౨౫౦ ఏండ్ల నుండి జనులకు అప్పులిచ్చి ప్రపంచములో కనివిని యెరుంగని వడ్డీని వసూలుచేస్తూ వచ్చినారు. ఈనాడుకూడా వారు నూటికి ౪౦౦ రూపాయిల వడ్డీని వసూలు చేస్తున్నారు. అప్పులపోతులు బాకీ యియ్యకుంటే జంబియాలతో పొడిచి వసూలు చేసేవారు.

"రైతుల ధాన్యాన్ని మార్వాడీలే కొని కోఠాలలో పెట్టి ధరలుపెంచి అమ్ముచుండిరి. ఆకాలములో మార్వాడీలను గూర్చి యిట్లనుచుండిరి. 'ఒకలోటాతో, దానికొక చిన్న త్రాడుతో, ఒకకట్టుధోవతితో నర్మదానుఒకమార్వాడీదాటి హైద్రాబాదు చేరుకొనిన కొన్నేండ్లలోపల వాడు విపరీతపు వడ్డీవ్యాపారమువల్ల ధనికుడై బండెడు బంగారుభర్తీతో మార్వా (బి. ౨-౫౬) 'అరబ్బులు రాజారాంబక్షు అనే పూర్వమంత్రికి బాకీలిచ్చిరి. అతడు బాకీలు చెల్లించకపోతే అరబ్బులు అతన్ని చాలా ఘోరముగా కష్టపెట్టగా తట్టుకొనలేక అతడు నిజాం దేవిడీలోనే దాగుకొనెను. (బి. ౨-౫౯) అరబ్బుల దౌర్జన్యాలు విపరీతమైపోయెను వారు అప్పులిచ్చి హింసించి వసూలు చేసుకొనుచుండిరి అప్పులపోతులను తమ జమాదార్ల యిండ్లలో మూసివేసి కూడునీళ్ళియ్యక కష్టపెట్టి బాకీలు వసూలుచేసుకొనుచుండిరి, పఠానులు, అరబ్బులు జాగీర్దారులకప్పులిచ్చి ౫౦ లక్షల ఆదాయకర జాగీర్లను తమ వశములో ఉంచుకొనిరి. (బి. ౨-౧౧౮) 'పూర్వం కోర్టులు లేకుండెను. కోమట్లకు వ్యాపారులకు అప్పులు రాకుంటే వారు రోహిలాలను అరబ్బులను పంపేవారు. వారు జంబియాలతో వసూలుచేసియో లేక వాని సామానులను లాగుకొనియో వస్తూ ఉండిరి. రోహిలాలు అరబ్బులు తమ సొంత అప్పులను ఇయ్యనివారిపై బండలుమోపి వాతలు వేయుచుండిరి. బాకీపడినవాడు పారిపోయేట్లు కనబడితే వానిపై తమవారి సిద్దీముగ్గురిని కావలాపెట్టి ఆ కావలికూలీ కూడా వసూలు చేయుచుండిరి. తామిచ్చినదానికంటె చాలా యెక్కువ వసూలుచేస్తూ ఉండిరి. (బి. ౨-౧౬౩)

జనులు తమ పిల్లలను అమ్ముకొనుచుండిరి. అట్టి వ్యాపారాన్ని క్రీ.శ. ౧౮౫౬ లో నిషేధించిరి. (బి. ౨-౧౯౭) హైద్రాబాదురాజ్యములో క్రీ.శ. ౧౮౯౮ లో సహగమనమును ఆపివేయించిరి.

(బి. ౨-౫౮)

తెలంగాణములోని భూములన్నీ గుత్తకిచ్చుచుండిరి గుత్తేదారులు రైతులవద్ద ధాన్యభాగము తీసికొని సర్కారుకు రూపాయలు చెల్లించుచుండిరి, భూమికు నిర్ణయమగు పన్నులు లేకుండెను. దేశముఖులు దేశపాండ్యాలు పన్ను వసూలుచేయు అధికారులు భూమిపన్నే కాక మగ్గంపన్ను, కడపపన్ను, కలాలి, ధస్తక్ పట్టీ, ఖేడ్ పట్టీ, పట్టీవంటీకులాల

పన్ను, పెండ్లి పన్ను, లోళ్ళ పన్ను, హాట్బాజారీ ( కూరగాయలు ) పీనుగుల పట్టి, తోకపన్ను, అదంపట్టి (హిందూపారిశ్రామికులపై పన్ను ) మున్నగు ౨౭ విధాల చిల్లర పన్నులను ప్రజలనుండి లాగుచుండిరి, (బికి ౨-౫౩)

తెలంగాణములో చాలాపరిశ్రమలుండెను. ఇంగ్లీషువారి వ్యాపారముమూలాన దేశమందలి అరాచకమువలన ౧౮౦౦-౧౮౫౦ ప్రాంతమున వాటి క్షీణదశ ప్రారంభమయ్యెను. వరంగల్ జంఖానాలు, తివాసీలు కాకతీయుల పతనమునాటి నుండి ప్రసిద్ధిగాంచినట్టివి. బిదరులో బిదరీ సామానులు బిదరుసుల్తానుల కాలము నుండి వృద్ధికి వచ్చినట్టివి. తెలంగాణము ప్రధానముగా నూలుబట్టలకు ప్రపంచ ప్రఖ్యాతి గన్నట్టిది. మార్కోపోలో రుద్రమదేవికాలములోని సన్ననిబట్టలను జూచి అవి సాలెపురుగుల దారాలా అని భ్రమపడెను,

వరంగల్ తివాసీలను, జంఖాణాలను ౧౯౫౧ లో ఇంగ్లండుకు ప్రదర్శనార్థము పంపిరి, ఇనుమును కరిగించి ఇనుపవస్తువులను చేయుచుండిరి. వరంగల్, కూనసముద్రము, డిందుర్తి, కోమరపల్లి, నిర్మల్, జగిత్యాల, అనంతగిరి, లింగంపల్లి, నిజామాబాదు మున్నగు స్థలములలో ఈపనులు జరుగుచుండెను. నిర్మల వద్దనుండు కూనసముద్రములో శ్రేష్ఠమైన ఉక్కును సిద్ధముచేయుచుండిరి. ఎల్గందల్ ఇబ్రహీంపట్టణము, కోనాపూరు, చింతలపేట మున్నగు స్థలాలలోను మంచి ఉక్కు సిద్ధమగుచుండెను కూనసముద్రము ఉక్కువంటి దానిని పర్షియాలో చేయుటకు చాలాప్రయత్నముచేసి విఫలులైరి కత్తులను హైద్రాబాదు, గద్వాల, వనపర్తి, కొల్లాపురములలో ౧౮౯౦ వరకు కూడా విశేషముగా తయారుచేయుచుండిరి. ౫ రూ మొదలు ౧౫ రూ. వరకు వాటి నమ్ముచుండిరి. బంగారునీరు పోసిన కత్తులు ఖమ్మములోని జగదేవపూరులో తయారగుచుండెను. గద్వాలలో తుపాకీలుకూడా సిద్ధముచేయుచుండిరి. రోహిలాలు పట్టే పెద్దతుపాకీలను వనపర్తి. గద్వాల. నిర్మలలో చేయుచుండిరి. ౨౦ రూ నుండి ౬౦ రూ. వరకమ్ముచుండిరి నూలు, పట్టు కలిపి నేసిన మష్రు అను బట్టలను హైద్రాబాదులో గద్వాలల నేయుచుండిరి. టస్సర్ పట్టుబట్టలను వరంగల్, నారాయణపేట, మట్వాడా, హసన్ పర్తి, కరీంనగరుజిల్లాలోని మాధాపురంలో నేయుచుండిరి. ఇందూరు ( నిజామాబాదు ) మెదకు, హైద్రాబాదులోను,మహబూబునగరుకు ౧౦ మైళ్ళ దూరములోనున్న ......లోను కాగిదములు సిద్ధము చేయుచుండిరి.

(బిల్గ్రామి సం. ౧. పు ౩౯౫-౮౨౫)

కడపజిల్లాలో దువ్వూరుఅను గ్రామముకలదు. 'దువ్వూరు మొదలుకొని ప్రతిగ్రామమందున్న కొండ కరముల

వాండ్లు ఇనుపరాళ్లతో ఇనుము చేయు చున్నారు (కా. యా ౬) గుంటూరు జిల్లాలో చేరిన వేటపాలెములో "౧౦౦౦ నేతగాండ్లుండిరి తోవుశెల్లాలు రుమాలా తానులు చీరలు వగైరాలు నేసి అనేక దేశాలకు వుపయోగమయ్యేటట్లు చేసి జీవించుచున్నారు" (కా 3౫౫) బాల కొండలో (వేములవాడ వద్ద) "మేనాస వారలు గంజీఫాచీట్లు ఇవి మొదలైనవి చేసి హైదరాబాదుకు తీసుకొనిపోయి అమ్ముచున్నారు. ఈ యూరిలో జీవి గలవాండ్లు అనేకులు శివపన్నులుగా నున్నారు" (కా ౪౬) "నిర్మల వంట పాత్రలు ఈ ప్రాంతములో బహుప్రసిద్ధిగా నున్నవి. నిండా కంచరయిండ్లున్నవి." (కా. ౫౨)

అప్పటిజనులు ఆచారవ్యవహారాలు కొన్ని వీరాస్వామియిట్లు తెలిపినాడు "హైదరాబాదులో గొప్పవారందరున్నూ పండుటాకులు (తమలపాకులు) వేసు కొనుచున్నారు బాలకొండలో పండు టాకులు దొరకును. కడప మొదలుగా గోదావరీతీరమువరకు (నిజామాబాదు కుత్తరములో) అమ్మే పక్కాలు ముడి పక్కాలు. ఈ దేశములో పేదలు నిండా నిండా తాంబూలము వేసుకోవడము లేదు వక్కలు మాత్రము నములుతారు. శూద్రులచేతి హుక్కాలు ఇతరులు తాగు చున్నారు." (కా ౫౮) హైదరాబాదులో పండ్లు దొరుకును కాని "చెన్నపట్టణము కంటె మూడింతల వెల యివ్వవలసినది కూరగాయలు అప్రకారమే ప్రియమైనా మహారుచికరముగా నున్నది. (కా 3౮) "కూరగాయలరుచికి హైదరాబాదుకు సమముగా యీవరకు నేనుచూచిన భూమిలో యేదిన్నీ చెప్పకూడదు" (కా. ౨౭౬)

ఆకాలమున హిందూదేవాలయముల యొక్కయూ హిందూమతముయొక్కయు స్థితి శోచనీయముగా వుండినది హిందు వులలో కులాలతత్త్వము వెర్రి రూపాల దాల్చెను. మద్రాసులోని కులకక్షలను గూర్చి యిట్లు కాశీయాత్రలో తెలిపినాడు. "అప్పట్లో అనేక తెగలు దేశములనుంచి యిక్కడికి వచ్చి చేరినందున యెడమ చెయ్యిశక్తి అని కుడిచెయ్యిశక్తి అని రెండు పక్షాలుగా యిక్కడివారు చీలి యింగ్లీషు వారికి చాలాశ్రమను కలుగజేసినారు." (3౭౦) దేవాలయాల ఆదాయాన్ని ఇంగ్లీ షువారున్ను నవాబులున్ను తాము పాలించే ప్రదేశాలలో తీసుకొంటూ ఉండిరి "వెంకటేశ్వరునికి ప్రార్థనలు చెల్లించే లోకులవలన కుంఫిణీ వారికి సాలుకు సుమారు లక్ష రూపాయీలు వచ్చుచున్నవి కొండమీద యేధర్మ కార్యము చేసుటకున్ను సర్కారుకు రూక లియ్యవలెను." (కా. ౪) "అహోబిల ములో ఉత్సవకాలమందు ౪౦౦ వరహాలు హాశ్శీలు అగుచున్నవి. వాటినంతా కందనూరి నవాబు పుచ్చుకొని వెనక గుళ్ళసంగతినే విచారింపడు (కా. ౧౦) "శ్రీశైలయాత్రకు తీసే హాశ్శీలు కంద నూరు నవాబుకు చేరుచున్నది. (కా. ౧౩) "అగుడి హాశ్శీలుమూలకముగా సంవత్స

రము ౧కి ౧౫౦౦౦ కందనూరు నవాబుకు వచ్చినా గుడి యేగతి పొందేదన్ని విచారించదు. (కా. ౨౦)

హైదరాబాదు "మిహారుచుట్టునూ చిన్నతిప్పలున్నవి. అనేక తిప్పలకొనలయందు షాహీదులు కట్టబడియున్నవి హిందూదేవాలయములు లేవు. అవియున్నా వృద్ధికి రానియ్యరు" (కా. ౩౫)

"ఇందలవాయి అనే రామస్థలము చేరినాను. (కామారెడ్డి దాటినతర్వాత ఇందల్వాయి వచ్చును) ఈతురకల రాజ్యమందు ఈస్థలము కుంపటిలో తామరమొలచినట్లున్నది. తిరుపతి వదలిన వెనక రాజోపచారములతో ఆరాధన నడిచేగుడి యిదియొకటే చూచినాను. నావిచారణలోనున్న వేరేలేదని తెలిసినది." (కా. ౪౩)

ఈవిధముగా ఇంగ్లీషువారి యొక్కయు కర్నూలు నవాబులయొక్కయు, హైద్రాబాదు నవాబులయొక్కయు ప్రపాలనలో ఆంధ్రదేశమందలి హిందూమతమునకు క్షీణదశ సంప్రాప్తించియుండెను. దానికనుగుణ్యముగా హిందువులలో కులం తప్పులు, ఎచ్చుతచ్చులు, కొత్త కొత్త ఆచారాలు, అంతులు కొల్లలుగా పెరిగిపోయెను జనులకు మతబోధచేయు పీఠాధిపతు లేమూలనుండిరో యేమో? ఆచార్యత్రయము తర్వాత వారిపీఠాలపై విభ్రాజమానులగుచూవచ్చిన పీఠాధిపతుల స్మరణ సెచ్చును కానరాదు. అట్టి అంధకారములో తత్త్వాలు బోధించే కొందరు భక్తులుమాత్రము తమను చేతనైనంత సంస్కారము చేస్తూవచ్చిరి. మన సమీపకాలములో బ్రహ్మానందయోగి, కంబగిరి, ఇంద్రిపీఠిబ్రహ్మన్న, చిత్తూరు నరసింహదాసు, వరనారాయణదాసు, పరశురామ నరసింహదాసు, అదికేశవులు, వీరాస్వామి, శివయోగి, తోటగజేంద్రుడు, అంగప్ప మున్నగువారు పామరజనులలో మతప్రచారము చాలా చేసిరి.

కర్నూలు నవాబులు మతావేశపరులై చాలా దేవాలయాలను మసీదులుగా మార్చిరి. కొందరి హిందువులను తురకలనుగా జేసిరి. మహారాష్ట్రదేశములో శివాజీకాలములో ముసల్మానులైన పలువురి హిందువులను శుద్ధిచేసి మరల హిందువులనుగా జేసిరి. క్రీ శ. ౧౭౫౬లో కర్నూలుజిల్లాలోని పత్తికొండను బసాలత్ జంగు అనునవాబు చిన్నతిమ్మన్న అనునతనికి జాగీరుగా నిచ్చెను, అతడు పైకము చెల్లించలేక తన భార్యను పిల్లలను జామీనులుగా బసాలత్ జంగువద్ద వదిలెను బసాలత్ జంగు ఆస్త్రీని పిల్లలను బలవంతముగా ముసల్మానులచేత వండించిన అన్నమును తినిపించెను. ఆసంగతిని పేష్వాతో చెప్పుకొనగా వారిని విడిపించి శుద్ధి చేయించెను. కాని వాసప్ప అను పిల్లవాన్ని మాత్రము బసాలత్ జంగు భార్య వదలక తురకనుచేసి రహ్మతలీఖాను అను పేరుపెట్టి తన కొడుకుకు దివానుగా చేసెను.

(కర్నూల్ మాన్యుయల్)

## ॥ గీతావళి

౧

శ్లో॥ శ్రీ మాడపాటికులభూషణ సచ్చరిత్రం
హన్మంతరాయ విబుధం, వినయాభిరామం
భాషాభిమాన నిరతం బహుకార్యదీక్షం
లోకోపకారక మతిం హృదిభావయామి. ౧

శ్లో॥ ఏతత్తుసర్వ విదితం ప్రతిభాతిలోకే
శ్రీ భోగభాగ్యనగరం శ్రితస్వర్గతుల్యం
యస్యాధిపోరక్షతి స్వప్రజాస్తు
హ్యుస్మానలీతి ప్రథితోదిశి దక్షిణాయాం. ౨

శ్లో. అస్మత్సుహృత్సంచిత రాజ్యతంత్ర
న్యాయాదిశాస్త్ర కుశలత్వ విభూషిత తత్వాత్
రాజ్ఞాప్రతిష్ఠిత మహోన్నత విశ్వవిద్యా
పట్టాప్రదాన పరిషద్బహు మానితోభూత్. ౩

శ్లో. రాష్ట్రేస్మి న్యవనాధినాథ ప్రభుతా నాస్త్యేవ వై రంజనే
అన్యోన్యం మతవై మనస్యరహితా నేకేశతాబ్దాగతాః
ఆంధ్రాణామతి విస్తరా పరిగణెసంఖ్యావశాత్పూర్వతః
భాషావ్యాప్తి పరోబభూవ సుకృతీ హన్మంతరాయాగ్రణీః. ౪

శ్లో. ఏతేనైవ ప్రతిష్ఠితా దిశిదిశి గ్రంథాలయా నేకశః
రాష్ట్రేస్మిన్ సకలాంధ్రమేళన సభా సంస్థాపితా భూత్స్వయం
విద్యావ్యాప్తి హృదిస్థితోయ మధునా విద్యాలయా నిర్మితాః
తేషాం రెడ్డికుల ప్రశస్తిసుభగం విద్యాలయంరాజతే. ౫

శ్లో. సర్వేషా మాంధ్రజానాం శుభకరసమయంచోత్సవం ప్రాప్తమద్య
యస్మాచ్ఛ్రీ మాడపాటేర్వయసి సుఖతరం షష్టిపూర్తిర్బభూవ
దేయాచ్ఛ్రీచంద్రమౌళి ర్నతజనసులభస్సర్వ దేవాదిదేవః
ఆరోగ్యం విత్తమాయుశ్శత మధికతరం లోకసంప్రీతయేస్య. ౬

శ్రీ జొన్నలగడ్డ శోభనాద్రిశాస్త్రి.

౨

సీ. పలుకఁగా నేరని పత్రిక బుడుతల, "కత్తత్తి" యని మాటలాట నేర్పి
వ్రాయువ్య నేరని పండిత లోకము, గ్రామ్యక్కి "క్రో" యనికూయ నేర్పి
వ్రాయఁగా జంకెడి పడుచుల కలముల, గిలుకుల దెసలంట గలువ నేర్పి
మదిలోని భావాళి మాటాడి కలిబుచ్చ, విన్నపోయెదు వారి వెన్నుఁ జఱచి

గీ. ఆంధ్ర సారస్వత మునిజామాంధ్రసంఘ, మిట్టుల నెన్నిఁటినో కూర్చుఘటకులందు
నొక్కరుఁడవయి మించితీవుఱుక్కమిగుల, రమ్యగుణసాంద్రహనుమంతరాయచంద్ర!

సీ. అలనాడు నాటిన యాంధ్ర సంఘుంబిప్పు, డెట్టులపనినిర్వహించు చుండె
నలనాడు గ్రంథాల యాభివర్థక సంఘ, మెట్టుల పని నిర్వహించు చుండె
నలనాడు కూర్చిన యాంధ్ర సారస్వత, మెట్టుల పని నిర్వహించు చుండె
నలనాటి సంచార కాంధ్ర సంఘ తలంబు, దెట్టులపని నిర్వహించు చుండె

గీ. నీవునాటిన మొలకలు నీవు జూచు. చుండ గెలలేయఁ జూచు భాగ్యోదయంబె
నీకు గల్గెనదృష్టంబు నీదకాదె ప్రాజ్ఞగుణదుర్య హనుమంత రాయవర్య!

శ్రీ ఒద్దిరాజు రాఘవరంగరావుగారు

3

మృదు మధురగాత్రి సస్మేర భాస్వత్తంత్రి
నుదయించి వల్లకీ హృదయార్ద్రశ్రుతులొల్క
ఆడనంపు కార్యభావాంత రోర్మికలందు
గదలిరావయ్యా! విక్కపు మక్కువల్ మీర
నడయ! హన్మద్రాయ! సకలాంధ్ర సంపూజ్య!!

ఏలొక్కలప్ప

మాతృదేవీభక్తి
మైమఱవు దట్టంగ
మాతృభిమాన ని
ర్మలభావ ముప్పొంగ
జాతిసేవాభక్తి
జాతిపూజాసక్తి
మణికాంతోజ్జ్వల దీప్తి

శుభ్రతేజస్స్ఫూర్తి
రగులంగ
బాగులంగ
రక్తంబులుడుకెత్త
బ్రేమాంజలిఘటించి
భూమి నాదలవాల్చి
నీమంబుతో పాడ

నీ తేజముల్ప్రాలి
తప్తాశ్రు దుఃఖనేత్రములఁ దల్లిని జూచి
సుప్తస్వదేశవాసుల మేలుకొల్పఁగ
పసుపుతోరము గట్టి
భద్రభేరిని గొట్టి
కనుగందువుల లేపి
కడిదిబోదుల రేపి
యువకమానసపాళి
నుఱ్ఱూతలూగించి
యువతీజనస్వాంత
మివురొత్త గిలకొట్టి
తెలగాణ్యమున, నవ్య
తేజంబు వెలిగించి
కలకలారావ సంకులరసాలచ్ఛాయ
విశ్రమించితివయ్యా విబుధాగ్రగణవర్య

• • •

గురువర్యుఁడవు నీవు- గురుకులాగ్రణివీవు,
గరువంబులేని సం-గడికాఁడ వీవయ్యా!
మన తెలంగాణమున-గనువిచ్చితివి నీవు
చిననాట నంకరిలో-పెరిగి పేర్వడసితివి!
ఊరూర నీపేరు - కీర్తులు వెలయంగ
మారుమూలల కేఁగి-మాటాడి, మేల్కొల్పి

తనజాతి, తనబాస
తనసంస్కృతి మనంగ
జనతా వళిఁ బ్రీతి
జనియించ నేర్పితివి!

తల్లులను మఱచి, పెర-తల్లి వంచలఁబడిన
కల్లకపటపు మోజ-గడియించి, పేరూరు
కొల్లమాపిన తెలుగు-హేమాహేమిలలోన
తొల్లిఁటి నిజాయితీ-తొలకరిఁగఁ జేసితివి

తెనుఁగు శ్రీకారంబు
తెనుఁగు నుడికారంబు
తెనుఁగు హుంకారంబు
తెనుఁగు వ్యవహారంబు
తెలిపితివి గురుమంత్ర-ములఁ బోసితి
వయ్యా!
బిలబిలధ్వనులుట్టఁ - బ్రేమంపువలుకులను
ఋణపడియె నాంధ్రవిస్తృతజీవితములు
గణనీయ నీకిపుడు-గావించు పూజనలు
గురు హనమదాఖ్య - సద్గుణపితా
మహా! పూజ్యా!!

---

మా తెల్గుతల్లి కి-మ్మనికోరికల వండ
మాతల్లికలలోని-మధుకలశ ముప్పొంగ
తెలుఁగుదీవనసేస-లొలుకంగ, జిలుకంగ
తెలుఁగుభావన, దిగం-తరకీర్తి వెలుగంగ

అల భీష్మవతిఁ బోలి
ఇల తిక్కకవిఁ జాలి
అల చణక్యుని వోలి
ఇల తిమ్మరసు జాలి
అల భోజనృపుఁడవై
ఇల కృష్ణరాయుఁడై

కలకాలమీవగది తెలగాణ్యసభ్యుఁడవై
విలసద్గుణస్ఫూర్తి వెలుగొందు గురువర్య
తెలుఁగు హృదయము లందు తెలుఁగు
పాత్రములందు
తెలుఁగు లేఖనులలోఁ తెలుగు భావన
ములో

వెలలేని నీమహా ద్విభవ రేఖలు గలవు!
తలపించు భావిసంతతికి నీస్వర్ణాఖ్య!

హనుమంత రాయఁడిన
అఖిలాంధ్ర పూజ్యుఁడవ.

అరువదేడులునిండ -
నాద్యుఁడు పితామహుఁడు
చిరుబొజ్జ కదలఁబం -
గరు చెక్కుళులు కుల్కఁగ
బోసి నోట్చిగురింపఁ -
ముడుతఁబడ నెన్నొసలు
భాసమానాంధ్ర సిం -
హాసన మధిష్టించి
ముసిముసి నగవులీల -
గుసగుసలు బుసగొట్ట
కపిమసంగడు తాతఁ -
గాంచరా! మీరెల్లి!!

ముతకధోవతి చెంగు -
మురువొప్పజీరాడ,

సితదు కూలచ్ఛాయ -
లతి పూజ్యతనుజాల
చేఁ గట్టె మున్ముందు -
లాగికొని పోవంగ
వేఁ వేఁగమున సాగి -
వెడలుచుండగ. తాత!

కోడ కాండ్రింతయును -
చేడియలు బాలకులు.
జోడించి చేతులను - శీర్షంబులను వంచి
తెలుగునమస్కృతుల -
తెలుపనుప్పొంగెద
తలరాకు బండి మెత్తని - తలంపులతోడ
మనసార పూజించి - మనసేవ లొనరించి
మన పితామహునికి -
ర్తనము సేయండోయి

శ్రీ గవ్వా అమృతరెడ్డిగారు

## ఆంధ్రపితామహోపాఖ్యానము

రచయిత: శ్రీ గవ్వా మురహరిరెడ్డిగారు

౪

సీ. కుచ్చుబొమిడిక శిరమెక్కి కులుకులాడ
ఊగునొకగాను కంఠాన కుచ్చుటోపి
నాల్కపై శారుకూతలు నాట్యమాడ
మన తెలంగాణొకవ్వ దున్మాదివోలె.

ఆ. పేరంటానికిబోయె నాంధ్రికడకీ పేరమ్మ, తద్వేషమూ
మొరాలీనుగజూచి, విల్వువను నీరిదాడ, నోయమ్మకో!
వర్రె నన్ గన నాదులజ్జవిడదే! ఈ నీవు జాతియతన్
జేరన్ జూచెదగాక! నివ్వనుచు, గాసింతెంత రోషింపగా.

క. అనఘుని యువమతి బొగిలియు
దనయులను నయంబుగనమి, ప్రథమంబున, యా
గానముల వేలుపు గొలువగ
హనుమద్రాయుని నొసంగె, నసువులనూదన్.

ఉ. పొత్తుల బిడ్డవోలె నిటమొల్చియు ప్రాగ్భవనంబుసోకి మే
లొత్తిన బుద్ధిశోంపముల నూగుచు జెంపోకవోయి మాతృదుః
ఖాత్తగతిన్ గరంగి స్వగతాకృతి నేమరి బంధక్రిందయా
వత్తు జగత్తునుంగనెదు వ్యర్థమతీంద్రుల భ్రాతృలన్గనన్.

సీ. మోహైనవాతెఱ ముత్యాలగుఱిపింప
సభ నుపన్యాసాల సాముగూర్చ
బూజపట్టినబుద్ధి నాజుకుపఱపంగ
గ్రంథాలయాల సంగతమునిచ్చి
భావనైచ్య పరీతవల్లరితతిగోయ
నాంధ్రసంఘుల విత్తమమరజేసె
ప్రభువుకు ప్రజలకు ప్రేమపాశములల్ల
న్యాయవాదమునేర్చి సాయపడియె

గీ. తెలుగువారికి గరడాలు దిద్దనేర్పి
అగ్నిగుండాల వీరంగమాడనేర్పి
విస్మరించిన మన పూర్వవైభవముల
తలుపులనువిప్పి తలపుల గిలకరించె

సీ. ధోవతినందాగ దొరతనంబారు సం
చరిగొసి తిత్తిలో దిరుగువారు
బొట్టుబొట్టుల మైత్రి గుట్టు తెల్పునటంచు
కలకు మ్లేచ్ఛప్రవృత్తి గ్రాలువారు
తెలుగు తేనెల గ్రోల దెలివికెక్కువయుని
గులకరాళ్లను మ్రింగి కునుకువారు
తనదాపుబీకల తద్దినంబులుపెట్టి
పొరుగబిడ్డల పెళ్ళి జరుపువారు.

గీ. తాత హనుమంతరాయని త్యాగ ధైర్య
సత్య సంపత్తులల్లిన చంద్రికలను
తిమిరమును వాపుకొనిరి మా తెనుగువారు
ఆంధ్రజాతీయరోచిస్సు లలముకొనగ.

గీ. ఇట్టి ధీ హనుమద్రాయ పట్టిపెంచె
సిలుగుఁ గాంచి తోడికోడలు మొగంబు
మాడిపో! "శ్రీ తెలంగాణ" మాన్యహృదయ
ఒక్కనా డాతనింగని పొక్కెనిట్లు.

ఉ. కూరిమిబిడ్డ కందొవలకుల్కెను నన్నని చెక్కుటద్దముల్
చారలువారె ముత్తెములసందడి వాతెఱవాసె ముద్దులొ
ల్కారు పసిండిమేన్సొబగు ఘూణిత మానసమానమయ్యె
నారటసంబు వాడె నికనాగతిజూచునెవండొ! ఈశ్వరా!

చ. మతుని బితామహుండనుట శోకము ప్రాకొను నో ప్రభూ! భవ
ద్వ్రతుడగు హన్మదాఖ్యునకు బ్రాయమునిచ్చితి! నిత్యజీవిగా
నితడటనీ చిదాంశువుల నీసరిమై భజయింపలేదె! యే
కతమున షష్టికీడ్చితివి? కట్టడి! నా హనుమంతరాయనిన్

క. నావినిస్మిత వదనుండై
దేవర మన శ్రీ నిజాము తెల్గు పురంధ్రిన్
పావన వాగ్మధుధారల
దీవెనలన్నింపి తనివిదీర్చెనిటు దయన్.

శా. జేలా! యాడితివంతె! నీ కడుపుతీపిన్ గాని యీలోకమం
దేలీలన్ జిరకాలజీవులగు వీరేమాత్రలేదాట త్వ
న్మాలామధ్యమణి ప్రభావుడగు హన్మద్రాయుడాయుష్కుడై
లాలించున్ నిను వేయికాలములు వాల్లభ్యంబు చేకూరగన్.



## పంచరత్నములు

శ్రీ అడ్లూరి అయోధ్యరామకవిగారు

ఉ. శ్రీ విజయోస్తు! ఆంధ్రజనసేవిత! సుప్రతిభాన్వితాంధ్రగీ
ర్దేవి ప్రియాత్మజా! నిఖిల దిగ్వశ విస్తృత కీర్తివంత! ని
ర్జీవ సమాంధ్ర ధైర్యధన జీవకరా! హనుమంతరా[illegible]! స
ద్భావ గుణాంచితాంధ్ర! ప్రపితామహ! కీర్తి వెలుంగు మెప్పుమున్

సీ. ఒకనాడు గ్రంథాలయోద్యమం బనుపేర
నాంధ్రలక్ష్మికి రూప మమరజేసి!
ఒకనాడు సాహిత్యసుకళోద్ధరణమని
వన్నచిన్నల నవయువంబుదిద్ది!
ఒకనాడు పత్రికాముఖమున గోలకొం
డను నివాసముగ పట్టంబుగట్టి!
ఒకనాడు దాసి నాంధ్రోద్యోగంబని పిల్చి
సంజీవకిరణిచే చక్క దిద్ది!

గీ. నట్టి గారాబుకన్న మా పిట్టి[illegible]
నెట్టులో పెంచినావు ప[illegible]యేండ్లు!
పెరుగుచున్నట్టి యాశాల పెరుగ నియని
కొడుకుల జూచి గుండెలు గొట్టుకొనవె?

శా. 'తాతా' నన్ స్థితిజూడుమంచు కలనో నా బాష్పముల్ రాల్చుచున్
"నా తండ్రుల్ నను గొడ్డుకేశమున కన్యాయంబుగా నన్ను జూ
తేతండ్రీ!" యన నీవుగాక హృ[illegible]మందే తమ్ము లజ్ఞానులై
మాతృస్పృష్టిపడి ఘోరహింసల[illegible] మాతాగ్రణీ! గుండెదో.

ఆ. వే. నీకు వర్షశతము నిండగా నీబాల
షష్టిపూర్తి జేయ సమయమందు
మా స్వరాజ్యలక్ష్మి మా "ఆంధ్రప్రపితామ
హా"! యనంగ జేయు నచ్చు వేగ.

ఉ. నీకృషి నీతపస్సు గ[illegible]తొలి నాడటెంపని
యాకృతి పద్యకాంతమున [illegible] కే
దోకృతిగా సమర్పణ యథోచితభక్తి నిసేయు కోర్కె నే
డీకృతి "గేయమాలిక" గనిచ్చి యలంకరణంబు సేయుమా!

# తెలుంగు వీరగాథ

శ్రీ అడవి బాపిరాజుగారు

తందానతాన తందానతాన తందాన
తందానా.

పరమేశ్వరునకు జేజేలండీ
భక్తిని పెట్టండీ.
తందానతానా.

భారతమాతకు జేజేలండీ.
ప్రణతులు పట్టండీ.
తందానతానా.

ఆంధ్రమాతకూ జేజేలండీ.
అంజలి దాల్చండీ.
తందానతానా.

ఆంధ్రనాయకుడు అమృతమూర్తీ
అదుగో చూడండీ
ఆంధ్రనాయకుడు గూడపాటికీ
జయములు పలుకండీ
తందాన తాన

నిద్రపోయే తెలుగునాడునూ
నిద్ర లేపినాడూ
నీవు ఆంధ్రుడవు నీకే [illegible]
నిద్రొద్దన్నాడూ
తందానతాన

ఆతని కేకతో మేలుకొలుపుతో
అందరు లేచారూ
తెలంగాణమూ ఉలిక్కిపడుతూ
తెలివిని పొందిందీ
తందానతాన

తెలుగుతనమూ తమకే లేదని
తెలుగు భాషా తమదే కాదని
తెలుగువారూ తామే కామని
తెలంగాణమూ మత్తులో ఉంటే
మంత్రపుకత్తా తిప్పారండీ
మాడపాటివారూ.
ఆంధ్రమహాసభ కడుపున కనిరీ
ఆంధ్రమహాసభ జనకులు అయిరీ
నిజాంరాష్ట్ర ఆంధ్రదేశమూ
నిలిచిండండీ ప్రతిజ్ఞ పూనిందీ.
తందానతాన

ఆంధ్రమహిళలకు శక్తినిచ్చిరీ
ఆంధ్రయువకులకు శక్తినిచ్చిరీ
ఆంధ్రులు అంతా వీరపురుషులై
కార్యశూరులై
ముందుకు వచ్చిరి
మాడపాటి శ్రీహనుమంతారావుని
[illegible]దూ.
తందానతాన

అంబైఏళ్ళా దేశసేవయే
అరవైఏళ్ళా సంఘసేవయే

ఆంధ్రపురుషుడూ
హనుమంతుండూ
వారికి జేజేలూ

తందానతాన

గాంధీకిమల్లె పూర్ణజీవియై
కర్మవీరుడై కరుణామయుడై
తెలంగాణమును
ముందుకునడిపే
తెలుంగువీరుండై

తాతగారు మా హనుమంతుండూ
నూటఇరువదీ ఏళ్ళు బ్రతుకనుని
మాకు నాయకుడు మహా నాయకుడు
మా బిడ్డలకు నాయకుండుగా
వీరపురుషుడై వెలగాలంటూ
భగవంతుణ్ణి ప్రార్థిస్తామూ
మంగళమయ్యా మంగళమయ్యా
తెలుగునాయకుండా.

తందానాన



## కానుక గేయము

శ్రీ కాళోజీ నారాయణరావుగారు

౨

తాతకు అరువదియేండ్లు నిండెనని
తందనాలు పాడండోయ్
తాత యొనర్చిన మేలుతలచుకొని
తాండవ నృత్యము చేయండోయ్
ఆంధ్ర గౌరవము తెలంగాణమున
అతడే నిలిపినవాడండోయ్
ఆంధ్ర పితామహుడని అందరిచే
ఆదరింప బడినాడండోయ్
ఆంధ్రోద్యమమును తెలంగాణమున
నంచరింప జేశాడండోయ్
ఆంధ్రమహాసభ పేర నందరకు
అమర తరువు అయినాడండోయ్

పితామహుండు చెప్పినమాటలు
పిన్న పెద్దలకు తగునండోయ్
పిన్ననాటనే పెబ్బగ నిలచి
పేరుపడసిన వాడండోయ్
ఆంధ్రపితామహు నాధిక్యంబును
అవనినంతా చాటండోయ్
తెలంగాణులు తాత ఋణంబును
తీర్చుమార్గ మిదియేనండోయ్
తాత చూపిన మార్గము వదలి
తప్పుడు త్రోవల బోకండోయ్
తత్వభేదమని తాతకు మనమలు
దగ్గునేర్పుట తగదండోయ్

కలకొరకారి కంటూ తెచ్చుట
తథ్యమటంచును తలచండోయ్
వారలు వేరని మనలో మనము
తన్నులాడుట తగదండోయ్
కామారెడ్డులు కాంగ్రెసువాదులు
కలసిన కానిది లేదండోయ్
తాత పేరటనైనను మనుమల
కంటూ బాసిన చాలండోయ్
షష్టిపూర్తి యుత్సవమును చేయగ
సన్నాహాలు చేయండోయ్
పల్లె పల్లెలో యింటి యింటిలో
పండుగవలె జరుగాలండోయ్
ఐక్యరాజ్యములు తెలంగాణమున
లభ్యమౌట ఘనమౌనండోయ్

ఐక్యమునకు ప్రాముఖ్య మొసంగిన
లక్ష్య ఐక్యము కాదండోయ్
ఆంధ్రపితామహుడన్న ఆంధ్రులకు
ఆదరమెంతో చూపండోయ్
ఆంధ్రగౌరవము నిలుప భేదములు
అడ్డము రావని తెలుపండోయ్
పితామహునియెడ భక్తిభావము
ప్రేరేపించుటచే నండోయ్
కాళోజీ నారాయణరావు
కానుకగేయము వ్రాసిండోయ్
తాత కరువది ఏండ్లునిండెనని
తందనాలు పాడండోయ్
తాతచేసిన మేలుదలచుకొని
తాండవ నృత్యము చేయండోయ్



# ఆంధ్ర పితామహ జీవిత చరిత్ర

## యక్షగానము

రచయిత : శ్రీ శిరోమణి చలమచర్ల రంగాచార్యులుగారు

౧

**యక్షుడు :**

రామ రామ శ్రీ రామా రామా రామా రఘు రామా!
కామితార్థము లిచ్చి బ్రోవు కమనీయ గుణధామా!
ఆంధ్ర పితామహుని అద్భుత చరితము అందరు వినరండి!
ఆంధ్ర జాతినే మేల్కొల్పిన అమలచరితుం డండి!
కలమే కత్తిగ పనిసాధించిన కార్యశూరు డండి!
తెలుగు నేలపై మిలమిల మెఱసే దివ్యరత్న మండి!

తాత యుగంధరు వాసిఁగల్పిన నీతిచతురు డండి !
ఈతడె యందఱి నేతాజీయని ఖ్యాతిగాంచె నండి!
"రామరామ

ఊతగాడు :
ఓహోహో ! ఇట్టి ఘనులైన వారా హనుమంతరావు పంతులుగారూ ! వారి పుట్టు పూర్వోత్త రాలెట్టివో సవిస్తరంగా వినుల విందు చేయమంటున్నారయ్యా! తెలుగు దొరలందఱునూ! ఓ జక్కుల శీను!

యక్షుడు :
అన్నలార! మీ రవధరింపుడీ యాంధ్ర దేశమందు
చెన్ను మీఱు కృష్ణామండలమే చేరియుండు నందు
పొక్కనూరు జనపదము పేరెక్కి యుండు నందు
చక్కగాను ఆర్వేల శాఖ యాచక్కి పొల్పునొందు
మాడపాటి వంశంబు వెలుంగును మాన్య మౌచునందు
వాడవాడలకు ప్రాకెను ఆ ఘనవంశ కీర్తియొందు!
"రామరామ శ్రీ"
ఆ వంశంబున వెంకటప్పయ్య అమల గుణుఁడు పుట్టె
శ్రీ వర్ధిల్లగ వేంకట సుబ్బమ్మ చేతినతడు పట్టె
పుణ్యదంపతులు నోచిన నోములు పూచి కాచె నట్టె
గణ్యుల పుత్త్రుల నిరువురి గాంచగ ఘనత మిన్నుముట్టె
తిరుమల రాయుడు జ్యేష్ఠుడు వంశపు తేజము నిలబెట్టె
సిరులెసంగ హనుమంతరాయుడు చిన్ని పట్టి పుట్టె
"రామరామ శ్రీ"

ఊతగాడు :
ఆహా! ఈరీతిగా ఉదయించిన బాలహనుమంతరాయని గాంచి విజ్ఞానవంతులైన పెద్దలంతా ఏమని దీవిస్తున్నారయ్యా!

యక్షుడు :
పాప యీతఁడే తెలంగాణవు భావినేత యంచు
ఏపుగ ఆంధ్రుల సంస్కృతి కితడె ప్రాపుచూపునంచు
విద్యల నీ పసిబాలుడె ముందు వెలయఁజేయు నంచు
ఉద్యమంబులకు నీ బుడుతండే యూతయౌ నటంచు

తెలుగు వెలుంగుల కీ ఉటుతండే దివ్వెకంబ మంచు
పలికిరి వృద్ధులు దీవెన లివియే ఫలములౌచు మించు
"రామరామ శ్రీ"

ఊతగాడు :

ఓహోహో! శ్రీపంతుల వారి బాల్యదశ యేయేవిధంగా నడిచిందో వివరించ గలవయ్యా!

యక్షుడు :

పసితనంబునన జనకుని బాసిరి బాలురు వలవంత
కసికందులను మేనమామయే గాంచి సాకెనంత
శ్రీ తిరునగరి సాతాని నర్సయ చెన్నుగ తన పొంత
ఖ్యాతిగ శ్రీకారము చుట్టించి యశము గాంచె వింత
వడిగా సాగిన చదువుల తిగెలె వన్నెమీఱె నంత
మిడిలు దాటి మెట్రిక్కు దాటెను మేలన జనమంత!
"రామరామ శ్రీ"

ఊతగాడు :

పంతులుంగారి అప్పటి ఆకృతి విశేషాలూ విద్యావైశద్యాలూ ఎల్లాంటివయ్యా అని యడుగుతున్నారయ్యా తెలుగుదొరలంతానూ.

యక్షుడు :

కోరమీసల బెళుకు తనంబే మీఱు మోము సౌరు
కోరి వెలమల జులపా తలపై కుచ్చుటోపి చేరు
ధీరతనంబే పోతపోసిన తెరగున మైతీరు
పారసీకమే బాసాడ సెబాసులు డయివాఱు
ఉరుదు తెలుగు అంగ్రేజీల బిరుసుతె పస మీరు
తరుణ శ్రీ హనుమంతరాయుని దాశతలంపున గోరు
"రామరామ శ్రీ"

ఊతగాడు :

భోగ్యాం రా! ఏమిఅద్భుత మేధస్సురా! మిడిలేగాకనూ, మెట్రిక్కులో గూడా విజయము పొందీ పారసీలో నాలుగు బాసలూ ఆకళింపు చేసుకొని ఏమే ఉద్యోగాలు సాగించారయ్యా పంతులుంగారూ!

యక్షుడు :

ఉద్యోగాలే చేయగాను మది ఊహ చేసినాడు
విద్యాశాఖను లేఖకుడై తా వెలయ గల్గినాడు
శాసన సభలో పరివర్తకుడై సంతసించినాడు
భాసుర ప్రజ్ఞాన్వితుడీతండని ప్రథను పొందినాడు
సేవను వీడి న్యాయవాదియై చెన్ను మీరినాడు
జీవిత రథమును స్వాతంత్ర్య పథమున జేర్పగల్గినాడు

"రామరామ శ్రీ"

ఊరగాడు :

అవాటి తెలంగాణము పంతులుగారి కేవిధంగా గోచరించిన దయ్యా!

యక్షుడు :

తెలుగు మాటాడుటె తెలియని పెద్ద దేశముఖులతోను
తెలుగు వేసమే నీచమనెడి యా ధీరవరులతోను
తెలుగుపత్రికే చూచియెఱుంగని తెలుగుమూకతోను
తెలుగువారికి సంస్కృతిలేదను తెంపరిగమితోను
తెలుగులు బోయజాతివారనే పలుగాకులతోను
తొలిగాదోచెను తెలంగాణమే తొలగిన పసతోను

"రామరామ శ్రీ"

ఊరగాడు :

అయ్యారే! అట్టిస్థితిలోనికి వచ్చిన తెలంగాణమును గాంచి కన్నీరునిండ
పంతులుగా రేమని కళవళం పడ్డారోగదా!

యక్షుడు :

కాకతీయులు రాజ్యమేలిన గణ్యభూమి యిదియా!
కాకలుదేరిన ఆంధ్రవీరుల పీఠము నెలవిదియా!
పోతన భాగవతంబు పుట్టిన పుణ్యభూమి యిదియా!
కాత మల్లినాథుండు వొడమిన ధన్యవాటి యిదియా!
ఆంధ్రులసంస్కృతి కాలవాలమై అలరిన చోటిదియా!
ఆంధ్రత్వమ్మెమాయు దుస్థితికి జేర వచ్చె నిదియా!

"రామరామ శ్రీ"

ఊతగాడు ;

అని తలుపలువిధాలుగా తెలంగాణపు దుస్థితిని గాంచి విచారించినవారై పంతులుగా రేమిచేసినారయ్యా!

యక్షుడు :

అప్పుడేమి తా జేసినాడయా హనుమంతరాయుండు
చప్పున గ్రంథాలయోద్యమంబే సాగించెను ముందు
చప్పక మెల్లగ రాజకీయములు చేర్చెను నిపుణుండు
గుప్పెను సభలం దుపన్యాసములు కొల్లగ ధీరుండు
విప్పెను తెలుగు చరిత్రమ్ముగలే విద్యల పేరుండు
త్రిప్పెను ప్రజల దృక్పథంబునే తెలుగునాయకుండు

"రామరామ శ్రీ"

ఊతగాడు :

పంతులుగారి అఖండ కృషి ఫలితంగా తెలంగాణంలో కలిగిన జాగృతికి చిహ్నాలేవేవయ్యా! యక్షులదక్షా!

యక్షుడు :

పలుచోట్లను గ్రంథాలయమ్ములే బయలుదేర నోహో!
భళిభళి! తెలుగు పత్రికలల్లే బయలువెడలెనోహో!
తెలుగువ చెప్పె పాఠశాలలే వెలయసాగె నోహో!
తెలుగు వేసమే బాగనిపించే తెలివి కలిగె నోహో!
తెలుగు బాసలో ఉపన్యసించే తెగువగల్గె నోహో!
తెలుగులకెట్టి సంస్కృతి గలదో తెలియవచ్చె నోహో!

"రామరామ శ్రీ"

ఊతగాడు :

నివురు గప్పిన నిప్పులాగా మెల్లగా సాగుతూన్న గ్రంథాలయోద్యమాన్ని సమయం గుర్తించి కీలు త్రిప్పినారయ్యా పంతులుగారూ, ఇక ఏంచెప్పాలిగదా! అదే ఆంధ్రోద్యమమై పల్లెపల్లెను అలముకొన్న రీతి ఎట్లాంటిదయ్యా! నాయకులై నడుము బిగించిన వారెవరెవరయ్యా!

యక్షుడు :

రంగము కెక్కి ప్రతాపరెడ్డి రక్తి మొలసె నౌరా!
చెంగున రామ కృష్ణరాయడే చెంగలించె నౌరా!

రంగారావు కంబము మెట్టే ప్రాక గల్గె నౌరా!
రంగారెడ్డి కొండతుంతసై పొంగివచ్చె నౌరా!
సింగంబై నరసింగరాయుడే చెన్నుమీరె నౌరా!
ఖంగున రామచంద్రరాయుడే కదలివచ్చె నౌరా!
పొంగుచు రామకోటీశ్వరుడే మొనముదలసె నౌరా!
రంగుగాను నారాయణ రెడ్డి రాణచూపె నౌరా!

ఊరగాడు :

ఇట్టి అతిరథ మహారథులే గాక ఇంకా ఎందరెందరో ఆంధ్ర యోధులు కార్యరంగానికి దూకేసరికి ఆనాటి భారత యోధులను గాంచిన భారత పితామహుడు భీష్మునికి ఉప్పొంగి పోయినారు గాదా! ఆంధ్ర పితామహులైన పంతులు గారూ, వారి కీర్తి పతాకలై నిల్చిన మహాసంస్థలను నోరారా పేర్కొమంటున్నారయ్యా మన తెలుగు దొరలందరూనూ!

యక్షుడు :

అదిగో! ఆంధ్రమహా సభయే అవధరించ వలెను
అదిగో! ఆంధ్రమహిళా సభయే అవధరించ వలెను
అదిగో! ఆంధ్రగ్రంథాలయమే అవధరించ వలెను
అదిగో! లక్ష్మణరాయమండలి అవధరించ వలెను
అదిగో! మేల్గోల్కొండ పత్రిక అవధరించ వలెను
అదిగో! బాలికా పాఠశాలయే అవధరించ వలెను
అదిగో! శ్రీ విజ్ఞాన వర్ధని అవధరించ వలెను
అదిగో! సారస్వత పరిషత్తే అవధరించ వలెను
కలవు వర్గసభలు ఎన్నో కలవు తెలియ వలెను
కలవు పంతుల యాశీస్సుల కలిమి గాంచ వలెను

"రామరామ శ్రీ"

ఊరగాడు :

ఇక సారస్వతరంగంలో శ్రీ పంతుల వారి వీరవిహారాలు వివరించవయ్యా!

యక్షుడు :

శాస్త్రకాలపు హిందుప్యార్యుల గాథ వ్రాసెనండి
చిత్రము గారిబాల్డు జీవితము చిత్రించెనండి

కూరిమి ప్రేమచందు కథలే కోరి కూర్చెనండి
పేరిమి భారత సమితునే వెలయ చేసెనండి
కమ్మగ రోమక సామ్రాజ్యపు కథను వ్రాసెనండి
ఇమ్మగ నెన్నో వ్యాసరాజముల నితడు వ్రాసెనండి

"రామరామ శ్రీ"

## యశాశీస్సులు

అరువది యేండ్లు నిండెను మన అగ్రనేత కిపుడు
పరువము తెలుఁగు జాతికి యిది సౌభాగ్య సమయమిపుడు
పెల్లుగ షష్టిపూర్త్యుత్సవమే వేడ్క సాగె నిపుడు
కొల్లగ తెలుగుల ఉల్లపుపూలే కురియసాగె నిపుడు
కోరిక పూఁచు నీతని జీవిత కుసుమవాటి యెపుడు
నూరు వసంతములందు వెలయుత! నూత్నకళల నెపుడు
రామ రామ శ్రీ రామా రామా రామా రఘు రామా!
కామిం తార్థము లిచ్చి బ్రోవు కమనీయ గుణధామా!



# అనుబంధము ౧

## ఆంధ్రపితామహుని షష్టిపూర్త్యుత్సవ వర్ణనము

### హైదరాబాదు

### ౧

#### మొదటిదినము

పార్థివసంవత్సర మాఘ శుద్ధపంచమీ బుధవారం (౬-౨-౧౯౪౬ ఫ॥ 6-2-1946) నాడు రెడ్డిహాస్టల్ ఆవరణమందు చక్కని షామియానాలను విశాలముగా వేసిరి. ద్వారములకు పచ్చని తోరణములు, రంగు రంగుల జండాలు రోడ్డువరకు కట్టిరి. "హనుమంతరాయ షష్టిపూర్త్యుత్సవము-సుస్వాగతము" మొదలగు పదములు రంగుగుడ్డలపై వ్రాయబడి నలువైపుల అతికించబడినవి. అశ్వారూఢయైన రుద్రమదేవి పటము ద్వారమువద్ద ఉంచబడెను. ఆవరణమంతయు కన్నులపండుగా నుండెను. మూడుగంటలకల్లా జనం రాసాగిరి. స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు, ఆంధ్రులు, కర్ణాటకులు, మహారాష్ట్రులు, మహమ్మదీయులు ఒకరేమిటి అందరు ఆంధ్రపితామహుని ప్రశంసించేవారే. ఆంధ్రవిద్యాలయము మున్నగు సంస్థల స్వచ్ఛందసేవకులు బారులుతీర్చి నిలువబడిరి. నాలుగు గంటలకు సీతారాం బాగు సన్నాయి మేళగాండ్లు శ్రావ్యంగా వాయించనారంభించిరి. కొంచెము సేపటికి అందరు హనుమంతరావుగారి ఇంటికి బయలుదేరిరి. అదివరకే హనుమంతరావుగారి ఇల్లు జనముతో క్రిక్కిరిసిపోయెను. ఆహ్వానసంఘ కార్యదర్శియగు శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు, సభ్యులందరు ఆశీర్వదింప, శ్రీ హనుమంతరావుగారికి, వారి సతీమణికి, కుమారునికి ఖద్దరు వస్త్రములు సమర్పించిరి. ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీ రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు శ్రీ కె. కోటిరెడ్డిగారి (కడప) తో సమయమునకు వచ్చిరి. తెల్లగుర్రంబగ్గీ మనోరంజకముగా నలంకరింపబడి ద్వారము కడకు వచ్చెను. శ్రీ హనుమంతరావుగారును, వారి కుమారుడును దానిలో సుఖాసీనులైరి. సన్నాయి వాద్యముతో, స్వచ్ఛందసేవకుల 'మాడపాటి హనుమంతరావుకు జై, ఆంధ్రపితామహుకు జై' అను నినాదములతో, ఉత్సాహపూరితజనంతో ఊరేగింపు ఆరంభమయ్యెను. పురుషులందరు బగ్గికి ముందును, స్త్రీలందరు వెనుకను నడచిరి. కంఠస్వామి సందంతయు ప్రజామయమైపోయెను. లాల్జీ మేఘ్జీ గారి ఇంటివద్ద శ్రీ హనుమంతరావుగారికి పూలదండ వేసిరి. పెద్దరోడ్డుమీదికి ఊరేగింపు

వచ్చువరకు ట్రాఫిక్ అంతయు ఆగిపోయెను. బగ్గీగుఱ్ఱము ఎదురు బెదురు లేక శాంతముగా తీసికొని పోవుచుండెను. దారిలో బట్టలవర్తకులు తుంగా సత్తెయ్య నరసింహులు, రాజయ్య, వరదాచారి, పర్వతాల వెంకయ్య, ఎఱ్ఱం సత్యనారాయణగార్లును కృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయ కార్యదర్శిగారును, భాగ్యనగర ఖాదీ భాండారు ఖాదీవస్త్రాలయము వసుదేవ ఆయుర్వేద ఫార్మసీవారును పూలదండలు వేసిరి, కొందరు వస్త్రములతో బహూకరించిరి. ఊరేగింపు సుమారు అయిదున్నరగంటలకు రెడ్డిహాస్టలు ద్వారము వద్దకు వచ్చెను. బాలికలు మంగళహారతి పట్టిరి వైష్ణవోత్తములు వేదగానము చేయుచుండగా శ్రీహనుమంతరావుగారు సభ్యులందరు సుఖాసీనులైరి.

శ్రీ రాజాబహద్దరుగారు ఆహ్వానఅధ్యక్ష ఉపన్యాసమిచ్చుచు శ్రీ హనుమంతరావుగారి సేవను త్యాగమును వివరించిరి. గౌ॥ దివాన్ బహద్దరు అరవముదు అయ్యంగారుగారు, ప్రారంభోపన్యాసమిచ్చుచు, శ్రీ హనుమంతరావుగారు పూర్వం తమవలెనే న్యాయవాదులనియు, వారు ఆంధ్రులకు అనేకవిధముల సేవ చేసిరనియు, అనేక సంస్థలస్థాపించి అభివృద్ధికి తెచ్చిరనియు, తెలుపుచు శ్రీవారి గుణగణములను ప్రశంసించిరి. నాటిసభాధ్యక్షులు శ్రీ కోటిరెడ్డిగారు మాట్లాడుతూ తమబోటి సంస్థానేతరంవారిని ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించమనికోరుట భారతదేశము ఏకఖండమని ఋజువు చేయడమేననియనిరి. తమకు శ్రీవారితో కొద్దిసంవత్సరాల పరిచయమైనా బాల్యమునుండి వారి ఆంధ్ర సేవను వింటిమనియు వారిసేవ అపారమనియు తెలిపిరి. తరువాత ఆహ్వాన సంఘము వారి సన్మానపత్రమును ఆసంఘపక్షమున శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు చదివిరి. పిమ్మట ౪౨ సంఘముల వారు సన్మానపత్రములు సమర్పించి, ఆంధ్ర పితామహులను పుష్పమాలలతో గౌరవించిరి. ఆంధ్రసంస్థలవారేకాక, రాజా బహద్దరు విశ్వేశ్వరనాథ్‌గారు, కాశీనాథరావు వైద్యగారు, జనార్దనరావు దేశాయిగారు, శ్రీహనుమంతరావుగారిని పుష్పమాలాలంకృతులంజేసిరి తరువాత తులాభారమహోత్సవము జరిగెను. శ్రీవారు అలంకృతమైన పెద్ద త్రాసులో కూర్చొనిరి. వెండిరూపాయలతో తూచిరి. ౬౪౦౦ (ఆరువేల నాలుగువందల) రూపాయల తూకమున్నట్లు నిర్ణయించబడెను. ఈపైకము ఆహ్వాన సంఘపక్షమున వారికప్పగింపబడెను. మున్నూరుకాపు సంఘమువారు మరికొన్ని ఇతర సంస్థలవారును తమ ప్రత్యేక కానుకలనర్పించిరి. అలియబాద ప్రసన్నగజానన బాలికా పాఠశాల బాలికలు శ్రీవారి జీవితమును గురించిన బుర్రకథను వినిపించిరి శ్రీ కోటిరెడ్డిగారు తమ తొలిపలుకులలో శ్రీ హనుమంతరావుగారిని నిజాంరాష్ట్రములోనే కాక ఆంధ్రదేశమంతటిలోను గూడ వారిని ఎరుగనివారు లేరనిరి. శ్రీ హనుమంతరావుగారు తమకు జరిపిన

సన్మానమునకు కృతజ్ఞతా వందనములు తెలిపిరి. పండితుల ఆశీర్వచనములతో మొదటిదిన కార్యక్రమము ముగిసెను. (౫-౫-౧౩౫౫ ఫ.)

రెండవదినము.

(౭-౩-౧౯౪౬) గురువారం సాయంత్రము ౬ గంటలకు ఆంధ్రపితామహుని షష్టిపూర్త్యుత్సవ రెండవరోజు కార్యక్రమము, ప్రేక్షకులచే క్రిక్కిరిసియున్న రెడ్డిహాస్టలు ఆవరణంలో ప్రారంభమైనది. ఆహ్వానసంఘ కార్యదర్శియగు శ్రీకొండా వేంకట రంగారెడ్డి గారి పరిచయ వాక్యములతో శ్రీ పింగిలి వెంకటరామారెడ్డి దేశముఖుగారు అధ్యక్షత వహించిరి. ఆంధ్ర మహాసభా ప్రచారకుడు "వందేమాతరం" గీతమును పాడెను. అధ్యక్షులు తమ తొలిపలుకులలో శ్రీ హనుమంతరావుగారు హనుమకొండలో తమ బాలమిత్రులేకాక సహపాఠకులనియు, తాము కొలది విద్యతో మానుకొనినను రావుగారు తమ చదువును మెట్రిక్ వరకు సాగించి ఉత్తీర్ణులైనటుల చెప్పిరి. హనుమంతరావుగారి జీవితములో వివిధ దశల వివరించుచు, వారి నిరాడంబర ప్రజాహిత జీవనమును కొనియాడిరి. కార్యదీక్షను, నిష్కల్మష ఆశయములను వివరించిరి. వాక్చాతుర్యమును సూచించుచు వారు ఏకార్యమును తలపెట్టినను శ్రోతలు తమంతటతామే సహాయమును వెల్లడింప చేయ సమ్మోహనాస్త్రమును ప్రయోగింపగల ప్రజ్ఞావంతులనిరి.

తదనంతరము రాజానాయని వెంకటరంగారావు బహద్దరుగారు, నడింపల్లి జానకిరామయ్య, సుందరమ్మగార్లు, ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము బెజవాడవారు, గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు, స్వామి రామానంద తీర్థగారు, శ్రీజగద్గురు వీరభద్ర శివాచార్యులుగారు (బనారసు) మహారాజా రామేశ్వరరావు బహద్దరుగారు, నిజాంరాష్ట్రీయాదవ యువజనసంఘము హైదరాబాదువారు, నిజామాబాదుజిల్లా ఆంధ్ర మహాసభ వారు, అయ్యదేవర కాళేశ్వర రావుగారు, కోణకంచి చక్రధరరావుగారు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, డాక్టరు మారేమండ రామారావు ఎం ఏ. గారు, అక్బర్ అలీఖాన్ అడ్వొకేటుగారు, వి. రామసుబ్బరాయడుగారు, మల్లెల శ్రీరామమూర్తిగారు, సి. రాఘవేంద్రరావుగారు, శ్రీహనుమంతరావుగారిని అభినందించుచు పంపిన సందేశముల కొమ్మవరపు సుబ్బారావుగారు చదివిరి. పితామహుని జీవితమునుగూర్చి తాము వ్రాసిన గీతములను మంత్రిప్రగడ వెంకటేశ్వరరావుగారు, జూకారెడ్డిగారు వినిపించిరి. ఎస్. నారాయణరావుగారు, వివేకవర్ధనీ ఆంధ్ర విద్యార్థిసంఘమువారు, మరికొన్ని ఇతర సంఘములవారు తమ సన్మానపత్రముల జదివిరి. శ్రీ పండిత ఆదిరాజు వీరభద్రరావుగారు, షష్టిపూర్త్యుత్సవ సంచిక

విషయములను వర్ణించిరి. ఈ సంచిక మొదటి ౮౭ పుటలలో శ్రీ హనుమంత రావుగారి జీవితచరిత్ర వ్రాయబడినదని తెలిపి ఆద్యంతభాగములను చదివి వినిపించిరి. పుష్పమాలచే నలంకరింపబడిన సంచికప్రతిని శ్రీ కొండా వెంకటరంగా రెడ్డిగారు పితామహునికి సమర్పణము చేసిరి. ఈ షష్టిపూర్త్యుత్సవము వారము దినములవరకు పలుతావుల జరుగును కనుకను వాటివిషయములన్నియు ఈ సంచికలో ఒకేచోటనుండుట సమంజసమని తలపబడుటచే ఇంకను బైండు చేయబడలేదనియు కొలదిరోజులలో ఈ పనిని ముగించి ప్రతులు కావలసినవారికి అందజేసెదమనియు ప్రతిఒక్కంటికి విలువరు ౫ లుఅనియు తెలిపిరి. శ్రీఅడ్లూరిఅయోధ్య రామయ్యగారు తామురచించిన "కాటికొండగేయము" అను పుస్తకమును శ్రీ హనుమంతరావు గారికి అంకితమిచ్చిరి. ఆర్. నారాయణరెడ్డిగారు ఆదినుండియు తమకు పితామహునితో గల పరిచయమును వారియెడల భక్తి గౌరవములను వివరించిరి. ఆంధ్రమహాసభలో నిటీవల కొన్ని అభిప్రాయభేదము లేర్పడినను, మహాసభకు గట్టిపునాదులు వేసినవారు శ్రీహనుమంతరావు గారేయనియు, ఆచరణలో భేదమున్నను ఆదర్శము లొక్కటేయనియు సూచించి తమహృదయపూర్వక అభివందనముల నర్పించిరి. తరువాత మౌల్వీసిరాజుల్ హసన్ తిరిమిజ్జీగారు, జనార్దన్ రావు దేశాయిగారు, బూర్గుల రామకృష్ణారావు గారు, కాశీనాధరావు వైద్యాగారు, మందుముల నరసింగరావు గారు, పండితధారేశ్వరజీగారు, శ్రీహనుమంతరావుగారి ప్రతిభను సేవను ప్రశంసించిరి.

శ్రీకొండా వెంకటరెడ్డిగారు షష్టిపూర్త్యుత్సవ ఉద్దేశమును మొదట రయ్యతు పత్రికలో సూచించితి ననియు, పలుతావులనుండి దీనినితప్పక చేయవలెనని సూచనలు వచ్చెననియు, రెడ్డిహాస్టలులో కొందరు సభచేసి, కార్యనిర్వాహక వర్గమును శ్రీరాజాబహద్దర్ గారి అధ్యక్షత క్రింద నేర్పరచిరనియు తెలిపిరి. ఈకార్యనిర్వాహక వర్గమువారు తమను కార్యదర్శిగా నేర్పరుచుటయేకాక, సంచిక ఉపసంఘమును, ఆర్థికఉపసంఘమును ఏర్పరచి రనిరి. ఈరెండు ఉపసంఘములవారు చక్కగా పనిచేసిరనియు, వారికృషి ఫలితముగా ఈఉత్సవమింతవిజయవంతముగా జరిగినదనియు చెప్పిరి నిధికై తాము ప్రత్యేకకృషి చేయలేదనియు చేకూరిన ధనమంతయు అభిమానులు ఒక్కొక్క రూపాయ మొదలుకొని వేయిరూపాయల వరకు విరాళముల నిచ్చిరనియు తెలిపిరి. దాతలపేర్లను నిధినివసూలు చేసినవార్ల పేర్లను చదివిరి. మొత్తమువసూళ్ళు పదివేలరూపాయలకు మించినటుల ప్రకటింపబడెను ఆంధ్రవిద్యాలయభవనము, ఆంధ్రభవనము, హనుమంతరాయ భవనము ఒకేచోట కట్టబడవలయునని ఏర్పాటులు జరుగుచున్నవనియు ఈకార్యమునకు ౩ లక్షల రూపాయలు కావలసి

యున్నదనియు అందరుతగు సహాయమును చేయవలయు ననియు కోరిరి. బూర్గుల ఇందిరాదేవిగారు "జనగణ"మనుజాతీయ గీతమును శ్రావ్యముగ పాడెను తిరుమలా దేవియను మరియొక బాలిక యింకొక గీతమును వినిపించెను.

శ్రీ హనుమంతరావుగారు తమ ప్రత్యుత్తరమునియ్య నిలువబడగానే, సభావరణమంతయు కరతాళధ్వనులచే మారుమ్రోగెను. వారు ఇలాఅనిరి:—"అధ్యక్షులు ఉపన్యాసకులు రెండు రోజులనుండి నన్నెంతో గొప్ప పొగడ్తలతోను సన్మానములతోను సత్కరించుచున్నారు. నేను మీరు అనుకున్నంతగా ప్రవక్తను కాను. నాకుముందు ఈ ప్రకారముగా సన్మానింపులు జరుగునని కొద్దియో గొప్పయో తెలిసియున్న యెడల ఇంకను సేవనుచేసి యుందును. లోకమునకు ఎక్కువగుటకు ప్రయత్నములు చేసియుందును. నేను వ్రాసిన పుస్తకములు అచ్చువడకముందే ఇతరులు అట్టిపుస్తకముల ప్రకటించుటచే నవి అనవసరమని అచ్చువేయించలేదు. ప్రభుత్వ ఉద్యోగమునందు రు. ౨౦ మొదలు రూ. ౧౦౦ ల వరకు వేతనము సంపాదింపగలిగినను దానియందు నాకు అభిరుచిలేక వకీలువృత్తి నారంభించితిని. నేనును కాశీనాథరావువైద్యాగారును ఒకే కాలమున సనదుల పొందితిమి. వారు చాల ధనమును సంపాదించినను ఇంకను ఆవృత్తినే అవలంబించుచున్నారు. కొలది కాలములోనే ఈవృత్తిని నేను విడనాడితిని. పత్రికను స్థాపించుటకై మూడు సార్లు ప్రయత్నించి విఫలమనోరథుడనైతిని. కనుకపొగడ్తకు తగినంత సేవను నేను చేయలేదు. ఆంధ్రమహాసభ విషయములో నిప్పుడు చీలికలేర్పడినను శీఘ్రకాలములో నైక్యత సమకూరకలదని ఆశించుచున్నాను."

తరువాత శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు నిన్న సమర్పింపబడిన తులాభార పైకము రు, ౬౮౦౦ లు, శ్రీ హనుమంతరావుగారి సొత్తేననియు, వారు దానిని తమ యిష్టానుసారము ఉపయోగించుకొన వచ్చుననియు తెలిపిరి. దీనికి ప్రత్యుత్తరమిచ్చుచు శ్రీ హనుమంతరావుగారు తమ జీవితములో రు. ౬౮౦౦ లను ఒక్కసారి ఎప్పుడు సంపాదింపలేదనిరి. తన జీవితావసరములకు తగినంత రాబడితనకున్నదనియు తులాభార పైకము నంతటిని ప్రజాహిత కార్యములకై శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు (అవసరమనుకొనినచో) ఇతరులను చేర్చుకొని ఉపయోగించ వచ్చుననియు అధికారమిచ్చిరి. అధ్యక్షుల మలిపలుకు తరువాత ఈ షష్టిపూర్త్యుత్సవమునకై సహాయము చేసినవారందరి పేర్లను పేర్కొని శ్రీకొండా వెంకటరంగారెడ్డిగారు తమ కృతజ్ఞతావందనములను తెలిపిరి. శ్రీ కొత్తూరి సీతయ్యగారు ఈ ఉత్సవవిషయమున శ్రీ వెంకటరంగారెడ్డిగారి కృషిని ప్రశంసించుచు హైదరాబాదు ఆంధ్రులపక్షమున వందనముల నర్పించిరి, బాలికల మంగళగీతము తరు

వాత అధ్యక్షులు వెడలిపోయిరి. శ్రీ వెంకటరంగారెడ్డి, హనుమంతరావుగార్ల సమక్షమున ఒక హిందూస్థానీయులు యోగవ్యాయామ ప్రదర్శన మొనర్చిరి. శ్రీమాన్ శిరోమణి చలమచర్ల రంగాచార్యులుగారు ఆంధ్రపితామహుని జీవితమునుగూర్చి వ్రాసిన బుర్రకథను ఆంధ్రమహాసభ ప్రచారకులు వాద్యయంత్ర సహాయముతో మనోరంజకముగా పాడిరి. పై ప్రచారకులు రాత్రి ౧౨ గంటల వరకు తమ బుర్రకథను వినిపించిరి. రంగమంతయు ప్రేక్షకులచే నిండియుండెను. ఇట్లు విజయవంతముగా, ఉత్సాహవంతముగా రెండవనాటి కార్యక్రమముతో షష్టిపూర్త్యుత్సవము ముగిసెను. (౬-౫-౧౯౫౫)

౨

ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారి షష్టిపూర్త్యుత్సవము ఆంధ్రమహిళాసభ, ఆంధ్రయువతీ మండలులు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయములో జరిపెను. శ్రీమతి టి. వరలక్ష్మమ్మగారు అధ్యక్షత వహించిరి. సంస్థాన ఆంధ్రులకు హనుమంతరావుగారు చేసిన సేవను కొనియాడుచూ, కజితపేటికలో సన్మానపత్రము సమర్పింపబడెను. శ్రీ హనుమంతరావుగారు ప్రత్యుత్తర మిచ్చుచూ, సంస్థాన మహిళలు మేల్కొనుట తనకు సంతోషదాయకమనిరి. సంస్థాన స్త్రీల అభ్యుదయానికి పాటుబడదరుగాక యని ఆశించిరి.

(౨-౫-౫౫౪)

3

పూజ్యులైన ఆంధ్రపితామహుని షష్టిపూర్త్యుత్సవము నారాయణగూడ బాలికల పాఠశాల పక్షమున పాఠశాల భవనమున జరుపబడెను. ఈ యుత్సవమునకు శ్రీ జస్టిస్ ఆర్. ఎస్. నాయుడుగారు అధ్యక్షత వహించిరి. శ్రీయుతులు రాజా బహద్దరు వెంకటరామారెడ్డి, కొండా వెంకటరంగారెడ్డి, బూర్గుల రామకృష్ణరావు మున్నగు ప్రముఖులు ఉత్సవమున పాల్గొనిరి. ఆంధ్రపితామహునికి పాఠశాల పాలకవర్గము వారును, ఉపాధ్యాయ సంఘము వారును, విద్యార్థినీ సంఘము వారును, ప్రాత విద్యార్థినీ సంఘము వారును, సన్మాన పత్రముల సమర్పించిరి. పాలకవర్గము వారు శ్రీవారికి ఒక వెండిచెంబును బహుమానముగ నిచ్చిరి. శ్రీవారి రూపపటమును అధ్యక్షులు అవిష్కరించిరి. శ్రీవారి జీవితవిశేషములను శ్రీమతి ఎస్. వి. కామాక్షి యను విద్యార్థిని ఇంగ్లీషునందును, శ్రీమతి వి. సునంద అను విద్యార్థిని తెలుగునందును ఉపన్యసించిరి. బాలికలు కోలా

టము, పూసలమ్మ, డ్రిల్లు, గానము, మున్నగు వినోదములచేత సభాసదుల నానందపరిచిరి, పాఠశాల పండితులగు శ్రీ శిరోమణి కేశవపంతుల నరసింహ శాస్త్రిగారు శ్రీవారిని గురించి రచించిన పద్యముల జదివిరి. అధ్యక్షుని మలిపలుకులతోను, ఆంధ్రపితామహుని అభిభాషణములతోను, ప్రధానోపాధ్యాయుని కృతజ్ఞతావచనములతోను సమావేశము మంగళాంతముగా సమాప్తమయ్యెను.

(౨3-౫-౧3౫౫ఫ)

# శికింద్రాబాదు

౮-౫-౫౫ ఫ. ఆదివారము సాయంత్రము ౬ గంటలకు కింగ్సువేలోని రామభవన ఆవరణములో సికింద్రాబాదు ఆంధ్ర మహాసభ జాతీయపట్టణకమిటీ అధ్వర్యమున ఆంధ్రపితామహుని షష్ఠిపూర్త్యుత్సవము అతివైభవముగా జరిగినది.

శ్రీ యమ్. శ్యామారావుగారి మందిరమునుండి గొప్ప ఊరేగింపుతో శ్రీహనుమంతరావుగారిని సభాస్థలమునకు పుష్పమాలాలంకృతమైన మోటారులో తీసికొని వెళ్ళిరి. సభకు సుమారు ౧౫౦౦ మంది ప్రజలేతెంచిరి. రాజా బహద్దరు వెంకటరామారెడ్డిగారు అధ్యక్షత వహించిరి. వారు తమ ఉపన్యాసమున పంతులుగారి ప్రజాసేవ వారికి సంస్థానపు వివిధ సంస్థలతోగల సంబంధమును వానియన్నిటికి వీరెట్లు మూలమో వివరించిరి. పంతులుగారిని విద్యాప్రియులని, స్నేహపాత్రులని, మార్గదర్శకమైన శీలముగల వారని ఉగ్గడించిరి. ఉపన్యాసాంతమున శ్రీపంతులుగారితో మనమందరము కలసి స్త్రీవిద్యాభివృద్ధికి కృషిచేయవలె ననుచు వారు దీర్ఘాయు వగునటుల భగవంతుని ప్రార్థించిరి.

తరువాత శ్రీవారికి ఈ క్రిందవివరించిన 3౨ ప్రజాసంస్థల పక్షమున సన్మానపత్రము సమర్పింప బడెను. 1. ఆంధ్ర మహాసభ, సికింద్రాబాదు పట్టణసంఘము 2. ఆంధ్రమహాసభ, తిరుమలగిరి పట్టిసంఘము 3 వైశ్యసేవాసంఘము 4. వైశ్య సేవాసమితి 5. ప్రజా సేవాసంఘం 6. ఖాదీ ప్రచారసంఘం 7. మహిళాచరకా సమాజం 8. గుమాస్తాలసంఘం 9. బట్టల హాకర్సుసంఘం 10. ఆర్యవైశ్య యువజన సంఘం తిరుమలగిరి 11. ఆర్యసమాజము తిరుమలగిరి 12. శ్రీకృష్ణగ్రంథాలయము 13. శ్రీనివాసగ్రంథాలయం 14. మద్యపాననిరోధకసంఘము 15. శ్రీ భూమానంద దాస మండలి 16 యాదవసంఘం 17 యాదవ సంఘం, పికెటు 18. ఆర్యసమాజం శికింద్రాబాదు 19. కాపుసంఘము 20. విశ్వబ్రాహ్మణ సేవాసంఘం 21, చరకాసంఘము బోయగూడ 22, ఆంజనేయ యువజనసంఘము 23 బజరంగ్ వ్యాయామ

శాల 24. గ్రెయిన్ మర్చంట్సు అసోసియేషన్ సికింద్రాబాదు. 25. ఆంధ్ర సంవర్ధనీ గ్రంథాలయము 26. మదూరి రాఘవులు భాషాకల్పవల్లి సంఘము 27. శ్రీకృష్ణగ్రంథాలయము 28. శ్రీగౌరీ శంకర ఆంధ్ర గ్రంథాలయము 29. నిజాం రాష్ట్ర ఆంధ్రసారస్వత పరిషత్తు (సికింద్రాబాదు) 30. ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘము 31. సాధనసమితి 32. నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభ తాలూకా సంఘము (సికిందరాబాదు)

సంస్థలపక్షమున పంతులగారికి రుగ్గట లును ఒక ఖద్దరుశాలువయు, ఒక గ్రంథాలయ పక్షమున ఒక భగవద్గీత కానుకగా నియ్యబడెను,

శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి గారు ఉపన్యసించుచు ఇటులనిరి—పంతులుగారికి ఆంధ్రమహాసభ పుత్రికయగు "ఆంధ్రమహిళాసభ" పుత్రిక ఆంధ్రపితామహాజయ్" అన్నంత మాత్రమున లాభములేదు. దేనికొరకు వారు తమ సౌఖ్యమును, స్వార్థమును త్యజించిరో, కృషి సలుపుచుండిరో, వానిని మనము సాధించబూనిననాడే వారిని గౌరవించినటులగును. పంతులుగారిని గౌరవించుట సన్మానించుట యన మనమొక ప్రజాసేవకుని త్యాగపురుషుని గౌరవించు చున్నామన్నమాట. అట్టివారిపట్ల మన భక్తిని వెల్లడించు చున్నామన్నమాట. భారతీయులు త్యాగపురుషులనే, ఎప్పుడు గౌరవించుచు వచ్చినారు. భారత సంస్కృతి సర్వమానవ కళ్యాణమును, శ్రేయస్సును కాంక్షించును. అందుకే పంతులుగారు కూడ కృషిచేసిరి. మనమును సంకుచిత తత్వమును విడనాడి విశాలత్వము నలవరచుకున్ననాడు పంతులుగారి వలెనే మానవ శ్రేయస్సునకు కళ్యాణమునకు పాటుబడగలము.

పిమ్మట శ్రీ బిదురు శేషయ్యగారు మాట్లాడుచు పంతులుగారు ఆంధ్రమహాసభ విషయములో వలెనే నిజాంరాష్ట్ర సారస్వత పరిషత్తు విషయములో కూడ శ్రద్ధవహించినారనియు, ఇంకను వహించవలెననియు కోరిరి. మహారాష్ట్ర పరిషత్తు కార్యదర్శి పరిషత్తుపక్షమున ఉపన్యసించుచు, పంతులుగారు 'ఆంధ్రపితామహులే కారు నిజాంరాష్ట్ర పితామహులు, నిజాం రాష్ట్రములో ఈనాడు రాజకీయోద్యమములు ప్రబలినవన పంతులుగారు నాటిన బీజములేకారణము, వారిని ఆంధ్రులు గౌరవించినటులే మహారాష్ట్రులుకూడ గౌరవింతురు. పంతులుగారు ముందు ఏలాటి ఉద్యమమును నడిపినను మహారాష్ట్రులు వారిక్రింద నిలిచెదరని హామీ ఇచ్చుచున్నాను" అనిరి మీజాన్‌పత్రికా సంపాదకులు పంతులుగారిలో నున్న ఉత్తమ నాయక లక్షణములను, సామర్థ్యములను వివరించిరి. శ్రీమతి రాపోలు లలితాదేవి ఎం. ఏ. గారు శ్రీ పంతులుగారికి అంజలి ఘటియించుచు వారిని ప్రశంసించిరి. శ్రీ అరిగె రామస్వామిగారు నేను హైదరా

బాదు ఆదిమనివాసులలోను, హరిజనుల లోను వ్యక్తిత్వము చైతన్యము కలుగుటకు కారణము పంతులుగారే యనిరి. శ్రీ శ్యామరావుగారు సికిందరాబాదు కార్యకర్తలకును, పంతులుగారికిని గల సంబంధ బాంధవ్యములను వివరించిరి. వారు సికింద్రాబాదు పౌరులకు ఎట్లు సేవ చేసినది వివరించిరి శ్రీయుతులు వాసుదేవ మొదలియారు, బాజీకృష్ణారావు, వైశంపాయన్, పి. పి సుబ్బారాయుడు బూర్గుల రామకృష్ణారావు మొదలగు ప్రముఖులును ప్రసంగించిరి. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల శ్రీనివాస వేంకటాచారి జొన్నలగడ్డ శోభనాద్రి శాస్త్రి గార్లును పంతులుగారినిగూర్చి తాము వ్రాసిన గేయములను, శ్లోకములను చదివి వినిపించిరి. (౯-౫ ౧౩౪౫ ఫ)

## హనుమకొండ

రాజరాజ నరేంద్ర ఆంధ్ర భాషా నిలయమున పితామహుని షష్టి పూర్త్యుత్సవము శ్రీ ఉదయరాజు రాజేశ్వరరావు హైకోర్టు వకీలు, దేశముఖుగారి అధ్యక్షత అత్యంత వైభవముగా జరుపబడెను. ఇచ్చటి ప్రముఖులు శ్రీ హనుమంతరావు పంతులు గారిని, సకుటుంబముగా తీసికొని వచ్చి, ఆంధ్ర మహాసభ ఓరుగల్లు వ్యా అధ్యక్షులైన శ్రీ సూర్య ప్రకాశరావు గ్రంథాలయాధ్యక్షులైన శ్రీ హరిహర శ్రీనివాసరావు గార్ల ఇండ్లలో విందులు చేసిరి. ఈ సమావేశమునకు విఖ్యాత కవిశేఖరులు జాషువా కవిగారును, పండిత కురుగంటి సీతారామయ్య గారును విచ్చేసి పంతులుగారి కృషి ఫలితముల గొనియాడిరి. జాషువా కవిగారు తమ కవితను వినిపించిరి. ఆంధ్ర మహా సభాధ్యక్షులైన శ్రీయుత ఎం. నరసింగరావు గారును, వర్ప శ్రీనివాసరావు గారును, జీడికంటి రామారావుగారును సభలో పాల్గొనిరి. ఆంధ్ర మహాసభ పట్టణ కమిటీ పక్షమున రు౧౧౬లు శ్రీ పంతులుగారికి సమర్పించిరి. శబ్దానుశాసన ఆంధ్ర భాషానిలయము, మటెవాడ, ఆంధ్ర మహాసభ తాలూకా సంఘము, వరంగల్లు, రాజరాజనరేంద్రాంధ్ర భాషానిలయము, హనుమకొండ పక్షమున సన్మాన పత్రములు సమర్పింపబడెను. (౧౩-౫-౧౩౪౫)

## ఓరుగల్లు కోటలో

ది. 2-3-46 సాయంత్రం గం 6 కు ఓరుగల్లు కోట [illegible] ఆంధ్ర గ్రంథాలయమున, శ్రీయుత మగ్గిశెట్టి వెంకటయ్య గారి అధ్యక్షతపైన ఉత్సవము అత్యంత వైభవముతో ఉత్సాహపూరితముగ జరుపబడెను. సాహితులు పెద్దలు, కార్యకర్తలు, గ్రంథాలయ సభ్యులు, దాదాపు 800 మందివరకు సమావేశములో పాల్గొ

నిరి. వెంకటరామయ్య, బేతి నర్సయ్య, బ్రహ్మానందము గారలు మా టాడు చు మనకు దారి చూపించిన మహాపురుషుడు, ప్రస్తుతం వెనక వుండి హైదరాబాదుకు ఒక గాంధిలాగు చల్లని చాయల నిచ్చు చుండు హన్మంతరావు గారికి రుణపడి యున్నామనిరి. సమావేశాధ్యక్షులైన. శ్రీ. వెంకటయ్య గారు 200 వత్సరముల చరిత్ర, ముఖ్యముగా హైదరాబాదు రాజ్యచరిత్ర సభికులకు తెలియ పరచిన మీదట కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత ఆంధ్రులు పడిన కష్టములను వివరించిరి.

బ్రిటిష్ ఆంధ్రులు ఆంధ్రమహాసభ ద్వారా ప్రజలలో చైతన్యము, విద్యావ్యాప్తి పెంపొందించు చుండ, నైజాం లోని 80 లక్షల ఆంధ్రులు నాయకుడు లేక సంస్థ లేక, నికృష్టముగా జీవించుచుండిరి. ఘోరాతిఘోరమగు ఈ పరిస్థితిని చూచి భరించలేక శ్రీయుత మాడపాటి హనుమంతరావుగారు 1923, సంవత్సరమున ఆంధ్ర మహాసభను స్థాపించిరి. కార్య కర్తలు లేకున్నను పనియంతయు స్వయముగ నిర్వహించి, కార్యక్రమమంతయు సంస్థయే చేసినదని ప్రకటించుచూ వచ్చిరి.

గ్రామాలకు వెళ్ళి గ్రంథాలయములు స్థాపించి, పాఠశాలలు స్థాపించి, పారిశుధ్యమును గూర్చి ప్రచారము చేసి ఆంధ్ర మహాసభకు వన్నె తెచ్చిరి. గవర్నమెంటు వారు ఇది రాజకీయ సంస్థయని భయపడిన సందర్భమున, హనుమంతరావు గారు భయపడ 'నవసరములే'దని హామీ నిచ్చిరి. ఇలాంటివి యెన్నో కలవు.

ప్రభుత్వము తన అధికార బలమును ప్రయోగించి అభివృద్ధిని నిరోధించుచునే యుండినది కానియీ చైతన్యమునకు బ్రహ్మాండమైన ఉద్యమమునకు హనుమాన్ టేకిడి నుండి బయలుదేరే శాంతి తరంగములే కారణము.

ఇట్లు నేటి ఉద్యమ పరిస్థితులు వివరించుచు చాల దూరము ముచ్చటించిరి. ఆంధ్రోద్యమమున పనిచేయు యువకులకు పితామహుని యాశీస్సులు ఎంతో అవసరమని తెలిపిరి. (౨౯-౧-౧౯)

## ఖమ్మం

ఖమ్మంమెట్టులో సాయంత్రము 6 గంటలకు శ్రీ మాడపాటి హనుమంతరావు గారి షష్టిపూర్తి ఉత్సవము ఏలిసెట్టి గోపయ్యగారి ఆవరణలో శ్రీ. సుందుముల నరసింగరావు గారి అధ్యక్షత క్రింద జరిగెను. సమావేశమునకు పురుషులు స్త్రీలు బహుళముగా వచ్చిరి శ్రీ నరసింగరావు గారిని ఆంధ్రపితామహుని యావపటసహితముగా ఒక మోటారు కారులో స్టేషను నుండి ఆంధ్రమహాసభ కార్యాలయము

నకు బ్యాండు వాద్యముల ఊరేగింపుతో తీసికొని వెళ్ళిరి. శ్రీయుతులు కోదాటి నారాయణరావు, యం. ఎస్. రాజలింగం పర్సా శ్రీనివాసరావు, డాక్టరు ఉపేంద్ర రావు, కొలిపాక వెంకట కిషన్‌రావు యాల్లాప్రగడ కృష్ణమూర్తి, ఊట్కూరు వెంకట రామారావు, బావా వెంకట కోటయ్యగారు పంతులుగారి గుణగము లను గురించేగాక ఆంధ్రమహాసభ రాజ కీయ దృక్పథమును, దానిభావికర్తవ్యము మొదలగు విషయములను గూర్చి ఉపన్య సించిరి. (౧౦-౫-౧౩౫౫ ఫ)

## మానుకోట

పర్సారంగారావు హైకోర్టువకీలుగారి అధ్యక్షతన గ్రంథాలయ ఆవరణలో ఆంధ్ర పితామహుని షష్టి పూర్త్యుత్సవ బహిరంగసమావేశము జయప్రదముగా జరుపబడెను. ఇక్కడ కూడ ఆంధ్రమహా సభాధ్యక్షులు, జిల్లా సంఘ ప్రథమకార్య దర్శిగారు పాల్గొనిరి. (౧౨-౫-౧౩౫౫ ఫ)

## మధిర

ఈ గ్రామమున మిర్యాల నారాయణ గుప్తగారి అధ్యక్షతన ఆంధ్రపితామహుని షష్టి పూర్త్యుత్సవ బహిరంగ సమావే శము జరుప బడెను. దూరశ్రవణ యంత్రము లమర్చబడి, పెద్ద వేదిక విశాల మగు ప్రదేశమందు అతిరమ్యముగా అమ ర్చబడెను. ఈ సమావేశమునకు ఆంధ్ర మహా సభాధ్యక్షులైన మందుల నరసింగ రావుగారును, ఈ జిల్లా సంఘాధ్యక్షులైన పర్సా శ్రీనివాసరావు గారును, ప్రధాన కార్యదర్శి జీడికంటి రామారావుగారును విచ్చేసి కార్య క్రమములో పాల్గొనిరి. పితామహుని స్వస్థలమైన మధిర పట్టణ మునకు ఇట్టి భాగ్య మబ్బినందుకు సభ వారు సంతోషములను వెలి బుచ్చిరి. (౧౧-౫-౧౩౫౫ ఫ)

## కామాపల్లి [మానుకోటతాలూకా]

బుధవారము సాయంత్రము ౬ గంట లకు స్థానిక పాండురంగ గ్రంథాలయ ములో శ్రీ. ఎం. ఎన్. రామయ్యగారి అధ్యక్షత క్రింద షష్టి పూర్త్యుత్సవ సమా వేశము జరిగెను. సుమారు ౨౦౦ మంది పుర ప్రముఖులు పాల్గొనిరి. శ్రీ ఉమ్మె త్తల గోపాలరావుగారు శ్రీ. హనుమంత రావుగారి జీవిత చరితమును గూర్చి ఉపన్యసించిరి. (౫-౫-౧౩౫౫ ఫ)

## ఇల్లెందు

శ్రీమాడపాటి హనుమంతరావుపంతులుగారి షష్టిపూర్తి ఉత్సవ బహిరంగ సభ స్థానిక గ్రంథాలయములో శ్రీ టి హయగ్రీవాచార్యులవారి అధ్యక్షతలో జరుపబడెను. సభకు సుమారు ౫౦౦ మంది విచ్చేసిరి, ఆంధ్రమహాసభనుగురించియు పంతులుగారి కృషిని గురించియు బాధ్యతాయుత ప్రభుత్వమును గురించియు కూలంకషముగా కార్యకర్తలు ఉపన్యసించిరి. ఈ సభకు శ్రీ జములాపురం కేశవరావు, కోదాటి నారాయణరావు యల్లాప్రగడ కృష్ణమూర్తి ముదిగొండ రాజలింగంగార్లు విచ్చేసి ఉపన్యసించిరి.

(౧౩-౫-౧౩౫౫ ఫ)

## తల్లాడ

ఇచ్చట పితామహుని షష్టిపూర్త్యుత్సవము శ్రీ అనంత పద్మనాభ శాస్త్రి (మధిర) గారి అధ్యక్షతన జరిగినది. పితామహుని జీవిత విశేషములను అధ్యక్షుల వారు చక్కగా విపులీకరించిరి. వి. అనంతరామయ్య శాస్త్రిగారు ఉపన్యసించిరి.

(౭-౫-౧౩౫౫ ఫ)

## ఎట్టుపాలెం

ఎట్టుపాలెం గ్రామములో శ్రీమాడపాటి రామచంద్రరావుగారి అధ్యక్షతలో హనుమంతరాయ షష్టిపూర్తి ఉత్సవము దిగ్విజయముగా జరిపినారు.

(౬-౫-౧౩౫౫ ఫ)

## బుద్ధవరం తా॥ ఖమ్మం

శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారి షష్టిపూర్త్యుత్సవ బహిరంగ సభ జాతీయాంధ్ర మహాసభ వరంగల్ జిల్లా సంఘపక్షమున, ఆంధ్రజాతీయపక్ష పర్యవేక్షణలో శ్రీకొరుపోలు శీతారాం రావుగారి అధ్యక్షతన జరుపబడినది. స్త్రీ పురుషులు సుమారైదారు వందల జనం సమావేశంలో పాల్గొన్నారు.

సభ, వందేమాతరం, ఝండా వందనములతో ప్రారంభింపబడింది. సమావేశకర్తయగు శ్రీ కొండపల్లి వెంకటరామ నరిసింహారావుగారు స్వాగతోపన్యాసం చేసిన తదుపరి, అధ్యక్షులవారు, తమ యుపన్యాసంలో శ్రీపంతులుగారి కృషిఫలితంగా గ్రంథాలయోద్యమ రూపంలో బయలుదేరినసంస్థ క్రమక్రమంగా, ఆంధ్ర

మహాసభగా వర్ధిల్లి ప్రజల్లో సాంఘిక ఆర్థికరాజకీయ చైతన్యం కలిగిస్తూ ప్రజలను స్వాతంత్ర్యోన్ముఖులను గావిస్తున్నదనీ, యింతేగాక, ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై అఖిలభారత కాంగ్రెసు, ఆదర్శవిధానాల ననుసరిస్తూ బాధ్యతాయుత ప్రభుత్వంధ్యేయంగాకృషిచేస్తున్నదనీ తెలుపుచూ యువకులంతా యుద్యమంలోపాల్గొని కృతకృత్యులు కావాలనీ కోరారు.

తదుపరి, ఆంధ్రజాతీయ పత్రికేంద్ర సమితి కార్యదర్శులు శ్రీ కోదాటి నారాయణరావుగారు పంతులుగారి జీవిత చరిత్రను, ఆంధ్రమహాసభసృష్టి, ఆనాటి ప్రజల చైతన్యం, మహాసభకృషి, తత్ఫలితంగా హైదరాబాదు ప్రజల్లో నేడుగలిగిన చైతన్యం, స్త్రీ జనోద్ధరణకై పంతులుగారు చేస్తున్న నిరంతర కృషిని తెల్పుచూ, గాంధీజీ చెప్పినప్రకారం శ్రీ వారుకూడ 125 సంవత్సరములసంపూర్ణాయుర్దాయముగలిగి ఆంధ్రజనసేవ చేయాలనీ కోరారు.

శ్రీ యల్లాప్రగడ కృష్ణమూర్తిగారు, బాధ్యతాయుత ప్రభుత్వమును గూర్చి విపులంగా యుపన్యసించిరి.

శ్రీ బొమ్మకంటి సత్యనారాయణ రావుగారు నేటిఆహారసమస్యను గురించి మాటాడుతూ, రానున్న దేశక్షామాన్ని దుర్కొనుటకు, గాంధీజీ సూచించినఅష్ట సూత్రపత్రికను వివరిస్తూ, అది సర్వత్రా ఆచరణీయ మనిరి.

శ్రీ యం. యస్. రాజలింగంగారు నిర్మాణకార్యక్రమాన్ని గురించి వివరిస్తూ నూలువడుకుటయందు గల స్త్రీల విధిని బోధించారు. నిర్మాణకార్యక్రమంద్వారా ప్రజల్లో ఎలా చైతన్యం గలుగజేయాలో తెలిపారు. తదుపరి జాతీయాశయాలను, త్రివర్ణపతాక ప్రాముఖ్యతను వివరిస్తూ అఖిలభారత రాజకీయాల్లో, హైదరాబాదు రాజకీయాల్లో కమ్యూనిస్టులు వహిస్తున్న పాలసీని నిశితంగా విమర్శించారు.

శ్రీ చావా వెంకట కోటయ్యగారు, పంతులుగారి జీవిత ఆశయములను వివరిస్తూ, వారి కార్యదీక్షవల్ల రైతాంగంలో గలిగిన చైతన్యంగురించి యుపన్యసించిరి.

తదుపరి శ్రీ కొమరగిరి జనార్దనరావుగారు, గ్రంథాలయాల విషయమై యుపన్యసించిరి.

శ్రీ కె. బుచ్చిరామారావుగారు, మహాసభ కృషివల్ల రైతుల్లో గలిగిన రాజకీయ వికాసం గురించి తెల్పుచూ స్థానిక సమస్యలపై యుపన్యసించిరి.

సమావేశ కర్తలగు శ్రీ కొండపల్లి వెంకట్రామ నరశింహారావుగారికి మహా

సభ పక్షమున శ్రీ కోదాటి నారాయణ రావుగారు కృతజ్ఞత తెలిపిరి.

సభ గం 11-30ని॥ లకు జయప్రదంగా ముగింపబడెను. (౧౭-౫-౫౫ వ)

# నల్లగొండ

౧౨-౫-౫౫ వ సాయంత్రము ౬ గంటలకు ఆంధ్రభవనమున బహిరంగసభ నల్లగొండ జిల్లాసంఘ పక్షమున జరుప బడెను. శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారు అధ్యక్షత వహించిరి. వారు తమ తొలిపలుకులో శ్రీ పంతులవారిని గౌర వించదలచినవారు వారి ఆశయములను కార్యరూపమున బెట్టవలయు ననియు, మన రాష్ట్రమున జరుపు ఉత్సవములు వారికి ధనము, ఆస్తి లిచ్చునవి కావనియు, ప్రజలు తమను తాము గౌరవించుకొను చున్నారనియు సెలవిచ్చిరి. శ్రీ కంచన పల్లి వెంకటరామారావుగారు, శ్రీ పులి జాల రంగారావుగారు, పండిత భద్రదేవు గారు ప్రసంగించిరి.

శ్రీ వి భాస్కరరావుగారు మాట్లా డుచు ఆంధ్రమహాసభపక్షమున మేము ప్రతిచోట షష్టిపూర్తి ఉత్సవములు జరుపుచున్నా మనియు నేటికి ఆరురోజుల నుండి జనగామ, సూర్యాపేట మొదలగు స్థలములలో ఈ ఉత్సవములు జరుపబడె ననియు స్త్రీ పురుషులు అత్యుత్సాహ ముతో పాల్గొనిరనియు తెలిపిరి. శ్రీ గోపాలరెడ్డి, నారాయణరెడ్డి మొదలగు వారు స్థానిక ఆంధ్ర భవన నిర్మాణము, వైదిక బాలికా పాఠశాల మొదలగు వానిని సెలకొలిపినందులకు వారి సేవను ప్రశం సించి, వేసిన గట్టిపునాదులను వృద్ధిపరిచి వానిని సద్వినియోగపరుచు బాధ్యత విద్యావంతులగు యువక న్యాయవాదు లపై కలదనియు, వారు ముందంజ వేయ వలెననియు కోరిరి. శ్రీ పంతులవారు స్థాపించిన ఆంధ్రమహాసభ నేడు ఒక గొప్ప రాజకీయసంస్థగా మారినదనియు, దాని ప్రాముఖ్యత ఉదయపుర సంస్థాన ప్రజామండలితో సంబంధము కలుగుటచే మరింత ఎక్కువైనదనియు, ప్రపంచపరిస్థి తులకు అనుగుణ్యముగా ముందంజ వేయు చున్న సంస్థలకు తీసిపోదనియు, బాధ్యతా యుత ప్రభుత్వస్థాపనకు కృషిచేయవలసి యున్నదనియు కోరిరి.

శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు తమ ఉపన్యాసాంతమున భారత దేశమున రాబోవు మార్పులను విశదీకరించుచు, భారత రాజ్యాంగ చట్ట నిర్మాణసంఘములో మన రాష్ట్రమునుండి ప్రజాప్రతినిధులు ఎన్నుకోబడునటుల చూడవలయుననియు బాధ్యతాయుతప్రభు త్వము ప్రస్తుత పరిస్థితులలో చాల అవ సరమనియు, దేశములోని ఆహారక్లిష్ట సమస్యను ప్రజలు శాంతముతో ఎదు ర్కొనవలెననియు కోరిరి.

# సూర్యాపేట

## ౧

నిజాం రాష్ట్ర ఆంధ్రమహాసభ సూర్యాపేట తాలూకా సంఘ పక్షమున నేటి సాయంత్రం ౬ గంటలకు శ్రీ వికెర కంటి రామలింగంగారి దొడ్డిలో శ్రీ వేములపల్లి వెంకటకృష్ణయ్యగారి అధ్యక్షతన బహిరంగ సమావేశము ఆరంభమై రాత్రి ౧౦ గంటలకు అతివైభవముగా ముగిసెను. సుమారు ౧౫౦౦ మంది సభకు విచ్చేసిరి.

శ్రీ వెంకటకృష్ణయ్యగారి యింటినుండి శ్రీ హనుమంతరావుగారి పటముతో ఊరేగింపు ౫ గంటలకు బయలుదేరి, ౬ గంటలకు సభాస్థలమును ప్రజలు చేరిరి. వైదిక పాఠశాల బాలికల వందేమాతర ప్రార్థనతో సభాచర్య ఆరంభమయ్యెను. శ్రీ కంచనపల్లి వెంకటరామారావుగారును, వి. భాస్కరరావుగారును, మోత్కూరి వెంకటాద్రిగారును పితామహుని జీవిత విశేషములను గూర్చి విశదీకరించి వారి దేశసేవను కొనియాడిరి. శ్రీ వెంకటరాజు గారు పంతులుగారి జీవితమును బుర్రకథగా రచించి చదివిరి. వారి ఆయురారోగ్యమునకై ఈశ్వరుని ప్రార్థించుచు ఒక తీర్మానమును చేసిరి.

(౮-౫-౧౩౫౫ ఫ.)

## ౨

ఆంధ్ర పితామహులగు శ్రీ మాడపాటి హనుమంతరావు గారి షష్టిపూర్తి ఉత్సవము శ్రీ వైదికాంధ్ర పాఠశాల వైపు నుండి ౨౮-౨౯ ఫర్వర్ది తేదులలో అతి వైభవముగ జరుపబడెను. ఉత్సవము యొక్క ప్రథమ దివసమున పాఠశాల బాలికలచే సాంఘిక నాటికయగు "అల్లుండ్ల సంత" సాయంకాలమున ప్రదర్శింపబడెను నాటక ప్రదర్శనానంతరము శ్రీమాన్ సోమాశివయ్య గారు నటనాపాత్రత నధికముగా పోషించిన శ్రీ కప్పగంతుల సుశీలాదేవి మరియు మేనా లక్ష్మమ్మయను బాలికలకు వెండిగిన్నెలను బహుమానమొసంగిరి. ప్రదర్శనా సమయములో స్త్రీ విద్యా విషయమైన బుర్రకథలను కూడా యిద్దరు బాలికలచేత వినిపింపబడెను. పిమ్మట శ్రీ మంత్రిప్రగ్గడ రాజగోపాలరావు గారు (చేతవోలు) బాలికల ఉత్సాహమునకు మెచ్చుకొని ప్రదర్శనలో పాల్గొన్న బాలికలందరకు వెండి గిన్నెలు బహుమతిగా నొసంగిరి. నాటికారచయితలగు శ్రీమాన్ గవ్వా మురహరరెడ్డి గారిని బాలికలకు పాత్రాభినయముకూడా కొద్దిదినములలోనే నేర్పి షష్టిపూర్తి ఉత్సవ సమయమున ప్రదర్శింప చేసినందులకు శ్రీమాన్ అమరవాది వెంకటనర్సయ్యగారు సన్మానపూర్వకముగ ఒక ఖద్దరు శాలువ మరియు రజతపాత్రచే సత్క

రించిరి, తదుపరి నేటి కార్యక్రమము ముగిసెను.

౨౪-౪-౪౪ నాడు పగలు గం 4ల నుంచి చక్కగా అలంకరింపబడిన ఒక బండిపై ఆంధ్ర పితామహులగు హనుమంతరావు గారి పెద్ద పటమును ఊరేగించబడెను, ప్రబోధ గీతములచే పాఠశాల బాలికలు బారులుతీరి ఉత్సవము ముందు నడువగా వెనుక పురజనుల నేతలు సమ్మిళితముగా నడువ ఉత్సవము గ్రామము నందలి నాల్గు బజారులలో తిరిగి ఆర్యసమాజ భవనము ఎదుట ఆపబడెను. పిమ్మట సభాస్థలమునకు పురజనులందరు విచ్చేసిరి. పాఠశాలాధ్యక్షులగు శ్రీమాగ కోదాటి వెంకటేశ్వరరావు గారు నేటి సభకు అధ్యక్షత వహించిరి. బాలికల ప్రార్థనా గీతములచే కార్యక్రమము ఆరంభమయ్యెను. పాఠశాల కార్యదర్శియగు శ్రీగవ్వా అమృతరెడ్డిగారు హనుమంతరావుగారి జీవిత చరిత్రమును మరియు వారి సేవాకార్యముల విపులముగా వివరించిరి పిమ్మట శ్రీవిశ్వమిత్రగారు ఆంధ్రోద్యమము మరియుషష్టిపూర్త్యుత్సవము యొక్క మహత్వమును మనకర్తవ్యమును గుఱించి వ్యాఖ్యానము చేసిరి. పిమ్మట శ్రీ గవ్వా మురహరి రెడ్డిగారు, శ్రీ కోదాటి శ్రీనివాసరావు గారు పితామహుని సేవాకార్యముల గురించి రచించిన తమపద్యములను గేయములను చదివి వినిపించిరి, ఆపై పాఠశాలలో అధ్యాపకురాలగు శ్రీమతి లక్ష్మీదేవిగారు తమ ఉపన్యాసములో ఆంధ్ర పితామహుడు స్త్రీ విద్యకై ఏవిధముగ కృషిచేసినది వివరించిరి ఇంకను శ్రీ డాక్టరు శర్మగారు మొదలగు వారి ఉపన్యాసములు జరిగెను. బాలికలు గేయాలు, పద్యాలు కూడా వినిపింపచేసి సభాసదుల ఆనందింప జేసిరి. చివరకు అధ్యక్షులు, శ్రీ హనుమంతరావు గారి సేవలను, ఆకాలమునాటి తెలుగు వారి దుస్థితి మరియు రైతుకూలీల అవస్థలను చెప్పుచు వానిని పోగొట్టుటకై ఆంధ్ర పితామహు డేవిధముగా పాటు పడ్డ విషయముమరియు వారు స్త్రీ విద్యకై ఏవిధిగ పాటు పడుచున్నది విస్తృతముగ చెప్పిరి, ఆపై ఒక తీర్మానము పితామహుని సేవా కార్యముల ప్రశంసించుచు, వారు చిరాయురారోగ్యములు గలిగియుండుటకై ఈశ్వరుని ప్రార్థించుచు, ఆమోదింపబడెను.

తీర్మానమును సన్మానమును ఆంధ్ర పితామహునికి పంపబడెను.

తర్వాత బాలికా పాఠశాల బాలికలకు మరియు ఇతర బాలబాలికలెల్లరకు మిఠాయి పంచబడెను. ఆపై షష్టిపూర్త్యుత్సవమును సమాప్తముగావింపబడెను.

(౨౪-౪-౧౩౪౪ ఫ)

## దేవరకొండ

సాయంత్రము ౬ గంటలనుండి ౯ గంటలవరకు శ్రీ యం. కొండలరావు గారి అధ్యక్షతక్రింద బహిరంగసభ జరుపబడెను. శ్రీ యం. నారాయణ రెడ్డిగారు పంతులుగారి గుణగణములను వారు దేశమునకు చేసిన సేవను, ప్రోత్సహించి నెలకొలిపిన ఉద్యమములను పేర్కొనిరి. ఆంధ్ర మహాసభవారు రైతులకు తదితరవర్గములకు చేసినకృషిని చెప్పిరి. పంతులుగారిపై ఈరాష్ట్రపు ఆంధ్రులకు గల ప్రేమ విశ్వాసముల వెల్లడించుచు తీర్మానమును స్థాయిసంఘ కార్యదర్శి శ్రీ భాస్కరరావుగారు ప్రవేశపెట్టగా ఏకగ్రీవముగా నామోదింపబడెను. స్థాయిసంఘ వైజ్ఞానికదళము వారు పల్నాటివీరచరిత్రము బుర్రకథగా చెప్పిరి. (౧౧-౫-౧౩౫౫ ఫ)

## ఘనపురం

సాయంత్రం 7 గంటలకు స్థానిక శ్రీ సీతారామగ్రంథాలయసంఘయాజమాన్యమున ఆంధ్ర పితామహుని షష్టిపూర్త్యుత్సవ సమావేశము జరిగెను. శ్రీ పెం. రామానుజరావుగారు వారి జీవితములోని దేశసేవ నిజాంరాష్ట్ర ఆంధ్రోద్యమ సంక్షిప్త చరిత్రము వివరించిరి. తదుపరి సభికులకు "ఆంధ్రప్రభ" పత్రికలోని శ్రీ మల్లెలరామమూర్తిగారు వ్రాసినపంతులుగారి జీవితము చదివి వినిపింపబడెను. ఈ సందర్భములో కొందరు అభిమానులు "హనుమంతరాయ నిధికి" రు ౫౨ లు సమర్పించిరి. (౧౧-౫-౧౩౫౫ ఫ)

## మిరియాలగూడెం

సాయంత్రము ౫ గం॥ లకు గ్రంథాలయము నుండి శ్రీ మాడపాటి హనుమంతరావుగారి పటమును తీసికొని బాలబాలికల ప్రార్థనలతో జయజయ ధ్వనులతో ఊరేగింపు నలువీధుల తిరిగి శ్రీ నాగబండి వెంకట రామయ్యగారి ఆవరణములో శ్రీ నరసింహారెడ్డిగారి అధ్యక్షతక్రింద సభ జరిగెను. సుమారు ౨౦౦౦ మంది సభకు వచ్చిరి, అధ్యక్షులు శ్రీ హనుమంతరావుగారి జీవిత విశేషములు వారికి ప్రజాహిత సంస్థలతో గల సంబంధము ముఖ్యముగా ఆంధ్ర మహాసభ ఆరంభమునాటి అభివృద్ధి గురించి చెప్పుచు వారి త్యాగమును సూచించిరి, కంచనపల్లి వెంకట రామారావుగారు మాట్లాడుచు షష్టిపూర్తి సమావేశ ప్రాముఖ్యతను తెలుపుచూ శ్రీపంతులుగారికి నల్లగొండజిల్లాలో అన్ని తాలూకాలలో శ్రీవారి షష్టిపూర్తి ఉత్సవములు జరుపుచున్నామని యీ హైదరాబాదు రాష్ట్రములో నేటికివచ్చిన చైతన్యమునకు మూలపురుషులు వారేననియూ బాధ్యతాయుత ప్రభుత్వ స్థాప

నను వారి కృషిని కొనియాడిరి. శ్రీ పంతులవారు వ్రాసిన పుస్తకములు, నెలకొల్పిన సంస్థలు మొదలగు విషయముల విశదీకరించిరి. శ్రీ పంతులుగారిపై వారికి గల భక్తి శ్రద్ధలను వెల్లడించుచు తీర్మానమును ఏకగ్రీవముగా నామోదించిరి శ్రీ ఆదినారాయణ గుప్తగారి గంభీరోపన్యాసము తరువాత సభ ముగిసెను. తరువాత ఆంధ్ర మహాసభ వైజ్ఞానికదళమువారిచే బుర్రకథ చెప్పబడెను. మిర్యాల గూడెం తాలూకా సంఘ కార్యదర్శులగు శ్రీ పాశెం రామిరెడ్డి వకీలుగారు ఇత్తడిడక్కీలను కొనుటకు రు ౧౫౦ లుబహూకరించిరి.

(౧౦-౫-౧౩౫౫ ఫ)

## హుజూరునగరం

సాయంత్రం ౬ గంటలనుండి ౧౦ గంటలవరకు శ్రీ బోయనపల్లి వెంకటరామారావుగారి అధ్యక్షతక్రింద శ్రీవారి ఆవరణమున, హుజూరు నగర తాలూకాసంఘ పక్షమున షష్టిపూర్తి ఉత్సవము జరుపబడెను. శ్రీ పంతులవారి జీవిత విశేషములను, ఆంధ్రమహాసభ మొదలగు సంస్థల నిర్మాణమును గురించి శ్రీ బోయనపల్లి వెంకట నరసింహారావుగారు విపులముగా నుపన్యసించిరి. శ్రీయుతులు ఎం. వెంకటేశ్వరరావు, వెదిరె రాజారెడ్డిగారు వారి గుణగణముల వివరించిరి. స్థాయి సంఘ కార్యదర్శి, శ్రీ వేములపల్లి భాస్కరరావుగారు ఆంధ్రమహాసభవారి ఆధ్వర్యమున క్రమేణఅభివృద్ధిగాంచి నేడు బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపనకు చేయుచున్నకృషిని విశదీకరించిరి. అధ్యక్షుల వారి ఉపసంహార వాక్యములతో సభ ముగిసెను,

(౯-౫-౧౩౫౫ఫ)

## జనగాం

జనగాముతాలూకా ముఖ్యస్థానమున శ్రీ యం. నారాయణరెడ్డిగారిఅధ్యక్షతన బహిరంగ సభ జరుపబడెను. శ్రీ పంతుల వారి రూపపటముతో ఊరేగింపుగావింప బడెను. బహిరంగసభలో సుమారు ౫౦౦ మంది పాల్గొనిరి. శ్రీ బోయనపల్లి వెంకట నరసింహారావుగారు స్వాగతోపన్యాసము గావించిరి. ఆంధ్ర మహా సభాధ్యక్షులు మందుముల నరసింగరావుగారు జిల్లా సంఘకార్యదర్శి కె. వెంకటరాంరావుగారు, శ్రీపంతులవారి జీవిత విశేషముల గురించి విపులముగా ఉపన్యసించిరి సభానంతరము బుర్రకథ దళమువారు శ్రీ భాస్కరరావుగారి పర్యవేక్షణలోవచ్చిరి. పది గంటలనుండి బుర్రకథ జరుపబడెను. ఆంధ్రోద్యమ ప్రచారము గావింపబడెను. సభ జయప్రదముగా ముగిసెను.

(౭-౫-౧౩౫౫ ఫ)

## సంగారెడ్డి

శ్రీ కనారాజయ్య ఆవరణలో శ్రీ కటకం లింగయ్య గుప్తగారి అధ్యక్షతన సాయంత్రము 6 గంటలనుండి షష్టిపూర్తి ఉత్సవము జరుపబడెను. శ్రీ పంతులుగారి రూపపటము పుష్పమాలలతో నలంకరింపబడి వేదికపై నుంచబడెను. పురవాసులనేకులుఉత్సవ సమావేశములలో పాల్గొనిరి. గుండ్లపల్లి వెంకయ్యగారు ఎం, దేవీ ప్రసాద్ యాదవగారు, పరుశురాం సింగుగారు, మొదలగు ప్రముఖులు శ్రీ పంతులుగారు, నిజాంరాష్ట్ర వాసులకు చేసినసేవ ఆంధ్రోద్యమము, గ్రంథాలయోద్యమము కేంద్ర సంఘములు, సంఘములు, వృత్తిసంఘములకు ప్రాథమిక హక్కులు ఆంధ్ర భాష ఇత్యాదులకు వీరొనర్చిన అఖండత్యాగమును కొనియాడిరి. ఆంధ్ర పితామహునకు ఆయు రారోగ్యములు పెంపొందుటకై ప్రార్థనలు గావించిరి. (౧౮-౫-౧౩౫౫ ఫ)

## సదాశివపేట

నేటిసాయంత్రము౬ గంటలనుండి ప్రథమ ఆంధ్ర మహాసభ జరిగిన మెదకు మండలమున గల సదాశివపేటలో సుమారు ఆరు ఏడువందల ప్రజా సమూహముతో సమావేశమై శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారి అధ్యక్షతలో నిద్రాణమైన తెలుగు జాతిని మేలుకొలిపిన ఆంధ్రపితామహుని షష్టిపూర్తి ఉత్సవము జరుపబడెను. శ్రీ వెంకటేశ్వరగుప్త వకీలుగారు శ్రీ చన్నబసప్ప వకీలుగారు, శ్రీ శంకరరావు మొదలగు దేశభక్తులు శ్రీ వారి జీవితమును గురించి విపులముగా ఉపన్యసించిరి. (౧౩-౫-౫౫ ఫ)

## జోగిపేట

శ్రీ మాడపాటి హనుమంతరావుగారి షష్టిపూర్తి ఉత్సవము శ్రీయుత శ్రీపతి రావు వకీలుగారి అధ్యక్షతలో జరిగెను. సమావేశము శ్రీ విఠలేశ్వర దేవాలయ ప్రాంగణములో విశాలమైన పచ్చని తోరణముల పెండాలులోజరిగెను. చుట్టు పట్ల అయిదారుమైళ్ళదూర గ్రామముల నుంచి ప్రజలు వందలకొలది వచ్చిరి. శ్రీవారి జీవితమును గురించి ఉపన్యాసములు జరిగెను. (౧౦-౫-౧౩౫౫ ఫ)

## మహబూబునగరం

శ్రీ పండిత యం. నారాయణరావు ఉతక్రింద షష్టిపూర్త్యుత్సవ బహిరంగ హిందూప్రజామండలి అధ్యక్షుల అధ్య సభ జరిగెను. (౧౨-౫-౫౫ ఫ)

## మఖల్

శ్రీ గిర్మను నాగప్పగారి అధ్యక్షతక్రింద షష్టిపూర్త్యుత్సవము జరిగెను.

(౧౩-౯-౯౯౬)

## నాగరకర్నూలు

ఈరోజున షష్టిపూర్త్యుత్సవము మహావైభవముగా సానికప్రముఖులచే జరుపబడెను.

(౭-౯-౧౩౯౯౬)

## గూడూరు

బుధవారము మాడపాటి హనుమంత రావు పంతులుగారి షష్టిపూర్తి ఉత్సవ బహిరంగసభ శ్రీయుత కొర్రపాటి వెంకట సుబ్బారావుగారి అధ్యక్షతను జరిగినది. బహిరంగ సభలో వేయిమంది ప్రజలు పాల్గొనిరి. సభానంతరము కాంగ్రెసు బుర్రకథ, ఆంధ్రమహాసభ బుర్రకథ, చాలఉత్సాహ. ఉద్రేకపూరితముగా కొర్రపాటి వెంకట సుబ్బారావు గారిచే చెప్పబడెను అవతలి వీధిలో భాగవతము జరుగుచున్నను. ప్రజలు ఉత్సాహముతో బుర్రకథలోనే పాల్గొనిరి.

(౨-౬-౧౩౯౯ ౬)

## బెజవాడ

ది 6-2-1946 బుధవారము సాయంత్రం దివ్యజ్ఞానసమాజ భవనమున షష్టిపూర్తిసభ నగర గ్రంథాలయ సంఘ యాజమాన్యమున జరిగినది. శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారు అధ్యక్షత వహించిరి. కార్యదర్శి శ్రీ మల్లెల శ్రీ రామమూర్తిగారు శ్రీ హనుమంతరావు గారి జీవితచరిత్రమును గూర్చి ఉపన్యసించిరి.

ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసంఘము, నగర గ్రంథాలయ సంఘము, కృష్ణాజిల్లా గ్రంథాలయ సంఘముల పక్షమున సన్మాన పత్రమును, శ్రీ శ్రీ రామమూర్తిగారు చదివిరి దానిని శ్రీ హనుమంతరావుగారికి పంపుటకు తీర్మానించబడెను.



# అనుబంధము ౨

## తీర్మానములు

౧

### హైద్రాబాదు నిజాంరాష్ట్ర ముదిరాజ కాన్ఫరెన్సు కార్యవర్గమువారి తీర్మానము

"ఆంధ్రపితామహ" శ్రీయుత, మాడపాటి హనుమంతరావుపంతులుగారి, షష్టిపూర్తి ఉత్సవ సందర్భమున హైద్రాబాదు నిజామురాష్ట్ర ముదిరాజ కాన్ఫరెన్సు, వారిని అభినందించుచున్నది. మరియు, దేశమునకై, వారి సేవ లసంఖ్యాకములు. వాటి వివరముల నీ చిన్నతీర్మానమున చేర్కొనుట శక్తికిమించిన పనియని విస్పష్టపరచుచున్నది.

జాతి, దేశీయుల కొరకు, పవిత్రసేవ లొనరించిన మానవుల చరితలు, నిశ్చయముగ, సర్వకాలముల తేజరిల్లును. అట్టి మహాపురుషుల, జీవితములే, క్రొత్త మొలకలను, మన జీవితములకు, దోహద మొసంగగలవని, ముదిరాజ మహాసభ అభిప్రాయము.

హైద్రాబాదులోని గత ౨౫ సంవత్సరముల క్రిందటి పరిస్థితులను నేటి సందర్భములతో పోల్చి చూచిన, చాల వ్యత్యాసము కానవచ్చును. ౨౫ సంవత్సరములకు పూర్వము హైద్రాబాదులో రాచకీయమగు జాగృతి శూన్యమని నుడివిన విరుద్ధముకాదు. ఈ "యజ్ఞాతవాస" కాలములో శ్రీయుత హనుమంతరావుగారు తమ ఉద్యోగమును పరిత్యజించి, నిజామురాష్ట్రములోని, నవయువకమండలి, హృదయముల రాజకీయోత్సాహమును పురిగొల్పి, వారిలో జాగ్రదవస్థ రగుల్కొలుపుట నెక్కుడు ప్రశంసాపాత్రమగు విషయము. దేశము వారి యీ మేలును, ఎప్పుడును మరువజాలదని చెప్పుటలో సందేహములేదు. ఆకాలపు పరిస్థితులు, సందర్భముల ననుసరించి, శ్రీవారు తమ దేశాభ్యుదయ కార్యక్రమము, పుస్తకాలయస్థాపనలతో ప్రారంభించిరి. మొట్టమొదట తెలంగానాలో నీ పుస్తకాలయోద్యమములో విజయమును సాధించిరి. తరువాత సాంఘికోద్ధరణాకార్యములలో పాల్గొనిరి. ఈ సందర్భములో, సూర్యాపేట వర్తకసంఘనిర్మాణ విషయమున, వారి అత్యుత్తమ కృషి వలన గలిగిన, ఆ ఖండవిజయమే వారి ధైర్య సాహసములకు సాక్షీభూతమైయున్నది. శ్రీవారు నవయువకుల ఆశయముల మహోన్నతములుగను, ఆదర్శప్రాయములు

గను వికసించునటుల పెంపొందచేయుట, ఆ యువకమండలియే నేటి క్లిష్టరాజకీయ సమస్యలతో, నిరాఘాటముగా, ముందంజ వేయుటవల్ల స్పష్టపడుచున్నది.

తదుపరి శ్రీ రావుగారు ఆంధ్రోద్యమమును నడపిరి. నేడు వివిధసంస్థలలో అత్యుత్తమసేవలలో నిమగ్నులైన స్వార్థరహితులందరు పై ఆంధ్రోద్యమపు వృక్షమున విరియబండిన ఫలములే! పండిత హనుమంతరావుపంతులుగారు కేవలము ఆంధ్రోద్యమముననే నడపించుచుండిరని ఎంచుట సత్యదూరము. వారియొక్క పరిశ్రమ మన రాష్ట్రములోని అఖిలజాతుల పురోభివృద్ధికిని ప్రాకినదని ముదిరాజ మహాసభ నిర్భయముగా జాటుచున్నది. శ్రీవారు పాల్గొననిది, వారి యీ శీర్వాదమును బొందనిది ఏసంస్థయు హైదాబాదులో లేనేలేదు. హైదాబాదు విద్యాపరిషత్తు, సోషియల్ సర్వీసు, కాన్ఫరెన్సు, హిందూధర్మపరిషత్తు, హిందీప్రచారసభ మొదలగువాటి నిర్మాణము, ఉద్దేశ ప్రచారములలో శ్రీవారి చేయూతగల సందర్భములు ఎవరును కాదనలేరు. "ఖలాఫతు" అలజడి రోజులలో, వారొనరించిన సేవ, దక్కను చరిత్రలో ఎప్పటికిని మరపురానిది. శ్రీవారి సేవాదీక్ష, జాతి మత వివక్షతాప్రాకారములచే బంధింపబడక అఖిలలజాంరాష్ట్రాభ్యుదయమునకే సాయపడగలదని ముదిరాజ మహాసభ నమ్మకము. రాష్ట్రములోని ముదిరాజ సంఘోద్ధరణ కార్యక్రమములో శ్రీవారు జూపిన ఆసక్తి, సూచించిన నిర్మాణవిధానము, దానిని అమలుపరచుటలో వారు గావించిన తోడ్పాటునకు ఈ కాన్ఫరెన్సు శ్రీవారికి తమ కృతజ్ఞత దెల్పుచున్నది.

భావిచరిత్రకారుడు తన చరిత్రలో శ్రీవారి సేవాపరంపరలు సువర్ణాక్షరములతో చిత్రించగలడు. తుదలో దేశోద్ధారకునికి దీర్ఘాయురారోగ్యము లొసంగి, యింతకంటె అధికతరసేవ లొనర్చుటకు వారికి తగు బలమును, తేజస్సును జేకూర్చుగాక యని ముదిరాజమహాసభ భగవంతుని ప్రార్థించుచున్నది.

౨

నిజాంరాష్ట్రాంధ్ర మహాసభ దేవరకొండతాలూకా సంఘమువారి తీర్మానము

నిజాంరాష్ట్రాంధ్రోద్యమ స్థాపనాచార్యులు, ప్రజాహితకార్యనిమగ్నదీక్షావ్రతులు నిరాడంబరజీవులు, సర్వవిధాల ఆదర్శపాత్రులు, ఆంధ్రపితామహులగు శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులవారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున ఈ సభవారు తమ హృదయపూర్వక సంతోషమును ప్రకటించుచు, శ్రీవారిపట్ల తమ యచంచల

భక్తివిశ్వాసముల వెల్లడించుచున్నారు. భగవానుడు వారికి ఆయురారోగ్యము లొసంగుగాక! శ్రీ పంతులవారి మార్గదర్శికత్వమున నిజాంరాష్ట్రాంధ్రులు సర్వతో ముఖాభివృద్ధిగాంచుచు వారి ఏకైకలక్ష్యమైన బాధ్యతాయుత ప్రభుత్వస్థాపన ప్రాప్తు లగుదురుగాక!

3

ఆంధ్రపితామహులు, నిజాంరాష్ట్ర ఆంధ్రోద్యమ స్థాపకులు అయిన శ్రీయుత మాడపాటి హనుమంతరావు పంతులుగారి షష్టిపూర్తి సందర్భమున హృదయపూర్వకముగా అభినందించుచూ ఇంకనూ దేశసేవ చేయుటకునూ, తద్వారా ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై యితోధికమార్గదర్శకత్వమును వహించుటకును, దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించుటకును భగవంతుని ప్రార్థించుచున్నాము.

ఆంధ్రమహాసభ తాలూకా సంఘము<br>
మధిర వర్తకసంఘము<br>
సరస్వతీ గ్రంథాలయము



# అనుబంధము 3

## ఆంధ్ర పితామహ

# శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారికి

## షష్టిపూర్త్యుత్సవ సందర్భమున సమర్పించిన

# సన్మానపత్రములు

**మహోదయా !** కాకతీయ చక్రవర్తుల అవక్రమమైన పరాక్రమముతోను అమోఘమయిన ఆజ్ఞా శక్తితోను శత్రునిరాకరణ ధర్మపాలనా పూర్వకముగా ప్రజాసేవ గావించి మించిన శతాబ్దములలో మింటబెట్టిన దీపమువలె మెరసిపోయిన యీ రాష్ట్రము నేటి కైదారు శతాబ్దములనుండి ఆంధ్రసభ్యతను "మఱ్ఱపెట్టి" మరచి అంధకార బంధురమై యున్నను ఆ "పార్థివ" తేజస్సు మరల మీస్వరూపముతో నవతరించి ప్రశాంత ప్రగల్భమైన ప్రజ్ఞాశక్తిచే నిద్రాణ మయియున్న ప్రజానీకమునకు ప్రాణప్రబోధముల నొసగి బ్రతుకుదెరువు చూపినది. ఈనాడు మీ కృషి ఫలితముగా మన "తెలుగునాడు" మరల వెలుగునాడైనది. మీరు వెలిగించిన ఆంధ్ర జ్యోతి అమరజ్యోతియైనది. ఇట్టిమీకు భగవంతుడు చిరాయురున్నతిని ప్రసాదించుగాక!

**నేతృ గుణాబ్ధీ !** కాపులేని మందవలె బెదరి బెదరియున్న ఆంధ్ర సమాజమును కూడగట్టి ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములచే ప్రతికూల పరిస్థితులను తొలగించి క్రమశిక్షణా దక్షమయిన మార్గమున నడపించుచు నాయక శిరోమణులై త్యాగశీలత్వము ప్రియవక్తృత్వము ధీరత్వము ఉచితజ్ఞతవంటి సహజగుణములను నిరాడంబరత సులభగమ్యతవంటి బాహ్యగుణములను ప్రదర్శించి ప్రజాసేవకులకు మహోన్నతములైన ఆదర్శములను ప్రసాదించినారు. ఆంధ్రుల సంస్కృతి సభ్యతలు మరల వేళ్ళుపారి ఆకువేసి పుష్పించినవి. ఆంధ్రాభిమాన పరిమళములు అష్టదిశలయందు వ్యాపించి ఆనంద వర్ధకములైనవి.

**ఆంధ్రోద్యమ విధాతా !** ఈప్రసుప్తాంధ్రమును ప్రబుద్ధాంధ్రముగా చేయుటకు మీరునిర్మించిన యుద్యమమే ఆంధ్రోద్యమముగా రూపొందినది. ఆంధ్రుల సర్వతోముఖాభ్యుదయమే ఆంధ్రోద్యమమునకు పూర్ణస్వరూపము. మొదటి గ్రంథాలయోద్యమమును చేపట్టి రాష్ట్రము నందంతటను గ్రంథాలయములను పఠనాలయములను విరివిగా నెలకొల్పి ఆంధ్రోద్యమును భాషోద్యమముగాతీర్చి తెలంగాణపు చరిత్రలో నూతనాధ్యాయమును కలిగించినారు. మీయుద్యమ ప్రచారమునకు శ్రోతృవర్గమును సిద్ధపరచుకొని క్రమక్రమముగా ఆంధ్రుల సాంఘిక సమస్యలను పైకితెచ్చి వాటికిపరిష్కరణ మార్గముచూపుచు సంఘసంస్కారమునకు పునాదులువైచి దానిని సాంఘికోద్యమముగా ప్రవర్తింపజేసి ప్రజాహృదయములను చూరగొని ఉద్యమము నుమరింత పుష్టివంతము గావించినారు. నిజాముప్రభుత్వముతో ప్రజలప్రాథమిక స్వత్వముల కొరకై ప్రశాంత దీక్షతోపోరాడ సంకల్పించి ఆంధ్రమహాసభను స్థాపించి నిరంతరముగా విజయవంతముగా కృషిగావించి, ఆంధ్రోద్యమమునకు రాజకీయత్వరంజన మొసగి రాష్ట్రీయాంధ్రుల కెంతయు మన్ననిని సమకూర్చిపెట్టినారు. అవకాశము గల్పించుకొని స్త్రీవిద్యా

ప్రచారమునకు సంఘమున సగపాలైన సోదరీమణులలో చైతన్యముపోసి వారిద్వారా కృషిని నిర్వహింప జేయుచు ఆంధ్రోద్యమమును మహిళోద్యమముతో జతపరచి సర్వాంగసుంద రము గావించినారు. విజ్ఞానరాష్ట్రి ఆంధ్ర సారస్వతపరిషత్తులో ముఖ్యభూమికను దరించి దానిని రాజకీయములతో నెట్టిసంబంధము లేకుండదూరముగ నుంచి ప్రజాసభ్యతను పోషిం చు నుద్దేశ్యముతో దానికి స్థయిర్యమొసగి ఆంధ్రోద్యమమును వైజ్ఞానికోద్యమముగా దీర్చి ఆంధ్ర జాతీయతకు సర్వాంగపుష్టిని చేకూర్చినారు. ఇట్టి ఆంధ్రోద్యమ పితామహులైన మీరు చిరాయురా రోగ్యములతో వర్ధిల్లి ఇంకను మాకుమార్గదర్శకు లయ్యెదరుగాక.

కార్యకుశలా ! చేపట్టిన కార్యమును నిర్వహించుటలో మీరువైచిన మార్గములు ఎల్లరకును అనుకరణీయములు. అభ్యుదయోపాయములు. ఆంధ్రోద్యమమునకు ఎల్లప్పటికిని ఏకనాయక ముగా చేయక వెనుక నుండి ఉద్యమమునకు సూత్రధారులై ప్రతిభాసామర్థ్యములుగల కార్య కర్తలను ఏరి పైకిదెచ్చి వారిద్వారా నాయకత్వము నిర్వహింపజేసి ఇప్పటి కెందరినో ప్రజా సేవకులను సృష్టిచేయుట యందలి మీనిర్మాణశక్తి ప్రపంచమునకు ఆదర్శప్రాయము కాగలదు. మీరుప్రత్యక్షముగాను పరోక్షముగాను ఆంధ్రసంఘ మందలి యెల్ల కుల సంఘములకును తోడుపడి మీయుత్సాహశీలము వారికి పంచియిచ్చి ఆయాసంఘములు చైతన్యవంతములై అభి వృద్ధి నందగాచూచి ఆనంద వైశాల్యమును పొందగలవారు మనరాష్ట్రమున మీరొకరేయనిన సాహసము కాగూడదు. మీతో ఏదోఒక సంబంధములేని ప్రజాసంస్థ మనహైద్రాబాదులో లేద నినప్పుడు కృషిక్షేత్రమెంత సువిశాలమైనదో తెలియఁగలదు. మీరాంధ్రోద్యమమును నిర్వ హించిన తర్వాతనే రాష్ట్రీయులగు మహారాష్ట్ర కర్ణాటకులలో తదీయోద్యమములు ప్రారం భింపబడుటయు తత్సంస్థలయందుకూడ మీకు గౌరవస్థాన ముండుటయు చూడ మీకార్య కుశల త్వము ఎంతనిగూఢ గంభీరమైనదో స్పష్టమగుచున్నది.

సహృదయవతంసా ! మీలోనిర్వ్యాజమయిన సహృదయత్వమే తలపెట్టిన కార్యములు విజయ రహస్యమని సూక్ష్మదర్శులకు గోచరింపఁగలదు. అదియే మాకిప్పటికి విధేయమగుచున్నది. తెలంగాణమునకింత విశాలోన్నత గంభీరమయిన అభ్యుదయ కృషి గావించిన మీకు రాష్ట్రీయులేమిచేసి మీఋణమును తీర్పగలరు ? కారణజన్ములైన మీ జన్మదినము తమకు జాతీ యోత్సవ దినముగా చేసికొని ప్రాచీన సాంప్రదాయసిద్ధమయిన షష్టిపూర్తిరూపముతో మీకు వజ్రోత్సవమును గావించి తమకు కృతజ్ఞతను ప్రకటింపగోరుచున్నాము. మీరు భౌతికముగా వ్యక్తిరూపముతో మా నడుమ మన్నను మహావ్యక్తులగుటవే ఆంధ్ర ప్రజాభ్యుదయ రూప ముగా పరిణత పొందుటయే ఈ ఉత్సవమునకు హేతువు. ఈ సందర్భమున "పత్రిం పుష్పం ఫలం తోయమన్నట్లు" మాహృదయ పుష్ప క్షేమఫల ఆనంద బాష్పతోయం పురస్సరముగా ఈ సన్మానపత్రమును సమర్పించుకొని కృతకృత్యులయ్యెదమని విన్నవించుచున్నాము.

తెలంగాణపక్షమున

ఆహ్వాన సంఘ సభ్యులు

## 2

ఆంధ్ర పితామహా ! నిద్రాణమైన తెలంగాణమును మేలుకొలిపి మానవ చైతన్యమును ప్రసా దించుటకై సర్వకాల సర్వావస్థలయందు కృషిసల్పుచు, జీవితమందలి ముఖ్యభాగమెందులకై

వ్యయపరచిన, మీకు మీషష్టిపూర్తి శుభమహోత్సవ సందర్భమున- మేము హృదయపూర్వకమైన శతాభివందనము లర్పించు చున్నాము.

"ఉదార చరితానాంతు, వసుదైవకుటుంబక" మ్మను నార్యోక్తి ననుసరించి ప్రజా సేవకై జీవితమును వినియోగించిన మీరు ధన్యజీవులు

ఆంధ్రోద్యమస్థాపనాచార్యా! ఈ రాష్ట్రమందు దాదాపుఅర్ధభాగము ఆంధ్రులదైనను వారు తమ ప్రాముఖ్యతకుతగిన గౌరవస్థానము నందుకొనుట యటుండ, తమమతామే తెలుసుకొనలేని స్థితియందున్నపుడు మీరు సర్వతోముఖముగా ఆంధ్రోద్యమ బీజాంకురములనునాటి నిర్నిద్రజాగరూకతతో నీరుపోసి కాపాడిపెంచి పెద్దజేసితిరి. ఇరువదిఐదు సంవత్సరముల క్రితమునాడు మీరు నాటిన ఈ మొక్క నేడు మహావృక్షమై వివిధ స్వతంత్రశాఖలుకలిగి పుష్పఫలభరితమై తెలంగాణ మందలి కలిగిన ప్రజోద్యమము లన్నింటి నావరించి విరాజిల్లుచున్నది.

మీ భాషా సేవాసక్తికి తెలంగాణమందలి గ్రంథాలయోద్యమము ఆంధ్ర సారస్వత పరిషత్తులు నేయేల రాష్ట్రాంధ్రులయందు కలిగిన భాషాభిరుచి, తత్సేవాసంకల్పము, అమూల్యమైన ఫలితములు.

మీరు స్థాపించిన ఆంధ్ర జనకేంద్ర సంఘము రాను రాను నిజాంరాష్ట్ర ఆంధ్ర మహాసభగామారి ప్రజలందు రాజకీయ చైతన్యము కలుగజేసి బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనకై పాటుబడు జీవంతమగు ప్రజా సంస్థలలో ముఖ్యస్థానము వహించి ప్రజాశక్తికి నిజమైన కేంద్రమైనదని మేమందరము గర్వించుచున్నాము.

దేశోద్ధారకా! ఈ రాష్ట్రములో సార్వజనిక ప్రజా సంస్థలన్నియు మీ నిరంతర సేవను బడసి వృద్ధిపొందినవను మీవిద్యావిషయకసేవ ప్రత్యేకముగా ప్రశంసార్హమై యున్నదని మేము భావించుచున్నాము. ఈ నగరములోని బాలికాపాఠశాల లన్నియు మీ ఆర్థిక సేవకు కొంత ఋణపడి యున్నను మీ ప్రత్యేక కృషిఫలితమైన యభిమానసంస్థ బాలికల యున్నతపాఠశాల. ఏ గౌరవాధికారములను కోరక త్యాగశీలురై దేశక్షేమమునకై మీరు సల్పుచున్నకృషి యాదర్శప్రాయమని మేము తలంచుచున్నాము.

నిరాడంబరమైన మీ జీవితము మీ హృదయమార్దవము మీ త్యాగశీలత ప్రజోద్యమ కార్యకర్తలందరికి ననుకరణీయమైనదని మేము భావించుచున్నాము.

ఆంధ్రనాయక రత్నమా! నేటివరె ప్రజా సామాన్యమునందు జాగృతిచైతన్యములులేని ప్రారంభదశలో ధనసహాయము, కార్యకర్తలు మున్నగు సౌకర్యములలోపము గలిగియు, ప్రాథమిక సత్వముల నణచివేసి అభ్యుదయము నరికట్టు ప్రభుత్వచట్టముల బంధనములకు లోబడుచు మీరు ధైర్యమును గోల్పోవక నెమ్మదిగా శాంతియుతముగా నడిపించిన యాంధ్రోద్యమము నేడు వృద్ధిమార్గోన్ముఖమై జీవకళతో పెంపారుచున్నదన్న యీ గౌరవము యధార్థముగా మీకే చెందుచున్నదనుటలో అతిశయోక్తి యెంతమాత్రమునులేదు. ప్రపంచ పరిస్థితులనుబట్టి బహు తీవ్ర గమనమునకుగురియైన నీకాలమునందు మీ కార్యదీక్ష సంఘటన పాలనము దేశసేవకులగు కార్యకర్తల కత్యంతావశ్యక గుణములని విశ్వసించుచున్నాము. ధైర్యోత్సాహములతోబాటు పైవద్ధుణములుకలిగి ప్రజోద్యమములను విజయవంతముగా కొనసాగించుటకై మీనమయస్ఫూర్తి సలహాలు మీనేతృత్వము అవసరమని మేముభావించుచు పరమేశ్వరుడు మీకు చిరాయురారోగ్యములను శక్తిసామర్థ్యములను ప్రసాదించుగాక యని హృదయ పూర్వకముగా ప్రార్థించుచున్నాము.

ఆంధ్ర మహాసభ స్థాయిసంఘము.
హైదరాబాదు (దక్కన్)

## 3

ఆంధ్ర పితామహా!

బీడుబడియున్న తెలంగాణాన్ని చెట్టుగొట్టి, దున్ని కొంతవరకు సిద్ధపరచారు మీరు. తమను తాము తెలుసుకోవాలని ఆంధ్రజాతిని మేల్కొలిపారు. సేవాక్షేత్రానికి వెంటతీసుకో నడిచారు. సేద్యపు విధానాన్ని చూపించారు. ఈ నాడు వివిధమార్గాల్లో వివిధఉద్యమ అంకురాలు నెలకొన్నవి ఇప్పుడిప్పుడే తెలంగానము సస్యశ్యామలమవుతున్నది. కృషిఫలితము చూడగల్గినమీరుధన్యజీవులు.

మీరీ తెలుగునేలన జాతీయోద్యమాన్ని విత్తారు. అదివేరుపోసుకొని వ్యాపిస్తూవున్నది. మీరు ఆరంభించిన జాతీయోద్యమాన్ని ముందుకు తీసుకు తోతూవున్న తరుణసేవకుల సంఘటిత శక్తియే ఆంధ్రజాతీయ పక్షము.

మీరునేర్పిన - సేవాదీక్ష - సహనశక్తి మేము అలవరచుకొంటున్నాము. మీ ఉపదేశాలను అను సరిస్తున్నాము. ఇప్పుడిప్పుడే మీకృషిఫలితాలు దృగ్గోచర మవుతున్నవి. మీ సానుభూతిని చూర గొన గలిగినందుకు గర్విస్తూ వున్నాము. మీ ఆశీర్వాదబలం వల్ల హైదరాబాదు రంగంలో ఉచిత పాత్రను నిర్వహించగలమని ఆసిస్తున్నాము.

ఆర్థిక రాజకీయ రంగాలలో, హైదరాబాదులోని సోదరప్రాంతాలలోను, తదితరరంగాలలో సోదరప్రాంతంలోను చేతులుకలిపి కృషిచేయవలెననే మీ సంకల్పాన్ని మేము నెరవేరుస్తున్నాము.

ఆంధ్రజాతి మిమ్ములజూచి గర్విస్తున్నది. ఆయురారోగ్యాలతో వర్థిల్లి ఆంధ్రజాతి సేవ జేయవలెనని ఆకాంక్షిస్తున్నది. ఈశ్వరుడు ఈ కోర్కెలను నెరవేర్చుగాక!

విశాలాంధ్రాంధ్రులూ, ఆంధ్రజాతీయోద్యమ ప్రదాతలూ, నిర్మాణ కార్యదక్షులూ, నాయకులూ, అయినమీకు ఆంధ్రజాతీయ పక్షపు జోహార్లు.

సేవానిధులయిన మీరు చూపిన మార్గంలో విశాలాంధ్రాంధ్రులు తదితర సోదరులతోకలిసి సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధిస్తారనీ, అభ్యుదయ రంగంలో ఆంధ్రజాతి తనపాత్రను నిర్వహిస్తుందనీ, మావిశ్వాసము. అందుకై కృషిచేస్తూవున్న ఆంధ్రజాతీయపక్షము ఈ పవిత్ర తరుణంలో మీ ఆశీర్వాదాలకు వాంఛిస్తున్నది.

ఆంధ్రమహాసభకేంద్రసమితి ( జాతీయపక్షము )

ఖ మ్మ ం మె ట్టు

## 4

ఆంధ్రపితామహా! తెలంగానమున ఆంధ్రోద్యమ బీజాంకురములను స్వహస్తములతో నాటి ఆ మొక్కను నిర్నిద్రజాగరూకతతో కాపాడి నీరుపోసి, పెంచి, పెద్దచేసిన మీకు ఆంధ్రోద్యమ జన్మదినోత్సవ సందర్భమున జోహారులర్పించుచున్నాము.

నిద్రాణమైన విశాలాంధ్ర ఆంధ్రభూభాగమును మేలుకొల్పి ఇచటి ప్రజలకు మేమాంధ్రుల మను ఆత్మజ్ఞానమును ప్రసాదించిన మీకు మా హృదయపూర్వకమైన శతాభివందనములు.

నాయకాగ్రణీ! కీర్తిశేషులైన శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావుగారలతో పాటు 1901వ సంవత్సరమున గావించిన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ స్థాపనమే మీ దేశారాధనకు ప్రాతిపదిక. అప్పటినుండి ఇప్పటివరకు మీరు గావించిన ఆంధ్రభాషాసేవ అపారము. ఆ సేవవలననే ఇతరులచే నిరసింపబడుచున్న తెలుగుభాషకు మన రాష్ట్రాంధ్రులయందును

ఇతర ప్రజలయందును నేటి పలుకుబడియును, గౌరవమును లభించినది. ఈ మీ కృషికి తెలంగాణమందలి పల్లెలలోగల గ్రంథాలయములే సాక్షి.

ఆంధ్రోద్యమ స్థాపనాచార్యా! నేటికి 25 సంవత్సరముల క్రితం "నిజాంరాష్ట్రములో నివసించు ఆంధ్రులందరియందు పరస్పర సానుభూతియు, ఐకమత్యము కలిగించుట" మరియు "ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై పాటుబడుట" అను రెండువిశాలాదర్శములను దృష్టియందుంచుకొని మీరు స్థాపించిన ఆంధ్రజన కేంద్రసంఘమే, ఆంధ్రమహాసభగా మారి, జీవంతమగు ప్రజాసంస్థలలో ముఖ్యస్థానమును వహించి, మూడు ప్రాంతీయమహాసభలలో అగ్రగణ్యమై ఈరాష్ట్రములోని ప్రజాశక్తికి ప్రధాన కేంద్రమైనదని మేముగర్వించుచున్నాము. ఆంధ్రులకు ఈ గౌరవము కలిగించుటకు మీరే కారకులు.

దేశభక్తా! ఈ రాష్ట్రములోని విద్యావిషయిక, సాంఘిక, ఆర్థిక, రాజకీయాది సర్వతోముఖములగు ప్రజాసంస్థలన్నియు మీయొక్క నిస్స్వార్థమగు హార్దికసేవకు ఋణపడియున్నవి. ఏ పలుకుబడి, గౌరవము, యశస్సు, అధికారము, కీర్తిప్రతిష్టలను కాంక్షించక, వాని నితరులకు వదలివేసి త్యాగశీలురై నియమబద్ధులై నిరంతరాయముగా దేశక్షేమమునకై కృషిసల్పుచున్న మీకు ఈ రాష్ట్రవాసులెంతయు కృతజ్ఞులైయున్నారు. మీ నిరాడంబర జీవితము, మీ సౌలభ్యము, మీ మార్దవము, మీ హృదయకోమలత్వము, మీ త్యాగబుద్ధి ఆదర్శప్రాయమని మనవిచేయుట మా విధియని తలంచుచున్నాము.

ఆంధ్రరత్నమా! మీరు నాటినమొక్క, పుష్ప ఫలభరితమై, మీరు భావనాప్రపంచమున గనుచుండు స్వప్నము యదార్థమై పరిణమించుటయే మీ జీవితాదర్శము. మా ధ్యేయము కూడ నదియే. అతి శీఘ్రగమనమున మారుచుండు ఈ ప్రపంచ పరిస్థితులలో ఈ రాష్ట్రమునందలి ప్రజోద్యమములను ముఖ్యముగా ఆంధ్రోద్యమమును ఎల్లప్పుడొక కంటచూచుచు సమయోచితములగు సలహాలను కార్యకర్తల కొసంగి, ధైర్యోత్సాహములతోపాటు కార్యదీక్షను, సంఘటనాపాటవమును కలుగజేయు శక్తిసామర్థ్యములను ప్రసాదించి భగవంతుడు మీకు చిరాయురారోగ్యముల నొసంగుగాకయని ప్రార్థించుచున్నాము.

నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభ
హైదరాబాదు జిల్లాసంఘము

## 5

ప్రజాసేవ దీక్షితా! పవిత్రమైన ప్రజాసేవ కంకితమైన మీ జీవితపు దారులను సరిదిద్దుటలో ఆదిమస్థానమై తర్వాత తమ ఆశయపుష్పాలచే సువాసనాభరితమై పోవుచున్న నల్లగొండజిల్లా పక్షమున తమ షష్టిపూర్తి యుత్సవసందర్భంలో ధన్యవాదాన్నర్పించే గౌరవాన్ని పొందుతున్నాము.

నిజాంరాష్ట్రాంధ్రోద్యమ స్థాపనాచార్యా! తెలుగువారి తెనుగుతనానికి, చైతన్యానికి, రాజకీయ జాగృతుల పాలిటికి చవిటిపర్రయైపోనున్న మన తెలంగాణా ప్రాంతమున, ఆంధ్రత్వము, సాంస్కృతిక చైతన్యాలకు మడులుగట్టి చేసిన మీ కృషి, నేడు ఆంధ్రమహాసభ రూపంలో, యావన్నిజామాంధ్రుల రాజకీయ స్వాతంత్ర్య సాధనా ప్రయత్నాలలో ముందడుగు వేయుచున్నది. నిజామాంధ్ర సోదరులలో చైతన్యాన్ని పూరించ ప్రారంభించిన మీ యుద్యమారంభంకూడా మా నల్లగొండ నుంచియే ప్రారంభమగుట, విశాలమగుట, మా యదృష్టము.

సేవాధురీణా ! రాజకీయోద్యమం, సారస్వతోద్యమం, మహిళోద్యమం మున్నగు ప్రజాభి వృద్ధికి సంబంధించిన ప్రతి యుద్యమంకూడా మీ సహాయసంపత్తి, కృషిమూలమై సద్భుతమైన వన్నచో అతిశయోక్తిగాదు. ఈ విధంగా ఆంధ్రోద్యమమే మీ జీవితం, మీ జీవితమే ఆంధ్రోద్యమమై సమ్మిశ్రితమై ఆంధ్రోద్యమ పితామహులన్న పేరు సార్థక మైపోయినది.

నేడు రాజకీయ, ఆర్థిక, సారస్వత, సాంఘిక సమస్యలను పత్రికా క్షేత్రములో లేఖినియే చుక్కానిగా నేటి క్లిష్టపరిస్థితులలో తాము చూపుచున్న దారులు యనుసరణీయాలు.

సామాన్య సాంఘిక సంస్కరణల కొరకారంభమై, నేడు రాజకీయ స్వాతంత్ర్య కార్యక్రమంలో ముందుకుపోతున్న ఆంధ్రోద్యమము, సోదరీమణుల యున్నత విద్యాభివృద్ధికై జ్యోతిగా వెలసిన బాలికల యున్నతపాఠశాల, అవిద్యా, అజ్ఞానముల తొలగించి దేశీయులలో అపార సారస్వతోత్సాహాన్ని రేకెత్తించే ఆంధ్ర సారస్వత పరిషత్తు, గ్రామ గ్రామాన వెలసిన గ్రంథాలయాలు, పఠనాలయాలు తమ ప్రజాసేవ వృక్ష మధుర సుఫలాలు.

కార్యదీక్షా ! నేటివరకు తమ నిరాడంబర సేవాధురీణతతో లాభమొందిన మేము చిరకాలము తమ అమూల్యమైన సేవలనుబొందుచు, ఆశయపుష్పాలు వికసించి సువాసనల విరజిమ్మగా ఆంధ్రత్వ చంద్రికలను విశాలాంధ్ర దేశంతోపాటు అనుభవించ దృఢవిశ్వాసులమగుచున్నాము.

తథాస్తు

ఆంధ్ర మహాసభ జిల్లాసంఘము నల్లగొండ

## 6

ఆంధ్ర పితామహా ! ౨౩ సంవత్సరములే నూరుసంవత్సరములుగా తలుస్తున్న బానిస భారతదేశమున మీరువిండిన ౬౦ ఏండ్లు ౩ వందల ఏండ్లుగా తలుస్తూ, అందుకు మేము హర్షించుచున్నాము.

ప్రజోద్యమ నిర్మాతా ! నేడు హైద్రాబాదు సంస్థానమందలి ప్రధానరాజకీయసంస్థగా, బ్రహ్మాండమైన ప్రజాసంస్థగా అభివృద్ధినొందుచున్న నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభయొక్క చరిత్రలో మూలస్థానముగల మిమ్ములనుచూచి మేము గర్వముతో ఉప్పొంగుచున్నాము.

ఆంధ్రుల పెన్నిధీ ! ఒకవైపు నిరంకుశ ప్రభుత్వపు విషపుకోరలు, వేరొకవైపు సోదర ప్రజలకు ఆంధ్రులంటే అలసత్వము, ఇంకొకవైపు అన్నివిధాలా వెనుకబడియుండి, రాజకీయంగా అణచివేయ బడుతున్న సమయమున ఆంధ్రులను సర్వతోముఖముగా చైతన్య పరచి, నిద్రాణమైయున్న స్వాతంత్ర్యశక్తుల కార్యరంగమున కాలిడుటకు కారకులైన మీచే చేయబడిన కృషితో కూడిన సుమారు ౨౫ ఏండ్ల ఆంధ్రోద్యమ చరిత్రకు నేడు రూపురేఖలు దిద్దే కాలమాసన్నమైనది. ప్రమత్తతవల్ల ప్రజాజీవితమే తుఫానుకు గురి అయ్యేప్రమాద మేర్పడినది. ఇట్టి క్లిష్ట పరిస్థితిలో మాసర్వశక్తుల నుపయోగించి స్వతంత్రప్రజాజీవిత సాధనకై మేమునిర్వహించాల్సిన బాధ్యతను గుర్తించుతు, మేము వహించుతున్నపట్టుదల మీనుండేనేర్చుకున్నామని విన్నవించుకొనుచున్నాము.

సర్వతోముఖ కార్యదక్షా ! నాడుఅజ్ఞానము, సాంఘికకుళ్ళును రూపుమాపుటకై గ్రంథాలయములు, సంస్కరణోద్యమములద్వారా తాము కలిగించిన వ్యక్తిత్వఫలితముగ తలయెత్తిన ఉత్తమ శక్తులే నేడు తమ కర్తవ్యాన్ని గుర్తించి, ఒకవైపు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఎత్తులను, వేరొకవైపు సంస్థాన నిరంకుశవిధానములను, ఇంకొకవైపు అడుగడుగుకు గ్రామగ్రామానికి అడ్డువచ్చే

ప్రజాపీడితుల ఆటను కట్టించుటకు అమోఘమైన శ_క్తితో, మొక్క_వోని ధైర్యముతో నిర్వహించు చున్న బాధ్యతలు మీకండ్ల పండుగ కాగలదని మేము విశ్వసించుచున్నాము.

సత్యాన్వేషీ! గ్రంథాలయోద్యమము, సంఘ సంస్కరణోద్యమము, మహిళోద్యమము, విద్యా ప్రచారము, సాహిత్యసేవారూపములైన పిల్లకాల్వల కలయికయే నేటి—ఆంధ్రమహాసభ సముద్ర— స్వరూపమవియును, అట్టిప్రజాసముద్రమున చేపలవలె మెలగు మాకు జాలరుల బాధకలదవియును గు_ర్తించుటకు ఎల్లరికి పూజనీయులైన మీరు అట్టి జాలరులను కనిపెట్టాలని కోరుతున్నాము.

నిజాంరాష్ట్రీ ఆంధ్రమహాసభ
సికింద్రాబాదు తాలూకాకమిటి.

# 7

పూజ్య పితామహా! రాయలసీమకు "ఆంధ్రకవితా పితామహుని" "ఆంధ్రనాటక పితామహుని" దయచేసిన కాలపురుషుఁడు, తమ స్వరూపముతో "ఆంధ్రపితామహుని" దయచేసి, మా రాష్ట్ర మును నిజముగా సత్యలోకముచేసి వంద్యుఁడయ్యెననుట అతిశయో_క్తి కాదు. కారణజన్ములైన తమ అవతారముచే పవిత్రమై, తమ కొకప్పుడు బాల శిశు కోత్సవము గావించి మిన్నందిన పార్థివసంవత్సరము మఱొకసారి యీనాఁడట్టి యుత్సవమునే సంకల్పించి, అందు భాగస్వామి త్వము నొసంగి మమ్ము గౌరవ భాజనులను చేసినది। తామీ రాష్ట్రీయుల సర్వతోముఖాభివృద్ధికై చేసిన సేవ స్వర్ణాక్షరములతో లిఖింపఁదగినదిగాని మఱియొకటికాదు.

సాహిత్య రసికా! గుణవృ_త్తముల సాహిత్యమును, శబ్దార్థరూప సాహిత్యమును, తమ రసి కత్వమునకు కారణమై సాహిత్యమును పోషించినవి. ఈ రాష్ట్రోద్యానమున తమ కథావల్లి 'మల్లి కాగుచ్ఛము' ను పూచి, దిగంతములను సుగంధబంధురము గావించినది తెనుఁగు, సుజాత పత్రికా సంపుటములు విలువరించు "వ్యాస" పీఠమైన తమ కలము, ఇచ్చటి సారస్వతో పాస కులను కన్నుదెఱచి క_ర్తవ్యోన్ముఖులనుజేసి యీ నాఁటికిని "తెలంగాణ" లో ముందు తెన్నులు చూపుచున్నది। కమనీయమగు కవితానౌకలో "మిత్రస్మృతి" ని, 'మధురతమ' భావ తరంగ ములపై తేలియాడించిన సహృదయ శిరోమణులగు తమకు మా హృదయపూర్వకాభి వందనములు.

చరిత్రకుశలా! స్వచరిత్రమును కుశలముగాదిద్ది, ఆదర్శప్రాయముగా పెట్టుకొన్న తమ ప్రజ్ఞ అనన్య సామాన్యమైనది.

భారతదేశ చరిత్రపరిజ్ఞానమున ప్రత్యేక ప్రతిభను గడఁటించి, తత్పారభూతముగా ప్రతి విష యమునందును చారిత్రిక దృక్పథము వలవఱచుకొని, నేఁడు సర్వవిషయ సమంజస పరిష్కా రమున కట్టిదియే అత్యావశ్యకమని నిరూపించిన తమ క_ర్తృత్వముక్రింద ఇంకను వెలుఁగు చూడవలసియున్న "గ్యారిబాల్డు జీవిత చరిత్రమును", "రోమక సామ్రాజ్యచరిత్రము" ను చాటుచున్నది అట్లే తమ "స్వీయచరిత్రము" ను గూడ స్వహ_స్త లిఖితముచేసి, రాష్ట్రీయుల కచిరకాలముననే అనుగ్రహింపఁగలరని మాప్రార్థన.

విజ్ఞానధురీణా! తమ వైజ్ఞానిక దృష్టియందలి ధురీణత, కార్యకారణభావవివేచనా సమన్వయ మార్గమున నడచి. "అన్యులమనముల్ నొప్పింపక, తానొవ్వక", యెల్లరికిని హృదయాహ్లాద కరముగా నుండునట్టిదని యెవ్వ రెఱుఁగరు?

అజాత శత్రువులై తెలంగాణా "ధర్మక్షేత్రమున" ప్రశాంత రాజకీయములను నీతిజ్ఞతతో నిర్వహించి, ప్రదర్శించిన-తిక్కన పలుకులలో-" మెత్తని పులి " తనము ( యుధిష్ఠిరత్వము ) ఎవ్వరికైనను " నాల్పస్యతపసఃఫల " మ్మనఁదగినదేగదా !

కళారుచిరా ! పుణ్యయశస్సులచే ఈ రాష్ట్రమును 'కళారుచిరము' చేసిన తమ కళాప్రియత్వము శుష్కహృదయుల కెంతయేని యుపదేశకమై సరసత్వము నొసంగఁగలిగినట్టిది.

మన విద్యావిధానముతో సర్వకళలను జతఁగలిపి, నూతనోత్తేజమును వెదఁజల్లుచు తత్ఫలితముగా రాష్ట్రీయులు సర్వతోముఖాభివృద్ధి సంపన్నులుగావలయునని, నిత్యమును ఆంధ్రకుటీరమున భావ తపస్సునుగావించు ఋషిమూర్తులగు తమకు మరొకమారు జోహారులు !

పరిషద్ధురంధరా ! ఈ నిజాంరాష్ట్ర ఆంధ్రసారస్వత పరిషత్తు తమ కడగొట్టు గారాబపుపుత్రిక ! తమ ఆశీర్వాద ప్రభావముచే నిది యిప్పుడు ౨౬ శాఖాసంఘములతో సుసంపన్నమై కార్యశూరత్వముతో వర్ధిల్లుచున్నది. అయినను ఇది స్వతంత్రముగానిల్చి నడయాడఁదగిన స్థితికిరాలేదు. అంతవఱకు తాముతమ వాఙ్మనః క్రియలను దీని యోగక్షేమములకై వినియోగించి పాలింపఁగలరని యాశించుచు, తత్ప్రథమున కృతజ్ఞతా సూచకముగా "చంద్రునికి నూలుపోగువలె" ఈ సన్మాన పత్రమును సమర్పించుకొనుచున్నాము.

నిజాంరాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు

# 8

విజ్ఞాననిధీ ! ఆంధ్రుల సర్వతో ముఖాభివృద్ధికి నీవు చేసిన సేవ యపారము. తెలంగాణమున జరిగిన విజ్ఞాన ప్రచారము నీ కృషిఫలితమే యనుట నిక్కము. నీ విజ్ఞానతృష్ణ తాత్కాలికావేశముగాదు. ఆనాఁటి విజ్ఞానచంద్రికలోను నేఁటి విజ్ఞాన వర్ధినిలోను సమాధి నివేశమున నీమూర్తి స్వర్ణవర్ణములతో మెఱయుటయే యిందుకు తార్కాణ. పరమ పవిత్రమగు నీ విజ్ఞానాధ్వర్యమున కిఁక నీవాచార్యుఁడవై యాంధ్రులకు విజ్ఞానసర్వస్వమును బ్రసాదింతువుగాక !

నాయకాగ్రేసరా ! త్యాగశీలమున ప్రజాహృదయమును చూఱగొనిన నాయకాగ్రేసరుడవు. నీషష్టిపూర్తి మహోత్సవము అఖిలాంధ్రులకు నొకగొప్పపండుగ. తమ సోదరసభ్యునకు జరుగుచున్న యీ మహాగౌరవమునకు విజ్ఞానవర్ధినీ పరిషత్సభ్యులమగు మేము హార్దికానందమును ప్రకటించుచు ఈ శుభసమయ జ్ఞాపకచిహ్నముగా నిన్ను పరిషత్తులో శాశ్వతగౌరవ సభ్యునిగా జేసుకొను గౌరవము నందుకున్నాము. నీజీవితోద్యానము నిత్యవసంత శోభితమై విజ్ఞానపరిమళమును దిక్కులనెల్ల వెల్లివిరియఁజేయుగాక ! సర్వేశ్వరుఁడు నీకు ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధుల నొసంగి మనుచుగాక ! !

| విజ్ఞానవర్ధినీపరిషత్తు<br>హైద్రాబాదు | } | సురవరము ప్రతాపరెడ్డి (అధ్యక్షుడు)<br>చలమచర్ల రంగాచార్యులు ( కార్యదర్శి ) |
|---|---|---|

# 9

మహాశయా! భారతీయసంస్కృతిని ఉద్ధరించుటయే తమ పవిత్రాశయము. తన్నిర్వహణమునకై తామొనర్చిన కృషి కొనియాడ దగినది.

తత్సంస్కృతికి మూలాధారమగు భగవద్గీతా ప్రచారమునకై ౧౨ సంవత్సరములకు పూర్వమే నారాయణగూడా బాలికల ఉన్నతపాఠశాలలో తాము బీజావాపము చేసియుంటిరి. అదియే అంకురించి ఈ గీతాపరిషద్వృక్షరూపమున పరిణమించి శాఖోపశాఖలతో నిజాంరాష్ట్రమునందంతటను వ్యాపించుచున్నది.

అనేక సంస్థలు మీచేయూతతో వర్ధిల్లుచున్నవి. వానిపైవలెనే యీగీతా పరిషత్తుపైనగూడ అభిమానముంచి దీనివి వర్ధిల్ల జేయుటకు శ్రీకృష్ణ భగవానుడు మీకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యములను నొసంగుగాక.

శ్రీమద్భగవద్గీతా పరిషత్తు
హైదరాబాదు

## 10

మహాపురుషా ! ఇరువదవ శతాబ్దపు పరమోజ్వల పృథ్విలో, నొకమూల చీకటి తెరల మధ్య తడవు కొనుచున్నది భరతఖండము. అందొకమూల దండకకీకారణ్యమునాటి నాగరికతను తలపించును తెలంగాణము. అందున శతాబ్దములు వెనుకబడియుండిరి తెలుగులు. అట్టియెడ విజ్ఞాన దీపికలతో నిలచి తెలుగులచే వెలుగునోములు నోపించి, మాపూర్వాంధ్ర చారిత్రకౌన్నత్యమును స్మృతికిదెచ్చి మానాడులలోని మహోజ్వల మహాంధ్ర రేఖల మిరుమిట్లు గొలిపించి. ఒడలు తెలిసిన, మీకు మాజోహారులు.

ఓయుగతారా ! వెలిగినదితొలి తెలుగుసాహిత్యము. కాలవశమునవెలుగులు తొలగినవి సాహిత్యము సన్నగిలినది. అట్టియెడ భాషామతల్లి సేవకై మీ ' సుజాత ' నేర్పరచి, ఆమెచేపల్కించిన ముద్దుపల్కులతో ఆంధ్రభాషలోని తీరుతీయములు, కవిత్వపు కమనీయత, మాండలిక మాధుర్యము, ద్యోతకమొనర్చి ఆంధ్రులలో భాషాభిమానమును రేకెత్తించి బాషను పునరుజ్జీవింపజేసిన, మీకు జేజేలు.

ఓ ఆంధ్రపితామహా ! జీర్ణింపనున్న ఆంధ్రజాతి పునరుద్ధరణ మహోద్యమమునకు నడుము కట్టి, ఆంధ్రుల రాజకీయ నైతిక, సాంఘిక, సారస్వత విషయములలో మీరుచూపిన కార్యదీక్ష, మీ నైపుణి, మీసాధనకు, మీకుకేల్మోడ్పులు.

ఓమేధోజ్వలమణీ ! ఈషష్టిపూర్త్యుత్సవ సందర్భమున నానందింపఁ జేరిన నీపౌత్రుల వాంఛాబలమున, మాకై మీరేర్పరచిన సంస్థలకై మీకలిమి మాకు ద్వితీయావృత్తియగుత !

ఓ ఆదర్శమూర్తీ ! మీ అంతఃకరణముల ప్రాపు తెలుగుతల్లికి చిరాయుకల్పమగుత !

(1) నిజాంరాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు
(2) ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం
(3) సాధనసమితి సికింద్రాబాదు

## 11

జయ విజయీభవ — దిగ్విజయీభవ

శ్రీ స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర అసఫ్‌జాహి వంశాభరణ శ్రీమన్మహబూబ్ అలీఖాఁ బహద్దరు పాదుషా కుమారతిలక ! లెఫ్టనంటు కర్నల్ వత్తేజంగు జి. సి.

యస్. ఐ. జి. సి. బి. రాయల్ విక్టోరియా రత్నహారాలంకార ! సార్వభౌమ ప్రభుత్వ పరమ హితావతంస ! సుల్తానుల్ ఉలూం శ్రీమదల్లా భక్తిభావరంజిత చిత్తసరోరుహ ! శ్రీనిజాం ప్రాజ్య రాజ్యలక్ష్మీ విజేశ్వర ! సుభట సంస్తుత్యనామాది ప్రశస్తి సహితులగు హెచ్. ఇ. హెచ్. నవాబు సర్ మీరు ఉస్మాన్ అలీఖాన్ బహద్దురువారు హైదరాబాదు మొదలి పట్టణంబుగా సుఖ సంకథావినోదంబుల పృథ్వీ రాజ్యంబు చేయుచుండగా-

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౮౭౭ అగు నేటి పార్థివనామ సంవత్సర మాఘశుద్ధ పంచమీ బుధవారమునాడు భాగ్యనగర నామాంతర హైద్రాబాదు పురవరం బున సకలాంధ్రజనులు, సకలజాతీయులు అబాలగోపాలము కవి పండిత గాయక విద్వజ్జనులు పరివేష్టించి శ్రీ మన్మాడపాటి హనుమంతరాయామాత్య నాయకమణి షష్టిపూర్తి మహోత్సవ శుభసందర్భమున పేరోలగంబు నందుండంగా సకలవిద్యావినోద ! శాంతిప్రియ వినయవిభూషణ ప్రజ్ఞాయుగంధర ఆంధ్రపితామహ మాడపాటివంశ పయఃపారావార రాకాసుధాకర వెంకటప్ప యామాత్య తనూభవ వేంకట సుబ్బమాంబా గర్భశుక్తి ముక్తాఫల హనుమంతరాయామాత్యు లకు శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి సభాసములు ఆనంద కందళిత హృదయార విందులయి సమర్పించుకొన్న అభినందన పత్రము ఏమనగా-

ఆంధ్రతిలకా ! భవదీయ సంకల్ప సందేశ సమాలోచన భాగ్యమును పొంది శ్రీ లక్ష్మణ రాయ పరిశోధకమండలి తెలంగానపు చరిత్ర మాగాణమునందు కృషిసలిపినది తమ ప్రతిభా విశేషమున తాళపత్రగ్రంథములు గౌరవ పాత్రములయి విశిష్టతను పొందినవి. శిలాశాసనములు ముక్తకంఠముతో ప్రాచీనాంధ్రప్రాభవమును చాటినవి. ఆంధ్రచరిత్రకు నూతనవికాసము కలిగినది.

ఆంధ్రమాన్యా ! భవదీయ కార్యవిరతి యోచనాబలము సహస్ర భానుమండల మరీచీ వీచికలతో వేయిదిక్కుల ప్రసరించి తెలుంగు రాష్ట్రమును ఎట్లు సంచలితముజేసి ప్రాచీనాంధ్ర చరిత్రాభిమాన మును ఎట్లు ప్రజ్వలితముచేసెనో అట్టి చరిత్రాత్మక విషయమును శ్రీ లక్ష్మణరాయ పరిశోధక మండలి సభాసదులు కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచున్నారు.

ఆంధ్రరత్నా ! భవదీయ షష్టిపూర్తి మహోత్సవ మంగళ సందర్భమునందు శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి సభాసదులు ప్రేమాంజలులను తమకు సమర్పించుకొనుచున్నారు.

వేదోక్తం పరిపూర్ణమాయురస్తు
సమస్త సన్మంగళాని భవంతు

రాజానాయని వెంకట రంగారావు బహద్దురు (అధ్యక్షుడు)
ఆదిరాజు వీరభద్రరావు ( గౌరవకార్యదర్శి )
శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి, హై. ద.

## 12

హనుమంతరాయధీమణీ ! " శతం జీవశ్శరదో వర్ధమానః " అను వేదోక్తినే మేమంద రము ఏక కంఠముతో నుచ్చరింపుచు విన్నాశీర్వదించు చున్నాము. మీషష్టిపూర్తి మహోత్సవ మును నెరపుచు మేము మోదఖేదములకు గురియగుచున్నాము. మీయొక్క సేవాభాగ్యమువింత కాలము పొందినందులకు సంతోషమును కృతజ్ఞతను తెలుపుకొను చున్నాము. మీషష్టిపూర్తితో పాటు మీరు ఆరంభించిన మహోద్యమములకు కూడ షష్టిపూర్తిచేయలేక పోవుచున్నామని

యీ తెలంగాణపు ఆంధ్రులందరితో మేమును ఖేదమునే పొందుచున్నాము. తాము ఏ ఆదర్శ సిద్ధికై సర్కారు ఉద్యోగమును, లాభదాయకమైన న్యాయవాద వృత్తిని పరిత్యజించి త్యాగ మహనీయులై నిరాడంబర జీవితమును పూనుకొంటిరో, ఆ యాదర్శ మింకను శిఖరముపై పదిబారల దూరమైనను ఎక్కలేదు. అప్పుడే షష్టిపూర్తియా! యని మేము చకితులమైనచో క్షంతవ్యులము.

ఆంధ్రోద్యమ పితామహా! మీరు ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై వేసిన బాటలు పెక్కు గలవు. మీరు ప్రజాహిత జీవితమున కంకితమైననాడు ఆంధ్రులు ఉపేక్షానైరాశ్యములను బురద చెలకలలో పడియుండెడివారు. ఎన్ని జాతీయ గీతములు యుద్ధ కాహళములవలె మ్రోసినను వీరు కుంభకర్ణ నిద్రనుండి లేవలేదు. ఒకయాధునిక మహర్షి ప్రవచించిన యద్భుతసత్యము జ్ఞప్తికి తెచ్చుకొనుచున్నారము. "నిప్పు" 'నిప్పు' అని బండెడు తెల్లకాగితములమీద వ్రాసి మీదపడవేసి నను ఒక్కదూదియేకు కూడ చలింపదు. నిర్లక్ష్యముతో నట్లే నిలిచియుండును. కాని ఒక సజీవ మైన ముత్తెమంత యగ్నికణమును ఒకదూది గోదాములోనే వేయుము. అచిరకాలములోనే దూదికొండ గడ గడలాడును. కార్య తంత్రజ్ఞుడవైన నీవు ఆంధ్రుల నైరాశ్య తూలమునందు గ్రంథాలయము, అను అగ్నికణమును మీటినావు. మా శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము ఇట్టి కణములలో మొట్టమొదటిది. ఆ యగ్ని కణములు జ్వలించుచునే యుండును.

మాతృ దేశారాధకా! ఒక కడివెడు బురదమట్టి నీటిని తేర్చుటకు ఒకయిందుపకాయచాలును. ఒకజాతి జీవితజలమే బురదయైనచో నిర్మలము చేయగల ఇందుపకాయయేది! మతిమంతుడవైన నీవు తెలంగాణ వాసులకు "ఆంధ్రమహాసభ" యను కొండంత ఇందుపకాయను ప్రసాదించి నావు. అదియును మెల్లమెల్లగా బురదను విరుచుచు జీవితమును తేర్చుచున్నది. ఇంక నిదే విధముగ వృద్ధాప్యమెఱుగని ఆత్మశక్తి పెంపొంద పూర్ణాయురారోగ్య వంతుడవై మాతృదేశ భాషాసేవకు గడంగి యశశ్చంద్రికలవెలయించి మించెదరుగాకయని మా యభిమతము.

శుభం భవతు

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ సభ్యులు

హైద్రాబాదు.

# 13

మహాశయా! మీకు మా హృదయపూర్వక వందనములు. మన తెలుగుసీమను, ఆంధ్రత్వ మును విస్మరించిన మన తెనుఁగు వారిని ప్రబోధించి వారియందు నూతనోజ్జీవమును కల్పించిన మీ ప్రతిభా విశేషమును కొనియాడ మే మెంతవారము?

ఆంధ్రగ్రంథాలయస్థాపకా! నేటికి ౪౫ సంవత్సరములకు మున్నే రాజధానీ నగరమున శ్రీకృష్ణ దేవరాయాంధ్రభాషానిలయ స్థాపనావసరమున మీరిచ్చిన చేయూఁతయు, తదాది తామిచ్చు దోహదమును, మీకుగల భాషాభిమానమునకు తిరుగులేని సాక్ష్యముగదా. ఒక నైనిలయమే యననేల మా శ్రీ వేమనాంధ్రభాషానిలయ స్థాపకులలో తామొకరుగాదో. ఈ నిలయ కార్యనిర్వా హకవర్గ సభ్యులై యుండి, హైద్రాబాదునగరమున నీ నిలయమున కిట్టి యుత్తమస్థితి చేకూర్చి నది మీ యుత్తమాభిమానము బలముకదా. నిలయమునకు సొంత భవనమును నిర్మించు విషయ మున తాముచూపిన ప్రోత్సాహాదరములు నిలయచరిత్రమున సువర్ణాక్షరముల లిఖింపదగినవని యనుట కేమేని సందియము కలదా. ఇట్లొక్కొక్కటి లెక్కించుట కెన్నియని! ఈ నిజాంరాష్ట్రమున

నేయాంధ్ర భాషాసంస్థ మీయండలేక నిలువగలిగినది ? తాము చేయుచున్న గ్రంథాలయోద్యమ ప్రచారమునకు ఫలితములే గదా రాష్ట్రమునందలి పల్లెలలోని ఆంధ్ర గ్రంథాలయములు. మాతృభాషాభిమానమే జాతీయాభ్యుదయ హేతువని విశ్వసించుటకు మీ జీవితమే చక్కని దృష్టాంతము. నేటి తెలంగాణపు సర్వతోముఖాభివృద్ధికి, మీ గ్రంథాలయోద్యమమే బీజమనుటకు మాకెట్టి సంశయమునులేదు. ఇట్లు వివిధ సంస్థలద్వారా తాము చేయుచున్న భాషాసేవయేగాక, తాము స్వయముగ రచించిన గ్రంథములమూలమునగూడ చేయుచున్న విజ్ఞాన ప్రసార మమూల్యమైనది. సకలాంధ్రావనికి విజ్ఞాన వీచికలం బరపిన విజ్ఞానచంద్రికా గ్రంథమాల తమ యభిమాన పుత్రికయేగదా.

ఆంధ్రభాషాపోషకాగ్రణీ ! వార్ధక మ్మిమువరించినను, మీ రాపెను నిరాకరించి నేటికిని విజాంరాష్ట్రాంధ్ర సారస్వత పరిషన్ముఖమున నవయువక బలంబుతో తాము సలుపుచున్న భాషాసేవ యే యాంధ్రుని ముగ్ధునొనరింపజాలదు.

తమరు చిరజీవులై, ఆంధ్ర భాషాభ్యుదయ హేతుసాధనముల నిర్మించి, ఆంధ్రుల గౌరవంబుల నందుచు, ఆంధ్రమాతృ శ్రీయాశీః పాత్రులై వెలయం జేయ భగవంతుని ప్రార్థించుచున్నాము.

శ్రీవేమన ఆంధ్రభాషానిలయ సభ్యులు

హైదరాబాదు

## 14

పితామహా ! మీరు ఆంధ్ర పితామహులేకాదు. రాజకీయ సంస్కరణ ప్రజా పరిషత్తుకు అధ్యక్షులుగా ఎన్నుకోబడి హైదరాబాదు పితామహులయినారనిన అతిశయోక్తికాదు. హైదరాబాదు ప్రజా జీవితము ప్రత్యేకముగా తెలంగాణా ప్రజా జీవితములో మీ శుభనామమును సువర్ణాక్షరములతో చరిత్రకారులు లిఖించెదరు. మీ కీర్తి, యశస్సు పరమపూజ్యుడగు గోఖ్లేవలె ఆచంద్రతారకముగా వెలయును.

నేడు మీషష్టిపూర్తి-హిందూ ధర్మశాస్త్ర ప్రకారము మీ ఆయుస్సులో సగముకూడ పూర్తి కాలేదు. మిగత అరువది అయిదు సంవత్సరములలో మీ రింతకన్న ఘనకార్యములుచేసి ప్రజా శ్రేయస్సుకు మీ తపోశక్తిని ధారపోయుటకు భగవంతుడు మీకు ఆయురారోగ్యముల ప్రసాదించుగాక.

శ్రీబాలసరస్వతీ ఆంధ్ర భాషానిలయము

హైద్రాబాదు

## 15

ఆంధ్రపితామహా ! శ్రీ మోహనదాసు కరంచంద్‌గాంధీజీ యావద్భారతానికేగాక సకల ప్రపంచానికీ ఆదరణీయ మహాపురుషుడు అయినా పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతాలకు శ్రీఅబ్దుల్ గఫార్‌ఖాన్‌గారు 'ఫ్రాంటియర్ గాంధి' అని యెటుల ప్రసిద్ధిజెందినాడో, అటులనే, ఆంధ్ర పితామహులయిన తమను "నిజాంరాష్ట్ర గాంధిజీ" అని భావించుట అతిశయోక్తి కాజాలదు. అది నిజాంరాష్ట్రీయుల పూర్వజన్మ సుకృతవిశేషము. భారత భావి భాగ్యోదయ దర్శనాభిలాషియై గాంధీమహాత్ముడు ౧౨౫ సంవత్సరములు జీవించ సంకల్పించుకున్నట్లే నిజాంరాష్ట్ర సర్వతోముఖాభివృద్ధ్యర్థం తామునూ ౧౨౫ సంవత్సరములు జీవింపబద్ధకంకణులగుట మా మహదాశయం.

ఆంధ్రోద్యమ మూలపురుషా ! సేనాధిపతిలేని సైన్యం చెల్లాచెదరయి, దరీ తెన్నూ గానక పలు తెరంగుల పరువులుపెట్టు చందంబున జీవితపరమార్థము జాతిగౌరవ ప్రతిష్ఠల ప్రాముఖ్యపరిచయం లేక పౌరుష హీనంగా ప్రొద్దుబుచ్చుచున్న నిజామాంధ్రులకు మహానాయకుడవై వారిలో చైతన్యం కలిగించి విచ్ఛిన్నమైన ఆంధ్రశక్తులను ఏకోన్ముఖంచేసి బ్రహ్మాండమైన నేటి ఆంధ్రోద్యమ నిర్మాణమునకు మూలపురుషులైన మీకివే మా జోహారులు. సత్సంకల్పముతో, సదయహృదయంతో సంస్థాపింపబడ్డ యిట్టి మహోద్యమాన్ని యెడమార్గము, పెడమార్గము పట్టింపదలచుకున్న వారల ప్రయత్నం పటాపంచలగుట నిక్కువమని మా దృఢవిశ్వాసము.

ప్రతిఫలాపేక్షరహితా ! భారతదేశానికేగాక యావత్ప్రపంచానికి ఆదరణీయమైన భగవద్గీతలోని నిష్కామకర్మోపదేశాన్ని తమ జీవన పరమలక్ష్యంగా పరిగ్రహించి ప్రతిఫలాపేక్షలేక పవిత్రహృదయంతో నిజామాంధ్రుల వివిధ విద్యా, విజ్ఞాన, సాంఘిక, ఆర్థిక, రాజకీయాది సమస్త ఉద్యమాలను సక్రమపద్ధతులపై నడిపి, నేటి ఆంధ్రుల అభ్యున్నతికి మూలపురుషులయిన మీకు రాష్ట్రమెంతో ఋణపడివుంది. ఇట్టి సన్మానాలెన్నిగావించినా తమ ఋణవిమోచనము దుస్తరము.

త్యాగమూర్తీ ! ఈశ్వర దృష్టిలో లక్ష్మి సరస్వతులు పరస్పర విరుద్ధశక్తులు. లక్ష్మిఉపాసకులు సరస్వతీ ఉపాసకులవలె ప్రపంచవాసుల గౌరవ ఆదరాభిమానాలను చూరగొనజాలరు. అయినా భోగభాగ్యాలకు వశీభూతులై అత్యధిక సంఖ్యాకులు లక్ష్మినే ఉపాసింతురు. అంతేగాదు, స్వార్థమే ప్రధానంగా భావించి దేశద్రోహానికి వెనుదీయరు. సంకల్పించుచో లక్ష్మీప్రసన్నులై లక్షలాది ధన సమీకరణ మొనర్పగలశక్తి, సామర్థ్యాలున్నా సర్వశ్రేష్ఠమై, రాజపూజితమైన సరస్వతీ ఉపాసకులై దేశసేవ, సంఘసేవ, జాతిసేవలనే జీవితాశయంగా భావించి శాశ్వత కీర్తిని గడించిన మీకు హృదయ పూర్వక వందనములు.

మహాపురుషా ! రామరావణులవంటి ద్వంద్వ తత్వాలతో కూడుకుంది ప్రపంచం. రావణతత్వ సిద్ధికి ఒక జన్మ పర్యాప్త మవుతుంది. కాని రామతత్వ వశీకరణకు యెన్నిజన్మల సుకృతవిశేషమో అవసరం. నేటి మీ అకలంక యశస్సునకునూ, తమ పూర్వజన్మకృషిఫలితమే అని మా పరిపూర్ణ విశ్వాసం. ౧౨౫ సంవత్సరముల జీవితాంతమున మానవజీవిత పరమార్థమైన మోక్ష సామ్రాజ్య ప్రసాదమే భగవదేచ్ఛ యగుచో అంతటికంటె బ్రహ్మాండ విషయముండదు. అలాగాక, పునర్జన్మయే ఈశ్వరసంకల్ప మగుచో అది పీడిత ప్రజాకోటి సముద్ధరణకే వినియోగపడు నట్లనుగ్రహింపబడుగాక !

విజ్ఞానరాశీ ! సూర్యప్రకాశంలేని సృష్టిఅంధకార బంధురమై, సమస్త వ్యవహారాలు స్తంభించి పోయినట్లే విద్యావిహీన మానవజీవితం జీవన పరమలక్ష్యాన్ని సాధించలేక నిరర్థక మవుతుంది. దేశగౌరవ ప్రతిష్ఠల నిర్ణయానికి, అభిమానభరితమానవజీవిత నిర్వహణకూ, సాధనభూతము విద్యయే. అట్టి సర్వోత్కృష్టమైన విద్యావ్యాప్తికే గ్రంథాలయాలు, బాలబాలికా పాఠశాలలు స్థాపించి వాటి మహోన్నత దశకు తమ సర్వశక్తులు వినియోగించి నిజాంరాష్ట్రాంధ్రులకు యెనలేని సేవనొనర్చిన మీకు ౧౨౫ సంవత్సరములు దీర్ఘాయురారోగ్య ఐశ్వర్యాదుల నను గ్రహింప పరమ దయాళువైన పరమేశ్వరుని ప్రార్థించుచు ఉడుతాభక్తితో ఈ సన్మానపత్రాన్ని సమర్పించుకొనుచున్నాము.

24 సంఘములు, సికింద్రాబాద్.

## 16

ఆంధ్రోద్ధారకా ! ఆంధ్రదేశ చరిత్రలో మహోజ్జ్వలమైన కాకతీయ సామ్రాజ్యమునకు జన్మభూమి యగు మన తెలుగునాట ఆంధ్రులు ఇతరానుకరణమున గుర్తింపబడజాలక, ఆంధ్ర భాషాభిమానము సన్నగిలినదినములలో, మీరు ఆంధ్రోద్యమమును లేవదీసి, నామమాత్రావశిష్టముగనున్న ఆంధ్రసభ్యతకు ప్రాణముపోసి, ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై స్వార్థరహితమైన కృషి గావించిన మీ కార్యదీక్షకు జోహారులు.

గ్రంథాలయోద్యమ ధురంధరా ! మీరు మొదట ఓరుగల్లులో 'రాజరాజనరేంద్ర గ్రంథాలయము' నకు శంకుస్థాపనచేసి, తదభివృద్ధికి కారకులై, పిదప భాగ్యనగరమునకు విజయము చేసి ఆంధ్రులు గర్వింపతగిన "శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము" నకు ౨ సంవత్సరములు కార్యదర్శిత్వమును మహాసామర్థ్యముతో నిర్వహించి, ఆ సమయమునను తర్వాతనుగూడ గ్రంథాలయోద్యమమందు విరివిగా ప్రచారముచేసి, రాష్ట్రమున విజ్ఞాన బీజములవెదజల్లి, ఫలించిన తత్సస్యముల కనులారగాంచి ఆనందించుచున్న మీరు మా గ్రంథాలయముల కన్నిటికిని వందనీయులు. మీ పవిత్రనామము గ్రంథాలయములకు సదాస్మరణీయము. మీచేతి చలువవల్ల ఈ ఉద్యమము ఇతోధికముగా పెరిగి దేశ కల్యాణమునకు త్రోవతీయుగాక.

ఆదర్శపురుషా ! మీ యవతార విహారములచే పవిత్రమైన మన రాష్ట్రమునకు మీ రొసగిన ఆదర్శములు పవిత్రతరములు. మీ సహృదయత్వము, మీ త్యాగశీలత మీ ఉచితజ్ఞత యనన్యసామాన్యము.

ఈ షష్టిపూర్తి ఉత్సవసందర్భమున అభినందన పూర్వకముగా అర్పింపబడుచున్న ఈ సన్మానపత్రమును స్వీకరింపకోరుచున్నాము.

ఆంధ్రసంవర్ధనీ గ్రంథాలయము
మడూరి రాఘవులు భాషాకల్పవల్లిసంఘము
శ్రీకృష్ణగ్రంథాలయము
శ్రీగౌరీశంక రాంధ్ర గ్రంథాలయము
(ముషీరాబాదు)

## 17

మహాశయా—వందన సహస్రములు ! తమ షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున యీ సమ్మానపత్రము సమర్పించి గౌరవించు సదవకాశము లభించినందుల కమితానంద మొందుచున్నారము.

ఆంధ్రమహాపురుషా ! కృష్ణా మండలమున జన్మించి నైజాం రాష్ట్రమున ఆంధ్రాంగ్ల, ఉర్దూ, పార్శీ భాషలలో పాండిత్యమును గడించి, ప్రభుత్వోద్యోగమున జేరి ప్రజా సేవాభిలాషివై, ఉద్యోగమును వీడి, న్యాయవాద వృత్తి జేబట్టి, నిజాం రాష్ట్రాంధ్ర ప్రజల సర్వతోముఖాభివృద్ధికై దాదాపు ముప్పది సంవత్సరముల పైకాలమునుంచి తామొనర్చి యొనర్చుచున్న కృషి వర్ణింప వీలుకానిది.

గ్రంథాలయోద్యమ నాయకా ! గ్రంథాలయోద్యమము ద్వారానే విజ్ఞానాభివృద్ధి కలుగునని గ్రహించి చిరకాలమునుంచి ఆంధ్రరాష్ట్రమున గ్రంథాలయములను స్థాపించుటకై తాము చేసిన చేయుచున్న కృషి సువర్ణాక్షరములతో లిఖింపదగినది. ముఖ్యముగ హనుమకొండలోని రాజరాజ నరేంద్ర భాషానిలయమునకును, హైద్రాబాదులోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము నకును తాము కార్యదర్శిగా నుండి వాటి యభివృద్ధికి చేసిన అపార పరిశ్రమకు ఆ సంస్థల యిప్పటి ఉన్నతియే ప్రత్యక్ష సాక్ష్యము.

నైజాంరాష్ట్రాంధ్రోద్యమ పితామహా ! నైజాం ఆంధ్రులలో చైతన్యములేని ఆరోజులలో, నైజాంరాష్ట్ర ఆంధ్రజనకేంద్ర సంఘముద్వారానూ, మీదట నైజాం రాష్ట్రాంధ్ర మహాసభాస్థాపకు లలో ముఖ్యులై నైజాం రాష్ట్రాంధ్ర మహాసభా స్థాపననుంచి నాల్గు సంవత్సరములు కార్యదర్శి గనూ, తర్వాత అధ్యక్షులుగనూ, బాలికా పాఠశాలా స్థాపకులలో నొకరై ఆసంస్థకు పండ్రెండు సంవత్సరములకు పైగా కార్యదర్శిగనూ, గ్రంథాలయోద్యమ, ఆంధ్రోద్యమ సారస్వతోద్యమ ముల ద్వారానూ తాము నైజాంఆంధ్రులకు చేసిన, చేయుచున్న, చిరకాల సేవకు చిహ్నముగా "నైజాం రాష్ట్రాంధ్రోద్యమ పితామహులని" ప్రజలచే బిరుదు పొందిన మిమ్ము యెంతని కొని యాడగలము !

ప్రజా సేవాభిలాషీ ! గ్రంథాలయోద్యమము ద్వారా వయోజన విద్యావ్యాప్తి గావించి ప్రజలలో గల నిరక్షరత్వమును నిర్మూలింప కృషిచేయు మా యీ సమ్మాన పత్రమును స్వీకరించి మా కృషి జయప్రదమగుటకు మమ్మాశీర్వదించ కోరుచూ, తమ కాయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి, ఇంకనూ దేశసేవ, భాషాసేవ, యొనర్చునట్లనుగ్రహించుగాక యని దయామయుడగు శ్రీకృష్ణ భగవానుని ప్రార్థించుచున్నాము.

ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసంఘము (రిజిష్టర్డు)
బెజవాడ నగర గ్రంథాలయ సంఘము
కృష్ణాజిల్లా గ్రంథాలయ సంఘము, బెజవాడ

# 18

ఆంధ్రపితామహా ! అజ్ఞానాంధకారముకోబడి, ఆత్మగౌరవమనునది విస్మరించి, అన్యులకు దాసోహమనుటయే తమకర్తవ్యముగాభావించి, ఎదుటివారిదృష్టిలో కొరగానివారుగా వర్తించుచున్న తోడి తెలంగాణ ఆంధ్ర సోదరీ సోదరుల దుస్థితినిగాంచి, పరితప్తహృదయులై వారిలో చైతన్యము, వ్యక్తిగౌరవము పెంపొందజేయగల "గ్రంథాలయోద్యమము" నకు అంకురార్పణము జేసి, అనేక శ్రమలకు గురియై, ఆయుద్యమమునే అండగా జేసుకొని క్రమక్రమముగా ఇంచు మించు ఇరువదిఐదు సంవత్సరముల క్రితము, యెనుబదినాలుగు లక్షల ఆంధ్రుల ఏకైక ప్రతినిధి సంస్థయగు 'ఆంధ్రమహాసభయను' దానిని స్థాపించి, జాతి, మత భేదములను పాటింపక, తెలుగువారిలో చైతన్యము ద్విగుణీకృతము గావించిన మీకృషిని మేమెన్నడును మరువజాలము.

ఆర్యాదర్శా ! నిజాంరాష్ట్రమున తమ సలహాను పొందక తమ కార్యక్రమమును సాగించుసంస్థలు ఒకటి రెండు కలవేమోగాని, ముఖ్యమైన ఆంధ్ర, మహారాష్ట్ర, కర్నాటక, ఆర్య, విద్య, వైద్య, హరిజన, వైశ్య, విశ్వబ్రాహ్మణ, బ్రాహ్మణ, క్షత్రియ, ముదిరాజ, మున్నూరుకాపు, గౌడ, పద్మశాలి, నాయీబ్రాహ్మణ, యాదవ, మేరుకుల మొదలగుజాతీయ, ధార్మిక, విద్య, కులసభలెల్లను తమ

అమూల్యాభిప్రాయముల గైకొనక తమ తమ కార్యక్రమముల సాగించకుండుట జూడ, తమ యందపారభక్తిశ్రద్ధలు జూపువారు ఆంధ్రులేకాక ఆంధ్రేతరులుగూడా కలరని తేలుచున్నది. ఇది మీ ఆర్యాదర్శముయొక్క నిదర్శనము.

విజ్ఞానప్రియా ! విద్యావిషయముల వెనుకబడి మాతృభాషాభిమానమును విస్మరించిన ఆంధ్రసోదరీ సోదరులను మేలుకొలిపి, ఎన్నియో బాల బాలికల పాఠశాలలను స్థాపించి నిర్విఘ్నముగా విద్యా కృషి చేయుచున్న మీకు ధన్యవాదములర్పించుచు, తమకు దీర్ఘాయురారోగ్య ఐశ్వర్యముల కలి గించుగాతయని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

మంత్రిప్రగడ వెంకటేశ్వరరావు, (ప్రకాశకులు)
వైదిక ధర్మ గ్రంథమండలి, హై. ద.

# 19

పూజనీయా ! తమరి సేవాదీక్ష—సహనశక్తి—విద్యార్థులమైన మాకు ఒక చక్కని ఆదర్శం.

అజ్ఞానాంధకారములో నిద్రాణమైవున్న తెలంగానా ప్రజానీకాన్ని మేల్కొల్పి ఒక చక్కని మార్గాన్ని చూపించినారు.

ఈ తెలుగు నేలలో మీరు నాటిన ఉద్యమం దిన దినం అభ్యుదయ పంథాలో వ్యాపిస్తూవుంది. అది కలిగిస్తూన్న చైతన్యానికి నిదర్శనం, నేడు తెలంగాణా ప్రజానీకంలో కానవస్తూన్న క్రమ వికాసమే.

త్యాగమూర్తులు, సేవానిధులైన మీ జీవితం ధన్యమైనది. మీ ఉపదేశాలను అనుసరిస్తూ మీ సానుభూతిని చూరగొన గలిగివున్నందుకు గర్విస్తున్నాం.

మీ ఆశీర్వాద బలంవల్ల ఆంధ్ర విద్యార్థిలోకంలో మాతృభాషాప్రచారంతోపాటు సరియైన చైతన్యాన్ని, సక్రమవికాసాన్నికల్గిస్తూ చక్కని పాత్రను నిర్వహించగలమని ఆశిస్తున్నాం.

ఈ పవిత్ర తరుణంలో భక్త్యాంజలులను అర్పిస్తూ తమరి ఆశీర్వాదాన్ని ఆశిస్తూవుంది,

ఆంధ్ర విద్యార్థి మహాసభ
కేంద్ర సమితి

# 20

మహాశయా ! తెలంగాణాగ్రామాభివృద్ధికై తామొనర్చినకృషి చాలావరకు ఫలించినది. ఆంధ్రాభి వృద్ధికి విరివిగా గ్రంథాలయములు స్థాపించి, ప్రయోజనవిద్య అత్యావశ్యకమను మీ శంఖారావము నిజాంరాష్ట్రమున తాండవించు అజ్ఞానశత్రు కర్ణపుటంబుల కదలించుచున్నవి. బహుకొద్దిలోనే పలాయనసూత్రము పఠించునేమో !

ఆంధ్రపితామహా ! ఈ రాష్ట్రంలో అనగా ఆంధ్రదేశంలో మీరు ఒక గొప్పచలనం గలిగించి కరడుగట్టియుండిన ఆంధ్రులరక్తాన్ని ఉడుకెత్తించి పునః ఆంధ్రుల ప్రతిభను లోకమునకు చాటిన శ్రీశ్రీ పంతులుగార్కి భగవంతుడు ఆయురారోగ్యములు ప్రసాదించుగాక అనిప్రార్థించుచున్నాము.

హనుమదాంధ్ర గ్రంథాలయము
అరట్ల - జాగీరు

## 21

ఆర్య ఆంధ్రపితామహా ! తమ యమూల్యాయువు నేడొక చిహ్న రూపము దాల్చుటచే సుదినము సుప్రభాతము. ఈ ఆంధ్ర పురవాసుల సత్రేమను జూరగొనుచున్న షష్టి పూర్త్యుత్సవ మెంతయో ప్రమోదావహము.

ఐన ఏ విజామాంధ్రుల గాఢ నిద్రను సర్వతోముఖముగ మేల్కొల్పుటకై కృషిసల్పిన ఈ షష్టిపూర్త్యుత్సవ మొకటియే సంతృప్తికరమా.

దేశమున నైతికముగ ధార్మికసేవ యొనర్చుట ప్రతిమనుష్యుని కర్తవ్యమై యున్నను అది నిర్మల హృదయ పూరితమై వెలిగించు మానవుని సొత్తైయుండునుగదా ! ఫలవృక్షమువలె నమ్ర భావము సూచించు అపలిత వదనమువగల మందస్మితముచే నామీ దేశీయుల శ్రేయఃపరంపరకై జేయు కృషి ఈ నాటికిని 'స్వార్థోయస్య పరార్థ ఏవనపు మానేకస్పృతామగ్రణీః ' యను పరార్థ ప్రవృత్తికి గురియై సాంఘిక ఆర్థిక రాజకీయాద్యంగణముల విరవిహార మొనర్చి విశేషవిజ్ఞానము నార్జించి త్యాగమున అసమానమగు కీర్తిని గడించి జనసామాన్యమునం దాంధ్రపితామహ యను బిరుదమును సార్థక మొనర్చి ప్రజా బాహుళ్యమునం దధికామోదమునొంది దేశమున యాంధ్ర భాషకుగల ప్రాముఖ్యత నుగ్గడించి ఎన్నో అవసరములతీర్చిన విచ్చోట ఈ నా దొనర్పబడు యీ యుత్సవ మాదర్శప్రాయము గాకుండునా.

దుష్పూరోదర పురాణాయపిబతి స్రోతః పతింబాడబః
జీమూతస్తు విదాఘసంభృత జగత్సంతాపవిచ్ఛిత్తయే ॥

అను పై నైతిక వచనామృత పరమార్థమును గుర్తించి పరోపకార ప్రవృత్తి గలిగి ప్రజాజీవనమే తమ జీవనముగ నెంచు తమకాసింహాద్రీశుడు శతాయుపరిమితిగల ఆయురారోగ్యముల ననుగ్రహించు నట్లాశించుచున్న—

వైదిక కళాశాల
(కార్యకారిణీ సమితి)
సింహాద్రిబాగ్ వరంగల్

## 22

ఆంధ్రపితామహా ! విజాంరాష్ట్రమున దాము గడిచిన నలువది సంవత్సరములనుండియు, జేసిన ప్రబోధము నేడు వివిధ సంస్థలుగా మారుటయేగాక, ఆంధ్రజన సమాజమును కన్నుదెరపి మాతృదేశ, మాతృభాషాభ్యుదయముల వట్ల నుత్సాహవంతమును గావించినందులకు మా హృదయపూర్వక ధన్యవాదములు.

భాషోద్ధారకా ! అవిశ్రాంతమగు మీ మాతృభాషా సేవకు ఫలముగా భాగ్యనగరమున ఆంధ్ర బాలికల ఉన్నతపాఠశాల నెలకొని, స్త్రీ జనములో నూతనోత్తేజమును గలిగించుచున్న దవినచో, మీత్యాగము మీసేవ దేశాభ్యుదయ మంజుల మల్లికాయమానమునకు ప్రధానస్తంభములగు చున్నవని వేరుగా చెప్పనక్కరలేదు.

దేశసేవాపరాయణా ! మీరు చేసిన ప్రోత్సాహమునకు, చూపిన త్యాగమునకు, ఆచరించిన కార్య కౌశలమునకు నేడు విశాలాంధ్రమున వ్యాపించిన "ఆంధ్రమహాసభ" మహితదీప్తులు, అవి ప్రజలకు సాధించిపెట్టిన యుపకారవరంపరలు, ప్రతిదేశీయాంధ్రుని హృదయమున మొలకెత్తిన దేశసేవామణి ప్రభలు తార్కాణములని చెప్పిన, మీ గుణలేశమును బొగడినవారమగుదుము.

పండితవర్యా ! అపారమగు మీమేధాబలమునకు నేడు మీ రాయా సారస్వతసంఘములందును, సమావేశములందును ప్రకటించుచున్న చారిత్రికవిజ్ఞానము, ఆంధ్ర సారస్వతకౌశలము, ఉపన్యాస ధారామధురధోరణి, విషయ విమర్శననైపుణ్యము మున్నగు సుగుణరత్నములు ప్రబల నిదర్శనములు.

విద్యాప్రియా ! విశేషించి మీరు మా పాఠశాలయందును, బాలికల విద్యాభ్యాస పద్ధతులయందును, బాలికా విజ్ఞానాభినందనమునందును, పాఠశాలయొక్క శాశ్వతశుభ భవిష్యత్తునందును చూపుచున్న ఆదరాభిమానముల యెడ మేమెంతయు కృతజ్ఞతా బద్ధులమైయున్నాము.

ఇట్టిసద్గుణ సంపన్నులును, దేశసేవా పరాయణులును, త్యాగైకశీలురును, స్త్రీ విద్యాభిమానులును, విజ్ఞానసంపన్నులును అగు మీకు భగవానుఁడు చిరాయురారోగ్య భాగ్యములనిచ్చుగాక. మీ పవిత్రకీర్తికన్యపై దిక్కామినులు సుమాంజలులఁజల్లుచురుగాక. సతీసుత యుతముగా మీకు శుభమగుగాక.

బాలికల ఉన్నత పాఠశాల,
పాలకవర్గము, బాలికలు, బోధకులు, నారాయణగూడ, హైః ద.

## 23

గీ. స్వాగతంబాంధ్ర నాయకా స్వాగతంబు । ధన్యవాదంబులాంధ్ర పితా మహాంధ
ప్రాత విద్యార్థినీ సంఘపక్షమందు । భక్తి నర్పింతుమిదె యభివాదశతము.

గీ. విద్యలేమి యనెడు పెద్ద బీడు భూమి । గహన కృషిసేయు నీవునాగంట దున్ని
జ్ఞాన బీజంబులొత్తుగా జల్లినావు । కోసికొందుము ముత్యాల కూర్మిపంట.

సీ. ఆంధ్రులకే గాక అరవ కన్నడ మహా । రాష్ట్రులకెల్ల గారాబు బిడ్డ
ధన్యాంధ్ర విశ్వవిద్యాలయ రాణియై । క్రీడాభి రామయై వెలయు వధువు
నిఖిల కళా సమన్వితలైన కన్యల । గనిపొంగిపోవు భాగ్యముల రాశి
అవదలొ ముగుదల కాశ్రయంబు లొసంగి । లాలించు దొడ్డ యిల్లాలు మరియు
మంచి చెడుగుల వవితాప్రపంచమునకు । తానె పెట్టని కోటయై తనరు నట్టి
బాలికా పాఠశాల నీ ప్రథిత కీర్తి । చంద్రికల నొక్క కళ సుమ్ము సచ్చరిత్ర.

సీ. కర్తవ్యముల కడగా నుంచి నిద్రించు । నీ రాష్ట్రమును ప్రబోధించి తెలిపి
నా భాష నా జాతి నా దేశమనెడి జా । తీయ భావంబుల దీక్ష పెంచి
నూతనోత్సాహులై నీతెన్నుతోపని । తరుణంబునందు సత్పథము జూపి
మన జాతి వ్యక్తిత్వమును నిల్పుటకు నిజాం । రాష్ట్రాంధ్ర సభల నేర్పాటుజేసి
అన్నిటను మార్గదర్శకుండైన మాడ । పాటి హనుమంతరాయుండు పదియు నదులు
వత్సరంబులు సకల సంపదల తోడ । దేవ దేవుని కృపను వర్ధిల్లు గాక.

ఉ. నైతిక భావ సంపద ననామయ భాగ్యమునన్ మహాత్ము ని
ఖ్యాతిని భోగరాజుమన, త్యాగగుణంబున ఆంధ్ర కేసరిన్
నీతనయందు బోలుచును విస్తుల వంశ మహీజమూలమౌ
గాతయటంచు మ్రొక్కెదము. కారుణి కోత్తముడౌ పరాత్పరున్.

ప్రాత విద్యార్థినీ సంఘము
బాలికల ఉన్నత పాఠశాల
నారాయణగూడ హైద్రాబాదు

## 24

శ్రీవిద్యాభిమానీ ! విద్యాశూన్యులై, అజ్ఞానాంధకారమున బడియున్న స్త్రీ లోకమును తమ విజ్ఞానచంద్రికలచే నుల్లాసపతులను గావించిన మీకు పరమేశ్వరు డాయురారోగ్యైశ్వర్యముల సమకూర్చుగాక ! తామాంధ్రబాలికల ఉన్నతవిద్యా ప్రసారమునకు సలిపినకృషికి మేమెంతయు కృతజ్ఞులము.

పాఠశాలాస్థాపకా ! శిథిలావస్థయందున్న మా పాఠశాలాభివృద్ధికై యెంతయో కృషిసల్పి, భవన నిర్మాణమునకుగూడ, మూలస్తంభమై, నిలిచి, బహుప్రయాసపడిన మీకు మా హృదయ పూర్వకాభివందనములు.

స్వచరిత్రమును కుశలముగా దిద్ది, ఆదర్శప్రాయముగా పెట్టుకొన్న తమ ప్రజ్ఞ అనన్యసామాన్యము. మీకీర్తికాంత తెలంగాణ నాట్యరంగమున తాండవమాడుచున్నది. అట్టి మీ షష్టిపూర్త్యుత్సవమును జరుపుట మాకు పండుగ. మా పాఠశాల మీ గారాబు బిడ్డ. తమ యాశీర్వాదప్రభావముచే నది యిప్పుడు సుసంపన్నయై కార్యశూరత్వమును బ్రకటించుచున్నది. ఈ పాఠశాల కనుబంధముగా భోజన, వసతిగృహ నిర్మాణమునకు తోడ్పడి దానిని సక్రమపద్ధతులపై నడిపితిరి. వసతిగృహమున బాలికల సంఖ్య, దినదినాభివృద్ధి గాంచుచున్నది. మా పాఠశాల, వసతిగృహము రెంటిని మంచి పునాదులపై నెలకొల్పి స్వయముగా కార్యభారమును వహించి, ఎట్టిలోటు లేకుండ తీర్చి దిద్దిన తమ యభిమానమును మేమేగాక యింకను ముందురానున్న బాలికలుకూడ గొని యాడెదరు. మీ కనేక సంస్థలతోగల సంబంధమొక విధమైనది, మా పాఠశాల, వసతిగృహములతోగల సంబంధము. ప్రేమాభిమానము సాటిలేనిదని బాలికలమైన మేము సగర్వముగా చెప్పుకొన గలుగుచున్నాము.

బాలికాహితాభిలాషీ ! ఈ పాఠశాలయందు పాఠ్యక్రమముగల తరగతులనేగాక, చిత్రలేఖనము, భగవద్గీతా పరీక్షలు, సంస్కృతము, ప్రాథమిక చికిత్స, కవిత, బోధకవిద్య, పోటీపరీక్షలు, పత్రికారచన, ఖేలనాది వినోదములు, వక్తృత్వము, వ్యాసరచన, గ్రంథనిలయము, పఠనమందిరము, సంగీతము, గృహనిర్వాహకశాస్త్రము, నాట్యకళ, వ్యాయామము, గరల్ గైడు, బ్లూబర్డు మొదలగు ఇవి యవి యన నేల సకలాంగ శోభితముగ లలితకళలన్నింటికిని తగు విధమైన స్థానమును కల్పించి, ఆంధ్ర ప్రపంచమున నాదర్శప్రాయలైన సతులను, మాతలనుగా తయారుజేయుటకై తాము సల్పిన కృషి, పాఠశాల చరిత్రమునందు, సువర్ణాక్షరములతో లిఖింపతగినదని నుడివిన, స్తుతిపాఠము గాజాలదని నొక్కిచెప్పుచున్నాము ఇవియ మా బాలికా హృదయభక్తి వల్లీ సముల్లసిత వాక్ప్రసూనములు,

తమకు పరమేశ్వరుడు, దీర్ఘాయురారోగ్యములను బ్రసాదించుగాక !

బాలికోన్నత పాఠశాలా విద్యార్థినులు

నారాయణగూడెం హై. ద.

## 25

విద్యాభిమానీ ! "యత్ర నార్యంతు పూజ్యంతే రమంతే తత్రదేవతా" అనిగదా ఆర్యోక్తి. మహిళాజనము సంఘమునందు పూజ్యస్థానము పొందుటకు వారు విద్యావివేక వంతులయి ఉండవలయును అట్టిపరిస్థితుల కాల వాల మయినప్పుడే సంఘము సంపూర్ణ సభ్యతా విశిష్టతను గడిం

పగలదు. ఇత్యాది భావపరంపరలను ప్రచారముచేసి తమరు ఆంధ్రజాతిని మేల్కొల్పియున్నారు. నిజాంరాష్ట్రాంధ్ర భూభాగమునకు తమరు వైతాళికులయి విరాజిల్లు చున్నారు.

పండితాగ్రణీ! తమ స్త్రీ విద్యాభిమానము అనుపమాన మయినట్టిది. తమ ఆంధ్రభాషాభిమానము అపార మయినట్టిది. ఆంధ్రబాలికల విద్యావిధానములో మాతృభాషకు ప్రాధాన్యమిచ్చుచు, తమరు జూపిన మార్గము సవ్యమైనది. స్త్రీ జనోద్ధరణమునకు తాముచేసిన కృషి అమిత మయినట్టిది. తమ ఆంధ్రమహాసభ ఆంధ్రజనమందారమై ఆంధ్రుల గౌరవ మినుమడింపజేసినది. తాము కావించిన ప్రబోధము, కలిగించిన జాగృతి ప్రత్యాంధ్రుని హృదయమును స్పందించునట్లు చేసినది. తమరు అజరామరులయినారు. తమ జీవితము ధన్యమయినది.

నాయకాగ్రణీ! తమరు నోరు విప్పిననాటనుండి, కలము నాడించిన నాటనుండి తెలంగాణములో మహా తేజఃపుంజ మొక్కటి ప్రకాశమానమైనది ఆ తేజఃపుంజములోని యొకకిరణమే స్త్రీ విద్య. ఇప్పుడు ఆంధ్ర గృహములను, ఆంధ్రసంఘమును కాంతి మంతము చేయుచున్న దాకిరణమే. ఆ కిరణజ్యోతి మాకన్నులను దెరచినది. కర్తవ్యమును బోధించినది. మా సావిత్రీ కన్యా పాఠశాల జననమునకు కారణమైనది.

ఆంధ్రపితామహా! తాము స్థాపించిన బాలికల ఉన్నత పాఠశాల, ఆదర్శముగా నిడుకొని, మా సావిత్రీ కన్యామాధ్యమిక పాఠశాల 4 సంవత్సరముల బాలిక, తమ ఆశీర్వాదముల నూతగాగొని తన రూపు రేఖలను దిద్దుకొనుచున్నది. తమ షష్టిపూర్త్యుత్సవ శుభ సందర్భమున మా పాఠశాల బాలికలును సభ్యులును తమ యానందమును ప్రకటించుచున్నారు. ఇవే మా జోహారులు. అందు కొనుడు.

పరమేశ్వరుడు తమకు సకల శ్రేయస్సులనుగురిపించుగాక!

అ. పురుషోత్తమరావు (కార్యదర్శి)
సావిత్రీ కన్యామాధ్యమిక పాఠశాల, కిషన్‌గంజు, హై. ద.

## 26

ఆర్యవర్యా! తాము ఆంధ్రులపాలిటి కల్పతరువై పూర్వము, శ్రీకృష్ణదేవరాయలు, మనుమసిద్ధి మొదలగు రాజులకాలముతోనే అంతరించి పోయిన ఆంధ్రమును, పునరుద్ధారణగావించి ఆంధ్ర పితామహులనునామమును సార్థకపరచి నిజాంరాష్ట్ర ఆంధ్రులయొక్కయు, ఆంధ్రజాతియొక్కయు కొరతను దీర్చినవారై తిరి.

ఇందులకు తార్కాణముగా మీ ప్రోద్బలమువలన అనేక ఆంధ్రసంస్థలు దినదినాభివృద్ధి గాంచుట యెల్లరకు విదితమైయున్నది.

ముఖ్యముగా తమకుగల స్త్రీ విద్యాభిమానము వర్ణనాతీతము. తమయొక్క ప్రోద్బలము వలన పాఠశాలలు స్థాపింపబడి అనేక మంది బాలికలకు విద్యాదానము జేసి వారలలోని అజ్ఞానాంధకారమును పారదోలితిరి.

ఇతర పాఠశాలలతోపాటు మా పాఠశాలయు సుమారు పదహారు సంవత్సరములుగా స్థాపింపబడి దినదినాభివృద్ధిగాంచు చుండుటకు విద్యాభివృద్ధికై తగుసమయములయందు తగిన సలహాలనొసంగి బాలికల ఉన్నతపాఠశాల నారాయణగూడెంలో జరుగు ఉత్సవసందర్భములలో ఈ పాఠశాలను ఆహ్వానించి పైపాఠశాల వారలతో పాఠశాలపరీక్షలు జరిపించుచు ప్రోత్సాహపరిచినందులకు మేమెంతయో కృతజ్ఞులమై యున్నారము.

ఈ తమ షష్టిపూర్త్యుత్సవము జరుగుభాగ్యము లభించినందులకు మా జీవితములు నేటికి ధన్యవంతములైనవి.

ఇంకను తమకు ప్రజాహిత కార్యములయందు సమయోచితములగు సలహాలను కార్యకర్తలకు నొసంగుచు ద్విగుణితోత్సాహముతో కార్యసాఫల్యతను కలుగజేయ శక్తిసామర్థ్యములను అనుగ్రహించి తమకు భగవంతుడు చిరాయురారోగ్యముల ప్రసాదించుగాకయని ప్రార్థించుచున్నారము.

ఆంధ్రబాలికా పాఠశాల
గొల్లకిడికి హై. ద.

## 27

ఆంధ్రోద్ధారకా! చిన్ననాటినుండి తాము ఆంధ్రుల అభివృద్ధికి తోడుపడుచు, మార్గదర్శకులై వారిని గాఢనిద్రనుండి మేల్కొలిపితిరి. ఆంధ్రులెల్లప్పటికి తమకు కృతజ్ఞతాబద్ధులై యున్నారు.

విద్యాప్రియా! చిన్నప్పటినుండి విద్యపై నుండినంత ప్రేమ మరేవిషయాంతరమందు లేదనుటకు తాము విర్మింపజేసిన ఆది హిందూ పాఠశాలలు ఆంధ్రబాలికోన్నత పాఠశాల, ఆంధ్ర విద్యాలయము మొదలగు పెక్కు బాలబాలికా పాఠశాలలలో కార్యనిర్వాహక సభ్యులుగాను, కార్యదర్శులుగాను ఉండుచు శక్తివంచనలేక వాటి యభివృద్ధికి తోడ్పడితిరి.

రాజకీయవేత్తా! రాజకీయ తరంగములు మీహృదయ సముద్రమునందు పొంగి పొరలుచున్న సంగతి సామాన్యప్రజకు తేటతెల్లము కాజాలదు. ఒకప్పుడు హైద్రాబాదు నగరమునందు తెలిసియో తెలియకనో సత్యాగ్రహోద్యమము బయలుదేరెను. అది మీకు అప్పటి పరిస్థితులనుబట్టి నచ్చకపోవచ్చును. కాని క్రమేణ అట్టి ఉద్యమము మీ హృదయము నాక్రమించెను. అప్పుడు తాము అన్ని సంస్థలకు స్వస్తిచెప్పి ముఖ్యమగు ఆంధ్రబాలికోన్నత పాఠశాలా కార్యదర్శిపదవిని కూడ నమ్మికగలవారికి ఒప్పజెప్పి సత్యాగ్రహోద్యమములో పాల్గొనుటకు సంసిద్ధులైతిరి.

అంతలో మహాత్మ గాంధిగారు సత్యాగ్రహ విరమణకు ఆజ్ఞనొసంగిరి. లేనియెడల తాము సత్యాగ్రహోద్యమములో మీరు స్వయంగాదిగి ఇంకెంతమందిని దింపేవారో అనుట అతిశయోక్తికాదు.

బొజ్జం నరసింహులు
ఆంధ్రపాఠశాల కార్యదర్శి, కాచిగూడెం హైద్రాబాదు

## 28

పూజ్యపితామహా! మీగుణగణములు వర్ణించుట సూర్యునికాంతిలో చిన్నదీపపుకాంతిగా తోచును. మీరుచేసినసేవ అమోఘము. మీరు ఆంధ్రులకొరకు చేయుచున్నసేవ యింతింతని వర్ణించనలవికాదు. మీరు నిజాంరాష్ట్రములో ఆంధ్రానికి ఉగ్గుపాలుపోసి పెంచుచున్న ఘనులు. మీ మూలాన్ని, ఆంధ్రమంటే యేమిటో ఈ నిజాంరాష్ట్రీయులకు తెలిసినది. మీకు మా పాఠశాల వారందరు కృతజ్ఞతా పూర్వకముగా వందనములర్పించి, మీకు ఆయురైశ్వర్య సర్వసిద్ధులు నొసంగుగాక యని ఆసర్వేశ్వరుని ప్రార్థించెదము.

కార్యనిర్వాహక సభ్యులు
శ్రీబాలా త్రిపురసుందరీ పాఠశాల లాల్‌దరవాజా, హై-ద

## 29

అమాత్యశేఖరా ! మీ వంశీయు లమాత్యశేఖరులై యుగంధర ప్రజ్ఞామరీణులై రాజకార్యధురంధరులై వన్నెకెక్కిన సుధీవిలయులు. మీ యందట్టి ప్రతిభావిశేషము వంశాగతమై మళోలితమై యున్నది. భావికాల్యాంగమున విది సుసార్థక్యముం బొందుగాత !

ఆంధ్రపితామహా ! మీ రాంధ్రసంఘ స్థాపనాచార్యులైన నాటనుండి, మీ ప్రోద్బల ప్రోత్సాహములు మీ ఆలోచన ఆశీర్వచనములు పొందని ఆంధ్ర సంస్థలు మన విజాంరాష్ట్రమున లేవనుటలో అతిశయోక్తి లేనేలేదు. ప్రతిసంస్థయు ఆంధ్రుడైన ప్రతివ్యక్తియు మీ షష్టిపూర్తికి కృతజ్ఞతా బద్ధాంజలి యగుట కడుంగడు విధాయక కర్తవ్యము.

నిగర్వశిరోమణీ ! మహానాయక లక్ష్యలక్షణాంచితుడవగు నీవు మృదుమధుర మందహాసాలావములతో ఒడుదొడుకులు లేవి సల్లాపములతో సహృదయుల హృదయముల రంజింపజేయు నీయహంతా శూన్యమైన పరమసాత్త్విక ప్రభావమునకు వేనవేలు మా జోహారులు !

మహానీయా ! నేడు మన ఆంధ్రావనికి కలిగిన యత్కించిన్మాత్ర చైతన్యమునకును వికాసమునకును విజ్ఞానమునకును మీరు కల్గించిన జాగృతియే విశ్చయమైన జాగ్రదవస్థకు హేతువైనదనుటలో యెవ్వరికి నభిప్రాయ భేదముఉండదని మా యభిప్రాయము. మీ సేవాప్రభావ మింకను ప్రజానీక మవగాహనము చేసికొనుగాత !

పూజనీయా ! విష్కామ కర్మయోగివైన నీద్వితీయ షష్టిపూర్త్యుత్సవమును స్వతంత్ర భారత ప్రజారాజ్యమున యావదాంధ్రుఖ ఇంతకు వేయి మడుంగల విరతిశయానందోత్సాహమున నల్పుదురుగాత. అని భగవాముని ప్రార్థించుచున్నాము.

జై ! ఆంధ్రపితామహునికి జై ! మాడపాటి హనుమంతరాయనికి జై !

శ్రీ శబ్దానుశాసన ఆంధ్ర భాషానిలయము

ఓరుగల్లు

## 30

తెలంగాణగ్రంథాలయోద్యమస్థాపకా ! తమ మాతృభాషాభక్తి, తమ భాషాసేవ, తమ యాంధ్రాభిమానము అత్యంత ప్రశంసాపాత్రము. తెలంగాణములో తాము గ్రంథాలయోద్యమమును స్థాపించి సాగించి వృద్ధికి తెచ్చినారు. కావున మా సంఘము తమకు ప్రత్యేకముగా జోహారు లర్పించుకొనుచున్నది.

తెలంగాణమునకు తమ సేవ యద్వితీయము తామే యిచ్చట ఆంధ్రోద్యమమును ప్రారంభించి యితరులకన్న చాలా వెనుకబడిన మన సోదరులలో జాగృతివి గలిగించి ధన్యులైనారు.

హైదరాబాదు సంస్థానములోని సోదరముల్కిభాషాద్వయమగు మహారాష్ట్ర కర్ణాట భాషలకు వలెనే యాంధ్రమునకును దీర్ఘదుర్దినము ఏర్పడినది. తమ సేవాభాస్కరకిరణప్రసారముచే ఆ మబ్బువిచ్చుకొని పోయి మరల మన మాతృభాష యుజ్జ్వలముగా ప్రకాశింపవలెనని యందరును దమరిని గోరుచున్నారు. అఖిలాంధ్రదేశము మీకు చేదోడు వాదోడుగా నుండగలదని మీతో మనవి చేసుకొనుచున్నాము.

మీరారంభించిన సదుద్యమము లన్నియు సుస్థిరాభ్యుదయములకై తమ యాశీస్సులను గోరు చున్నవి. మీకా పరాత్పరుడు సుదీర్ఘాయుస్సును సుస్థితిని సౌఖ్యమును ప్రసాదించుగాక! అని మేము సదా ప్రార్థించుచుందుము. చిత్తగింపగలరు.

ఆంధ్రదేశగ్రంథాలయ సంఘసభ్యులు
పటమటలంక (వయా బెజవాడ)

# 31

ఆంధ్రపుత్రా! మా నిజామాంధ్రమాత కడుపుచల్లని పుత్రుడవైన నీకు మా హృదయపూర్వక సన్మానము.

ఆంధ్రోద్యమనిర్వాహకా! ఒకానొకనాడు ఖండఖండాంతరములలో దమనాగరికతనువ్యాపిం పఁజేసి తాత్కాలికముగా నివురుగప్పిన నిప్పువలె నిద్రాణమై యున్న యాంధ్రశక్తులను మేలు కొలిపి, ప్రజ్వలింపజేసి, ఆంధ్రత్వమునకు ప్రాణప్రతిష్ఠ గావించిన నీకు మా ధన్యవాదములు.

మహిళోద్యమస్థాపకా! మహిళోద్యమము విస్తరిల్లి ననేగాని ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధి సాగిం పఁబడదని సర్వజ్ఞుండవైన నీవుగ్రహించి, ఆ నాడు రామమోహనుఁడు, విద్యాసాగరుడు, వీరేశ లింగము త్రొక్కిన త్రోవనే ఈనాడు త్రొక్కినందులకు, ఈరాష్ట్రములోని మహిళాలోకము తన కృతజ్ఞతను వెల్లడించుచున్నది.

ఆంధ్రసోదరా! ఆ జన్మసేవా బద్ధకంకణుండవైన నీకు భగవంతుడు దీర్ఘాయురారోగ్యసంప దలనొసగి యింకను చిరకాలము ఆంధ్రమాతకు సేవయొనర్చునట్లు జేయుగాకయని ప్రార్థించు చున్నాము.

నిజాంరాష్ట్రాంధ్రమహిళాసభ

# 32

మహిళాభ్యుదయకాంక్షీ! మహిళా ప్రపంచమునకు మీరు గావించిన సేవ యనుపమానము. మీ చల్లని కరపల్లవములచే నెలకొల్పబడి దినదిన ప్రవర్ధమానమగుచు స్త్రీలోకమున నుత్తమ విద్యాప్రచారము గావించుచున్న బాలికా పాఠశాలలే యిందుకు నిదర్శనము. తెలంగాణపు వనితా సమాజమున కల్గిన జాగృతికి మీ యఖండ కృషియే ప్రధాన హేతువు. రామమోహనరాయలు, కార్వేపండితుడు, వీరేశలింగము పంతులు మున్నగు స్త్రీ జనోద్ధారకులగు మహాపురుషుల శ్రేణిలో మీ కర్హస్థానముగలదు. స్త్రీల ఆరోగ్య విద్యాభివృద్ధికై ఈ పరిషత్తుసేయు అల్పసేవ ఆంధ్రపితా మహులగు మీ యాశీస్సులకు, పాత్రమగుట దీని పురోభివృద్ధికి సూచకమని విశ్వసించు చున్నాము.

ఆంధ్రపితామహా! మీ షష్టిపూర్తి మహోత్సవము ఆంధ్రజాతికి పండుగ. మీకుజేయు సన్మా నము ఆంధ్రజాతి తనకుదా జేసికొనెడి సన్మానము. స్త్రీల ఆరోగ్య విద్యాపరిషత్సభ్యులమగు మేము ఈ మహోత్సవములో బాల్గొని మీకు సన్మానపత్రము సమర్పించి హార్దికానందమును తెలుపుకొనుచున్నాము. మీకు సర్వేశ్వరుడు సంపూర్ణాయురారోగ్యైశ్వర్యాభివృద్ధుల నొసంగి రక్షించుగాక!

స్త్రీల ఆరోగ్య విద్యాపరిషత్తు

## 33

ఆర్యా! తాము వకీలువృత్తి నవలంబించి యుండినవారైనను పత్రికా సంపాదకుల వర్గములో కూడ చేరినట్టివారే. తాము "తెలంగాణ" దినపత్రికను స్థాపించుటకై మొట్టమొదట సెలవు పొందియుంటిరి. కాని పరిస్థితులు వేరయ్యెను.

తాము ౨౫ ఏండ్లనుండియు తరచు పత్రికలకు వ్రాస్తూవచ్చినారు. హైదరాబాదులోని తెనుగు నీలగిరి పత్రికలకు తాము సహాయపడియుంటిరి. సుజాతపత్రిక తమ ప్రోద్బలమువల్లనే అస్తిత్వములోనికి వచ్చెను. దాన్ని నడిపినముగ్గురిలో తామొకరని మాకు తెలిసిన విషయమేకదా!

తాము ఉర్దూలోను తెలుగులోను నవ్యసాచులు. తమరు ఉర్దూ దినపత్రికలలో ప్రతిదినము వ్రాయుచుండుట అందరెరిగిన రహస్యమేసుమా. తాము మరాటిభాషను కూడా ఎరుగుదురు. అవసరమైనప్పుడు మరాటీవ్యాసాలను తమచే తర్జుమాచేయించి మేము ప్రకటించుకొన్నందున తమకు మరాటీ పాండిత్యము కలదన్నది ఈ సందర్భములో అందరికీ తెలుపుకొంటున్నాము.

మేము గోలకొండ పత్రికను స్థాపించిననాడు దీనిని వారపత్రికగానే ప్రారంబింపదలచితిమి. కాని తామిట్లంటిరి "తెనుగు నీలగిరి అనురెండు వారపత్రికలు కలవు. వాటికి మీరు పోటీ పడిన వారగుదురు. అది కూడదు. మీరు అర్ధవార పత్రికను ప్రారంభింపుడు" దీన్నిబట్టి తమకు సోదరాంధ్రపత్రికలపై ఎంతటి అభిమానమున్నదో వ్యక్తమగును. తమ అభిప్రాయముపై మేమిట్లని యుంటిమి "అర్ధవారపత్రికను భరించగలశక్తి మాకు లేదు." అందుపై తాము ఒకటి రెండేండ్లు సహాయపడుటకు మాటయిచ్చి అట్లేమాటను నిలుపుకొంటిరి. తాము మా పాలకవర్గములో ఆదినుండియు ఉండి సహాయ పడుతూ వచ్చినారు.

తమ షష్టిపూర్తి సందర్భములో మా ఆనందము తెలుపుకొంటూ తాము వైదికాశీర్వాద రీత్యా శతమాన దీర్ఘాయుష్మంతులై దేశసేవజేసి ఆంధ్రాభ్యుదయమునకు ముఖ్యులై యుండగలరని పరమేశ్వరుని ప్రార్థించుతున్నాము.

చిత్తగించ గలరు

గోలకొండ పత్రికా పాలకవర్గము

## 34

ఉ॥ శ్రీమహితాన్వితాభ్యుదయ శీలవివేక విచారుఁ, డాంధ్రలో
కామలమానసస్ఫురిత హంసము, కార్యవిభావిభావసుం,
డామలయాద్రిశీతల దయార్ద్రహృదాబ్జుఁడు, దెల్గుదేశపు
న్నోముల పంటనావెలసె సూర్ల హనుమంతుఁ డగ్రతన్

శా॥ సేవారూపముఁజూపి యాంధ్రులను శిక్షింపన్నుపాధ్యాయుఁడై
ప్రావీణ్యంబున సంఘసంఘటనముల్, గ్రంథాలయస్థాపనా
భావోద్రేకము, బాలికా పఠన సంభావ్యోత్సుకత్వంబునుం
దావుల్ జేరగజేసె నీతెలుగు రాష్ట్రంబందు దీక్షామతిన్.

మ॥ ఇనవంశోత్తము కార్యసాధనకు మున్నీతెల్గు దేశాన దా
జననంబందిన వాయుసూనుఁడతి తేజశ్శాలియాంధ్రోద్యమం

బునుబూరింవగ మాడపాటి గృహసంభూతుండునై నేటికిన్
హనుమంతాఖ్యనె జెన్నుమీరె నిట షష్ట్యబ్దంబు లత్యున్నతిన్

తే. గీ॥ తొలుత గ్రంథాలయంబులు దెలుగు పత్రి । కలును సంఘముల్ బుట్టె నీ కన్నుసన్న ।
నేడు పరిషత్తులెన్నియో నెలవుగాంచె । నాంధ్ర పైతామహుండవంట యబ్బురంబె.

తే. గీ॥ తెలుగుసామ్రాజ్యమనవట్టి కొలనునందు । వికసితాంబుజ రూపమై వెలసియుంట
సంఘషట్పద సంఘముల్ సాభిలాష । బాయకుండెదు హనుమంతరాయ ! విన్ము

చ॥ వరలువిజాము రాష్ట్రమున వైష్ణవసంఘము వేదసత్క్రియా
చరణకు ప్రోత్సహించు బహుశాఖలతోడ నపారవాక్సుధా
భరణుడు మాడపాటికుల భానుడు యోచనలందు బాల్గొనన్
వరపురుషోత్తముం డతడు వర్థిలుగావుత పెక్కువత్సరాల్.

సీ॥ అతిశాంతుడగునైన నతుల ధర్మక్రియా - పాలనామృదుల శార్దూలమితడు
బాపిసత్వము బాప బరిత ప్తుడగునైన - వనవసాదమున మహర్షియితడు
సర్వానుకూల్య ప్రశస్తవర్తనుడైన - నాగ్రహించినచో " మహాత్ముడ " డితడు
పురుషార్థములతోడ పురుడించువాడైన - ధారవోసిన బలి వీరుడితడు.

గీ॥ నాగకీర్తివి జేకొన్నన్యాయమూర్తి - మాడపాటిహనుమంతుడోడకుండ
జిరతరాయువుగవి ప్రజాసేవజేయ - వైష్ణవుల శుభాశీస్సులు వరలుగాక.

నిజాంరాష్ట్ర శ్రీవైష్ణవసంఘము

# 35

మహాశయా ! నేటిదినము నిజాంరాష్ట్రాంధ్రులెల్లరకు సుదినము. మీ షష్టిపూర్త్యుత్సవము జరుపు భాగ్యావకాశము కలిగించిన పరమేశ్వరునకు ధన్యవాదములు.

త్యాగమూర్తీ ! తాము దేశసేవ మరియు మానవాభ్యుదయమే తమ జీవిత పరమావధిగ నెంచి స్వార్థరహితులై దాదాపు నలువది వత్సరములనుండి నిజాంరాష్ట్రాంధ్రుల సాంఘిక, నైతిక, వైజ్ఞానిక, ఆర్థిక, మరియు రాజకీయాభి వృద్ధికై చేసినసేవ యమోఘము, అప్రతిహతము. కావున మీ కృషి స్వర్ణాక్షరములచే లిఖించబడి మీ కీర్తి ఆచంద్రతారార్కము వర్ధిల్లుగాక !

సర్వవ్యాపకుడగు భగవానుడు మీకు చిరాయువు నొసగుగాక !

జె. ఆదినారాయణగుప్త
అధ్యక్షుడు
నిజాంరాష్ట్రార్యవైశ్య యువజనసంఘము

# 36

ఆంధ్రనాయకా ! నీవు నెలకొల్పిన ఆంధ్రోద్యమ ప్రభావమున రాజకీయచైతన్యముతోబాటు సాంఘికచైతన్యముకూడ ఎంతోగలిగిన దనుటకు నేడు తెలంగాణమున తలసూపిన అసంఖ్యాకములైన సాంఘిక సంస్థలేసాక్షి. మహోద్యమముద్వారా నీవుగావించిన మేలునకు మావర్తక జాతి సర్వదా కృతజ్ఞతాబద్ధమైయున్నది. మీ ప్రోత్సాహ ఫలితమువనే నేడీవసతిగృహము జరుగుచున్నది. నీకు జరుగుచున్న యీ షష్టిపూర్తిమహోత్సవ గౌరవము ఆంధ్రజాతి తనకుదాను గావించుకొనుచున్న సన్మానమే. నీవు ఆంధ్రలోకమునకు ఆత్మవంటివాడవనిన అతిశయోక్తిగాదు. ఈ యుత్సవ సమయమున ఇవే మా ప్రేమపూర్వకాభివందనములు.

మహనీయచరితా ! మీ జీవితము ఆదర్శప్రాయము. మీ ఆకాంక్ష అఖిలాంధ్రకల్యాణము. దేశ సేవాదీక్షలో అడుగుపదులుగడిపి ఆంధ్రుల హృదయ పీఠికల నధిష్ఠించి ఆంధ్రపితామహ బిరుదమును అన్వర్థమొనరించుకొనిన అమలచరితులైనవు. మీకు సర్వేశ్వరుడు శతాయురారోగ్యములను సకలసంపదలను ఒసగి రక్షించుగాక !

విజాంరాష్ట్ర వైశ్యవిద్యార్థిగృహము 

బిజ్జాల పెద్దవీరయ్యగుప్త (అధ్యక్షుడు)
కొత్తూరు శీతయ్యగుప్త
పద్మ బొంతయ్యగుప్త
కార్యదర్శులు

## 37

ఆంధ్రపురుషపుంగవా ! తెలుగు ప్రాంతములందు ఆంధ్రోద్యమ బీజాంకురమును మీ హస్తములతో నాటి ఆ మొక్కకు యే అంతరాయములు గలుగకుండా కాపాడి పెంచి పెద్దజేసి ఆంధ్ర భూభాగమును మేలుకొల్పి విజాంరాష్ట్ర ప్రజలకు మే మాంధ్రులమను ఆత్మజ్ఞానమును ప్రసాదించిన మీకు మా నమస్కారములు.

ఆంధ్రనాయకా ! కీర్తిశేషులైన కొమర్రాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావుగారలతో పాటు ౧౯౦౧ వ సంవత్సరమున గావించిన శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయ స్థాపనమే మీ దేశారాధనకు ప్రాతిపదికము. నేటివరకు గావించుచుండిన ఆంధ్రభాషాసేవ కొనియాడదగినది. ఆ సేవ వలననే "ఇతరులచే నిరసింపబడుచున్న తెలుగుభాషకు" ఆంధ్రులయందును ఆంధ్రేతరుల యందును నేటి పలుకుబడియును గౌరవమును లభించినవి. ఇట్టి మీ అకుంఠితమైన కృషిని పల్లెలలోగల గ్రంథాలయములే వక్కాణించుచున్నవి. ఆంధ్ర ఉద్యమము యెడ మీకుగల స్థిరసంకల్పము మీరు వసించు సౌధ అగ్రభాగమున లిఖించిన ఆంధ్రకుటీరమే సాక్ష్యమిచ్చుచున్నది. మరియు సార్థకమగుచున్నది.

ఆంధ్రపితామహా ! ఆంధ్రులయందు ఐక్యతయు ఆంధ్రుల సర్వోన్నతులకై పాటుబడుట ఇట్టి ఆశయములు దృష్టియందుంచుకొని మీరు స్థాపించిన ఆంధ్రజన కేంద్రసంఘమే ఆంధ్రమహాసభగా మారి జీవంతమగు ప్రజా సంస్థలలో ముఖ్యస్థానము వహించి మూడు ప్రాంతీయ మహాసభలలో అగ్రగణ్యమై ఈ రాష్ట్రములోని ప్రజాశక్తికి ప్రధానమైనదని మేము గర్వించుచున్నాము. ఆంధ్రుల గౌరవమునకు మీరే కారకులు.

ఈ రాష్ట్రములోని విద్యావిషయిక, సాంఘిక, ఆర్థిక, రాజకీయాది సర్వతో ముఖములగు వివిధ సంస్థలన్నియు మీ నిస్వార్థమగు సేవకు ఋణపడియున్నవి. కీర్తి ప్రతిష్ఠలను వదలివేసి త్యాగశీలురై నియమబద్ధులై నిరంతరాయముగా దేశక్షేమమునకై కృషి సల్పుచుండిన మీకు మా వందనము లర్పించుచున్నాము.

ఆంధ్రశిఖామణీ ! తాము నాటిన మొక్కలు పుష్ప ఫల భరితములై మీరు భావనా ప్రపంచమున గమచుండు దృశ్యములు యదార్థమై పరిణమించుటయే మీ జీవిత ఆదర్శము. మా గమ్యస్థానము గూడా ఇదియే. తీవ్రగమనమున మారుచుండు ఈ ప్రపంచముయొక్క పరిస్థితులలో ఈ రాష్ట్రమునందలి ప్రజోద్యమములకు సలహాలను కార్యకర్తల కొసగి ధైర్య ఉత్సాహములతోపాటు కార్య

దీక్షను సంఘటనా పాటవమును గలుగజేయు శక్తిసామర్థ్యములను ప్రసాదించుటకై మీకు ఆ విరాడ్విశ్వకర్మభగవానుడు ఆయురారోగ్యములు నొసంగుగాకయని ప్రార్థించుచున్నాము.

విశ్వబ్రాహ్మణ సేవాసంఘము

హైద్రాబాదు

# 38

నాయకాగ్రణీ! ఒకవైపు విద్యావిజ్ఞానములేమి, గాఢాంధకారమయమైనతెలంగాణము, మాతృభాషను క్రూరముగా గాయపరిచిన నిజాంప్రభుత్వ విద్యావిధానమొకవైపు, తెనుగు ప్రజలు విద్యావిజ్ఞానములేవి కారణమున, వారిసాంఘికజీవనం మురికికుళ్ళుతో బాధపడుచుండుట వేరొకవైపు పరాయిప్రభుత్వ నిరంకుశ పరిపాలనా విధానమున, ప్రజలువ్యక్తిత్వవాక్స్వాతంత్ర్యములేవి, కష్టజీవులయిన మూగప్రజలు వింకొక వైపు, ఇది నాటి మన రాష్ట్రీయ ప్రజాజీవితం.

సూత్రధారీ! ఇట్టి కారుమబ్బులోని ప్రజాజీవితాన్ని కాంతివంతమొనర్చుటకై, తాముకంకణబద్ధులై, గ్రంథాలయోద్యమము నొకవైపు స్త్రీవిద్యా, బాలికాపాఠశాలల స్థాపన వింకొకవైపు నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభ స్థాపించుటయు, నగరనగర గ్రామగ్రామమున, ప్రబోధనసభల ద్వారా మేల్కొలుపబడుట మరొకవైపు, వారివి యెల్లవేళల చైతన్యపరుచుటకుగాను 'తెలంగాణ' యను దినపత్రిక, ఈరాష్ట్రమునకు చరిత్రాత్మకమైన మీనిరంతర కృషిద్వారాయే గదా!

తెలుగుపితామహా! తాము నాడు నాటిన బీజములుమొక్కలై వివిధరూపకముగ శాఖోపశాఖలుగామారి, పుష్పఫలపత్రములంది, మహావృక్షములవలె మిన్నుకందుచున్న, మీ మహోద్యమము ద్వారా ప్రజలు విద్యాగంధమునెరింగి, వారివారి బాధ్యతలను గుర్తెరింగి సాంఘికకుళ్లను తుదముట్టించుచు నేడురాజకీయచైతన్యమునుబొంది ,పజఇతమ హక్కులకు ప్రభుత్వముతో బోరాడుచుండుటకు కారణముమీరేగదా! ఇట్టి పవిత్ర సత్కార్యసాధకులగు ఆంధ్రపితామహులైన తమ షష్టిమహోత్సవసందర్భమున సన్మానమొనర్చు భాగ్యము సికింద్రాబాదు విశ్వబ్రాహ్మణ ప్రజలకు లభించుటకెంతయో కృతజ్ఞులము. ఇవియే మాసంఘపక్షాన జోహారులు.

విశ్వబ్రాహ్మణ సేవాసంఘం

సికింద్రాబాద్

# 39

శ్రీమాడపాటికులాబ్ధికలానిధీ! హనుమంతరాయ సుధీ! నిజాంరాష్ట్రాంధ్రదేశమునకు కాంతిలోనూడిన, ధైర్యసాహసములతో జేసిన మీసేవ, మీరు జూపిన బుద్ధికుశలత, మీకార్యదీక్ష, వేనోళ్ళ బొగడదగినవి. మీ త్యాగము, మీ సహనము మీ సౌభ్రాతృత్వము మరువదగినవి కావు. మరచెదమన్నను మా ప్రతిచలనమున జూపున కగపడునట్టి మీ రొనర్చిన ఘనకార్యముల రూపములు మరువనీయవు.

ఆంధ్రోద్యమపితామహా! నిజాంరాష్ట్రాంధ్రదేశమున నెద్దియో, ఆంధ్రులన నెవ్వరో దెలియని మా హృదయములందు ఆంధ్రోద్యమ బీజమునాటితిరి. అంకురమునకు దోహదమొసంగుచు జాగరూకతతో కాపాడితిరి. అయ్యది వృక్షమై శాఖోపశాఖలు గలిగి ఫలించుచున్నది. తద్వార నెందరినో హనుమంతరాయల సృష్టింపగలిగితిరి.

మా ఆంధ్రదేశభట్టబ్రాహ్మణసంస్థ బీజముకూడ, యితర ఆంధ్రసంస్థలతోపాటు మీచే కృషి చేయబడిన ఆంధ్రభూమియందు నాటుకోబడినది. అయ్యది అంకురించి మీశక్తిసామర్థ్యములతో నిర్మించిన స్థిరజల పూరిత వాపీదోహదముచే వృద్ధిబొందుచున్నది. మీ పాలేర్లు, మీభాగరులే, ఆయంకురములమధ్య సేద్యముజేయుచు కలుపునాశనమొనర్చుచు రక్షించుచున్నారు.

ఆంధ్రమాతసుపుత్రమా! నేటి మీ షష్టిపూర్తిని గురించిన యుత్సవము, మీగౌరవమునకు చాలినదనజాలము. కేవలము మాభక్తివిశ్వాసములను సమిష్టిగా వెళ్ళడించుకొనుటకుజూపిన మా కించిదుత్సాహము. మా ఆంధ్రసంస్థలన్నియు, మీ సదుపదేశముల బొందుచు, మీ అన్వేషణక్రింద వృద్ధిబొందుటకు, పరాత్పరుడు మిమ్ము చిరాయువుగానుంచుటకు ప్రార్థించుచున్నాము. మీరు మా సంస్థల నాశీర్వదింపుడు.

ఆంధ్రదేశభట్టబ్రాహ్మణమహాసభ
హైదరాబాదు, దక్కన్.

## 40

ఆంధ్రపితామహా! వందనములు. నేడు రాష్ట్రీయాంధ్రలోకమునకు సుదినము. ఆనందదినము. సర్వసుఖముల ననుభవించుచు, ఇతర లోకముతోపాటు ఉద్యోగ సోపానములనెక్కి విశేషధనార్జనము చేయవలసిన యౌవనదశయందే తాము దేశసేవారంగమున కాలిడి రాష్ట్రమందు చేసిన నిరుపమాన సేవనుగూర్చి కొనియాడుట చర్విత చర్వణమే యగును. అట్లని యూరకుండుట కృతఘ్నతకు మించిన మహాద్రోహమనినను సత్యదూరముకాదు. కావున నేటి యానందోత్సవ సమయమున మా మనస్సులలో రేకెత్తిన భక్తివిశ్వాసములను ప్రకటించుటయే మా యీ యుద్యముయొక్క ఉద్దేశము.

నాయకాగ్రణీ! తెలంగాణము రాజకీయముగనేమి, వైజ్ఞానికముగనేమి, ఇతర విధములనేమి నిద్రామగ్నమైయున్నకాలమున దేశక్షేమమునుగోరి సేవారంగమునకురికి ఊరూరికి పల్లెపల్లెకు తిరిగి ప్రజా సామాన్యమునకు చైతన్యము కలిగించిన తమ యువక ప్రతిభ అమేయమనినచో అది ముఖస్తుతి యని తలంపకుందురుగాక

అభినవయుగంధరా! ప్రజలలో రాజకీయ వైజ్ఞానిక చైతన్యమును కలిగింపగోరి ఆ పద్ధతులకై సుదూరమాలోచించి గ్రంథాలయోద్యమ రూపమున తామెత్తినయెత్తు నేడు నానాముఖముల విస్తరిల్లి బ్రహ్మాండమైపోయినది. నేడు రాష్ట్రములో తలయెత్తి, ఉవ్వెత్తుగ విజృంభించుచున్న సాంఘిక, వైజ్ఞానిక, రాజకీయోద్యమములన్నియు ఆనాటి మీ వ్యూహ రచనావిధానమువలన గలిగిన ఫలములేకదా! తమలోని అభినవ యుగంధరత్వమున కింతకంటె పరమోదాహరణము వేరొకటేల?

తెలంగాణపుగాంధీజీ! తమను ఈపేర సంబోధించుట కొందరకు విడ్డూరముగను మరికొందరకు వికటముగను కన్పట్టవచ్చును. కాని యట్టిసంబోధనమే కృతజ్ఞతకు సరియగు లక్షణమని మా యాశయము! ఏలయన మహాత్ముడు జేసినదియు, చేయుచున్నదియు సకల ప్రజాక్షేమ చర్యయే కాని కేవల మొక కులమునకు గ్రామమునకు మాత్రమే కాదు. స్థానికముగానేమి, తెలంగాణమునందితర ప్రదేశములందేమి నేడు తలయెత్తియున్న విద్యాసంస్థలు గ్రంథాలయ సంస్థలు, రాజకీయ సంఘములు, సంస్కారోద్యమ సంఘములును పతిత కులసముద్ధరణ సంఘములును తమ యాశీస్సులనుపొంది తమ యుదారాశయముల నాదర్శముగా గొనుచునే వర్థిల్లుచున్నవి.

కులమత ఆచారభేదములను పాటింపని మీ యుదారహృదయమే రాష్ట్రీయాంధ్రలోకమునకు మంగళజ్యోతియైనది. ఆ సమాన సౌభ్రాతృత్వమే మిమ్ము ప్రజలలో తలనాయకగ జేసినది. ఇంతియేకాదు. ప్రజలకు, ప్రభుత్వమునకు నడుమ సూత్రధారులై ఉభయపక్షముల మనస్తత్వములను తమలో జీర్ణింపజేసికొని, అటు ప్రభుత్వమునకు సదేష్టగను, ఇటు ప్రజలకు నాయక శిరోమణిగను విలసిల్లి తాముజేసిన ఉదారసేవకు తెలంగాణపు గాంధిత్వము సహజభూషణమని విశ్వసింతుము.

సర్వసమవర్తీ ! రాష్ట్రములోని తక్కిన కులసంఘములతోపాటు మా రెడ్డి సంఘమునకు గూడ సర్వరంగములలో చేయూతనిచ్చి ఆత్మవిశ్వాస వికాసములను పెంపొందించిన తమకు మా సంఘము ధన్యవాదము లర్పించుచున్నది.

ఈ యుత్సవములలో క్రొత్తందనము నందియున్న తమ తులాభారోత్సవము ప్రజలకు ఆనందదాయకమై విలసిల్లగలదు. తాము ఇతోధిక యుర్వ్యాభ్యుదయమునొందుచు క్రమముగ వజ్రోత్సవ శతాయురుత్సవాదుల ననుభవించునట్లును ఆనంద శాంతిమయమగు తమ భావిజీవితమువలన దేశీయులు అధికాధిక లాభములనందునట్లును భగవంతుడు మిమ్మనుగ్రహింప ప్రార్థించుచున్నాము.

రెడ్డి జనసంఘ సభ్యులు
అలియాబాద హైద్రాబాద దక్షిణ

# 41

పూజ్య శ్రీపితామహా ! వందనములు. నేడు దేశీయయువజన సమూహమునకెల్ల ప్రతిజ్ఞోత్సవదినము. తమదేశభక్తిమయమగు జీవితమున నేటి ఈ యుత్సవము మధ్యాంకముపడగియున్నది. "గతానుగతికో లోకః" అని నట్లుగాక తాము తమ యౌవనదశయందే యుద్యోగవాంఛలను కాలదన్ని దేశసేవకై నడుముబిగించుట యుదార్ధమగు వీరవ్రతమే యనదగును. తమ యావీరవ్రతము దేశీయయువజనులకెల్ల నుపాస్యమనుట సత్యము. నేడు రాష్ట్రమున సర్వతోముఖముగ జాగృతమైయున్న యువజన ప్రతిభకు తమ యాదర్శజీవితమే జన్మస్థానమనిన యతిశయోక్తి కాజాలదు.

సర్వశ్రేయోభిలాషీ ! సర్వజీవిత రంగములయందును దేశాభ్యున్నతియె తమకు వాంఛనీయమగుట దేశముగుర్తించినది. సర్వసంఘములలో విద్యా, వైజ్ఞానిక, నైతిక, సాంఘికాది విషయములలో అభ్యుదయసాధనమే తమ సేవావ్రతమునకు పరమలక్ష్యమనుటకు ప్రమాణములు అనేకములు గలవు. ఆంధ్రమహాసభ, బాలికాపాఠశాల, రెడ్డిహాస్టలు, గోలకొండపత్రిక, కృష్ణరాయ, బాలసరస్వత్యాది గ్రంధాలయములు ఇవి యవి యననేల రాష్ట్రమునందలి ఆంధ్రభూభాగమునగల సర్వసంస్థలును తమ యుదారాదర్శములను, ఆశీస్సులను అండగా గొనియే వర్ధిల్లుచున్నవి. తెలంగాణములో మొలచిన, మొలచుచున్న ప్రతి ఉద్యమముగూడ తమ గంభీరోపదేశమును కొనిననేగాని ముందడుగునకు సిద్ధపడుటలేదనిన తమసేవానిరతికి వేరొకప్రమాణమేల!

మహాత్మా ! మా రెడ్డిహాస్టలు విద్యార్థిగణము సాముదాయికముగను, వ్యక్తిగతముగను గూడ తమకు జీవితాంతము కృతజ్ఞతాబద్ధమై యుండకతప్పదు. ఏలయన రెడ్డిహాస్టలు జీవితచరిత్రమునకు శ్రీశ్రీ రాజబహద్దరుగారితోపాటు తాముకూడ ప్రముఖ భూమికను నిర్వహించుచు విద్యార్థి జీవితరథమునకు సూత్రధారులై యున్నారని యెరుంగుదుము. రెడ్డిహాస్టలు జీవితారంభము మొదలు

నేటివరకును అలసట యెరుంగక అవసరము వచ్చినప్పుడెల్ల హాస్టలు పురోభివృద్ధికి తగిన కార్యములలో తాము పాల్గొనుటయే తమ సర్వ సమభావమునకు తార్కాణము.

తమ యువక జీవితము యువకమండలికివి తమ వార్ధకజీవితము వృద్ధగణమునకును పరమా దర్శమును, అవశ్యాచరణీయమును అగునని భావించుచున్నాము.

శాంతినిధానా! తమ యీ షష్టిపూర్త్యుత్సవము, వజ్రోత్సవ, శతాయుసుత్సవాదులకు దారితీయుఁగాక! తమ భావిజీవితము ఇతోధికముగ దేశ సౌభాగ్యదాయకమగునట్లును, తమ గత జీవితము నేటి యువజనావళికి కార్యశూరత్వమును కలుపునట్లును, తమకు సంపూర్ణాయురారోగ్య ముల ప్రసాదించి అనుగ్రహించునట్లును భగవానుని మా సంఘమువారము హృదయపూర్వక ముగ ప్రార్థించుచున్నారము.

జయవిజయీభవ! దిగ్విజయీభవ!!

రెడ్డిహాస్టలు యువజన విద్యార్థిసంఘము
హైద్రాబాదు, దక్కన్.

## 42

ఆంధ్రనాయకా! నిజామురాష్ట్రాంధ్ర జనులు తమ నిర్వ్యాజసేవా విశేషములను గమనించి కృత జ్ఞతా పూర్వకముగ తమ వయః కాలగణనానుసారము నేడు చేయుచున్నషష్టి పూర్త్యుత్సవ సంద ర్భమున సోమక్షత్రియ సంఘ పక్షమున తమకు జోహారులు సమర్పించు కొనుచున్నారము.

ఆంధ్రసోదరా! తమ భావనా బలవిశేషము చేతను, తమ దేశపరాయణత్వము, రాజభక్తి, త్యాగశీలత, వివేచనాధురంధరత్వము చేతను స్థాపితమైన "ఆంధ్రమహాసభ" ఆంధ్రుల పాలిటి అమరతరువయి ఆంధ్ర లోకమునకెల్ల మహా మహోపకారము గావించినది. తద్వారా అన్ని సంఘములు 'మేల్కాన్నవి.' ఇట్టి శుభపరిణామమునకు జనకులైన తమకు మాధన్యవాదములు.

ఆంధ్రపండితా! తమరు రచించిన మల్లికాగుచ్ఛము కమ్మనితావుల వీనుచున్నది; ప్రశంసా పాత్రంబగు తత్కావ్యము మీ యశశ్చంద్రికల దిగంతముల వ్యాప్తంబొనర్చెను

ఆదర్శపురుషా! ఈ షష్టిపూర్తి జయంతి సందర్భమున తమకు మా యభినందనములు. ధన్యమైన తమ జీవితము భావిసంతానమునకు ఒజ్జ బంతిగా నుండుగాక! పరమేశ్వరుడు తమకు చిరాయు రారోగ్యైశ్వర్యంబుల ప్రసాదించునుగాక!

సోమ క్షత్రియ సంఘసభ్యులు
హైద్రాబాదు-దక్షిణ.

## 43

ఆంధ్రోద్యమ ప్రతిష్ఠాపనాచార్యా! నిఃక్షిప్తమైన నిజాంమాంధ్ర తేజము మీ యాచార్యత్వ మున గ్రంథాలయోద్యమరూపముగ ప్రకాశితమై కన్నడ, మహారాష్ట్ర, భాగములయందు నైతము జాగృతిని కలిగించి కరడు గట్టిన జాతీయ వాద జ్వాలలతో "జాతోజీ" వంటి వీర యువక విస్ఫులింగములతో విజృంభించుచున్నది. ఈ విభాసితమగు ఆంధ్ర తేజము సత్త్వర స్వాతంత్ర్యభావ దీప్తితో నూపదాంధ్రమున ప్రకాశించునట్లు పండు బారిన తమ హృదయముతో ఆశీర్వదింపవలయునని కోరుచున్నాము.

తెలుంగాణపు విన్నాణీ! చైతన్య రహితమగు తెలంగాణపు రైతువర్గ మనుభవించుచున్న అనేక విధములగు అక్రమపు పన్నుల బాధ, అసదముగ, కార్మిక వర్గము పొందుచున్న "వెట్టి చాకిరి" యొక్క యమయాతనమీద, యీ విశిష్టమగు చల్లని చూపువలన ప్రశమించుచున్నదని చెప్పుటకు సంతసించుచున్నాము.

సంఘనిర్మాణ చతురచాణక్యా! సాంఘిక బలమునందు గల ప్రబల శక్తిని గ్రహించి, ఆంధ్ర జాతీయ భాగ్యసౌధమునకు విచ్చైన మెట్లవలె అనేక సంఘములను నియమించి ఒక్కొక్క సంఘమును ఆంధ్ర మహాసభయందు మేళవింప చేయుచు, నా నాట సాంఘిక శక్తిని పెంపొందింప చేసిన మీ మేధా సంపదను మా మనఃపూర్వకముగ అభినందించుచున్నాము. ౧౮౬౩ వ శాలివాహన శకమునందు మీ ప్రోత్సాహముచే నెలకొల్పబడిన మా "యాదవ మహాజన సమాజము" విస్తరించి నేడు జిల్లా సంఘములవరకు వ్యాపించి, మించిన వేర్పుతో పని చేయుచున్నది. యితోధిక విజ్ఞాన బలసంపన్నమై, దేశీయభాగ్య క్షేమములకు, మా సమాజము మూల పట్టగునట్లు తమ పెద్దల హృదయముతో దీవించవలయుననియు పూర్ణాయురారోగ్య మేధా బల సంపదలతో పుత్ర పౌత్రాభివృద్ధిగా మా యదుకుల భూషణుడు మిమ్ము కాపాడవలయుననియు ప్రార్థించుచున్నాము.

శ్రీ నిజాంరాష్ట్ర యాదవ మహాజనసమాజము, సికింద్రాబాదు.

## 44

ఆర్యవర్యా! నిజాంరాష్ట్రాంధ్ర దేశమునందు ప్రజాహిత కార్యతత్పరతయను బీజమును నాటి అయ్యది పెద్దవృక్షమై శాఖోపశాఖలుగా పరిణమించుటకు కృషిసలిపిన తాము నిజాంరాష్ట్రాంధ్ర దేశమునకంతకు ఆదర్శప్రాయులు, పూజనీయులు.

ఆంధ్రపితామహా! బ్రిటిషు ప్రాంతములోని ఆంధ్రదేశమునందు ఆంధ్రుల అభ్యుదయమునకై సలుపబడుచుండిన కృషిని కడుశ్రద్ధతో గమనించి నిజాంరాష్ట్రాంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై రమారమి నలుపది సంవత్సరముల నుండి అవసరమైన ప్రయత్నములు చేయుచు గ్రంథాలయోద్యమముతో నారంభించి ఆంధ్రమహాసభా కార్యక్రమమును రాజకీయాభివృద్ధి క్షేత్రమునందు వదలిన తమ నిరంతర కృషికి "ఆంధ్ర పితామహ" యనుబిరుదము ఎంతయో తగియున్నదనుట నిర్వివాదాంశము

నిరంతర కార్యదీక్షాపరాయణా! సంఘ సంస్కరణోద్యమమునందు కందుకూరి వీరేశలింగం పంతులుగారివలెను, చారిత్రక క్షేత్రమునందు పరిశోధన సలుపుటలో కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారివలెను, గ్రంథరచనయందు సులభశైలికి చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారివలెను, అంకెలతోసహా బహిరంగ సభలయందు ఏ విషయమును గురించి యైనను గంభీరోపన్యాసము చేయుటలో డాక్టరు పట్టాభిగారిని బోలియును, తాము తమకుగల సహజమైన ప్రతిభ, కుశాగ్రబుద్ధియైన ప్రజ్ఞతో నిజాంరాష్ట్రాంధ్రులలో కిరీటములేని చక్రవర్తి యని పేరుగాంచితిరి.

విద్యాభిమానీ! మల్లికాగుచ్ఛము, వేదకాలమునాటి ఆర్యులు, మున్నగు రచనలు తమ సాహిత్య విజ్ఞానమునకు సాక్షిభూతములైయున్నవి. ముట్నూరి కృష్ణరాయలవలె తాము పత్రికలలో వ్రాయు సంపాదకీయములు జనసామాన్యమునకు నేటివరకు కూడ విజ్ఞాన వర్ధకములగుచున్నవి. తాము ఆంధ్రబాలికల ఉన్నత విద్యా ప్రసారమునకు సలిపిన కృషికి నిజాంరాష్ట్రాంధ్ర కర్వేయని బేర్కొనిన అతిశయోక్తి కాజాలదు. గ్రంథాలయములు, పఠనమందిరములు, ఆంధ్ర సంఘములు,

బాలబాలికాపాఠశాలలు, వార్తా పత్రికలు, కరపత్రములు, లఘుపుస్తకములు, గ్రంథమండలులు,
ఇవి యవి యన నేల ప్రతి ఉద్యమమునకు మూల పురుషులు తామే యని ఘంటాపథముగా
చెప్పిన కాదు లేదను వారెవరు కలరు?

సర్వజన సమాదరణీయా! ఈ రాష్ట్రములోని వివిధ కులస్థులగు వారి సంఘములు స్వకులా
భివృద్ధి నిమిత్తము స్థాపింపబడినచో స్వసంఘాభిమానముతో అభివృద్ధి ప్రయత్నము లారంభమై
క్రమముగా ఆంధ్రోద్యమము పెంపొందుననియు తుదకు సర్వమానవ సౌభ్రాతృత్వమేర్పడు
ననియు తలంచి ఈయుద్యమమును తాము ప్రోత్సహించితిరి. ఈ నాడు ఇందు లక్షల మున్నూరు
కాపు సోదరుల అభివృద్ధికై కృషి సల్పుచున్న మున్నూరుకాపుసంఘములు, యువక
మండలి, చారిత్రక పరిశోధక మండలి, నిజాంరాష్ట్ర మున్నూరుకాపుమహాసభలు, అఖిల
భారత తెలుగు మున్నూరు కాపు మహాసభ విలసిల్లుచుండుటకు సంతోష పడు వారిలో తామే
అగ్రగణ్యులనుటలో సందియ మావంతయునులేదు. మా సంఘీయులు పెక్కుండ్రు ఆంధ్ర సంస్థ
లలో కార్యకర్తలుగా నేడు పని చేయుచున్నారని సగర్వముగా చెప్పుకొన గలుగుచున్నాము.
మా యభివృద్ధి ప్రయత్నములందు తాము జూపుచున్న సానుభూతికి కృతజ్ఞులము. షష్టిపూర్త్యుత్సవ
సందర్భమున మా హృదయాంతరమున నున్న పూజ్యభావమును వెల్లడించుట కవకాశము లభిం
చినందుకు ధన్యులము. "చంద్రునకు నూలు పోగన్నట్లు" ఈ సందర్భమును పురస్కరించు
కొని మాశక్త్యనుసారము ౧౧౬ రూపాయిల కట్నమును తమకు సమర్పించుచున్నాము.
అన్యథా భావించక, భక్తి ప్రేమలతో నొసంగు మా చిన్న కానుకను అంగీకరించ వేడుకొనుచు,
పరమేశ్వరుడు తమకు దీర్ఘాయురారోగ్యములను ప్రసాదించు గాకయని ప్రార్థించుచున్నాము.

ఆంధ్ర పితామహకు జయమగు గాక! తథాస్తు

శ్రీ మున్నూరు కాపు సంఘములు,

1. అలియాబాదు
2. బాదర్‌ఘాటు
3. చిక్కడిపల్లి
4. లాల్‌దర్వాజ
5. మలక్‌పేట
6. గల్పేటి
7. ఉప్పుగూడెం
8. కాచిగూడెం
9 అసఫ్‌నగరం
0 యాకుతుపురం
11. ఇసామియాబజారు
12. సబ్జిమండి
13. బోడెలిషాబిలికి
14. గౌలిగూడెం
15. సికింద్రాబాదు

వి. రా. మున్నూరుకాపు యువక మండలి      శ్రీ మున్నూరుకాపు చరిత్ర పరిశోధక మండలి.

## 45

ఆంధ్రోద్ధారకా! నిజాంరాష్ట్రములోని సకలాంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి నిరంతర దీక్షతో
కృషిసల్పిన తాము సర్వజనసమాదరణీయులు. షష్టిపూర్త్యుత్సవ సందర్భమున హైద్రాబాదులోని
నాయీబ్రాహ్మణ సభవారు తమపట్ల భక్తి ప్రేమలను వెల్లడించుట తమ విధ్యుక్తధర్మమని తలంచు
చుచున్నారు. ఇట్టి అవకాశమును మాకొసగిన షష్టిపూర్త్యుత్సవ సంఘమువారు వంద్యులు.

నాయీబ్రాహ్మణాభిమానీ! రమారమి పాతిక సంవత్సరములనుండి మా యభివృద్ధికై
చేయబడుచున్న ప్రయత్నములన్నింటిలో తమ సానుభూతిని బడయుభాగ్యము మాకు గలిగినది.
మాకు చేదోడు, వాదోడుగానుండి యభ్యుదయమార్గములను జూపి మమ్మాదరించుచు వచ్చిన
తమ మేలును మే మెన్నటికిని విస్మరింపజాలము.

నాయీబ్రాహ్మణుల జనసంఖ్య ఈ రాష్ట్రములో ఏడు లక్షలకు మించియున్నది. మా జాత్యు
ద్ధరణ ప్రయత్నములు అఖిల భారతదేశమున జరుగుచున్నవి. హైద్రాబాదులోగూడ అనేక సభలు

జరిగినవి. ఈ సభలలో తాముపాల్గొని అమూల్యమైన హితోపదేశములను జేసి మమ్ము కృతజ్ఞతా బద్ధులనుగా జేసియున్నారు. ఈ సంఘమునకు జెందిన కొందరు వ్యక్తులు ఈ పేరుతో వ్యవహరింపబడుట అవమానకరంబని తలంచిన కాలమున నాయీబ్రాహ్మణసంఘ మేర్పరచి నాయీ బ్రాహ్మణుల పూర్వచరిత్రను స్మరణకుదెచ్చి తోడ్పడితిరి సామాన్యముగా ఇతర బ్రాహ్మణులవలెగాక తాము పక్షపాత రహితముగా యిర్ష్యాభావమున కెడమీయక నాయీబ్రాహ్మణులు ఉత్తమ జాతికి జెందినవారేయని అఖిలభారత నాయీబ్రాహ్మణ మహాసభవారి ఢంకా వినాదమును రాష్ట్రంలో ప్రతిధ్వనించునట్లు చేసితిరి.

ఆర్యవర్యా! సవిత, కౌండిన్య, భారద్వాజ, కాశ్యప మున్నగు మహర్షులు మా పూర్వ మూల పురుషులు. వేదకాలమునుండి మా చరిత్రగలదు. దేవఋషినారదుడు, బాల బ్రహ్మచారి హనుమానుడు, వైద్యరాజగు అశ్వనీకుమారుడు మున్నగువారు నాయీబ్రాహ్మణులని సిద్ధాంతీకరింపబడినది. సామ్రాజ్య సంస్థాపకులగు నంద, మౌర్యవంశములు నాయీబ్రాహ్మణజాతికి చెందినవేయని చారిత్రక దృష్టాంతములుగలవు. బ్రాహ్మణులతో ఏ కారణమువలననో వైవాహిక సంబంధములు తెగిపోయినవి. యజ్ఞోపవీతధారణ అంతరించినది. దురాచారములు వ్యాపించినవి. వైశ్యులు పాకమునకై బ్రాహ్మణులను నియోగించినపుడు. వారికంటె మంచి ద్వితీయశ్రేణికి చెందిన క్షత్రియులు నాయీబ్రాహ్మణుల వంటకముల నుపయోగించిరి. విలాసపూరిలోని నయనాదేవి, కాంగ్డాలోని జ్వాలాదేవి, జగన్నాధపురిలోని ముఖ్య దేవాలయములలో నాయీబ్రాహ్మణులే పూజారులుగా బనిచేయుచున్నారు. వారిచే నొసగబడిన తీర్థప్రసాదములు భారతీయులందరు నేటికివి స్వీకరించుచున్నారు. మాజాతివారు అశ్వినీకుమారసంతతి వారగుటకు నేటికని మావారిలో వైద్యులు, శస్త్రచికిత్స చేయువారు పెక్కండ్రుగలరు. మానవసంఘమునకు మాజాతివారు చేయుచున్న సేవ అపారమైనది. శుభాశుభ కార్యములందు వేదకర్మాచరణయందు మా యవసరము నేటికివిగలదు. మేము మా పూర్వౌన్నత్యమును స్మరించి భవిష్యత్తును కాంతివంతముగ నొనర్చుటకు చేయుచున్న కృషికి తోడ్పడుచున్న తాము, భక్తిపూర్వకముగ సమర్పించు మా సన్మానపత్రమును అంగీకరించెదరుగాక యని వేడుచున్నాము. పరమేశ్వరుడు తమకు ఆయురారోగ్యములను ప్రసాదించుగాక!

నాయీబ్రాహ్మణ సంఘోద్ధారకునకు జయమగుగాక! తథాస్తు

హైద్రాబాదు నాయీబ్రాహ్మణ సంఘసభ్యులు

హైద్రాబాదు.

## 46

ఆంధ్ర పుణ్యపురుషా! నిజాంరాష్ట్రమందు అంధకారమున అణగియున్న ఆంధ్రులను అజ్ఞానమునుండి తొలగించి, ఆంధ్రజాతి గౌరతను నిల్పి గౌరవముతో ఆంధ్రులమను జెప్పజాలెడుశక్తి, ఆంధ్రుల కొసంగి, ఇక చారిత్రకయం దెప్పటికి ఆంధ్రనామము అంతర్ధానముగాకుండ, సువర్ణాక్షర లిఖితముగా నొనరించిన మీకు అభివందనములు.

ఆంధ్రజాతికి అఖండతేజస్సు నొసగిన ఆంధ్రపితామహా! తమచేనాడు స్థాపింపబడిన నిజాంరాష్ట్రాంధ్రజన కేంద్రసంఘమును తేజోవంతమగు నిజాంరాష్ట్రాంధ్రమహాసభగా మార్చదగిన మహత్తుగల, మహామబావులగు మీరు, పేరు ప్రతిష్ఠలకైన పాటింపక అమూల్యమగు సమయమును సహితము లెక్కింపక, యీవరకు వచ్చిన ఇక ముందు రానున్న ఆపదల

కైన భీతిల్లక, ప్రజాసేవ యొనరించిన ప్రతిఫలమునకైన నిరీక్షింపక, త్యాగశీలురై ఆంధ్ర మహాసభ అభివృద్ధినే దృష్టిపథమందిడుకొని నిజాంరాష్ట్రమందుగల ప్రజాసంస్థ లన్నిటిలో నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభయే అగ్రస్థానము ఆక్రమింప అర్హతగల సంస్థగా నొనరింపుటకై తమరు పడిన, మరియు పడుచున్న పాట్లు వర్ణింప దుస్సాధ్యము.

ఆంధ్రభాషాభిమానీ ! ఆంధ్రభాషాభివృద్ధికై శ్రీ కృష్ణ దేవరాయల ఆంధ్రభాషానిలయము నెల కొల్పి గ్రామగ్రామమున గ్రంథాలయములు స్థాపించి, రాత్రిపాఠశాలలు ప్రారంభించి, జిల్లాలు, తాలూకాలు, గ్రామాలు పర్యటనచేసి నిజాంరాష్ట్ర ఆంధ్రుల కాంధ్రభాషయందభిరుచికలిగించిన మీకు మనః పూర్వకముగా వందనములు.

నిజాంరాష్ట్రమందున్న ఆంధ్ర స్త్రీ విద్యా ప్రోత్సాహకా ! నిజాంరాష్ట్రమందున్న ఆంధ్ర స్త్రీల అవిద్య గాఢాంధకారమును తొలగింపనెంచి, తగు కృషిసల్పి, ఆంధ్రబాలికల ఉన్నతపాఠ శాల మరి యితర పాఠశాలలు స్థాపించుటకు తగు సహాయమొనర్చి, ఆంధ్ర సోదరీమణులకు విద్యా సౌకర్యము చేకూర్చిన స్త్రీ విద్యాభిమానీ తమరికి నమస్కారములు.

అమూల్యాభిప్రాయమొసగు ఆంధ్రనాయకా ! ఈ నిజాంరాష్ట్ర గౌడజనసంఘమునకు అమూల్యాభిప్రాయముల నొసగి సంఘోన్నతికై తగు సహాయ మొనరించినందుకు ఈ సంఘం తమరికి ఎంతో ఋణపడియున్నది.

ఆంధ్ర అనుభవనాయకా ! నిజాంరాష్ట్రమందలి ప్రజోన్నతికై పాటుపడు సంఘములకు అమూల్య, అభిప్రాయముల నొసంగి,సంఘటనతోపాటు,సంఘములన్నిటికి నూతనోత్సాహముతో ముందంజవేయ ప్రోత్సహించి, సంఘ కార్యకర్తలకు సాహస సామర్థ్యములను ప్రసా దించుటకై భగవంతుడు మీకు ఆయురారోగ్యములనొసంగి శతపూర్తివార్షికోత్సవము చేయు భాగ్యము ఆంధ్రులకు లభింపుగాక యని ఈ నిజాంరాష్ట్రములోని ౫౦౦౦౦౦ గౌడులు ఏకకంఠ ముగా ప్రార్థించుచున్నారు.

నిజాంరాష్ట్ర గౌడజనసంఘ సభ్యులు

భా గ్య న గ ర ము

## 47

మహాశయా! నిజాంరాష్ట్ర ఆంధ్రచరిత్రలో నేటి షష్టిపూర్త్యుత్సవ కార్యక్రమము సువర్ణాక్షరము లతో లిఖింపదగినది. ఆంధ్రులకిది పండుగదినము. బ్రిటిషు ఆంధ్రదేశమునందు జరుపబడుచున్న అభివృద్ధి ప్రయత్నములతో తులదూగునట్లు రాష్ట్రీయాంధ్రుల అభ్యుదయమునకై చిరకాలము నుండి కృషిసల్పుతున్నతాము ఇచ్చటి సకలాంధ్రులను కృతజ్ఞతా బద్ధులనుగా నొనర్చియున్నారు. ప్రజాహిత కార్యములందు సేవాతత్పరతను అంకురింపజేయుటలో తామే మూలపురుషులనియు, మార్గదర్శకులనియు మేము వేరేచెప్పనవసరములేదు. నిద్రావస్థలో నుండిన వివిధసంఘములను మేల్కొల్పికార్యరంగమున ప్రవేశపెట్టితిరి.

పుణ్యపురుషా ! ఈ రాష్ట్రములోని పద్మశాలీయుల జనసంఖ్య అయిదు లక్షలకు మించియున్నది. వీరికి నిత్యజీవనమునందు గల కష్టములను విచారించి నివారణోపాయముల నవలంబించుట యందు తమయాలోచనా లాభమును మా సంఘము బడయగలిగినది. వెట్టిచారికి, మగ్గముపన్ను, నూలు బట్టలపైసుంకము, ప్రభుత్వాధికారులవల్ల జాగీర్దారులవల్ల వసూలుచేయబడు చట్టవిరుద్ధమైన

మామూళ్లు మున్నగు వానిని నిర్మూలించుటకు తాము మాసంఘీయుల పక్షమున చేసిన కృషి అమూల్యమైనదనియు తమ నిరంతర కార్యదీక్షాఫలితములను నేటికాలమున మాసంఘీయులు అనుభవించుచున్నారనియు సవినయముగా మనవి చేయుచున్నాము.

దేశాభిమానీ ! రాట్నమే దాస్యవిముక్తికాధారభూతమని మహాత్మాగాంధిగారు చాటిరి. తాము నూలు, నేతపరిశ్రమను ప్రోత్సహించితిరి. చేనేతపరిశ్రమకుగల ప్రాముఖ్యతను చాటి సర్వవిధముల సాయపడితిరి. పద్మశాలీయులు భృగుమహర్షి సంతతివారనియు, మార్కండేయ వంశజులు యజ్ఞోపవీతధారులు గనుక వారి పూర్వచరిత్ర కాంతివంతముగా నుండెననియు పద్మశాలీయులు పదత బ్రాహ్మణులుగ పరిగణింపబడవలెనన్న వారిలో వ్యాపించిన దురాచారములు నిర్మూలించ బడవలెననియు తాముచేసిన హితోపదేశములను మాసంఘీయులు ఆచరణలో బెట్టిరనియు తన్మూలమున సంఘసంస్కరణాభివృద్ధిచేకూరినదనియు తమకుదెలియని విషయముగాదు. ఖద్దరు వస్త్రధారణ వ్రతమును బూనినవారిలో తామేఈరాష్ట్రమున మొట్టమొదటి వారని మావిశ్వాసము. త్రికరణ శుద్ధితో తాముజేయుచున్న మానవసేవ మకుటాయమానమని నుడివిన స్తుతిపాఠము గాజాలదు.

పూజ్యనీయా ! అఖిలభారత పద్మశాలీయ ఆఱవమహాసభ హైద్రాబాదులో జరుపబడిన సందర్భములో అద్దానిని విజయవంతముగ జేయుటకో తామొర్చిన సహాయమును మేమెన్నటికిని మరువజాలము. సభాచర్యలను అధికారుల దృష్టికితెచ్చుటయందును, వస్త్రప్రదర్శన కార్యక్రమములను జయప్రదముగ నొనర్చుటయందును చేనేత పారిశ్రామికుల నైపుణ్యమునకు వన్నెబెట్టుట యందును తాము తోడ్పడిమమ్ము ఋణబద్ధులనుగా నొనర్చితిరి.

దయార్ద్ర హృదయా ! తమ సరళస్వభావము, కరుణాపూరిత హృదయము పవిత్రాచరణ, కష్టములోనున్న వారిని గట్టెక్కించుటయందు తాము జూపు యభిమానము మున్నగు సద్గుణాతిశయములు మాసంఘములోని నవయువకుల కెందరికో గుణపాఠములయినవి. ముఖస్తుతి వచనములు తమకు అసంతుష్టిని గలిగించునని దెలిసియు షష్టిపూర్త్యుత్సవ సందర్భమున మా హృదయాంతర్గతమైన భావములను వెల్లడించకపోవుట పాడిగాదనియెంచి ఈ సన్మానపత్రము అంగీకరించవలెనని ప్రార్థించుచున్నాము.

నిజాంరాష్ట్ర పద్మశాలి మహాసభ
మరియు
పద్మశాలి యువజనసంఘము హై. ద.

# 48

పూజ్యఆంధ్రపితామహా ! దాదాపు ఇరువది అయిదు సంవత్సరములనుండి నిజాంరాష్ట్రాంధ్రులలో విద్య, సాంఘిక, రాజకీయ ప్రబోధము గలిగింప దృఢసంకల్పులై, తాము చేయుచున్న కృషి ఆంధ్రులెన్నటికిని మరువజాలరు. మీయొక్క కృషి ఫలితముగనే ఇచ్చట ఆంధ్రులలో నేడు కన్పించుచున్న చైతన్యము గలిగినదనుటలో అతిశయోక్తి కన్పట్టదు.

సద్హృదయా ! మీరు జాతిమతభేదముల పాటింపక ప్రజాసేవకై పాటుబడు ప్రతిసంస్థకో నిజమైన పురోహితునివలె సలహాలనొసగుచు సోదరాంధ్రులకు తోడ్పడు మీ ఉదారస్వభావమును ఎంత కొనియాడినను తక్కువే.

మార్గదర్శకా ! నిరాడంబర జీవితమును గడపుచు, చిన్న పెద్దల తారతమ్యములను పాటించక అర్థించిన వారెల్లరకు హితోపదేశములజేయుచు, దేశీయులను సదుద్యమ ప్రచారమునకు ప్రోత్స

హించి, అజ్ఞానాంధకారమును బారద్రోలయత్నించుచు మాకు మార్గదర్శకులైన మీకు మానిజాం రాష్ట్ర మేరు సంఘముపక్షమున కృతజ్ఞతావందనము లర్పించుచు, భగవంతుడు మీకు ఆయురారోగ్య ఐశ్వర్యముల ననుమడింపజేయుగాతయని ప్రార్థించుచున్నాము.

గట్ల వెంకటక్రిష్ణయ్య
కార్యదర్శి
నిజాంరాష్ట్ర మేరుసంఘము హైద్రాబాద్-దక్షిణ

## 49

మహాత్మా ! నిజాంరాష్ట్రములో ఆంధ్రోద్యమానికి మూలపురుషులై అనవరతము దానిని కంటికి రెప్పవోలె కాపాడి తెనుగువారిలో ఆంధ్రత్వాన్ని స్మరింపజేసి, నూతన జీవాన్ని పోసిన మీకృషిని కొనియాడటానికి మాకు పదజాలము దొరకదు. మీకు మా హృదయ పూర్వక నమస్సులు.

నాయకశిఖామణీ ! ఆంధ్రభాషతో ఎక్కువగా పరిచయము, అభిలాష లేని ఈ రాష్ట్రంలోని ఆంధ్రసీమల్లో మీరు అనేకములైన ఆంధ్ర గ్రంథాలయాలు స్థాపనచేసి, ప్రజలలో ఉద్రేకాన్ని, కాంక్షని, రేకెత్తించారు. నలుబది అయిదు సంవత్సరాలకు పూర్వమే హైద్రాబాదులో శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయాన్ని ఆ తరువాత శ్రీ వేమన ఆంధ్రభాషానిలయాన్ని స్థాపించినవారికి మీ సహాయ సానుభూతులను చూపి, ఆంధ్ర భాషామతల్లి యొక్క సేవ అపారంగా చేశారు. మీ నాయకత్వాన ఇంకా ఎన్నెన్నో, గ్రంథాలయాలు, సంస్థలు నెలకొల్పబడ్డాయి. అవన్నీ పేర్కొనగలమా ? ఇవికాక మీరు స్వయంగా గ్రంథాలు రచించి ఎంత విజ్ఞానాన్ని జనసామాన్యంలో వెదజల్లారు ! రాష్ట్రీయమైన ఎన్ని ఎన్ని పత్రికలకు మీ రచనలు మకుటాయమానంగా ఉన్నాయో మేము చెప్పనక్కరలేదు.

దేశభక్తాగ్రేసరా ! ఈ రాష్ట్రంలో విద్యావిషయంలోను, సాంఘికంలోను, రాజకీయంలోను స్థాపించిన సంస్థలన్నీ సంపూర్ణంగా మీకు ఋణపడి యున్నాయనడంలో సందేహంలేదు. మీ యొక్క నిరాడంబర జీవితం, సహృదయత్వం, త్యాగం, దేశభక్తి, మా యువకులకు ఆదర్శం. వయస్సులో వృద్ధులైనా, కార్యదీక్షలో యువకులకన్నా, ఎక్కువగా ఉత్సాహం పట్టుదల, చాకచక్యం, గలిగి కార్యనిర్వహణము చేయు మిమ్మల్ని ఏ యువక సంఘాలు ఆదర్శమూర్తులుగా పూజించవు ? మీరుచేసిన కృషిని యే ఆంధ్రుడు మరచిపోయి కృతఘ్ను డనిపించుకొనడానికి సాహసిస్తాడు.

మీ యొక్క కార్యదీక్షని, ఉత్సాహాన్ని, ఆయురారోగ్యాన్ని శక్తి సామర్థ్యాన్ని, పెంపుచేస్తూ సాంఘిక, రాజకీయ, సారస్వత వీధులలో సంచరింపచేస్తూ, తదభివృద్ధిని మిచే చేయిస్తూ సదా ఆ భగవంతుణ్ణి మీ యందనే విజయమని మా హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాము.

యువజన సంఘము
నాంపల్లి హైదరాబాదు-దక్షిణ

## 50

ఆంధ్రపితామహా ! మీ షష్టిపూర్తి ఉత్సవము తెలంగాణావాసులకు పర్వదినము. ఈ సందర్భములో మీకు సన్మానపత్ర మొసగనిచ్చినందుకు ఈసంస్థలు గర్వించుచున్నవి.

మీరు తెలంగాణా మరియు హైద్రాబాదు ప్రజాహితజీవితమునకుసృష్టికర్తలు. ఆరోజులలో మీరు స్థాపించని లేక మీకు సంబంధములేని ప్రజాసంస్థలు లేవనిన అతిశయోక్తికాదు. ఆంధ్రజనకేంద్ర

సంఘము, వర్తకసంఘములు, గ్రంథాలయములు, బాలికాపాఠశాలలు, అన్నిప్రజాసంస్థలును మీ కృషిఫలితములు. భావిసంతతి "స్వర్గసీమ" లు గట్టి పునాదులపైనస్థాపింపబడి, మంచి పలుకుబడితో పనిచేయుచున్న ఆంధ్రమహాసభ పల్లె పల్లెకు ప్రాకిపోవుచున్నది. చూచిన, భారత జాతీయకాంగ్రెసు స్థాపనాచార్యులయిన దాదాభాయి నౌరోజీగారి దూరదృష్టి. విశ్వవిద్యాలయ శీవితో అలరారుచున్న ఆంధ్రబాలికలఉన్నత పాఠశాలను చూచిన కాశీహిందూ విశ్వవిద్యాలయ మునకు మూలపురుషులైన పండితమదనమోహన మాలవ్యా గారి పట్టుదల ఓర్పు మీలోమూర్తీ భవించినదని చెప్పవచ్చును రాజ రాజనరేంద్ర గ్రంథాలయమును, కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయములు విశాలతవైభవము, మీ విశాలదృష్టి, సామర్థ్యములను చాటుచున్నవి. ప్రజాసంస్థల లెక్కలను ప్రమాణయుగానుంచు ప్రవీణత, నిత్యజీవితమునందు క్రమబద్ధమగు అలవాట్లు, ప్రజాజీవితములోని కార్యకర్తలకును, ప్రత్యేకముగా యువకులకును ఆదర్శనీయాంశములు. సాధుత్వము మరియు నిరాడంబరత్వము తమరి విశేషతలు-పత్రికానిర్వహణయందును, విజ్ఞానపూర్వకమగు సంపాదకీయ రచయితయందు మీకుగల ప్రజ్ఞఅద్వితీయము.

వెంకటరావు మెమోరియల్
బాలబాలికలపాఠశాల, లాల్దర్వాజా. హై. ద.

## 51

ఆంధ్రనాయకాగ్రణీ! సూర్యోదయము వలన సర్వలోక చైతన్యముగలిగినట్లు నీవు ఉదయించుట వలన తెలంగాణమున సకల సంస్థలు ఉత్తేజము నందినవి. ఆంధ్రజాతిలో గలిగిన స్వజాతి గౌరవము, స్వధర్మ విరతి స్వసంస్కృతి రక్షణయను ప్రగతి పథములు నీవు సంకల్పించిన మహోద్యమ ఫలితములే. నీ షష్టిపూర్తి మహోత్సవము జాతీయమగు ఒక మహా పర్వము. నీ కివే మా హృదయపూర్వకమగు పుష్పాంజలులు.

తెలంగాణ గాంధీ! పురుషోత్తముడగు మహాత్ముని యడుగు జాడలో శాంతి సత్యా అహింసా మార్గమున తెలంగాణమును నడుపు నీ యసాధారణ ప్రజ్ఞకు శుభమగుగాక! ఆంధ్రులు నీ యాదేశములను పుష్పమాలవలె బౌదల దాల్చి యభ్యుదయము నొందుదురు గాక! సర్వేశ్వరుడు నీకు సంపూర్ణాయురారోగ్యైశ్వర్యముల నొసగి రక్షించుగాక!

చున్నిలాల్ బన్సీలాల్ అధ్యక్షులు
పెద్ది వెంకయ్యాగుప్త కార్యదర్శి
ఉస్మాన్గంజి ధర్మశాల, హైద్రాబాదు.

## 52

శ్రీఆంధ్రపితామహా మాడపాటి హనుమంతరాయాగ్రణీ! నేడు నీ షష్టిపూర్తి మహోత్సవము లానందపూర్వకంగా దిలకించు సౌభాగ్యమబ్బుట మా విజాంరాష్ట్రాంధ్ర భూభాగమునకు శుభావహము.

మహనీయ గుణగరిష్ఠా! నీ సేవా గుణ ఫలితముగ నిద్రాణముగనున్న ఆంధ్ర భూ ధరణి నిజాంరాష్ట్ర ప్రాంత్యభాగములం దగ్రమణియై రాణించగలుగుచున్నది.

ప్రాగాంధ్రమున వీరేశలింగ కవిపుంగవు దుద్భవిల్లి సకలోద్యమములు లేవనెత్తి ప్రతిభావంతము నుత్పత్తిజేసినట్లు వేయుపడిన పశ్చిమాంధ్రమగు మన నిజాంరాష్ట్రంనందు సకలోద్యమ

సమన్వితమగు ఆంధ్రోద్యమము నుత్పత్తిజేసి తత్ప్రభావ సంపత్తిని సమకూర్చి ఆంధ్రుల గౌరవ కీర్తి మర్యాదల నీవ బలవత్తర మొనర్చితివి. నీకన్న మున్ను ఈ యాంధ్రుల యవస్థను గన్నవా రెవరున్నారు ? ఆంధ్రులన్న జంగిలి నుకొన్న (అడవి మనుష్యులనుకొన్న) పుడు, మహారాష్ట్ర కర్నాటకులతోపాటి లేకున్నపుడు, రాష్ట్రంలో నేయంశమునందును స్థానము లేకున్నపుడు ఈ దీనావనతకు ఖిన్నుడవై తదాది కృషి ప్రసన్నుడవై మన్ననగల ఆంధ్రోద్యమ వ్యాప్తి గావించినవాడవై ఆంధ్రోన్నతిని గడించి ఆంధ్రుల కెన్నిక సంపాదించి వన్నెగాంచిన వారిలో మేటి మిన్నవు.

నేడు మన యాంధ్రభాగమున బొదకట్టుచుండెడు. అన్ని సంస్థలు నీ కష్టార్జితమైన జాడలే. నీ భాషా సేవ, నీ గ్రంథాలయ సంచాలనము, నీ బాలికోన్నత పాఠశాలోపక్రమణము, నీ జాతీయ విద్యాలయ రచన వేయేల సకలోద్యమ సమ్మేళనమైన యాంధ్రోద్యమము ఆంధ్ర మహాసభ ప్రతిష్ఠాపనము, తచ్ఛాఖా విస్తార వ్యాపనము ఆంధ్ర దేశమునందు వివిధ సంస్థా ప్రతిష్ఠాపనల మూలకమేనవి.

రేయనక పవలనక అన్నపాన వేళలనక ప్రాణమూలకబొందక విశ్రాంతి నెరుగక ఏకైక దీక్షతో ఈ యాంధ్ర భారమునె నుద్ధరించుటకు నీ కృషిపాలనపరి నీ నిరంతర దీక్షాపరతంత్ర పరిశ్రమ నింత అంతయని చెప్పలేము. ఆ దృశ్యమును మేము కన్నులార గాంచి యుర్వి మీరి ఇప్పటు ఆప్యాయము లేదేని గ మున్నారము. నేడు గోపాలుని గిలిరిన కంసుని పంపున పంపినట్లు ఒకవంక సనాతనులు మరొకవంక రాజ్యాంగవాదులు ఈ యాంధ్ర మహాసభ సుకుమార గాల నంతరింప నెన్నో ప్రయత్నములు చేసిరి. నీవెట్లింకాలను సంరక్షించు కొంటివో అది మాకు వర్ణనాతీతము. సనాతన ప్రతికూలమగు సంఘ సంస్కారణ పథమునకు రాజరికంవారి గుడిబారి కాని రాజ్యాంగ ప్రసక్తి జూపట్టక ఎట్లెట్లో పాలనము నెట్టుకొని ఇప్పట్టున ప్రబల సంస్కార సంయుతమును బలవత్తర రాజకీయ సంస్థగను ఎల్లప్రాయజవ్వనిగ ప్రజల యెదుట ప్రదర్శించిన చతురుడవు. కావుననే పెన్ని బ్రిటీషు ఆంధ్ర నాయకులు ఏటికి ఎదురీత గాడవని పేర్కొనిరి. ఆంధ్ర మహాసభ నీ చిన్నబిడ్డ నీ ప్రాపున ఎన్నో యవాంతరముల ముంగిట జాగ్రత్తగా నల్లారిముద్దుగా పెంచబడినది. ఈ నీబిడ్డ బిడ్డలము నీ షష్టిపూర్తి యుత్సవములందు దొరద వినుతులొనర్చుచున్నాము. గైకొని యాశీర్వదింతువుగాక !

ఓ మాడపాటి కులాన్వయా ! ఒకచో మా చివరిమాటను పాటించవా ! అది నీమాటే ఏమి ఒనకొనెదవు ? ఈ మధ్య నీయాంధ్రోద్యమ మందు జోర్యము తగ్గినకొలది తరతన వారి వీరి గుంజాలాటలలో ఆంధ్రోద్యమము తొట్రుపాటు నొందుచున్నది. ఈ చిక్కుల విప్పుటకు చతురోపాయ మతివగు నీవే ఎరుగుదువు. మరియు నీ యాశీర్వాద ఫలమున నీ ప్రవేశమూలమున స్థిమితత్వము ప్రాప్తించును కావున మానుపేగాక ఇక ముందుగూడ సదా కాపాడుచుండుమని మా ప్రార్థన.

సర్వసంధానుకూలుడగు భగవానుడు మీకు దీర్ఘాయురారోగ్యపాటవము ప్రసాదించి దేశ సౌభాగ్యాన్ని కాపాడుట కుపకరించునుగాక !

వరంగల్ జిల్లా ఆంధ్రజన సంఘ మువక్షమున

పరచ శ్రీనివాసరావు ( జిల్లా సంఘ అధ్యక్షులు )

అయితరాజు జీడికంటి రామారావు<br>
బొమ్మకంటి సత్యనారాయణరావు } (జిల్లా సంఘ కార్యదర్శులు)

# 53

ఆంధ్ర పితామహా! నీ షష్టిపూర్తి మహోత్సవము ప్రాచీన ఆంధ్రరాజ్య కేంద్రమగు నగరాన జయప్రదముగా జరుపుటకు మే మెంతయును కృతులము.

ఆంధ్రోద్యమ స్థాపకా! నైజామురాష్ట్రములోని ముఖ్యభాగమగు ఆంధ్రప్రాంతమునకు ప్రత్యేకతలేని కాలమున మహారాష్ట్ర కర్నాటక ప్రాంతీయుల పురోభివృద్ధిని, కన్నార తిలకించి, ఆంధ్రుల దుస్థితిని గుర్తించి నాడు భాగ్యనగర (హైదరాబాదు నగర) మందలి నీ "ఆంధ్రకుటీర" తోటలో నీవు నాటిన ఆంధ్రజనకేంద్ర సంఘ పరిపక్వమేకదా: నేడు కర్నాట మహారాష్ట్ర మహాసంస్థలకు మిన్నయై ఆంధ్రుల అగ్రగణ్యతను చాటుచు అటు భారత జాతీయ సిద్ధాంతములపై ఆంధ్రుల పౌరసత్వ హక్కులను కాపాడుటకు కంకణము కట్టిన నైజామాంధ్ర జాతీయసంస్థ? నేటి ప్రపంచ విఖ్యాత జాతీయోద్యమ కారకులగు దాదాభాయి నౌరోజీ ప్రముఖులకు నీ వెందు తీసిపోవుదువు?

కర్మవీరా! అల్పమైన ఆంధ్రీయత కలములోనే గాక కార్యములో కూడా చూపిన కార్యశూరుడవు నీవేకదా? నాటి నీ "ఆంధ్రకుటీరమే" నేడు దీనికి సాక్షి. నేటి ఆంధ్రబాలికల పాఠశాలస్థాపన సేవనలే దీనికి నిదర్శనములు. ఆంధ్రగ్రంథాలయ స్థాపనమే దీనికి దర్పణము. నీ వంటి కర్మవీరుని పుత్రునిగా బడయగలిగినందుకు ఆంధ్రమాత నిజమైన వీరమాతయై ధన్యయైనది.

హనుమంతరాయా! స్వభుజశక్తిచే రాజ్యకాంక్షచే రాజ్యాభ్యుదయ తృష్ణచే సైన్యసంపత్తివలన మంత్రిసహాయుడై ఆంధ్రరాజ్యమును నెలకొల్పినాడు కృష్ణరాయలు. కేవలము త్యాగశక్తిచే, పరోపకార కాంక్షచే, జాత్యభ్యుదయ తృష్ణతో, ఆత్మబలముచే ఏకాకివై అనేక సంఘటనల నెదుర్కొని ఆంధ్రజాతీయ సంస్థను స్థాపించినావు నీవు. మీ యిద్దరిలో ఎవ్వరధికులని ప్రశ్న వచ్చినప్పుడు కాలమేమి చెప్పుచున్నది? నీవేయని వేనోళ్ళ చాటుచున్నది. నాటి కృష్ణరాయ స్థాపిత ఆంధ్రరాజ్యము అన్య హస్తగతమై విచ్ఛిన్నమైనది. కాని నేటి నీ స్థాపిత ఆంధ్రోద్యమము విచ్ఛిన్నముగాక అపూర్వతేజముతో బయటపడి విరాజిల్లుచున్నది. ఇది చాలదా? మీ యిర్వురి రాయలలో నీ ఆధిక్యనిరూపణకు నిదర్శనము.

తాతా! యువకులమగు మేము నీ స్థాపిత ఆంధ్రోద్యమమును నీ సంకల్పానుసారము జయప్రదముగా ఐకమత్య స్థిరసంకల్ప కార్యదీక్ష, రజ్జువులలో గమ్యస్థానము చేర్చుటకు, జాతీయత సత్య తేజో శక్తులను ఈశ్వరుడు మాకు ప్రసాదించునట్లు మమ్మాశీర్వదింపుము. నీ ఆశీర్వాద సంకల్పబలములే మాకు అనశ్వర్య తేజోమయ శక్తులు ఆంధ్రులను అజ్ఞానతిమిరమునుండి రాజకీయవిజ్ఞాన తేజములోనికి తెచ్చు ఆంధ్రోద్యమసంస్థను స్థాపించి వైజ్ఞానివై వృద్ధుడవైతివి. యిక ఏతదోద్యమ విజయమునకై క్రియారూపకతపస్వివగు యోగివై పడుచువాడవు కమ్మని కోరుచున్నాము. కర్మవీరుడవగు నీవు కార్యరంగమునుండి వైతొలగిన నీ స్థాపితసంస్థ దుర్బలమగును. అది ఆంధ్రమాతకు విచారహేతువు. కన్నతల్లి కన్నీటిని తుడుచు కార్యశక్తి నీ సహాయసంపత్తి వల్లగాని మా కలవడదు. నాటి భారతవృద్ధులగు పితామహ ఆచార్యుని పోకడను, నేటి భారతీయ పితామహుడగు బాపూజీ నడకను అన్ని రూపుల అనుసరింపుమని ఆంధ్ర పితామహుడవగు నిన్ను కోరుచున్నాము.

ఆంధ్రపుత్రా ! ఆంధ్రోద్యమము నిన్ను విడనాడజాలదు. నీ నాయకత్వము చిరస్థాయిగానుండ వలెననియు నీనాయకత్వములోనే భిన్న సంఘర్షణముల రూపుమాపి క్రమాభివృద్ధితో బాధ్యతాయుత ప్రభుత్వ వాంఛితమును నెరవేర్చుకొన వలెననియు కోరుచున్నాము. పరాత్పరుడు మా కోర్కెను నెరవేర్చుటకై నీ కాయురారోగ్యముల ప్రసాదించుగాకయని కోరు నీ ఆశీర్వద కాంక్షులు.

నగరాంధ్రసంఘము
హనుమకొండ

అధ్యక్షుడు
పరుచేల సూర్యప్రకాశరావు
కార్యదర్శులు :
మాదిరాజు వెంకటసుబ్బారావు
శాన లక్ష్మీనారాయణ



నేషనల్ ప్రెస్, నారాయణగూడ హైద్రాబాద్ ( దక్కన్ )

# అనుబంధము ౪

## షష్టిపూర్త్యుత్సవపు లెక్కలు

### ఆదాయము

1. శ్రీ రాజా పన్నాలాల్ గారు, హైదరాబాదు — రు. 1000
2. శ్రీ కాళోజి నారాయణరావు, వకీలు, హనుమకొండ గారిద్వారా — 521
3. శ్రీమతి అమరచింత సంస్థానపు రాణీగారు — 500
4. శ్రీ అక్కినేపల్లి జానకిరామారావుగారు, జాగీర్దారు, కొండగడప — 500
5. ,, కొండా వెంకటరంగారెడ్డిగారు, అడ్వొకేటు, హైదరాబాదు — 500
6. ,, చేవ లక్ష్మయ్యగారు, హైదరాబాదు — 301
7. ,, మంత్రిప్రగడ రాజగోపాలరావుగారు, బేతవోలు — 270
8. ,, బోయినపల్లి వెంకటనరసింహారావు, వకీలు, నల్లగొండ గారిద్వారా — 235
9. ,, జి. నరసింగరావు, వకీలు, హైదరాబాదు గారిద్వారా — 226
10. ,, మిరియాల ఈశ్వరయ్య, శంకరపల్లి గారిద్వారా — 216
11. ,, దర్గా పాండురంగ దుర్గయ్యగారు హైదరాబాదు, — 201
12. ,, శ్రీధర నాయకుగారు, బ్యారిష్టరు ,, — 202
13. ,, వై. సత్యనారాయణ, కంట్రాక్టరు హైదరాబాదుగారి కుమార్తె ద్వారా — 200
14. ,, పర్చా శ్రీనివాసరావుగారు, వకీలు, ఖమ్మం — 200
15. ,, ఉప్పల వెంకయ్యగారు, హైదరాబాదు — 200
16. ,, ఒద్దిరాజు రాజేశ్వరరావు, కాళోజినారాయణరావు, వకీళ్ళు, హనుమకొండ, గార్ల ద్వారా, — 193
17. ,, కల్వా రామయ్య, అండ్ సన్సు, హైదరాబాదు — 151
18. ,, తూము వరద రాజులుగారు, వకీలు, హనుమకొండ, — 150
19. ,, చక్రహరి నరసరాజుగారి ద్వారా — 150
20. ,, కొత్తూరి సీతయ్య, హైదరాబాదుగారి ద్వారా — 138
21. ,, మాదిరాజు రామకోటీశ్వరరావు, అడ్వొకేటు హనుమకొండ గారిద్వారా — 132
22. ,, పెమ్మరాజు వెంకటరావు, ఆలేరు, గారిద్వారా — 123

23. శ్రీ కొండా సత్యనారాయణరెడ్డి గారిద్వారా రు 120
24. ,, వరఖోడస్టేటు రాణీగారు 116
25. ,, డాక్టరు కందాళ రంగాచారిగారు, హైదరాబాదు 116
26, ,, మహారాజా రామేశ్వరరావు బహద్దురుగారు, వనపర్తి సంస్థానాధీశ్వరులు 116
27. ,, రాజానాయని వెంకటరంగారావు బహద్దరుగారు, మునగాల సంస్థానాధిపతులు 116
28 ,, వెంకటస్వామి, వకీలు, మున్నూరు కాపుసంఘముద్వారా 116
29. ,, పర్చరంగారావు, వకీలు, హనుమకొండ గారిద్వారా 116
30. ,, వల్లూరి సూర్యనారాయణరావుగారు, బి ఎ. ఎం. యల్ హైదరాబాదు 116
31. ,, బూర్గుల రామకృష్ణరావుగారు, బి. ఎ. ఎల్. ఎల్. బి. హైదరాబాదు 116
32. ,, మిరియాల నారాయణగుప్త మధిర గారిద్వారా 114
33. ,, హకీం నారాయణస్వామి, హైదరాబాదు గారిద్వారా 112
34. ,, సిద్దిఅంబరు బజారు (హైదరాబాదు) దుకాణదార్లు 105
35. ,, బిజ్జాలలక్ష్మి పద్మారాములుగారు, హైదరాబాదు 101
36. ,, [illegible]చేపల్లి రాజయ్యాగారు, హైదరాబాదు 101
37. ,, అంతురామ చంద్రరావుగారు, వకీలు. హైదరాబాదు 101
38. ,, బి. రామిరెడ్డిగారిద్వారా, 101
39. ,, భగవాన్ దాసుగారు, హైదరాబాదు 101
40. ,, చక్రవర్తి నరసరాజుగారు, వకీలు, కొల్లాపూరు 100
41. పులిజాల వెంకటరంగారావుగారు వకీలు నల్లగొండ 100
42. ,, బోయినపల్లి వెంకటరామారావు, వకీలు మహబూబునగరు, గారిద్వారా 100
43. ,, వేనేపల్లి కొండలరావు, దేశముఖులు, కొప్పోలు, దేవరకొండతాలూకా గారిద్వారా 100
44. ,, పూసూర్కురు రాఘవరావుగారు, లక్ష్మక్కపల్లి 100
45. ,, బిక్కేపల్లి రామచంద్రరావుగారు, కల్వకుర్తి 100
46. ,, దచ్చేట భూమయ్యగారు, హైదరాబాదు 100
47. ,, జస్టిస్ రామచంద్ర నాయకుగారు, హైదరాబాదు 100
48. ,, పటేర హనుమంతరావుగారు, వకీలు మహబూబునగర్ 100

| | | |
|---|---|---|
| 49. | శ్రీ డాక్టరు రంగారెడ్డిగారు, హైదరాబాదు | రు. 100 |
| 50. | ,, వాసుదేవనాయకుగారు, హైదరాబాదు | 100 |
| | ఇతరములు | |
| 51. | నూరురూపాయలకు తక్కువ దానముల మొత్తము | 1810 |
| 52. | శ్రీ. మాడపాటి హనుమంతరావుగారి రూపపటముల అమ్మకము | 12 |
| 53. | దానముగావచ్చిన మీజాన్ పత్రికలఅమ్మకము | 0 7 0 |
| | మొత్తము | 11,113 7 0 |

## వ్యయము

| | | | | |
|---|---|---|---|---|
| 1. | రశీదు పుస్తకములు – – | 133 | 0 | 0 |
| 2. | బండ్లు, రైళ్ళ ఖర్చులు – – | 121 | 11 | 2 |
| 3. | తపాల ఖర్చులు – – | 72 | 11 | 6 |
| 4. | లెక్కల పుస్తకములు – – | 3 | 13 | 10 |
| 5. | షష్టిపూర్తి ఉత్సవపు సంచిక ముద్రణము అడ్వాన్సు | 1650 | 0 | 0 |
| 6. | ఫోటోలు – – | 64 | 8 | 0 |
| 7. | ప్రకటనలు మొదలగు అచ్చుపనులు – | 21 | 0 | 0 |
| 8. | షష్టిపూర్తి ఉత్సవపు ఖర్చులు – – | 785 | 5 | 8 |
| 9. | శ్రీ మాడపాటి హనుమంతరావుగారికి బహూకరించిన వస్త్రములు, గడియారము, వెండిచెంబు – | 465 | 14 | 4 |
| 10. | శ్రీ మాడపాటి హనుమంతరావుగారికి బహూకరించిన తులాభార ధనము – – | 6400 | 0 | 0 |
| | మొత్తము | 9768 | 0 | 6 |
| | నిలువ | 1345 | 6 | 6 |
| | | 11,113 | 7 | 0 |

మరా:— సంచిక ముద్రణము బైండింగు వగైరాలక్రింద ఇంకను షుమారు రు 300 లు వ్యయము చేయవలసియున్నది.